# శ్రీ రామకృష్ణ కథామృతము

నేడే కొనండి! (ప్రథమ భాగము) పదేపదే చదవండి!

శ్రీ "మ.—" చే వంగభాషలో విరచితమైన మూలగ్రంథమునుండి అనూదితము. నవభారత నిర్మాతయగు శ్రీ వివేకానందస్వామికి శ్రీరామకృష్ణ పరమహంస గురుదేవుడు. ఆ పరమహంసదేవుని దివ్య వచనామృతమును శ్రీ "మ.—" ఆనంద తన్మయతతో తాను వినినది వినినట్లుగ ఐదు భాగములుగ గ్రంథస్థ మొనర్చెను. అందు ప్రథమ భాగమిది.

ఆ అవతారమూర్తియొక్క వచనములు ఈ పుటలయందు మనస్సును పూర్తిగ ఆకట్టుకొనునట్లుగ అనువదింపబడినవి. వీనిలో పరిష్కరింపబడని తత్త్వవిషయిక సమస్యలేదు, తొలగింపబడని ఆధ్యాత్మిక సంశయము లేదు. వివరింపబడని ఆత్మవికాసక విషయములేదు. ఆసక్తికరము. ఆధ్యాత్మికులకు ఒక వరప్రసాదము.

వెల : సాదా : రూ. 8–00

పుటలు : 240 + VIII ప్రథమ ముద్రణము కాలికో : రూ. 12–00

• • •

# శ్రీ రామకృష్ణ జీవిత చరిత్ర

రచయిత : శ్రీ చిరంతనానందస్వామి

వంగభాషలోని మూలప్రమాణ గ్రంథముల ననుసరించి రచింపబడినది. ఇందు శ్రీ రామకృష్ణుని జీవితాంశములు మృదుమధురమగు తేటతెనుగున సమగ్రముగ వివరింపబడినవి. ఢిల్లీ సాహిత్య అకాడెమీ వారిచే ఉత్తమోత్తమ గ్రంథముగ నిర్ణయింపబడినది.

శ్రీ రామకృష్ణ జీవితచరిత్ర ఆద్యంతము ఆత్మవైభవమే. దివ్యవైభవమే. ఇదియొక దెస కావ్యము. ఇంకొకదెస చరిత్రము వెరసి తత్త్వ సంహిత. లేక దివ్య కావ్యము. ఈ శ్రీ రామకృష్ణ జీవిత చరిత్ర శారదాకంఠమున ఓంకారఘంట। రోమాంచముల పంట.

—శ్రీ వేలూరి శివరామశాస్త్రి.

....విమర్శక చక్రవర్తి....కీ. శే. శ్రీ కట్టమంచి రామలింగారెడ్డిగారి శ్లాఘామోదములనందిన మీ పూర్వ గ్రంథముల వివి రచనావైదగ్ధ్యమున....మించియున్నది. విషయౌదాత్త్యము రచనౌదాత్త్యముగా పరిణమించుట స్వాభావికమే కదా సిద్ధహస్తుల చేతులతో।

—శ్రీ కందుకూరి మల్లికార్జునం.

It is bound to communicate to the reader the beauty and power of Sri Ramakrishna's life.

—Sri S. Radhakrishnan.

Classic...authentic...It will be a very valuable addition to the Telugu literature.

—The Hindu.

పుటలు : 478 + XXX

వెల : రూ. 10–00

# శ్రీ రామకృష్ణ ప్రభ

సంపుటము 36 | 1979 - మార్చి | సంచిక 3

## విషయసూచిక



గమనిక :—'శ్రీ రామకృష్ణ కథామృతము' ఈ సంచికలో ప్రచురింపబడలేదు.

---

## శ్రీ రామకృష్ణ మఠము, మద్రాసు - 4.

1897 వ సంవత్సరమున స్థాపింపబడిన మదరాసు రామకృష్ణమఠమునకు ఇప్పుడు ఎనుబదిఏండ్లు నిండినవి.

ఈ ఎనుబది సంవత్సరములుగా మదరాసు రామకృష్ణమఠము ప్రజోపయోగకరమైన పనులను సాధ్యమైనంత వఱకు నిర్వహించుచున్నది. మఠము ఒక ఉచితవైద్యశాలను, రెండు పాఠశాలలను, ఒక లైబ్రరీని నడుపుచున్నది. తమిళం, ఇంగ్లీషు, తెనుగుభాషలలో ఆధ్యాత్మికగ్రంథములు, పత్రికలు వెలువరించుచున్నది.

ఇప్పుడు మఠమునకు అధికనిధుల ఆవశ్యకత ఏర్పడినది. జార్జిటౌను శ్రీ రామకృష్ణ జాతీయ బాలికల పాఠశాల నూతన భవన నిర్మాణమునకు; కొన్ని ముఖ్యమైన పుస్తకములను తక్కువధరలో ప్రజలకందించుటకు; మఠముయొక్క ఆవరణకంతటికి ఉపయోగపడే ఒక పెద్ద సెంట్రల్ ఓవర్‌హెడ్ వాటర్‌టాంక్ నిర్మాణమునకు; ఆడిటోరియమ్ లెక్చర్ హాల్ మరామత్తులకు - సుమారు ఐదులక్షల రూపాయల వ్యయము అంచనా వేయబడినది. ప్రజల నుండి విరాళముల రూపములోగాని, మా సావనీర్‌లో ప్రకటనలరూపములోగాని తగినంత సహాయము లభించగలదని ఆశించుచున్నాము.

# భగవాన్ శ్రీ రామకృష్ణదేవుని జన్మదిన (బహిరంగ) మహోత్సవము మరియు 80 వ వార్షికోత్సవ కార్యక్రమము

## 10-3-79 నుండి 16-3-79 వరకు

**10-3-79 శనివారము సాయంత్రం 5-00 నుండి 8-00 వరకు సేవాదినము**

స్వామి తపస్యానంద, స్వామి లోకేశ్వరానంద, డా॥ ప్రభశంకర్ అనువారు 'సేవాదర్శనము' ను గురించి ప్రసంగింతురు. తరువాత దాసాంజలి బాలబృందమువారి భక్తిసంగీతముండును.

**11-3-79 ఆదివారము సాయంత్రం 4-30 నుండి 8-00 వరకు శ్రీ రామకృష్ణదినము**

స్వామి తపస్యానంద, స్వామి లోకేశ్వరానంద, స్వామి సర్వజ్ఞానంద, తమిళనాడు గవర్నరు మొదలగువారు 'శ్రీ రామకృష్ణుల జీవితము - ఉపదేశము' ను గురించి ప్రసంగింతురు. తరువాత మంజక్కుడి రాజగోపాల్ శాస్త్రి గారిచే విభీషణ శరణాగతి అను హరికథా కాలక్షేపముండును.

**12-3-79 సోమవారం సాయంత్రం 6-00 నుండి 8-00 వరకు మాతృశ్రీ శారదాదేవిదినము**

మొదట స్వామి పురుషోత్తమానంద భక్తిపాటలు పాడుదురు. తరువాత స్వామి తపస్యానంద, స్వామి లోకేశ్వరానంద, శ్రీమతి ఇందిరా సోమసుందరం అనువారు 'శ్రీ శారదాదేవి జీవితము - ఉపదేశము' ను గురించి ప్రసంగింతురు.

**13-3-79 మంగళవారం సా॥ 5-30 నుండి 8-30 వరకు స్వామి వివేకానందదినము**

స్వామి తపస్యానంద, స్వామి లోకేశ్వరానంద, శ్రీ గిరిధారి ప్రసాద్ అనువారు 'స్వామి వివేకానందుల జీవితము - సందేశము' ను గురించి ప్రసంగింతురు. తరువాత మదురై సోము భక్తిపాటలు పాడుదురు.

**14-3-79 బుధవారము సా॥ 6-00 నుండి 8-30 వరకు**

శ్రీ గిరిధారి ప్రసాద్ 'వళ్ళలారు' ను గురించి ప్రసంగింతురు. తరువాత రామకృష్ణమిషన్ స్టూడెంట్స్ హోమ్ విద్యార్థులచే భారతీయనృత్యముల ప్రదర్శన జరుగును.

**15-3-79 గురువారము సా॥ 6-00 నుండి 8-30 వరకు**

శ్రీ గిరిధారి ప్రసాద్ 'తిరువాచకమ్' ను గురించి ప్రసంగింతురు. తరువాత స్వామి సర్వజ్ఞానంద వ్యాఖ్యానముతో రామకృష్ణ పరమహంస సినిమా ప్రదర్శింపబడును.

**16-3-79 శుక్రవారము సా॥ 6-00 నుండి 9-00 వరకు**

శ్రీ గిరిధారి ప్రసాద్ 'దానకర్ణ' ను గురించి ప్రసంగింతురు. తరువాత కొత్తమంగళం విశ్వనాథ్ బృందంచే 'విల్లుపాట్టు' పాడబడును.

మోక్షార్థం జగద్ధితాయ చ.

# శ్రీరామకృష్ణ ప్రభ

సంపుటము 36 1979 - మార్చి సంచిక ౩

## ప్రార్థన

యః ఏకోఽవర్ణో బహుధా శక్తియోగాత్
వర్ణాననేకాన్నిహితార్థో దధాతి ।
విచైతి చాంతే విశ్వమాదౌ చ దేవః
స నో బుద్ధ్యా శుభయా సంయునక్తు ॥

[illegible], 4-1.

అద్వితీయుడు - అరూపుడు - స్వార్థనిరపేక్షుడును ఐయుండియు ఏ పరమాత్మ, సృష్టి ప్రారంభమున తన శక్తిద్వారా ఈ విశ్వస్వరూపముగా ఆవిర్భవించి మరల సృష్టి అంతమున ఈ విరాట్ స్వరూపమును ఉపసంహరించుచున్నాడో, అట్టి దేవుడు మనకు శుభమైన బుద్ధిని అనుగ్రహించును గాక!

# కథామృతము

ప్రబుద్ధ భారతలో ప్రచురింపబడిన స్వామి చేతనానందగారి
ఆంగ్ల రచనమునకు స్వేచ్ఛానువాదము.

అనువాదకులు : డి. వి. బ్రహ్మాజి

చల్లని పండువెన్నెల వర్షిస్తున్న ఒక శరద్రాత్రి సమయంలో శ్రీ కృష్ణపరమాత్మకు గోపికలను ఆనందపరచవలెనను కోరిక జనించింది. వెంటనే వంశీమోహనుడు యమునా తీరమునందలి వనాంతరమునకు పోయి మధురాతిమధురముగా వేణువునూదసాగెను. శ్రీ కృష్ణుడే తమ హృదయేశ్వరుడని త్రికరణ శుద్ధిగా విశ్వసించి ఆ నల్లనయ్యనే ఆరాధించే గోపికలు ఆ వంశీనినాదం తమ చెవుల సోకగనే ఇళ్ళూ వాకిళ్ళూ విడచిపెట్టి, బంధువులు వారిస్తున్నా లెక్కచెయ్యక శ్రీ కృష్ణుని సమీపించారు. "మీ ఇళ్ళకు మీరు తిరిగి పొండి" అన్న గోపాలునితో వారు కన్న అన్యమయినదేదీ తమకు లేనేలేదని, "నీవు కానిది ఏదయినాసరే మేము చూచునది లేదు, వినునది లేదు, తలచునది అంతకుముందే లేదు"- అని విన్నవించుకొన్నారు. పరిశుద్ధము, పరిపూర్ణమునయిన గోపికల అనన్యభక్తికి మెచ్చి శ్రీ కృష్ణుడు వారితో కలసి ఆ బృందావన పులినమున సవిలాసముగా చాలసేపు క్రీడించాడు.

నిరంతర సౌభాగ్యసంపద ఒక్కొక్కసారి మానవులను గర్వాంధులను గావించి పతనానికి హేతుభూతమవుతుంది. గోపికలు కూడా "కృష్ణుడు మావాడే" అని అహంకరించి పతనంచెందే దురవస్థ కలుగరాదని ఆ వ్రజ విహారి సంకల్పించుకొన్నాడు. అంతవరకు వారితో ఆటలాడుతూ అక్కడే ఉన్న ఆ పరమాత్మ ఒక్కసారిగా అంతర్ధానమయ్యాడు. అపుడా గోపికలు ఆ గోవర్ధనోద్ధారిని వెదకుతూ విలపించి విహ్వలతతో పాడిన గోపికా గీతలు భక్తి సాహిత్యమునకే మకుటాయమానములు. భక్తిరసమును ప్రతిపదము నిష్యందించు ఆ అమృతగీతములు మధుర భావ గర్భితములై అలరారుచున్నది.

ఈ గోపికా గీతములలోని ఈ క్రింది శ్లోకము భగవత్కథామృత వైశిష్ట్యమును అత్యంతమనోజ్ఞముగ వర్ణించుచున్నది.—

తవ కథామృతమ్ తప్తజీవనమ్
కవిభిరీడితమ్ కల్మషాపహమ్।
శ్రవణమంగళమ్ శ్రీమదాతతమ్
భువి గృణంతి తే భూరిదా జనాః॥

[ఓ ప్రభూ! నీ మధురామృత వాగ్వర్షము తాపోపశమనమును కల్గించును. సనకసనందనాది ఋషీశ్వర సంకీర్తితములయిన నీ పలుకుతేనియలు భవపాపహారములు, శ్రవణమంగళకరములు, ఘనలక్ష్మీయుతములునై విరాజిల్లుచుండును. అట్టి నీ కథామృతమును త్రావగల్గు మహాభాగ్యము ఎంతో పుణ్యము చేసికొన్న వారికిమాత్రమే ఒడగూడును.]

అయిదు సంపుటములుగ వంగభాషయందు "శ్రీరామకృష్ణ కథామృతము"ను రచించిన మహేంద్రనాథగుప్తుడు ఆ అయిదు సంపుటములలోను ముఖపత్రముపై ఈ పై శ్లోకమునే ముద్రించుకొన్నాడు. ఈ గోపికాగీతమునందలి అర్థమును శ్రీరామకృష్ణకథామృతమును దృష్టియందుంచుకొని విస్తృతముగ పరిశీలించెదముగాక.

"తవకథామృతమ్'' అని గోపికాగీతము ఆరంభమగుచున్నది. "ఓ ప్రభూ! నీ వాక్కులు అమృతమువలె మధురమయినవి'' అని దీని తాత్పర్యము. మనంతూడా అప్పుడప్పుడు మధురముగా మాట్లాడుతూనే ఉంటాము. ఎవరైనా మధురముగ మాట్లాడినపుడు "ఆహా! మీ మాటలు తేనెలొలుకుతూ ఉన్నాయి.'' అని మెచ్చుకుంటాం. కాని, లౌకిక జీవనులమయిన మనమాటలలో పైపైకి ఎంత మాధుర్యం అయినా గోచరించవచ్చును; కాని, అవతారపురుషుని వాక్యములలో వలె ఆపల్కులలో అమృతం నిండి నిబిడీకృతం కావటం మాత్రం జరుగదు.

పూర్వము దేవదానవులు మందరపర్వతమును కవ్వముగను, వాసుకుని త్రాడుగనుజేసి క్షీరసాగరమును మథించి అమృతకలశమును సాధించారు. అయితే, మోహినీరూపమున వచ్చిన విష్ణువు దైత్యుల కన్నుగప్పి ఆ అమృతాన్ని దేవతలకే పంచి యిచ్చాడు. అది త్రాగిన దేవతలు అమరులు కావటం జరిగింది. కాని, ఈ అమరత్వం అనేది సాపేక్షమయినది మాత్రమే. పరమేష్ఠి సహితము కల్పాంతమున నశింపవలసినవాడే కదా! నిరపేక్షమయిన అమరత్వం కేవలం బ్రహ్మజ్ఞానంవల్ల మాత్రమే లభిస్తుంది. ఆ అమృతస్వరూపమయిన పరమాత్మ సమస్త జీవకోటియందును అంతర్భూతమై ప్రకాశిస్తూనే ఉంటుంది. "అమరలోకం అనేది బయట ఎక్కడో వేరుగా లేదు. అది నీలోనే ఉంది. నిన్ను నువ్వు తరచి చూచుకొనగల్గితే నీలో నిక్షిప్తమయి ఉన్న అమృతాన్ని గ్రహించి అమరత్వమునందగలవు''– అనునదే ఈ కథయందిమిడియున్న సంకేతము, సందేశము.

భగవంతుడు అమృతసముద్రుడు. ఒకసారి రామకృష్ణులు వివేకానందునితో "నరేన్! పరమాత్మ అమృతసాగరము. ఆ అమృతముతో నిండియున్న చిన్న గిన్నె యొకటి నీ ముందున్నది. నీవు నిన్నొక ఈగగ భావించుకో. అపుడు నీవా అమృతమునెట్లు గ్రోలెదవు?'' అని ప్రశ్నించారు. దానికి నరేంద్రుడు "ఆ గిన్నె అంచుపై వ్రాలి లోనికి మెడసాచి త్రాగుతాను.'' అని జవాబిచ్చాడు. "అదేమి? ఆ గిన్నెలో మధ్యగా మునిగి త్రాగిన నేమి?'' అని గురుదేవులు తిరిగి ప్రశ్నింపగా, వివేకానందుడు "అందులో మునిగి చనిపోవు ప్రమాదమున్నదిగదా!'' అని అన్నాడు. అది విని పరమహంస మందహాసమొనర్చుచు "నాయనా! ఆ గిన్నెయందున్నది సచ్చిదానందము అనెడి అమృతమధువు. అందు మరణభీతికి తావు లేనే లేదు. ఆ అమృతసాగరమున ఎంత లోతుగా మునిగినను చావురాదు; సరికదా అమరత్వమే లభింపగలదు.'' అని విశదపరచారు. శ్రీరామకృష్ణ కథామృతము కూడనిట్టిదే.

సామాన్యముగా మానవుడు మ డు – అనగా మరణించు స్వభావము కలవాడు అని మనం అంటూ ఉంటాము. కాని, ఇది నిజం కాదు. మన శరీరము నశ్వరమేకాని, ఆత్మపదార్థము మాత్రము అమరమే. ఈ ఆత్మయే మన అసలు స్వరూపం. ఈ తత్త్వమును తెలుసుకొనుటకే అనాదినుండియు మానవుడు అన్వేషిస్తున్నాడు ఈ సందర్భమున బృహదారణ్యకోపనిషత్తునందలి ఈ క్రింది గాథ గమనార్హము. ఋషిపుంగవుడయిన యాజ్ఞవల్క్య మహర్షి తన ప్రియసతియగు మైత్రేయికి ఐహిక సంపదను ప్రసాదిస్తానంటాడు. అందుకామె "ప్రభూ! జ్ఞానమును, అమృతత్వమును నాకు సమకూర్చజాలని ఈ భౌతిక సంపదను నేనేమి చేసుకుంటాను'' (యేనాహం

నామృతా స్యామ్, కిమహం తేన కుర్యామ్?) అని జవాబిస్తుంది. త్యాగము వలన అమృతత్వమును పొందగలమని బోధించడము ద్వారా ఈ పరమార్థమునే వేదాంతము ప్రతిపాదించుచున్నది. క్రైస్తవమతము కూడ ఈ సంగతినే ప్రబోధించుచున్నది. ఏసుక్రీస్తు ఒకనితో "నీకు గల సంపదనంతటిని విక్రయించి ఆ ధనమును పేద సాదలకందరికి పంచిపెట్టు. అందువలన నీకు పరలోకములో ధనము నిలువకాగలదు. ఇపుడు కట్టుగుడ్డలతో నీవు నా వెంట బయలు దేరి రమ్ము" అని చెప్పినట్లు బైబిలునందు గలదు.

శ్రీరామకృష్ణకథామృతము అను పదమునకు— "శ్రీరామకృష్ణుని యొక్క వాగమృతము" అని అర్థము వచ్చును. సామాన్యముగా మనమీ అమృతమును వినడము, చదవడము, వర్ణించడము జరుగుతోంది. కాని, ఈ దివ్య కథామృతమును కడుపారగ్రోలెడి వారు మాత్రం చాల అరుదు. ఈ కథామృతము నెంత త్రాగితిమి అనునది కాదు ముఖ్యము:- ఒక చుక్క కావచ్చు, ఒక దోసెడు కావచ్చు, లేదా గంగాళముతో త్రాగవచ్చు. ఎంత త్రాగినను మనం అమరులం కాగలము. మనము త్రాగిన పరిమాణము కాదు లెక్కలోనికి వచ్చునది. అందలి వస్తుతత్వమే అమరత్వమునను గ్రహించు లక్షణమును కల్గియున్నది. నిజముగ గనుక మనం శ్రీరామకృష్ణకథామృతమును జీర్ణించుకొనగల్గితే, మన ఐహికవాంఛలన్నీ తక్షణమే పటాపంచలై పోతాయి. అయితే, విషయవాంఛలనుండి విముఖులము కావడం మనకంత సులభసాధ్యం కాదు. అసలు సమస్య అంతా ఇక్కడే. ఈ సత్యమునే శ్రీ గురుదేవులు ఈ క్రింది నీతి కథలో తెలియజేస్తున్నారు:—

బెస్తవనితలు-పూలవాసన

బెస్తవనితలు కొందరు సంతలో తమ చేపల నమ్ముకొని ఇండ్లకు మరలిరి. దారిలో చీకటి పడి, వాన ఆరంభమయినది. ఆ పల్లెవాండ్రు దాపుననే యున్న ఒక ఇంట్లో తలదాచుకొన జేరిరి. ఆ ఇల్లొక పూలవర్తకునిది. ఇంటి యజమాని బెస్తపడతులనాదరించి ఆ రాత్రికి తాను పూలను నిల్వచేయుగదిలో పండుకొనుడని అనుమతించెను. ఆ గదిలో పూవులు తట్టలు తట్టలు పడియుండుటచే పుష్పసౌరభమా గది నంతయు నింపివేసినది. చేపలకంపునకలవాటు పడిన ఆ పల్లెపడుచులకా సుగంధపరిమళము సహింపరానిదై నిద్రపట్టకుండెను. చివరకు వారిలోనొకామె వారికి చక్కని సలహానిచ్చినది. ఆ సలహామేరకు ఖాళీగానున్న చేపల బుట్టలపై నీళ్లు చిలకరించి ఆ బుట్టలను దగ్గర బెట్టుకొని ఆ 'మత్స్యగంధము'నకు ఒడలు మరచి నిద్రింపజొచ్చిరి.

అభ్యాసమెంత బలీయమయినదో ఈ కథ తెలియజెప్పుచున్నది. ఐహికజీవనమును గడపుచుండు మనమంతా ఈ కథలో పల్లెవాండ్రవంటి వారమే! పరతత్త్వం యొక్క దివ్యసుందరపరిమళమును భరించలేని దుస్థితిలో మనమున్నాము. కాని, మనమీ సంసారసాగరమును తరింపవలెనన్నచో ఆ దివ్యసుధామకరందమాధుర్యమును తనివి తీర త్రాగక తప్పదు.

సారాయము, సారాయము అంటూ మనం అదేపనిగా వెయ్యిసార్లు ఆ మాటను పునరుక్తిగా ఊరక వల్లించటం వల్ల మనకు నిషా కలుగదుగదా! మత్తు కలగాలి అంటే ఆ సారాయమును మనం త్రాగియుండవలెను. అట్లే కథామృతమును వినడంవల్ల చదవటం వల్ల అంతగా ప్రయోజనం లేదు. ఆ అమృత

సాగరమున మనము తల మున్కలుగా మునిగి కడుపార ద్రావినగాని మన తనివి తీరదు.

గోపికాగీతమునందలి రెండవ పదము-"తప్తజీవనమ్" అనునది. "సంసార దావాగ్నిని చల్లబరచుటకు ఓ ప్రభూ! నీ వాగమృత ధారయే శరణ్యము" అని దీని తాత్పర్యము. ప్రాపంచికజీవనము సర్వదా దుఃఖభూయిష్ఠము, దైన్యసంకలితమునై తపించుచున్నది. వేదాంతశాస్త్రాధ్యాపకులొకరు సంసార జీవనస్వభావాన్ని ఈ క్రింది ఉపమానంతో చక్కగా విశదపరిచారు.

ఒక బాటసారి ఏకాకిగా ఒక ఎడారిగుండా ప్రయాణం చేస్తున్నాడు. పైన ఎండ నిప్పులు చెరగుతోంది. ఆ పాంథుడు క్షుధార్తుడై, తృష్ణాతురుడై మార్గాయాసముతో అలమటిస్తున్నాడు. తలదాచుకొనడానికైనా ఎక్కడయినా కాస్త నీడ కన్పిస్తుందేమో అని ఆతడాత్రముగా దిక్కులు చూస్తున్నాడు. చిట్ట చివరకతనికి చల్లని నీడ పడిన ప్రదేశమొకటి గోచరించింది. 'అమ్మయ్య' అని ఆ బాటసారి ఆ నీడలో తలపెట్టుకొని ఆదమరిచి నిద్రింప సాగెను. కాని, ఆ నీడ ఒక కాలసర్పము పడగక్రింది నీడయని ఆ అభాగ్యుడు గుర్తింప లేకపోయినాడు!! ఈ ప్రాపంచికజీవనం కూడా ఇట్లాగే ఉంటుంది. మాయ అనునది మనలనేవిధముగ వివశులను చేస్తుందో గ్రహింపలేక, అజ్ఞానులమై, మోహగర్తము నందు మమతావర్తమునందు చిక్కి పాము పడగనీడ వంటి ఐహిక సుఖములే సౌఖ్యప్రదములని భ్రమిస్తూ చరిస్తుంటాము.

మానవజీవితము ఆశాబద్ధము, వాంఛాపీడితమునై; జన్మజరావ్యాధిమృత్యుబాధితమై, కామక్రోధాది షడ్గుణ సంకీర్ణమై పరితపించుచున్నది. గోవిందకథాసుధమహావర్షము తప్ప అన్యమేదియు ఈ తాపమును ఆర్ప జాలదు. బాధాతప్తమానవాసికానికి భగవత్కథామృతము మాత్రమే దుఃఖోపశమనమును కల్గింపజాలును. ఇతరోపాయము లన్నియు ప్రయోజనశూన్యములే.

గీతమునందలి తరువాతి పదము-"కవిభిరీడితమ్" అనునది. "కవీశ్వరులు నీ కథామృతమును విశదముగా వ్యాఖ్యానించి, స్తవరూపమున బహువిధములుగ కీర్తించుచున్నారు." అని దీని అర్థము. భగవంతుడు అవతారరూపమున ఆవిర్భవించిన వెంబడినే ఆ అవతారవిశేషములను కీర్తించుచు, అవతారతత్త్వమును విశదపరచుచు అనేక గ్రంథములు వెలయు చుండును. సంగీత, సాహిత్య, శిల్ప, నాటకరూపకాది ప్రక్రియలపారముగా ఆ అవతారమూర్తి గుణగణములనుగ్గడించుచు వెల్లివిరియుచుండును. శ్రీరామకృష్ణపరమహంస పల్కిన పల్కులు చాల సరళముగను పరిమితముగను నున్నవి. కాని, ఆ అలతి అలతి పల్కులలో నిక్షిప్తమైయున్న సర్వమత సమన్వయ తత్త్వమును, మానవుని దివ్యత్వమును నేల నాల్గు చెరగులా విస్తరింపజేసినాడు స్వామి వివేకానందుడు. సర్వధర్మసమన్వయమును అనుభవపూర్వకముగ ప్రవచించి, ప్రాచ్య పాశ్చాత్య సంస్కృతీసమ్మేళనము గావింప నావిర్భవించిన అవతారవరిష్ఠుడే శ్రీరామకృష్ణుడను సత్యమును స్థాపించిన మహనీయుడును స్వామి వివేకానందుడే. శ్రీరామకృష్ణుని కథామృతమును గ్రంథస్తము గావించి నిక్షేపముగ భద్రపరచియుంచిన ధన్యుడు మహేంద్రనాథ గుప్తుడు. శ్రీ గురుదేవుల ఆశయములను అనేక రూపకములుగ రచించి ప్రదర్శించినాడు ప్రఖ్యాత నటుడగు గిరీష్‌చంద్రఘోష్. పరమహంస భావములనే ఎందరెందరో కవులు

గీతముల రూపంలో వెలయించియున్నారు. వాస్తవమునకు శ్రీరామకృష్ణులు నిరక్షరాస్యులే అని చెప్పవచ్చు. అయితే, ఆయనకు లభించిన జ్ఞానం అంతా పుస్తకములద్వారా పరోక్షముగా గాక, (సూటిగా) నేరుగా భగవంతుని నుండియే లభించియున్నది. కావుననే, పరమహంస ఒకసారి భక్తులతో: "భగవత్తత్త్వమును ఒక్కమాటలో అర్థంచేసుకోవాలని మీరు అభిలషిస్తే నా దగ్గరకు రండి. అదే విషయాన్ని వేలకోలది మాటలలో వినాలనుకొంటే మీరు కేశవచంద్రసేన్ వద్దకు పొండి" అని అన్నారు. కేశవచంద్రసేనుడానాటి వంగదేశమందలి ప్రముఖ పండితుడు, మహావక్త. మొదటిసారిగా శ్రీరామకృష్ణులను గురించి పత్రికాముఖముగ ప్రకటించినది ఈతడే. ఈ విషయం తెలిసిన శ్రీగురుదేవులు కేశవునితో: "మీ పత్రికలయందు నన్ను గురించి వ్రాయుదువెందులకు? పుస్తకములలోను, వార్తా పత్రికలలోను వ్రాసి నీవు ఎవ్వరిని గొప్పవాళ్ళను చేయజాలవని గుర్తించు. ఆ జగన్మాత ఎవర్ని గొప్పవాళ్ళను చేయవలెనని సంకల్పిస్తుందో వారే గొప్పవారు కాగలరు" అని అన్నారు.

మన గీతమునందలి తర్వాత అంశము- కల్మషాపహమ్" – అనునది. భగవంతుని భాషణములు అనేకజన్మదురితౌఘవినిశ్శోషణములని దీని అర్థము. మన దేహమును, మనస్సును కూడ పునీతము గావించు పవిత్రత వానియందున్నది. ఇహలోకమును, నల్లటిరంగు దట్టముగ పూయబడిన ఒక గదియని అనుకొందాము. మల్లెపువ్వవలె తెల్లనైన వస్త్రములు ధరించి మనమాగదిలో ప్రవేశించామని భావిద్దాము. మనం ఎంత జాగ్రత్తగా ఉన్నా ఏదో క్షణమున ప్రమాదవశాత్తు రంగు అంటక తప్పదు. అది చాలు మన దుస్తులు చెడిపోవుటకు. లౌకిక జీవనంకూడా ఇట్టిదే. కామక్రోధాది వికారముల సంసర్గము కారణంగా మన మనస్సు కలుషితం కాక తప్పదు. పాపకర్మము లెల్లవేళలా మనలనాకర్షించి లోగొనడానికే ప్రయత్నిస్తుంటాయి. అట్లాగని, మనం వాటికి లోబడరాదు; నిరోధించి వానిని ఎదుర్కొనాలి. ఈ పోరాటమున మనకు బాసటగా నిల్చునదే "కథామృతము." భౌతిక వ్యామోహములనుండి, ఆకర్షణలనుండి మన మనస్సులను మరలించి పునీతము గావించు శక్తి ఈ "కథామృతము"నకు గలదు.

గోపికలచే కీర్తింపబడిన తరువాతి లక్షణము "శ్రవణమంగళమ్" అనునది. భగవత్కథామృతమును వీనుల వినినంతనె సమస్త సన్మంగళములు ఒనగూడునని తాత్పర్యము. తెలిసి తినినను, తెలియక తినినను కారము నాలుకపై బడినచో చురుక్కు మనక తప్పదు. అది, కారం యొక్క నైసర్గికస్వభావం. అట్లే పరమాత్మస్వరూపుని దివ్యభాషణములు వస్తుతః మంగళప్రదములై విరాజిల్లుచుండును.

పైపెచ్చు ఆ పలుకులు "శ్రీమంతములు" కూడను. అనగా, సుందరములై, మన చిత్తములనాకర్షించి సమ్మోహనపరచి లోగొను స్వభావము వానియందు గలదు. శ్రీరామకృష్ణ కథామృతమునకు అనిర్వచనీయమైనఅపూర్వాకర్షణశక్తి గలదు. ఒకసారి దానిని విన్నచో దాని బారినుండి మనము తప్పించుకొనజాలము.

"ఆతతమ్" అనుపదమునకు విస్తృతమై సులభసాధ్యమయినదని అర్థము. ఆధ్యాత్మిక సాధనామార్గమున పురోగమింపనిచ్ఛగించు ప్రతిసాధకుడును ఈ "కథామృతము"ను చవిచూడక విడువడు. సాధకుని స్థితిననుసరించి, మనః పరిపక్వమునననుసరించి అంచెలంచెలుగా

"కథామృతము"నందలి అర్థము అవగత మవుతుంది. చదివిన కొలదియు చవులూరే స్వభావము గలది "కథా మృతము". ఎన్ని పర్యాయములు దీనిని పఠించినను, ఎప్పటికప్పు డిది క్రొంగ్రొత్త రీతులలో కన్పిస్తుంది. అంతు తెలియరాని మహోన్నత ఆధ్యాత్మిక సాక్షా త్కార విషయమై గ్రంథ స్వరూపమున నిక్షే పితమయిన మహానిధానమే శ్రీరామకృష్ణ కథామృతము. ఈ గ్రంథమునొకసారి కడ ముట్ట చదివి పూర్తిచేసితిమని చెప్పుటకు వీలు కాదు. చదివిన కొద్దియు ఈ దివ్యగ్రంథము తనయందు నిక్షిప్తమయిన రత్నములను క్రొత్త క్రొత్తగా వెలువరిస్తూనే ఉంటుంది.

ఇక, గోపికాగీతమునందలి చివరి పదము "భువిగృణంతి తే భూరిదా జనాః" అనునది. మనమనేక రకముల దానాలు చేయుచుండ వచ్చును. వాటన్నిటి కంటెను శ్రేష్ఠమయినది "కథామృతమును" పంచిపెట్టుట. లేదా దీనికే మరియొక విధముగ కూడ అర్థం చెప్పుకో వచ్చు- "పూర్వజన్మమున పెట్టిపుట్టిన గాని నీ కథామృతమును విను భాగ్యము లభింపదు."

క్రిస్టోఫర్ ఇషర్‌వుడ్ అను ప్రఖ్యాత పా శ్చాత్య సాహితీవేత్త "శ్రీరామకృష్ణ కథా మృతము"ను గురించి ఇట్లా అంటాడు:- "ఇది అత్యంతము ఆహ్లాదకరమయిన ఒక మధుర జీవితగాథ. ఇందలి నిజాయితీ అసాధారణమయి నది. ఇది చాల విపులముగను, విస్తారముగను ఉన్నదని అనిపించవచ్చును గాక. కాని ఇందలి ఏ విషయమును మనకు విసుగు పుట్టించదు. ఒక్కసారి చదివిచూడండి. మీకు నిరుత్సాహం కలుగబోదని నేను నమ్ముతున్నాను."

శ్రీరామకృష్ణమఠమునకు చెందిన స్వామి యొకరు అమెరికాదేశపు ప్రముఖ విద్యా సంస్థ యొకదానిలో (Massachussets Institute of Technology) రసాయన శాస్త్రమున ఆచార్య పదవినధిష్ఠించిన ప్రముఖ శాస్త్రజ్ఞులొకరికి "శ్రీరామకృష్ణ కథామృతము" యొక్క ఆంగ్లానువాద ప్రతి నొకదానిని (The Gospel of Sri Ramakrishna) బహూకరించారు. ఆ ఆచార్యుడీ గ్రంథమును చదివిన పిమ్మట స్వామి వారికి తిరిగి అందిస్తూ "ఈ పుస్తకమును నేను చదవటమయితే చదివానుగాని, అంతగా ఆనం దించలేక పోయాను" అన్నారు. అదివిని ఆ స్వామి ఆ ఆచార్యునితో "దయయుంచి ఈ పుస్తకమును మరొక్కసారి చదివి చూడండి. అయితే, మొదటినుంచి చివరివరకూ కాకుండా ఈసారి మీకు నచ్చిన భాగాలు మాత్రమే చదువుకుంటూ పొండి"- అని కోరారు. స్వామి చెప్పిన పద్ధతిలో ఆ ఆచార్యుడా గ్రంథమును తిరిగి చదివాడు. పిమ్మట ఆయన స్వామితో ఇట్లా అన్నారు: "ప్రస్తుత సమాజమునకు తగిన జవాబు శ్రీ రామకృష్ణునిలోనే లభిస్తుందని గ్రహించాను. ఈ పుస్తకం నా కెంతగనో నచ్చింది. కామకాంచనముల వ్యామోహమున బడి అధోగతి పాలగుచున్న నవీనసమాజ సమ స్యలన్నిటికి పరిష్కర్త — శ్రీ రామకృష్ణుడు మాత్రమే. భౌతికజీవనలాలసులయిన మా (అమెరికా) దేశప్రజలకు, వారి సమస్యలకు సమాధానము ఒక్క శ్రీ రామకృష్ణుడేనని నా అభిప్రాయము."

"నా మాటలలో నీకు నచ్చినవి, నీ కెంత వరకు అవసరమనుకొంటావో అంతమాత్రమే తీసుకో. నేను చెప్పినవాటిలో నీకు పనికిరావని భావించేవాటిని వదలివెయ్యి" అని పర హంసయే స్వయముగ సెలవిచ్చియున్నారు. మన సంస్కారస్థాయిననుసరించి, మనఃస్థితి కనుగుణ్యముగా మనకు కావలసిన విషయ ములను "కథామృతము"నుండి గ్రహింప

వచ్చును. ఎవరెవరికి ఏయే సంపద కావలసి నను అదియంతయు నిక్షేపమైయున్న తావు శ్రీ రామకృష్ణ కథామృతము.

శ్రీ రామకృష్ణపరమహంస జీవితమున మొదటి సగభాగమును ధర్మోపార్జనమందును, ఆధ్యాత్మిక సాధనలోను, సర్వమతసమన్వయానుభవంలోను గడచిపోయింది. మిగిలిన సగభాగమూ తానార్జించిన ఆధ్యాత్మిక సంపదను నలువురకూ పంచిపెట్టుటలో ఆయన వితరణగావించెను. అమోఘము, అద్వితీయము నయిన శ్రీరామకృష్ణుని మహోన్నత ఆత్మశక్తిచే ఆకర్షింపబడిన జనులు తండోపతండము లుగ ఆయన చుట్టూ చేరెడివారు. అట్లా చేరవచ్చిన వారిలో చాలమంది వారి వారి ప్రత్యేక సమస్యలను, సందేహములను పరమహంసకు విన్నవించుకొని పరిష్కారము తెలుసుకొనవలెనని ఆశించెడివారు. మరికొందరు, కేవలం, ఆయన ఎట్లా ఉంటారో ఏమి మాట్లాడుతారో, ఎట్లా ప్రవరిస్తారో చూడవలెనను కుతూహలంతో వచ్చెడివారు. ప్రముఖ పండితులు, విద్యావేత్తలు, వైద్యులు, న్యాయశాస్త్ర పారంగతులు, ఉపాధ్యాయులు, విద్యార్థులు, సాధకులు, సంఘసంస్కర్తలు, జ్ఞానులు, మూఢులు- వారు వీరననేల, సమస్త జనసందోహము శ్రీరామకృష్ణుల సన్నిధికి ఆకర్షితమై పరువులెత్తెడిది. అట్లా చేరవచ్చినవారిలో కొంతమంది వంచకులు, త్రాగుబోతులు, ఆతతాయిలు, దుష్టులు, దుర్మార్గులు కూడా ఉండెడివారు. వీరందరితోటి శ్రీ గురుదేవులు ఏ అరమరికలును లేక ఆప్యాయముగ ఆదరముతో సంభాషించెడివారు. "కుపుత్రో జాయతే క్వచిత్, కుమాతా న భవతి" అనిగదా ఆర్యోక్తి. ఇట్లు తనను చేరవచ్చిన వారందరితోను పరమహంస గావించిన సంభాషణలు యథాతథముగ "శ్రీ రామకృష్ణ కథామృతము"నందు అక్షర రూపమున నిక్షిప్తమైయున్నవి. అందువల్ల, విభిన్న వ్యక్తిత్వములు ఇందు ప్రతిఫలించుచుండును. కావుననే, ఈ "కథామృతము"న అక్కడక్కడ మన వ్యక్తిత్వంకూడా తొంగి చూసుంటుంది.

ఒక చిన్న కర్రమంచముమీద కూర్చొని, శ్రీగురుదేవులు, తనను చేరవచ్చినవారి సమస్యలకు పరిష్కారమార్గములు సూచించెడివారు. ఆ పరిష్కారముకూడ అలతి అలతి మాటలలో, చిన్న చిన్న కథల రూపంలో సూచించెడివారు. ఆయన జీవితమున ఏ సమస్యయు లేదు గనుకనే ఇతరుల సమస్యలనాయన చక్కగా పరిష్కరింపగల్గెడివారు. తాను బద్ధుడయినవ్యక్తి అన్యులనెట్లు ముక్తులను చేయగలడు? సంసారబంధమునుండి విడివడి, కామకాంచనముల జయించిన ముక్తసంగుడు కావుననే శ్రీరామకృష్ణుడు సంసారుల సమస్యలకు సమాధానములు సూచింపగల్గినాడు. ఇతరులను బంధవిముక్తులను చేయునదే కదా భగవదవతారమని శ్రీరామకృష్ణుని ఉవాచ! తనను జేరవచ్చిన వారి సమస్యలను పరిష్కరించటమే కాక, పరమహంస వారినందరను ఆధ్యాత్మికమహోన్నతస్థితికి గొనిపోయెడివారుకూడా. తన మహోపదేశములచే శ్రీ గురుదేవులు మానవమానసపుష్పమును వికసింపజేసి దివ్యానుభవములనొనగూర్చి ప్రకాశింపజేసెడివారు. పరమహంస పవిత్రమూర్తిమత్వమే సమస్త శాస్త్రార్థసంగ్రహమై, ముముక్షుజనమార్గదర్శకమై విరాజిల్లుచుండెడిది. ఈ విషయమునుగూర్చి, ఆయనయే స్వయముగా ఇట్లు ప్రకటించియున్నారు:- "ఒకడు కష్టపడి నిప్పురాజేస్తే, ఇతరులంతా దాని చుట్టును జేరి చలికాచుకొంటారు. వీ

అందరికోసము శ్రమపడి నేను వండి, వార్చి అంతా సిద్ధము చేసియున్నాను, మీరు చేయ వలసినదంతా ఇచటకు వచ్చి తృప్తిమేరకు తినుటమాత్రమే.'' కేవలము తన సన్నిధిని జేరిన యంతమాత్రముననే సమస్త జనులు ధన్యతగాంచగలరని శ్రీగురుదేవులీ దుమూాల ముగ స్పష్టపరచియున్నారు. సమస్త నిగమాగమసారమూర్తియై యొప్పు శ్రీగురుదేవుల పవిత్ర సాన్నిహిత్యమే మహోత్తమ తపశ్చర్యయును, అద్వితీయ సాధనయునగుననుటలో వింత యేమి?

తనను శరణుజొచ్చినంతమాత్రముననే సమస్త పాపకర్మములను నశింపజేసి పుణ్యాత్ములనొనరింతునని శ్రీరామకృష్ణులే అభయ మొసంగియున్నారు. ఎంతటి పాపాత్ముడయినను తనను శరణు వేడినచో పాపభీతి తొలగి నిశ్చింతగనుండవచ్చునని శ్రీగురుదేవులు వచించెడివారు. మనకు స్వాతంత్ర్యం రాకపూర్వము మన దేశమును బ్రిటిషు ప్రభుత్వం పరిపాలించెడిది. కాని, పుదుచ్చేరి మాత్రం ఫ్రెంచివారి అధీనంలో ఉండెడిది అక్కడమాత్రం బ్రిటిషు పాలకుల మాటగాని, చట్టముగాని చెల్లుబడి కాకుండెడిది. అందువల్ల బ్రిటిషువారి రాజ్యమున తప్పుచేసిన వ్యక్తి ఫ్రెంచివలస రాజ్య ప్రాంతమయిన పుదుచ్చేరిలోకి పారిపోయి అక్కడ తలదాచుకొని శిక్ష తప్పించుకొనెడివాడు. అదే మోస్తరుగ పాపాత్ములు తన్ను జేరినచో పాపవిముక్తులయి పాపఫలితమును తప్పించుకొనవచ్చునని పరమహంస సూచించెడివారు. ''నేను మీ కర్మఫలితములను విధ్వంసము చేయగలను. నేను ఫ్రెంచి వలస రాజ్యమును''—అని శ్రీరామకృష్ణులనుచుండెడి మాటల అర్థమిదే!

''శ్రీరామకృష్ణకథామృతము నందలి మొత్తము వస్తువంతయు భగవంతుడే. ''మంగళాదీని, మంగళమధ్యాని, మంగళాంతాని'' అన్నలక్షణమునకు లక్ష్యముగా ఈ మహాకావ్యమున ఆద్యంతము సర్వమంగళస్వరూపుడగు భగవంతుని లీలయే ప్రత్యక్షమగుచుండును. ఆ పరాత్పరుని ప్రత్యక్షమొనర్చుకొనుట యెట్లు అనునదే ఈ కమనీయకావ్యమందలి ప్రధానాంశము. ''నాకు తెల్సినది భగవంతుడొక్కడే. ఇతర విషయం ఏదీ నాకు తెలియదు'' అని శ్రీరామకృష్ణుడు లుమార్లు ప్రకటించియున్నారు. ఆ మహనీయుని దివ్య జీవనమంతయు ఆత్మవైభవమే అనునట్లు దీపించినది. ఆత్మ చైతన్యసాక్షాత్కారమే ఈ ''కథామృత' కావ్యవస్తువు.

మామూలు జనులు మతమును బోధించడం మాత్రమే చేయగలరు. భగవదవతారమూర్తులు మతమును మనకందరికి బోధించుటకే కాక, మతమును మనకు అనుగ్రహించుటకును సమర్థులు. అసలు మతం అంటేఏమిటి?—వాస్తవతత్త్వమును స్వానుభవపూర్వకముగ తెలిసికొనుటయే మతము. ఈ అనుభవమును మనకు అనుగ్రహింపగలవారే అవతారమూర్తులు. తమ కరస్పర్శమాత్రమున, వీక్షణాకటాక్షమున, వాగ్విశేషముచేతనే మానవ జీవితమున విప్లవాత్మకమయిన మార్పులు గొని రాగల మహాపురుషులలో అగ్రగణ్యుడు శ్రీరామకృష్ణుడు. సామాన్యజనమునందంతర్లీనముగా అణగిమణగి నిద్రించుచున్న భగవద్దర్శనాలాలసతను జాగృతమొనర్చి భగవదారాధనోన్ముఖులుగా తీర్చిదిద్దగల ఆధ్యాత్మికశక్తి పరమహంసయందు అపరిమితముగ నున్నది. ఆధ్యాత్మికశక్తి రూపుగొన్న ఆకారమే శ్రీరామకృష్ణుడని చెప్పనొప్పును.

''శ్రీరామకృష్ణకథామృతము' చదువు

చున్నప్పుడు, పరమహంస మనకనేక వైవిధ్యములతో [అందు] సాక్షాత్కరించుచుండును. ఒక్కొక్కప్పుడు దివ్యభావపరవశుడై దురవగాహమయిన వేదాంతవిషయములను చర్చించుచుండును; అంతలో నవ్వుచు, మరుక్షణముననే భగవంతుని గూర్చి విలపించును; మరి కొంతసేపటికి యోగసమాధిస్థితియందు పూర్తిగ మగ్నుడై పోవును; అంతలోనే ప్రక్కవారితో వేళాకోళములాడుచు హాస్యవల్లరి కురిపించును. నవరసములనొకేకాలమున అత్యద్భుతముగ పోషింపజాలిన మహానాయకుడు శ్రీరామకృష్ణుడు. పరిపూర్ణతమావతారమూర్తికి తప్ప అన్యులకిట్టి రసపోషణాసామర్థ్యముండజాలదు. కనుకనే వివేకానందస్వామి శ్రీగురుదేవులను అవతారవరిష్ఠుడని కీర్తించెను.

శ్రీగురుదేవుల హాస్యరసపోషణము అనన్యసామాన్యము, అనితరసాధ్యమునై అలరారుచున్నది. శ్రీరామకృష్ణుల పరిహాసభాషణము సహితము భగవంతునకు సంబంధించినదే అయియుండును. అదే ఆయన వైశిష్ట్యము. పారమార్థికవ్యక్తి అనినంతమాత్రమున — కేవలము ఒక జడుడు, తీవ్రవిచారనిమగ్నుడు, నవ్వుముఖమెరుగని వ్యక్తియని తలచుట పరిపాటి. కాని ఈ భావన అసంబద్ధము, అసమంజసము ననక తప్పదు. వాస్తవమునకు, పరమాత్మసాక్షాత్కారమునందిన ఆనందమునకు సాటి ఆనందము మరియేముండును? కనుక, నిజముగా భగవత్సాక్షాత్కారము లభించిన శ్రీరామకృష్ణులవంటి పుణ్యపురుషులు తాము ఆ బ్రహ్మానందసాగరముననోలలాడుటయేగాక ఇతరులను కూడ ఆనందమగ్నులను గావించుట [illegible]జము. శ్రీగురుదేవులు తమ చమత్కారసంభాషణలతో భక్తులను ఆనందపరవశుల గావించెడివారు. ఇట్టి సందర్భములలో "శ్రీరామకృష్ణకథామృతము" నందు మహేంద్రనాథగుప్తుడు 'అన్నియు నవ్వులే', 'అంతా నవ్వులలో మునిగిపోయారు' అని వ్రాసియున్నాడు.

తనను జేరవచ్చిన వారినెవ్వరినీ శ్రీరామకృష్ణుడు తిరస్కరించి యెరుగడు. "ఒక్క ప్రాణికి గనుక సహాయము చేయగల్గినచో, అందునిమిత్తమై నేను మరల మరల అనేక పర్యాయములు శునకజన్మము నెత్తుటకయినను సమ్మతింతును." "ఒక్క మనిషినుద్ధరించుటకై ఈ నా శరీరమును వేయిసార్లయినను త్యాగమొనర్ప సంసిద్ధుడను."— అని ప్రకటించుచు శ్రీగురుదేవుడు ప్రాణుల ఆర్తినాశము నెడల తనకు గల దీక్షను స్పష్టముగ వెల్లడించియున్నాడు.

"శ్రీరామకృష్ణకథామృతము" అను ఈ మహాగ్రంథమును వంగభాషలో రచించిన మహేంద్రనాథగుప్తుడు కలకత్తాలో శ్యామ్ బజారునందలి 'విద్యాసాగర ఆంగ్లోన్నత పాఠశాల' యందు ప్రధానోపాధ్యాయుడుగ పని చేయుచుండెడివాడు. "మహాత్ముల చరిత్రములలో ఈ గ్రంథము విశిష్టమయినది" అని పాశ్చాత్యతత్త్వవేత్తలు ఈ "కథామృతము"ను కీర్తించియున్నారు. భగవంతుని లీలలు అతి విచిత్రముగ ఉంటూంటాయి. ఆ లీలావైదగ్ధ్యము ఊహాతీతము. ఈ గ్రంథ రచయితయగు మహేంద్రనాథుడు తీవ్రమయిన కౌటుంబ సమస్యలతో విసిగి వేసారి చివరకు ఆత్మహత్య గావించుకొన నిశ్చయించునంతటి దుస్థితికి చేరుకొన్నాడు. అట్లాంటి సమయంలో అతడు దక్షిణేశ్వర సమీపమున గల తన సోదరి గృహమునకు వచ్చుట తటస్థించినది. మహేంద్రనాథుని మేనల్లుడు అతనిని ఒక

శ్రీరామకృష్ణుల దివ్యసన్నిధికి తోడ్కొని పోయినాడు. ఆ మేనల్లుడు మరల రామకృష్ణుని దర్శించినట్లు మనకు కనపడదు! కాని, మహేంద్రనాథుడు మాత్రము పరమహంస సందర్శనమాత్రమున అపూర్వముగ మారిపోయినాడు. అయస్కాంతము సన్నిధికి ఇనుము ఆకర్షింపబడిన చందమున మహేంద్రనాథుని హృదయము శ్రీ రామకృష్ణుని వైపు ఆకర్షితమయ్యెను. కొలది దినములలోనే మహేంద్రనాథుడు శ్రీ గురుదేవుని ముఖ్య శిష్యులలో నొకడయ్యెను. శ్రీరామకృష్ణులొకపర్యాయము అతనితో "నీవు నాకు స్వకీయుడవు. తండ్రి కొడుకుల వంటి వారము మనము." అని ప్రకటించినాడన్నచో వారి మధ్య పెంపొందియున్న సన్నిహితసంబంధము అర్థము కాగలదు.

క్రమబద్ధముగా ప్రతిరోజు తన దినచర్యను వ్రాసియుంచుకొను అలవాటు మహేంద్రనాథునకు బాల్యమునుండియు అభ్యాసమయియున్నది. శ్రీరామకృష్ణునితో పరిచయము వృద్ధిచెందసాగిన కొలది, మహేంద్రనాథుడు ఎక్కువకాలము శ్రీ గురువులచెంతనే వెళ్ళబుచ్చుచుండెను. రమారమి అయిదు సంవత్సరముల కాలముపాటు శ్రీరామకృష్ణుల పాదముల చెంత కూర్చుండి, తాను విన్నవి విని నట్లు, కన్నవి కనినట్లు మహేంద్రనాథుడు వ్రాసుకొనుచుండెడివాడు. అపూర్వమయిన జ్ఞాపకశక్తి, అమేయమయిన భావనాబలము, కళాత్మకమయిన రచనా కౌశలము మహేంద్రనాథునకు భగవంతుడిచ్చిన వరములు. "నా గ్రంథమున నేను స్వయముగా నా చెవులార వినిన సంగతులను, కనులార గాంచిన సంఘటనలను మాత్రమే పొందుపరచి యున్నాను. పరోక్షముగ సేకరించిన సమాచారం ఇసుమంతయునిందు లేదు."- అని మహేంద్రనాథుడు నిర్ద్వంద్వముగా ప్రకటించియున్నాడు కనుక, "శ్రీరామకృష్ణ కథామృతము" నందలి సంగతులన్నియు రచయితయొక్క ప్రత్యక్ష ప్రమాణముపైనాధారపడియే లిఖింపబడినవని నిస్సంశయముగా నిశ్చయింపవచ్చును. ఆయన పల్కులు భక్తిశ్రద్ధలతో "శ్రీరామకృష్ణ కథామృతము"నందు అక్షరరూపమున నిక్షేపింపడియున్నవి. కాలము, స్థలము, వ్యక్తుల వివరములతో సహా ఎవరెవరితో పరమహంస ఎప్పుడెప్పుడు ఏయే సందర్భములలో ఏమేమి మాట్లాడినది ఈ "కథామృతము"నందు నిర్దుష్టముగా లిఖింపబడియున్నది. ఒక ఛాయాచిత్రమునందు వలె ఇందు సంఘటనలు లిఖింపబడినవని చెప్పనగును. ఈ విధముగా-శ్రీరామకృష్ణపరమహంస విషయమై కాదనరాని, తిరుగులేని సాక్ష్యము మనకు "శ్రీరామకృష్ణ కథామృతము"నందు లభించుచున్నది.

శ్రీరామకృష్ణులు ఇదివరకు లేని విషయమేదయిన క్రొత్తగ బోధించినారా అన్నచో లేదనియే చెప్పవలెను. ఆయన చెప్పిన సిద్ధాంతములు మనకు క్రొత్తవికావు. కాని అతిపురాతనమయిన ఆ సత్యమునే ఆధునిక లోకమునకు అనువుగా వినూత్న పద్ధతిలో పునర్వ్యాఖ్యానముగావించుచు ఆయన బోధించినరీతియే అద్వితీయము, అనిదంపూర్వమునై ఒప్పారుచున్నది. "మహమ్మదీయుల కాలమున చలామణిలోనుండిన నాణెములు బ్రిటిషువారిరాజ్యం వచ్చాక చెల్లుబాటు గాకుండపోయినవి. అదే మోస్తరుగ ఆయాకాలములకు అనుగుణముగ తత్త్వబోధనా విధానములు కూడ మారుతూ ఉంటాయి. కాలానుగుణ్యముగ మార్పు రాక తప్పదు." అని శ్రీగురుదేవులే స్వయముగ ప్రవచించియున్నారు. ఈ నవీన కాలమున

కనుగుణమగు విధముగ బోధించి ఆధునిక మానవాళికమును తరింపజేయుట కావిర్భవించిన అవతారమూర్తియే శ్రీరామకృష్ణుడు.

ఒకనాడు మానవులకు వచ్చిన రోగములను వనమూలికలతోను, ఔషధములతోను నయముగావించుకొనెడివారు. ఈనాడు వ్యాధి నివారణ నిమిత్తం ఏంటిబయాటిక్కులు, ఇంజక్షన్లు వంటి ఆధునిక చికిత్సను విరివిగా వాడుతున్నారు. వ్యాధినివారణకు ఆ కాలములో మూలికలు అవి పనికి వచ్చినట్లే, ఈ కాలములో ఆధునిక మందులు పనిచేస్తున్నాయి. రెండు రకాల మందులూ చికిత్సకు పనికి వచ్చేవే. వాని ఉపయోగము కాలానుగుణ్యముగా మారుతోంది. కాలానుగుణ్యముగ తత్త్వబోధనారీతిలో వచ్చుమార్పు కూడ ఇట్టిదే. ఇదే విషయమును భగవద్గీత కూడ నొక్కి చెప్పుచున్నది. శ్రీకృష్ణపరమాత్మ అర్జునునితో: "ఓ అర్జునా! నీవు నాకు భక్తుడవు, స్నేహితుడవునై యున్న కారణమున పురాతనమైన ఆ యోగవిద్యనే ఇపుడు నీకు బోధించి యున్నాను." అని ఈ యోగవిద్య అత్యంత ప్రాచీనమైనదని స్పష్టం చేసి యున్నాడు.

తర్కశాస్త్రమునందు పునరుక్తి యనునది ఒక లోపము అయితే కావచ్చును. కాని ధర్మశాస్త్రములందు మాత్రము పునరుక్తి కూడ ఒక అలంకారమే యగును. ఒకే విషయమును ధర్మశాస్త్రము పదేపదే ప్రవచిస్తుంది. అయితే, ఈ చెప్పెడివిధానము మాత్రం కాలానుగుణ్యముగ మార్పుచెందును.

"శ్రీరామకృష్ణకథామృతము" అను ఈ సంహితయందు పునరుక్తులు కోకొల్లలుగా మనకు కన్పించుచుండును. "ఈ పునరుక్తులను తొలగింపరాదా" అని ఒకరు రచయితను ప్రశ్నింపగా ఆయన ఇట్లా జవాబు చెప్పాడు: "ఈ పని నేను చేయజాలను. ఒకే కథను శ్రీరామకృష్ణుడు వేర్వేరు వ్యక్తులకు వేర్వేరు సమయాలలో విడివిడిగా చెప్పియున్నాడు. అట్లే ఒకే విషయమును గూర్చి పలుసార్లు ముచ్చటించి యుండెను. పునరుక్తి యని గనుక వానిని మిగిలిన తావులయందు తొలగించిన పక్షమున పరమహంస గావించిన సంభాషణలోని ధార విచ్ఛిన్నమైనట్లన్పించును. అదియునుగాక, ఏ వ్యక్తికి ఆ వ్యక్తిని ప్రత్యేకముగ శ్రీరామకృష్ణుల దివ్య కథామృతము ఏ విధముగా ప్రభావితం చేసిందో తెలుసుకోవాలి అంటే అయా ప్రత్యేక సందర్భములలో శ్రీ గురుదేవులు ఆయా వ్యక్తులతో పల్కిన పల్కులను పునరుక్తిగా వ్రాయక తప్పదు. ఒకే రత్నమును వేర్వేరు తావులలో పొదిగినపుడు దాని ప్రకాశము మారుతోంది గదా. ధూళిధూసరితమయిన నేలనుంచినపుడు రత్నం ఒకలాగ కన్పిస్తుంది. అదే రత్నమును శాద్వలీ స్థలిపై నుంచినపుడు మరియొకలాగ ప్రకాశిస్తుంది. ఆరత్నమునేతీసుకొని అందమైన భరిణలో మెరయుచున్న మెఖమల్ గుడ్డమధ్య పొదిగినపుడు అది మరింత సుందరముగా ప్రకాశిస్తుంది. అదేవిధముగ శ్రీరామకృష్ణుల సంభాషణము కూడ వేరువేరు సమయములందు, వేరువేరు వ్యక్తులను భిన్న భిన్న రీతులుగా ప్రభావితమొనర్చియున్నవి. కనుక పునరుక్తిగా వ్రాయుట జరిగినది."—మహేంద్రనాథగుప్తుని దృష్టియందు శ్రీ గురుదేవులు పల్కిన ప్రతిపల్కును ఒక అనర్ఘరత్నమే!

జరిగినది జరిగినట్లుగ క్రమబద్ధముగ మహేంద్రనాథుడు వ్రాసుకొని పదిలపరచిన "దినచర్య పుస్తకము (Diary) ఆధారముగ శ్రీరామకృష్ణ కథామృతము" వెలసియున్నది.

ఈ విషయమై ముచ్చటిస్తూ రచయిత ఇట్లా అంటారు: "కొన్నికొన్ని సందర్భములలో ఒకే దృశ్యమును నేను అనేకసార్లు భావనచేసి యుంటాను. ఒక్కొక్కప్పుడు, వానచినుకై చాతకపక్షి వేచి చూచినట్లు శ్రీగురుదేవుని నోటిమాట వెలువడువరకు నేను ఎంతో ఆత్రముగ నిరీక్షించుచుండెడివాడను." ఆ దివ్య గ్రంథమునందు రచయిత యగు మహేంద్రనాథుడు శ్రీరామకృష్ణుల మధుర సంభాషణములను, ఉపదేశసందేశములను అత్యంత భక్తిశ్రద్ధలతో క్రోడీకరించియున్నాడు. అంతియ కాదు; శ్రీగురుదేవుల దివ్యసన్నిధిని తాను తిలకించిన కమనీయ సుందరదృశ్యములను అతడు అత్యంత మనోజ్ఞముగ వర్ణించియున్నాడు. మనోహరముగ చిత్రితములయిన ఈ ఘట్టములు పాఠకుల హృదయములనాకర్షించి పరచుకొని పారవశ్యమును కల్గించుచున్నవనుటకు ఒక చిన్న వర్ణనము చాలు:

'మధ్యాహ్నభోజనం పూర్తిచేసిన అనంతరం శ్రీరామకృష్ణపరమహంస అప్పుడే కొద్దిసేపు విశ్రమించియున్నారు. వారున్న ఆ గది అంతా పరిశుద్ధ నిర్మల పవిత్ర వాతావరణంతో నిండిపోయింది. ఆ గదిగోడలకు స్త్రీ పురుష దేవతా చిత్రాలు వ్రేలాడుతూ ఉన్నాయి. నీట మునిగిపోతూన్న పీటర్‌ను రక్షించుచున్న క్రీస్తుప్రభువు పటంకూడా ఆ చిత్రాలలో ఉంది. గది బయటనున్న పుష్పాలు మనోహరమయిన సువాసనలను వెదజల్లుతూ ఉన్నాయి. చేరువనే, దక్షిణాభిముఖముగా ప్రవహిస్తూన్న గంగానది కూడా అక్కడకు చక్కగా కన్పిస్తోంది. అది వర్షాకాలము కావడంవల్ల భాగీరథి నిండుగా ప్రవహిస్తోంది. సముద్రుని చేరవలెనని సమధికోత్సాహముతో ఆతృతగా పరుగిడుచున్న మందాకినికూడా — దక్షిణేశ్వర దివ్యపురుషుని పాదస్పర్శము చేత పునీతమయిన ఈ భూభాగమును — దర్శించి స్పర్శించి నందులకు ఆనందము చెందుచున్నట్లున్నది.' (ఇది శ్రీరామకృష్ణ కథామృతము, వంగమాతృక యందు 129 వ పేజీలో వర్ణింపబడిన 1883 సం॥ జూలై 22 నాటి సఘటన.)

శ్రీరామకృష్ణపరమహంసను సందర్శించి ధన్యులయిన భక్తజనుల మనోభావములను సంకేతాత్మకముగా రచయిత పై వర్ణనమున ప్రతిబింబించుచున్నాడు. సచ్చిదానంద సాగరమున నిమగ్నమగుటకై పరువులిడుచున్న సాధకుని చిత్తవృత్తమందు సముద్రుని జేర త్వరపడు గంగాతోయము రూపమున చక్కగ ప్రతిబింబితమగుచున్నది.

వేదాంతశాస్త్రమును విధ్యుక్తముగా అధ్యయము చేయ అర్హతలను సముపార్జించుట బహుకష్టసాధ్యము. వివేక వైరాగ్యములను, శమదమాది షడ్గుణసంపత్తిని కల్గియుండి, తీవ్రమయిన మోక్షేచ్ఛ చే తపించువాడు మాత్రమే వేదాంతాధ్యయమునకు అర్హుడని శాస్త్రములు నిర్దేశించుచున్నవి. పైగా, ఈ మార్గము అసిధారావ్రతమువలె బహు క్లేశ సంభరితము. కాని, శ్రీరామకృష్ణ కథామృతమును పఠించి, ఆ మూలమున తరింపదలచినవారికి ఏ యోగ్యతయునక్కరలేదు. ఈ పవిత్ర ఆమ్నాయము చదువుటకందరకును అధికారమున్నది. విపులమైన వ్యాఖ్యల సహాయముగాని, ఒక గురువర్యునివలన అర్థవివరణముగాని, అవసరము లేకనే ఈ గ్రంథము మనకందరకు అర్థము అగుచుండును. సరళమైన భాషలో సుందరమైన శైలిలో రచన సాగినందున ఇది చదువుట ఆహ్లాదకరముగ కొనసాగిపోవును. అసలు శ్రీగురుదేవుని పలుకులన్నీ తేటతేటగా తేనెలు చిలుకునవేగాని, క్లిష్టమయినదొక్కటియు

మనకు కన్పింపదుగదా! అంతియుకాదు. ఆ మహనీయుని దివ్య సందేశము ఒక జాతికి, ఒక మతమునకు, ఒక దేశమునకు మాత్రమే పరిమితమయినది కానేకాదు. అయ్యది విశ్వజనీనము, సార్వకాలీనకమునై వెలుగొందు చున్నది.

ఇక, శ్రీరామకృష్ణుని నీతికథలలో ఒక్కొక్క గాథయు ఒక మహాకావ్యమై అలరారుచున్నది. ఆయన చెప్పిన నీతికథలుగాని, దృష్టాంతములుగాని వాటికవియే సాటి. అందలి నీతిని గ్రహించుట పసిబాలురకు కూడ చాల తేలిక. శ్రీగురుదేవుని నీతికథలు స్పష్టతతో, సరళముగ ద్రాక్షాపాకములో నలరారుచు మనలను సమ్మోహపరచుచుండును. పరమహంసను దర్శించిన వ్యక్తి యొకరు "అయ్యా! నేను ఆ భగవంతుని ఎట్లా తెలుసుకొనగలను"-అని శ్రీరామకృష్ణులను ప్రశ్నించెను. ఆ ప్రశ్నకు శ్రీగురుదేవులొసంగిన జవాబు ఎంతో రమణీయముగ నున్నది. "ఐహికభోగలాలసుడయిన వ్యక్తికి లౌకిక విషయములందు గల మమతాబంధమెంత గట్టిదో; తల్లికి తన బిడ్డయందు గల అనురాగమెంత దృఢమయినదో, పతివ్రతయగు భార్యకు తన భర్తయందు గల ప్రేమపాశమెంత బలవత్తరమైనదో;—అంత తీవ్రమయిన ప్రేమతో గనుక నీవు పరమాత్మను ఆరాధింపగల్గినచో నీవు భగవంతుని తప్పక చూడగలవు" అని పరమహంస సమాధానము.

శ్రీ రామకృష్ణుని నీతికథలు సందేశాత్మకముగ నిర్మాణదృక్పథముతో మనకు నీతిని గరపుచుండును. మహా గ్రంథములు సహితము గావింపలేని ఉద్బోధనను శ్రీ రామకృష్ణుని నీతికథలు మనకు వివరముగ బోధించుచుండును. "కట్టెలు కొట్టువానికి సన్యాసి ఉపదేశము" అను కథ ఇందులకొక చక్కని ఉదాహరణము.—

కట్టెలుకొట్టి వాటినమ్మి పొట్టపోసుకొను శ్రమజీవి యొకడు ఒకనాడు అడవిలో కట్టెలు కొట్టుకొనుచుండగా సాధుపుంగవుడొకడా మార్గమున వచ్చెను. ఆ శ్రమజీవి పడు కష్టమునుగాంచి ఆ సాధువు దయార్ద్రహృదయుడై వానితో "ఇంకను ముందుకు సాగిపొమ్ము. అందువలన నీకు మేలు చేకూరును." అని పల్కెను. ఆ పల్కులను విశ్వసించి కట్టెలు కొట్టువాడు మరునాడు వనములోపలికి ముందుకు సాగిపోయెను. అచట వానికి మంచి గంధపు చెట్టు కన్పింపగా, గంధపు కట్టెలు గొట్టుకొని వానినమ్మి ఆనాడు మంచిలాభము సంపాదించెను. "ఆ సాధువు నన్ను ముందుకు సాగిపో అనినాడేగాని, గంధపుచెట్టువద్ద ఆగమని చెప్పలేదు గదా." అని భావించి ఆ కట్టెలుకొట్టువాడు మరునాడు మరింత లోపలికి సాగిపోయెను. ఆనాడు వానికొక రాగి గని ఎదురయ్యెను. తాను మోయఁజాలినంత రాగి నతడు గ్రహించి అంగడిలో విక్రయించి మరింత లాభమునార్జించెను; కాని ఆతడంతటితో నాగలేదు. "ముందుకు సాగిపో, మేలుకల్గును" అను సాధువు వాక్యములనే నమ్మినవాడగుటచే ప్రతిరోజు మరింతముందు సాగిపోవుచుండెను. అందువల్ల వానికి వెండిగని, బంగారపుగని, చిట్టచివరకు వజ్రాలగని ఎదురుపడినవి. ఫలితముగా నాతడు తుదకు కోటికి పడగలెత్తెను.

ఈ కథారత్నమునందు మనకు శ్రీ గురుదేవులు బోధించు నీతి ఇది:- బ్రహ్మజ్ఞానము బడయవలెనన్నచో సాధకుడు తనమార్గమున తొలుదొల్త లభించు సిద్ధులతోను, మహిమలతోను తృప్తిచెంది అదే పరమార్థమని భ్రమించి అక్కడితో ఆగిపోరాదు. పూనికతో

తన సాధనామార్గమున ముందుకు సాగి పోవలెను. అప్పుడే శాశ్వత బ్రహ్మానందము అతనికి సిద్ధింపగలదు.

శ్రీరామకృష్ణుని బోధనలు అత్యంత సరళము లై, ఆచరణ సాధ్యములై అలరారుచుండును. "నీవు ధ్యానము చేయదలిస్తే పూర్తిగా అంతర్ముఖుడవైపోయి ధ్యానము గావింప వలెను. లేదా; ఒక మారుమూలకుగాని, నిర్జ నారణ్యమునకుగాని పోయి ఏకాంతముగ ధ్యానమొనర్పవలెను"- అని శ్రీ గురుదేవు లొక భక్తునకు బోధింపగా ఆ భక్తుడు "అడ వికి పోవుటకు నాకు వీలుకాదే" అని తన అశక్తతను వెలిబుచ్చెను. దానిపై పరమ హంస అతనితో "అట్లయితే నీ ఇంట్లోనే ఒక గదిలో మూలకుపోయి ధ్యానము చెయ్యి" అని దారి చూపించారు. "నా ఇంటి నిండా ఎప్పుడూ జనం తిరుగుతూనే ఉంటారు కనుక ఇది కూడా నాకు వీలుపడదు." అని ఆ భక్తుడు తన అశక్తతను వెళ్ళబుచ్చాడు. అందు శ్రీ గురుదేవులు అతనితో "పోనీలే నాయనా! బయట ఎక్కడా ప్రశాంతమయిన చోటు నీకు దొరకకపోతే నీ హృదయాంతరముననే ఆ దైవమును ప్రతిష్ఠించికొని ధ్యానంచేసుకో" అని సులభోపాయం సూచించారు. ఒక మార్గము వీలుకానిచో మరియొకటి; అదీ సాధ్యము కానిచో ఇంకొకటి. అన్యథాశరణం నాస్తి అంటూ అనన్యగతిత్వముతో ఆ పరా త్పరుని చరణారవిందములను శరణుజొచ్చిన చాలును. అంతా ఆయనే చూచుకొనగలడు!! "నీకొరకై నీ తరఫున వ్యవహరించు వకాలత్ నామా అధికారము నాకొసంగుము. ఇప్పటి నుండే నీ సర్వబాధ్యతలను నేను వహిస్తాను. అంతకుమించి నీవేమియు చేయనవసరము లేదు."- అని శ్రీరామకృష్ణులు స్వయముగా గిరీష్‌చంద్రఘోష్ వంటి ఐహిక జీవనునకు అభయమొసంగి యున్నారు. సాక్షాత్తు భగవ దవతారమూర్తికి కాక ఇట్టి ప్రపత్తిమార్గ మును సూచింపగల అర్హత, అధికారము ఇతరులకెవ్వరికి గలదు! సంసారలంపటు లకు సామాన్యమానవులయెడ నింతటి సానుభూతి చూపించుట శ్రీ గురుదేవు లకే చెల్లినది. ఈ మార్గమును గురించి పల్కినపుడు శ్రీ రామకృష్ణులు దీనిని మార్జాల కిశోరన్యాయమని వర్ణించెడివారు. పిల్లిపిల్ల ఎక్కడనున్నను 'మ్యావ్' అని అరచినంత మాత్రమున తల్లి పరుగునవచ్చి దాని క్షేమ మును కనిపెట్టి చూచును. అట్లే మనము మన సర్వముక్త్యారునామాను భగవంతుని అధీనము గావింపగల్గినచో, ఆ సర్వేశ్వరుడే మనలను సర్వదా కాపాడుచుండునని పరమ హంస పలుమార్లు బోధించియున్నారు.

అత్యంత మనోజ్ఞము, సరళ సుంద రములునై ఒప్పారెడి శ్రీ రామకృష్ణుల దృష్టాం తములందు మచ్చునకొకటి :—

ఒక పెద్ద అడ్డుగోడకు అవతలవయిపున ఏమున్నదో తెలుసుకోవాలి అని గోడకు ఇవతలనున్న వ్యక్తులలో ముగ్గురు ఉత్సాహ వంతులు కుతూహలం చూపించారు. అందులో ఒకడు ముందుగాపోయి పెద్దనిచ్చెన యొకటి పట్టుకువచ్చాడు. అతడా నిచ్చెన పైకెక్కి చూడగా ఆవలి వయిపున పరమానంద సౌఖ్యము గోచరించినది. వెంటనే అతడు ఏమీ చెప్పకుండా గోడదూకి అవతల పడ్డాడు. రెండవవాడుకూడా అదేపని చేశాడు. వారి వలన ఇవతలనున్నవారికేలాభమూ చేకూర లేదు. అయితే, మూడవవ్యక్తి మాత్రము నిచ్చెనపైకెక్కి ఆవలివైపుచూచి తాను గ్రహించిన ఆనందమును ఇవతలివారికి పంచి

యీయవలెనని తలచినాడు. అందులకై ఆతడు నిచ్చెన దిగివచ్చి ఈవలనున్న వారందరకు తాను చూచిన ఆనందతత్త్వమును విశదముగ వర్ణించి వారినందరను ధన్యుల జేసెను.

పై దృష్టాంతమునందు అడ్డుగోడగా నిలచినది మనలనావరించిన మాయయే! గోడకివతలవయిపున మనమంతా ఉన్నాము. తాను తరించుటయేగాక మనలనందరను తరింప నిచ్చెన దిగివచ్చిన ఆ మూడవవ్యక్తియే శ్రీ రామకృష్ణుడు!!!

రామకృష్ణుడు ప్రతిరోజు ఆ రాత్రిక సమయమున దక్షిణేశ్వర దేవాలయం అంతా ఘంటానినాదములతో మార్మ్రోగువేళ ఇంటి పైకప్పుపైనెక్కి రామానుజులవలెనే "ఓ నా బిడ్డలారా! రండి, రండి. మీరెక్కడున్నారు? మిమ్ములను చూడనిదే నేను జీవింపజాలను" అని కరుణార్ద్రకంఠముతో ఎలుగెత్తి ఆహ్వానించుచుండెడివారు. శిష్యుల నిమిత్తమై తాను పరితపించినంత తీవ్రముగా ఏ కన్నతల్లియు తన బిడ్డలను గురించి పరితపించి యుండదని పరమహంసయే ప్రకటించియుండెను.

శ్రీ రామకృష్ణకథామృతమును వంగ మాతృకమున రచించిన మహేంద్రనాథ గుప్తుడు తాను శ్రీ గురుదేవులను రెండవసారి దర్శించినపుడు ఆయనకు తన మనస్సులోని నాల్గు సందేహములను విన్నవించుకొని యున్నాడు. ఈ ప్రశ్నల మూలమున మహేంద్రనాథుడు సకల మానవాళికిని మహోపకారమొనర్చెనని చెప్పక తప్పదు. శ్రీ గురుదేవులు మహేంద్రనాథునకొసంగిన సమాధానములు భక్తజనులకెల్లరకును ఎల్లవేళల ఆరాధనీయములై అలరారుచున్నవి:-

మహేంద్రనాథుడడిగిన మొదటి ప్రశ్న: "స్వామీ! మా మానసమును భగవంతునిపై దృఢముగా నిలుపుటకేమి చేయవలెను?" దీనికి పరమహంస చెప్పిన సమాధానమిది— : "నామజపమునొనర్చుట, ఆయన గుణవిశేషములను కీర్తించుట, సజ్జనసాంగత్యము అనునవి ఆచరించవలెను. అప్పుడే మనస్సు భగవంతునిపై లగ్నం కాగలదు. ఒక మొక్కను నాటిన తొలిరోజులలో దానిని జంతువులు తినిపోకుండా దానిచుట్టూ దృఢమైన కంచెను వెయ్యాలి. అట్లాగే పైన పేర్కొనిన మార్గములద్వారా మనస్సును పరిరక్షించుకొంటూ సాధనామార్గములో పరిణతి చెందాలి."

ఇక, మహేంద్రనాథుని రెండవ ప్రశ్న "మేము ఈ లోకమున మా లౌకికజీవితమును ఏ విధముగా గడపవలెను?" ఇందుకు జవాబుగా శ్రీ గురుదేవులు "నీ విధ్యుక్తధర్మములను నిర్వహిస్తూఉండు. కాని, నీ మనసును మాత్రం ఆ భగవంతునిపైననే కేంద్రీకృతం చెయ్యి. భార్యాబిడ్డలు, తల్లిదండ్రులు, చుట్టపక్కములు అందరితోను కలసి మెలసి జీవిస్తూ, వారికవసరమైనవి అన్నీ సమకూరుస్తూ, వారి పోషణభారమును వహించు. వారందరూ నీకు ఆప్తులుగనే ప్రవర్తించు—కాని, నీ హృదయాంతరమున మాత్రము ఒక్క దైవము తప్ప మిగిలినవారెవ్వరును నీ వారు కారను సత్యమును మరువకు" అని చెప్పెను. ఈ విషయమునే ఇంకా వివరిస్తూ శ్రీ రామకృష్ణులు అనేక దృష్టాంతములను ఉదహరించియున్నారు. అందులో—కొన్ని :—

సంపన్నుడగు ఒక యజమాని యింట సేవలు గావించు పరిచారిక అచటి పనులన్నియు కడు శ్రద్ధగా నిర్వర్తించుచు ఆ యింటనున్నంతసేపును 'నా యిల్లు', 'నా యజమాని' అని పల్కుచు, యజమాని బిడ్డలను 'నా రాముడు, నా కృష్ణుడు' అని

ఆప్యాయముగ పిలుచుచు వర్తించును. కాని, వాస్తవమునకు ఆ యిల్లు తన స్వంతము కాదనియు, ఆ పిల్లలు తనవారు కారనియు ఆమెకు గుర్తే. ఆమె మనసు మాత్రము దూరముగ పల్లెలోనున్న తన స్వంత ఇంటి పైననే యుండును.

"తాబేలు నీటిలో కదలాడుతూనే ఉంటుంది. కాని దాని ఆలోచనలు మాత్రం గట్టుమీద ఇసుకలో తాను పెట్టిన గ్రుడ్ల మీదే ఉంటుంది."

"పనసపండును ఒలిచేటపుడు ముందు చేతులకు నూనె రాసుకొంటే చేతులకు జిగురంటుకోదు, తొనలు చక్కగా వస్తాయి. అదే మోస్తరుగా, ముందుగా భగవంతుని ప్రార్థించి ఆయన ప్రేమనార్జించినపిమ్మట సాంసారిక విధులను నిర్వహించటానికి మనం పూనుకొన్నట్లైతే భవబంధాలు మనకంటవు."

మహేంద్రనాథుడడిగిన మూడవ ప్రశ్న 'భగవంతుని ప్రత్యక్షముగ గాంచుట సాధ్యమేనా?' దీనికి శ్రీ రామకృష్ణులు "నిస్సందేహముగా చూడగలము. అప్పుడప్పుడు ఏకాంతవాసము గావించుచు, భగవన్నామమును జపిస్తూ, ఆయన చరిత్రమును శ్లాఘిస్తూ, ఏది సత్యమో ఏది మిథ్యయో ఎరిగి సంచరించుచుండినచో భగవంతుడు మనకు తప్పక గోచరిస్తాడు." అని జవాబిచ్చారు.

"ఏయే పరిస్థితులలో మనము భగవంతుని కనులార గాంచగలము?" అనునది మహేంద్రనాథుని చివరి ప్రశ్న. ఇందుకు శ్రీ గురుదేవులు స్వానుభవపూర్వకముగ ఒసగిన సమాధానం ఇది...:-"భగవత్సాక్షాత్కారమునకై తీవ్రమయిన హృదయవేదనతో పరితపించినచో నీవు తప్పక భగవంతుని చూడగలవు. ఈ లోకమున సామాన్యముగ భార్యా బిడ్డల నిమిత్తము, సంపదల నిమిత్తము కడవల కొలది కన్నీళ్లు కార్చి విలపించువారే కాని, భగవత్సాక్షాత్కారమునకై నిజముగా పరితపించువారెవ్వరు? భగవత్ సాక్షాత్కార వాంఛాతప్తులయినవారికి ఆ దైవము కన్పడి తీరును. తొలిసంజకు పిమ్మట సూర్యోదయం తప్పక జరిగితీరును. అట్లే దైవసాక్షాత్కార వేదనానంతరముభగవంతుడు కనబడి తీరును."

"శ్రీ రామకృష్ణకథామృతము" అమూల్యమయిన ఒక నిక్షేపమని చెప్పనొప్పును. దీని వెల నిర్ణయించుట అసాధ్యము. శ్రీ రామకృష్ణదేవుని గృహస్థ శిష్యులలో పూర్ణచంద్రఘోష్ అనునాతడొకడు. పూర్ణచంద్రుడు శ్రీ గురుదేవునకు అత్యంత ప్రీతిపాత్రుడై ఆయనచే 'ఈశ్వరకోటిలోనివాడు' అని కీర్తింపబడినాడు. అట్టి పూర్ణచంద్రుడొకసారి గృహకలహములతో కలతజెంది, విసిగి వేసారి, ఆత్మహత్య గావించుకొన నిశ్చయించుకొనెను. ముందుగా స్నానముచేసి శుచియై, దేవాలయమునకు పోయి దైవమును దర్శించినపిమ్మట ఆత్మహత్య చేసుకొనవలెనని పూర్ణచంద్రుడు సంకల్పించెను. అదే ప్రకారముగనాతడు దైవదర్శనము గావించుకొనెను. తర్వాత "శ్రీ రామకృష్ణకథామృతము" కొంచెము చదివి శ్రీ గురుదేవుని దివ్యకథామృతము కొంచెము చవిచూచి ఆ పవిత్రభావముతో తనువు చాలించవలెనను తలంపు పూర్ణచంద్రునకు కల్గినది. వెంటనే "శ్రీ రామకృష్ణకథామృతము"ను చేతికి తీసుకొని యదాలాపముగా తెరచిచూచెను. అతడు యదాలాపముగా తెరచిన ఆ పుటలో "పూర్ణచంద్రఘోష్ గొప్ప బాలభక్తుడు. ఈ బాలుని శ్రేయస్సు గురించి శ్రీ రామకృష్ణులెంతయో చింతించుచున్నారు." అనుచు మహేంద్రనాథుడ

వ్రాసిన వాక్యము అతనికంట పడింది. ఆ వాక్యము చూచీచూడగనే పూర్ణచంద్రుడు తన్మయుడై పోయినాడు. "శ్రీ గురుదేవులు నన్ను గురించియు, నా యోగక్షేమముల గురించియు విచారిస్తున్నారు. ఆయన నా కుశలమును ఆకాంక్షిస్తుంటే, నేను ఆత్మహత్య గావించుకొనుటయా? అసంభవము. ఇది జరుగకూడనిపని." అని పూర్ణచంద్రుడు తన ఆత్మహత్యా సంకల్పమునకు స్వస్తి పల్కెను. ఈ విధముగా పూర్ణచంద్రుని జీవితమును "శ్రీ రామకృష్ణ కథామృతము" రక్షించినది! ఈ దివ్యగ్రంథమున నిక్షేపింపబడిన కథామృతముయొక్క ప్రభావ మట్టిది!!

(అద్వైతాశ్రమం — మాయావతినుండి వెలువడు 'ప్రబుద్ధ భారత' అను ఆంగ్ల మాసపత్రిక సౌజన్యముతో.)


## FORM IV

*(See Rule 8)*

Statement about ownership and other particulars about the Sri Ramakrishna Prabha (according to Form IV Rule 8, circulated by the Registrar of Newspapers for India.)

1. Place of Publication ... : Madras-600004.
2. Periodicity of its Publication... : Monthly.
3. Printer's Name — : M. Balasundaram.
   Nationality ... : Indian.
   Address ... : Freedom Press, 528, T. H. Road, Madras-600021.
4. Publisher's Name ... : Swami Tanmayananda.
   Nationality ... : Indian (Hindu Monk).
   Address ... : Sri Ramakrishna Math, Mylapore, Madras-600004.
5. Editor's Name ... : Swami Tanmayananda.
   Nationality ... : Indian (Hindu Monk).
   Address ... : Sri Ramakrishna Math, Mylapore, Madras-600004.
6. Name & Address of individuals who own the newspapers and partners or shareholders holding more than 1% of the total capital.

I, Swami Tanmayananda, hereby declare that the particulars given above are true to the best of my knowledge and belief.

Date: 25-3-1979.

(Sd) SWAMI TANMAYANANDA,
*Signature of the Publisher.*

# శరీర మాద్యం ఖలు ధర్మ సాధనమ్

చీమలకొండ ఉమారామలింగమూర్తి

**మ**నము ఏ పనిని చేయదలచినను ఒక గమ్యముండవలెను. విద్యార్థుల గమ్యము ఏదేని ఒక ఉద్యోగమునకు అర్హత సంపాదించి, ఆ వృత్తి ధర్మమును నేర్పరితనముతో సమర్థవంతముగ నిర్వర్తించి ధనార్జనము ద్వారా కుటుంబపోషణ చేయుచు సుఖజీవనము గడుపుట. ఇదే తీరున కర్షకుడు అధిక ఉత్పత్తిని సాధించి సుఖజీవనమును గడుపుటకు ప్రయత్నించును. కార్మికుని గమ్యము కూడ తన పని వలన యజమాని మెప్పును బడసి తానీయబడు భృతితో సుఖజీవనము గడుపవలెననియే. అందువలన సంఘములోని ప్రతి వ్యక్తి న్యాయబద్ధమగు ఒక పనిని (ధర్మమును) చేయుచు, ఆర్జించి తన కోరికలను సఫలీకృతము చేసికొని సుఖజీవనము గడుపుచు వార్ధక్యము వచ్చిన తరువాత జీవితగమ్యమును- జన్మరాహిత్యము ద్వారా శాశ్వతసుఖమునిచ్చునదియు అగు మోక్షమును- కాంక్షించుట పరిపాటి. అందువలననే చతుర్విధపురుషార్థములగు ధర్మ (Duty) అర్థ (Weatth) కామ (Desire) మోక్షము (Liberation)లు అనునవి మన గమ్యములుగా ఏర్పడినవి. వీనిని బడయుటకు కొన్ని సాధనములు (Means) కావలెను. విద్య, మానవసేవ, వృత్తి అనునవి సాధనములు. విద్యను నేర్చుకొనుటకుగాని మానవసేవ చేయుటకుగాని ఆరోగ్యవంతమైన శరీరము అవసరమని ఈ క్రింది వాక్యము చెప్పుచున్నది.

శరీరమాద్యం ఖలు ధర్మసాధనమ్
దేహే సరోగేత్ నవార్థ సిద్ధి.

(ధర్మసాధనములన్నిటికి శరీరము మొదటిది. శరీరము రోగిభూయిష్టమైనచో ఏ కోరికలు సిద్ధింపవు.)

ఈ వాక్యము యొక్క ప్రాముఖ్యమును గ్రహించుటకు ఈ దిగువ ఉదాహరణములను గమనింపుము. సత్కర్మము (మంచి పనిని) ఫలాపేక్షరహితముగ చేయవలెననెడు కర్మమార్గమును, అనన్యభక్తినలవరచుకొని భగవత్సాక్షాత్కారము పొందమని సూచించు భక్తిమార్గమును, జ్ఞానము వినా మోక్షము ప్రాప్తించదు గాన అట్టి జ్ఞాన సముపార్జనను గూర్చి జ్ఞానమార్గమును వివిధ ఆధ్యాత్మిక అంతస్థుల యందున్న వివిధ మనుజులకు భగవద్గీతయందు విశదీకరింపబడినవి. మానవునిలోనుండు దైవాంశను గుర్తించుట ద్వారా మానవసేవ చేయుటకు కరచరణాద్యవయవములు పటిష్ఠముగ నుండవలెనుకదా! భగవద్గీతలో చెప్పబడిన దైవయజ్ఞము, బ్రహ్మయజ్ఞము, ద్రవ్యయజ్ఞము, తపోయజ్ఞము, స్వాధ్యాయము- ఇత్యాది ద్వాదశయజ్ఞములను చేయుటకు కూడ కరచరణాద్యవయవములే గాక అంతరింద్రియములగు మనస్సు బుద్ధి చిత్తము కూడ సరియగు స్థితిలోనుండవలెను. జ్ఞాన సముపార్జన ద్వారా ఆత్మసాక్షాత్కారము పొందుటకు రాజయోగము (యమ, నియమ, ఆసన, ప్రాణాయామ, ప్రత్యాహార, ధారణ, ధ్యాన, సమాధులు) అవలంబించుటకుగాని బ్రహ్మసూత్రకారుడగు వేదవ్యాసుడు సూచించిన I ఆత్మానాత్మవివేకము II ఇహాముత్రఫలభోగవిరాగము III శమదమాది షట్కసంపత్తి IV ముముక్షుత్వము అను సాధన చతుష్టయము అవలంబించుటకు గాని బహిరింద్రియములతో పాటు అంతరింద్రియములు కూడ తోడ్పడవలెనుకదా! అంతరింద్రియముల స్థితికూడ శరీరారోగ్యముపైననే ఆధారపడి యుండును అను

భావము A Sound mind in a sound body అను ఆంగ్లనానుడి కూడ తెలియచేయుచున్నది. అందువలన ధర్మసాధనములన్నిటికి శరీరము మొట్టమొదటిది. చేతులారంగ శివుని పూజింపక పోయినను నోరు నొవ్వంగ హరిని కీర్తింపక పోయినను దయను సత్యమును మనస్సున తలవని యెడల తల్లుల కడుపుచేటు కాగలదని పోతన రమ్యముగ వర్ణించినాడు. మానవ జన్మమును పొంది అక్షరపరబ్రహ్మమును (నాశము లేని పరమాత్మను) తెలిసికొనక మరణించువాడు కృపణుడు (దీనుడు) అని బృహదారణ్యకోపనిషత్తునందు కూడ చెప్పబడినది.

ఇట్టి ప్రాముఖ్యతగల శరీరము రోగభూయిష్ఠమైనచో ఏ కోరికలు సిద్ధింపబడక పోవుటయే గాక అట్టి పురుషుడు సంఘమునకే భారమగును. కావున శరీరమును ఆరోగ్యవంతముగనుంచుకొనుటకు మనము సర్వవిధముల శ్రద్ధ గైకొందుము. ఆరోగ్యము శారీరక (Physical) మానసిక (Mental) నైతిక (Moral) ఆరోగ్యమని మూడు విధములుగనుండును. శరీర సౌష్ఠవము గల్గి మనస్సు అపరిపక్వముగ నున్నను, శరీరమును, మనస్సును ఆరోగ్యవంతముగ నుండి నైతికముగ దిగజారినను అట్టి వ్యక్తి ఎట్టి ప్రయోజనమును సాధించలేదుకదా! Have the strength of a giant but do a not use it like a giant (రాక్షసునికున్నంత బలము ఉండవలసినదే గాని దానిని రాక్షసుని వలె ఉపయోగించరాదు) One may be an intellectual giant but a moral pigmy అసాధారణ తెలివితేటలు గల వ్యక్తి నైతికముగ మరగుజ్జు అయిన ఏమి ప్రయోజనము? అందువలన శారీరిక మానసిక నైతిక ఆరోగ్యములు అవసరము. శరీర ఆరోగ్యమునకు మితముగ బలవర్ధకాహారము, పరిశ్రమ, బ్రహ్మచర్యము, విశ్రాంతి అవసరమని చెప్పబడినవి. పొగ పీల్చుట మత్తు ద్రవ్యములనుపయోగించుట నిషేధింపబడినవి. అప్పుడప్పుడు ఉపవసించుటకూడ అవసరము. మానసికారోగ్యము సాత్వికాహారమువలన వృద్ధియగును. ఉత్తేజకరములు (Stimulants), రాజస తామస ఆహారములు వర్జనీయములు. నైతికారోగ్యమునకు సత్యమును(మనోవాక్కాయముల ద్వారా) పాటించుట, ఋజువర్తనము, ఓరిమి, దయ, సహనము, శాంతము ఇత్యాది గుణములనలవరచుకొనుట అవసరము. ఈ తీరున ఆరోగ్యమును పెంపొందించుకొనుటలో ఆరోగ్యము ఒక సాధనము (Means) మాత్రమే అనియు, అదియే పరమావధి (End) కాదనియు మరువరాదు. ఆరోగ్యము అను సాధనము ధర్మసాధనము మాత్రమే. ఈ నియమములు పాటించుటవలన మనస్సు వశీకృతమై, ఆత్మోద్ధరణకు ఉపయోగపడును.

Fire is a good Servant but a bad master అను ఆంగ్లనానుడి కలదు. నిప్పువలన మనము ఎన్నియో ఉపయోగములను పొందుచుందుము. ఈ ఉపయోగములను పొందుటకు నిప్పును అదుపులోనుంచవలెను. అదుపు తప్పిన నిప్పువలన ప్రతి సంవత్సరము ఘోరమగు అగ్నిప్రమాదములు తటస్థించుచుండుట మనకు తెలియనిదికాదు. అటులనే వశీకృతమైన మనస్సు మన బంధువనియు, వశీకృతము కాని మనస్సు మనకు శత్రువనియు మనము మరువరాదు. మనస్సు వశీకృతమైనచో మనము సన్మార్గమున ప్రవర్తింతుము. వశీకృతము కానిచో మనము జ్ఞానేంద్రియ కర్మేంద్రియములకు బానిసలమై చూడరాని దృశ్యములను చూడవలెననియు, వినరాని మాటలను వినవలెననియు, అనరానిమాటలను ఉచ్చరించవలెననియు, చేయరాని పనులను చేయవలె

ననియు, కోరికల పరంపరకు లోనగుదుము. సుకృత దుష్కృతములవలననే సుఖదుఃఖములు కల్గును. వశీకృతమైన మనస్సు సుకృతములను చేయించును. వశీకృతము కాని మనస్సు దుష్కృతములను చేయించును. ప్రస్తుత కాలమున అణుశక్తిని ప్రజోపయోగమునకుగాని ప్రజానాశనమునకుగాని వినియోగించుటకు అవకాశము కలదు కదా. అటులనే శరీరమును ధర్మసాధనముగా చేసికొని తరించవచ్చును. అధర్మసాధనముగ చేసికొనినచో అధోగతి పాలుకావలసి వచ్చునుకదా. అందువలన మన శరీరమును సన్మార్గమునగాని చెడుమార్గమునగాని పెట్టునది మన మనస్సే.

మరి యొక సంగతినికూడ గమనింపవలసి యున్నది. మనలో కొందరు పుట్టుకతోనే వివిధ స్వభావములు కల్గియుందురు. కొందరిలో రాక్షసగుణము (తమస్సు) అధికముగను, కొందరిలో మానవగుణము (రాజసము) అధికముగను, మరికొందరిలో దైవీగుణము (సత్వగుణము) అధికముగను ఉండును. కొందరు దృఢకాయులుగను కొందరు బలహీనులుగను ఉందురు. దీనికి కారణము మనపూర్వజన్మములందు మనము చేసిన సుకృత దుష్కృతఫలితములని మన శాస్త్రములు చెప్పుచున్నవి. వివేకానందుని అభిప్రాయమును గమనింపుడు.

"We are responsible for what we are; and whatever we wish ourselves to be, we have the power to make ourselves. If what we are now has been the result of our Past actions, it certainly follows that whatever we wish to be in future, can be Produced by our present actions. So we have to know how to act. మన ప్రస్తుత స్థితికి మనమే బాధ్యులము. భవిష్యత్తులో ఎట్లు ఉండగోరెదమో అట్లుండుటకు కూడ మనకే శక్తి కలదు. ప్రస్తుతస్థితిలో ఇట్లుండుటకు గతములోని మన కృ[illegible] కారణమైనచో, భవిష్యత్తులో ఎట్లుండ గోరెదమో అట్లుండుటకు మన ప్రస్తుత చర్యలే కారణమగును. అందుచే ఎట్టి కృత్యములు చేయుట సమంజసమో తెలిసికొనవలసి యున్నది." ఇట్టి ప్రయత్నమునే పురుషప్రయత్నము (పురుషకారము Self effort) అందురు. అనారోగ్యమైన శరీరమును ఆరోగ్యవంతముగను, రాజసతామసగుణము లున్నచో వానిని సత్వగుణముగను మార్చుకొనుటకు మన ప్రయత్న మవసరము. అందువలన మన శరీరము అధర్మమార్గములో నడచుచున్నచో దానిని క్రమపరచుటకు సన్మార్గమున పెట్టి ధన్యులగుటకు మన ప్రయత్నము సహాయపడును. కావున శరీరమును అధర్మ సాధనముగ నుపయోగించి అధోగతి పాలగుటకంటె ధర్మసాధనముగనుపయోగించి ఆత్మసాక్షాత్కారమును పొందుటయే అభిలషణీయము.

వికాసమే జీవనము, సంకోచమే మరణము; సమస్త ప్రేమయు వికాసమే, సమస్త స్వార్థపరతయు సంకోచమే. కావున ప్రేమయే జీవననియమము, ప్రేమగలవాడే సజీవుడు. స్వార్థపరుడు మృతప్రాయుడు. కావున అవ్యాజముగా ప్రేమింపుము. అవ్యాజ ప్రేమయే జీవననియమము.

-స్వామి వివేకానంద

# మాతృదేవి చరణసన్నిధి

ఆంగ్ల గ్రంథము:
**ఎట్ ది హోలీమదర్స్ ఫీట్**

అనువాదము:
**పి. గణపతిశాస్త్రి**

అక్టోబరు – నవంబరు 1914.

మా బాలిగంజ్ గృహంలో పూలకే మాత్రము కొరత లేదు. పూలర్పిస్తే శారదా మాతకెంతయినా సంతోషం కలగగలదని నే నెరుగుదును. అందుకని చాలా పూలు సేకరించి పొద్దున్నే మాతృ సందర్శనానికి వెళ్లాను. ఆమె పూజ ప్రారంభించబోతున్నది. అందుచేత నే నర్పించిన పూలవైపు చూసి చాలా సంతోషించింది. నా పారిజాతాలకేసి చూసి, అమ్మ ఎంతో ఆనందంతో "ఎంత చక్కని పుష్పాలు తీసుకువచ్చావు! కార్తికమాసంలో పారిజాతాలతో పూజ చెయ్యాలి. ఈ సంవత్సరంలో ఠాకూరు పూజలో ఇంకా పారిజాతాలుపయోగించలేదు. ఎంత మంచిదానవు నీవు!" అని మనసారా అభినందించింది.

నేను పుష్పాలు కొన్ని వేరుగా ఉంచలేదు. అందుచేత మాతృదేవతకర్పించడానికి ఏమీ లేదని అనుకున్నాను. అయితే అమ్మ అన్ని గమనిస్తున్నదని చిట్టచివరికి నాకవగతమయింది. అమ్మ నే నర్పించిన పుష్పాలకన్నింటికి మంచిగంధం పూసింది. ముందుగా నే నా పని చెయ్యలేకపోయాను. అయితే అమ్మ ఆ కుసుమాలు కొన్ని జంగిడి పక్కనే ఒకచోట జాగ్రత్త చేసింది. అది నా కోసం చేసినపనే. అమ్మ పూజ ముగించి నన్ను పిలిచి "రా అమ్మా! ఆ జంగిడిపక్కనే కొన్ని పుష్పాలు నీ కోసం జాగ్రత్త చేశాను. అవి నా కోసం తీసుకురా!" అని ఆజ్ఞాపించింది.

అదే సమయంలో ఫలాలతో శిష్యుడొకడు ఆమె సందర్శనానికి వచ్చాడు. అతనిని చూసి అమ్మ ఎంతయినా సంతోషించింది. ఆమె అతని నుదుటిమీద మంచిగంధంతో బొట్టు పెట్టి, చిబుకం స్పృశించి ఆ చేయి ముద్దు పెట్టుకున్నది. ఒక శిష్యుని ఎడల అమ్మ అంతటి వాత్సల్యంతో ప్రవర్తించడం అంతకుమునుపెన్నడు నేను గమనించలేదు. ఆ పైన నాతో "నీ మాలలో కొన్ని అతని కియ్యి, తల్లీ!" అన్నది. ఆ శిష్యుడు నే నిచ్చిన పూలు దోసిలికట్టి ఎంతో భక్తి శ్రద్ధలతో అందుకున్నాడు. ఆ సమయంలో అతని శరీరం అంతా ప్రేముడితోను, భక్తితోను గజగజ వణుకుతున్నది. పట్టరాని ఆనందంతో అతడా పుష్పాలు మాతృదేవత పాదాలమీద సమర్పించాడు. శారదామాత ఠాకూరుకు నివేదించిన ఫలం స్వీకరించి తిరిగి వెళ్లిపోయాడు. అతడు రాంచీనించి వచ్చినట్టు ఆ తరవాత నాకు తెలిసింది. ఆ పైన అమ్మ తన మంచం మీద కూర్చుని "రా అమ్మా!" అంటూ నన్ను పిలిచింది.

ఆ తరవాత నేను శారదామాత గదిలోకి వెళ్లాను. ఆమె ఠాకూరునొక నవ వధువులాగ ఎంతో ఆప్యాయంగా "రండి! భోజనం చెయ్యండి! అని పిలిచింది. అటుపిమ్మట బాల గోపాలుని విగ్రహం దగ్గిరికి వెళ్లి అతనినికూడా "రా! గోపాలా! రా! భోజనం చెయ్యి!" అని ఆహ్వానించింది. నేను సరిగా అమ్మ వెనకాలే నిలుచున్నాను. ఆమె నా కేసి చూసి నవ్వి "నేను అందరిని భోజనానికి పిలుస్తున్నాను." అన్నది. అలాగంటూనే అమ్మ నైవేద్యాలర్పించవలసిన గదివైపు వెళ్లింది. శారదాదేవి ధోరణి గమనించి దేవతలందరు

ఆమెననుసరిస్తున్నారని నే ననుకున్నాను. పట్టరాని భావావేశంతో ఆమెవైపు చూస్తూ అలాగే నిలుచుండిపోయాను.

ఆయా దేవతలకందరికి నైవేద్యాలర్పించినపిదప బాగా దక్షిణంగా ఉన్న గదిలోనించి అమ్మ ఇవతలికి వచ్చి, ఆ ఫలహారాలు స్వీకరించడానికి దానికి పక్కనేఉన్న గదిలోకి వెళ్లింది. ఆ తరవాత ఆమె విశ్రమించడానికి నే నొక పరుపు అమర్చాను. శారదామాత విశ్రమించింది. నేను ఆమె పక్కనే కూర్చున్నాను. అప్పు డామె ఇలా గన్నది.

"నీవు ఇప్పుడే భోజనం చేశావుకదా! రవంతసేపు విశ్రమించు. నేను పడుకున్నాను. అమ్మకూడా నిద్ర కుపక్రమించింది. అంతలోనే బలరామబాబుగారి ఇంటిలోనించి పనిమనిషి ఒకడు, ఆపిల్ పళ్లబుట్టతో అక్కడికి వచ్చాడు. అతడాగంప తాకూరుగదిలో ఉంచాడు.

ఆపైన కిందికివెళ్లి ఆ బుట్ట ఏమి చెయ్యమన్నారని అక్కడఉన్న సన్యాసులనడిగాడు. వారు "ఆ గంపవల్ల లాభమేమిటి? వీధిలోకి విసిరివెయ్యి!" అన్నారు. ఆ నౌకరు ఆ గంప వీధిలోకి విసిరివేశాడు. అతడు అక్కడినించి వెళ్లిపోగానే అమ్మ నిద్రలేచింది వరాండాలోనికివెళ్లి వీధికేసి చూసింది. ఆ పైన నన్ను పిలిచి "చూడమ్మా, అది ఎంత సొగసయిన గంపో గమనించావా! వారు దానిని వీధిలోకి విసిరి వెయ్యవలిసిందని ఆ నౌకరుతో చెప్పారు. వారికి బొత్తిగా లక్ష్యంలేదు! వారు అనాసక్త పురుషులు! వారికి చిన్న చిన్న వస్తువులంటే బొత్తిగా లక్ష్యంలేదు. కాని ఒక చిన్న వస్తువయినా మనం వీధిలోకి విసిరివెయ్యలేము. అధమం దానిని మనం కూరలు తరిగినప్పుడు తొక్కలు వెయ్యడానికయినా వాడుకో వచ్చును."

అలాగన్న తరవాత ఆమె ఆ గంప తెప్పించి, శుభ్రంగా కడిగించి ఒక గదిలో జాగ్రత్త చేయించింది. అందువల్ల నా కొక గొప్ప గుణపాఠం నేర్చుకున్నట్టయింది. కాని ఎన్నాళ్లనించో జీర్ణించిన అలవాట్లు ఒక పట్టాన విడిచిపెట్టవు!

మరి కొంతసేపయిన తరవాత బిచ్చగాడు ఒకడు వచ్చి అన్నం పెట్టవలిసిందని అర్థించాడు. అతని కేకలు విన్న సన్యాసులు కోపగించుకుని ఆ బిచ్చగాణ్ణి "పో! పో! మాకిప్పుడు ఇబ్బంది కలిగించవద్దు!" అని గట్టిగా కసురుకున్నారు. శారదామాత ఆ గొడవ విని ఇలా గన్నది.

"అదిగో చూశావా, వారి ధోరణి! ఆ ముష్టివాడికి కాస్త బిచ్చం పెట్టడానికి తాము చేస్తున్నపని మధ్యలో ఆపివెయ్యాలని వారు అతణ్ణి పంపించివేశారు. ఈ మాత్రం చిన్న పనికూడా వారు చెయ్యలేక పోయారు. ఎంతటి బద్ధకం మనుషులు! బిచ్చగాడికి కాస్త పిడికెడు ముష్టికూడా వెయ్యలేక పోయారు. వాడికి న్యాయంగా రావలిసినది ముట్టజెప్పకుండా పంపించివెయ్యటం న్యాయమేనా? ఈ కూరలు తరిగిన పెచ్చులు చూశావా? ఇది ఆవుకివ్వవలిసిన ఆహారము. ఇది ఆవుముందు వెయ్యాలి."

శారదాదేవికి దగ్గిరలో ఉండాలన్న అభిప్రాయంతో మేమంతా బాగ్‌బజారులో వేరొక ఇంటికి మారాము. ఇందుచేత ప్రతి సాయంకాలము నేను అమ్మ సందర్శనంకోసం వెడుతూండేదాన్ని. అమ్మ నివాసగృహంవద్ద ఈ వేళ సంకీర్తన జరుగుతుంది. కాళికామాత స్తోత్రం రూపంలో బేలూరుమఠం సన్యాసులు కొందరు ఈ వేళ సంకీర్తన జరుపుతారు. సాయంత్రం ఎనిమిదిన్నర తరవాత సంకీర్తన

ప్రారంభమయింది. నే నిటువంటి పాటలు కొన్ని ఇంతకుముందు విన్నాను. కాని పుణ్యమూర్తులయిన ఈ సన్యాసులగొంతులనుండి వెలువడిన పాటలలో ప్రత్యేకశక్తితోబాటు భావావేశం చక్కగా మూర్తీభవించింది. నా కళ్ళమ్మట కన్నీటిబిందువులు ప్రవహించాయి. వారు అప్పుడప్పుడు ఠాకూరు పాడుతూండే పాటలు కొన్ని పాడారు. దానిమీద శారదామాత ఎంతో ఆత్రతతో అన్నది.

"ఇదిగో, ఇది వినండి. ఠాకూరు అప్పుడప్పుడు ఇది పాడుతూండేవారు.'

వారు ప్రత్యేకించి ఇంకొకపాట అందుకోగానే శారదాదేవి మరి నిగ్రహించుకోలేకపోయింది. ఇక పవ్వళించి ఉండలేక లేచి కూర్చుంది. అమ్మకళ్ళలో బాష్పబిందువులు కొన్ని తరళించాయి. ఆమె లేచినిలిచి "మనం వరాండాలోకి వెడదాం రండి. అక్కడినుంచి విందాము" అన్నది. పాటలు పాడడం పూర్తి కాగానే నేను మాతృదేవత పాదధూళి స్వీకరించి ఇంటికి తిరిగి వచ్చివేశాను.

—సశేషము.

## ప్రతీక్ష (కథానిక)

హిందీ మూలం :

శ్రీ క్రాంతిద్వివేది

స్వేచ్ఛానువాదం :

సూరంపూడి విశ్వేశ్వరరావు

హృదయాలలోని ప్రత్యణువునూ కదిలించే రోదనధ్వనుల మధ్యన నిలబడిన నలిన్ ఏదో ఆలోచిస్తున్నాడు. అతను ఏడేండ్ల పసివాడు. వాళ్ళనాన్న దీర్ఘకాలం వ్యాధిపీడితుడయి మరణించాడు. దుఃఖవిహ్వలయయిన తల్లిని యిద్దరు చెల్లెళ్ళను పోషించే భారం ఇక తనమీదే ఉన్నట్టు అతనికి తెలిసింది. పదిహేనురోజులకు పూర్వము పుస్తకాలన్నీ లేవని; గుడ్డలు చిరిగిపోయాయని జీతం కట్టలేదని తన్ను విద్యాలయంనుంచి పంపించివేశారు. ఇక బడికిపోయే యోగం లేదని అతనికి తెలిసిపోయింది. ఇప్పుడు, ఆ బాలునికి ముందుమార్గం అగమ్యంగా అనూహ్యంగా ఉంది.

ఇరుగుపొరుగల దయాధర్మాలతో కొన్నిరోజులు గడిచాయి. దుఃఖమూర్తియయిన అమ్మ, యే పనియైనా దొరుకుతుందనే ఆశతో ప్రయత్నాలు చేసి విఫల అయింది. చివరకు నలిన్‌కు భిక్షాపాత్ర ఆధారమయింది.

ఉన్నతము విశాలము అయిన ఫాలభాగము, తెల్లని కేశజాలము, గడ్డముగల, కాషాయవస్త్రాలను ధరించిన ఒక సన్యాసి యాచనచేసే యీ బాలుని పద్ధతిని గమనించాడు. ఈ బాలుడు అక్కడక్కడ దొరికిన వార్తాపత్రికలలోని ముక్కలను తీసి చదవడం చూశాడు. పదిహేను దినములు యీ విధంగా గమనించిన తర్వాత అతను యిక ఉండలేకపోయాడు. సన్యాసి బాలుని సమీపించి అడిగాడు.– "బాబూ! నీకు భిక్షకావాలా! చదువు కావాలా?" ఈ ప్రశ్నకు ఏంజవాబుచెప్పాలో బాలునికి తోచలేదు. సన్న్యాసి మళ్ళీ అడిగాడు.– "బాబూ! నువ్వు విద్యాలయంలో చదవాలనుకుంటున్నావుగదూ?"

అవునన్నట్లు నలిన్ శిరస్సుతో సంకేతం చేశాడు.

"అయితే నన్ను మీ అమ్మగారి వద్దకు తీసుకునడు."

సన్యాసిని నలిన్ తన యింటికి నడిపించుకు వచ్చాడు. సన్యాసి పరిస్థితిని అర్థంచేసుకున్నాడు. నలిన్ చదువుకు సహాయం చేస్తానన్నాడు. అతని చదువు పూర్తిఅయేదాక, వాళ్ళకుటుంబ పోషణకు సరిపోయే, ఆర్థిక సహాయం కూడ చేస్తానని చెప్పి వాళ్ళను ఒప్పించాడు.

నలిన్ మళ్లీ విద్యాలయానికి పోతున్నాడు. ఆ సంన్యాసి ప్రతినెల అవసరమయిన ఆర్థిక సహాయాన్ని అందచేస్తున్నారు. తీక్ష్ణమైనబుద్ధి, కఠోరసాధన ఫలితంగా నలిన్ ప్రతి తరగతిలో ప్రథముడుగా ఉత్తీర్ణుడవుతూ వచ్చాడు. అప్పుడప్పుడూ బాబా డబ్బు ఇవ్వడానికి అతణ్ణి తన కుటీరానికి పిలచేవారు. కంబళీ కమండలము రెండుమూడు పాత్రలు-ఇవే ఆయనకున్న యావత్తు సంపద. చిన్నవాడైన నలిన్ మనస్సులో యీాయనకు రూపాయలు ఎక్కడ నుంచి వస్తున్నట్టు అనే ప్రశ్న కలిగేది. కాని బాబాను ఎప్పుడూ అడగలేక పోయేవాడు. పెద్దవాడినైన తర్వాత నౌకరీ వచ్చిన తర్వాత బాబా యిచ్చిన ప్రతీపైసా చెల్లిస్తాననుకునేవాడు.

నలిన్ బి.ఏ. పరీక్షలో ఉత్తీర్ణుడయే వరకు యిలాగే జరిగింది. అవసరాలు పెరిగినకొద్ది బాబా కూడా డబ్బు యెక్కువగానే యిచ్చేవారు. నలిన్ ఐ. ఏ. యస్. పరీక్షలో తీసుకోబడ్డాడు. శిక్షకు మంసూరీ వెళ్ళేముందు బాబాకు కనిపించాడు. బాబా పాదములవద్ద నలిన్ వందరూపాయలుంచాడు. శిక్షణ అయిన తర్వాత యిమ్మనమని బాబా యిచ్చివేశారు.

రెండు సంవత్సరములు పూర్తి అయిన తర్వాత నలిన్ బాబా దర్శనానికి పోయాడు. కాని కుటీరం శూన్యంగా ఉంది. బాబా ఎక్కడకు వెళ్ళినదీ ఎవ్వరికీ తెలియదన్నారు. ఆయన్ను తన శాయశక్తులా వెదకాడు. లాభం లేకపోయింది.

ఎనిమిది సంవత్సరముల తర్వాత నలిన్ ఢిల్లీ కేంద్రసచివాలయంలో నియుక్తుడయ్యాడు. ఒకరోజున అతను కారిడోర్‌లో నిలబడియుండగా సాధుబాబా దర్శనం అయింది. అదే భవ్యరూపం. మార్పేమీలేదు. గడ్డం మాత్రం పొడగయింది. నలిన్ అక్కడే వారి పాదాలను చుట్టివేశాడు– "బాబా! మా ఇంటికి దయచేయండి. నాకు సేవచేసే అదృష్టాన్ని ప్రసాదించండి."

"బాబూ! చిరునామా వివరంగా యిచ్చి వెళ్ళు. వీలున్నప్పుడు వస్తాను. నువ్వు కులాసాగా ఉన్నావుకదా."

"ఉన్నాను స్వామీ! మీ దయవల్ల అన్నీ లభించాయి. సేవించే భాగ్యం కలిగించమని వేడుకుంటున్నాను."

"చెల్లెళ్ళ వివాహాలు అయాయా?"

"ఇంకా లేదండి"

అటుతరువాత ఆయన మళ్ళీ కనిపించలేదు. నలిన్ నేటివరకు ఆయనకోసం నిరీక్షిస్తునే ఉన్నాడు. బాబా చరణధూళితో తన యిల్లు పావనం కావాలని అతని తీవ్ర ఆకాంక్ష.

('కల్యాణ్' సౌజన్యంతో)

నాటి వల్లకాడు గొల్లపాలెం
నేటి రమణీయ గ్రామం రామకృష్ణపురం

# రామకృష్ణ మిషన్ వారి ప్రశంసనీయమైన కృషి ఫలితం

మండలి వెంకట కృష్ణారావు

దివిసీమలో రామకృష్ణమిషన్ చేపట్టిన నిర్మాణ కార్యక్రమవిషయం మీకు తెలిసినదే. వేయిఇండ్ల నిర్మాణం దాదాపు పూర్తికావస్తుంది. ఇక రెండు మూడు గ్రామాలే బాకీవున్నాయి. అక్కడ కూడ పని మంచి వేగంతో సాగుచున్నది. ఒకటి రెండు నెలల్లో ఈ కార్యక్రమం సమాప్తినందవచ్చును.

రామకృష్ణమిషన్ అధినేతలు, అరవైలక్షల రూపాయల వ్యయంతో కూడిన ఈ పెద్ద పనిని నిర్వహించే బాధ్యతను స్వామి ప్రమథానందజీ (ప్రీతిమహారాజ్)కి అప్పగించారు. ఈ ప్రీతిమహారాజ్ ఇటువంటి నిర్మాణ కార్యక్రమాల్లో అసాధారణమైన అనుభవాన్ని గడించినవారు. ఈయన అధ్వర్యంలో ఒకటి వెనుక ఒకటి గ్రామంగా మొత్తంపని ఇప్పుడు పూర్తికావస్తున్నది. గొల్లపాలెం (రామకృష్ణపురం) గ్రామం, ప్రధాన మంత్రిచే ప్రారంభోత్సవం చేయబడిన సంగతి మీకు విదితమే. ఫిబ్రవరి 9 వ తేదిన ద్వారక, ఇరాలి (వివేకానందపురం) అనే రెండు గ్రామాలను, రామకృష్ణమిషన్ కార్యదర్శి శ్రీమత్ స్వామి గంభీరానందజీ మహరాజ్ చే ప్రారంభోత్సవం చేయబడింది. ఎన్. టి. ఆర్—ఏ. ఎన్. ఆర్ బృందంవారు; 'ఈనాడు' పత్రిక వారు; రాష్ట్ర ప్రభుత్వంవారు; తదితరులు; అందజేసిన నిధులతో ఈ రెండు గ్రామాల నిర్మాణం జరిగింది.

ఈ రెండు గ్రామాల ప్రారంభోత్సవానికి కృష్ణాజిల్లా కలెక్టరుగారు అధ్యక్షత వహించారు. దివిసీమ ఎమ్. ఎల్. ఏ. శ్రీ మండలి వెంకటకృష్ణారావు, రామకృష్ణ మిషన్ సహాయకార్యదర్శి శ్రీమత్ స్వామి ఆత్మస్థానందజీ మహారాజ్ కూడ ప్రసంగించారు.

ఈ ప్రారంభోత్సవాన్ని చూడడానికి మా రామకృష్ణప్రభ సహాయ సంపాదకుడు వెళ్ళడం జరిగింది. రామకృష్ణ మిషన్ యొక్క సుహృత్ మండలిలో ఒకరైన శ్రీమండలి కృష్ణారావుగారిని, దివిసీమ నిర్మాణ కార్యక్రమాల విషయమై ఒక రచనను రామకృష్ణప్రభకు పంపవలసిందిగా అక్కడ అభ్యర్థించడం జరిగింది. ఆయన వెంటనే అంగీకరించారు. ఎంతో కార్యభార నిమగ్నులై ఉన్నాకూడ ఆ అభ్యర్థనను జ్ఞప్తియందుంచుకొని తరువాత కొన్నాళ్ళకే ఒక రచనను రామకృష్ణప్రభకు పంపించారు. ఆయనకు ధన్యవాదాలను తెలుపుకొంటూ ఆ రచనను రామకృష్ణప్రభ పాఠకులైన మీకు అందించుచున్నాము.

---

"ఏం బాబూ! నేను వచ్చిపోతేగాని
మా వూరుకు కంకరరోడ్డు వేయించవా!
బస్సు ఎక్కి మావూరు వెళ్ళే గతి లేదా!
బురదలో నడవలేక వచ్చి వెడి వచ్చాను."

అన్నాడు 65సంవత్సరాల ముదుసలి శ్రీ అద్దంకి భూమయ్య. ఈనాటికి నా చెవుల్లో ఆ మాటలు గింగురుమంటూ వున్నాయి. 1977 అక్టోబరులో అవనిగడ్డ గాంధీక్షేత్రంలో జరిగిన ఆంధ్ర ప్రదేశ్ నిర్మాణ కార్యకర్తల సమ్మేళనంలో పల్గొంటానికి, సేవాశ్రమం ప్రారంభోత్సవానికి వచ్చిన గాంధీగారి కోడలు శ్రీమతి నిర్మలా గాంధీని, మనుమడు శ్రీ కనూగాంధీని చూడటానికి వచ్చి, వారిని దర్శించిన తరువాత నా దగ్గరకు వచ్చి గొల్లపాలెం సర్పంచ్ శ్రీ అద్దంకి భూమయ్య అన్న మాటలు అవి. భూమయ్య వెనుకబడిన జాతులకు చెందిన గాడ కులస్థుడు. నిశానిదారు అయినా నిఖార్సు అయిన మనిషి. బక్కచిక్కి చాలా అమాయకుడుగ కనపడినా నిండు హృదయము కలిగిన నిర్మొగమాటి. ఎన్నో తగాదాలు తీర్చిన సిసలైన మనస్వి. చల్లపల్లి రాజాగారికి శ్రీ భూమయ్య అంటే ఎంతో ఇష్టం. నిజాయితీకి నిలబడే నిలకడ గల మనిషి. నన్ను కలిసిన నలభైరోజులకు నవంబరు 19వ తేదీన తుఫానలో ఇంటింటికి తిరిగి అందరిని జాగ్రత్తగా

ఉండమని చెప్పి ఇల్లు చేరాడు. ఉప్పెన వచ్చింది. మా కార్యకర్త కడలిలో కలిసిపోయాడు.

గొల్లపాలెం సముద్రతీరానికి మూడు కిలో మీటర్ల దూరం ఉంటుంది. పల్లె గ్రామాలకు రక్షణగ శ్రీ నీలం సంజీవరెడ్డిగారు ముఖ్యమంత్రిగా ఉన్నప్పుడు 1956లో నిర్మించిన సముద్రపు కట్ట పూర్తిగా కొట్టుకొనిపోయింది. గొల్లపాలెం సూటిగా సముద్రం పెద్ద గుణ్ణం వేసింది. ఆ సూటిగా వున్న పాత ఉపకాలి, గొల్లపాలెం, చింతకోళ్ల, మందపాకల పూర్తిగా తుడిచిపెట్టి అద్దంకి వారి దిబ్బను పల్లంచేసి, మందపాకల సెంట్రల్ ఛానల్ కోడూరు–నాగాయ లంకరోడ్లను గుణ్ణాలు పెట్టి గ్రామాలకు గ్రామాలే తుడిచి 10మైళ్ళ దూరాన జయపురం దగ్గర కోడూరు–అవనిగడ్డ రోడ్డుకు ఇండ్లను, శవాలను, కళేబరాలను చేర వేశాయి సముద్రపు కెరటాలు. ఎంత భయంకరమైన ఉప్పెనో 20 అడుగుల ఎత్తున 100 మైళ్ళ వేగంతో వచ్చిన వాగలకు ఏమి ఆగుతాయి? ఎవరు బ్రతుకుతారు? ఎవరి త్రోవ వారిది! ఏది దొరికితే దానిని పట్టుకొని బ్రతకటానికి ప్రయత్నించారు. కర్ర అనుకొని పామును పట్టుకొన్నారు. ఉవ్వెత్తున కెరటాల మీద మైళ్ళకొలది పయనించి బ్రతుకు జీవుడా అని బయటపడ్డారు. కొందరు చెట్లను, కొందరు ఇండ్లకప్పులను పట్టుకొని ప్రాణాలు నిలబెట్టుకొన్నారు. ఎక్కడ చూచినా శవాలే! సముద్ర తీరంలో చేలవెంట, గట్లవెంట ఎచటబడితే అచట శవాలతో, కళేబరాలతో మరుభూమిగ మారిపోయింది దివిసీమ! కడసారి భూమయ్య శవాన్ని అయినా చూద్దామని బ్రతికి బయట పడిన గ్రామస్థులు వేయి కండ్లతో వెదికారు. ఎక్కడ కనబడతాడు? ఎలా గుర్తుపడతారు? ఏ శవసేన కార్యకర్తలచేతులతో, పోలీసుల చేతులలతో, సింగరేణి కాలరీస్ వారిచేతులలతో భూగర్భంలో కలిసిపోయాడో? ధన్యోస్మి, మా భూమయ్య మంచిపేరుతో చివరి దాక ప్రజా సేవ చేస్తూ తన ప్రజలతో కలిసి ఉప్పెనకు ఆహుతి అయినాడు. మూడు పర్యాయాలు పంచాయతీ ప్రెసిడెంటుగా వున్న భూమయ్య ఆ పంచాయతీలో మెజారిటి ప్రజల వెంట వెళ్ళాడా అనిపించింది.

సముద్రతీరంలో పశువులను కాచుకుంటూ జీవించే గొల్లల (యాదవులుకు) నిలయం గొల్లపాలెం. వారితోపాటు గౌడులు, ముదిరాజులు, హరిజనులు ఉన్నారు. గొల్లపాలెం పంచాయతీలో ఇరాలి, ద్వారక, ఈటగుణ్ణం, బస్వానిపాలెం, శ్రీరామపురం శివార్లు ఉన్నాయి. 10 చదరపు కిలోమీటర్ల వైశాల్యం కలిగిన విశాల ప్రాంతము. పార్లమెంటు సభ్యుడుగా ఉన్నప్పుడు వ్యవసాయానికి కాలువలు త్రవ్వించి, సమితి ప్రెసిడెంటుగ ఉన్నప్పుడు మట్టిరోడ్డు వేయించి, ఆ ప్రాంత అభివృద్ధికి కృషిచేశాము. సముద్రానికి కట్టవేసి, కట్టవరకు వ్యవసాయం చేస్తున్నారు. పచ్చని పైర్లతో నందనవనంగా తయారయింది. సముద్రానికి కన్నెర్ర అయిందా అన్నట్టు సముద్రపు పొంగులు వచ్చాయి. సర్వనాశనం అయింది.

21వ తేదీ హెలికాప్టరులో శ్రీ వెంగళరావుగారితో ఆ ప్రాంతాన్ని పరిశీలించాము. సముద్రంలో తాడిచెట్లు కనబడుతున్నట్లు జలమయంగా ఉంది. గుర్తుపట్టలేక పోయాము. నడచి వెళ్ళటానికి రహదార్లు లేవు. వారంరోజుల తరువాత హెలికాప్టరులో గొల్లపాలెంలో దిగాను. అప్పటికి ఇంకా శవాలను ఖననం చేస్తున్నారు. శ్రీరాముడు వారధి కట్టినందుకు ఆ పూర్వపు కోపం సముద్రానికి ఉన్నట్లుగా, కొత్తగ కట్టిన ఆర్. సి. సి. రామాలయాన్ని సముద్రుడు నేలమట్టం చేశాడు. స్లాబ్ ముక్కలు ముక్కలు అయిపోయింది,

పాఠశాల భవనం మాత్రం మిగిలింది. శ్రీ భూమయ్య ఇల్లు పూర్తిగ కొట్టుకుపోయింది. ఆ స్థలం మీద నిలబడి శ్రద్ధాంజలిఘటించాను.

గొల్లపాలెం పంచాయతి జనాభా శివార్లతో కలిపి 4162 మంది ; చనిపోయినవారు 1901. మూడు నాలుగు వందల మంది ఇతర ప్రాంతాలకు కోతలకు వెళ్లటంచేత బతికి బయటపడ్డారు. ఆ రోజు ఊళ్లో ఉన్న జనాభాలో అధిక సంఖ్యాకులు మరణించారు. ఒక్క గొల్లపాలెం జనాభా 1181. చనిపోయినవారు 432. బ్రతికి ఉన్నవారంతా కోడూరు, అవనిగడ్డ చేరారు. ప్రభుత్వం భోజన ఏర్పాట్లు చేసి ఆదుకుంది.

సేవకు ప్రతీకగా నిలబడిన రామకృష్ణ మిషన్ వారు రాజమండ్రి నుండి వచ్చి అవనిగడ్డలో నన్ను కలిసి కోడూరు వెళ్ళారు. స్వామి బోధస్వరూపానంద ఆధ్వర్యం వహించారు. కోడూరులో ప్రాథమిక ఆరోగ్య కేంద్రం వద్ద శిబిరం ఏర్పాటు చేశారు. ప్రభుత్వం బియ్యం ఇస్తుంటే రామకృష్ణమిషన్ వారు పప్పు, నూనె దినుసులు, కాయగూరలు పంపిణీ చేశారు. ప్రభుత్వం వెయ్యి బల్లీలు, 23 వేల గెడలు, లక్షాముప్పదివేల తాటాకు యిచ్చారు. వాటితో తాత్కాలికంగా గుడిసెలు వేసుకున్నారు. రామకృష్ణమిషన్ వారు ఎన్నో కష్టాలకు గురి అయి ఆ గ్రామాల వెంట తిరిగి అనేక విధాల వారికి సేవ చేశారు. దుప్పట్లు, బట్టలు, వంటసామగ్రి పంచిపెట్టారు. ఆరోగ్య శాఖ వ్యాధినిరోధకచర్యలు తీసుకొన్నది. శ్రీ జలగం వెంగళరావు, ప్రపంచ ప్రఖ్యాత ఎవంజిలిస్ట్ శ్రీ బిల్లిగ్రహం, ప్రతిపక్ష నాయకులు శ్రీ వై. బి. చవాన్ ఆగ్రామంలో హెలికాప్టరులో దిగి ప్రజలను పరామర్శించారు. ప్రభుత్వంవారు చనిపోయినవారికి రూ. 2,29,400; ఇండ్లకు రూ. 24,350, వంటపాత్రలకు రూ. 11,450; బియ్యం 115 క్వింటాలు, గోధుమలు 87 క్వింటాలు పంచిపెట్టారు. ఎడ్లు, ఆవులు, గేదెలు, దున్నలు, వ్యవసాయ పనిముట్లు ఇచ్చారు.

సహాయ కార్యక్రమాలలో నిర్విరామంగా పాల్గొన్న రామకృష్ణమిషన్ శాశ్వతమైన ఇండ్ల నిర్మాణ కార్యక్రమాన్ని చేపట్టాలని నిర్ణయించుకొన్నారు. ఇండ్ల డిజైన్ తయారు చేయుటంలో, ప్రభుత్వంవద్ద మాచింగ్ గ్రాంటు సంపాదించడంలో, వివిధ సంస్థలనుండి డబ్బు సేకరించటంలో స్వామి బోధస్వరూపానంద విశేష కృషి చేశారు. 1978 జనవరి 2న ఈ గ్రామానికి స్వామి రంగనాథానందజీ శంకుస్థాపన చేశారు. ఆ ఉత్సవానికి అధ్యక్షత వహించే భాగ్యం నాకు కలిగింది. గొల్లపాలెంను బుల్‌డోజర్లతో సదాటు చేయించి, రోడ్లు, మురుగు పారుదల వసతులతో చక్కటి ప్లాను తయారు చేయించి 229 ఇండ్లు కట్టారు. సమశీతోష్ణత కలిగి ఉండేటట్లు, తుఫాను, ఉప్పెన తాకిడికి తట్టుకొనేటట్లు ఇళ్లు పటిష్ఠంగా నిర్మించబడినాయి. ప్రతి ఇంట్లో రెండు గదులు; వైశాల్యము 200 చ॥ అ॥ దాకా వుంటుంది. కోడూరు నుండి గొల్లపాలెం దాకా కంకర రోడ్డు పంచాయతీ రాజ్య ఇంజనీర్లు చాలా కష్టపడి నిర్మాణం చేస్తున్నారు. గ్రామంలో రోడ్లు పూర్తి అయినాయి. హంసలదీవి–గుల్లలమోద కోస్తా రోడ్డు శాంక్షన్ అయింది.

మా భూమయ్య మాట నిజం అయింది. బ్రతికి సాధించాడు–చచ్చి సాధించాడు.

నాటి వల్లకాడు గొల్లపాలెం
నేటి రమణీయగ్రామంరామకృష్ణపురం.

భారత ప్రధాని వచ్చి ప్రారంభోత్సవం చేశారు. భూమయ్య బ్రతికి ఉంటే ఎంత బ్రహ్మానందాన్ని పొందేవాడో!

# సూతసంహిత

ఏలూరిపాటి అనంతరామయ్య

## :పదకొండవ అధ్యాయం:

### : హిరణ్యగర్భాది విశేష సృష్టి కథనం :

నైమిశీయులు "భగవానుడా, భగవానుడు, బ్రహ్మ, ప్రభువు ఇలా స్థావరజంగమాలను సృష్టించి తరువాత ఏమి చేశాడో వెంటనే చెప్పు" అని అడిగారు 1.

సూతుడు చెప్పాడు :

సంసారకారణమైన తమస్సు చుట్టుముట్టి ఉండగా, సృష్టింపబడినవాటి అభివృద్ధికోసం ఆ తమోరూపం విడిచిపెట్టి 2, అతడు హిరణ్యగర్భుడు అనే పేరుగల బ్రహ్మరూపం ధరించాడు. హిరణ్యగర్భునిగూర్చీ, ఇతరములను గురించీ చెపుతాను సువ్రతులారా 3.

ద్విజులారా, శబ్దస్పర్శాది పంచ (సూక్ష్మ) భూతాలు జన్మించాక, వాట్లయందు సమష్టి ఇంద్రియాల జ్ఞానశక్తులు సత్త్వగుణంవల్ల జన్మించాయి4. అలాగే, ద్విజులారా, శబ్దస్పర్శాది (సూక్ష్మ) భూతాలయందు రజోగుణంవల్ల సమష్టి ఇంద్రియాలక్రియాశక్తులు జన్మించాయి5.

భూతాలలోఉన్న జ్ఞానశక్తులు అయిదు కలిసి అన్నింటిసమష్టిమానసేంద్రియం ఏర్పడుచున్నది 6. ఆ మనస్సునందున్న భగవానుడు త్రిమూర్తులలోనిబ్రహ్మ హిరణ్యగర్భుడని సూక్ష్మదర్శులైన మునులు చెప్పారు ద్విజోత్తములారా 7. అలాగే వేదవిదుత్తములారా, క్రియాశక్తులు కలిసి శివాజ్ఞవల్ల ప్రాణముల సమష్టిప్రాణం ఏర్పడుతున్నది 8. ఆ ప్రాణమందున్న విష్ణుభగవానుడు సూత్రాత్మ అని కీర్తింపబడినాడు. ఇద్దరిలోనూ సాక్షాత్తుగా ఉంటాడు త్రిమూర్తులలోని మహేశ్వరుడు 9. వేదవేత్తలలో ఉత్తములారా, వేదాలలో అంతర్యామి అని కీర్తితుడైనాడు. హిరణ్యగర్భరూపం పొందినవాడని వేదాలలో నిశ్చితుడైన10 భగవానుడు ఆ బ్రహ్మ మళ్ళీ తనశరీరం మాయతోనే రెండుగా చేసి, మునిశ్రేష్ఠులారా, సగంభాగంతో పురుషుడైనాడు 11. సగంభాగంతో నారి (అయినాడు.) ప్రభువు ఆమెయందు విరాట్టును సృష్టించాడు. భగవానుడు లోకనాయకుడు, మళ్ళీ అలాగే స్వరాట్టు అనే అతనినీ సమ్రాట్టు అనే అతనినీ సృష్టించాడు విప్రులారా.

విప్రేంద్రులారా, వారు ముగ్గురినీ ఆ బ్రహ్మండం ఆవరించింది12, 13. ప్రాధాన్యంచేత విరాట్టు బ్రహ్మండాభిమాని అయాడు. స్వరాట్టు సమష్టి లింగస్వరూప (శరీర) అభిమాని అయ్యాడు. సామ్రాట్టు రెండింటిఅభిమానీ అయాడని శ్రుతి చెప్పినది 14.

విప్రులారా,ఆస్తికులారా, విరాట్టు స్వాయంభువమనువునూ, శతరూప అనేనారినీ సృష్టించాడు. ఆమె యోగిని, తపస్విని15. ఆ చక్కని చుక్కను ఆ మనువు స్వీకరించాడు. ఆమెకు అతనివల్ల జన్మించారు ప్రియవ్రతుడు (ప్రియవ్రతుడు) అని ప్రసిద్ధికెక్కిన అతడూ 16, ఉత్తానపాదుడూ ఇంకా ఇద్దరు కుమార్తెలూ. ద్విజులారా, ఉత్తానపాదుని తరవాత పుట్టిన కన్యను (ప్రసూతిని) దక్షప్రజాపతికీ 17. పరిశుద్ధురాలయిన ఆకూతిని మానస (రుచి) ప్రజాపతికీ ఇచ్చాడు. (స్వాయంభువమనువు) మానస

8. ప్రాణం=ప్రాణము, అపానము, వ్యానము, ఉదానము, సమానము అను ఐదు వృత్తులుగల ప్రాణము,

ప్రజాపతికి ఆకూతివల్ల యజ్ఞుడూ దక్షిణా కలిగారు విప్రులారా 18. ఆస్తికులారా, యజ్ఞునికి పన్నెండుగురు కుమారులు మునులు కలిగారు.

దక్షునికి ఇరవైనలుగురు కూతుళ్లు జన్మించారు 19. దక్షుడు శ్రద్ధ మొదలైన పదముగ్గురు కన్యకలను ధర్మునికిచ్చాడు. అలాగే శ్రద్ధ మొదలైన పదిమంది కన్యకలు సంపన్నులైనారు 20. విప్రులారా, వారుగాక ఖ్యాతి మొదలైన పదకొండుగురు కన్యకలూ (తగిన భర్తలను పొంది) సంతానవతులైనారు.

ద్విజోత్తములారా, ఈ ప్రకారం ప్రాణులకు కర్మానుగుణంగా అంబికాపతి ఆజ్ఞవల్ల లెక్కపెట్టలేనంతమంది ఎందరో జన్మించారు 21. స్వభావంవల్లనే సమస్తమూ కలిగినదని కొందరంటారు. విప్రోత్తములారా అది పొసగదు, దేశకాలాదులఅవసరం ఉన్నది కనుక 22. కర్మవల్లనే సమస్తమూ ఉద్భవించినదని (మరి) కొందరంటారు. శ్రుతిస్మృతులు చెప్పేదానికి విరుద్ధం మునిపుంగవులారా 23.

పూర్వం హిమాలయంప్రక్క వ్యాసముని, సుమంతుడు, జైమిని, వైశంపాయనుడు 24. పైలుడు, కపిలుడు, పతంజలి, విప్రులారా, అక్షపాదుడు, కణాదుడు, ముని అంగిరసుడు 25, ముకుందుడు, మోచకుడు, మహామతి, మహాకాలుడు, కాలరూపుడు, కలామాలి, కామరూపుడు, కపిధ్వజుడు 26 వేదజ్ఞుడు, వైదికుడు, విద్వాంసుడు, విద్వేషి, వేణువాహనుడు, శాల్వాలుడు, లకులుడు, వహ్ని, త్రిజదండుడు, పరంతపుడు 27, పాపనాశుడు, పవిత్రుడు వీరూ ఇతర మహార్షులూ తమలో తాము శ్రద్ధతో ఆలోచించి పరమర్షులారా 28, మనస్సులు సంశయగ్రస్తములు కాగా మహోత్తరమైన తపస్సు చేశారు.

ఈలోపల కరుణానిధి రుద్రుడు ప్రసన్నుడై 29, వారిఎదుట స్వయంగా ఆవిర్భవించాడు పరమేశ్వరుడు. అతనిని చూచి మునులందరూ ఇంద్రియాలూ బుద్ధులూ కలక దేరగా 30 పరమభక్తితో నమస్కరించారు. అందరూ అంజలిపుటాలు ఘటించి భగవానుని, త్రిలోచనుని, పరమేశ్వరునిఅడిగారు (సందేహం తీర్చమని) 31.

దేవదేవుడు, మహాదేవుడు, సర్వజ్ఞుడు. కరుణానిధి, కపర్ది, నీలకంఠుడు, కాలకాలుడు, మహేశ్వరుడు 32 సోమార్ధశేఖరుడు, సోముడు, సోమసూర్యాగ్నిలోచనుడు మునులసంశయం పోగొట్టే మధురవాక్యం పలికాడు: 33. "మునీశ్వరులారా, జగత్సృష్టిస్థితిసంహారాలు స్వభా

---

19. యజ్ఞునికి=యజ్ఞునిభార్య దక్షిణ. కనుక దక్షిణయందు అన్నమాట.

20, 21. శ్రద్ధ మొదలైన=వారిపేర్లు. శ్రద్ధ, లక్ష్మి, ధృతి. తుష్టి. పుష్టి, మేధ, క్రియ, బుద్ధి, లజ్జ, వపువు, శాంతి. సిద్ధి, కీర్తి.

ఖ్యాతి మొదలైన=వారివీ వారి భర్తలవీ పేర్లు: ఖ్యాతి_భృగుడు, సతి_భవుడు, సంభూతి_మరీచి, స్మృతి_అంగిరసుడు, ప్రీతి_పులస్త్యుడు, క్షమ_పులహుడు, సన్నతి_క్రతువు, అనసూయ_అత్రి, ఊర్జ_వసిష్ఠుడు, స్వాహా_అగ్ని, స్వధ_పితరులు_విష్ణుపరాణం. అ. 7; శ్లో. 23_27.

22. స్వభావంవల్లనే=ఇది లోకాయమితిమతం. దేశకాలాదుల అవసరం=కాశ్మీరదేశంలో కుంకుమ పండుతుందని దేశాపేక్ష. పగలు పద్మాలూ రాత్రులు కలువలూ వికసిస్తవని కాలాపేక్ష. ఆదులు అన్నందున పుణ్యాత్ములకే సుఖం, పాపాత్ములకే దుఃఖం అని అదృష్టాపేక్ష, కర్మవల్లనే=ఇలా అనేవారు అనీశ్వరవాదులు__అను అర్థోజ్ఞాపికలవ మూలం తాత్పర్యదీపిక_అన్య.

వంచేత గాని, కేవలం నాచేత గాని, కేవలం కర్మచేత గాని కావు34. మునిసత్తములారా, ద్విజులారా, ప్రాణుల కర్మపరిపాకంచేతనూ, నాచేతనూ జగత్తుయొక్క సృష్టిస్థితినాశమూ సంభవిస్తాయి35. ఈ విధంగా జగత్తుయొక్క జన్మాదులు కర్మానుగుణంగా నాచేత కావటం ఇది స్వభావమని వేదార్థనిర్ణయం విప్రోత్తములారా''36, అని పలికి సర్వజ్ఞుడు కరుణానిధి మహాదేవుడు మునిశ్రేష్ఠులను అనుగ్రహించి అక్కడే అంతర్ధానమైనాడు37.

వేదవిత్తములారా, విప్రులారా, మునులూ తమలో తాము మాటాడుకొని చాలా సంతోషపడి వెళ్లారు38.

మునిశ్రేష్ఠులారా, మీరుకూడా ఈశానుడు సదా ప్రాణి కర్మానుగుణంగా జగత్తును సృజించి సంహరిస్తాడని తెలుసుకోనండి39.

ఈ ప్రకారం విని మునిశ్రేష్ఠులు, నైమిశీయతపోధనులు, ప్రసన్నహృదయులై శర్వుని ఆదరంతో పూజించారు40.

: ఇది శ్రీస్కాందపురాణం సూతసంహితలోని శివమాహాత్మ్యఖండంలో 'హిరణ్యగర్భాదివిశేషసృష్టి' అను పదకొండవ అధ్యాయం :

# తల్లికి మంగళహారతి

జై జై మహాతల్లి లలితమ్మదేవి
తల్లుల తల్లికి మంగళారతులు।
మా హారతులు నీకు వలయునా తల్లి?
మా భక్తిశ్రద్ధలకిదె నెపము సుమ్మ।

సాటియా ఈజ్యోతి నీ తేజమునకు?
ఈ వెలుగులోనిన్ను ఊహింపనిమ్మ।
నీ శ్వాసమే గాలి, నీ తేజమే అగ్ని
నీ శరీరము కావె ఈ జగములన్నియును? జై జై॥

ఊహింపజాలము నీ నిజస్వరూపము మేము
నీ మాయాశక్తి మము భ్రమియింపచేయు
ఎన్నిజన్మలకైన నిను తెలియ మావశమె?
నీ కరుణ లేశము లేకున్న మాకు జై జై॥

లోపములు సైరించి మన్నింపుమమ్మ
మా పిచ్చికోర్కెలను కడతేర్పవమ్మ
నీవుపేక్షించిన మేము ఎందు పోగలమమ్మ
నీవు తల్లివికాన వేడుచుంటిమి నిన్ను, జై జై॥

నీ ఇంద్రజాలము మము తికమకలపెట్టు
కాని నీ కృపచేత తోచినది మాకు
గాఢమగు భక్తితో నిను తలంచినచాలు
మా మనసు చీకటులు మాయమగు గాదె? జై జై॥

ఏమని పొగడుదు నీ చమత్కారమును
మా ప్రబలశత్రువే మా మనసుకాగ
మా పరమమిత్రమే మా మనసుకాదె?
మాతల్లి, మాతండ్రి మా ప్రభువు నీవె। జై జై॥

ఈ పళ్ళెమే నీది, గప్పురమ్ము నీది
నీదె ఈ హారతి, అక్షతలు నీవి
ఎటుచూచిననుచాలు అన్నియును నీవి
మాది ఏమున్నదని నీ కీయగలము? జై జై॥

రామకృష్ణులు నీకు ముద్దుబిడ్డడుగాదె
ఆ పరమహంసయే పెట్టిన వరవడిని
శ్రద్ధతో, భక్తితో, అనుకరించెదమమ్మ
ఆయనపేరుతో నిను కొలువనిమ్మ.

జై జై మహాతల్లి లలితమ్మదేవి
తల్లుల తల్లికి మంగళారతులు.

—కె. వి. రావు.

# వేదవిద్య

అంతేవాసి

వేదము అపౌరుషేయము: అనగా మనుష్యమాత్రులు మానవ చేతనతో వ్రాసినది కాదు. యస్య నిశ్వసితం వేదాః—ఆయన ఊపిరే వేదాలు అయినవి. ఎవరాయన? పరబ్రహ్మము. ఆయనది దివ్యచైతన్యము. అందుకై తపించి యోగనిష్ఠలో తాదాత్మ్యమునందినపుడు ఆ ఊర్ధ్వమూలమునుండి ప్రవహించిన చైతన్యము ఆ యా వ్యక్తుల నోట మంత్రముగా వెలువడెను. వెలువడకముందే వారికి మంత్రములు వినబడెను, కనబడెను. అందువలన వారు మంత్రద్రష్టలు. అత్రి, వశిష్ఠుడు, విశ్వామిత్రుడు, అగస్త్యుడు, వామదేవుడు మొదలగు ఋషులు విని పలికినందున శ్రుతి అని కూడ చెప్పుదురు. మననముచేసిన తరింపజేయగలవి గావున మంత్రములు. మంత్రద్రష్టలు అంతర్ముఖులై సాధనకు పూనుకొనుటకు ముందు మనుష్యులే యైనను ఆ తర్వాత వారు మనుష్యత్వపు మూడు ప్రహారీలను ఛేదించుకొని పోయినందున భిన్నులై అతీతులై ఋషులైరి. కనుక మంత్రములు అపౌరుషేయములు; కనుకనే అనాది.

మన దేశములో వేదము అందరికిని పెద్ద ప్రమాణము. పామరులు పండితులు అందరకును; వేదము తెలిసిన వారికిని తెలియని వారికినికూడ వేదము తర్వాతనే ఏదైనను లెక్కకు వచ్చును. వేదమునకు యిట్టి పలుకుబడి యెపుడు వచ్చినది తెలియదు. లిపి యేర్పడక మునుపు, లిపి యేర్పడి తాళపత్రములందు లిఖితము కాక మునుపు వేదములు కంఠస్థముగానుండి అనుశ్రుతముగా పరంపరగా వచ్చి నిలిచియుండుట పరమాశ్చర్యము. కంఠస్థముచేసిన వారి జ్ఞాపకశక్తియు వారికందు గల శ్రద్ధయు అతిలోకమైనవి. జటఘున పనసద్వారా వేదమును ఉపాసించిన వారు స్వరముపోకుండ మంత్రములు పోకుండ శతశతాబ్దములమీదుగా ఒకతరము వారు తరువాతి తరమువారికి అందించుచు సంరక్షించుకొనుచు వచ్చుట ప్రపంచ ఇతిహాసములో మహద్విశేషము.

గత శతాబ్దములో విజయనగరమహారాజులగు ఆనందగజపతిగారి తోడ్పాటుతో ఈస్ట్ ఇండియా కంపెనీవారి సహాయముతో మాక్స్ ముల్లర్ పండితులు పూనుకొని తాళపత్రప్రతులనే కాక వేదము కంఠతా వచ్చిన వారిని గూడ ఆధారముగా పెట్టుకొని ఋగ్వేదము అచ్చువేయించినది మొదలు వేదముల ముద్రితప్రతులు లభ్యమై పరిశోధన చాల జరిగినది.

సాయణాచార్యులుగ వాసికెక్కిన విద్యారణ్యస్వామి అయిదారువందల యేండ్లకు పూర్వము వ్రాసిన భాష్యము, ఎపుడు వ్రాసినదో తెలియని యాస్కుని నిరుక్తము వేదము చదివి అర్థము చేసికొనుటకు శరణ్యగ్రంథములు.

ఇపుడు నిలచియున్న వేదములు అసలు వేదములలో కొంత భాగమేననియు, అలమైపోయిన వేదము చాల ఉండియుండవలెననియు ప్రతీతి.

గతించిన నూరేండ్లు పైగా పాశ్చాత్య విద్వాంసులును మన విద్వాంసులును చాల పరిశోధన కావించి ఉపనిషత్తులే గొప్పవి అనియును, ఎప్పుడో పూర్వకాలములో పంచభూతములకు జడిసిన మనుష్యులు అగ్ని వాయువు మొదలైన దేవతామూర్తులను కల్పన చేసికొని తమ యోగక్షేమములకొఱకు అర్చన, ప్రార్థన చేసిరనియు, ప్రకృతిని యీ విధముగా ప్రసన్నము చేసికొనుటకు చదివిన స్తోత్రపాఠములే వేదములనియు అక్కడక్కడ

కొన్ని మంత్రములలో ఉదాత్త భావములు లేకపోలేదనియు ఐనను వేదములలో విశేషించి ఏమీ లేదనియు చెప్పుచు వచ్చిరి. ఇదే యిపుడు ప్రబలియున్న భావము. పాశ్చాత్యులు పరిశోధన లెస్సగా చేసినను వారి మనోవృత్తిని బట్టి ముందుగా పెట్టుకొన్న సూటినిబట్టి వేదార్థమునకు వచ్చుసరికి ఇట్టే తేల్చివేసిరి.

సంప్రదాయసిద్ధముగా వేదమునకు మూడు విధములగు అర్థమున్నది-అధిభౌతికము, అధిదైవికము, ఆధ్యాత్మికమునని ప్రతీతి. కేవలము అధిభౌతికముగా అర్థము చెప్పినవారున్నారు. కేవలము భూమి పరముగా భూగర్భస్థ విషయకముగా ఒకరర్థము చెప్పుటకు ప్రయత్నించిరి. దయానందసరస్వతిగారు వేదములకు గుప్తార్థము ఉన్నదనియు, సంస్కృత ధాతువులకు అనేక అర్థములున్నవనియు, మంత్రార్థము సంజ్ఞా శీలమనియును దేవతలు ప్రకృతిలో గోచరించు శక్తియుక్తుల మూర్తులే కాక అంతకు మించిన లక్ష్యలక్షణములతో కూడిన వారనియు నిరూపించిరి. అధ్యాత్మపరముగా అర్థము చెప్పు ప్రయత్నము పూర్వము కూడ కొంతవరకు జరిగెను. అది తెలిసినవారు ఉండియుందురు. అధ్యాత్మ విద్య గుహ్యవిద్య అగుటచే ప్రకటితము కాక క్రమశః ఖిలమైయుండును.

మన జాతి మనుగడకంతకును వేదమే మూలాధారముగా కన్పించుచున్నందునను వేదమునకు స్థూలార్థము మాత్రము చెప్పి అంతకన్న మిన్నవి ఉపనిషత్తులని కొట్టివేయుట సబబు కాదు. మంత్రద్రష్టలగు ఋషుల ఆత్మానుభూతిని పొందగల్గినయెడల మంత్రార్థము బోధ కాగలదని భావించుట ఈ జిజ్ఞాసకు మొదటి మెట్టగును. ఆంతరమైన అనుభూతితో శ్రీ అరవిందులు అనేక ఋక్కులకు అర్థవివరణ చేసి వేదరహస్యమును కొంత తెలిపియున్నారు. అధ్యాత్మపరముగా అర్థము చెప్పుటకు వలయు సాధన సామగ్రిని ఇచ్చి వెళ్ళినారు. మున్ముందు వేదార్థమును మూలముట్టుగా తెలియగోరు వారికి దారిచేసి వెళ్ళినారు.

ఇపుడు లాంఛనముగా చేయుచున్న నమస్కారములోని భావము గమనించినచో అంతరార్థము బాహ్యప్రక్రియలో ఎట్లు స్ఫురించునదియు మరుగుపడిపోవునదియు గూడ గ్రహింపగలము. నమస్కారము అను మాటలలోనే వంగుట, అణగియుండుట, సమర్పించుకొనుట యను భావము ఇమిడియున్నది. నమఃశివాయ లేక నమో భగవతే వాసుదేవాయ అన్నపుడు 'నమః'కు అర్థము చేతులెత్తి దణ్ణము పెట్టుట మాత్రమే కాదు, వ్యక్తి సర్వము సమర్పితము అగుట. నమస్కృతి, లోని భావమునకు బాహ్య ప్రక్రియ; భావము వినా లాంఛన ప్రాయము.

ఇట్లే అగ్ని నిప్పు మాత్రమే కాదు. ఊర్ధ్వముఖమైన మన అంతర్ముఖమగు ఆస్థకును, సంకల్పమునకును మూర్తిగా, సంసిద్ధికి సోపానము లగు ఈశ్వర లక్షణములను మన మనః ప్రాణ శరీరములందు ప్రతిష్ఠాపన చేయగల్గిన దైవముగా అగ్ని మనకు భాసమైనపుడు మన భావనలో తాత్పర్యము వేరుగా నుండును. యాస్కుని కాలమునాటికే వేదముల అర్థము మరుగుపడి పోయినపుడు ఈనాడు ఆ క్లేశము ఇంకను ఎక్కువే అగును. అర్థము కాని దానిని అర్థము చేసికొనుటకు బదులు అర్థము కానిది అర్థము లేనిదిగా భావింపబడు యీ కాలమున వేదమునకు అధ్యాత్మ పరమైన అర్థము ఉండవచ్చునది ఒప్పుకొనుటకుకూడ మంచి మనస్సు అవసరమగును.

మహిమానిత్వమైన గాయత్రీ మంత్రము వేదములోనిదే. ఈ మంత్రములోని సూర్యుడు

ఆకాశములో కనబడు సూర్యుడు మాత్రమే కాదు. వేదములో ఆవాహన చేయు దేవతలు, 'హృదయం పరమేశితుః' అయిన అదితి ఒడిలోనికి మనిషిని చేర్చు ఆత్మ బంధువులు. ఉషస్సు, మరుత్తులు, అగ్ని, ఇంద్రుడు, సూర్యుడు, సోముడు-వీరందరును అనాహతములో ఆస్థ అను అగ్ని రగలగానే మనిషిని మనః ప్రాణశరీరములను ముప్పేట చెఱనుండి విడిపించి ఉద్ధరించుటకు ఉద్యుక్తులై అనుక్షణము సంసిద్ధముగానున్న ఆత్మీయులు.

గాయత్రీ జపములో మనలను అదిమియుంచు కోశములను అతిక్రమించుటకు సంకల్పించుకొనుచున్నాము. సృష్టి అంతటితోను, సృష్టికి పైనున్న సర్వముతోను మనము ఒకటియైనట్లు భావన చేయుచున్నాము. "ఊర్ధ్వమూలము"ను తెలిసికోగోరుచున్నాము. కొమ్మలలో చిక్కుకొని అధోముఖులము కాకుండ సూర్యముఖులమగుచున్నాము. జ్ఞాన భాస్కరుని మన బుద్ధిలోనికి ఆహ్వానించి మన బుద్ధి ఇంద్రియములకు లోబడికాక జ్ఞానసూర్యుని కిరణ ప్రచోదనచే విలసిల్లునట్లు సంకల్పించుచు, అర్చించుచు మన ధ్యాసను ఆ సూర్యునిపైననే నిలుపుచున్నాము. ఉషోదయముతోనే చిమ్మచీకటులు తెలవారినట్లు ఆ జ్ఞానసూర్యునిరశ్మిచే మన బుద్ధి తప్తమును సంశుద్ధమైనపుడు సూర్యభగవానుడు హిరణ్మయపాత్రను తీసివైచి దానికి వెనుకనున్న సత్యనారాయణుని దర్శింపజేయును. మంత్రచైతన్యము కల్గిన కొలది సిద్ధి. అపుడు 'స్వే దమే' స్వంతయింటిలో ప్రవేశింతుము.

ఋగ్వేదములో ఒకే ఒక సూక్తము 8 ఋక్కులది దేవీ సూక్తముగా ప్రసిద్ధమైనది. మంత్రద్రష్ట అంభృణి. అందరు ఋషులలో ఈమె ఒకతెయే ఋషిక, అంభృణ ఋషికుమార్తె. ఈ ఋక్కులకు దేవత ఆదిశక్తి. తంత్రశాస్త్రమంతయును ఈ ఒక్క సూక్తముపైన ప్రతిష్ఠితమై యున్నదని చెప్పవచ్చును. ఇదొక దివ్యానుభవచోదితమైన మంత్రము. దీని విలువ సాధకునకు ఆదిశక్తితో తాదాత్మ్యము, అట్టి తాదాత్మ్యముచే కలిగిన చైతన్యము ఆ చైతన్యముచేనైన శక్తి చాలనము సిద్ధించును.

ఒక్కొక్క సూక్తములో ఒక్కొక్క అనుభూతి ప్రకటమై ప్రసరించును. మనకు అనుదినము పరిచితమైన ఉషోదయములో సాధకునకు వేరు సంజ్ఞ గోచరించును. సూర్యోదయమునకు ముందు వేకువ. జ్ఞానసూర్యుని కల్యాణతమ రూపము మనలోని చైత్యపురుషునకు సాక్షాత్కరింపక మునుపు కలుగు అనుభూతికి తార్కాణగా అభయము చెప్పుచు ఉషోదేవత వచ్చును. వేకువ జాము వర్ణన తప్ప వేరేమియు ఉండదను ఊహకు అంత వరకే అందును. శబ్దార్థమునకే కట్టుబడినచో మనము కావ్యశక్తిని కూడ గ్రహింపలేము. అట్లే యీ సూక్తములో వట్టి ఆవేశము తప్ప వేరేమియు లేదనుకొన్నచో అంభృణి వాక్కును పరవశింపలేము. పరా, అపరా ప్రకృతులను యిద్దరుతల్లుల కన్నబిడ్డలమగు మనము రెక్కలు విప్పుకొని విరాట్‌రూపముతో ఒకటై మనమెరిగిన 'నేను' నశించి సాఽహం పరాశాక్తనుండి సచ్చిదానందులముగా ప్రవర్తిల గల్గుటకు దేవీ సూక్తము మహత్తమ మంత్రరాజము. అంభృణి పేరు వాక్. ఆమెవాక్కు అమోఘము.

ఋగ్వేదము 10 వ మండలము 125 వ సూక్తము దేవీసూక్తము. సూక్తభావము తెలుపుటకు యీ తెనిగింపు కొంచెము ఉపకరించగలదు.

## దేవీ సూక్తము

1. నా సంచారము రుద్రులతో, వసువులతో; అంతేకాదు: ఆదిత్యులతోను విశ్వదేవులతోను. మిత్రుని, వరుణుని, ఇంద్రుని, అగ్నిని, అశ్వినులను నేను భరించుచున్నాను.

2. దేవతలకు ఆనందము చేకూర్చు సోమమును చేపట్టియున్నాను. త్వష్ట, పూష, భగ దేవతలను భరించి నిలుపుచున్నాను. యజమాని యజ్ఞార్థమిచ్చు హవిస్సును యజ్ఞఫలముగా పొందు ద్రవిణమును నేనే యిచ్చుచున్నాను.

3. రాష్ట్రి(జ్ఞ)ని నేను. వసువుల నిచ్చుదాననునేను. చికితుషిని ము కల్గించు చైతన్యను) దేవతలకు ముందు నేను బహుశక్త్వమునంది బహుశక్త్వము నావేశించిన పూర్వపుదానినని దేవతలు నన్ను ముందుంచుకొనుచున్నారు.

4. నావలననే చూపు, అన్నము; ప్రాణము, వినుకలి. నన్ను తలచనివారు క్షయమగుదురు. విను, శ్రద్ధగా విను, శ్రద్ధ యేమో చెప్పుచున్నాను విను.

5. నేనే స్వయముగా తెలుపుచున్నాను,- దేవతలును మనుష్యులును పొందగోరునది (సత్యమును) తెలుపుచున్నాను. నా ఇష్టము కొలది ఉగ్రత్వము, బ్రహ్మత్వము, ఋషిత్వము, శుద్ధమైన మేధస్సు యిత్తును

6. బ్రహ్మద్వేషిని శరముతో మట్టుపెట్టుటకు రుద్రధనువును ఎక్కుపెట్టుదును; నేలను నింగిని కమ్మి జనులకు సమరోత్సాహము కల్గింతును.

7. సృష్టి శిరస్సున నున్న తండ్రిని (స్వర్గమును) నేను ప్రసవించితిని. అంతః సముద్ర సలిలములలో నాజన్మ. అందుండి సకల భువనములను వ్యాపించియున్నాను. అదిగో ఆ స్వర్గమును వెలివిరిసి ప్రవహించు నా జ్యోతిః కాయముతో - వర్ష్మణముతో - స్పృశించి అంతటను వ్యాపించుచున్నాను.

8. గాలివలె ప్రచండముగా వీతును, సకల భువనములను ఆరంభించుదాననై వీచెదను_ భూతలమును దాటిపోయి, స్వర్గమును దూసికొనిపోయి నా విస్తారము వలన నేనింతదాననైతిని.

---

1. ఓం అహం రుద్రేభిర్వసుభిశ్చరామ్యహమాదిత్యైరుత విశ్వదేవైః।
   అహం మిత్రావరుణోభా బిభర్మ్యహమిన్ద్రాగ్నీ అహమశ్వినోభా॥
2. అహం సోమమాహనసం బిభర్మ్యహం త్వష్టారముత పూషణం భగమ్।
   అహం దధామి ద్రవిణం హవిష్మతే సుప్రావ్యే యజమానాయ సున్వతే॥
3. అహం రాష్ట్రీ సఙ్గమనీ వసూనాం చికితుషీ ప్రథమా యజ్ఞియానామ్।
   తాం మా దేవా వ్యదధుః పురుత్రా భూరిస్థాత్రాం భూర్యావేశయన్తీమ్॥
4. మయా సో అన్నమత్తి యో విపశ్యతి యః ప్రాణితి య ఈం శృణోత్యుక్తమ్।
   అమన్తవో మాం త ఉపక్షియన్తి శ్రుధి శ్రుత శ్రద్ధివం తే వదామి॥
5. అహమేవ స్వయమిదం వదామి జుష్టం దేవేభిరుత మానుషేభిః।
   యం కామయే తం తముగ్రం కృణోమి తం బ్రహ్మాణం తమృషిం తం సుమేధమ్॥
6. అహం రుద్రాయ ధనురా తనోమి బ్రహ్మద్విషే శరవే హన్తవా ఉ।
   అహం జనాయ సమదం కృణోమ్యహం ద్యావాపృథివీ ఆ వివేశ॥
7. అహం సువే పితరమస్య మూర్ధాన్ మమ యోనిరప్స్వన్తః సముద్రే।
   తతో వి తిష్ఠే భువనాను విశ్వోతామూం ద్యాం వర్ష్మణోప స్పృశామి॥
8. అహమేవ వాత ఇవ ప్రవామ్యారభమాణా భువనాని విశ్వా।
   పరో దివా పర ఏనా పృథివ్యైతావతీ మహినా సమ్బభూవ॥

# కబీరు వచనామృతము

[కబీరు వచనములను ఎన్నో గ్రంథములను వ్రాతప్రతులను సంప్రదించియే కాక పాడుకొనుచు తిరుగు చుండు గోసాయిలు సాధువులు ముఖతః విని వ్రాసికొని కబీరుని అని చెప్ప సాహిత్యము చాల సేకరించి అందు రూఢిగా కబీరు చేసెనని సవిమర్శగా తాము స్థిరపరచిన వాటిని నాలుగు భాగములుగ ఏర్పరచి శాంతి నికేతన ఆచార్యులు క్షితిమోహనసేన్, కబీరు అను గ్రంథమును 1911లో ప్రచురించిరి. దానిననుసరించి శ్రీ రవీంద్రనాథ్‌ఠాకూరు నూరింటిని ఎన్నుకొని One Hundred Poms of Kabir అను ఆంగ్లానువాద మును 1915లో ప్రకటించిరి. హిందీ మూలములోబాటు తమ వంగభాషానువాదమును జతచేసి సేన్‌గారు వెలువరించిన యీ గ్రంథమును కీర్తిశేషులు శ్రీ వేలూరి చంద్రశేఖరంగారు 1920లో తెలుగు చేసిరి. ఇందలి నాలుగు భాగములలో ప్రతిభాగమునను పరీక్ష, ఉపదేశములు, సాధన, తత్త్వము, ప్రేమ అను అయిదు శీర్షికలతో కబీరు పదే పదే వినూత్న ఆత్మానుభవామృతమును మనకు అందించుచున్నారు. ఈ తెలుగు ప్రతి 50 సంవత్సరముల తరువాత లభ్యమై ప్రచురించు అవకాశము కల్గినందుకు సంతసించుచున్నాము.]

## కబీరు పరీక్ష

కొందరు మాకు రాముడుపాస్యుడందురు. కొందరు మాకు రహీముపాస్యుడందురు. కొందరు మాకాదేశమే చాలకమందురు. ఇట్లందరును నానా వేషముల ధరించి నలు వైపుల ద్రిమ్మరుచున్నారు. కబీరిట్లను చున్నాడు :-సత్యజ్ఞానము లేనిదే యెన్నడును ఆ రహస్యముయొక్క అంతము లభింపదు.

**2**

ఓ కబీరా! నీవు నిత్యమును స్నానమొన ర్తువు. అన్యుని ముట్టుకొనుటకు నీకేవమగును. నిత్యమును నీవు పుష్పములతో పత్రములతో దేవతను పూజింతువు. వీటికీ వ్యర్థపుగోల!

ప్రపంచమున జనులు తమతమ చేతులతో విగ్రహమునాకారించి వానికడనుండియే ఫలముల గోరుదురు! జగమంతయు దేవ విగ్ర హములను జినవిగ్రహములను పూజించు చున్నది. తీర్థవ్రతస్నానముల చేయుచున్నది. రాకపోకలచే చరణములకు గ్లాంతి కలుగు చున్నది. ఈ దుఃఖమునకు అవసానమెచ్చట కాగలదు! సత్యములో నా సత్యమయుడు వసించును. మిథ్యనాతడు పరాస్తము చేసి వైచును. కబీరిట్లనుచున్నాడు :-ఎచట సత్య వస్తువున్నదో అచట సహజముగా నాతని దర్శ నము లభించును.

ఓ సాధూ! పురోహితుడు కడునిపుణు డైన కసాయి. చిత్తమునందు దయ ఇంచు కైనను లేదు.

స్నానమొనర్చి తిలకము ధరించి కూర్చుండి యథారీతి దేవీపూజనొనర్చును. ఇక నొక క్షణములో ప్రాణహింస చేసి రక్తపు నదిని ప్రవహింపజేయును. మరియు తన కులము అతి పవిత్రమనియు ఉచ్చమనియు సభయం దధికారము వహించును. ఇతనికడ లోకులు దీక్షాగ్రహణమొనర్తురు. విని నాకు నవ్వు వచ్చుచున్నది. వీరు పాపపుమాటలు విన్పిం తురు. నీచకర్మల చేయింతురు. ఔరా! గోవధనొనర్చువారలను వీరు తురకలందురు. వీరు వారలకంటె తక్కువా యేమి?

ఔరా వీరిద్వురకును దారి దొరకలేదు. హిందువుల హిందుత్వము చూచితిని. తురకల యవనత్వము చూచితిని. కబీరిట్లనుచున్నాడు: ఓ సాధూ ఏ దారిని నేను పోవుదును.

5

ఓ సాధూ! చూడు ప్రపంచకమెంత వెర్రిగానున్నదో! సత్యము చెప్పుదువేని నిన్ను గొట్టుటకుద్యుక్తమగును మిథ్య చెప్పుదువేని విశ్వసించును. హిందువులు మా రాముడందురు. ముసల్మానులు మా రహీముడందురు. ఉభయులును కలహింతురు. కొట్టుకొందురు. కాని మర్మమెవ్వరును గ్రహింపరు. మరియు మతమును విధులను పరిపాలించు ప్రాతః స్నాతులనేకులను జూచితిని స్థూలము వారి జ్ఞానము. ఏమనవారు పరమాత్మను పరిత్యజించి పాషాణమును పూజింతురు. కొందరు రాగి విగ్రహములను రాళ్ళ విగ్రహములను పూజింతురు. తీర్థవ్రతములందు కొందరు భ్రాంతులు. కొందరు మాలలను ధరింతురు. కొందరు టోపీల నలంకరించుకొందురు. కొందరు బొట్టుపెట్టుకొందురు. కొందరు జపము చేయుదురు. కొందరు భజనకీర్తనలు పాడుదురు. పరమాత్మను ఎరుగనే ఎరుగరు.

పీరు పకీరులను పెక్కుమందిని చూచితిని. కొందరు మత గ్రంథములను, కొందరు కొరాను చదువుదురు. వారందరును లను చేకొందురు, రహస్యపు మాటలను జెప్పుదురు-కాని ఈశ్వరు నెరుంగరు.

హిందువుని దయ, ముసల్మానుని కరుణ ఉభయుల యింటినుండియు పారిపోయినది. ఒకడు బలి ఇచ్చును. ఇంకొకడు కంఠచ్ఛేద మొనర్చును. ఉభయుల ఇంట నిప్పంటుకొనినది. వారు తాము బుద్ధిమంతులమని తలపోయుదురు. మరియు నన్ను పహాసింతురు-కబీరిట్లనుచున్నాడు- ఓ సాధూ! వీరలలో నెవడు వెర్రివాడో నాకు చెప్పుము.

6

ఎవడు, మనస్సునుండి తనను తాదూర గింపగల్గునో అతడే వృత్తీర్ణుడైనవాడు. కొందరు నేను జ్ఞానినందురు. కొందరు నేను త్యాగినందురు. కొందరు నేను ఇంద్రియజేతనందురు. కాని యభిమానమందరిని బట్టుకొని యున్నది. కొందరు నేను యోగినందురు. కొందరు నేను భోగినందురు. అభిమానము దూరముకాలేదు. ఇక రోగి ఎటుల బ్రతుకగలడు! కొందరు నేను దాతనందురు. కొందరు నేను తపస్వినందురు. ఆత్మ తత్త్వమును నిజ స్వరూపమున నెవ్వరును నెరుంగరు. అందరు భ్రమయందు నిమగ్నులు. కొందరు నేను యోగములనన్నిటిని ఎరుగుదునందురు. కొందరు రహస్యము నెరుగుదునందురు. ఆ యాత్మదేవత ఎప్పుడెరుగబడలేదో అప్పుడీమాటలన్నియు వ్యర్థము. కొందరు అన్ని ధర్మములను సాధించితినందురు. కాని ఆత్మ భ్రాంతి దూరముకాకుండనేని నుదుటననేక కష్టములింకనూ వ్రాసి యున్నవి. ఎవడు గర్వాభిమానముల దూరమునకు ద్రోసివైచునో అతనికడ కర్మబంధనము శక్తిహీనము. కబీరిట్లు చెప్పుచున్నాడు:- నేనా స్వామి భృత్యుడను. నానిజపదమునకు వచ్చి చేరితిని.

7

ఓయీ సేవకా! నా కొరకెక్కడ వెదకుచున్నావు? నేను నీపార్శ్వమందుననే యున్నాను. నేనే మందిరమునను లేను. మసీదునను లేను. కాబాతీర్థమునను లేను. కైలాసమునను లేను. క్రియాకర్మలందు లేను. యోగవైరాగ్యములందు నేనులేను. అన్వేషించుట తెలియునేని తత్క్షణమే నన్ను తెలియగలవు. కబీరిట్లనుచున్నాడు:- ఓ సాధూ! నేను సకల నిశ్వాసములలోను కలను.

అహా! యీ లోకమెంత వెర్రి! భక్తియన నేమో ఎవ్వరును ఎరుగరు. కొందరు కొడుకుల

కోసమై వచ్చి ఓ గోసాయీ నాకు పుత్రుల ప్రసాదింపుమందురు. కొందరు దుఃఖపీడితులై వచ్చి నాయెడ ప్రసన్నుడవు కమ్మందురు. కొందరు వచ్చి ధనము కొరకు ప్రార్థించి ధనముపహారమొసగుదురు ఆ పరమ సత్యమును గ్రహించువాడెవడును లేడు. అందరును మిథ్యనన్వేషించుచున్నారు. కబీరిట్లనుచున్నాడు:- ఓ సాధూ! ఈ అంధులతోనేమి చేయనగును?

**9**

సాధకుల జాతి తెలియనడుగుట వృథా. ఏమన బ్రాహ్మణుడు, క్షత్రియుడు, వైశ్యుడు అందరును సాధన చేయుచున్నారు. సాధకుని జాతి విషయమై ప్రశ్న చేయుటయే ఆశ్చర్యము. మంగలి సాధన చేసినాడు. చాకలి సాధన చేసినాడు. దర్జీ సాధనచేసినాడు. సాధన యందు సాధకుడైన రైదాసుకలడు. శ్వపచ ఋషి జాతికి మాదిగ. హిందూముసల్మానులలో అన్ని జాతులవారును సాధకులైరి. ఏ జాతిఅను విచారణ అవసరములేదు.

**10**

ఎవని హృదముయనందు ప్రేమసంచారము లేదో అతడు కాశీవాసము చేసిననేమి? గంగా జలము త్రాగిననేమి? అతడు కంఠమాలలు ధరించిననేమి? బొట్టుపెట్టుకొనిననేమి? కబీరిట్లు చెప్పుచున్నాడు:- ఓ అన్నా! అతడు బ్రతికి యుండుటయే వృథా.

**11**

నా స్వామి యొక్క లీల నిగూఢము. యోగి ముద్రాయోగమునభ్యసించి అతనిని ఏ విధముగా తెలియగలడు? అంధుడైన ఘుతానుయాయి అడవిలోను, అరణ్యములోను ద్రిమ్మరుచున్నాడు. బ్రహ్మచారి పూజాతర్పణముల యందు మఱపుగొని యున్నాడు. కుంభకముచే యోగి ప్రాణాధారణమొనర్చుచున్నాడు. ఆతడు జగద్వాయువును ద్యజించి అజగరసర్పము రీతి శక్తిలాభమొనరించుకొని ఈ విశ్వఖేలనమందు దసలీలను బోగొట్టుకొనినాడు. బ్రహ్మను మాత్రము పొందలేడు. నా మందిరము శూన్యము. గభీరనిశీథమువలె నచట చీకటి. నేనెచట విశ్రమింతును? కబీరిట్లనుచున్నాడు:- నీమందిరమందెచ్చట సూర్యచంద్రులు దీప్యమానులో అచట శయనింపుము.

**12**

ప్రేమయొక్క రంగుచే మనస్సును రంజింపక యోగి తన బట్టను రంజించుచున్నాడు. పూజామందిరమున ఆసనము పరచుకొని బ్రహ్మను పరిత్యజించి పాషాణమును బూజ చేయుచున్నాడు. చెవులలో జిల్లులు చేసుకొని యోగి జడలను బాడిగించుచున్నాడు. గడ్డమును బెంచి అసలు మేకవలెనే అయిపోయినాడు. అడవికేగి అగ్నికుండమును వెలిగించి కూర్చొనుచున్నాడు. మరియు కామమును కాల్చినపుంసకుడైపోయినాడు. తల గొరిగించుకొని బట్టకు రంగువైచుకొని గీత చదివి యోగి మిథ్యావాచాలుడైనాడు. కబీరిట్లనుచున్నాడు: నీవు కాలుచేతులు బంధించుకొని మృత్యుద్వారమునకు బోవుచున్నావు.

**13**

ఓ సాధూ! సాధనావిధానమత్యంతము నిగూఢము. మాలలు ముద్రలు ధరించిననేమి, తల గొరిగించుకొని గాని జడలు ధరించిగాని దేహముపై బూడిద ధరించిగాని జలముగాని విగ్రహముగాని పూజించుచున్నగాని కందమూలఫలములభుజించినగాని యేమి లాభము?

తత్వజ్ఞానము లభింపనిది తీర్థవ్రత నియమముల బాలించిననేమి? భజనచేసిననేమి, శాస్త్రము నకు వ్యాఖ్యలు చేసిననేమి, ప్రపంచకమందం తట పరిభ్రమించిననేమి, సంధ్యాతర్పణము షట్కర్మలు ఆచరించిననేమి? ఈ తత్వజ్ఞాన హీనులందరు తమ్ము సాధులుగా చెల్పుకొం దురు. మరియు స్వాములై గూర్చుండి విషయ ముల భోగింతురు. వీరు జ్ఞానధ్యానముల మర్మ మెరుగరు. ఊరక వృథాతర్కములు జేయు దురు. తమ తలపై గంపెడు కర్మ భార మున్నను, పరుల చెవులందు మంత్రము లూదుచు తిరుగుచుందురు-ఇట్టిది వీరి కుమతి. పరమగురువై బ్రహ్మాను తెలియక ఇంకెన్నాళ్లు లోభతరంగములందు గొట్టుకొనిపోవుచుందురు? ఎవడు నిగూఢుడు - ఎవడు గభీరుడు-ఎవని పారము పొందరానిది-సీమమునుండియు ఆ సీమమునుండియు నెవడతీతుడు - అపారమెవ్వని దృష్టి-ఎవనికి ప్రవేశము సర్వత్ర అవ్యా హతము-ఆ బ్రహ్మాయే సకల భ్రమజాలముల నుండియు విమోచింపగలడు. ఎవనిదృష్టి నిర్మ లము-ఎవని ఆత్మ బ్రహ్మానామమున కాధా రము-ఎవడు నీవు నేను అనుభేదమునుండి ముక్తుడు అతడే సాధనారహస్యమునందు ప్రవేశింప సమర్థుడు - కబీరీమాటయే చెప్పు చున్నాడు.

## 14

మోహబంధనము విషయమై నేనింకను ప్రపంచించి చెప్పుదును వినుము. వీరు భూత పిశాచముల బూజింతురు. మృత్యువు వీరి యింట వసించి ఆనందించుచున్నది. భక్త మహాశయుడు ఏకాదశినాడు నిర్జలోపవాసము చేయును. శ్రద్ధతో పురాణశ్రవణ మొనర్చును. కాని మేకను జంపి మాంసము తినుట యందతి చతురుడు. ఒరే, చండాలుడా, మహాపాపీ, అపరాధీ, దయలేక అంధత మనస్సునందుంచుచున్నావు. నీ దేహమును దయను సాధించుటయందేల నియోగింపవు? నీవంటి యకర్మణ్యులనేకులు జగత్తునందు భ్రిమ్మరుచున్నారు. వీరి మనస్సునందెంత గర్వము-కబీరిట్లును చున్నాడు:- ప్రేమ నుండి యెవడు విచ్ఛిన్నుడో అతనికి నరకమే గతి.

## 15

తన కొడుకునకు క్షౌరమొనర్చునపుడెంత దయ. తలపై గాటగునని యెంత జాగరూకత. కాని మేకపిల్లను బట్టుకొని బలి యిచ్చునపుడు దయ సుంతైననూ లేదు.

పాకాల శ్రీ రామకృష్ణమందిరంలో ఫిబ్రవరి 4 వ తేదీతో పదిరోజుల గీతాయజ్ఞం జయప్రదంగా ముగిసింది. ప్రతిరోజు రెండు వేళలా చిన్మయమిషన్‌కు చెందిన స్వామిని శారదా ప్రియానందగారు తెలుగులో గీతా ఉపన్యాసాలు గావించారు. కడపటిరోజు పాకాల శ్రీ రామకృష్ణసేవాసంఘం అధ్యక్షుడు శ్రీ చెరుకూరి గురవయ్యనాయుడు వందనసమర్పణ చేస్తూ యీ గీతాయజ్ఞానికి కారకులైన వారందరికీ కృతజ్ఞతలు తెలియజేశారు.

10-2-79.

ఎన్. పరంధామనాయుడు
కార్యదర్శి, శ్రీ రామకృష్ణ సేవాసంఘము, పాకాల.

# లీల శారదాదేవి

బి. ఎస్. ఆర్. ఆంజనేయులు

## పూరీ జగన్నాధయాత్ర

మనదేశంలో తూర్పుదిక్కునవున్న గొప్పక్షేత్రం పూరీ జగన్నాధం. ఈ దేవాలయము సముద్రము ఒడ్డున ఉన్నది. మహాపురుషులందరు ఈ క్షేత్రాన్ని దర్శించారు. ఇక్కడ అన్ని కులాలవారు భేదాలుగాని, ఎంగిలిగాని పాటించకుండా అన్నప్రసాదం తీసుకుంటారు. అందుకే యిక్కడి ప్రసాదం, మహాప్రసాదం అంటారు. 'సర్వం జగన్నాధ' మనే మాటకూడా మీరు వినేవుంటారు. శ్రీ రామకృష్ణదేవులు ఆ ప్రసాదాన్నిగూర్చి యిలా చెప్పారు.

'జగన్నాధప్రసాదం భగవంతుని రూపమే.'

జగన్నాధస్వామిని దర్శించాలని శ్రీ రామకృష్ణులకు వుండేది. కాని, ఆయన జీవించి యుండగా అది వీలుపడలేదు. శ్రీ శారదా రామకృష్ణులు యిద్దరు ఒక్కటే కదా! ఆమె ఒకసారి పూరీయాత్ర చేసింది. శ్రీ రామకృష్ణదేవుల చిత్రపటాన్ని వెంట తీసుకుపోయినది. కన్నులకు గంతకట్టుకొని గుడిలోనికి పోయింది. స్వామికెదురుగా నిలబడి రామకృష్ణదేవుల పటాన్ని స్వామివైపు తిప్పి, ఆయన చూచినతర్వాత తాను కన్నుల గంతవిప్పుకొని స్వామిని దర్శించింది. పటంరూపంలోయున్నా ఆమెకు రామకృష్ణదేవులు స్వయంగా వెంట వున్నట్లుగానే చూచింది. ఒకసారి ఆమె యిలా చెప్పింది. "పటములో కనుపించేది ఆయన నీడ కాదా!'

ప్రధమ ధామము పూరీ జగన్నాధపురము<br>
అటకు శ్రీ రామకృష్ణుని పటముదెచ్చి<br>
మొదట స్వామినిచూపి తా పిదప జూచె<br>
అతడు ఆ క్షేత్రమును చూడ నందువలన

సంపాదకులు : స్వామి తన్మయానంద.

శ్రీ ఎమ్. బాలసుందరంగారిచే ఫ్రీడమ్ ప్రెస్, (మద్రాసు_600 021) న ముద్రింపబడి.

స్వామి తన్మయానందవారిచే శ్రీ రామకృష్ణమఠము (మద్రాసు_600 004) నుండి ప్రచురింపబడినది.

# శ్రీ రామకృష్ణ మఠ ప్రచురణలు

| గ్రంథము | వెల |
|---|---|
| శ్రీ రామకృష్ణ కథామృతము | 8.00 |
| శ్రీ రామకృష్ణ జీవితచరిత్ర | 10.00 |
| శ్రీ రామకృష్ణ బోధామృతము | 8.00 |
| శ్రీ రామకృష్ణోపనిషత్తు | 3.75 |
| శ్రీ రామకృష్ణపరమహంస నీతికథారత్నములు | 2.50 |
| గురూపదేశములు | 2-00 |
| నా గురుదేవుడు | 1.25 |
| శ్రీ రామకృష్ణ దివ్యవాణి | 1.50 |
| శ్రీ రామకృష్ణ పరమహంస జీవిత సంగ్రహము | 0.75 |
| ఆరాత్రికము మరియు శ్రీ రామనామ సంకీర్తనము | 0.60 |
| శ్రీ శారదాదేవి జీవిత చరిత్ర | 4.00 |
| శ్రీ శారదాదేవి | 2.50 |
| శ్రీ శారదా సూక్తి నవనీతము | [illegible].80 |
| శ్రీ వివేకానంద జీవిత చరిత్ర | 4.00 |
| బాలల వివేకానందుడు | 2.00 |
| శ్రీ వివేకానంద సంపూర్ణ గ్రంథావళి | |
| 8 సంపుటముల పూర్తిసెట్టు (సాదా) | 55.00 |
| .. .. (క్యాలికో) | 61.00 |
| విడి సంపుటములు ఒక్కొక్కటి (సాదా) | 5.00 |
| .. .. (క్యాలికో) | 6.50 |
| స్వామి శిష్య సంవాదములు | 10.50 |
| సందేశ తరంగిణి (మొదటి భాగము) | 4.00 |
| .. (రెండవ భాగము) | 5.50 |
| భారత యువజనులారా! | 3.00 |
| ప్రబోధ రత్నాకరము | 3.75 |
| రాజయోగము | 6.25 |
| కర్మయోగము | 4.00 |
| భక్తియోగము | 4.00 |
| శ్రీ వివేకానందలేఖావళి (మొదటిభాగము) | 2-25 |
| (రెండవభాగము) | 3.00 |
| హిందూ మతము | 4.00 |
| వివేక సూర్యోదయము | 4.00 |
| అనుష్ఠాన వేదాంతము | 2.50 |
| ప్రాచ్యము - పాశ్చాత్యము | 1.25 |
| కులము, సంస్కృతి, సామ్యవా | 3-00 |
| భారతదేశము | 2.00 |
| భారతీయ మహిళ | 2-00 |
| నా జీవితము, జీవిత కార్యము | 1.25 |
| శ్రీ రామకృష్ణ సేవాసంస్థ తదాదర్శములు | 0-50 |
| చికాగో నగరోపన్యాసములు | 1.00 |
| శ్రీ వివేకానంద శంఖారావము | 0.80 |
| నవీన భారత దేశము | 0.40 |
| సర్వం విష్ణుమయం జగత్ | 0.35 |
| శ్రీ వివేకానంద సింహగర్జనలు | 0.20 |
| బ్రహ్మానంద బోధనలు | 4.75 |
| తాపత్రయ చికిత్స | 0.60 |
| ముక్తిమార్గము | 0.30 |
| పారమార్థిక సంభాషణలు | 6.60 |
| నారద భక్తి సూత్రములు | 4.00 |
| శ్రీ మద్భాగవతము-మూడవ సంపుటము | 7.50 |
| దేవీమాహాత్మ్యము | 4.00 |
| శ్రీ మద్భగవద్గీత | 3.00 |
| శ్రీ మద్భగవద్గీత చిన్నసైజు | 3.00 |
| పారాయణగీత తాత్పర్యసహితము | 3.75 |
| మూలము | 2.00 |
| కఠోపనిషత్తు | 2.00 |
| గిరీశచంద్ర | 1.00 |
| భక్తిమార్గము | 1.00 |
| శ్రీకృష్ణవాణి | 1.80 |
| బుద్ధవాణి | 0.80 |
| క్రీస్తు సూక్తిమాల | 0.80 |
| మహమ్మదు సూక్తి మంజరి | 0.60 |
| శ్రీ విష్ణుసహస్రనామ స్తోత్రము | 1.25 |

ఇవియేకాక ఆంగ్ల, సంస్కృత, తమిళ, హిందీ, కన్నడ గ్రంథములును.

వేదాంత కేసరి (ఆంగ్లము) శ్రీ రామకృష్ణ విజయము (తమిళము)

అను మాసపత్రికలును, శ్రీ రామకృష్ణ పరమహంస, శ్రీ శారదాదేవి, శ్రీ వివేకానందస్వామి మున్నగువారి ఛాయాచిత్రములు, త్రివర్ణ చిత్రములు, తైలచిత్రములు మున్నగునవెన్నియో మా యొద్ద లభింపగలవు.

అడ్రెసు : మేనేజరు, శ్రీ రామకృష్ణ మఠము, మైలాపూరు, మద్రాసు - 600 004

సంవత్సర చందా రూ. 10-00 జీవిత చందా రూ. 125-00 విడి సంచిక 1-00 రూ

# శ్రీ రామకృష్ణ ప్రభ

సంపుటము 36 | 1979 - ఏప్రెల్ | సంచిక 4

## విషయసూచిక




రామకృష్ణప్రభ

సంవత్సర చందా: రూ. 10-00. జీవిత చందా: రూ. 125.

శ్రీ రామకృష్ణమఠము,

మైలాపూర్, మద్రాసు-600-004.

## శ్రీ రామకృష్ణ ప్రభ అభిమానులకు
### ఒక ముఖ్యమైన మనవి

శ్రీ రామకృష్ణ ప్రభకు వ్యాప్తి (Circulation) చాల పరిమితముగనున్నది. చందాదారుల సంఖ్య ఎక్కువ అగుటకు మీ సహాయమపేక్షించుచున్నాము. మీలో, వ్యక్తిగతముగా ఒక్కొక్కరు ఒక్కొక్క క్రొత్త చందాదారుని చేర్పించుటకు ప్రయత్నించిన చాలును. ఆంధ్రదేశములో రామకృష్ణసమితులు, సమాజములు, సేవాసంఘములు—నడిపించుచున్న కార్యదర్శులు కనీసము పది చందాదారులను చేర్పించుటకు ప్రయత్నించిన బాగుండును. సాధ్యమైనంతవఱకు జీవిత చందాదారులను, అట్లు కానిచో సంవత్సర చందాదారులను చేర్పించి మీరందఱు, పత్రిక వెలువరించుటకు తగినంత ప్రోత్సాహమును మాకు కలిగించగలరని ఆశించుచున్నాము.

ఈ విషయమున, ఈ వఱకే కొందఱు స్వయముగా మాకు సహాయమందించుచున్నారు. ఎన్. పరంధామనాయుడు(పాకాల), కొత్తా గౌరీశంకరరావు (విజయవాడ), డి. పి. ఆర్. విఠ్ఠల్ (హైదరాబాదు) మొదలగువారు ఈ విషయమై చేసిన, చేస్తున్న సహాయమునకు మిక్కిలి కృతజ్ఞులము.

ఆత్మనో మోక్షార్థం జగద్ధితాయ చ.

# శ్రీరామకృష్ణ ప్రభ

సంపుటము 36 1979 - ఏప్రెల్ సంచిక

## హిరణ్యగర్భ సూక్తము

హిరణ్యగర్భస్సమవర్తతాగ్రే
భూతస్య జాతః పతిరేక ఆసీత్,
స దాధార పృథివీం ద్యాముతేమాం
కస్మైదేవాయ హవిషా విధేమ॥

అగ్రే=సృష్ట్యాదియందు, హిరణ్యగర్భః= హిరణ్యగర్భుడు, సమవర్తత (ఆపరమాత్మనుండియే) పుట్టెను, జాతః=ఉత్పన్నుడైన (ఆ హిరణ్యగర్భుడు), భూతస్య=భువన సమూహమునకు, ఏకః=ఒక్కడైన, పతిః=ప్రభువు, ఆసీత్=ఆయెను, సః= ఆ పరమాత్మ, పృథివీం=భూమిని, ఉత=మఱియు, ఇమాం=ఈ, ద్యాం=అంతరిక్షమును, దాధార=ధరించెను, (మేము ఇక ఆ పరమాత్మకంటె భిన్నుడైన) కస్మై=ఏ, దేవాయ=దేవునికొఱకు, హవిషా = హవిస్సుగల యజ్ఞముచేత, విధేమ = విధులననుష్ఠింతుము?

యః ప్రాణతో నిమిషతో మహిత్వైక
ఇద్రాజా జగతో బభూవ,
య ఈశే అస్య ద్విపదశ్చతుష్పదః
కస్మై దేవాయ హవిషా విధేమ॥

యః=ఏ పరమాత్మ, ప్రాణతః=చలించునట్టియు, నిమిషతః = నిమేషముగలట్టియు, జగతః = ప్రపంచముయొక్క, మహిత్వే = పూజయందు, ఏక ఇత్ = ఒక్కడే అయిన, రాజా=ప్రభువు, బభూవ=ఆయెనో, యః= ఎవ్వడు, అస్య=ఈ బ్రహ్మాండముయొక్క, ద్విపదః=మనుష్యులను, చతుష్పదః=పశ్వాదికమును, ఈశే=శాశించుచున్నాడో, (అట్టి పరమాత్మను ఉపేక్షించి) కస్మై=ఏ, దేవాయ=దేవుని కొఱకు, హవిషా=హవిస్సుగల యజ్ఞముచేత, విధేమ=విధులనుష్ఠింతుము?

య ఆత్మదా బలదా యస్య విశ్వ
ఉపాసతే ప్రశిషం యస్య దేవా,
యస్య ఛాయాఽమృతం యస్య మృత్యుః
కస్మై దేవాయ హవిషా విధేమ॥

యః=ఎవ్వడు, ఆత్మదా=జీవరూపుని ఇచ్చు

చున్నాడో, (యః=ఎవ్వడు) బలదా= అన్నాది పుష్టిని ఇచ్చుచున్నాడో, యస్య= ఎవ్వనియొక్క, ప్రశిషం=ఆజ్ఞను, దేవాః= దేవతలు (మనుష్యులును), ఉపాసతే=ఉపాస నమువలె పవిత్రముగా భావించి పరిపాలించు చున్నారో, యస్య=ఏ పరమేశ్వరుని యొక్క, ఛాయా=నీడ, అమృతం=మోక్ష హేతువగు చున్నదో, యస్య=ఎవని యొక్క (శరణము పొందకపోవుట), మృత్యుః = నరకమునకు హేతువగుచున్నదో, (అట్టి పరమాత్మను విడిచి) కస్మై=ఏ, దేవాయ=దేవుని కొఱకు, హవిషా=హవిస్సుగల యజ్ఞాదికముచేత, విధేమ=విధులననుష్ఠింతుము?

యస్యేమే హిమవన్తో మహిత్వా
యస్య సముద్రగ్ం రసయా సహాఽఽహుః,
యస్యేమాః ప్రదిశో యస్య బాహూ
కస్మై దేవాయ హవిషా విధేమ ॥

ఇమే = ఈ (భూమండలమునందు) కన బడుచున్న, హిమవన్తః = హిమవత్పర్వతము మున్నగు గొప్ప గొప్ప పర్వతములన్నియు, యస్య=ఏ పరమేశ్వరునియొక్క, మహిత్వా= గొప్ప విభూతులో, రసయాసహ = గంగాది సకల నదులతో కూడిన, సముద్రం = సముద్ర మును, యస్య = ఏ పరమాత్మునియొక్క, (మహిత్వా = గొప్ప విభూతిగా) ఆహుః = పలుకుచున్నారో, యస్య = ఏ పరమాత్మకు, ఇమాః=ఈ ప్రాగాదిదిశలు (అవయవములో), యస్య=ఏ పరమాత్మకు, ప్రదిశః=విదిక్కులు, బాహూ=బాహువులో, (అట్టి ప[illegible] గాక) కస్మై = ఏ, దేవాయ దేవునికొఱకు, హవిషా=హవిస్సుగల యజ్ఞముచేత, విధేమ= పరిచర్య ఒనరుము?

యం క్రందసీ అవసా తస్తభానే
అభ్యైక్షేతాం మనసా రేజమానే,
యత్రాధిసూర ఉదితౌ వ్యేతి
కస్మై దేవాయ హవిషా విధేమ ॥

క్రందసీ = (అతివృష్టికిని ఉరుము మెరు పులు మున్నగువానికిని ఆధారభూతములయి, ప్రలయాధారకములగుటచేత ప్రాణులయొక్క) రోదనమునకు హేతుభూతములయినట్టియు, అవసా=రక్షణహేతువగు అన్నమును కలుగ జేయుటచేత, తస్తభానే=జీవులకు స్థితిని కలుగ జేయునవియును, రేజమానే = ప్రకాశించు చున్నవియును అగు ద్యావాపృథ్వులు, మనసా=నిర్మలమగు మనోవృత్తిచేత, యం= ఏ పరమేశ్వరుని, అభ్యైక్షేతాం = అంతట చూచుచున్నవో, యత్ర=ఏ ద్యావాపృథ్వుల యొక్క అంతరాళమునందు, ఉదితః=ఉత్పన్ను డగు, సూరః=సూర్యుడు, ఉదితః=ఉదయించి, అధివ్యేతి = పరిభ్రమించుచున్నాడో, (అట్టి పరమాత్మకంటె భిన్నమైన) కస్మై ఏ దేవాయ=దేవునికొఱకు, హవిషా=హవిర్ద్ర నముగల యజ్ఞముచేత, విధేమ=అర్చింతుము

యేన ద్యౌరుగ్రా పృథివీ చ దృఢే
యేన సువస్తభితం యేన నాకః,
యో అన్తరిక్షే రజసో విమానః
కస్మై దేవాయ హవిషా విధేమ ॥

యేన=ఏ పరమాత్మచేత, ఉగ్రా=క్రూర మైన, ద్యౌ=ఆకాశము, పృథివీ చ=భూమియు, దృఢే=దృఢములుగా చేయబడినవో, యేన= ఏ పరమాత్మచేత, సువః=ఆదిత్యమండలము, స్తభితం=అంతరిక్షమునందు నిరాధారముగా స్థాపింపబడినదో, యేన=ఏ పరమాత్మచేత,

నాకః = పుణ్యఫలోపభోగనిమిత్తము స్వర్గ లోకము నిర్మింపబడినదో, యః=ఏ పరమాత్మ, అంతరిక్షే=భువర్లోకమునందు, రజసః=(వృష్టి రూప) జలముయొక్క, విమానః=నిర్మాణ కర్తయో, (అట్టి పరమాత్మను వదలి) కస్మై= ఏ, దేవాయ=దేవునికొఱకు, హవిషా=హవి ర్దానముగల యజ్ఞముచేత, విధేమ=పరిచర్య నొనర్తుము ?

ఆపో హ యన్మహతీర్విశ్వమాయం
దక్షం దధానా జనయన్తీరగ్నిమ్,
తతో దేవానాం నిరవర్తతాసురేకః
కస్మై దేవాయ హవిషా విధేమ ॥

ఏకః=అద్వితీయుడై నట్టియు, దేవానాం= బ్రహ్మాది దేవతలకు, అసుః=ప్రాణభూతుడై నట్టియు అగు పరమాత్మ, యత్=ఎప్పుడు, (జగత్తును నిర్మాణమొనర్పవలయునని సంక ల్పించెనో) తతః=పిదప, మహతీం = పూజ్య ములయినట్టియు, లేక సముద్రాది రూపము చేత గొప్ప పరిమాణము గలట్టియు, ఆయం= శుభావహమైనట్టియు, దక్షం=సమస్త ప్రాణి ధారణ పోషణ సమర్థమయినట్టియు, విశ్వం= ప్రపంచమును, దధానాః = ధరించుచున్న ట్టియు, అగ్నిం=అగ్నిని, జనయన్తీః=పుట్టించు చున్న, ఆపః=ఉదకములను, నిరవర్తత హ= పుట్టించెనుగదా, (అట్టి పరమాత్మను వదలి) కస్మై = ఏ, దేవాయ = దేవునికొఱకు, హవిషా=హవిస్సుగల యజ్ఞముచేత, విధేమ= విధులననుష్ఠింతుము?

యశ్చిదాపో మహినా పర్యపశ్య
ద్దక్షం దధానా జనయన్తీరగ్నిమ్,
యో దేవేష్వధిదేవ ఏక ఆసీ
త్కస్మై దేవాయ హవిషా విధేమ ॥

చిత్=చిద్రూపుడగు, యః= ఏ పరమే శ్వరుడు, దక్షం=శ్రౌతస్మార్త కర్మానుష్ఠాన మగు, అగ్నిం=అగ్నిని, జనయన్తీః=పుట్టించు చున్నట్టి, ఆపః=ఉదకములను, మహినా= మహిమచేత, పర్యపశ్యత్=సకల జగజ్జీవన సాధనముగా గాంచెనో, యః=ఏ పరమేశ్వ రుడు, దేవేషు=దేవతలందు, అధి = అధికు డగు, ఏకః=ఒక్కడగు, దేవః=దేవుడు, ఆ సీత్=ఆయెనో, (అట్టి పరమేశ్వరుని వినా) కస్మై దేవాయ హవిషా విధేమ=మరే దేవుని కొఱకు హవిస్సుగల యజ్ఞాదికముచేత విధుల ననుష్ఠింతుము?

స్వశక్తిపై నిల్వుడు. మానవులై - ధీరులై - యుండుడు. మనలను ధీరులనొనర్ప గల మతము, ధీరులనొనర్పగల సిద్ధాంతములు, ధీరులనొనర్పగల విద్య - ఇవియే మనకు వలయునవి. శారీరకముగాగాని, మానసికముగాగాని మిమ్ములను బలహీనులను చేయునదేదియైనను దానిని విషమువలె పరిత్యజింపుడు ; దానిలో ప్రాణములేదు, అది సత్యము కాజాలదు. సత్యము బలదాయకమై, వికాసహేతువై, శక్తిసామర్థ్య ప్రదాయకమై యుండును.

# శ్రీరామకృష్ణ కథామృతము

(రెండవ భాగము)

సాయంకాలమయ్యెను.

కీర్తన ముగిసిన పిదప శ్రీరామకృష్ణులు, విజయ్ నరేంద్రాది భక్తులతో కూర్చొనిరి. భక్తులందరూ శ్రీరామకృష్ణుల వైపునసే చూచుచుండిరి. శ్రీరామకృష్ణులు భక్తుల యోగక్షేమములనరయుచుండిరి.

కేదార్ : (చేతులు జోడించి అతి వినయముగ శ్రీరామకృష్ణులతో) తల తిరుగును. ఇదెట్లు నయమగును?

శ్రీరామకృష్ణులు : ఇట్లె నాకు కూడ తల తిరిగెడిది. బాదంనూనె తలకు రాచుకొనుము. బాదం నూనె తలకు రుద్దిన నయమగునని వింటిని.

కేదార్ : అట్లే చేసెదను.

శ్రీరామకృష్ణులు (చున్నీతో) మీరందరెలాగున్నారోయీ!

చున్నీ : అందరు క్షేమమేనండి. బృందావనములో బలరాంబాబు, రాఖాల్ వాళ్ళు కూడ కుశలమే.

లు : నీవు అంత మిఠాయి పంపితివేల?

చున్నీ : బృందావనమునుండి తెచ్చిన ప్రసాదమని...

శ్రీరామకృష్ణులు : (హరీష్‌తో) నీ ఆరోగ్యము సరిగా లేదుకదూ! రెండు దినాలైన పిదపనే అక్కడికి (దక్షిణేశ్వరమునకు) రమ్ము. విశ్రాంతి తీసుకొనక పోయినచో అక్కడికి వచ్చి మరల జబ్బున పడెదవు.

(నారాయణునితో వాత్సల్యముగ) నాయనా! (దక్షిణేశ్వరమునకు) రా. అక్కడనే భోజనం చెయ్యి. (మాస్టరును చూపుచు) ఈయనతోనే రా. (మాస్టరుతో) నీవేమంటావు?

మాస్టరు ఆ రాత్రియే శ్రీరామకృష్ణులతోడ దక్షిణేశ్వరమునకు పోవ నిశ్చయించుకొనెను. అందుచే ఆలోచించుచుండెను.

ఇంతలో సురేంద్రుడు వచ్చి శ్రీరామకృష్ణుల కడ నిల్చెను. సురేంద్రుడు చాలసేపు వరకు రామునింటిలోనే యుండెను. అటుపై తన ఇంటి వరకుపోయి తిరిగివచ్చెను. సురేంద్రుడు మద్య పానలోలుడై యుండెను. అంతకుముందు విపరీతముగా మద్యము సేవించెడివాడు. శ్రీరామకృష్ణులు వాని దుస్థితిచూచి చాల దుఃఖించిరి. మద్యపానము ఆపివేయుమని ఆయన సురేంద్రునకు చెప్పలేదు. అతడట్లు చేయజాలడని కాబోలు- 'చూడు సురేంద్రా! నీవు సేవించు దానిని మొదట దేవికి నివేదించి అటుపై సేవించుము. అట్లైనచో నీతల తిరుగదు. తప్పడడుగులు పడవు దేవిని స్మరించుచుండినచో క్రమేణ నీకు మద్యముపై అభిలాష తగ్గుచుండును. చివరకు దానిపై ఇష్టము కూడ పోవును. దేవి కారణానందదాయిని. ఆమె ప్రసన్నమైనచో సహజానందము కల్గును.' అని చెప్పియుండిరి.

సురేంద్రుడు ప్రక్కనే యుండెను. అతనిని చూచుటతోడనే శ్రీరామకృష్ణులు-నీవు త్రాగితివా? అని అడిగి వెంటనే భావావేశులైరి.

మరల కొంత బాహ్యజ్ఞానము కలుగగనే శ్రీరామకృష్ణులు జగజ్జనని నామస్మరణ చేసిరి. ఆనందముతో ''శివసంగే సదారంగే ఆనందే మగనా'' (శివునితో సర్వదా క్రీడించుచు ఆనందమునవోలలాడు తల్లీ!) అను పాట పాడిరి.

అటుపై శ్రీహరి నామస్మరణ ఆరంభించిరి. ''హరిబోల్-హరిబోల్'' అని భజన చేసిరి. ఆ తరువాత రామ స్మరణ కావించిరి. 'రామా-రామా-రామా'' అని పలుమార్లు స్మరించి ఈ విధముగ ప్రార్థన చేసిరి:- ''ఓ రామచంద్రా! నేను భజన విహీనుడను-సాధన విహీనుడను-జ్ఞాన విహీనుడను-భక్తి విహీనుడను-క్రియావిహీనుడను. ఓ రామచంద్రా! నిన్నే శరణుజొచ్చితిని. ప్రభూ! దేహ సుఖముల నీకడ కోరుటలేదు. దేవా! లోక మర్యాదలు కూడ కోరుటలేదు. అష్టసిద్ధులు ప్రసాదించుమని అడుగుటలేదు. శతసిద్ధులైనను అక్కరలేదు! నీ శరణాగతుడను- నీ శరణగతుడనే!

రామా! తండ్రీ! నీ పాదకమలములపై శుద్ధ భక్తి కలుగునట్లనుగ్రహింపుము. రామచంద్రా! నీ విశ్వమోహినియగు మాయలో పడకుండునట్లుగ కాపాడుము. ఓ రామచంద్రా! నీవే శరణు నీవే శరణు.''

శ్రీరామకృష్ణులీవిధముగ ప్రార్థన సల్పుచుండ అచ్చటనున్న వారందరూ ఆయననే చూచుచుండిరి. అతిదీనము కరుణాపూరితము నగు ప్రార్థన వినుచుండ అందరకు కన్నీళ్ళు కారుచుండెను.

## అధ్యాయము-17

### దక్షిణేశ్వరమున మహార్నవమి పండుగరోజు భక్తులతో శ్రీరామకృష్ణులు

1884 29వ తేది సోమవారము మహార్నవమి పండుగ. వేకువఝాముననే కాళికాలయమున ప్రభాతభేరి మ్రోగెను. మేల్కొలుపు పాటలు మేళగాండ్లు పాడుచుండిరి. దేవి ఆలయమున మేల్కొలుపులు, సుప్రభాతపు సేవలు ముగిసెను. ఇంకను చీకటి వదలలేదు. తోట మాలీలు, పూజారులు బుట్టలు తట్టలు చేత బట్టుకొని త్వరత్వరగ పుష్పములు కోయుచుండిరి.

శ్రీరామకృష్ణులు వేకువనే లేచిరి. భవనాథ్, బాబూరాం, నిరంజన్, మాస్టరు మున్నగువారు ముందటిదినము రాత్రినుండియే శ్రీరామకృష్ణులకడనుండిరి. భక్తులు వరండాలో నిద్రించిరి. లేచి చూచుసరికి శ్రీరామకృష్ణులు-''జయ జయ దుర్గే'' యని పల్కుచు భావోన్మత్తులై నృత్యము చేయుచుండిరి. కట్టుకొన్న వస్త్రము జారిపోయెను. పసిబాలునివలె జగజ్జనని నామస్మరణ చేయుచు గదిలో నృత్యము చేయుచు తిరుగుచుండిరి. కొంతసేపు తరువాత ''సహజానందం, సహజానందం'' అనిరి. అటుపై ''గోవిందా! గోవిందా!'' అని స్మరించి మరల ''ప్రాణహే గోవింద మమ'' అనిరి.

భక్తులు లేచి కాలకృత్యములు చేసివచ్చిన పిదప శ్రీరామకృష్ణులు భక్తులతోబాటు వరండాలో చాపపై కూర్చొనిరి. భవనాథ్, మాస్టరు దగ్గరనే యుండిరి.

శ్రీరామకృష్ణులు: (భవనాథ్‌తో) మానవునకు భగవద్విశ్వాసము కలుగుట చాల కష్టము. కాని ఈశ్వరకోటికి చెందిన మహానుభావులకు పుట్టుకతోడనే భగవద్విశ్వాసముండును.

ప్రహ్లాదుడు చిన్నప్పుడు గుణింతము నేర్చుకొనునపుడు 'కృ' వ్రాయమనిన 'కృష్ణుడు' జ్ఞప్తికివచ్చి విలపింప మొదలిడెను. సామాన్యులది సంశయాత్మకమగు బుద్ధి. ఆ సందేహములు సులభముగపోవు. ఇంతెందుకు - హాజరాను చూడండి. బ్రహ్మ శక్తి ఒక్కటే-వేఱు

కాదు అని వెయ్యిసార్లు చెప్పినా నమ్మడు. సృష్టిస్థితి ప్రళయముల చేయుచున్నతరి 'శక్తి' అనియు, నిష్క్రియుడైయున్నప్పుడు 'బ్రహ్మ' యనియు వ్యవహరింతురు. రెండును అభిన్నములు. అగ్ని అనగానే దానికిగల మండించు శక్తి జ్ఞప్తికి వచ్చును. అట్లే మండించుశక్తి అనగా అగ్ని గుర్తుకు వచ్చును. ఒకదాన్ని విడిచి ఇంకొకదానిని ప్రత్యేకముగ ఆలోచింపజాలము.

నేనొకదినము తల్లిని ప్రార్థించితిని :— 'తల్లీ! ఇచ్చట ఉపదేశముల తారుమారు చేయుటయే హాజరా కోర్కె. మొండి వాదములకు దిగును, వానికి బుద్ధి చెప్పుము లేదా ఇక్కడనుంచి పంపివేయుము.' మరునాడు అతడు నా వద్దకువచ్చి 'నీవు చెప్పునది ఒప్పుకొందును.' అనెను.

భవదాథ్ : (నవ్వుచూ) హాజరా తలతిక్కమాటలు మీ కంత కష్టం కలిగించిందా?

శ్రీ రామకృష్ణులు : నా స్వభావ మెప్పుడో మారిపోయినది. నే నితరులతో వాదనలకు దిగలేను. బాబోయీ! హాజరాతో ఎవ్వరు వాదులాడగలరు! నావల్ల కాదు. సరి ఆ సంగతట్లుండనీ. దేనిని జ్ఞానము దేనిని అజ్ఞానమందురో తెలియునా? భవవంతుడు ఎక్కడో దూరములో కలడు అని తలంచుటయే అజ్ఞానము. భగవంతుడు సర్వత్ర కలడని తలంచుటయే జ్ఞానము.

యథార్థజ్ఞానము కలిగినచో అన్ని రూపములు చిత్ రూపములుగ అగపడును. పసివాండ్రను గమనించితిరా? వా రన్నిటిని ప్రాణము గలవిగా భావింతురు. నేను కామార్పుకూరులో నుండగ శిబుతో (శ్రీ రామకృష్ణుల అన్న కుమారుడు. పూర్తిపేరు శివరాం) మాట్లాడు చుండెడివాడను. అతడప్పుడు నాలుగు సంవత్సరముల బిడ్డడు. ఆకాశములో ఉరుములు, మెరుపులు చూచి నాతో "చిన్నాన్నా! చిన్నాన్నా! చూచావా? ఆకాశముమీద చెకుముకిరాళ్ళు కొట్టుచున్నారు. వచ్చి చూడు" అనెడివాడు.

ఒకనాడు వాడు చెట్టుపై మిడుతను పట్టుకోవడానికి ప్రయత్నించినాడు. గాలికి ఆకులు గలగల లాడినవి. వాడు వెంటనే పెదవిపై చూపుడువ్రేలుపెట్టి ఆకులనుద్దేశించి "ఉష్! మీ రిట్లు చప్పుడు చేయకూడదు. మిడుత పారిపోతుంది. తరువాత నేను దాన్ని పట్టుకోలేను" అన్నాడు. చిన్న పిల్లలకు అంతయు చైతన్యమయముగా నమ్మకమున్నట్లనే మనకును నమ్మకముండవలెను. అట్లు లేనిచో భగవంతుని పొందజాలము.

—సశేషము.

మతమునుగూర్చి ఎన్నడును వాదులాడకుము. మతసంబంధమగు వాదోపవాదములన్నియు పారమార్థికశీలము లేదనియే తెలుపును. మతవివాదములెప్పుడును గుంజును విడిచి తొక్కకే సంబంధించునట్టివి. పవిత్రతయు పారమార్థికతయు పలాయనమై హృదయము శుష్కమైపోయినపుడే వివాదములు ఆరంభమగును, అంతకు ముందుగాదు.

# మానధనుడు

బద్వేలి రమేష్

–"ఇక నాకు చేతకాదు. ఈ పిల్లలు, వీళ్ళ ఆకలి చూపులు, ఎండిన డొక్కల ఏడ్పులు వింటూ భరించలేను. ఎన్నాళ్లు ఇలా జీవించగలను. గుండె తరుక్కుపోయే ఈ దీనరాత ఏ పగవాడికీ వద్దు భగవంతుడా!" ఆమె కంఠం రుద్ధమయింది, మాటరాలేదు.

కుచేలుడు కళ్ళుమూసుకొన్నాడు వినలేనంటూ.

"ఇలా కూచుంటే ఎలాగండి? దీనికి పరిష్కారమే లేదా?" కన్నీళ్లు తుడుచుకొంటూ అడిగింది.

ఏం చెప్పగలడు కుచేలుడు? తనకు తోచిన రీతిలో గింజలు తెచ్చి పడవేస్తున్నాడు. తన సంపాదనకు ఈ కుటుంబానికి అంచులు కలియవు. తామరఆకు మీద నీటి బొట్టులాగా తాను జీవిస్తున్నా ఈ సంసారం, ఈ దారిద్ర్యం తనను నెమ్మదిగా కూర్చోనివ్వగలదా? అదే యోచిస్తున్నాడు.

"మాట్లాడరేం?" కోపాన్ని దిగమ్రింగుకొంటూ అంది.

"ఏది దారి?"– అన్నాడు మెల్లగా.

"మీరేమనుకోకపోతే ఒక సంగతి చెబుతాను. మీ స్నేహితుడు దయాళువైన కృష్ణుడున్నాడు కదా? ఒకసారి వెళ్ళివస్తే..."

ఆమె ఆంతర్యం అర్థమైంది, కృష్ణుని వద్దకు సహాయం చెయ్యమని అడగాలి కాబోలు. కుచేలుడు నిట్టూర్చాడు.

"మీరు ఉదాసీనం కనబరిస్తే మన కర్మ తెగలేదనుకొంటాను." ఆమె ఎంతో మామూలుగా అన్నా నిష్ఠూరంగానే కన్పించింది కుచేలునికి.

ఆమెను తేరిపార చూశాడు. ఆమె చూపుల్ను ప్రక్కకు మరల్చేటప్పుడు కన్నీళ్లు జలజలా రాలాయి. కుచేలునికి గుండె పిండివేసినట్లయింది.

"వెళ్ళమని అంటున్నావు. చిన్ననాటి స్నేహితునికి కనీసం చిన్న కానుకయినా పట్టుకెళ్లకపోతే ఏం బాగుంటుంది? ద్వారపాలకులకు ఏమైనా ఇవ్వాలన్నా చిల్లరకాసులూ లేవు."

నేలవేపు చూస్తూ కుచేలుడు అన్నమాటలకు మెల్లగా నిట్టూర్చి ఆమె లోపలికి వెళ్ళి వెంటనే వచ్చింది.

"ఏమిటి?"

"అటుకులు, చేరెడన్ని ఉన్నాయి. ఉన్నంతలో ఇస్తే భగవంతుడు సంతోషంగా స్వీకరిస్తాడు. నాకెంతో నమ్మకం ఉంది. ఈ చీకటి ఇక ఎంతోకాలం ఉండదని." మూటగా కట్టి భర్తచేతికి అందిస్తూ అతన్ని చూసింది. కుచేలుడు మౌనంగా అందుకొని– "దేవుని దయ ఎలా ఉందో?"నని నిట్టూర్చాడు,

## 2

ఇష్టసఖుల మధ్యన ఉన్న కృష్ణుని చూడగానే కుచేలుని కళ్లు నీటితో నిండిపోయాయి. కుచేలుని చూసిన కృష్ణుడు తటాలన లేచి ఆదరంగా అతని చేతులు పట్టుకొని ప్రేమగా నొక్కాడు.

"కృష్ణా!"– కుచేలునికి మాటరాలేదు. కుశలప్రశ్నలు వేస్తూ ఆదరణ చేస్తున్న కృష్ణుణ్ణి మౌనంగా చూస్తున్నాడు. చక్కని విందు ఆరగించి కృష్ణుని తల్పంపై కుచేలుడు కూర్చుంటూ స్నేహితుణ్ణి చూశాడు. కృష్ణుని

చెలిమి ఎంత తీయనిది! నిజంగా తన బ్రతుకు ధన్యం!...

వారిద్దరూ చాలాసేపు చిన్ననాటి ముచ్చట్లను చెప్పుకొన్నారు.

"నీకు గుర్తుందా కుచేలా! గురుపత్ని వంట చేయడానికి కట్టెలు లేవంటే మనమిద్దరం అడవిలోకి వెళ్ళాం. ఆ దట్టమయిన అడవిలో దారి తప్పి ఆ దిక్కుతోచని స్థితి. ఒకవేపు మబ్బులు నింగిలో ముసురుకొన్నాయి. చిటికెలో ఎడాపెడా వర్షం కురువనారంభించింది. మనమిద్దరం ఒకర్నొకరు పట్టుకొని ఆ రాత్రి ఎంతభయంగా దొర్లించాం," అంటూ కృష్ణుడడుగుతూంటే కుచేలుడు గుర్తుతెచ్చుకొన్నట్లుగా చూస్తూ ఔనన్నట్లు తలూపాడు.

"అవును కృష్ణా, మళ్ళీ ఉదయం గురువు సాందీపులు వచ్చి పరామర్శించినపుడుగాని భయంపోలేదు."

కృష్ణుడు నవ్వుతూ అన్నాడు.

"ఆ రోజులు మళ్ళీ రావు." తన సాహసాల్ని చిలిపితనాలను తలచుకొంటూ నిట్టూర్చాడు కృష్ణుడు.

కుచేలునికి మాత్రం - చక్కని తలకట్టు, నుదుట కస్తూరి తిలకం, మనోహరమైన కళ్లు, చిరునవ్వుల రూపం- ఆ గోపికాలోలుణ్ణి చూడడమే ఆనందంగా ఉంది. ఇలా చూస్తూ ఉంటే ఎంత ఆనందంగా ఉంది! ఈ క్షణంలో తన ప్రాణాలు పోయినా ఫరవాలేదు! ...

ఆ రాత్రి చక్కని విందు ఆరగించి మురళీ గానం విని నిద్రలోకి జారాడు కుచేలుడు.

ఎవరో పిలిచినట్లుగా కనులు విప్పాడు కుచేలుడు. ద్వారం వద్ద నిల్చున్న కృష్ణున్ని చూసి తటాలున లేచాడు.

"నువ్వింకా నిద్రపోలేదా కృష్ణా!"

"నాకింకా చిన్ననాటి ముచ్చట్లు ముచ్చటించుకోవాలని ఉంది" అన్నాడు.

"మన గురువు...ఆ చదువు...ఆరోజులు" ఆ అనుభూతిని చిందించాడు కృష్ణుడు.

"సర్వమూ నీవేకదా కృష్ణా, నీమాటలూ చేతలూ నాకు అర్థం కావడంలేదు.

కృష్ణుడు ఫక్కున నవ్వి, 'ఐతే ఈ గురువుకు కానుక ఏమయినా తెచ్చావా?" అన్నాడు.

కుచేలుడు, అభిమానంగా తలవంచుకొన్నాడు. తల్పం మీద తలగడ చెంతన ఉన్న అటుకులమూట సర్వాంతర్యామియైన కృష్ణుణ్ణి ఆకర్షించింది.

'అవి'

"అ-టు-కు-లు" గొణిగాడు.

కుచేలునికి ఏడ్పు ఒక్కటే తక్కువైంది. తన మిత్రుడికిచ్చే కానుక ఇదా? అని లోలోన వాపోయాడు, కుమిలిపోయాడు.

"అటుకులు నాకెంతో ఇష్టం." స్వగతంగా అనుకొంటూ మూటవిప్పి గుప్పెడన్ని నోట వేసుకొన్నాడు. అవి నములుతూ చాల బాగున్నవి అన్నాడు. మరో గుప్పెడు పోసుకోబోతూ నవ్వి ఊరకున్నాడు.

కుచేలుడు వింతగా చూశాడు.

"మీా చెల్లెలు రుక్మిణికి నా ఆరోగ్యం పట్ల అమితమైన జాగ్రత్త. అంతే...చాలు నీవు ప్రేమతో తెచ్చినదేయినా నాకు ఎంతో తృప్తినిస్తుంది." కృష్ణుని ముఖంలో తాండవిస్తున్న ఆనందాన్ని తదేకంగా చూస్తూండిపోయాడు కుచేలుడు.

రెండుమూడు రోజులు దొర్లిపోయాయి. కుచేలుడు తన ఇంటి పరిస్థితిని స్నేహితునితో వివరించనేలేదు. కృష్ణుడూ అడుగలేదు. మరు

సటి దినం కుచేలుడు ఇంటికి ప్రయాణం కడు తూంటే కృష్ణుడు ఆనందంగా వీడ్కోలిచ్చాడు.

## 3

కుచేలుడు తాను పొందిన ఆనందమే పెన్నిధిగా తోచసాగింది. దీనిముందు తన పరిస్థితి, కుటుంబం, అల్పంగా కన్పించసాగింది. అయినా తన భార్య ఈ వట్టి చేతులతో రావడం చూసి మండిపడుతుంది. బాధపడుతుంది. ఏది దారి అనుకొంటూ ఇంటిముఖం పట్టాడు.

కృష్ణుడు తన చెలిమిని మరువలేదు. ఇంతకన్నా తనకేం కావాలి! ఈ అనుభూతి తన భార్యకు తృప్తినిస్తుందా? సందేహంగా ఊరును చేరుకొన్నాడు.

తన ఇల్లు మునుపటిలా కళాహీనంగా లేదు. ఎంతో వినూత్నంగా ఉంది. ఆశ్చర్యంగా నిల్చుండి పోయాడు కుచేలుడు. లోపలనుండి కుచేలుని భార్య కోటికాంతులను కళ్లల్లో చిమ్మిస్తూ వచ్చి భర్తచేతిని ప్రేమగా స్పర్శించింది.

'భగవంతుని దయ అపారం'- ఇద్దరూ ఒకేసారి అనుకొన్నారు. నవ్వుకొన్నారు ఆనందంగా.

"భగవంతుడు ఇవ్వాలనుకొన్నప్పుడు చెప్పకనే ఇస్తాడు. తీసుకోవాలనుకొన్నప్పుడు చెప్పకనే తీసుకొంటాడు." అంటూ తను వెళ్లినరీతి, జరిగింది అంతా పూసగుచ్చి వివరించాడు కుచేలుడు.

"ఆ భగవంతుని వద్ద కూడా మీరు అభిమానంగా ప్రవర్తించారా?" ఆశ్చర్యం, కోపం మిళితమైన కఠంతో, ఆమె అంది.

"మానధనమే-ధనము. అందుకే భగవంతునికి ఇంత ఉదారం హటాత్తుగా కల్గింది" మనసులో అనుకొంటూ భార్యను ప్రేమగా చూశాడా మానధనుడు కుచేలుడు.

---

పంద్రెండేండ్ల స్ఖలిత బ్రహ్మచర్యమును పరిపాలించువానికి అపూర్వ శక్తి సామర్థ్యములు లభించును. సంపూర్ణ బ్రహ్మచర్యము మహాధీశక్తిని విశేషాధ్యాత్మిక ప్రభావమును చేకూర్చును. కామము నిగ్రహింపబడినచో, మహోత్తమ ఫలప్రదాయకమై యొప్పును. కామశక్తిని ఆధ్యాత్మికశక్తిగా పరిణమింపజేయుడు. ఈ శక్తి బలీయమైన కొలదియు ఘనతర కార్యములను సాధింపనగును. బ్రహ్మచర్యము లోపించుటయే మానవుని పతనమునకు కారణము. అవిచ్ఛిన్న బ్రహ్మచర్య పరిపాలనమున సమస్తజ్ఞానము అత్యల్పకాలముననే మన వశము కాగలదు. దేనినైనను ఒక్కసారి వినినంతనే లేక చదివినంతనే మఱచిపోకుండునట్టి ఏకసంధా గ్రహణశక్తి బ్రహ్మచర్యము వలననే లభించును. అకలంకమైన మనస్సు అద్భుత శక్తిమంతమును, మహాసంకల్ప బలాన్వితమునై శోభించును. బ్రహ్మచర్యము లేనిదే అధ్యాత్మికబలము కలుగజాలదు. బ్రహ్మచర్యము అద్భుతమానవ వశీకరణ సామర్థ్యమును చేకూర్చును. విశేష బ్రహ్మచర్యము అవలంబించినవారే లోకమున ఆధ్యాత్మిక నాయకులై విలసిల్లుచున్నారు— అదియే వారి శక్తిసామర్థ్యమునందలి రహస్యము.

# యోగీశ్వరి

శ్రీమతి భువనగిరి ల

యోగీశ్వరి అనునామె వంగదేశమున యశోహర జిల్లాలో జన్మించిన బ్రాహ్మణి. ఈమె మంత్రశాస్త్రమునందును వైష్ణవభక్తి శాస్త్రమునందును విజ్ఞానఖని. మహాపండితురాలు. కాషాయాంబరధారిణి. తాంత్రిక సాధనలో నారితేరిన యోగిని. ఆమె ముగ్గురకు తాను యోగసాధనలో సహాయపడవలెనని యోగదృష్టిలో తెలుసుకొనెను. తూర్పు వంగదేశంలో 'చంద్ర'-'గిరిజ' అను వారలకిద్దరికిదివరకే సహాయపడెను. మూడవవాడు గంగాతీరంలో ఉన్నాడని తెలుసుకొని తీరాలన్నీ వెదకుచు చివరకు దక్షిణేశ్వరం వచ్చి గంగానది నుండి పడవదిగి ఆలయం వైపు వచ్చుచుండెను.

అది ప్రాతఃకాలము. శ్రీరామకృష్ణుడు పువ్వులు కోయుచున్నాడు. చేతితో సంచీని పట్టుకొని ఆలయంవైపు వచ్చునామెను చూచాడు. స్వచ్ఛమై తేజోవంతమైన ఆకారము. విరియబోసిన జుత్తు. కాషాయాంబరము. ఆయన అలౌకికమైన ఆకర్షణతో ఆమెవైపు చూచుచుండగనే ఆమె దేవళము ప్రవేశించెను. రామకృష్ణుని చూడగనే ఆమె ఆనంద బాష్పములు రాల్చుచు ఆశ్చర్యానురాగాలతో "నాయనా! నీవిక్కడున్నావా! నీకోసం ఎంతో కాలాన్నుండి తీరాలన్నీ వెదుకుచున్నాను. ఇప్పటికి నిన్ను చూశాను." అనగా రామకృష్ణుడు "అమ్మా! నీవెవ్వరవు? నా కొఱకెందులకు వెదకుచున్నావు? నేనిక్కడున్నానని నీకెలా తెలిసింది" అని ప్రశ్నింపనామె "బాబూ! నా పేరు యోగీశ్వరి. నీవు గంగాతీరంలో ఉన్నావని జగదంబ చెప్పింది. యోగసాధనలో ముగ్గురకు సాయముచేయవలెనని ఆమె ఆజ్ఞ. ఇద్దరనిదివరకే కలుసుకొని సాధనలిచ్చితిని. ఇప్పుడు నిన్ను కలుసుకొన్నాను." అని ఊరకున్నది.

రామకృష్ణుడు ఆనందపరవశుడై ఎడబాసిన తల్లిని కలుసుకొన్న బిడ్డవలె ఆమెకు దగ్గరగా కూర్చుండి ఆప్యాయంగా తన సాధన రహస్యాలన్నీ చెప్పెను. తాను పడుచున్న అలజడలు చెప్పి "అమ్మా! నేను జగన్మాతకు నా సర్వస్వము నర్పించాను. నా జీవితం అయోమయంగా ఉన్నది. ఏదో శక్తి నన్నావహించి నాచేత కఠోర సాధనలను చేయిస్తోంది. చేయలేను-మాన లేను. ఒక్కొక్కపుడు నా గొంతు ఎవ్వరో నులుమునట్లుండును. మరియొకప్పుడు మహదానందము. నన్ను పిచ్చివాడంటున్నారు. అమ్మా! నేను నిజంగా పిచ్చివాడినేనా? జగన్మాతనహర్నిశాలూ సేవించినందులకిదా ఫలితం! చెప్పుతల్లీ! నేను నిజంగా పిచ్చివాడినా?" యోగిని వాని కథంతా విన్నది. మాతృవాత్సల్యంతో "నాయనా! నీవు పిచ్చివాడవని ఎవరన్నారు? ఇవి పిచ్చి లక్షణాలు కావు. శాస్త్రంలో దీనిని 'మహాభావం' అంటారు. ఆ దివ్యభావనచే నీకీ లక్షణాలు కలుగుచున్నాయి. మహాభావమనగా పందొమ్మిది భక్తిభావాలు ఒకే వ్యక్తియందు వ్యక్తమగుటయే (మహాభావము). ఇందులో ఒక్క భావన పొందుటకు ఒక్క జీవితం కూడా చాలదు. ఇట్టి మహాభావము పూర్వము చైతన్య ప్రభువునకు గలిగినది. ఈ భావాలన్నీ భక్తి శాస్త్రంలో చెప్పబడ్డాయి. ఆ గ్రంథాలు నా దగ్గరున్నాయి. బాబూ! భగవత్ప్రాప్తికై పరితపించే వారి భావాలన్నీ పొందవలసినవే. ఈ స్థితులన్నీ దాటవలెను" అనెను. ఆ మాటలు విన్నాడు రామకృష్ణుడు. ధైర్యం గల్గి ఉత్సాహవంతుడయ్యాడు.

కొంతసేపటికి ఆ బ్రాహ్మణి భిక్షాటనం చేసుకొని తెచ్చిన బియ్యం వండి ఆ వంటకమును తన ప్రతీకమైన సాలగ్రామమువద్దనుంచి, తాను దానిని పూజించి ధ్యాననిమగ్నయయ్యెను. అంతలో రామకృష్ణు డానందబాష్పములు చెక్కిళ్లనుండి జారుచుండ అర్ధబాహ్యప్రజ్ఞతో వచ్చి ఆ అన్నమును భుజించుచుండెను. కొంత సేపటికామె కన్నులు తెరచి వాని చర్య చూచి పులకితగాత్రయై ''ఆహా! నేటికి నా పూజ ఫలించెను. ధన్యురాలను'' అని సంతోషముతోనా భుక్తశేషమును తాను మహాప్రసాదముగా భుజించెను. ఆసాలగ్రామమును గంగలో విడిచెను.

బ్రాహ్మణీ రామకృష్ణుల సంబంధము మాతా పుత్ర సంబంధము. ఆమె వానిని గోపాలునిగ భావించి మిఠాయిలను వెన్నను తెచ్చి వానికి తినిపించును. ఆమె పగలంతయు రామకృష్ణునితో కలిసియుండి రాత్రికి రెండు మైళ్లదూరమున నున్న దేవమండపఘట్టమునకు పోవును. కొన్నాళ్లు ఆమె అచ్చటనే గడిపెను. ఆ సమయములో రామకృష్ణునకు శరీమున మంటలు బయలుదేరెను. ఎన్ని వైద్యములు చేసినను ఆ మంటలు తగ్గలేదు. నీటియందు కూర్చుండువాడు. తగ్గలేదు. బ్రాహ్మణి వానితో ''నాయనా! ఈ మంటలు భగవత్పరితాపమువల్ల కలిగినవి. ఇట్టిబాధ రాధాదేవికి కలిగినది. దీనిని నేను కుదర్పగలను'' అని చెప్పి సుగంధద్రవ్యములు పుష్పమాలలు తెప్పించి వానిని ధరింపజేసెను. మూడు దినములకా బాధ తగ్గెను. మరల ఇంకొక జబ్బు. ఎంత తిన్నను ఆకలితీరదు. ఈ జబ్బు కూడా ఆమెయే కుదిర్చెను. మధురబాబుతో చెప్పి మిఠాయిలు మొదలగు పదార్థములు చాలా తెప్పించి ఒక గదిలోనుంచి 'కావలసినప్పుడు తినుము'ని రామకృష్ణునికి చెప్పెను. ఆతడట్లు చేయగా నా జబ్బు శాంతించెను. ఇట్టి వెన్నియో కలిగెను. ఆమె వానికి వెజ్జు అయ్యెను.

ఆ బ్రాహ్మణి పరమహంసను పూర్తిగా నర్థము చేసుకొనెను. ఇతడు సామాన్య మానవుడు కాడనియు, మానవోద్ధరణకవతరించిన భగవానుడనియు, వీనివల్ల లోకమున మహత్కార్యములు కలుగనున్నవనియు గ్రహించిన విషయమును దక్షిణేశ్వరమున నేగాక మధురునితో కూడ దెల్పెను. 'పిచ్చి పూజారి భగవంతుడా' అని కోవెలలో నవ్వుకొనుచుండిరి. 'రామకృష్ణుని పూజా విధిలోని చర్యలు చూచుచు, భక్తియో, పిచ్చియో తెలియక సంశయాందోళిత మనస్కుడైన మధురబాబునకు నిజస్థితి తెలుసుకొనవలెనని తోచెను. మధురునితో బ్రాహ్మణి 'పండిత సభ నేర్పాటు చేయుమనియు, వారి సమక్షమున నీతడు అవతార పురుషుడని శాస్త్ర యుక్తముగ ఋజువు చేసెద'నవియు చెప్పెను. మధురుడు పండితుల పిలిపించి సభనొకదానినేర్పరుప నిశ్చయించెను. బాల హృదయుడగు రామకృష్ణుడా సభకొఱకునాత్రము చూపుచుండెను.

ఆ కాలమున వంగదేశమున సుప్రసిద్ధ పండితు లిరువురు కలరు. వారెవ్వరన వైష్ణవ భక్తాగ్రేసరుడైన వైష్ణవచరణుడను వాడొకడు. ఈతడు వైష్ణవసమాజమునకు నాయకుడు. ఈతడు మహాపండితుడు. రెండవవాడు గౌరీకాంతతర్కభూషణుడు. ఈతడు సాధనసంపన్నుడు. దుర్గపూజా సమయమున నీతడు మూడున్నర మణుగుల సమిధలను ఎడమచేతిలో నుంచుకొని కుడిచేతితో నిప్పు ముట్టించి అందు హోమము చేయునట! హోమము పూర్తియగువరకు నాచేయి నట్లే

యుంచువాడట! మరియు నెవ్వారైనను తనతో వాదమునకు వచ్చినచో శంకరాచార్య కృత దేవీస్తోత్రమును బీజాక్షరములతో గట్టిగా చదివి జబ్బకొట్టి కూర్చుండి వాదన ప్రారంభించినచో నాయన నెవ్వారును ఎదిరింపలేరట! ఇట్టి పండితులే పరీక్షాధికారులు. సభ నాట్య మందిరమున నేర్పాటుచేసిరి. అనేకమంది పండితులతోను చూడవచ్చిన జనముతోను సభాభవనము నిండియుండెను. మధురబాబు ప్రక్కన గౌరీకాంతతర్కభూషణుడాసీను డయ్యెను. శ్రీ రామకృష్ణుడు కోవెలలోనికి జని కాళీమాతకు నమస్కరించి యామె యాజ్ఞ గొని దివ్యభావపరవశుడై బయటకు వచ్చుచుండెను. వైష్ణవచరణుడదే సమయమున భవనమును ప్రవేశించుచు రామకృష్ణునకు సాష్టాంగ నమస్కారము చేసెను. భావసమాధిలోనున్న పరమహంస వాని భుజముపై నధిరోహించెను. వైష్ణవచరణుడంత భక్త్యావేశపరవశుడై ఆశువుగా కొన్ని శ్లోకములు చదివి రామకృష్ణుని స్తోత్రము చేసెను. ఈ దృశ్యము సభాసదులను అద్భుత పారవశ్యుల చేసెను. కొంతసేపటికి శ్రీ రామకృష్ణుడు మధురబాబు ప్రక్కకువచ్చి కూర్చుండెను. సభ ప్రారంభమయ్యెను.

భైరవిబ్రాహ్మణి సభామధ్యమున నిలిచెను కాషాయాంబరధారిణి. జ్ఞాన తేజోవిరాజితమైన ముఖము. పాండిత్య ప్రజ్ఞా శౌండీర్యము తెల్పు గంభీరస్వరముతో నిట్లుపన్యసించెను. "సభాసదులకును పండితోత్తములకును నా నమస్కృతులు. నేడీసభ పరమహంసయగు శ్రీ రామకృష్ణుని యవతార నిర్ణయమునకేర్పాటు చేయబడ్డది. శాస్త్రమునవతార పురుషుల లక్షణము లిట్లు చెప్పబడెను. ఎవ్వాని యందు ఊర్జితభక్తి వ్యక్తమగునో; ఎవ్వాడు భగవంతునికొఱకు ఉన్మత్తుడై విలపించునో; ఎవ్వానియొక్క తేజశ్శక్తులు విశేషముగా వ్యాపించునో; అతడవతారపురుషుడని భక్తి శాస్త్రమున చెప్పబడెను. ఈ శాస్త్రముననే, ఇట్టి భక్తిభావములు పందొమ్మిది యున్నచో మహాభావమనబడును. ఇట్టి మహాభావము చైతన్యప్రభువునకు ఉండెను. ఈ పరమహంస యందు చైతన్యప్రభువు నాకు సాక్షాత్కరించెను. అమానిత్వాది జ్ఞానలక్షణములీ మహాత్ముని యందు సహజ సిద్ధములు. మరియు యోగసమాధులతోనే వీని జన్మము. ఈతడు సర్వాంతర్యామినియు సచ్చిదానంద రూపిణియు సకల సృష్టి స్థితిలయకారిణియునగు జగన్మాతకు ముద్దుబిడ్డడు. వీనియందనేక దివ్యమహిమ లున్నవి." అని తాను చూచిన విషయములు శాస్త్రయుక్తులచే క్రోడీకరించి చెప్పెను. ఇతడు సాక్షాత్తు భగవదవతారమనియు లోక కళ్యాణమునకావిర్భవించెననియు అఖండ ధైర్యముతో అప్రతిహత యుక్తులచే ప్రకటించెను.

మధురుడు మున్నగువారీ ప్రకటన విని నిశ్చేష్టులైరి. వైష్ణవచరణుడు లేచి యోగినితో "అమ్మా! నీ ప్రకటనతో నేనేకీభవించుచున్నాను. ఇందు సందేహమునకు తావు లేద"నెను. చర్చకు కారణభూతుడగు రామకృష్ణపరమహంస తనకేమియునిందు సంబంధము లేనట్లు చిద్విలాసముగానుండెను. తర్వాత ఆ పండితులు లేచి రామకృష్ణ దేవునకు నమస్కరించిరి. ఆయన శశిధరునితో "వీరు నన్ను అవతారమనుచున్నారు. అది ఎట్లా?" అనగా శశిధరుడు "మిమ్మల వారు అవతారమే అన్నారు. అది చాలా తక్కువ. ఎవ్వాని అంశచే ప్రతి యుగమునందు లోక కళ్యాణార్థము అవతారములు ఆవిర్భవించు

చున్నవో, ఎవ్వని శక్తిచే అవతారకార్యములు సాధింపబడుచున్నవో; అట్టి పరమాత్మయే మీరని నా ఊహ. అది ఊహ మాత్రమే. మీరిట్టివారని ఎవ్వరు తెలుసుకొనగలరు? పరమాత్మను తెలుసుకొనుటకు వాక్కు మనసులతో బయలుదేరి వెళ్లి తెలుసుకొనలేకయే తిరిగి వచ్చును. "యతోవాచో నివర్తంతే అప్రాప్య మనసా సహ." రామకృష్ణుడంత నవ్వుతో "ఓహో! నీవు వారిని తలదన్నినట్లున్నావు. మీ రందరును చెప్పిన మాటలను నమ్ముచున్నాను. నాకేమీ తెలియదు" అని పలికి యూరకుండెను. సభ ముగిసెను. శ్రీరామకృష్ణ భగవదవతారముగా ప్రకటించిన బ్రాహ్మణి పుణ్యురాలు. భగవంతునకు గురువై తాంత్రిక సాధన తెల్పిన యోగిని మాన్యురాలు. ఆరు సంవత్సరములు భగవంతుడగు పరమహంసతో కలసిమెలసి మాతృవాత్సల్యముతో ఆనందించిన భైరవి బ్రాహ్మణి ధన్యురాలు.

## ఓ జగన్నటరాజ!!

నటరాజ! నటరాజ!!
ఓ జగన్నట రాజ!
నటియించి మా యెదల
ఘటియించు చిత్కళల॥

నీ చరణ విన్యాస
నృత్యభంగిమలందు
గోచరించును మాకు
ఆచరణ మార్గమ్ము॥ నటరాజ

నీవు తాండవ మాడ
దేవి లాస్యము సేయ
పారవశ్యమ్ములో
తారాడు భావాలు॥ నటరాజ

నీ కృపాదృష్టిచే
ఈ కళారాధకులు
లోకముల మేల్కొల్ప
చేకూరు మోదమ్ము॥ నటరాజ

నవరసమ్ములతోడ
నవగతుల నొనగూర్చి
నవనవోన్మేషంపు
జీవనము సమకూర్చు॥ నటరాజ

అందుకో మా హృదయ
దివ్య నీరాజనము;
అందిమ్ము నీ హృదయ
సౌందర్య భాండమ్ము॥ నటరాజ

జయము జయము నాట్యకళాస్థాపక!
జయము జయము త్రిభువన పరిపోషక!!
జయము జయము దుష్కృత జన శిక్షక!!
జయము జయము సాధు జగద్రక్షక!!
జయము జగజ్జన నాటక సూత్రా!
జయము పరిష్కృత భావ పవిత్రా!!
జయము నిత్యపరిశుద్ధ చరిత్రా!!
జయము సత్యశివ సుందరగాత్రా!!

జటాజూటమున జాహ్నవి ఘోషము
కలువల రాయని కిరణ ప్రసారము
అ ఇ ఉణ్ హల్లితి ఢమరుక నాదము
నిశిత కాంతులెగజిమ్ము త్రిశూలము
సర్వజ్ఞాంకిత తృతీయ నేత్రము
విరాగ సూచక కపాలదండము
జ్యోతిర్మయమగు మంగళ రూపము
ప్రళయ భయంకర తాండవ భంగిమ
నిత్యము మా హృదయమ్ముల నెలకొని
సత్యవ్రత సంస్కృతుల జేయుత॥ జయము జయము

—డాక్టర్ బొడ్డుపల్లి పురుషోత్తం.

# స్వామి యోగానంద

డి. వి. బ్రహ్మాజి

జాతిరత్నముల వంటి తన ప్రధానశిష్యులలో కొంత మందిని శ్రీ రామకృష్ణభగవానుడు ఈశ్వరకోటిలోని వారుగా పేర్కొనేవారు. వీరినే ఆయన నిత్యసిద్ధులు అని కూడా వచించెడివారు. సొర, గుమ్మడి వంటి తీగలు ముందు పిందెలు కాసిన పిమ్మట పూలు పూస్తుంటాయి. అదేమాదిరిగా, నిత్యసిద్ధులయిన ఈ శిష్యులు, ముందుగనే భగవంతుని సాక్షాత్కారమునంది తర్వాత సాధనల నవలంబించు ప్రత్యేక తరగతివారని గురుదేవుల అభిప్రాయము. పరమహంసచే ఈశ్వరకోటిలోని వారుగా ప్రకటింపబడిన శిష్యవర్గములో యోగానందస్వామి ఒకరు.

సన్యాసాశ్రమస్వీకారానికి ముందు స్వామిపేరు యోగీంద్రనాథచౌదరి. ఈయన దక్షిణేశ్వరగ్రామంలో నివసించే నవీన చంద్రరాయ్‌చౌదరిగారి పెద్దకుమారుడు. వీరి పూర్వీకులు గొప్ప సంపన్నులే. కాని, నవీన చంద్రుని కాలంనాటికి వారి ఆస్తి అంతా బాగా చితికిపోయింది. చాలా కష్టస్థితిలో చౌదరి కుటుంబం రోజులు గడుపుతున్నారు. నవీనుడు పూర్వాచారపరాయణుడు కావటంవలన తరచుగా అనేక జప తపాలు సాగిస్తుండేవాడు, ఆధ్యాత్మిక సాధనలు సాగిస్తున్నకాలంలో శ్రీ రామకృష్ణుడు కొన్ని పర్యాయాలు నవీనచంద్రుడి ఇంట జరిగే ఉత్సవాలలో పాల్గొనిఉన్నాడు. ఈవిధంగా యోగీంద్రనాథుని కుటుంబానికి రామకృష్ణులు పూర్వపరిచితులే!

యోగీంద్రుడు 1861 సం॥లో జన్మించారు. బాల్యం నుంచి కూడా ఆయన విచిత్ర భావపరవశుడై ఆలోచనా మనస్కుడై ఉండేవారు. ఆటల మధ్యలో అకస్మాత్తుగ నిశ్శబ్ద ప్రదేశానికి పోయి ఆకాశం వంక చూస్తూ "నేను ఎక్కడ నుండి వచ్చాను? అందున్న నక్షత్రములలో ఒక దాని నుంచి వచ్చి యుందునేమో! ఇక్కడున్నవారు నాఙత పిల్లలుకారు; వారువేరు. అయితే నేను ఇక్కడెందుకున్నట్లు? ఇదంతా స్వప్నమా?" అని ఈ విధముగా భావించేవారు. ఆయన అలవాట్లు, జీవన విధానమూ కూడా చాలా సరళంగాను, నిరాడంబరంగాను ఉండేవి. భోగలాలసపై ఆయనకెన్నడూ కోరికలేదు. స్వభావతః ఆయన చాలా మితభాషి. అంతగా కలుపుగోలు స్వభావం కలవాడు కాదు. అందువల్ల బాల్యంలో ఆయన స్నేహితులు యోగీంద్రునితో అంత చనువుగా మెలిగేవారు కాదు. కాని, వారందరికి కూడా యోగీంద్రునిపై గాఢమయిన ప్రేమ, గౌరవము ఉండెడివి.

తర్వాత కొన్ని సంవత్సరాలకు యోగీంద్రునకు ఉపనయనం జరిగింది. అప్పటి నుంచి ఆయన ప్రతిరోజు ధ్యానంలోను, భగవదర్చనలోను ఎక్కువ కాలం వినియోగించేవారు. ఆయన ప్రవేశ పట్టపరీక్షకు చదువుతున్న రోజులలో అనుకోని విధంగా శ్రీ రామకృష్ణునితో పరిచయభాగ్యం ఒనగూడింది. అప్పటికి యోగీంద్రుని వయసు 16-17సం॥ ఉంటుంది.

యోగీంద్రనాథుడు విహారార్థమై ప్రతిరోజు రాణిరాసమణి ఉద్యానవనమునకు వచ్చిపోతూ ఉండేవారు. బ్రహ్మసమాజంవారి పత్రికలలో కేశవచంద్రసేనుడు వ్రాసిన వ్యాసముల వలన అప్పటికే ఆయనకు రామకృష్ణుల గురించి కొంత తెలుసు. కాని, అభిజాత్యంవల్ల శ్రీ రామకృష్ణుని తాము స్వయంగా కలుసుకోలేదు. ఒకరోజున ఉద్యానవన సమీపంలో విహరిస్తున్న యోగీంద్రునకు అందలి పుష్పమొకదానిపై మనస్సుపోయింది. ఇంతలో అటువయిపుగా వస్తున్న ఒక వ్యక్తిని చూచి, అతడే తోటమాలి అనుకొని ఆ పుష్పాన్ని కోసి ఇమ్మని అడిగారు. ఆ వ్యక్తి కూడా ఏమీ అనకుండా పువ్వును కోసి యోగీంద్రుని చేతిలో ఉంచారు. తన భావిజీవితాన్ని తీర్చి దిద్దబోయే దేశికోత్తముడు శ్రీ రామకృష్ణపరమహంసయే ఆ వ్యక్తియని నాడు యోగీంద్రునకు తెలియదుగదా!

మరికొన్నినాళ్ళకు పిమ్మట ఆ తోటలోని ఒక గదిలో తనకు పూవును కోసి యిచ్చిన వ్యక్తి మాట్లాడుతుండటము, చుట్టూ చేరినవారు శ్రద్ధగా వినటమూ గోచరించింది యోగీంద్రునకు. శ్రీ గురుదేవులు ఆ సమయంలో తేటతేట పలుకులతో ప్రేమతత్త్వాన్ని గురించి ఉపన్యసిస్తున్నారు. అప్పుడే యోగీంద్రునకు ఆయనయే తాను వదివిన శ్రీ రామకృష్ణులయి ఉండవచ్చునని తోచింది. కొంతసేపు అక్కడనే బయట తచ్చాడుతూ తిరిగారు. ఇంతలో గది బయటనున్న వారినందరిని లోపలికి తీసుకుని రమ్మని రామకృష్ణులొక వ్యక్తిని ఆదేశించారు. ఆ మనిషి వచ్చి యోగీంద్రుని గదిలోనికి గొనిపోయి కూర్చుండ చేశాడు.

మిగిలినవారంతా వెడలిపోయిన పిమ్మట పరమహంస యోగీంద్రుని వద్దకు వచ్చి ఆయన వివరాలన్నీ కనుక్కొన్నారు. ఆయన నవీనబాబు పెద్దకొడుకని తెలిసి చాలా సంతోషించి తమ పూర్వపరిచయాన్ని నెమరువేసారు. యోగీంద్రునిలో అనేక పారమార్థిక ఔన్నత్య లక్షణాలు తనకు గోచరిస్తున్నాయని, ఆధ్యాత్మిక సాధనలో యోగీం

ద్రుడు సులభంగా సిద్ధినందగలడని శ్రీ రామకృష్ణులు ఆయనతో చెప్పారు. తరచుగా తనవద్దకు రావలసినదిగా గురుదేవులు యోగీంద్రుని కోరారు.

తన యెడల పరమహంస చూపించిన ప్రేమాదరణలకు ముగ్ధుడయిన యోగీంద్రుడు తరచు శ్రీ రామకృష్ణుని కలుసుకొనేవారు. అయితే ఆ రోజులలో దక్షిణేశ్వరంలో చాల మందికి శ్రీ రామకృష్ణుని దివ్యోన్మాదలక్షణాలు సరిగా అర్థంగాక, ఆయన ఒక పిచ్చి బ్రాహ్మణుడు అని మాత్రమే తలంచేవారు. కులమత వివక్షతను ఖచ్చితముగా అమలు జరపక పోవడంవలన శ్రోత్రియ బ్రాహ్మణులకు రామకృష్ణుని యెడల సద్భావం ఉండేదికాదు. అందువల్ల తాను పరమహంసను కలుస్తున్న సంగతిని చాలాకాలం యోగీంద్రుడు అతి రహస్యంగానే ఉంచారు. రామకృష్ణులను దర్శించిన సంగతి ఇంట్లో చెప్పకుండా తాను కోసుకువచ్చిన మంచి మంచి పుష్పాలను మాత్రం దేవతార్చన సమయంలో తండ్రికిచ్చి సంతోష పరచేవారు.

కాని రహస్యం ఎంతకాలమని దాగుతుంది? అసలు విషయం తెలిసిన స్నేహితులు "పిచ్చి బ్రాహ్మడివలలో పడెనే పాపం అమాయకుడు" అని యోగీంద్రుణ్ణి ఆటలు పట్టించారు. కాని, పరమ శాంతమూర్తి అయిన యోగీంద్రుడా హేళనలన్నింటిని ఒక్క చిర్నవ్వుతో కొట్టిపారవేసేవారు. చదువు యెడల యోగీంద్రునిలో పెరుగుతున్న నిర్లక్ష్యాన్ని, రామకృష్ణునితో ఆయన సాంగత్యాన్ని చూచి ఆయన తల్లిదండ్రులు ఎంతో దిగులు చెందారు. కాని, అందుకు వ్యతిరేకంగా ఎన్నిచెప్పినా తమ కుమారుని మనసు మార్చలేమని గ్రహించి మాట్లాడక ఊరకున్నారు.

ఇకపయిన చదువుకొనసాగించటం వలన లాభంలేదని గ్రహించిన యోగీంద్రుడు తండ్రి అనుమతితో ఉద్యోగాన్వేషణార్థం కాన్పూరులోనున్న మేనమామ కడకు ప్రయాణం అయ్యాడు. కాని ఉద్యోగ ప్రయత్నాలేవీ ఫలించలేదు. తన కాలాన్ని చాలవరకు ఆయన ధ్యాన ప్రార్థనములకే వినియోగించేవారు. ఎవరితోను మాట్లాడక ఏకాంతముగా కాలం గడిపేవారు. ఇదంతా చూచిన మేనమామ భయపడి పిల్లవానికి పెండ్లి చేయనిచో లాభంలేదని తలిదండ్రులను హెచ్చరించాడు.

ఈ సంగతులేవీ యోగీంద్రునకు తెలియవు. ఇంటివద్ద బంధువులొకరికి బాగా జబ్బుచేసింది అని మాత్రమే ఆయనకు వర్తమానం అందింది. తానెంతో ప్రేమించి గౌరవించే తన తల్లి ఏట్లాఉందోనని ఆదుర్దాతో యోగీంద్రుడు హుటాహుటిని దక్షిణేశ్వరం తిరిగి వచ్చారు. అప్పటికి ఇదంతా తనకు వివాహం చెయ్యడం కోసమని ఆడిన పన్నుగడయని తెలిసింది. వివాహబంధంలో ఇరుక్కోవడం ఆయనకు సుతరామూ ఇష్టంలేదు. సన్యాసజీవితం గడపుతూ తన శక్తియుక్తులు సర్వస్వమూ భగవత్సాక్షాత్కారానికై వెచ్చించాలనే ఆయన ఆరాటం. కాని, సుతిమెత్తని మనస్సుగలవాడు కావటంవల్ల తల్లిదండ్రులను కష్టపెట్టటం ఆయనకు సాధ్యంకాలేదు. ముఖ్యంగా కన్నతల్లి ఎచ్చి కన్నీళ్ళతో తనకోసమైనా వివాహం చేసికొనక తప్పదని నిర్బంధించడంతో మరి కాదనలేక యోగీంద్రుడు వివాహానికి అంగీకరించటం జరిగింది.

ఇదివరలో యోగీంద్రుడొకసారి శ్రీ రామకృష్ణులతో తాను యావజ్జీవితము బ్రహ్మచర్యదీక్షనవలంబింతునని చెప్పగా పరమహంస ఎంతయో సంతసించెను. అట్టి తాను అన్నమాట నిలుపుకొనలేక వివాహం చేసికొన్నాడు. అందువల్ల తనముఖం గురుదేవులకు చూపించుటకాయనకు మనసొప్పలేదు. విషయం యావత్తు వివరముగా పరమహంస చెవినబడింది. ఒక్కసారి వచ్చి తనను చూచిపొమ్మని రామకృష్ణులు ఎన్నిసార్లు కబురంపినా ముఖము చెల్లక యోగీంద్రుడు గురుదేవులను దర్శింపనే లేదు.

అయితే, శిష్యవాత్సల్యప్రపూర్ణుడయిన రామకృష్ణుడు ఊరకొనలేదు. గురుదేవుడొకనాడు యోగీంద్రుని స్నేహితుని ఒకనిని చేరబిలచి, "ఏమి పెద్దమనిషయ్యా నీమిత్రుడు? కాన్పూరుపోక పూర్వము ఇక్కడ నుండి కొంత పైకము గొనిపోయినాడు. ఎన్నిమార్లు కబురంపినను పైకమునకు లెక్క చెప్పడు." అని అన్నారు. ఈ విషయం యోగీంద్రుని చెవిన బడింది. దేవాలయం అధికారి ఒకరు కొన్ని వస్తువులను కొనడానికి తనకు కొంత సొమ్మునిచ్చిన మాట నిజమే. ఆ వస్తువులను తాను చాలకాలం క్రిందటనే గురుదేవులకు పంపివేశాడు. కాని, తనవద్ద మిగిలిపోయిన చిల్లర కొద్దిమొత్తం తిరిగి ఈయవలసి ఉంది. తన విషయమై శ్రీ రామకృష్ణులు చేసిన దోషారోపణకు యోగీంద్రునకు రోషం కల్గింది. తాను మోసకారిని కానని ఋజువు చేయటానికి తానే స్వయంగా పోయి చిల్లర తిరిగి ఇచ్చి గురుదేవులతో అసలు సంగతి అంతా చెప్పాలనుకొన్నాడు. అదే తాను పరమహంసను ఆఖరుసారిగా దర్శించటం అనుకొన్నాడు పాపం యోగీంద్రుడు !!

తన కడకు వచ్చిన యోగీంద్రుని చూచీచూడగానే

శ్రీ రామకృష్ణుడు తొందర తొందరగా ఆయనను జేర వచ్చెను. శిష్యుని చేయిబట్టుకొని, ఒక అలౌకికమయిన అసాధారణ వర్చస్సు మోమున తాండవింప గురుదేవులిట్లనిరి: "నీకు పెండ్లయినదని భయపడుచుంటివా, అయిన నేమి? నాకు మాత్రము కాలేదా? వీని [తనను ఉద్దేశిస్తూ] అనుగ్రహమున్నచో 'లక్ష పెండ్లిండ్లయినాసరే' నిన్నేమీ చేయజాలవు. నువ్వు సంసారంతోనే ఉండాలని అనుకొనే పక్షంలో నీ భార్యనొకసారి ఇక్కడకు తీసుకురా. ఆమె నీసాధనా మార్గంలో సహకారిగా ఉండునట్లు మార్చెదను. కాదు; సంసారాన్ని త్యజించివైచి యీశ్వర లాభమును పొందదలచిన పక్షమున అదికూడ నీకు సాధ్యం అయేటట్లు చేసెదను."

ఈ చల్లని మాటలు వినగానే తనను నిరాశాంధకారం నుంచి తేజోలోకానికి గొనిపోయినట్లే భావించాడు యోగీంద్రుడు. గురుదేవునకు తనపై గల వాత్సల్యాభిమానములకాయన కన్నులు చెమర్చినవి. తన తలపై నుండి కొండంతభారం తొలగిపోయినట్లు విముక్తి చెందాడు. గురుదేవులకు పాదాభివందనం చెప్పి ఇంటికి తిరిగి పోవునపుడు తాను తిరిగి ఇవ్వవలసిన పైకాన్ని గురించి గుర్తుచేశాడు యోగీంద్రుడు. దానికి రామకృష్ణులు అత్యంత ఉదాసీన వైఖరితో "అమూల పగిలిపోయిన రేకు పెట్టెలో ఆ చిల్లర పడవేయి" అన్నారు. ఈ పైకం విషయం అంతా కూడా తనను రప్పించుకొనటానికి పరమహంస కల్పించిన ఒక మిషమాత్రమేనని గ్రహించిన యోగీంద్రనాథునకు గురుదేవుని యెడల భక్త్యనురాగాలు మరింతగా ఇనుమడించాయి.

వివాహమయిన పిమ్మట కూడా యోగీంద్రుడు ప్రాపంచిక విషయాలపట్ల తన ఉదాసీన వైఖరిని, నిర్లక్ష్యాన్ని విడనాడలేదు. అది చూచి ఆయన తల్లి ఒకనాడు "డబ్బు సంపాదించకపోతే ఎందుకు పెళ్ళి చేసుకొన్నావు?" అని మందలించింది. దానికి ఆయన "నాకెంతమాత్రం ఇష్టం లేకపోయినా నీ బలవంతంపైననే గదా వివాహమాడినాను," అని జవాబిచ్చారు. అందుపై కోపం వచ్చిన ఆయన తల్లి "నీకిష్టం లేకుండా పెళ్ళి ఎట్లా జరుగగలదు?" అని నిలవేసింది. తల్లిని సంతోషపెట్టుటకై మాత్రమే తాను పెండ్లియాడగా ఆ కన్న తల్లియే ఇపుడిట్లు పల్కుచున్నది. ఈ ప్రపంచమున తనను నిస్వార్థంగా ప్రేమించే వ్యక్తి ఒక్క శ్రీ రామకృష్ణుడు మాత్రమే అనే సత్యమాయనకానాడు అవగతమయింది.

అనాటినుండి యోగీంద్రుడు ప్రతిదినము పగటిపూటను, కొన్నిసార్లు రాత్రులందు సహితము కూడ రామకృష్ణుల సన్నిధినే కాలం గడుపజొచ్చెను. ఇందువల్ల యోగీంద్రుని మీద ఎక్కువ శ్రద్ధ గైకొని తీర్చిదిద్దే అవకాశం శ్రీ రామకృష్ణునకు లభించింది.

యోగీంద్రునిది అతిమెత్తని కుసుమకోమల హృదయం. శ్రీ రామకృష్ణుని బట్టలలోకి ఒకసారి బొద్దింక ఒకటి దూరింది. బట్టను బయటకు గొనిపోయి బొద్దింకను చంపి రమ్మని ఆయన యోగీంద్రుణ్ణి నియమించారు. అతి దయార్ద్రహృదయుడయిన యోగీంద్రుడు ఆ బొద్దింకను చంపక దూరంగా వదలివేసి వచ్చాడు. అది తెలిసిన పరమహంస "నిన్ను నేను బొద్దింకను చంపి రమ్మనగా దాన్ని వదలి వచ్చావు. నా మాటలను నీవు అక్షరాలా అమలు జరిపితీరాలి. లేనిచో ఇంతకన్న ముఖ్యవిషయాలలో పశ్చాత్తప్తుడవు కావలసి వచ్చును," అని గట్టిగా బుద్ధి చెప్పారు.

మరొకనాడు యోగీంద్రుడు దక్షిణేశ్వరానికి పడవతో వస్తుండగా పడవలోని వారిలోనొక ప్రయాణీకుడు శ్రీ రామకృష్ణుని విపరీతముగ దూషింపసాగెను. గురుదేవుని గురించి తెలియక అజ్ఞానంచేత అతడట్లు పల్కుతున్నాడని, అందువల్ల తానతనితో వాదనపెంచుకొనవలసిన అవసరం లేదని భావించి యోగీంద్రుడు బదులు చెప్పక మౌనంగా ఊరకున్నాడు. ఈ సంగతి అంతా విని రామకృష్ణుడు "గురునిందాలాపము జరిగినపుడు శిష్యుడా చోటును వెంటనే వీడిపోవలయును, లేదా నిందకునకు శిరచ్ఛేదమయినా చేయాలి. కాని నీవు గురునిందను మారుమాట లేక సహించితివి. ఎంత తప్పు" అని మందలించారు. మితిమీరిన మెత్తని మనస్సుగల యోగీంద్రునకు కొంచెం పౌరుషం కల్గించాలనే ఉద్దేశముతో మాత్రమే గురుదేవులు ఇట్లామందలించారు. [ఇట్లాంటి సందర్భంలోనే తీవ్ర స్వభావం కల నిత్యనిరంజనుడికి మరొక విధంగా బుద్ధి చెప్పారు.]

అద్వైతతత్వ రహస్యాన్ని తెలిసికొని ఆధ్యాత్మిక శిఖరాగ్రాన్ని అధిరోహించిన రామకృష్ణుడు తన శిష్యులకు సామాన్య లౌకికవ్యవహార విషయములలో కూడా చక్కటి తర్ఫీదునిచ్చేవారు. యోగీంద్రుడొకనాడు బజారునకుపోయి అచటి వర్తకుని బాహ్యవర్తనము చూచి అతని పారమార్థికతను నమ్మి ఓటి బూరెలమూకుణ్ణి కొనుక్కు వచ్చాడు. ఇది తెలిసి రామకృష్ణులు "భక్తుడయినంతమాత్రాన వెర్రివెంగళప్ప కావాలని ఎక్కడా లేదు.

ఆ వర్తకుడు దుకాణం పెట్టుకొన్నది తన లాభార్జనకేగాని, పరమార్థసాధనకుగాదు. పరీక్షించకనే వాడిచ్చిన బూరెల మూకుడును కొనివచ్చుట అవివేకము. వస్తువు కొను నపుడు నాలుగు దుకాణాలలోను ధరలు విచారించి, సరకు నాణ్యము పరిశీలించి కొనాలి'' అని మందలించారు.

తనను గురువుగా అంగీకరించుటకు ముందు తనను తీక్ష్ణంగా పరీక్షించమని శిష్యులను శ్రీ రామకృష్ణుడు తరచుగా ప్రోత్సహించేవారు. ఒకనాడు యోగీంద్రుడు గురువర్యుని గదిలో పరుండెను. అర్ధరాత్రి ఆకస్మాత్తుగా మెలకువచ్చిన యోగీంద్రుడు తన ప్రక్కన చూడగా శ్రీ రామకృష్ణుడక్కట లేడు, గది తలుపులు తెరువబడి యుండెను. ''ఈయన నడిరేయి యెచటకు బోయి యుండును? తన బోధనలకు విరుద్ధముగా ఇంద్రియ సుఖాపేక్షతో భార్యకడకు వెళ్ళియుండునా?'' అని సందేహించి యోగీంద్రుడా నడిరాత్రిని మాతృదేవి నివసించెడి నహబత్తానా చెంతకపోయి కనిపెట్టియుండెను. ఇంతలో కొంతసేపటికి శ్రీ రామకృష్ణుడు పంచవటి వైపునుండి ఆ దారినే వస్తూ తన శిష్యునిగాంచి అక్కడెందులకున్నది ప్రశ్నించెను. సిగ్గుతో యోగీంద్రుని తల వాలిపోయినది. సంగతినంతయు గ్రహించిన పరమహంస తనను పరీక్షించినందులకై యోగీంద్రుని ఎంతయో మెచ్చుకొనెను.

యోగీంద్రునకు రామకృష్ణులపై అపారమయిన భక్తి విశ్వాసాలున్నమాట నిజమే. కాని, అవి గుడ్డి నమ్మకాలు మాత్రంకాదు. అవసరమయినచో తన సునిశిత బుద్ధితో సూక్ష్మంగా తర్కించిన తర్వాత మాత్రమే ఆయన గురువర్యుని మాటలను ఆచరణలో పెట్టెడివాడు. ''కామ విముక్తి నొందుట ఎట్లు?'' అని ఒకనాడు యోగీంద్రుడు రామకృష్ణుని ప్రశ్నించగా ఆయన: ''హరినామస్మరణము నిరంతరము చేయుచుండుము; కామము అదే అంతరించిపోవును-మరేమియును చేయనక్కరలేదు.'' అని ఉపదేశించెను. ఆసనములు వేయుమనియో, కరక్కాయలు తిని పథ్యము చేయుమనియో రామకృష్ణుడు చెప్పునని ఆశించిన యోగీంద్రుడు మొదట్లో ఆశాభంగం చెందాడు. అంతకంటె మంచిమార్గం రామకృష్ణునకు తెలియకపోవడం వల్లమాత్రమే ఆయన అట్లా ఉపదేశించారని యోగీంద్రుడు భావించాడు. ఆ రోజులలో దక్షిణేశ్వరంలో ఉంటున్న హఠయోగిని కామవిజయసాధనలగురించి అడిగి తెలుసుకోవాలనుకున్నారు. ఒకనాడాయన ఆ హఠయోగి వద్దకుచేరి ఆ యోగి చెప్పే మాటలను అమిత శ్రద్ధగా వింటున్నారు. అదే సమయానికి రామకృష్ణులు వచ్చి యోగీంద్రుని చేతులుపట్టుకొని ప్రేమాదరపూర్వకముగా తన గదికి తీసుకుపోయారు. దారిలో ''నువ్వు అక్కడకెందుకు వెళ్ళావు? ఆ రకమైన సాధనలవల్ల నీ ధ్యాస అంతా నీ శరీరం పయిన మాత్రమే కేంద్రీకృతం అవుతుంది; భగవంతుడిపై పోదు.'' అని స్నేహపూర్వకంగా బోధించారు. గురుదేవుల శిక్షణమున యోగీంద్రుడు కామవిజయాన్ని సాధించి సార్థకనాముడై ప్రకాశించాడు. ఈ విషయంలో యోగీంద్రుని గురించి వివేకానందస్వామి: ''మాలో కామమును సంపూర్తిగా జయించినవారు ఎవ్వరయినా ఉన్నారంటే అది యోగీంద్రుడే'' అని అన్నారు.

శ్రీ రామకృష్ణుల ప్రవర్తనలోని అంతర్యాన్ని యోగీంద్రుడు మొదట్లో తెలియజాలక పొరబాటుగా అర్థం చేసుకొని పిమ్మట తన అభిప్రాయం సరిదిద్దుకొన్న సంఘటన మరియొకటి గలదు. దక్షిణేశ్వరంలోని కాళికాలయంలో ఉండే నియమాన్ని అనుసరించి నైవేద్యముగా అర్పణమయిన ప్రసాదమున కొంతభాగం ప్రతిదినము శ్రీ రామకృష్ణునకు పంపబడవలసిన ఏర్పాటున్నది. ఒకనాడు తనకు ప్రసాదభాగము చేరకపోవుటచే గురువులు ఆందోళనచెంది వెంటనే దేవాలయకార్యాలయానికిపోయి విచారణచేశారు. ఈ చిన్నవిషయాన్నిగురించి పరమహంసకు ఇంతటి కలవరపాటు ఏలకో యోగీంద్రునకు అర్థంకాలేదు. ఇదంతా ఆయనలో అణగియున్న ''తనకు రావలసిన దానిని పెనుగులాడి గ్రహించు పౌరోహిత్యపు బ్రాహ్మణ మనస్తత్వమే'' యని యోగీంద్రుడు భావించెను. అంతలో తిరిగివచ్చిన గురుదేవులు యోగీంద్రునితో: ''చూచితివా? దైవప్రసాదము నిజముగ భక్తులు, సాధులు ఆయినవారలకు అందవలెనను ఆకాంక్షతో రాసమణి అందునిమిత్తము తన ఆస్తిని చాల మొత్తము దేవాలయసేవకై వ్రాసియిచ్చెను. నావద్దకు తీసుకొని రాబడిన ప్రసాదభాగము నిజముగ భగవంతునికై పరితపించు భక్తులకు మాత్రమే సద్వినియోగమగుచున్నది. కాని, ఇతరత్రా పోవుచున్న ప్రసాదము చాలవరకును దుర్వినియోగమే అగుచున్నది. రాణిరాసమణి యొక్క మనోవాంఛితము కొంతవరకయినా నెరవేరగలదను అభిప్రాయముతోనే నేను ఇచటికి రావలసిన ప్రసాదభాగమునకై పోరాడుచుందును.'' బాహ్యముగా తనకు లేకి చేష్టగా కనుపించిన ఈ చర్యలో కూడా శ్రీ గురుదేవునకు ఎంతటి మహోన్నతమయిన ఉదారాశయం నిండి నిబిడీకృతమయి ఉన్నదో గ్రహించిన యోగీంద్రుని కన్నులు అశ్రులు వారినవి.

శ్రీ రామకృష్ణగురుదేవుల పర్యవేక్షణలో యోగీంద్రుడు ఆధ్యాత్మికంగా త్వరితగతిని పురోభివృద్ధినందెను.

పరమహంస అస్వస్థుడై కోసిపూర్ ఉద్యాన భవనమునందు నివసించు సమయమున అహోరాత్రము గురుసంసేవ యొనర్చి తరించినవారిలో యోగీంద్రుడొకరు. గురుసేవా పరాయణుడయిన యోగీంద్రుడు తన సుకుమారమయిన దేహారోగ్యమును సహితము సరకు గొనక గురుశుశ్రూష యొనర్చెను. పరమహంస ఒకరోజున యోగీంద్రుని పిలచి సౌరమానమును అనుసరించి రచింపబడిన వంగ దేశపు పంచాంగమును తెప్పించి అందు ఆగష్టు శికి సరి పోవు తిథి నుండి వరుసగా తిథులను చదివించుకొనుచు ఆగష్టు 16వ తేదీయగు తిథి [చాంద్రమానము ప్రకారం భాద్రపద బహుళ విదియ, సోమవారం] వచ్చుసరికి అక్కడ ఆగమని చెప్పారు. భగవానుని అస్తమయదినము సరిగా ఆరోజేనని నాడు యోగీంద్రునకు తెలియదుగదా!

పరమహంస మహాసమాధి అనంతరం దుఃఖోపశమ నానికై మాతృశ్రీ శారదాదేవి మన యోగీంద్రుని, ఇతర శిష్యులను తోడుగా గైకొని బృందావన సందర్శనార్థ మేగెను. ఒక సంవత్సరమునకు యోగీంద్రుడు మాతృ దేవితోబాటు కలకత్తా తిరిగి వచ్చెను.

ఇప్పుడు సన్యాసాశ్రమాన్ని స్వీకరించిన యోగీంద్ర నాథచౌదరి యోగానందస్వామి అయ్యారు. శారదాదేవిని నీడలాగా అనుసరించి ఆమెను సేవించిన ధన్యజీవి యోగానందస్వామి. శారదాదేవితో కామార్పుకూర్ వెళ్ళి కొంతకాలం అక్కడున్నారు. పిమ్మట తపస్సాధనలో ఏకాంతంగా కొంతసమయం గడిపారు. ఇంతలో మాతృ దేవి బేలూరులోని నీలాంబరబాబు ఇంటికి తిరిగి వచ్చారని తెలిసి ఆమె సపర్యల కోసమై స్వామి బేలూరు చేరు కున్నారు. శ్రీ రామకృష్ణభగవానుడే స్వయముగా శారదా దేవి రూపంతో జీవించియున్నారని మనస్పూర్తిగా విశ్వ సించిన మన యోగానందస్వామి మాతృదేవి చరణ సేవకై తన సర్వస్వము ధారవోశారు.

1891లో యోగానందస్వామి కాశీ క్షేత్రంచేరి అక్క డొక ఏకాంతమందిరంలో నిరంతర ఆధ్యాత్మిక సాధనలో నిమగ్నమయ్యారు. ఆహారానికై కాలం వినియోగించడం కూడా వృథా అవుతుందేమో అన్నంత ఆరాటంతో స్వామి తన తీవ్ర తపశ్చర్య సాగించారు. ఆ రోజులలో వారణా శిలో రెండు తెగల మధ్య కొట్లాట జరిగి పరిస్థితి చాలా ఉద్రిక్తస్థితిని చేరుకుంది. కాని, స్వామి యోగానంద యెడలగల భక్తి గౌరవాల వల్ల ఏ పక్షంవారు కూడా ఆయన ఏకాగ్రతకు ఇసుమంతయినా భంగం కల్గించలేదు.

తీవ్రతరమయిన సాధనల ఫలితంగా యోగానందస్వామి ఆరోగ్యం బాగా దెబ్బతింది. అందుచే స్వామి బారానగరు మఠానికి తిరిగివచ్చేశారు. ఆ తర్వాత కలకత్తాలో బలరాం బోసు ఇంట్లోకి తన నివాసాన్ని మార్చారు స్వామి. ఈసరికే ఆయనలో క్షయవ్యాధి బాగా ముదిరిపోయింది. ఎంత అనారోగ్యంతో తీసుకుంటున్నా తనను చేరవచ్చిన వారి యెడల స్వామి చూపించే ఆదరణ, ఆప్యాయతలు మరపురానివి.

1895నుంచి 1897వరకు స్వామి ఆధ్వర్యంలో శ్రీ రామకృష్ణపరమహంస జయంత్యుత్సవాలు దక్షిణేశ్వరంలో బ్రహ్మాండంగా నిర్వహింపబడ్డాయి. 1898లో బేలూరు మఠంలో కూడా గురుదేవుల జయంతిని యోగానంద స్వామి పర్యవేక్షణలో అత్యద్భుతంగా నిర్వహింప బడింది. యువకులను కార్యరంగంలో ఉత్తేజితుల్ని చేయ డంలోను కార్యదీక్షతత్పరతలోను స్వామికిగల దక్షతయే ఈ ఉత్సవాల విజయానికి కారణభూతమని వేరే చెప్ప నక్కరలేదు.

అమెరికా, ఆయిరోపాలతో తన వేదాంత దుందుభిని మ్రోగించి, దిగ్విజయుడై తిరిగి వచ్చిన వివేకానందస్వామి తన గురువర్యుని దివ్యసందేశ మకరంద మాధుర్యమును విశ్వ వ్యాప్తం చేయటానికి, జీవారాధనయే శివారాధనమను గురూపదేశవాక్యాన్ని ఆచరణలో పెట్టటానికి ఒక సంస్థను స్థాపింపవలెనని భావించాడు. ఆయన అభిప్రాయంతో మన యోగానందస్వామి మొదట్లో ఏకీభవించలేదు. యోగానంద స్వామి అభిప్రాయంలో శ్రీ గురుదేవులు తన శిష్యులందరు సంపూర్ణముగ ఆధ్యాత్మిక సాధనలలో నిమగ్నమయిపోవా లని ఆశించారు. కాని, వివేకానందుడు ప్రవచించిన కార్య క్రమం శ్రీ రామకృష్ణుని ఆశయాలకు విరుద్ధముగా నుండి పాశ్చాత్యసమాజప్రభావజనితయై గోచరిస్తోంది. ఈ భావంతో యోగానందస్వామి వివేకానందుని ప్రతిపాదనను తీవ్రంగా ప్రతిఘటించారు. ఆ పల్కులు విని ఒక విధ మయిన దివ్యావేశంతో వివేకానందస్వామి ఇట్లా జవా బిచ్చారు: "బ్రహ్మజ్ఞానమునకయినా పరిమితికలదేమో కాని గురుదేవుని ఆధ్యాత్మిక సంపదకు మితిలేదు. ఆయన బోధనలను నేను సరిదిద్దుతాననడం కన్న హాస్యాస్పద మయిన విషయం మరొకటిలేదు. శ్రీ రామకృష్ణులు సంకల్పమాత్రం చేతనే ఒక్క పిడికెడు దుమ్మునుంచి నావంటి వివేకానందుల్ని వేయిమందిని సృష్టింప సమర్థులు. నాకు వేరే అభిప్రాయం అంటూ ఏదీలేదు. పరమహంస ఉద్దేశ్యమే నానోటి నుంచి వెలువడుతోంది. నేను నిమిత్త

మాత్రుడిగా, నా మూలంగా గురుదేవుడు తన కార్యము నొనర్ప సంకల్పించు కొన్నాడు.'' మహోద్విగ్నమనస్కుడైన వివేకానంద ముఖమునుండి వెల్వడిన యీ పలుకులు విన్న యోగానందస్వామి తన అసమ్మతిని ఉపసంహరించుకొని వివేకానందస్వామికి సంపూర్ణ సహకారం అందజేశారు. శ్రీ రామకృష్ణమఠం స్థాపించబడిన తర్వాత దాని మొట్టమొదటి ఉపాధ్యక్షుడు మన యోగానంద స్వామియే!

సునిశితమయిన ఆలోచనాదృక్పథం కల్గిన యోగానంద స్వామి ప్రతి విషయాన్ని లోతుగా తర్కించి విమర్శించి గాని అంగీకరించేవారు కాదు. తన గురుదేవులనే ఆయన ఏవిధంగా పరీక్షించి చూశారో మనం ఇదివరకే గ్రహించి యున్నాం. తమ గురువర్యుని ముఖ్యాశయము ఆత్మ మోక్ష సాధనం అయి ఉండగా; వివేకానందస్వామి బోధిస్తున్న మానవసేవాకార్యక్రమం తద్విరుద్ధమనియు, కేవలం పాశ్చాత్య సంప్రదాయసిద్ధమనియు, బంధహేతువనియు సోదరశిష్యులు కొంతమంది ఆయన వాదాన్ని విమర్శింప సాగారు. ఈ వివాదాన్ని ముందుగా ప్రారంభించినది కూడా మన యోగానందస్వామియే. ఈ రకమయిన విమర్శను వివేకానందస్వామి మొదట్లో హాస్యపూర్వకంగా ఖండించారు. కాని, రాను రాను తీవ్రమయిన ఆవేశంతో వివేకానందస్వామి శరీరం అంతా కంపించిపోసాగింది. కళ్ళ నుండి ఆవేశజనిత అశ్రుధార వర్షింపజొచ్చింది. ''అజ్ఞానముచేనలమటించుచున్న నా సోదరులను కర్మయోగ ప్రభావమున పునరుజ్జీవితులను గావించి ఉద్ధరించుటకై వేయిమార్లు నరకకూపమున పడుటకయినను నాకు ఆనందమే'' అని మహోద్విగ్నముగా గర్జించినాడా మహనీయుడు. ఆయన దివ్యావేశమును కనులారా గాంచిన సోదరశిష్యులకు శ్రీ రామకృష్ణుడే వివేకానందుని హృదయాంతరమున ప్రకాశించుచుండెనని విస్పష్టమయినది; సంశయాంధకారం పటాపంచలయింది, పశ్చాత్తప్తులయిన వారందరూ స్వామిని క్షమాభిక్షనర్థించారు; స్వామి కార్యంలో మనస్ఫూర్తిగా అంకితమయి పోయారు.

యోగానందస్వామి ఆరోగ్యం నానాటికి తీసికట్టు పోజొచ్చింది. చివరకు 1899సం..లో మార్చి 28న స్వామి యోగానంద తన భౌతికకాయాన్ని విడనాడి బ్రహ్మైక్యం చెందారు. శ్రీ రామకృష్ణుని పదునారుగురు ప్రధాన శిష్యుల లోను మొట్టమొదటగా మహాసమాధిని చెందినది మన యోగానందస్వామియే. స్వామి మరణమునకెంతయో సంచలించిపోయిన వివేకానందస్వామి అప్రయత్నముగా ''అంతమునకు ఇదియే ప్రారంభము'' అన్నారు. [అంటే, ప్రధాన శిష్యులు తమ ఐహిక జీవితాలకు ఇకనుంచి ఒకరొకరుగా స్వస్తి పల్కుతారని భావం.]

# మాతృదేవి చరణసన్నిధి

ఆంగ్ల గ్రంథము: అనువాదము:

## ఎట్ ది హోలీమదర్స్ ఫీట్

**22, జూలై 1918.**

సాయంత్రం ఏడున్నర అయింది. అమ్మ సందర్శనానికి వెళ్లాను. నేను నమస్కరించగానే శారదామాత ''రా, అమ్మా, ఇక్కడ కూర్చో, ఈవేళ చాలా వేడిగా ఉంది. ఇక్కడ కూర్చుని కాస్త విశ్రాంతి తీసుకో. సుమతి, మొదలయిన వారంతా జాగ్రత్తగా ఇంటికి చేరుకున్నారా?'' అని ప్రశ్నించింది.

''వచ్చారమ్మా వారింటికి వచ్చిన తరవాతే నేను ఇక్కడికి బయలుదేరాను.''

మేము ఇద్దరము కొంతసేపు ఇష్టాగోష్ఠి కొనసాగించాము. ఆపైన మాతృదేవి అన్నది.

''తమ దుఃఖాలను గురించి, యాతనలను గురించి జనం ప్రస్తావిస్తూంటారు. వాటిని తొలగించవలసినదని భగవానుని ప్రార్థించినా ఫలితాలేవి కనబడడం లేదనికూడా వాపోతూంటారు. కాని దుఃఖమే భగవంతుని వరప్రసాదము.''

ఆనాడు దుస్సహ దుఃఖభారంతో కుంగిపోతున్నాను. ఆ సంగతి గ్రహించి, ప్రత్యేకించి

అనాలని అమ్మ ఆ మాటలన్నదా? ఆ తర వాత ఆమె తిరిగి ఇలాగన్నది.

"దుఃఖా లనుభవించనివారు ఒక్కరయినా ఈ ప్రపంచంలో ఉన్నారా? 'బృంద' ఒక్క నాడు శ్రీకృష్ణునితో ఇలాగన్నది. "నీవు కృపా మయుడవని ఎవరన్నారు? శ్రీ రామావ తారంలో నీవు సీతాదేవి జీవితం అంతా దుఃఖ సాగరంలో ముంచెత్తావు. కృష్ణుడవై నీ విప్పుడు రాధ జీవితం అంతా తీరని దుఃఖంతో నింపివేస్తున్నావు. కంసుని కారాగారంలో నీ తల్లిదండ్రులు రాత్రింబగళ్లు నీ కోసం పరిత పించారు. అయినా నీ పేరు ఒక్కమారు స్మరించినవారికి మరి దుఃఖభీతిలేదు. కనకనే మేమంతా నిన్నారాధిస్తున్నాము."

మే మొక స్త్రీని గురించి, ఆమెకు భగ వంతునిమీద నమ్మికలేమికి, ఆమె శారీరక లక్షణాలకు గల సంబంధాన్ని గురించి ముచ్చ టించుకుంటున్నాము. ఆ తరవాత అమ్మ ఒక ఉంపుడుగత్తె సంగతి ప్రస్తావించింది. ఆమె ఒకసారి శ్రీ రామకృష్ణుని సందర్శించి తన యజమాని తన ఆస్తి అంతా–నగలు, సొమ్ము– అన్నీ కాజేసి ఖర్చుపెట్టాడని మొరపెట్టు కున్నది. ఠాకూరు ఒక్క చూపుతోనే మను ష్యుల హృదయాల రహస్యాలన్ని గ్రహించ గలరు. అయినా ఆయా విషయాలను గురించి ప్రశ్నిస్తూంటారు. ఆ స్త్రీ చెప్పిన మాటలన్ని విని ఆయన "అల్లాగా!" అన్నారు. సామా న్యంగా అందరి సమక్షంలో గొప్ప దైవ విశ్వాసం వ్యక్తీకరిస్తూండేవారు. అదే సమ యంలో ఆయన మనమిప్పుడు ముచ్చటించు కుంటూన్న శారీరిక లక్షణాలను గురించి ముచ్చటిస్తూ వానికి సంబంధించిన చిన్న పద్య మొకటి చదివారు. ఏది ఏమయినా ఆ దుర దృష్టవంతురాలు తాను చేసిన పాపాలన్ని ఆయనదగ్గిర ఏకరువుపెట్టి పశ్చాత్తప్తురాలయి పాపవిముక్తి పొందింది.

నళిని అది విని "అది ఎలాగ కుదురుతుం దమ్మా! ఊరికే నోటిమాటలతోనే ఆమె తన పశ్చాత్తాపం ప్రకటించి అంతమాత్రం లోనే మరుక్షణంలోనే ఆమె పాపాలన్ని హరించిపోతాయా? అది సంభవమేనా?" అని అడిగింది.

దానిమీద మాతృదేవి ప్రతి సమాధానం చెప్పింది.

"ఏం ఎందుకుకాదు? ఠాకూరు మహానీయ భగవద్భక్తులు. ఆయనదగ్గిర తాము చేసిన పాపాలకన్నింటికి పశ్చాత్తాపం వెల్లడించిన వారికందరికి తప్పక పాపాలనుండి విముక్తి కలుగుతుంది. అలాగెందుకు జరగకూడదు? ఇంకొక్కమాట. పదిమందిలోను ఆయా వ్యక్తుల మంచిచెడుగులను గురించిన చర్చ వచ్చినప్పుడు ఆ చర్చలో పాల్గొన్నవారికంద రికి ఆ మంచిచెడుగులపాలు రవంత పంచుకో వలసిన ఆవశ్యకత కలుగుతుంది."

"అదెలాగ జరుగుతుంది?" ప్రశ్నించింది నళిని.

దానిమీద అమ్మ అందుకున్నది.

"అది ఎలాగ జరుగుతుందో నేను చెబు తాను. విను. ఎవరయినా ఒకవ్యక్తి తన మంచిచెడుగులను గురించి నీతో చెబుతా డనుకో! అతడు జ్ఞప్తికి వచ్చినప్పుడల్లా అతని మంచి చెడుగులుకూడా జ్ఞాపకం వస్తాయి. ఆ విధంగా అతని మంచిచెడుగుల ముద్రలు నీ మనస్సుమీద కొంతవరకు పడతాయి. అవునా? కాదా? కొంచెం ఆలోచించుకో అమ్మా!"

ఆపైన మేమిద్దరము, మానవుల దుఃఖాలు, యాతనలు, అశాంతి ఆదిగాగల వానిని గురించి

ముచ్చటించుకున్నాము. దానిమీద అమ్మ అన్నది.

"నా కేమాత్రము జీవితంలో శాంతి లేదు. భగవానుని ఉనికి నా కెన్నడు స్ఫురించలేదు. ప్రశాంతి కలిగేపద్ధతి నా కుపదేశించవలిసింది" అని నా దగ్గిరికి వచ్చినవారు అనేకులు అంటూంటారు. ఆ తరవాత నేను వారివైపు నా వైపు చూసుకుని, 'వారందరు ఎందు కలాగ మాట్లాడతారా!' అని ఆశ్చర్య పడుతూంటాను. నే నందరిలాగే సర్వసామాన్యంగానే ఉన్నాను గాని, నాలో ప్రత్యేకత ఏమి ఉన్నది? అయినా నాలో ఎన్నడు అశాంతి మొలకెత్త లేదు. ఇక భగవానుని సాక్షాత్కారం మాటా? కావాలంటే నా కది వెంటనే లభిస్తుంది. ప్రశాంతంగా ఒకచోట కూర్చోగానే నాకా సాక్షాత్కారం సంప్రాప్తిస్తుంది."

శారదాదేవి "బందిపోటుదొంగ తండ్రి"ని గురించి నే నొకచోట చదివాను. అయితే ఆ కథ అమ్మ ముఖతః, వినాలని అడిగాను.

"అమ్మా నీ వొకప్పుడు దక్షిణేశ్వరానికి ప్రయాణమయినావని, నే నొకచోట చదివాను. అప్పుడు నీ వెంట 'లక్ష్మిఅక్క' మొదలయినవారున్నారని విన్నాను. అయితే నీవు వారిలో సరిసమానంగా నడక సాగించలేక, సాయంకాలమవుతూందని గ్రహించి, వారిని ముందు వెళ్లిపోవలిసిందని కోరావట! అందుచేత బాగా వెనకబడిపోయావట! అప్పుడే నీ "బందిపోటు తల్లిదండ్రుల"తో పరిచయం కలిగిందట! అవునా?" ఆ ప్రశ్నమీద మాతృదేవి ఇలాగన్నది:

"నేను ఆ సమయంలో కేవలము ఒంటరిగా ఉన్నాననడం సరికాదు. ఇంకా నాతోబాటు ఇద్దరు నా కన్న పెద్దవారయిన మహిళలున్నారు. మిగిరినవారందరికన్న మేము ముగురము వెనకబడిపోయాము."*

నేనా వ్యక్తిని చూసినప్పుడు బాగా భయపడ్డాను. అతడు వెండి మురుగులతో, చిందరవందరగా ఉన్నజుట్టుతో చాలా భీకరంగా ఉన్నాడు. ఆపైన పొడుగాటి కర్ర ఒకటి చేత్తో పట్టుకున్నాడు. ఆ రోజుల్లో ఆ ప్రాంతాల్లో బందిపోటుదొంగలు చాలా ఎక్కువగా ఉండేవారు. మేము చాలా భయపడుతున్నట్టు కనిపెట్టి అతడు "మీరు ఎవరు? ఎటువైపు వెడుతున్నారు?" అని ప్రశ్నించాడు. తూర్పుదిక్కువైపు వెడుతున్నట్టు నేను సమాధానం చెప్పాను. దానిమీద అతడు "ఇది దారికాదు. ఇంకొక దారమ్మటే వెళ్లాలి" అని సమాధానం చెప్పాడు. ఆపైన నేను మున్ముందుకు సాగిపోవడం లేదని గమనించి అతడు "భయపడకండి. నాతో ఒక స్త్రీ ఉన్నది. ఆమె బాగా వెనకబడింది." అన్నాడు. దానిమీద నేను అతన్ని "బాబూ" అని పిలిచి సహాయం కోరాను. ఆ రోజుల్లో నే నిలాగ ఉండేదాన్ని కాదు. అప్పుడు ఎంతో దృఢంగా ఉండేదాన్ని. ఎక్కడ ఆగకుండా ఏకబిగిని మూడు రోజులపాటు ప్రయాణం చెయ్యగలిగేదాన్ని. నేను బృందావనం చుట్టూరా ప్రదక్షిణం చేసినా ఏ మాత్రము అలిసిపోలేదు."

ఆ తరవాత శారదామాత తిరిగి ఇలాగన్నది.

"దక్షిణేశ్వరంలో సంగీతం గోపురంకింద ఉన్నగది నీవు చూశావా? నే నక్కడే నివసించేదాన్ని. దాని ద్వారం చాలా కిందుగా ఉండడంవల్ల దానిలోకి అడుగు పెట్టినప్పుడల్లా

---

* దొంగ లెదిరించినప్పుడు శ్రీ శారదామాత కేవలము ఒంటరిగా ఉన్నట్టు, అంతకుమునుపు ఆమెతో మరి కొందరున్నట్టు బాగా విశ్వసనీయంకవల్ల

నా తలకు దెబ్బ తగులుతూండేది. ఒకసారి చాలా పెద్ద దెబ్బే తగిలింది. ఆ తరవాత నేనా ద్వారానికి బాగా అలవాటు పడిపోయాను. లోపలికి వెళ్లబోయేముందు నా శిరస్సు దానంతట అదే వంగిపోతూండేది. కలకత్తానించి బొద్దుగాఉన్న స్త్రీలెందరో నన్ను చూడడానికి వచ్చి, ద్వారానికిరువైపుల చేతులానించి "చూడండి! మహనీయురాలు మన అమ్మ ఎలాంటి ఇంట్లో ఉంటూందో! ఆమె ఏదో విదేశవాసంలో ఉన్నట్టు ఇక్కడ నివసిస్తున్నారు!" అని అంటూండేవారు. ఆపైన అమ్మ నళినికేసి, మాకేసి చూసి "మీరయితే ఒక్కనాడయినా ఆ ఇంట్లో ఉండలేకపోయేవారు!" అన్నది. "అవునమ్మా! అతా! నీ సంగతే వేరు!" అని వారిద్దరు దానికి సమాధానంగా అన్నారు. నేనాపైన అన్నాను.

"అమ్మా! ఆ తరవాత నీకోసం వారొక తాటాకులతో కుటీరం నిర్మించారని, ఒకనాటి రాత్రి విపరీతంగా వాన కురుస్తూండడంవల్ల ఆ కుటీరానికి వచ్చిన ఠాకూరు మరి తిరిగి తమ గదిలోకి వెళ్లలేకపోయారని నేను గురుదాస్ బర్మన్ పుస్తకంలో చదివాను."

అమ్మ: తాటాకుల కుటీరం అంటే నీ అభిప్రాయమేమిటి? అది చాలా సామాన్యమయిన చిన్న ఇల్లు. శారదానందస్వామి రచించిన శ్రీ రామకృష్ణలీలాప్రసంగమన్న పుస్తకం దానినిగూర్చి యథాతథంగా వ్రాసింది. మాస్టర్ మహాశయ్ పుస్తకంకూడా చాలా మంచి గ్రంథమే. ఠాకూరు ప్రసంగాలన్ని యథాతథంగా ఆయన దానిలో వ్రాశారు. ఎంతటి మధురమయిన ప్రసంగాలవి! ఇంకా నాలుగయిదు భాగాలకు తగినంత గ్రంథమున్నదని విన్నాను. అయితే ఆయన బాగా పెద్దవారయినారు మరి. అది పూర్తి చెయ్యగలరా? ఆ పుస్తకాల అమ్మకాలవల్ల కొంచెం పెద్దమొత్తమే ఆయన చేతికందిందని విన్నాను. దానిలో కొంత ఆయన ఒకచోట భద్రంగా జాగ్రత్త చేశారని విన్నాను. జయరాంబాటిలో నా ఇంటికోసం ఆయన దరిదరిగా వెయ్యి రూపాయలదాకా ఇచ్చారు. అందులో కొంత ఇంటికోసము, మరి కొంత ఇతర ఖర్చులకోసము ప్రత్యేకించడం జరిగింది. ఆపైన ప్రతినెల పదేసి రూపాయల చొప్పున ఆయన నాకు పంపించే ఏర్పాటు చేశారు. ఒక్కొక్కప్పుడు అంతకన్న ఎక్కువ మొత్తం కూడా పంపిస్తూంటారాయన. కలకత్తాలో ఉన్నప్పుడు నాకాయన 20, 25 రూపాయల దాకా కూడా పంపిస్తూంటారు. స్కూలులో ఉద్యోగం చేస్తున్నప్పుడు ప్రతినెలా రెండేసి రూపాయల చొప్పున ఇస్తూండేవారు."

నేను: గిరీశబాబు బేలూరు మఠంకోసం చాలా పెద్దమొత్తం ఇచ్చారని విన్నాను. అది నిజమేనా?

అమ్మ: అది అంత పెద్ద మొత్తమేమీ కాదు. ఇప్పుడు సురేశ్ మిత్రా నియమం ప్రకారం ఏదో కొంత ఇస్తున్నారు. అయితే గిరీశబాబు కూడా కొంత ఇవ్వకపోలేదు. నేను బేలూరులో నీలాంబర్ ఇంట్లో ఉన్నప్పుడు ఒక ఏడాదిన్నరపాటు నా ఖర్చులన్ని భరించాడు. అయితే మఠానికి అంత పెద్ద మొత్తమేమీ ఇవ్వలేదు. అతనికి అంతటి సొమ్ము ఎక్కడిది? పూర్వం అతడు చాలా నింద్యమయిన జీవితం గడుపుతూ, దుష్టులతో కలిసి నాటకాల్లో వేషాలు వేస్తూండేవాడు. కాని అతని భగవద్విశ్వాసం చాలా గొప్పది. కనకనే ఠాకూరుకు అతని ఎడల అంతటి దయ కలిగింది. ఠాకూరు అతన్ని స్వయంగా ఉద

రించారు. శ్రీ చైతన్యులలాగే భగవానుడు ప్రతి అవతారంలోను ఒక పాపిని సముద్ధరిస్తూంటాడు. జగాయిని, మాధాయిని శ్రీ చైతన్యు లుద్ధరించారు అది ఎల్లప్పుడు అలాగే జరుగుతూంటుంది. ఒకప్పుడు ఠాకూరే "గిరీశ్ లో భైరవాంశ ఉన్నది." అని అన్నారు.

"ఐశ్వర్యంలో ఏ మున్నదమ్మా! ఠాకూరు నాణాలుకూడా స్పృశించలేక పోయేవారు. ఏదైనా నాణెం తగలగానే ఆయన చెయ్యి కొంకరలు తిరిగిపోయేది. ఆయన తరుచు ఇలాగంటూండేవారు.

"ఇదిగో, చూడు బాబూ, రామలాలూ!* ప్రపంచమే అవాస్తవికమయిన భ్రమ. ప్రపంచం భ్రమకాదని వాస్తవికమయినదని అనుకునిఉంటే, ఈ లోకంనించి వెళ్ళేముందు కామార్పుకూర్ అంతా నేను యథార్థమయిన పైడితో పూతపూసి ఉందును అయితే భగవానుడు ఒక్కటే యథార్థమని మిగిలినదంతా అయథార్థమని నే నెరుగుదును."

ఆ పైన 'మాకు' తన పరిస్థితిని గురించి వాపోయింది.

"నేనెప్పుడు ప్రశాంతంగా ఒక్కచోట ఉండలేక పోతున్నానేమిటి?" దానిమీద శారదామాత ఇలాగ ప్రశ్నించింది.

"ప్రశాంతంగా" అంటే నీ అభిప్రాయమేమిటి? నీవు ఎక్కడ ఉన్నా అక్కడే ప్రశాంతత అలవరుచుకోవాలి. నీ భర్త దగ్గరకి వెడితే ప్రశాంతంగా ఉండగలనని భావిస్తున్నావా? అది ఎలాగ వీలవుతుంది? అతడు అట్టే సంపాదించడం లేదు. నీవు ఎలాగ కాలక్షేపం చెయ్యగలవు? నీవిక్కడ నీ పుట్టింట ఉన్నట్టే ఉన్నావు. మనుషులు తమ తండ్రుల ఇళ్ళలో ఉండరా? ఇదిగో. ఈ వ్యక్తి తన ఇంటికి చాలా దూరంలో ఉంటున్నాడు. నీవు ఏది విడిచిపెట్టలేవా? ఆవిడకేసి చూడు. ఆమె ఎంత ప్రశాంతంగా ఉన్నదో గమనించావా? నేనిక్కడ ఉన్నాను కనక ఆమె కూడా ఇక్కడే ఉన్నది. అంతే! నీవు కూడా అలాగ ఉండలేవా?"

"పోనీలే అమ్మా! అది అలాగుండనీ! ఠాకూరును గురించి ఇంకా ఏమన్నా చెప్పమ్మా" అన్నాను. ఆపైన అమ్మ అందుకున్నది.

"ఠాకూరు గురించి పుస్తకాల్లో ఉన్నది అంతా అన్ని విషయాల్లోను యథార్థంకాదు. షోడశీ పూజ చేసినప్పుడు ఠాకూరు నన్నెలాగ అర్చించారో రామచంద్రదత్త పుస్తకంలో యథాతథంగా యథార్థంగా అభివర్ణించలేదు".

ఆపైన అమ్మ అది అంతా అభివర్ణించి ఇలాగన్నది. "ఆ పూజ ఇంటిదగ్గర జరగలేదు. దక్షిణేశ్వరంలో ఠాకూరు గదిలో చుట్టు వరాండాలో జరిగింది. ఇప్పుడక్కడ గంగాజలంతో నిండించిన పెద్ద భాండమున్నది. ఆ పూజ ఏర్పాట్లన్ని హృదయ్ చేశాడు."

అదే సమయంలో జోగీన్ మా అక్కడికి వచ్చింది. కిటికీ దగ్గర నిలబడి ఆమె ఏదో చెప్పబోయింది. అంతలోనే శారదామాత "రా అమ్మా! రా! ఈమధ్యన నీవెక్కడ కనిపించడమే లేదే!" అంటూ లోపలికి పిలిచింది.

ఆపై జోగేన్ మా నవ్వుతూ అమ్మదగ్గిరికి వచ్చింది. ఆమె అమ్మదగ్గిరికి వెడుతూంటే ఆమె పాదం నా శరీరానికి తగిలింది. ఆమె వెంటనే చేతులు జోడించి క్షమాపణ వేడుకున్నది.

—సశేషం.

* ఠాకూరు మేనల్లుడు.

# సూతసంహిత

ఏలూరిపాటి అనంతరామయ్య

1978 సం॥ ఏప్రిల్ సంచిక నుండి ధారావాహినిగా సూతసంహిత ఇందు ప్రచురింపబడుచున్నది. ఈ ఏప్రిల్ సంచికతో సూతసంహితలో మొదటి భాగమైన శివమాహాత్మ్యఖండం పూర్తియైనది. (ఈ ఖండంలోని 13 అధ్యాయాల్లో ఒక అధ్యాయం మాత్రం ఇందు ప్రచురింపబడలేదు. జాతినిర్ణయకథనం అను పన్నెండవ అధ్యాయమే అది.) ఈ సూతసంహితలో ఇంకను జ్ఞానయోగఖండం, ముక్తిఖండం, యజ్ఞవైభవఖండం అను మూడు భాగములున్నవి. కాని అనివార్యకారణములచే సూతసంహిత ప్రచురణను ప్రస్తుతము రామకృష్ణప్రభలో కొనసాగింపలేకపోవుచున్నాము. సూతసంహిత అనువాదకులైన శ్రీ ఏలూరిపాటి అనంతరామయ్యగారు, మిక్కిలి శ్రమతో కూడిన ఈ అనువాదకార్యభారమును వహించి, ఏ నెలకానెల సమయము మించిపోకముందే వ్రాత ప్రతులను పంపి సహకరించినందులకు ఆయనకు మనఃపూర్వక కృతజ్ఞతలను తెలుపుకొనుచున్నాము.

## పదమూడవ అధ్యాయం

## తీర్థమాహాత్మ్య కథనం

నైమిశీయులు "భగవానుడా, సర్వశాస్త్రార్థ విత్తమా, దయతో సర్వప్రాణిహితం కోసం, మాకు సంతోషంతో తీర్థమాహాత్మ్యం చెప్పు" అని అడిగారు.

సూతుడు చెప్పాడు:

మునీశ్వరులారా, సర్వశాస్త్రోక్తమైన తీర్థ మాహాత్మ్యం సంగ్రహంగా చెపుతాను. పరమ శ్రద్ధతో వినండి 2.

గంగాద్వారం: గంగాద్వారం మహాతీర్థం. సర్వదేవతలూ దానిని సేవిస్తారు. మునీశ్వరులారా, సూర్యుడు మేషరాశిలో అశ్విని నక్షత్రంలో ఉన్నపుడు ఆ తీర్థంలో స్నానం చేసి 3, శ్రద్ధతో శివయోగికి యథాశక్తి ధనమిచ్చి, ఉపవసించిన మానవుడు సర్వపాపముల నుంచీ విముక్తుడవుతాడు ద్విజులారా 4.

సోమతీర్థం: విప్రులారా, పశ్చిమ సముద్ర తీరాన సోమనాథుని సన్నిధిలో సోమతీర్థమని ప్రసిద్ధమైనది ఉన్నది. దానిపొడవు యోజనం 5. వెడల్పు యోజనం. సర్వదేవతలూ దానిని సేవిస్తారు. విప్రులారా, పూర్ణిమనాడు, ఆర్ద్రా నక్షత్రంలో, అష్టమినాడు, వ్యతీపాతంలో, ద్విజులారా 6, ఆదివారంనాడు, చతుర్దశినాడు, ఇందులో స్నానంచేసి, అన్నదానంచేసి, సోమనాథుడనే సోమవిభూషణుడైన సోముని (శివుని)కి ప్రణమిల్లి 7, విభూతి కేశములకు పూసికొని ఒక్కరాత్రి ఉపవసించిన మానవుడు శంకరుని పొందుతాడు 8.

మణికర్ణిక: వారణసిలో మణికర్ణిక అనే మహాతీర్థం ఉన్నది. అందులో ఉదయమే ప్రశాంతచిత్తుడై మహాభక్తితో స్నానం చేసి 9, కరుణాసాగరుని, హరుని, విశ్వేశ్వరదేవుని దర్శించి యథాశక్తి అన్నపానాదిదానం చేసిన నరుడు ముక్తుడవుతాడు 10.

ప్రయాగ: ప్రయాగ అని మహాతీర్థం ఉన్నది. అది సంసారరోగానికి మందు, భరణిలో కాని కృత్తికలోగాని విశేషించి రోహిణిలో గాని 11, రవి మేషరాశిలో ఉండగా ఆ తీర్థంలో స్నానంచేసిన మానవుడు విముక్తుడవుతాడు. మునీశ్వరులారా, 12, ఆర్ద్రలో గాని, మృగశీర్షంలోగాని, గంగాసాగరసంగమంలో మధ్యాహ్నవేళ స్నానంచేసి, ప్రీతితో యథాశక్తి ధనదానం చేసినవాడు 13 సర్వపాపవినిర్ముక్తుడై శివసాయుజ్యం పొందుతాడు.

నర్మద: నర్మదకూడా మహాతీర్థం. నరక

6—వ్యతీపాతం=విష్కంభము మొదలైన ఇరవై యేడు గ్రహయోగాలలో ఒకటి.

ద్వారాన్ని నశింపజేస్తుంది 14, బ్రహ్మావిష్ణ్వాదులూ శివుడూకూడా దానిని సేవిస్తారు. అందులో స్నానంచేసి యథాశక్తి ఆదరంతో ధనదానం చేసిన 15 నరుడు బ్రహ్మలోకం పొందుతాడు. ఇందులో ఆలోచించవలసినది లేదు.

యమున: యమునకూడా మహాతీర్థం. దానిని యముడుకూడా సేవిస్తాడు16, రవి వృషభ రాశిలో ఉండగాగాని, విశాఖానక్షత్రయుక్తమైన ఆదివారం గాని అందులో భక్తితో స్నానంచేసి, బీదలకు అన్నదానం చేసిననరుడు 17. సర్వపాప వినిర్ముక్తుడగును.

సరస్వతి: సరస్వతి అని విఖ్యాతమైనది సర్వవరప్రద 18 అందులో సర్వదా వాగీశ్వరీ దేవి ఆదరంతో నివసిస్తుంది. అందులో ఏ కొంచెమైన శివయోగికి19 దానం చేసిననరుడు పుత్రాదులతో సహా స్వర్గం పొందుతాడు.

గోదావరి: గోదావరి అని లోకంలో సుప్రసిద్ధమైన మహానది ఉన్నది20. దానిని సర్వయోగీశ్వరులూ ఆరాధిస్తారు. ఆ మహానది సహ్యాపర్వతం నుంచి జన్మించింది. సూర్యుడు సింహరాశిలో ఉండగానూ అందులో స్నానం చేసి యథాశక్తి ధనదానం చేసిన మానవుడు 21 పన్నెండుసంవత్సరాలు నిత్యమూ గంగా నదిలో స్నానంచేసిన ఫలం పొందుతాడు.

కృష్ణవేణి: విప్రులారా, కృష్ణవేణి అని లోక ప్రసిద్ధమైన మహానది ఉన్నది22. ఆ శుభ నది సహ్యాపర్వతం నుంచే వెలువడింది. సర్వయోగీశ్వరులూ దానిని ఆరాధిస్తారు. ఇంద్రకీలగిరి అందులో స్నానంచేసి శంకరపీఠమైనది 23. శ్రీ మన్మహాదేవుడు శివతో విష్ణ్వాదులతో సహా నిత్యమూ నదిలో స్నానంచేస్తూ ఆ ఉత్తమపర్వతంపై ఉంటాడు24. బ్రహ్మవిత్తములారా, నరుడు పర్వంలో ఆ నదిలో స్నానం చేసి ఉపవసించి యథాశక్తి ధనదానం చేసి భవబంధవిముక్తుడవుతాడు25.

సువర్ణముఖరి: సువర్ణముఖరి అనేనది ఉన్నది. అది సంసారనాశిని. ఆస్తికులారా, సమస్త ప్రాణులకూ భుక్తిముక్తిసిద్ధికొరకు26 పరమాత్మ సాక్షాచ్ఛివుడు కేవలం కృపతో మాఘమాసంలో మఘానక్షత్రంలో నిర్మించడానదిని ద్విజోత్తములారా 7 ఆ నదిఒడ్డున శ్రీమద్దక్షిణకైలాసంపై శశిభూషణుడు శంకరుడు మహాదేవుడు పరశివాదేవితో సహా28 ఉంటాడు. ఆ సువర్ణముఖరీనదిని చూచి, ఆ నదిలో కలిసి (సర్వ) తీర్థాలూ తమపాపాలు ధ్వంసం కావటానికని ఉంటాయి29. మహాభక్తితో మాఘమాసంలోనూ మఘానక్షత్రంలోనూ (ఆ నదిలో స్నానంచేసి శివయోగికి యథాశక్తి శ్రద్ధతో ధనదానం చేసి30 శ్రీమద్దక్షిణకైలాసవాసి, వాసవార్చితుడు, శివుడు, నరులకు శివకరుడు అయిన శ్రీ కాళహస్తిశైలేశ్వరునికి31, భక్తితో దండప్రణామమాచరించి (ఎందరో) పాపపంజరం నుంచి విముక్తులైనారు. నరుడు మఘానక్షత్రంలోనూ మాఘమాసంలోనూ ఆ నదిలో. స్నానంచేసి 2 సర్వపాప వినిర్ముక్తుడై శివ సాయుజ్యం పొందుతాడు.

కంపానది: కంప అనేనది పుణ్యప్రదమైనది. దానిని బ్రహ్మదేవుడు నిర్మించాడు33. ద్విజోత్తములారా, ఆ నదిలో స్నానంచేసి శశిశేఖరుని శంకరుని చూచి నరుడు తత్క్షణమే భవబంధనంనుంచి ముక్తుడవుతాడు34. ఆదిలింగంవద్ద అచ్యుతుడు, హరి, మహావిష్ణువు ఆ నదిని శ్రద్ధతో చూచి విప్రులారా, అందులో స్నానంచేసి మహేశ్వరుని ఆరాధించి అక్కడ దేవదేవునిసన్నిధిలో ఉన్నాడు. ఆ నదిలో ఆదివారం గాని, పర్వంలో గాని, హస్తా నక్షత్రంలో గాని, ఉత్తరఫల్గునిలో గాని

ద్విజులారా, బ్రాహ్మణులారా, శ్రద్ధతో స్నానంచేసి విప్రునికి అన్నదానాదులుచేసి నరుడు స్వర్గలోకంలో ఉంటాడు35-37.

కుటిలానది: కుటిల అని లోకంలో ప్రసిద్ధమైన మహానది ఉన్నది. దానిఒడ్డున అధిక అనే రమ్యనగరం ఉన్నది. దానిని సూర్యుడు నిర్మించాడు. దానినిండా అప్సరసలున్నారు; దేవతలున్నారు; రాక్షసులున్నారు.

మునిశ్రేష్ఠులారా, వేదవేత్తలారా, దృఢవ్రతురాలు వీర అనేపేరుగల భద్రకాళి శ్రావణపూర్ణిమనాడు ఆ నగరానికి వెళ్లింది. సర్వదేవతలకూ తొలివాడు మహేశ్వరుడు. ఆయనను అక్కడ ప్రతిష్ఠించి ఆ ధర్మజ్ఞురాలు కుటిలానదీజలంతో శ్రద్ధతో అభిషేకించింది. ఆ దేవదేవుని కరుణానిధిని ప్రార్థించింది : "దేవదేవా, అశివనాయకా, శ్రావణపూర్ణిమనాడు ఈ నదిలో శ్రద్ధతో స్నానంచేసి, నిన్ను దర్శించి, స్తుతించి, నమస్కరించి42 విద్వాంసునికి యథాశక్తి వస్త్రధనధాన్యదానాలు చేసినవానికి భోగమోక్షాలు అనుగ్రహించు" అని38-43. విప్రేంద్రులారా, వేదవిత్తములారా, వీరు ప్రార్థింపగా శివదేవుడు గంభీరవాక్కులో 'అట్లే అగుగాక' అని చెప్పాడు44: ఆదివారంనాడు ఆ నదిలో పరమశ్రద్ధతో స్నానంచేసి ధనం కాని, ధనేతరం కాని దానంచేసినవాడు ముక్తుడవుతాడు. ఇందులో సంశయం లేదు45.

మణిముక్తానది: ద్విజులారా, మణిముక్త దివ్యనది. మహాదేవుడు నిర్మించినది. విష్ణువు, రుద్రుడు, బ్రహ్మ, అగ్ని, వాయువు, విశ్వేదేవతలు, వసువులు, సూర్యుడు, ఇంద్రదేవుడు, - వీరు, ధనూరాశిలో సూర్యుడుండగా ఆర్ద్రానక్షత్రంలో ఆ నదిలో స్నానంచేసి ధనదానంచేసి లోకహితకాంక్షతో శ్రీమద్వృద్ధాచలేశ్వరునికి నేలపై సాగిలపడి, దండప్రణామం చేశారు. శ్రీమద్వృద్ధాచలేశ్వరేశ్వరుని ప్రార్థించారు: "చెడునడతగలవాడైనా మంచినడతకలవాడైనా, మూర్ఖుడైనా పండితుడైనా, బ్రాహ్మణుడైనా శూద్రుడైనా, చండాలుడైనా ఇతరుడైనా, సూర్యుడు ధనూరాశిలో ఆర్ద్రానక్షత్రంలో ఉన్ననాడు శ్రద్ధతో ఈ నదిలో స్నానంచేసి వృద్ధాచలేశ్వరస్వరూపుడైన శివయోగికి యథాశక్తి ధనం కాని, ధాన్యం కాని, వస్త్రమే కాని, దానంచేసి, ఉపవసించి, ప్రాతఃకాలమే వృద్ధాచలేశ్వరేశ్వరునికి నమస్కరించినవానికి ఉత్తమగతి నను్గ్రహించు" అని.

ఇలా అందరూ ప్రార్థించేసరికి బ్రాహ్మణులారా, వేదవిత్తములారా, శ్రీమద్వృద్ధాచలేశ్వరుడు సంతోషించి "అట్లే అగుగాక" అని పలికాడు గంభీరవాక్కులో46-53. ఆ ఆర్ద్రానక్షత్రంనాడు శ్రద్ధతో మణిముక్తానదిలో స్నానంచేసిన మానవునికి ద్విజులారా, సంసార-జననమరణ-విచ్ఛిత్తి సిద్ధిస్తుంది. ఇందులో ఆలోచించవలసినది లేదు54.

శివగంగాతటాకం: శ్రీమద్వ్యాఘ్రపురం రమ్యమైనది. దానిని మహాలక్ష్మి సేవిస్తున్నది. ఆ పురంలో శివగంగ అని ప్రసిద్ధమైన తటాకమున్నది. అది ఉత్తమతీర్థం55. దాని దక్షిణపు టొడ్డున శశిశేఖరుడు శ్రీశంకరుడు పరానందం అనుభవించిఅనుభవించి నృత్యంచేస్తూ ఉంటాడు 56. బ్రహ్మాదిదేవతలూ మునులూ ప్రతిదినమూ ఆ తటాకంలో స్నానంచేసి భవానీసహితుడై

35-37. పర్వము=అమావాస్య యొక్కయూ పాడ్యమియొక్కయూ సంధి; విషువత్తు మొదలైనది; పంచపర్వాలు; అష్టమి, చతుర్దశి, కుహువు (=చంద్రకళలేని అమావాస్య), పూర్ణిమ, సూర్యసంక్రాంతి.

కృత్యంచేసేశివునికి 57 మహాభక్తితో సంసార రోగనివృత్తికోసం నమస్కరిస్తూ ఉంటారు 58. ఆ తటాకంలో భవానీసహితుడు హరుడు సాక్షాన్మహాదేవుడు, ఈశ్వరేశ్వరుడు ప్రాణి రక్షకోసం మాఘమాసంలోనూ మఘానక్షత్రంలోనూ బ్రహ్మవిష్ణ్వాదులతోపాటు స్నానం చేస్తాడు59. అట్టి ఆ తీర్థంలో నరుడు భక్తితో స్నానం ధనదానం ఆదరంతో చేసి సర్వసమతను పొంది బ్రహ్మము పొందుతాడు ద్విజోత్తములారా90.

గుహ్యతీర్థం: వేదవిత్తములారా, ఈ శ్రీమద్వ్యాఘ్రపురానికి ఈశాన్యదిశగా సముద్రంలో గుహ్యతీర్థమని ప్రసిద్ధమైనది ఉన్నది. సముద్రతీరం మొదలు ఒక యోజనం వెడల్పు అంతే పొడవూ ఉన్నది. బ్రహ్మ విష్ణువూ61,62. రుద్రుడూ, అశేష దేవాదులూ, మునులూ దానిని సేవిస్తూఉంటారు. వేదవేత్తలలో ముఖ్యులారా, పూర్వం జలనాయకుడు వరుణుడు 63 పొరపాటున జీవహత్యచేసి, ఆ పాపం పోగొట్టుకోవటానికి, వ్యాఘ్రపాదునిమాట విని, బహు వేగంతో 64 ఈ గుహ్యతీర్థానికి వెళ్లి, మఘానక్షత్రంలోనూ మాఘమాసంలోనూ మహాభక్తితో అందులో స్నానం చేసేసరికి అతని కల్మషం దగ్ధమై పోయింది65. ఇంతలో అంబికాపతి శ్రీమన్నీలకంఠుడు కృపాబలంవల్ల వరుణుని అనుగ్రహించాడు66. ధర్మాత్ముడు వరుణుడూ వాంఛితార్థములిచ్చే మహాదేవుని - లోకాలకు హితం కోరి ప్రార్థించాడు ; 67 "దేవా, భగవానుడా, బ్రాహ్మణుడు గానీ అంత్యజుడు గానీ, మఘానక్షత్రంలోనూ మాఘమాసంలోనూ నా పూజచేసి, శ్రద్ధతోనే ఈ తీర్థంలో స్నానంచేసి దానంచేసినవానికి వేగంగా ముక్తి అనుగ్రహించు" అని68.

దేవదేవుడు మహాదేవుడు వాఙ్మనోఽగోచరుడు హరుడు 69 "అట్లే అగుగాక" అని గంభీరవాణితో అన్నాడు విప్రేంద్రులారా.

పర్వంలో ఈ తీర్థంలో స్నానంచేసి ఆదరంతో ధనదానం చేసినవాడు70 సమస్త పాపములూ వదలి పరమగతికి వెడతాడు. మునిశ్రేష్ఠులారా, ఇందులో ఎందరో ప్రతి పర్వంనాడూ స్నానంచేసి71, సర్వపాపాలనూ విడిచి సంసారబంధం నుంచి విముక్తులైనారు.

బ్రహ్మతీర్థ తటాకం: బ్రహ్మతీర్థమని ప్రసిద్ధమైన తటాకాన్ని బ్రహ్మ నిర్మించాడు72. అది బ్రహ్మపురం నడుమ ఉన్నది. వేదవిత్తములారా, భగవానుడు రోమశుడు ఆ తటాకంలో 73 నిత్యమూ మహాభక్తితో స్నానంచేస్తూ బహుమహాతపస్సు ఆచరించాడు. కల్పాదిలో బ్రహ్మ ఆతటాకంలో స్నానంచేసి ద్విజులారా, పరమేశ్వరుని74 ఆదరంతో లోకాల సృష్టిస్థితుల కోసం పూజించాడు. అందులో ఆదివారమూ, గ్రహణవేళా, పర్వంలోనూ స్నానంచేసి75, భక్తితో ధనదానం చేసినవాడు పరమేశ్వరుని పొందుతాడు.

సూర్యపుష్కరిణి: సూర్యపుష్కరిణీతీర్థం మిక్కిలి శుభకరమైనది 76, శ్రీమద్బ్రహ్మపురానికి పడమటిదిక్కున ఉన్నది. అందులో ఆదివారమూ, చంద్రసూర్య గ్రహణాలప్పుడూ, విషువంలోనూ, పర్వంలోనూ, ఆర్ద్రానక్షత్రంలోనూ స్నానంచేసి పూషుడు దక్షాధ్వరంలో ఊడిన పళ్ళు లభించి ప్రీతిచెందాడు77,78.

పండితోత్తములారా, పూర్వం రావణుని

77-78. ఉత్తరఫల్గుని=ఉత్తర విషువం=విషువత్తు=రేయీపగలూ సమమైనకాలం. అయనకాలాలు=దక్షిణాయన ఉత్తరాయణ ప్రారంభసమయాలు.

కొడుకు ఇంద్రజిత్తు సకలజగత్తునూ జయించి పొగరెక్కి రథమెక్కి79. ఆకాశమార్గంలో అతివేగంతో వెడుతుండగా, ఈ తీర్థపు దక్షిణ తీరాన రథం నిలిచి పోయింది ద్విజులారా80, అతడూ మంచి తెలివైనవాడు గనుక, అది చూచి చాలాసేపు ఆలోచించి అక్కడే శ్రద్ధతో పరమేశ్వరుని పూజించాడు81. రాక్షసుల మహాధనం దేవదేవుడు మహాదేవుడు భవానీసహితుడు హరుడు స్వయంగా ప్రీతితో అక్కడే ఉన్నాడు82. ఇంద్రజిత్తు ఈశ్వరుని (కదలించి) తీసుకొనలేకపోయాడు. అతడు చాలాసేపు ఆలోచించి పరమేశ్వరునికి 83 ముమ్మారు ప్రదక్షిణంచేసి, ఉత్తమరథమెక్కి వివర్ణుడై బాగా పట్టుతప్పి లంకాపట్టణానికి వెళ్లాడు ద్విజులారా84.

పర్వంలో ఈ తీర్థంలో స్నానంచేసి సంతోషంతో బ్రాహ్మణుని భుజింపజేసినవాడు సర్వపాపాలూ పోయి శివలోకానికి వెడతాడు85.

కావేరీనది: వేదవేత్తలలో శ్రేష్ఠులారా, కావేరీ సాగరసంగమంలో స్నానం చేసినవాని సర్వపాపలూ నశిస్తాయి. సంశయం లేదు86. అలాగే, ద్విజులారా, శ్వేతారణ్యం, కుంభఘోణం, మధ్యార్జునం, హృదయస్థానం అభ్రమ తీర్థం, మంగళవంశికం87, త్రికోటిపీఠం–ఈ స్థానాలలో కావేరి శ్రేష్ఠమైనది; అన్ని కోరికలూ తీరుస్తుంది, ఈ స్థానాలలో కావేరిలో పర్వంలోనూ ఆదివారంనాడు స్నానంచేసి పరమేశ్వరునికి నమస్కరించి ధనం గాని, అన్యం గాని దానంచేసిన పురుషుడు మహాపాపంనుంచి విముక్తుడవుతాడు. ఈ స్థానాలలో మరణించిన పురుషుడు పాపిష్ఠుడు గానీ, శ్రేష్ఠుడు గానీ, అతడు ముక్తుడవుతాడు. ఇందులో సంశయం లేదు విప్రేంద్రులారా. ఈ సప్తస్థానాలలో మరణించినందున అనేకులు ముక్తులైనారు88 9.

క్షీరకుండం: క్షీరకుండమని ప్రసిద్ధమైనది సర్వతీర్థాలలోకీ ఉత్తమమైనది. అది సంసార రోగానికి మందు. పుణ్యప్రదమైనది. సర్వపాపాలనూ నశింపజేస్తుంది91. అన్ని కోరికలనూ తీరుస్తుంది. దివ్యమైనది. శ్రీమద్వల్మీకమధ్యంలో ఉన్నది. బ్రాహ్మణులారా, ఉత్తరలో ఫాల్గున మాసంలో విష్ణువూ92 శంకరుడూ, దేవతలూ మునులూ, సర్వప్రాణులూ, సోమసూర్యులూ సేవించినది. స్వర్గంనుంచి వల్మీకానికి వచ్చినది 93 ద్విజోత్తములారా, ఫాల్గునమాసంలో ఉత్తరలో శ్రద్ధతో (అందులో) స్నానంచేసినవాని సర్వపాపాలూ నశిస్తాయి94 ఇందులో వ్యతీపాత వేళ స్నానంచేసి ఆదరంతో ధనదానం చేసిన వానికి అప్రయత్నంగా ముక్తి తప్పక సిద్ధిస్తుంది. సంశయం లేదు95.

దేవతీర్థం: దేవతీర్థమని ప్రసిద్ధమైనది క్షీరకుండానికి పశ్చిమంగా ఉన్నది. పూర్వం దేవేంద్రుడు అందులో ప్రతిపర్వంలోనూ స్నానంచేసి 96, సంవత్సరాంతంలో వల్మీకనివాసి అయిన మహాదేవునికి ఆదరంతో ముమ్మారు ప్రదక్షిణం చేసి నేలపై (సాగిలపడి) దండప్రణామంచేసి97, దేవరాజత్వం విడిచిపెట్టి కర్మబంధంనుండి విముక్తుడైనాడు.

ఫాల్గునమాసంలో ఉత్తరలో మర్త్యుడు శ్రద్ధతో దేవతీర్థంలో స్నానంచేసి98 వల్మీకనివాసికి ఈశ్వరునికి ముమ్మారు ప్రదక్షిణంచేసి, ధనం కాని, మరొకటి కాని దానంచేసి, సంసారబంధనంనుంచి విముక్తుడవుతాడు99. ఆదివారం, ఆర్ద్రలో, విశేషించి కృష్ణాష్టమినాడు ఈ దేవతీర్థంలో స్నానంచేసినవాడు ఉత్తమ గతి పొందుతాడు100.

సేతురామేశ్వరం: సేతుమధ్యంలో మహాతీర్థం గంధమాదనపర్వతం ఉన్నది. అందులో రాముడు మహాభక్తితో సీతతో లక్ష్మణునితో

సుగ్రీవాది ఉత్తములితరులతో మునులతో దేవ గంధర్వులతో యక్షవిద్యాధరాదులతో స్నానంచేసి 101, 2, రాక్షసరాజును చంపినందున కలిగిన బ్రహ్మహత్యను విడిచి శ్రీమద్రామేశ్వరుడనే మహాదేవుని ప్రతిష్ఠించి103 తీర్థమాహాత్మ్యం తెలుసుకొని అధికధనదానం చేశాడు.

వేదార్థసారగులారా, ద్విజోత్తములారా, వ్యతీపాతవేళ గాని, చంద్రసూర్యగ్రహణాలలో గాని, ఆదివారం గాని, శుక్రవారం గాని, పర్వంలో గాని, ఆర్ద్రనాడు గాని, విషువంలో గాని, అయనకాలాలలో గాని, షడశీతిముఖంలో గాని, అర్ధోదయంలో గాని, సుముహూర్తాలలో గాని, ఆ తీర్థంలో స్నానం చేసి యథాశక్తి ధనదానం చేసి, రామేశ్వర శివుని దర్శించి లౌకికవైదికస్తోత్రాలతో స్తుతించి భక్తితో ముమ్మారు ప్రదక్షిణం చేసినవాడు బ్రహ్మహత్యాదిమహాపాపాల నుంచి విముక్తుడవుతాడు. ఇక్కడ మరణిస్తే కృతఘ్నులుకూడా విముక్తులవుతారు103-8.

మహాభక్తితో ఇక్కడే మాసమాత్రం ప్రతిదినమూ స్నానంచేసి రామేశ్వరుని దర్శించి, నిష్కమాత్రసువర్ణం ఆదరంతో దానంచేసి109 మాసాంతపర్వం (అమావాస్య) నాడు ఒకరాత్రి ఉపవసించి ద్విజులారా, బ్రహ్మహత్య, సురాపానం, సువర్ణచౌర్యం, మొదలైన బుద్ధిపూర్వంగా చేసిన పాతకాల నుంచి మర్త్యుడు ముక్తుడవుతాడు. ఇందులో సంశయంలేదు. ఇక్కడ స్నానం చేసినంత మాత్రంచేత చాలామంది కృతార్థులైనారు ద్విజులారా 111.

గురుపరంపర: ముందు చెప్పిన ఈ తీర్థాలను గురించి వేదాలలో శాస్త్రాలలో శివాగమాలలో చూచి దేవుడు భవానీపతి అంబికకు దయాబలంతో చెప్పాడు112. తిరిగి దేవి శంకరి గుహునికీ, గుహుడు బ్రహ్మకూ, చతుర్ముఖుడు తరువాత సమస్త జగత్ప్రసిద్ధికోసం మా గురువుకూ, అపారకృపా మహాసముద్రుడు మా గురువు నాకూ చెప్పారు113. విప్రులారా, మీకు మహాకృపాబలంతో మేమిది జగద్ధితంకోసం చెప్పాము. పరమశివప్రసాదసిద్ధికోసం సదా దీనిని మీరు శిష్యులకు సంతోషంతో చెపుతూ ఉండాలి114.

తీర్థమాహాత్మ్య ఫలశ్రుతి: ఈ తీర్థమాహాత్మ్యం సుముహూర్తంలో పఠించినవాడు సర్వపాపవినిర్ముక్తుడై పరమగతికి వెడతాడు 115. దీనిని నిత్యమూ సుముహూర్తాలలో వినిన మానవుడు సర్వపాపవినిర్ముక్తుడై శివలోకంలో ఉంటాడు116. తీర్థాలలోగాని, శ్రాద్ధకాలంలో గాని దీనిని వినిపించినవాడు సకలదారిద్ర్యమూ విడిచి మహాధనవంతుడవుతాడు117. దీనిని సంతోషంతో వింటూ దేవతాపూజ చేసిన వానిపట్ల బ్రహ్మ విష్ణు మహేశ్వరులు ప్రసన్నులవుతారు118. భగవానుడు దేవకీపుత్రుడు సర్వప్రాణిహితమందలి ఆసక్తితో మహాదేవానుగ్రహంకోసం దీనిని నిత్యమూ పఠిస్తూ ఉంటాడు119.

కనుక, మీరుకూడా, మునులారా, త్రిశూలి ప్రసాదంకోసం పరమశ్రద్ధతో దీనిని నిత్యమూ పఠించాలి120

104-108. షడశీతిముఖంలో=మిథునం, కన్య, ధనుస్సు, మీనం=ఈ రాసులలో రవి ప్రవేశించే సమయంలో.

109. నిష్కం=పలం=నాలుగు కర్షములు; కర్షం=16 మినుపగింజలయెత్తు. అంటే 64 మినుపగింజలయెత్తు ఒకపలం=కర్షం

సర్వార్థములూ తెలిసినవారిలో ఉత్తముడు సూతుడు మునీంద్రులకు ఈ విధంగా చెప్పి మిక్కిలి ఆనందపడ్డాడు. సోముడు, సోమార్థ శేఖరుడు121, సర్వజ్ఞుడు, సర్వకర్త, సంసార రోగౌషధం, సురలూ అసురలూ, మునీంద్రులూ మ్రొక్కే పాదపద్మములవాడు,123 (అయిన శంకరుని) హృదయపద్మంలో భక్తితో ధ్యానించేసరికి అతని ఇంద్రియములూ మనస్సు తేటపడినాయి. నేలపై (సాగిలపడి) జగద్గురువైన మహాదేవునికీ, సంసారసముద్రం తరించటానికి పడవ అయిన వేదవ్యాసునికీ దండప్రణామం చేసి మునిశ్రేష్ఠులను వీడుకొని కైలాసాచలానికి వెళ్ళాడు124, 125.

ఇది శ్రీస్కాందపురాణం శ్రీసూతసంహితలోని శివమాహాత్మ్యఖండంలో 'తీర్థమాహాత్మ్యకథనం' అను పదమూడవ అధ్యాయం.

(శివమాహాత్మ్యఖండం సమాప్తం)

---

మృతులు తిరిగిరారు; కడచినరాత్రి మరల గోచరింపదు; పతనమైన అల క్రొత్తగా లేవబోవదు; ఇట్లే మానవుడును పూర్వశరీరమును మరల ధరింపబోడు. కావున ఓ మానవుడా! భూత మృత విషయారాధనమును మాని సజీవ వర్తమానమును ఉపాసించుటకై మేము నిన్నాహ్వానించుచున్నాము; గతార్థములను గూర్చి యూరక చింతించుటమాని ప్రస్తుత కార్యాచరణమునకై మేము నిన్నాహ్వానించుచున్నాము; ప్రాత పుంతలను శిథిల మార్గములను తిరిగి కనుగొనుటలో నీ శక్తి సామర్థ్యములను వ్యర్థమొనర్చుకొనుట మాని అతి సమీపమున గల నూతన విశాల రాజమార్గములను బట్టుటకై మేము నిన్నామతించుచున్నాము. ధీమంతులిది గ్రహింతురుగాక!

---

# కబీరు వచనామృతము

## కబీరు ఉపదేశములు

(1)

ఓ సాధూ! ఎవడు నిర్మలుడై నాడో అతడే నెరవేరును. ఎంతవరకు పవిత్రతాసాధన సఫలము కాలేదో అంతవరకును ప్రేమ కుదురదు. తినకయే ఫలముయొక్క ఆస్వాదము గురించి వ్యాఖ్యానమొనర్చినచో నయ్యది శోభింపదు. అంధుడు తనచేత దీపము పట్టుకొని వెలుగు చూపుచో నితరులకడ వెలుగుపడినను, తాను మటుకు చీకటియందే పడియుండును.

(2)

ఎంతవరకు పరమాత్మతో పరిచయము కాలేదో, అంతవరకునేమియు లభింపలేదు. తీర్థ వ్రత జప సంయమములందు దగుల్కొని మరపుగొనకుము. నేను స్నానము చేయను. ప్రక్షాళనము చేయను. గంట ప్రయోగింపను. పటవస్త్రాదుల ధరింపను. నృత్యగీతములొనర్పను. మాల, విభూతి, జోలి ఈ యన్నిటికంటె స్వామి వేరు. కబీరిట్లనుచున్నాడు :— ముక్తి నీకు కావలయునేని నాపలుకాలకింపుము.

(3)

త్యాగమందే భోగమనుభవింపుమని ప్రేమ కెవ్వరు ఎప్పుడు నేర్పినారు!

(4)

సూర్యుడు ప్రకాశించునపుడు రాత్రికి దావెక్కడ! రాత్రి కమ్ముకొనునప్పుడు సూర్యుడు భాసింపడు జ్ఞానము ప్రకాశించుచోట అజ్ఞానమునకు దావెక్కడ? అజ్ఞానమావరించు కొనినచోట జ్ఞానము నశించును. కామమెక్కడ బల్లవంతమో అక్కడ ప్రేమ యెక్కడ? ప్రేమ ఎచట కలదో అచట కామము లేదు. కబీరిట్లనుచున్నాడు :— ఇది సత్య విచారము. అంతరమున నిష్యంది బాగుగా విచారించి చూడుము కత్తి చేగొని సంగ్రామమున ప్రవేశింపుము. ఓ భ్రాతా! దేహపాతము వరకును యుద్ధము చేయుము. శత్రుని శరీరము తెగవైచి, అచటనే అతనిని పరాస్తునిచేసి, ఆ ప్రభువు దర్బారునకేగి యవనతుడవుకమ్ము. వీరుడెప్పుడును సంగ్రామమును చేయుచు పలాయితుడు కాడు. కామక్రోధ మదలోభములతో నీ దేహమున మహాయుద్ధమగుచున్నది. శీలసత్యసంతోషముల రాజ్యమున నీ యుద్ధము జరుగుచున్నది. నామఖడ్గమచట మిగుల మ్రోగుచున్నది. కబీరిట్లనుచున్నాడు: ఏ వీరుడవడేని యుద్ధమునందు ముందంజ వైచినచో, ఆ భీరువుల గుంపంతయు ఒక్క నిముషములో పలాయనమగును. సాధకుని యుద్ధమతి భీషణము. అతి దుష్కరము. సతీవ్రతముకన్న, వీరవ్రతముకన్న సాధకుని వ్రతము మిగుల కష్టము. వీరుని యుద్ధము మూడు నాలుగు గంటలు. సతియుద్ధము ఒకటి రెండు ఘడియలు. సాధకుని యుద్ధము రాత్రిందినము జరుగుచున్నది. ఎంతకాలము దేహముండునో అంతకాలము ఆ యుద్ధము ముగియదు.

(5)

ఓ మనసా! ఏల నీవు ధైర్యమవలంబింపవు? అతడు పశుపక్షి కీటక పతంగాది సకలజీవముల కబురును తెలిసికొనును. గర్భమునందున్నప్పటి కబురుగూడ నాతడు తెలిసికొనును. బైటనున్నపుడాతడు కబురుకూడ తెలిసికొనడా? ఓ మనసా! ప్రభువుయొక్క నగవునుండి దూరముగానేల పారిపోయెదవు? ప్రియతముని వీడి నీవన్యుని ధ్యానించుచున్నావు. కావుననే నీ తపము, పనులు వమ్మగుచున్నవి.

(6)

నీ నామము గైకొని నీ చరణ ధ్యానము నందు మగ్నుడనగుదును. ఈ తనువు నిలువనీ, పోవనీ ఒక్క క్షణమైనను నిన్ను మరచి పోను.

(7)

ప్రేమము గ్రహింతును. నిర్భయుడనగుదును. ఇక లేశమాత్రమైనను కష్టము రానేరదు —దాసుడగు కబీరిట్లనుచున్నాడు :- ఇదియే ముక్తియొక్క సహజ లీల.

(8)

చతురతని విడనాడుము. మాటలచే ముక్తి దొరకొనుట సంభవము కాదు. ఒక్క ప్రేమము నెంతకాలము తెలియవో, అంత కాలము ఈ జగమున భ్రాంతుడవై భ్రమింతువు—కబీరుద్ఘోషించి చెప్పుచున్నాడు. ప్రేమము ఒక్కటి మాత్రమే సత్యము. ప్రేమ మొక్కటి మాత్రమే జీవనాధారము. సద్గురు వీలక్ష్యమునే బాగుగా జూపును. వేదము, కొరాను యిత్యాది, భవజ్వాలస్వరూపములు. వీనియందు వేదురుగొని చత్తువు. ముక్తి, ప్రేమలు వీనికంటె భిన్నములు. ఒకానొకరు వీని నేకాంతమునందు బొందుదురు. ఓయీ నా దేశమున వసింపుము. యముని పిలుపు నతిక్రమింపుము.

(9)

ప్రేమయొక్క సంయోగమునుండి ఎవ్వడు పరుగిడడో ఆ సాధువే జ్ఞాని. సత్రములందు నీవు వసియింతువు. లోకమంతయు నీ కపరిచితము. ఇపుడు తెల్లవారినది. ఆ దర్బారుకు వ-ఎల్లరితోడను పరిచయమగును.

(10)

ఒక క్షణకాలమైనను జగత్తుయొక్క కబురును నీవు వినవైతివి. కపటపు మాటలాడితివి. కైతవమాచరించితివి. నీ సంకెలలను నీవే తయారుచేసుకొంటివి. కామనాధారము నీ తలను క్రుంగజేయుచున్నది. అవి ఎట్లు తేలికపడును?—కబీరు లోనిమాట చెప్పుచున్నాడు :-జ్ఞాన వైరాగ్య ప్రేమలను మనసున నిలువరింపుము.

(11)

యోగము, జపము, నియమము, వ్రతము, పూజ మొదలగు నెన్నియో వ్యాపారములు పెరిగిపోయినవి. ఎవడు సద్గురువు – ఎవడు ప్రియుడు–ఎవడు జీవునికి రక్షకుడు–అతనితో మిళనము కానిమ్ము. అతని మిళనమునందు పరమ సుఖము కలదు. నిర్వాణపదము ప్రాప్తించును. కబీరిట్లనుచున్నాడు :—సత్యపురుషుని దర్బారెయ్యెడనో నేనచటికి జేరుదును.

(12)

ఓ మనసా! యీ తేప నిన్ను నీవే సమర్థించుకొమ్ము. జగదీశ్వరుడు జగత్తునకు గురువు, నీతనువునందంతటను నిండియున్నాడు. అతని నికటమందునికి చేసుకొనుము. కబీరిట్లనుచున్నాడు:- ఓసాధూ! సకల ఘటములను అతడెల్లప్పుడూ చూచుచున్నాడు.

(13)

ఓ మనసా! అతని సహవాసమునందు ప్రీతముకమ్ము. ఎవ్వడతనిని శరణమును గైకొనునో ఇక క్షయమతనికి లేదు. అట్టిదియే అతని రీతి. ఇట్టి జన్మనిక తిరిగిపొందవు. నీ వయస్సతిక్రమించి పోవుచున్నది.

## (14)

నీ దేహమందిరమునందు ఏ కామము నిలిచి యున్నదో అదియే మృత్యు దుర్గమును నిర్మించినది. జననమునుండి మరణము వరకును అమృత ప్రవాహము ప్రవహించుచున్నది-ప్రేమపు గల తియనందుకొనుము. గగనమునందు ఏ రసపూరితమైన మహాసంగీతము మ్రోయుచున్నదో దానిని సాధనయందు విని, వే పరుగిడుము. గభీర రాగిణియందు కబీరిట్లు పలుకుచున్నాడు:- సుప్తబ్రహ్మాను జాగరింపుము.

## (15)

ఓయీ విభ్రాంతుడా! సుఖసాగరమున కడకేతెంచి, పిపాసార్తుడవై తిరిగి పోకుము. ఇప్పుడైనను తెలిసికొనుము. మృత్యుభయము నిన్నన్ని వేపులను జుట్టుకొని యున్నది. నీ యెదుట నిర్మల నీరములు నిండి యున్నవి. నిఃశ్వాస నిఃశ్వాసమునందును త్రావికొనుము. ఓ ఉన్మత్తుడా! ఎండమావులకై పరుగిడకుము. ఆ అమృతరసమునే ఆసింపుము. ధ్రువుడు, ప్రహ్లాదుడు, శుకుడు వీరాయతృమును త్రావిరి. సాధుకుడైన రైదాసుగూడ త్రావినాడు. ప్రేమయందే సాధకుడు మత్తుడు. ఒక్క ప్రేమయందే అతని కాశ. కబీరిట్లనుచున్నాడు:- ఓసాధూ భయముయొక్క కోట కూలిపోయినది.

## (16)

మహాలునకు భ్రమయను తాళము వేసి యున్నది. ప్రేమ **అను** చెవిని లగింపుము. ఈ విధముననే కపటముయొక్క ద్వారమును తెరచి, ఆ భవనము మధ్యనున్న ప్రియతముని మేల్కొలుపుము. కబీరిట్లనుచున్నాడు:- ఓ సోదరా యిట్టి వీలు నీకిక చిక్క కలదా?

## (17)

ఈ జీవనమమూల్యము. దీని నొక దుష్టద్యూతమునందొడ్డితిని.

## (18)

వెఱ్ఱివానికెవరు తెలుపగలరు? వకుళమును బాతిపెట్టి ద్రాక్షాఫలమాసించుచున్నాడు. ఆ ఫలమెట్లు లభింపగలదు?

## (19)

ఓ మనా! ఓరిమిని సమకూర్చుకొనుము. వల్లభుని చరణముల ధ్యానింపుము. విద్య, కపటత, చతురత, జాత్యభిమానము విడనాడుము. దయ, వినయత, సామ్యము అభ్యసింపుము. మరియు జీవించియుండియే మృతునివలెగమ్ము. ప్రేమము, వైరాగ్యము, మనస్సు, జీవనము ఒక్కటిచేసి విశ్వముమ్రోయించు సంగీతముయొక్క ధ్వని వితానముల వినుము. కబీరిట్లనుచున్నాడు:-ఈ ఉపాయముచే ఆ సత్యలోకమునకు తీర్ణుడవు కమ్ము. అచట అమేయపురుషుని ధామము.

## (20)

ఓ ఉన్మత్తులారా! స్వామినే నీవెరుగవైతివి. ఇక నేటికి బడాయికొట్టెదవు? చతురతను వీడుము. మాటలచేత నెప్పుడు మిళనము కానేరదు. ధర్మవిషయిక శబ్దములను, సంపాదములను విని మైమరపుకొనకుము. శ్రేష్ఠమైనయది యింకొక వస్తువు. ఎవ్వడు వెదకునో అతనికి లభించును.

# శ్రీ రామకృష్ణ సేవాసమితి (బాపట్ల)

## బాపట్లలోని గోవిందనగర్ గ్రామపునర్నిర్మాణకార్యక్రమము

విశ్వవిఖ్యాతమయిన రామకృష్ణ వ్యవస్థ అడుగుజాడలలో అనుగమించు సత్సంకల్ప ములో శ్రీరామకృష్ణపరమహంస భక్తులు బాపట్లలో ఎనిమిది సంవత్సరముల క్రితం "శ్రీ రామకృష్ణసేవాసమితి" అను ఆధ్యాత్మిక, సాంస్కృతిక సంస్థను స్థాపించుకొన్నారు. బాపట్లలో శ్రీరామకృష్ణ ఉద్యమమును వ్యాప్తి గావించు పవిత్రోద్దేశముతో 1970 విజయ దశమి పుణ్యదినమున ఈ సంస్థ ఆవిష్కరింప బడినది.

ఆపదలలోనున్న దీనులను ఆదుకొను టయు, రామకృష్ణమిషన్ అడుగుజాడలలో సాంస్కృతిక, ఆధ్యాత్మిక, విద్యారంగములలో కృషిచేయుటయు, 1969 తుఫానులో నిరాశ్రయులయిన యానాదులకు రామకృష్ణమిషన్ వారిచే చీరాల ప్రక్కనే నిర్మింపబడిన వివేకానందనగర్ గ్రామముతో సన్నిహిత సంబంధాలు పెంపొందించుకొని, ఆ గ్రామ పురోభివృద్ధికి పాటుపడటము అనే ముఖ్యోద్దేశము లతో ఈ సేవాసమితి నెలకొల్పబడినది.

శ్రీరామకృష్ణ సేవాసమితి కార్యక్రమము ఈడు మార్గములుగా నడుస్తూంది.

1. పెద్దవారికి సంబంధించినంతవరకు ఆధ్యాత్మిక పురోభివృద్ధి సాధించుటకు
2. యువతరం విషయంలో సేవాదృక్పథమే పునాదిగా సాంస్కృతిక వికాసమును సాధించుటకు
3. బాలబాలికల విషయంలో నైతిక, ఆధ్యాత్మిక, విద్యారంగములలో వికాసమును కల్గించుటకు

శ్రీరామకృష్ణ వ్యవస్థకు చెందిన స్వాములు అనేకమంది బాపట్ల విచ్చేసి సమితి కార్యక్రమములకు స్ఫూర్తిని కల్గించి తోడ్పడుచున్నారు.

గత 1977 నవంబరు 19న సంభవించిన ను తుఫానువల్ల కల్గిన దారుణ వినాశమును గూర్చి అందరకు తెలిసినదే. తుఫాను వచ్చిన అయిదుగోజులకు రహదారి సౌకర్యాలు కొద్దిగా వీలయినవి. వెన్వెంటనే రాజమండ్రి లోని రామకృష్ణమిషన్ స్వాములవార్లు బాధిత ప్రజానీకమును ఆదుకొనుటకై హుటాహుటిని బయలుదేరి బాపట్ల చేరుకున్నారు. బాపట్లలో శ్రీరామకృష్ణసేవాసమితివారి సహాయముతో ఆనాడు తుఫాను కారణంగా ఎక్కువ నష్టం జరిగిన ప్రాంతాలకు వెళ్ళి పరిస్థితులను పరిశీలించారు. చిల్లరగొల్లపాలెం, గోవిందనగర్ మొదలయిన తావులలో సేవాసమితి సహాయంతో మొత్తం 850 కుటుంబాలకు బియ్యం, ఉప్పు, పప్పు వంటి నిత్యావసర వస్తువులను, మందులను అందజేశారు. మిషన్ స్వాములు తిరిగి వెళ్లిన పిమ్మట, వారినుండి అందిన గృహోపకరణములను, బట్టలను బాధితులకు పంచిపెట్టుటలో శ్రీరామకృష్ణసేవాసమితి నిర్విరామముగా కృషిచేసింది. బాధితులకు తక్షణ సహాయం అందించిన పిమ్మట సేవాసమితి గోవిందనగర్ గ్రామమును దత్తత స్వీకరించినది.

బాపట్లలోని ఒక్క గోవిందనగర్ గ్రామంలోనే, ఆ తుఫానునాటి రాత్రి, 22 మంది ప్రజలు ప్రాణాలు కోల్పోయారు. ఆ కాళరాత్రిలో, కూలిపోతున్న పూరిగుడిసెలను

విడిచిపెట్టి తలదాచుకొనుటకై పరుగులెడుతున్న అభాగ్యులలో 22 మంది, వారి ఇండ్ల ప్రక్కనే మృత్యుకూపములలాగా ఉన్న దొరువులలో గాలికి కొట్టుకుపోయి పడి మరణించారు. ఉండటానికి బాపట్ల మునిసిపల్ హద్దులలోనే ఉన్నప్పటికి, ఈ గోవిందనగర్ గ్రామం ఊరికి బయట, ఒక మూలగా విసిరివేసినట్లుంది. సరియైన రహదారి లేనందున ఇచ్చటకు చేరడం ఒకపట్టాన సాధ్యంకాదు. పైగా, ఇక్కడ ఉండేది అంతా అన్ని విధాలా వెనుకబడిన జాతికి చెందినవాళ్ళే. వీరి తరిఫున మాటాడగలిన సరియైన ప్ర కూడా ఎవ్వరూ లేకపోవడంతో వీరి అతీగతి పట్టించుకొన్న నాధుడే లేకపోయాడు. వీరి నిస్సహాయ దైన్య స్థితిని ఆకళింపుజేసుకొన్న సేవాసమితి వీరికి అండగా నిలబడింది. రామకృష్ణమిషన్ కేంద్రములనుండి విరివిగా అందిన నిత్యావసర వస్తువులను, మందులను, బట్టలను పంచిపెట్టింది. అన్నిటికన్న ముఖ్యముగా, ఈ గ్రామముపాలిట మృత్యుగహ్వారాలలాగా ఉన్న దొరువులను పూడ్చటం ఎంతో అవసరమని సేవాసమితి గుర్తించింది. దీనికి తోడుగ, ఎగుడు దిగుడుగానున్న నేలను కూడా బాగా చదును చెయ్యాలి. అప్పటికిగాని ఆ ప్రాంతము వాసయోగ్యం అనిపించుకోదు.

రామకృష్ణమిషన్ వారి నుండి అందిన భూరి ధనసహాయంతో సేవాసమితి వెంటనే కార్యరంగంలో దుమికింది. పదివేల రూపాయలకు పైగా ఖర్చుతో, ఒక్కొక్కటి రెండు నిలువులకుపైగా లోతున్న 30 దొరువులను రెండునెలలలోగా పూడ్పించారు. నేలనుకూడా చదును చేశారు. అటుతర్వాత ఈ దత్తత స్వీకరించి సర్వతోము గ్రామపునర్నిర్మాణ [illegible]యను సేవాసమితి చేపట్టినది. ముమ్మొందుగ తుఫానులో అన్నివిధాల దెబ్బతినియున్న గ్రామవాసులకై ఉపాధికల్పనా కార్యక్రమాన్ని చేపట్టింది. రామకృష్ణమిషన్ వారి నుండి ఋణముగా అందిన పదివేలరూపాయలతోను ఈ గ్రామప్రజలు వారివారి స్వంత వృత్తులను చేపట్టి, తమకాళ్ళపై తాము నిలబడగల్గునట్లు సేవాసమితి వారికి తోడ్పడింది.

8 కుటుంబాలవారికి- ఇటుకల నిర్మాణమునందు,

10 కుటుంబాలకు- చేపలవలలకై నైలాను దారము, ధనము అందించుటకు,

1 కుటుంబానికి- బుట్ట అల్లికకు

3 కుటుంబాలకు- చాపల అల్లికకు

1 కుటుంబానికి- రిక్షా

వగైరాలకు ధనసహాయం అందజేయబడింది. ఈ ప్రకారముగా సహాయం అందుకొన్న వారంతా తమ ఋణాలను పూర్తిగా చెల్లించివేశారు. ఈ ఉపాధికల్పనా ప్రణాళిక అన్ని విధములుగ విజయవంతముగ నిర్వర్తింపబడినదని చెప్పవచ్చును.

ఇక, బాధితుల శాశ్వతపునరావాసము మిగిలియున్నది. ఎట్టి ప్రకృతి ఉపద్రవములనయినా తట్టుకు నిల్వగల పక్కా ఇండ్లను నిర్మింపవలసిన ఆవశ్యకతను సేవాసమితి గుర్తించింది. దివిసీమ రామకృష్ణమిషన్‌వారు నిర్మించిన ఇండ్ల మోస్తరుగా ఇక్కడకూడా గృహనిర్మాణం జరిగితే బాగుంటుందని సమితి భావించింది. అందుకు కావలసిన ధనసహాయంకోసం సమితి అనేక సంస్థలను అర్థించింది. కాని ఫలితం కన్పించలేదు. చివరకు- శ్రీ రామకృష్ణ సేవాసమితికి ఆదినుండియు అన్నివిధముల సహాయమందిస్తున్న రామకృష్ణ వ్యవస్థను అర్థించడం జరిగింది.

హైద్రాబాద్ రామకృష్ణమఠం అధ్యక్షులయిన శ్రీమత్ స్వామి రంగనాథానందజీ మహారాజ్ వారి అనుగ్రహమువల్ల సమితివారి కృషి ఫలోన్ముఖమయినది. గోవిందనగర్ గ్రామమున 95 పక్కా ఇండ్లను నిర్మించు నిమిత్తం 2 లక్షల 50 వేల రూపాయల విరాళమును హైద్రాబాద్ రామకృష్ణమఠంవారు దయతో అందజేశారు. ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వమువారు సహాయకగ్రాంటుగా అందజేయు అంతే మొత్తముతో కలసి మొత్తము 5 లక్షల రూపాయలతో శ్రీ రామకృష్ణసేవా సమితివారు గోవిందనగర్ గ్రామమున సుస్థిర గృహనిర్మాణ కార్యక్రమమును చేపట్టినారు. ఒక్కొక్కటి 5 వేల రూపాయల ఖర్చుతో నిర్మింపబడనున్న ఈ ఇళ్లు పూర్తిగా సిమెంటు కాంక్రీటుతో, దివిసీమలో రామకృష్ణమిషన్ వారు నిర్మించిన ఇళ్ల నమూనాలో నిర్మింపబడును. ఆర్థికముగనేకాక, సాంకేతికముగ కూడ రామకృష్ణమిషన్ వారి పరిపూర్ణ సహాయ సహకారములపై ఆధారపడి ఈ గృహనిర్మాణ పథకము అమలు జరుగుచున్నది.

గోవిందనగర్ గ్రామదేవతయగు పోలేరమ్మ వారికి ఒక చక్కని దేవాలయము నిర్మించుట పూర్తియైనది. ఈ నిర్మాణమునకు కావలసిన ధనసహాయము రామకృష్ణవ్యవస్థకు చెందిన స్వాములవారి సహకార, ప్రోద్బలముల వలన వివిధ స్వచ్ఛంద సంస్థలనుండి అందినది. సుమారు 22 వేల రూపాయల ఖర్చుతో దేవాలయము పూర్తియగుచున్నది. ఈ శుభ సందర్భమున దేవాలయంలో పోలేరమ్మవారి విగ్రహ ప్రతిష్ఠకూడ జరుప నిశ్చయమైనది.

గోవిందనగర్ గ్రామమున పోలేరమ్మవారి విగ్రహప్రతిష్ఠయు, సుస్థిర గృహనిర్మాణమునకు శంకుస్థాపనయు జనవరి 29 నాడు హైద్రాబాద్ రామకృష్ణమఠాధ్యక్షులయిన శ్రీమత్ స్వామి రంగనాథానందజీ మహారాజ్ వారి పవిత్ర హస్తములమీదుగా జరిగినవి. రామకృష్ణవ్యవస్థకు ప్రథమాధ్యక్షులును, పరమహంసకు "ఆధ్యాత్మిక మానస పుత్రుడును" అయిన శ్రీమత్ స్వామి బ్రహ్మానందజీ మహారాజ్ వారి జన్మతిథినాడు ఈ కార్యక్రమము నిర్వహింపబడుట యెంతయో తగియున్నది.

ఈ సందర్భమున జరిగిన బహిరంగసభకు గుంటూరుజిల్లా కలెక్టరు శ్రీ జె. రాంబాబు గారు అధ్యక్షత వహించారు. శ్రీ రామకృష్ణ సేవాసమితి తరఫున శ్రీ బి. యస్. ఆర్. ఆంజనేయులుగారు సభ్యులందరకు స్వాగతముపల్కి, సమితి కార్యక్రమముల గురించి నివేదిక సమర్పించారు. శ్రీమత్ స్వామి రంగనాథానందజీ మహారాజ్ వారు తమ ప్రారంభోన్యాసములో జీవుని రూపముననున్న దైవమును సేవించుటగూర్చి వివరించారు. వివిధ ప్రదేశములనుండి గొనివచ్చిన పవిత్రజలములు, క్షేత్ర మృత్తికలు విగ్రహప్రతిష్ఠ సమయమున నిక్షేపింపబడిన సంగతి ప్రస్తావించుచు యావద్భారతదేశము ఈ సమయమున ఇక్కడ ప్రతిష్ఠితమైనదని వక్కాణించిరి. దేవాలయమును పరిశుభ్రముగా నుంచవలసినదని గ్రామవాసులకు బోధించారు. తమఇండ్లను, పరిసరములను శుచిగ, శుభ్రముగ నుంచుకోవలసిన అగత్యమును గురించి, వాతావరణ కాలుష్యమును నిరోధించవలసిన అవసరమును గురించి గ్రామవాసులకు నొక్కిచెప్పారు. దేవాలయములో మాత్రమేగాక, ప్రతి జీవియందును నెలకొనియున్న భగవంతుని అర్చించవలసినదని ఉద్బోధించారు. ఆంధ్రదేశమున రామ

కృష్ణ — వివేకానంద ఉద్యమము వ్యాప్తి గాంచుచుండుట తమకు ఆనందదాయకముగ నున్నదని వెల్లడించారు.

స్థానిక శాసనసభ్యులు శ్రీ కోన ప్రభాకరరావుగారు, మాజీ తుఫాను పునరావాస శాఖామంత్రి శ్రీ మండలి వెంకట కృష్ణారావు గారు ఉపన్యసించారు. అధ్యక్షులు శ్రీ జె. రాంబాబుగారు మాట్లాడుతూ ప్రభుత్వం తరఫున అవసరమయిన సహాయమునందజేయ గలమని హామీ యిచ్చారు గోవిందనగర్ గ్రామప్రజల తరఫున శ్రీ కలువకొల్లు వెంకటేశ్వర్లు వందనసమర్పణ గావించారు.

సాయంత్రం ఆరుగంటల సమయంలో రంగనాథానందస్వామివారు సేవాసమితికి విచ్చేసి తమ ఆశీస్సులను అందజేశారు. సేవా సమితి ఆవరణలో నెలకొనియున్న ప్రశాంత, పవిత్ర వాతావరణం తమకెంతో నచ్చినదని స్వామివారు వెల్లడించారు. ప్రతి జీవియు భగవదంశమే అని గుర్తించి మానవునిలోనున్న మాధవుని అర్చించుటద్వారా తరించుటయే మానవగమ్యమని సేవాసమితివారిని ఉద్బోధించారు.

అటుపిమ్మట బాపట్లలోని శ్రీ భావనారాయణస్వామివారి దేవాలయములో రంగనాథానందస్వామివారి బహిరంగోపన్యాసము ఏర్పాటయినది. అశేష ప్రజానీకము స్వామివారి ప్రసంగమును విని ఆనందించినది. వందనసమర్పణతో కార్యక్రమము ముగిసెను.

# పుస్తక పరిచయము

## బ్రహ్మసూత్రములు

(డా. సర్వేపల్లి రాధాకృష్ణన్ గారి ఆంగ్ల గ్రంథమునకు అనువాదము)

అనువాదకులు: డా. రత్నాకర బాలరాజు, M. A., Ph. D., (ఆంధ్రోపన్యాసకులు, ప్రభుత్వకళాశాల, అనంతపురము)

పేజీలు: 1048+37, మూల్యము: రూ. 50-00, ప్రతులకు: రత్నాకరభాస్కరరాజు, 9/187, గుల్జారుపేట, అనంతపురము.

ఒక చిన్నపిల్లవానికి ఇంట్లో ఉన్న దేవుని విగ్రహాన్ని పూలతో అలంకరించాలని ముచ్చట కలిగింది. పూలకోసం ఒక తోటలో ప్రవేశించాడు. చాలరకాలైన పువ్వులేమో కనపడుతున్నాయిగాని ఒక్కటీ అందుకోలేక పోతున్నాడు. ఒక చిన్న చెట్టులో ఉన్న పువ్వులనందుకోబోతే ముళ్ళు అడ్డుతగులుతున్నాయి. ఒక పొదరింట్లో పూచిన పూలను కోయబోతే అక్కడేదో జరజర ప్రాకిన శబ్దం వినబడింది. పామై ఉండవచ్చేమో అని భయపడి వెనక్కు జరిగాడు. పెద్దవృక్షాల్లో ఉన్న పూలు గిల్లుదామన్న కోరిక పుట్టిందేగాని ఆ వృక్షాలను ఎక్కలేకపోతున్నాడు. చివరకు ఏమీ తోచక అటుఇటు దిక్కులు చూడసాగాడు. వీని అవస్థను గమనిస్తున్న ఒక సాధువు అక్కడికి వచ్చి "అబ్బాయీ! పూలు కావాలా? ఎందుకు?" అని చాల ఆప్యాయంగా అడిగాడు. పిల్లవాడు జవాబుగా "దేవుడికి అలంకారం చేయాలి. అందుకోసం కావాలి!" అన్నాడు. ఈ జవాబు విని సాధువు చాల సంతోషించి "అబ్బాయీ! కాసేపు వేచి ఉండు. నీకు కావలసిన పూలు కోసి మాలగా కూర్చిఇస్తాను. తీసుకుపోయి నీ ఇష్టదేవుణ్ణి అలంకరించుకో" అని చెప్పి అక్కడున్న నానారకాల వృక్షాలు, చెట్లు, తీగలు,

పొదలు గాలించి మంచిమంచి పుష్పాలను ఏరి ఆపైన వాటిని చక్కని మాలగా కూర్చి పిల్లవాని చేతికిచ్చాడు. ఆ మాలనందుకొని పిల్లవాడు ఆనందంతో తన్నుతాను మఱచి గంతులు వేస్తూ ఇంటివైపు పరుగుతీశాడు. ఆ సాధువు ఆ చిన్నపిల్లవానికి ఏవిధంగా పనిచేసి పెట్టాడో అదేవిధంగా బాదరాయణాచార్యుడు భారతీయులకు ఒకపని చేసిపెట్టాడు. వేద వనంలో అక్కడక్కడ పూచిన అందమైన 'ఉపనిషత్ కుసుమాలను' ఒకటిగా సేకరించి 'బ్రహ్మసూత్రముల' ద్వారా 'వేదాంతసిద్ధాంతము' అనే చక్కని మాలను కూర్చి మనకిచ్చియున్నాడు. బ్రహ్మసూత్రముల ప్రధానోద్దేశమిదే అని ఆచార్యశంకరులు తమ సూత్రభాష్యంలో ''వేదాంతవాక్యకుసుమ గ్రథనార్థత్వాత్సూత్రాణామ్'' అని చక్కగా చెప్పియున్నారు. ఈ బ్రహ్మసూత్రములకు సంస్కృతభాషలో లెక్కలేనన్ని భాష్యములు, వివరణలు, వ్యాఖ్యానములు వెలసినవి. వాటిలో మునకున్న ప్రశస తక్కినవాటికి లేదు.

సంస్కృతభాషలో దాగిఉన్న ఈ వేదాంత సిద్ధాంతములను విశ్వవ్యాప్తం చేయడానికి కృషిచేసిన ప్రముఖులలో డా. రాధాకృష్ణన్ గారు ఒకరు. ఈయన, ప్రస్థానత్రయమని గౌరవింపబడు ఉపనిషత్తులను, భగవద్గీతను, బ్రహ్మసూత్రములను ఆంగ్లమునకనువదించి వ్యాఖ్యానించిరి.

డా. రాధాకృష్ణన్‌గారి ఆంగ్ల బ్రహ్మసూత్ర గ్రంథమునకిది చక్కని తెనుగు అనువాదము. ఈ అనువాదనిర్వహణకు-సంస్కృతాంధ్ర ఆంగ్లములలో మంచి పాండిత్యముండవలెను; తత్త్వశాస్త్రములో మంచి ప్రవేశముండవలెను; మూల గ్రంథకర్త ఎడల భక్తి శ్రద్ధలుండవలెను; మంచి ఉత్సాహముండవలెను; సాహసముండవలెను; ఫలాపేక్షా కాలుష్యరహితమైన శుద్ధమనస్సుండవలెను; అన్నిటికి మించి దైవానుగ్రహముండవలెను. ఇన్నిటిలో ఏది లోపించినను ఇంత బృహత్కార్యము తుదముట్టించుట వీలుకానిపని. అనువాదకులు డా. రత్నాకరబాలరాజుగారు దీనిని సాధించారు. ఈయనకివే మా అభినందనశతములు.

## శ్రీమదాంధ్ర భగవద్గీత (పద్యకృతి)

రచయిత : కార్యంపూడి రాజమన్నారు,
M. A., B. ED., ప్రభుత్వకళాశాలల ప్రిన్సిపాల్
(రిటైర్డ్)

పేజీలు : 155, మూల్యము : రూ.4-50, ప్రతులకు :
క. రాజమన్నారు, 1-8-702/24, నల్లకుంట,
హైదరాబాద్-500044

''భగవద్గీత మీద ఉన్న అద్వైతవ్యాఖ్యానాల్లో ఏది ఉత్తమం?'' అని ఒక ప్రసిద్ధ పండితుని అడిగాను. దానికి ఆయన ఆశ్చర్యంతో కన్నులు పెద్దవిచేసి ''గీతమీద అద్వైతభాష్యం ఒకటే ఉన్నది. అది శంకరాచార్యులు వ్రాసింది. ఏది ఉత్తమం అన్న నీ ప్రశ్నకు తావెక్కడ?'' అని నావైపు చాలంజిగా చూశారు. దానికి సమాధానంగా నేను శ్రీధర, మధుసూధన, నీలకంఠ, శంకరానంద, వెంకటనాథ, మొదలగు అద్వైత వ్యాఖ్యానకారుల మాటేమిటి?'' అని అడిగాను. ఆయన నవ్వి ''వాళ్ళ భాష్యాలు శంకరాచార్యుల భాష్యానికి పోటీగా వ్రాసినవికావు. 'గీతార్థం బాగా మననం అవుతుందిగదా' అనే ఉద్దేశంతో వారు వారు స్వయంగా వ్రాసుకొన్నవి అవి'' అని అన్నారు. నాకీ సమాధానం సమంజసమే అనిపించింది. ఆంధ్రదేశంలో చాల

రామాయణాలున్నాయి. "ఎందుకిన్ని?" అని ప్రశ్నించడం న్యాయంకాదు. కవితలల్లగల రామభక్తులు ఆత్మతృప్తి కొఱకు స్వీయ రామాయణాలు వ్రాసుకొన్నారు. అట్లాగే ఇప్పుడు భగవద్గీత మీద చాల పుస్తకాలు వస్తున్నాయి. 'ఈ వఱకే చాల పుస్తకాలున్నాయి గదా ఇక నేను వ్రాయడం ఎందుకు?' అని గీతాభిమానులైన రచయితలెవరూ విరమించడంలేదు. ఇప్పుడు గీతా సాహిత్యమాలకు మఱో అందమైన పుష్పంగా కార్యంపూడి రాజమన్నారుగారి ఈ కృతి వెలువడింది. ఏడువందల గీతాశ్లోకాలను ఏడు వందల తేటగీతి పద్యాలలో ఈయన చక్కగా తెనిగించారు. ఈ కృతి విషయమై కవి సామ్రాట్ విశ్వనాథ సత్యనారాయణగారు ఏమి అభిప్రాయము తెలివిచ్చారో చూడండి:- "రాజమన్నారుగారి తెనుగుపద్య రచన మనచేత చదివించును. ఆ శక్తి వీరి పద్య రచనలో నున్నది......ఇందులో నేపద్యము చదివినను ధారాశుద్ధిగా వెళ్ళును. అది ఈ పుస్తకములోని ప్రధాన గుణము. తెనుగు చదువరులు కాంక్షింపదగిన విషయము."

రాజమన్నారుగారి అనువాదము ఎలా ఉన్నదో మీకు చూపించుటకు రెండు ప్రసిద్ధశ్లోకాల అనువాదములను క్రింద ఉదాహరిస్తున్నాను. చూడండి :

వాసాంసి జీర్ణాని (2-22) అన్న శ్లోకానికి అనువాదం:

ప్రాంతవైన వస్త్రంబులఁ బాఱవేచి
జనుఁడు నూతన వస్త్రంబులను ధరించు
నట్లు దేహియు జీర్ణదేహముల విడిచి
అన్య నూతన దేహాల నాశ్రయించు

జాతస్య హి ధ్రువో మృత్యు (2-27) అన్న శ్లోకానికి అనువాదం :

జన్మమందిన ప్రాణికిఁ జావు ధ్రువము;
మరణమందిన నట్లె జన్మంబు ధ్రువము;
అరయ ననివార్యమైన యీ యర్థమందు
పార్థ! నీవిట్లు శోకింపఁబాడిగాదు.

## ఆపదుద్ధారక స్తోత్రము - మృత్యుంజయమ్

పై రెండు ప్రసిద్ధ స్తోత్రములను తెనుగు లిపిలో 'భారత భారతి ప్రచురణ' వారు ముద్రించి యున్నారు.

ఆపదుద్ధారక స్తోత్రము వెల : 50 పైసలు; మృత్యుంజయ స్తోత్రము వెల : రూ. 1-00. ప్రతులకు : ఆర్. వి. ఆర్. మూర్తి, భారత భారతి, గీతాపవర్ ప్రెస్, విజయనగరం-531202.

## కేశనివారిణి

గ్రంథకర్త : చిన్మయ రామదాసు.

పేజీలు : 80, మూల్యము : రూ. 1-50, ప్రతులకు : శ్రీ మళయాళ సద్గురుపెద్దాశ్రమము, తాడేపల్లి పోస్టు, వయా కొడాలి, దివితాలూకా, కృష్ణాజిల్లా, ఆంధ్రప్రదేశ్.

ఈ చిన్న పుస్తకం అతిసరళమైన భాషలో వ్రాయబడింది. ఇందు 45 అంశములున్నవి. చిన్న చిన్న కథల ద్వారా భక్తిజ్ఞాన వైరాగ్య విషయములు బోధింపబడినవి. "గృహస్థులు ముఖ్యముగా ఈ గ్రంథమును చదువుచుండవలెను" అని గ్రంథముపై సూచింపబడినను ఈ పుస్తకంలో చిన్నపిల్లలకు వినోదం కలిగించెడి చందమామతరహా కథలు కూడ ఉన్నవి.

—బి. సి.

# బాలల శారదాదేవి

బి. ఎస్. ఆర్. ఆంజనేయులు

## బుద్ధ గయ

పూరీవెళ్లి సంవత్సరము అయిన తర్వాత శారదాదేవి గయ వెళ్ళింది. గయ గొప్ప పుణ్యక్షేత్రం. అక్కడి దేవుడు విష్ణుమూర్తి. గదాధరుడు అనికూడ పిలుస్తారు. ఆయనే శ్రీ రామకృష్ణదేవుడుగా అవతరించాడు. అందువల్ల శ్రీరామకృష్ణులు అక్కడికిపోలేదు.

గయకు దగ్గరలో బుద్ధగయవుంది. సిద్ధార్థుడు అనే ఆయన అక్కడి ఒక మర్రిచెట్టు క్రింద తపస్సుచేశాడు. సత్యాన్ని దర్శిస్తేగాని కదలనని పట్టుపట్టి కూర్చున్నాడు. ఆయనకు అక్కడ జ్ఞానము కలిగింది. ఆయనే బుద్ధభగవానుడైనాడు, బౌద్ధమతం బోధించాడు. బుద్ధ గయ బౌద్ధమతస్థులకు చాలా పవిత్రమైనచోటు. బౌద్ధసన్యాసులు అక్కడ మఠాలు కట్టు కున్నారు. వాటిని ఆరామాలు అంటారు.

శ్రీ శారదాదేవి గయ చూచి బుద్ధగయకు వెళ్ళింది. అక్కడి ఆరామాలు చూచింది. వాటిలోవున్న సన్యాసులకు ఉండటానికి మంచిచోటు వున్నది. తినటానికి మంచి తిండి వున్నది. అప్పుడు ఆమెకు తన బిడ్డలు జ్ఞాపకానికి వచ్చారు. తన బిడ్డలంటే రామకృష్ణునిపేరుమీద సన్యాసం తీసుకున్నవారు. రామకృష్ణదేవుడు మహాసమాధి చెందినతర్వాత నరేంద్రుడు మొద లగు పదునారుమంది యువకులు సన్యాసం తీసుకున్నారు. వాళ్లు నిలవటానికి నీడలేదు. ఒక్కొక్కరు ఒక్కొక్కచోట మామూలు బిచ్చము తెచ్చుకునే సాధువులవలె తిరగటం మొదలు పెట్టారు. వారిని తలచుకొని శారదాదేవి చాలా దిగులు పడింది. కన్నీరు కార్చింది. శ్రీ రామకృష్ణదేవుని యిలా ప్రార్థించింది. "ప్రభూ! నా బిడ్డలు దిక్కులేకుండా తిరగటంచూచి నేను భరించలేను. నీపేరుమీద అన్నీవదిలిపెట్టి సన్యసించినవారికి ఉండటానికి నీడ, తినటానికి తిండి అనుగ్రహించు. వారందరు ప్రేమతో ఒకటైయుండేట్లు చెయ్యి. వారు నీబోధలు చెప్పి యితరులకు శాంతి కల్గించేటట్లు చెయ్యి.

శ్రీరామకృష్ణదేవుడు యీ ప్రార్థన విన్నాడు. దాని సంగతి ముందు చూద్దాము.

> "బుద్ధగయలోన స్వస్థులై బౌద్ధులుండ
> ఉండుటకు నీడ తినుటకు తిండిలేక
> తిరుగు నాబిడ్డలకు లోటు తీర్పుమ"నుచు
> ప్రార్థనముచేసె శారద రామకృష్ణ.

సంపాదకులు : స్వామి తన్మయానంద.

శ్రీ ఎమ్. బాలసుందరంగారిచే ఫ్రీడమ్ ప్రెస్, (మద్రాసు-600 021) న ముద్రింపబడి.

స్వామి తన్మయానందవారిచే శ్రీ రామకృష్ణమఠము (మద్రాసు-600 004) నుండి ప్రచురింపబడినది.

# శ్రీ రామకృష్ణ మఠ ప్రచురణములు

| గ్రంథము | వెల |
|---|---|
| శ్రీ రామకృష్ణ కథామృతము | 6.00 |
| శ్రీ రామకృష్ణ జీవితచరిత్ర | 10.00 |
| శ్రీ రామకృష్ణ బోధామృతము | 6.00 |
| శ్రీ రామకృష్ణోపనిషత్తు | 3.75 |
| శ్రీ రామకృష్ణపరమహంస నీతికథారత్నములు | 2.50 |
| గురూపదేశములు | 2.00 |
| నా గురుదేవుడు | 1.25 |
| శ్రీ రామకృష్ణ దివ్యవాణి | 1.50 |
| శ్రీ రామకృష్ణ పరమహంస జీవిత సంగ్రహము | 0.75 |
| ఆరాత్రికము మరియు శ్రీ రామనామ సంకీర్తనము | 0.60 |
| శ్రీ శారదాదేవి జీవిత చరిత్ర | 4.00 |
| శ్రీ శారదాదేవి | 2.50 |
| శ్రీ శారదా సూక్తి సముచితము | 0.80 |
| శ్రీ వివేకానంద జీవిత చరిత్ర | 4.00 |
| బాలల వివేకానందుడు | 2.00 |
| శ్రీ వివేకానంద సంపూర్ణగ్రంథావళి | |
| 9 సంపుటముల పూర్తిసెట్టు (సాదా) | 55.00 |
| .. .. (క్యాలికో) | 61.00 |
| విడి సంపుటములు ఒక్కొక్కటి (సాదా) | 6.00 |
| .. .. (క్యాలికో) | 6.50 |
| స్వామి శిష్య సంవాదములు | 10.50 |
| సందేశ తరంగిణి (మొదటి భాగము) | 4.00 |
| .. (రెండవ భాగము) | 5.50 |
| భారత యువజనులారా! | 3.00 |
| ప్రబోధ రత్నాకరము | 3.75 |
| రాజయోగము | 6.25 |
| కర్మయోగము | 4.00 |
| భక్తియోగము | 4.00 |
| శ్రీ వివేకానందలేఖావళి (మొదటిభాగము) | 2.25 |
| .. (రెండవభాగము) | 3.00 |
| హిందూ మతము | 4.00 |
| వివేక సూర్యోదయము | 4.00 |
| అనుష్ఠాన వేదాంతము | 2.50 |
| ప్రాచ్యము - పాశ్చాత్యము | 1.25 |
| కులము, సంస్కృతి, సామ్యవాదము | 3.00 |
| భారత దేశము | 2.00 |
| భారతీయ మహిళ | 2.00 |
| నా జీవితము, జీవిత కార్యము | 1.25 |
| శ్రీ రామకృష్ణ సేవాసంఘ : ఆదర్శములు | 0.50 |
| చికాగో నగరోపన్యాసములు | 1.00 |
| శ్రీ వివేకానంద శంఖారావము | 0.30 |
| నవీన భారత దేశము | 0.40 |
| సర్వం విష్ణుమయం జగత్ | 0.35 |
| శ్రీ వివేకానంద సింహగర్జనలు | 0.20 |
| బ్రహ్మానంద బోధనలు | 4.75 |
| తాపత్రయ చికిత్స | 0.60 |
| ముక్తిమార్గము | 0.30 |
| పారమార్థిక సంభాషణలు | 6.50 |
| నారద భక్తి సూత్రములు | 4.00 |
| శ్రీ పెద్ద భాగవతము-మూడవ సంపుటము | 7.50 |
| దేవీమాహాత్మ్యము | 4.00 |
| శ్రీ మద్భగవద్గీత | 9.00 |
| శ్రీ మద్భగవద్గీత చిన్నసైజు | 3.00 |
| పారాయణగీత తాత్పర్యసహితము | 3.75 |
| .. మూలము | 2.00 |
| కఠోపనిషత్తు | 2.00 |
| గిరీశచంద్ర | 1.00 |
| భక్తిమార్గము | 1.00 |
| శ్రీకృష్ణవాణి | 0.80 |
| బుద్ధవాణి | 0.80 |
| క్రైస్తు సూక్తిమాల | 0.80 |
| మహమ్మదు సూక్తి మంజరి | 0.80 |
| శ్రీ విష్ణుసహస్రనామ స్తోత్రము | 1.25 |

ఇవియేకాక ఆంగ్ల, సంస్కృత, తమిళ, హిందీ, కన్నడ గ్రంథములును,

వేదాంత కేసరి (ఆంగ్లము) శ్రీ రామకృష్ణ విజయము (తమిళము)

అను మాసపత్రికలును, శ్రీ రామకృష్ణ పరమహంస, శ్రీ శారదాదేవి, శ్రీ వివేకానందస్వామి మున్నగువారి ఛాయాచిత్రములు, త్రివర్ణ చిత్రములు, తైలచిత్రములు మున్నగున వెన్నియో మా యొద్ద లభింప గలవు.

అడ్రెసు : మేనేజరు, శ్రీ రామకృష్ణ మఠము, మైలాపూరు, మద్రాసు - 600 004

సంవత్సర చందా రూ 10-00 జీవిత చందా రూ. 125-00 విడి సంచిక 1-00 రూ

# శ్రీ రామకృష్ణ ప్రభ

సంపుటము 36 | 1979 - మే | సంచిక 5

## విషయసూచిక



శ్రీ రామకృష్ణ ప్రభ

సంవత్సర చందా : రూ. **10-00.** జీవిత చందా : రూ. **125-00.**

శ్రీ రామకృష్ణమఠము,

మైలాపూర్, మద్రాసు—600-004.

# శ్రీ రామకృష్ణ ప్రభ అభిమానులకు
## ఒక ముఖ్యమైన మనవి

శ్రీ రామకృష్ణ ప్రభకు వ్యాప్తి (Circulation) చాల పరిమితముగనున్నది. చందాదారుల సంఖ్య ఎక్కువ అగుటకు మీ సహాయమపేక్షించుచున్నాము. మీలో, వ్యక్తిగతముగా ఒక్కొక్కరు ఒక్కొక్క క్రొత్త చందాదారుని చేర్పించుటకు ప్రయత్నించిన చాలును. ఆంధ్రదేశములో రామకృష్ణసమితులు, సమాజములు, సేవాసంఘములు — నడిపించుచున్న కార్యదర్శులు కనీసము పది చందాదారులను చేర్పించుటకు ప్రయత్నించిన బాగుండును. సాధ్యమైనంతవఱకు జీవిత చందాదారులను, అట్లు కానిచో సంవత్సర చందాదారులను చేర్పించి మీరందఱు, పత్రిక వెలువరించుటకు తగినంత ప్రోత్సాహమును మాకు కలిగించగలరని ఆశించుచున్నాము.

ఈ విషయమున, ఈ వఱకే కొందఱు స్వయముగా మాకు సహాయమందించుచున్నారు. ఎన్. పరంధామనాయుడు (పాకాల), కొత్తా గౌరీశంకరరావు (విజయవాడ), డి. పి. ఆర్. విఠ్ఠల్ (హైదరాబాదు) మొదలగువారు ఈ విషయమై చేసిన, చేస్తున్న సహాయమునకు మిక్కిలి కృతజ్ఞులము.

ఆత్మనో మోక్షార్థం జగద్ధితాయ చ.

# శ్రీరామకృష్ణ ప్రభ

సంపుటము 36 1979 - మే సంచిక 5

## వేదాహమేతం

వేదాహమేతం పురుషం మహాన్తమ్
ఆదిత్యవర్ణం తమసః పరస్తాత్
తమేవ విద్వానమృత ఇహ భవతి
నాన్యః పంథా విద్యతే ఽయనాయ ॥

మహాంతం = గొప్పవాడును, ఆదిత్యవర్ణం = సూర్యునివంటి కాంతిగలవాడును, తమసః = అంధకారముకంటె, పరస్తాత్ = అవతలనుండువాడును, (అగు) ఏతం = ఈ, పురుషం = పురుషుని, అహం = నేను, వేద = ఎఱుగుదును, తం = ఆ పురుషుని, ఏవం = ఈవిధముగా, విద్వాన్ = ఎఱిగినవాడు, ఇహ = ఇచ్చటనే, అమృతః = ముక్తుడయినవాడు, భవతి = అగుచున్నాడు, అయనాయ = మోక్షముకొఱకు, అన్య = వేఱొక, పంథా = మార్గము, న విద్యతే = లేదు.

ఒక మంత్రద్రష్ట తన ధ్యానానుభవమును ఈవిధముగా ప్రకాశమొనర్చుచున్నాడు:—

(ఏ పురుషుడు దేవమనుష్య తిర్యగాది నానాభేదములు గల సకలప్రాణుల దేహములను కల్పించి వానికి నామరూపములను ఏర్పఱచి వానితో అంతట వ్యవహరింపబడుచున్నాడో) అట్టి గొప్పవాడును, సూర్యునివంటి కాంతిగలవాడును, అంధకారమునకు వెలుపలనుండువాడును అగు ఈ పురుషుని నే నెఱుగుదును. అట్టి పురుషుని ఎఱిగినవాడు ఇచ్చటనే ముక్తుడగుచున్నాడు. మోక్షమునకు ఇంతకంటె వేఱుమార్గము లేదు. (మోక్షప్రాప్తికి, జ్ఞానముకంటె అన్యమార్గము వేఱు లేదని తాత్పర్యము).

ఇంతలో హాజరా వచ్చి కూర్చొనెను. శ్రీరామకృష్ణులు హాజరాతో చాలసేపు మాట్లాడిన పిదప ఇట్లు ప్రశ్నించిరి. "చూడు! నిన్న రాముని ఇంట్లో విజయ్ కేదార్ మున్నగు వారందరు కూర్చొనియుండగ నరేంద్రుని చూడగనే అంత భావోద్రేకము కల్గిన దేల?"

ఇంతలో నరేంద్రుడు వచ్చెను. వానిని చూచి శ్రీరామకృష్ణుల ఆనందమునకు మేర లేదు. నరేంద్రుడు శ్రీరామకృష్ణులకు నమస్కరించి భవనాథ్ మున్నగు భక్తులతో మాట్లాడుచుండెను. మాస్టరు కూడనుండిరి. వారు కూర్చున్న చోట చాప పరచియుండెను. మాట్లాడుచు తటాలున నరేంద్రుడు చాపపై బోర్ల పరుండెను. వానిని అట్లు చూచి రామకృష్ణులు సమాధిస్థితి నందిరి. ఆ స్థితిలో లేచిపోయి నరేంద్రుని వీపుపై కూర్చొనిరి. భవనాథుడు దేవీకీర్తన పాడెను.

'గో, ఆనందమయీ హాయే మా ఆమాయ నిరానంద కొరోనా'

(ఓ, ఆనందమయురాలగు తల్లీ! నన్ను నిరానందుని చేయకు)

శ్రీరామకృష్ణులకు కొంత బాహ్య స్పృహ కల్గెను; పాటలు పాడసాగిరి.

(ఒక పాటయొక్క భావము:-స్వర్గ మర్త్య పాతాళములు నీవేనమ్మా! బ్రహ్మా విష్ణు మహేశ్వరాదులు నీయందే ఉద్భవించిరి. స్వర్గ లోకములో సర్వమంగళయను పేర వెలయు చున్నావు. వ్రజభూమిలో కాత్యాయనివై వెల్గొందితివి. కాశిలో అన్నపూర్ణ పేరుతో అనంతరూపములతోను వెలయుచున్నావు. దుర్గాయని నామస్మరణ చేయుచు ఎవరైనను వీదారినపోయిననుసరే సాంబశివుడు త్రిశూలము చేతగొని వారిముందు నడచుచు రక్షించుచుండును.)

హాజరా ఉత్తరపు వైపుగల వరండాలో కూర్చొని జపమాల చేతబూని జపము చేయుచుండెను. శ్రీరామకృష్ణులు వచ్చి వానికెదురుగ కూర్చొని హాజరా జపమాలను తన చేతిలో తీసికొనిరి. మాస్టరు, భవనాథ్ అచ్చటనే యుండిరి. 10 గం॥ వేళ శ్రీరామకృష్ణులు (హాజరాతో) "చూడు! నేను మాల త్రిప్పుచు జపము చేయలేను. లేదు లే-చేసిచూడనీ-ఎడమచేతితో చేయగలను. కాని మాల త్రిప్పుచు జపము చేయజాలకున్నానే!" ఇట్లనుచు జపము చేయ ప్రయత్నించుటతోడనే సమాధిస్థితినందిరి. సంపూర్ణముగ బాహ్యజ్ఞానము లేదాయె! చేతిలో మాల అట్లే నిలిచియుండెను. భక్తులు విస్మయముతో చూచుచుండిరి. హాజరా కూడ తన ఆసనము పైననే కూర్చుని ఆశ్చర్యముగ చూచుచుండెను. చాలసేపైన పిదప కొంత స్మృతి వచ్చినది. తరువాత "నాకాకలి వేయుచున్నది" అనిరి. మాస్టరు తినుబండారములు తెచ్చెదనని పోవుచుండ శ్రీరామకృష్ణులు "వద్దు నాయనా! మొదట కాళికాలయమునకు పోయెదను" అనిరి.

ృష్ణులు విశాల ప్రాంగణము మీదుగ శ్రీభవతారిణీ ఆలయమువైపునకు నడచుచుండిరి. ద్వాదశ శివాలయముల ఎదుట నిల్చి ప్రణామములు చేసిరి. ఎడమవైపున నున్న శ్రీరాధాకృష్ణాలయములో ప్రణమిల్లి తిన్నగ కాళికాలయము చేరి దేవి విగ్రహము మొదుట ఆసనముపై కూర్చొని దేవి పాదముల కడ పుష్పాంజలినిడిరి. అటుపై కొన్ని పుష్పములు తమ శిరస్సుపైనుంచుకొనిరి. లేచి

వచ్చునప్పుడు భవనాథ్‌తో "అమ్మకు నివేదించిన లేతకొబ్బరి తీర్థము తీసికొని రమ్ము" అనిరి.

శ్రీరామకృష్ణులు తమగదికి తిరిగి వచ్చిరి. భవనాథ్, మాస్టరు కూడ నుండిరి. వెంటనే పోయి హాజరా ఎదుట నేలపై పడి సాష్టాంగ ప్రణామము చేసిరి. హాజరా ఉలికిపడి "ఇదేమి? మీరిలా చేయుచున్నారేల?" అని అఱచెను.

ఆలయములో నైవేద్యము ముగిసెను. మధ్యాహ్న హారతులు ముగిసెను. భోజనము నకు వేళయ్యెను. బ్రాహ్మణులు వైష్ణవులు పేదలు అందరును గదిలో ప్రసాదము తీసికొనుటకు పోవుచుండిరి. కాళికాలయపు ప్రసాదము రాధాకృష్ణాలయప్రసాదము వితరణ చేయుదురు. ఆలయపు నౌకర్లు, పూజారుల పంక్తిలోనే భక్తులు కూడ కూర్చొని భుజింతురు. శ్రీరామకృష్ణులు (భక్తులతో) "మీరందరూ పోయి ఆలయములో భోజనము చేయండి, సరేనా? (నరేంద్రునితో) నీవు ఇచ్చటనే నాతో భుజించెదవా?"

భోజనానంతరము శ్రీరామకృష్ణులు కొంచెముసేపు విశ్రమించిరి, భక్తులు వరండాలో మాట్లాడుకొనుచుండిరి. శ్రీరామకృష్ణులు లేచి భక్తులకడకు పోయి కూర్చొని వారలతో బాటు ఆనందించుచుండిరి. మధ్యాహ్నము రెండుగంటలైనది. భవనాథ్ బాలబ్రహ్మచారి వేషము వేసుకొని చేత కమండలము పూని తటాలున వారిఎదుట నిలిచెను. శ్రీరామకృష్ణులతోబాటు భక్తులు నవ్వసాగిరి.

శ్రీరామకృష్ణులు: వాని మనస్సులో కోరిక ఇదియే కదా. అందుచే ఇట్లు వేషము వేసుకొనెను.

నరేంద్రుడు: అతడు బ్రహ్మచారి వేషము వేసెను. నేను వామాచారి వేయనా?

శ్రీరామకృష్ణులు ఆ మాట పెడచెవిని బెట్టి పాడుచు లేచి నృత్యము చేయసాగిరి. ఆ తరువాత ఇట్లనిరి.

రాజ్‌నారాయణ్, చండికాదేవి మీద పాటలు ఎంత చక్కగ పాడుతారు! పాడుచు వారు ఎట్లు నృత్యము చేయుదురు! మఱచిపోవాలనుకున్నా మఱపురాదు. కామార్పుకూరులో నకుల్‌చారి కూడ చక్కగా పాడుచు నృత్యము చేసెడివారు.

పంచవటి కడ ఒక సాధువు వచ్చియుండెను. చాల కోపిష్ఠి. నోటికి వచ్చినట్లు ప్రేలును. అతడు పాదుకలు తొడిగికొని శ్రీరామకృష్ణుల కడకు వచ్చి "నిప్పు దొరకునా" అని అడిగెను. శ్రీరామకృష్ణులు చేతులు జోడించి సాధువునకు నమస్కారము చేసిరి. అతడచ్చటి నుండి పోవు వఱకు అట్లే చేతులు జోడించి నిల్చియుండిరి. సాధువు వెడలిన పిదప భవనాథ్ "బాబోయీ! ఆ సాధువుపై మీకెంత భక్తి!" అనెను. శ్రీరామకృష్ణులు నవ్వుచు" ఆసాధువు తమోగుణ నారాయణస్వరూపుడు. తమోగుణ వ్యక్తులను ఇట్లే ఈ విధముగనే సంతుష్టుల జేయవలెను సుమా! ఏమైననూ సాధువు కదా!

పరమపద సోపానపటమున (వైకుంఠపాళి) ఆట భక్తులు ఆడుచుండిరి. హాజరాకూడ ఆడుచుండెను. శ్రీరామకృష్ణులు వచ్చి ఆట చూచుచుండెను. మాస్టరు-కిశోర్‌ల గవ్వ పైకెక్కిపోయెను. శ్రీరామకృష్ణులు వారిద్దరికి నమస్కారము చేసిరి. "మీరిద్దరు సోదరులు-ధన్యులు" అనిరి. (మెల్లగా మాస్టరుతో)

''నీవింక ఆడవద్దు'' అనిరి. మరల ఆట చూచుచుండిరి. హాజరా పావు నరకములో పడెను. అందరూ సంతోషముతో అట్టహాసము చేయుచు గంతులు వేసిరి. 'లాటు' గవ్వ ఎక్కడ పడకుండ తిన్నగా స్వర్గము చేరెను. అంత ఆనందము పట్టలేక 'లాటు' గంతులు వేయుచుండెను.

శ్రీరామకృష్ణులు : అటుచూడు! 'లాటు' గంతులు వేయుచున్నాడు. గెలువకున్నచో అతనికి చాల కష్టము వేసెడిది. (భక్తులతో మెల్లగా) దీనిలో మంచి అర్థము గలదు. హాజరాకు ''ఆటలో కూడ నేనే గెల్తును'' అనే గర్వముండెను. కాని భగవంతుడు మంచివాళ్ళ నెప్పుడు జారవిడువడు. మంచివాళ్ళకు తుదకు జయమే కల్గించును.

—సశేషము.

## ప్రపత్తి - పునఃప్రపత్తి

ఏనుగు తననెత్తిన తానే మన్ను వేసికొనునట్లు మనము చెడిపోవుకార్యములు మనమే చేసుకొనుచుండ మనపై భగవంతునకేల కోపమువచ్చును? మన కృత్యములు మనము చేయకపోవుటచే నాయనకు వచ్చిన నష్టమేమి? మనల నెటులయిన రక్షింపవలయుననియే ఆయన ఉద్దేశ్యము. సర్వప్రాణులయందు ప్రాణశక్తిని చొప్పించవలయుననియే సూర్యు డెండకాయును. ఆ యెండ మనమీదఁబడకుండఁ గొడుగు పట్టుకొనినను మూలయింటగూర్చుండినను సూర్యుఁ డేమిచేయగలఁడు? మనము గొడుగుపట్టుకొంటిమని మనమీద గోపించునా? అట్టులే భగవదనుగ్రహము మనమీదఁ బ్రవహించుచుండగా దానిని మనము మనస్సుచే గ్రహింపక దానిని రాకుండునట్లు చేసితిమేని యది రాకపోవును. కావున మనము చెడుదుమేకాని భగవంతునకుఁ గోపములేదు. ఎండ గాలి లోపలికి రాకుండ తలుపులు గవాక్షులు కిటికీలుమూసికొని మూలయింట నున్నవాడు వానినన్నిటిని తెఱచుట యెట్టిదో అట్టిది ప్రపత్తి. కిటికీలు గవాక్షులు తెఱచునంతమాత్రమున గాలి, యెండ తమంతట తామే యెట్లు వచ్చునో అట్లే మన సర్వేంద్రియములు భగవంతునివిషయమున పరాఙ్ముఖములు గాకుండఁజేయుటయే ప్రపత్తి. రోగము నెమ్మదించినపిమ్మట మరల జిహ్వాచాపలముచే తినరానిది తిని, చేయరానివి చేసినవాడు మరల నౌషధసేవచేయుటయే పునఃప్రపత్తి. రాత్రులందు కిటికీలు, గవాక్షులు, తలుపులు మూసినవాడు ఉదయమున తెఱచుటయే పునఃప్రపత్తి. అట్లైన భగవంతునిమాట కర్థమేమియందువా?

భగవంతుడు సర్వస్వతంత్రుడు, ఆయనశక్తి యాయనకు విధేయురాలై యాయన సంకల్పప్రకారము వర్తించును. అతిక్రమించి వర్తింపదు. మనము బాగుపడుట యీశక్తివలననే, శక్తిహీనతచేతనే చెడుదుము. మనము భగవంతునకున్ముఖులమైతిమేని యాశక్తిని మనలో ప్రవేశింపచేయును. ఆ కారణముచే నాయన మనకు రక్షకుడందుము. పునఃప్రపత్తి యనునది చేసిననేరమును క్షమింపుమని కోరుటయే. ఇది భగవంతుని క్షమాగుణమును తెలుపుచున్నది.

— కాశావజ్ఝల రామకోటిశాస్త్రి.

# తత్సత్

సుప్రసిద్ధ హిందీ కథానికా రచయితలు, నవలాకర్తలూ అయిన శ్రీ జైనేంద్రకుమార్ రచించిన కథ ఇది. సాహిత్య అకాడెమీవారు తెనుగులో ప్రచురించిన 23 హిందీ కథలు (సంపాదకులు : జైనేంద్రకుమార్, అనువాదం : వేమూరి రాధాకృష్ణమూర్తి) అను పుస్తకమునుండి వారి అనుమతితో దీనిని గ్రహించి రామకృష్ణ ప్రభ పాఠకులకు అందించుచున్నాము. ఇతఃపూర్వము ఈ కథను చదివినవారు సహితము మళ్ళీ నాలుగైదుసార్లు చదువవలసిన అత్యుత్తమ కథ ఇది. వేదసారములైన 'తత్త్వమసి' ఇత్యాది మహావాక్యములు ప్రతిపాదించు పరమసత్యమునే, ఈ కథావ్యాజమున శ్రీ జైనేంద్రకుమార్ పరమరమణీయముగా ప్రతిపాదించియున్నారు. ఈ తాత్త్వికకథను రామకృష్ణ ప్రభ పాఠకుల ముందుంచుటకు మిక్కిలి సంతసించుచున్నాము. ఈ కథను ప్రచురించుటకు అనుమతించిన సాహిత్య అకాడెమి సహృదయులకు కృతజ్ఞతలు తెలుపుకొనుచున్నాము.

ఒక దట్టమైన అడవిలో యిద్దరు వేటగాళ్లు ప్రవేశించారు. వాళ్లు అనుభవం కల పాత వేటగాళ్లు. వేటకోసం చాలా దూరం తిరిగి తిరిగి ఆ అడవిలో ప్రవేశించారు. ఇంత పెద్ద అడవిని యిదివరకు వాళ్లు ఎన్నడూ చూచియుండలేదు. ఆ అడవిని చూస్తే చాలు చెమటలు పోస్తున్నాయి. అక్కడ ఒక పెద్ద మర్రిచెట్టు నీడన మకాం పెట్టి మాట్లాడుకోవడం ప్రారంభించారు.

"చాలా భయంకరమైన అడవి" అని అన్నాడు ఒకడు.

"దట్టంగా కూడా వున్నది" అని అన్నాడు రెండోవాడు.

ఈ విధంగా కొద్దిసేపు మాట్లాడుకొని విశ్రాంతి తీసికొని వేటగాళ్ళు ముందుకు వెళ్ళిపోయారు.

వాళ్లు వెళ్లిపోయిన తరువాత అక్కడే వున్న మోదుగచెట్టు మర్రిచెట్టును "మర్రి తాతా! నీ నీడలో కూర్చున్నారే వాళ్లెవరు?" అని అడిగింది.

"వాళ్ళెవరో నీకు తెలియదా?"

"తెలియదు. విచిత్రంగా వున్నారు. ఎవరు తాతా వాళ్ళు?"

"చిన్నవాళ్ళుగా వున్నప్పుడు వాళ్లను చూచాను. వీళ్ళను మనుష్యులని అంటారు. వీళ్ళకు ఆకులంటూ వుండవు. మొండెం మాత్రమే వుంటుంది. వాళ్ళు ఎలా నడచి వెళుతున్నారో చూచావు కదూ! తమ మొండేనికి గల రెండు కొమ్మల ఆధారంతో నడచిపోతారు."

"వీళ్ళు ఎప్పుడు క్రింది స్థాయిలోనే వుంటూ వుంటారు. పైకి ఎదగరేం తాతా!"

"నీవలె నావలె వీళ్లకు వ్రేళ్లు వుండవు. అట్టి స్థితిలో పైకి ఎదగాలంటే వాళ్ళకు సాధ్యం కాదు. వేరు లేని వాళ్ళు అసలు ఎలా బ్రతుకుతున్నారో మరి? ఆశ్చర్యంగానే వున్నది."

అక్కడే వున్నది తుమ్మచెట్టు. గాలి రివ్వున వచ్చి ఆ చెట్టులోనుండి తిన్నగా వడపోతబడి ముందుకు వెళ్లిపోతూంది. దాని శరీరం మీద అన్నీ ముళ్లే. అది అందుకొన్నది. "తాతా! ఓ తాతా! నీవు చాలా కాలాన్ని చూచావు. కాని ఏదైనా అడవిని చూచావా! వీళ్లేమో అడవిని గురించి మాట్లాడుకొంటున్నారు."

"అవును తాతా! నేనూ విన్నాను. ఏదో అడవి అడవి అంటున్నారు. ఏమిటి తాతా అది!" అన్నది మోదుగ.

"నిజం చెబుతున్నాను. ఎంతో కాలం బట్టి వుంటున్నాను. ఆ అడవి ఏమిటో నాకూ తెలియదు. నేను దాన్ని ఎన్నడూ చూడలేదు.

చాలా జంతువుల్ని చూచాను. సింహాలు, పులులు, చిరుతపులులు, ఏనుగులు, ఎలుగ్గొడ్లు, తోడేళ్లు అన్నింటినీ చూచాను గాని అడవి అనే జంతువును యింతవరకు చూడలేదు'' అని అన్నది మర్రిచెట్టు.

''సింహాల కంటె, చిరుతపులుల కంటె కూడా అది భయంకరమైనది కాబోలు'' అని అన్నది మరో చెట్టు.

''భయంకరమంటే ఏమిటో నాకైతే తెలియదు. అందరితోను నేను ప్రేమగానే వుంటాను'' అని అన్నది మర్రిచెట్టు.

''తాతా! ప్రేమను గురించి చెప్పకు. నా దగ్గర వున్నవన్నీ ముళ్ళే. కాని ఆ మనుష్యులు అడవి భయంకరమైనదని అనుకొంటున్నారు. సింహాలకంటె, చిరుతపులులకంటె బహుశ అది భయంకరమైనది అయివుండవచ్చు'' అని అన్నది తుమ్మచెట్టు.

''అవును. కావచ్చు. మనిషి ఒక చిన్న కర్ర కొసనుండి నిప్పు రవ్వను వదలి దానితో సింహాల్ని, చిరుతల్ని చంపివేస్తాడు. ఆ విధంగా చచ్చిపోవడం కండ్లారా చూచాను. కాని అడవి శవం మాత్రం నేను చూడలేదు. బహుశ అది ఏదో గొప్ప భయంకరమైనదే అయి వుంటుంది'' అని అన్నది మర్రిచెట్టు.

ఈ విధంగా చెట్ల మధ్య సంభాషణ జరిగింది. అడవిని వాటిలో ఏవీ ఎరుగవు. దరిదాపుల్లో గల టేకు, మొదలుగాగల చెట్లు కూడా ఆ సంభాషణలో పాల్గొన్నాయి. కాని వేటికీ అడవిని గురించి తెలియదు. కాని అడవిని గురించి అజ్ఞాతంగానే వాటికి ఒక భయం ఏర్పడింది. అక్కడికి దగ్గరలోనే వెదురు పొద ఒకటి వున్నది. కొద్దిగాలి తగిలితే చాలు అది ఖర్ ఖర్, సన్ సన్ మంటూ చప్పుడు చేస్తూ వుంటుంది. అది తాను వున్న చోటునుండి ఈలలా ధ్వని చేసి ''సంగతేమిటో నాకు చెప్పండి. నాకు చాలా విషయాలు తెలుసు. నాకు చెప్పండి'' అని అన్నది.

మర్రిచెట్టు గంభీరంగా ''నీవు తీక్ష్ణంగా మాట్లాడుతావు. అడవిని నీవు ఎప్పుడైనా చూచావా? చూస్తే చెప్పు! మేమంతా అదేమిటో తెలుసుకొందామని అనుకొంటున్నాం'' అని అన్నది.

వెదురుగడ శూన్యంగా ''గాలి నాలో వున్న ఖాళీ ప్రదేశంలో అడవి, అడవి, అడవి అంటూ తిరుగుతున్నట్లున్నది. కాని అది నాలో ఆగదు. ప్రతిక్షణం అడవి అడవి అనే శబ్దం మాత్రం వింటూ వున్నాను. అడవి అనేది మాత్రం వున్నది. కాని నేను మాత్రం దాన్ని చూడలేదు. అది ఎవరికైనా కనబడిందా?'' అని ప్రశ్నించింది.

''ఏమీ తెలియని దానివి యింత తీక్ష్ణంగా ఎందుకు మాట్లాడుతావు?'' విసుగ్గా అన్నది మర్రిచెట్టు.

నాలో గాలి ప్రవేశించి యిటునుండి అటు పరుగెత్తుతూ వుంటుంది. నాలో అంతా ఖాళీయేగా మరి! నేను మాట్లాడను. మోగుతూ వుంటాను. ఆ గాలే నా లోపలి నుండి మాట్లాడుతుంది'' అని అన్నది వెదురుగడ.

''వెదురు బాబూ! నీవు దట్టంగా లేవు. ముక్కుసూటిగా అమాయకంగా వుండటమే నీకు తెలుసు. నీలో నిండుతనం వుంటే కొంచెం వంగి వుండేదానివే. పొడుగ్గా వున్నంత మాత్రాన అంతా ఒరిగి పడినట్లనుకోకూడదు'' అని అన్నది మర్రిచెట్టు.

ఆ మాటలకు కోపంవచ్చి యిలాంటి అవమానం తాను సహించలేనని, తాను చాలా ఎత్తైన దాన్నని వెదురుగడ ఖర్ ఖర్ సన్ సన్ అని అంటూ సమాధానమిచ్చింది.

మర్రిచెట్టు ఆ మాటల్ని పట్టించుకోకుండా మిగతా చెట్లవంక చూచి "మీరంతా యీ విషయం పచ్చిగడ్డిని అడిగిచూడండి అది అంతర్యామి. ప్రతిచోటకు వెళ్లగల శక్తి దానికున్నది. ఎవ్వరూ దాన్ని గురించి బాధపడరు" అని చెప్పింది.

"అప్పుడు మిగతా చెట్లన్నీ కలిసి "ఒసే గడ్డీ! అడవిని ఎరుగుదువా?" అని అడిగాయి.

"లేదు. నేను దాన్ని చూడలేదు. ప్రజల పాదాలను మాత్రమే నేను చూస్తుంటాను. వారి పండ్లు నాకంటె ఎత్తుమీద వుంటాయి. పాదస్పర్శద్వారా అందరి పరిచయం నాకు కలుగుతుంది. నా నెత్తిన దెబ్బ గట్టిగా పడినప్పుడు ఆ వస్తువు శక్తి ఎలాంటి ప్రమాణంలో వున్నదో నాకు తెలుస్తుంది. నెమ్మదిగా ఎవరైనా నడుస్తుంటే యితడెవరో దుఃఖజీవి అని అనిపిస్తుంది. దుఃఖాలతో నాకు పరిచయం ఎక్కువ. అదంటే నాకు ఎక్కువ యిష్టంకూడా. అందుకే యిలా క్రిందపడి వుంటున్నాను. అందరూ నా నెత్తిమీదగా వెళ్ళిపోతుంటారు. అంతా నా గుండెలమీదనే జరుగుతూ వుంటుంది. కాని అడవిని నేను ఎన్నడూ విడమరచి చూడలేదు" అని చెప్పింది గడ్డి.

"ఏమీ చెప్పలేవా?" అని ప్రశ్నించింది మర్రిచెట్టు.

"ఏదో క్రిందపడివుండేదాన్ని. నేనేం చెప్పగలుగుతాను తాతా అని సమాధానమిచ్చింది గడ్డి

అది పెద్ద గడ్డు సమస్య అయిపోయింది. బుద్ధిమంతురాలుగడ్డి సరియైన సమాధానమివ్వలేదు. వాక్చాతురుడు వెదురుబాబుకూడా ఏమీ చెప్పలేకపోయాడు. మర్రి తాత ఎంతో జిజ్ఞాసువు. అడవి అనే భయంకర జంతువును గురించి ఎలా తెలుసుకోవాలో ఎవ్వరికి బోధపడలేదు.

ఇంతలో మృగరాజు సింహం అక్కడికి వచ్చింది. కోరలు తీక్షణంగా వున్నాయి. పొడుగాటి వెంట్రుకలతో మెడ నిండివున్నది. తోక పైకెత్తుకొని వున్నది. నెమ్మదిగా, గర్వంగా అడుగులో అడుగు వేసుకొంటూ అక్కడికి వచ్చింది. దగ్గరగా గలగలని పారుతున్న సెలయేటిలో నీరు త్రాగసాగింది.

మర్రితాత పెద్దగా కేకపెట్టి పిలిచి "ఓ సింహం సోదరా! నీకు పరాక్రమం ఎక్కువ. ఎక్కడెక్కడో తిరుగుతూ వుంటావు వేటాడుతూ. ఒక్క విషయం అడుగుతాను చెప్పు!" అని అడిగింది.

సింహం నీరు త్రాగి తలపైకెత్తి చూచింది. "ఏమిటి నీవనేది" అని గర్జిస్తూ అడిగింది.

"ఏదో అడవి అనేది ఒకటి వున్నదట. అది యిక్కడికి దగ్గరలోనే వున్నదట. భయంకరంగా వుంటుందట. నీవు అందరినీ జయించినదానివి కదా! ఆ అడవిని ఎప్పుడైనా ఎదుర్కొన్నావా? అదెలా వుంటుందో కాస్త చెబుతావేమోనని" అని అన్నది మర్రిచెట్టు.

సింహం బిగ్గరగా గర్జించింది. "ఎవరా అడవి? నా ఎదుటికి తీసుకురండి. వెంటనే చీల్చి చెండాడి ఎండేస్తాను. నాముందు అదెంత?"

"అయితే అడవిని నీవు చూడలేదన్నమాట!" అని అన్నది మర్రి.

"చూస్తే ప్రాణాలతో వదిలేదాన్నా? యిదిగో గర్జిస్తున్నా. నా గర్జన విని అడవి ఎక్కడున్నా సరే నా ఎదుటికి రమ్మను. చూపిస్తా నా తడాఖా. బహిరంగంగా సవాలు చేస్తున్నాను. అది వుండటమో నేను ఉండ

టమో తేలిపోవాలి'' అంటూ భయంకరంగా భూనభోంతరాలు దద్దరిల్లి పోయేలా గర్జించింది. ఆ గర్జనకు మఱ్ఱి ఆకులు నిక్కబొడుచుకొన్నాయి. దాని తొఱ్ఱల్లో నివసిస్తున్న పక్షి పిల్లలు గజ గజ వణికిపోయాయి. కాని దాని గర్జన ప్రతిధ్వనించి నిలిచిపోయింది. దాని హూంకరింపుకు సమాధానం ఏమీ రాలేదు.

''అడవి వున్నదని, అది దగ్గరలోనే వున్నదని నీకు ఎలా తెలిసింది? నేనున్నాను గదా! మీరంతా నిర్భయంగా వుండండి. అడవి అంటూ ఏమీ లేదనే అనుకోండి. నేనున్నంత కాలం ఎవ్వరికీ మీరు భయపడనవసరం లేదు'' అని అన్నది సగర్వంగా సింహం.

''మీ మాటే నిజం. కొన్ని శతాబ్దాలు గడిచాయి. ఇంతవరకు అడవిని నేను చూచియుండలేదు. వుంటే తప్పక కనబడి వుండేదే. మీరు వుంటే మరెవ్వరు ఆగగలరు? వాళ్లున్నారే రెండు కాళ్లమీద ఆధారపడి నడుస్తుంటారు మనుష్యులు—వాళ్ళు యిందాక నా నీడన కూర్చొని ఆ అడవిని గురించి చెప్పకొంటున్నారు. అసలు వేరు అంటూ లేని యీ మనుష్యులకు మనకంటే ఎక్కువ తెలుస్తుందా అని!'' అన్నది మఱ్ఱిచెట్టు.

మఱ్ఱిచెట్టు యిక ఏమీ మాట్లాడలేదు. కాని మిగతావన్నీ అందుకొన్నాయి. ''మృగరాజా! నీ భయంవల్ల చాలా జంతువులు భయపడి దాక్కుంటాయి. అవి ముఖం చూపించవు. అడవికూడా అదే విధంగా దాక్కుందేమో! నీ భయం సామాన్యమైనదా మరి? యిది చాలా రహస్యమైన విషయం. ఎప్పుడూ నేలబొరియల్లో ముఖం దాచుకొని పడివుండే పాములున్నాయే వాటికి తెలుస్తుంది యిలాంటి వారి రహస్యం. చీకట్లో రహస్యాలు చీకట్లో వుండేవాళ్లకే తెలియాలి గాని వెలుతురులో తలలెత్తుకొని వుండే మా బోటివాళ్లకు ఏం తెలుస్తాయి?'' అని అన్నవి మిగతా చెట్లు.

''నేను చెప్పింది నిజం. సందేహించడం తప్పు. నేనున్నంతవరకు ఏమీ భయం లేదు. పాములెందుకు గీములెందుకు? నా కంటె ఎక్కువ తెలిసిన వాళ్లెవరైనా వున్నారా?'' అంటూ సింహం గర్జించింది.

మఱ్ఱిచెట్టు ఆ మాటలన్నీ వింటూ వున్నది. ఏమీ మాట్లాడలేదు. ఎవ్వరూ ఏమీ అనలేదు. తుమ్మముల్లు మాత్రం కోపంతో లేచి నిలబడ్డాయి. అయినా తుమ్మచెట్టు తొందరపడలేదు. ఏమీ మాట్లాడలేదు.

చివరకు ఆవలించి నెమ్మదిగా అడుగులు వేసికొంటూ సింహం ముందుకు వెళ్లిపోయింది.

అదృష్టవశాత్తు ఆ సాయంకాలం చీకటి పడబోతుండగా అరవకుండా గడ్డిలో జరజర పాకిపోతూ నిగనిగలాడే శరీరంతో నాగరాజు కనబడ్డాడు. తుమ్మచెట్టు చూపు తీక్షణమైనది. ''ఓ తాతా! మఱ్ఱి తాతా! సర్పరాజు వెళుతున్నాడు అడుగో. మహాజ్ఞాని. అతని ముందు నేను మాట్లాడలేను. అడవిని గురించి నీవు అడిగితే బాగుంటుంది'' అని అన్నది తుమ్మచెట్టు.

మఱ్ఱి తాతకు సాయంకాలంనుండి మౌనవ్రతం అవలంబించడం అలవాటు. ''సంధ్యాదేవి వస్తున్నది. ఇప్పుడు వాచాలత్వం మంచిది కాదు'' అని అన్నది మఱ్ఱిచెట్టు.

తుమ్మ ఊరుకునే రకం కాదు. ''మఱ్ఱి తాతా! పాము నేలను కరుచుకొని వుంటుంది. దాన్ని చూడటం కూడా కష్టమే. ఈ పాముది శ్యామవర్ణం—అంటే అంత జ్ఞాని అన్నమాట. రంగు చూడరాదూ! ఎంత నిగనిగ! అవకాశం దొరికింది పోగొట్టుకోవడం మంచిది కాదు'' అని అన్నది తుమ్మచెట్టు.

మర్రిచెట్టు పామును చూచి "ఓ నాగ రాజా! అడవి ఎక్కడ వుంటుందో కాస్త చెప్పు! అసలు అదేమిటోకూడా చెప్పు!" అని అడిగింది.

"అడవా! అంటే ఏమిటి? అదేం జంతువు? పాతాళలోకంలో దాని పోలకువే ఎక్కడా లేదే!" అని అన్నది పాము.

"మేమెవ్వరం దాన్ని చూడలేదు. నీకు తెలుసేమోనని అడుగుతున్నాం. బొరియ కన బడితే నీవు ప్రవేశించగలవు. వంకరటింకర వ్యవహారం నీ ముందు సాగదు కదా! అందుకే నిన్ను అడుగుతున్నాం" అని అన్నది మర్రి చెట్టు.

భూమి లోపలి గుంటలనన్నింటినీ నేను ఎరుగుదును. లోపలి వరకు వెళ్ళి లోని రహస్యాలు తెలుసుకొంటూ వుంటాను. అక్కడ జ్ఞానపు గని వున్నది. ఏం చెప్పను! నీకు అర్థం కాదు. నీ అడవి వున్నదే అది అసలు సత్యం కాదని తోస్తున్నది. అసలు అదంటూ లేనే లేదనుకుంటాను. అయినా యీ పై పై మాటలంటే నాకు గిట్టదు" అని అన్నది పాము.

'అడవి' అంటూ ఏమో చెప్పబోయింది మర్రిచెట్టు.

కాని "అంతా ఒట్టిది" అంటూ పాము విని పించుకోకుండానే ముందుకు సాగిపోయింది.

మొత్తంమీద జీవజంతువులు, చెట్లుచేమలు అన్నీ కలుసుకొన్నాయి. అడవి అంటే ఏమిటో తెలుసుకోవాలని ప్రయత్నించాయి. ఒకరి నొకరు ప్రశ్నించుకోవడం, ఎవరికి తెలిసింది వారు చెప్పడం జరిగింది. ఎవరి జ్ఞానం వారిది. వారిలో అజ్ఞాని అంటూ ఎవ్వరూ లేరని తేలింది. అయితే వారిలో అడవిని గురించి తెలిసిన వాళ్లు ఒక్కరూ కనిపించలేదు. ఒకళ్లిద్దరికి తెలియకపోతే పోవచ్చు. పది పదిహేను మందికి తెలియకపోతే పోవచ్చును. కాని ఎవ్వరికీ తెలియని వస్తువంటూ ఎప్పుడైనా ఎక్కడైనా వున్నదా అని? అందువల్ల జంతువులు, వనస్పతులు తూష్ణంగా చర్చించాయి. త్వాంతుంత, త్వాంతుంత అనేదాకా వ్యవహారం వచ్చింది. ఎంతగా చర్చలు జరిగాయంటే వాటిలోనుండి అనేక శాస్త్రాలు ఆవిర్భవించాయి. చివరికి రెండు కాళ్లవాడగు మనిషి విశ్వసనీయుడు కాదని, నిజాయతీపరుడు కాదని నిర్ణయం జరిగింది. అందుకే వాడు 'అడవి' అను కల్పిత కథను అల్లాడని, అంతా ప్రగల్భాలని, నిజానికి అదంతా ఏమీ లేదని కూడ నిర్ణయం జరిగింది.

అప్పుడు మర్రిచెట్టు అందుకొని "సోదరులారా! ఆ మనుష్యుల్ని మళ్లీ రానీయండి. వాళ్ళనే స్పష్టంగా అడుగుదాం. 'నిజం చెబితే చెప్పండి. లేకపోతే అబద్ధాలెప్పుడూ చెప్ప వద్ద'ని మందలిద్దాం. వాళ్ళను అడగకుండానే ముందుగానే అడవితో శత్రుత్వం కొని తెచ్చుకోవడం మంచిది కాదు. అది చాలా భయంకరమైనదని వింటున్నాం. ఇంకా అది ఏమిటో కూడ తెలియదు" అని అన్నది.

కాని మర్రిచెట్టు మాటలు అక్కడ ఎవ్వరికీ ఎక్కలేదు. ఇది ముసలిది. అందువల్ల భయపడి పోతున్నది అని యువకవర్గం భావించింది. అసలు అడవి అంటూ ఏమీ లేనే లేదన్న తీర్మానం నెగ్గింది.

ఒక రోజున ఆపదలో పడి ఆ వేటగాళ్లు మళ్లీ అక్కడికి వచ్చారు. వాళ్ళు వచ్చేసరికి అడవి అంతా ఒక్కసారి మేల్కొన్నది. రకరకాల జంతువులు, చెట్లు చేమలు అన్నీ రకరకాల కూతలతో, చప్పుళ్ళతో తమ వ్యతిరేకతను ప్రకటించాయి. అంతా వాళ్ల మీదకు దూకుతున్నాయా అన్నట్లు వున్నాయి. పాపం

ఆ మనుష్యులకు ప్రాణభయం పట్టుకొన్నది. వెంటనే వాళ్ళు తుపాకుల్ని సిద్ధం చేసుకొన్నారు. నిప్పులు కక్కే ఆ కొయ్యముక్కకి ఏమిటో మర్రిచెట్టుకు బాగా తెలుసు. అందుకని మర్రిచెట్టు జంతువుల్ని, చెట్లను చేమల్ని వారించి "ఎందుకు తొందరపడతారు? యీ మనుష్యుల్ని చంపివేస్తే ఏం లాభం? అసలు విషయమేమిటో తెలుసుకోవడం మంచిది కదా! కొంచెం ఆగండి. కోపంవల్ల జ్ఞానం లభించదు. ఆ ప్రశ్నను వీళ్లనే అడిగి తేల్చుకొంటాను" అని చెప్పి మనుష్యులవంక చూచి "సోదరులారా! మీరు మీ పొగలు కక్కే గొట్టాల్ని క్రిందికి త్రిప్పి పట్టుకోండి. మీకు ఏమీ భయం లేదు. మీరు అంటూ వుంటారే ఆ అడవి ఏమిటో చెప్పండి. అదెక్కడ వున్నదో చెప్పండి!" అని అడిగింది.

భయం లేదని తెలిశాక తుపాకుల్ని క్రిందికి దింపి "మనమంతా వున్నామే యిదే కదా అడవి అంటే" అని అన్నారు.

వాళ్ల నోటినుండి యీ మాటలు వెలువడ్డాయో లేదో రకరకాల ప్రశ్నలు ప్రారంభమైనాయి.

"అడవి యిక్కడెక్కడ వున్నది? ఎక్కడా లేదు."

"నీవున్నావు. నేనున్నాను. ఇది వున్నది. అది వున్నది. ఇదంతా అడవే. వేరుగా అడవి యింకెక్కడ వుంటుంది?"

"నీవు చెప్పేదంతా అబద్ధం."

"మోసగాడివి"

"స్వార్థపరుడివి"

"చంపివేయండి వీళ్లను"

"చంపండి. చంపండి."

మనుష్యులు భయపడిపోయారు. తుపాకులు సిద్ధం చేసికోబోతుండగా మర్రిచెట్టు అందుకొని వ్యవహారాన్ని సరి చేసింది. "మనుష్యుల్లారా! వినండి. మీరు అబద్ధం చెబుతున్నారని రుజువయినప్పుడే మిమ్మల్ని చంపివేయడం జరుగుతుంది. ఈ నిప్పులు కక్కే గొట్టాలు మిమ్ము రక్షించలేవు. ఒక్క ఎముక కూడా కనబడదు. తెలుసుకొని వ్యవహరించండి. మీరు చెప్పింది అబద్ధం కాకపోతే అడవి ఎక్కడున్నదో చెప్పండి!" అని గద్దించింది.

ఆ యిద్దరిలో పెద్దగా కనబడుతున్న మనిషి, ఆశ్చర్యంతోను భయంతోను వణుకుతూ "మనమంతా ఎక్కడ వున్నామో అదే కదా అడవి" అని అన్నాడు.

తుమ్మచెట్టు తన ముళ్లను నిలబెట్టి "వాగుడు కట్టిపెట్టు. అది సరివి చెట్టు. అది టేకుచెట్టు. అది మోదుగ చెట్టు. అది పచ్చగడ్డి. అది సింహం. అది నీరు. అది నేల. నీవు ఎవరి నీడలో కూర్చున్నావో అది మర్రిచెట్టు. ఇక నీవు చెప్పే అడవి ఎక్కడ వున్నదో చెప్పు! చూపించు! చూపించవేం! మమల్ని మోసం చేద్దామనుకొన్నావా?" అని గట్టిగా అన్నది.

"ఇదంతా కలిపితేనే అడవి" అని అన్నాడు మళ్లీ మనిషి.

"శుద్ధ అబద్ధం. నిజం చెప్పు" అని గర్జించాయి మొత్తం చెట్లు చేమలు.

ఇట్టి పరిసితిలో పాపం మనుష్యులు ఏం మాట్లాడగలరు? ప్రాణాలు పోక తప్పదనే నిర్ణయానికి వచ్చారు. అయినా ప్రయత్నించాలని వారిలో ఒకడు మానవభాషలో (ఇప్పటి వరకు వాళ్లు ప్రాకృత భాషలో మాట్లాడుతూ వున్నారు.) మరొకనితో "మిత్రమా! అసలు అడవి అనేది ఏమీ లేదని చెప్పివేయరాదా! ఎందుకొచ్చినపీడ! ఎలాంటి వాళ్ళతో వేగవలసి వస్తున్నదో చూచాముకదా!" అని అన్నాడు.

"నేనంత అబద్ధం చెప్పలేను" అని అన్నాడు రెండవ వ్యక్తి.

"అయితే నిలువునా మన ప్రాణాలు పోతాయి."

పోతే పోనీ! చిరకాలం ఎవరు బ్రతుకుతారు గనుక! ప్రాణభయంతో యీ అమాయక జీవుల్ని మోసం చేయలేను" అని చెప్పి "సోదరులారా! అడవి అనేది ఎక్కడో లేదు. మీరంతా కలిస్తేనే అడవి అవుతుంది. యిది నిజం" అని అన్నాడు ఆ వ్యక్తి.

దానితో తుఫానుకి గుండ్లలా ప్రశ్నల వర్షం కురియ సాగింది.

"ఏమిటి నీ వనేది? నేను అడవినా? అయితే తుమ్మచెట్టు అంటే ఏమిటి?"– అని అన్నది తుమ్మచెట్టు.

"నీవు చెప్పేది అబద్ధం. నేను వెదురు పొదను కాదన్నమాట. అడవినన్నమాట. నా ప్రతిరోమం నేను వెదురుపొదనని చెబుతున్నది."

"నేను గడ్డిని కాదా?"

"నేను సింహాన్ని కాదా?"

"నేను పామును కాదా?"

అంటూ అన్నీ ఒకేసారి అరవడం ప్రారంభించాయి. ఆ ఘోషకు మనుషులిద్దరూ దద్దరిల్లిపోయారు. మర్రిచెట్టు లేకపోతే అన్నీ కలిసి వాళ్లద్దర్నీ నామరూపాలు లేకుండా చేసేవి.

అప్పుడు మనిషికి మర్రిచెట్టుకు మెల్లగా సంభాషణ జరిగింది. వారి మాటలు మరెవ్వరికి వినబడలేదు. సంభాషణ జరిగిన తరువాత ఆ మనిషి మర్రిచెట్టు మీదకు ఎక్కుతూ కనబడ్డాడు. ఎక్కి ఎక్కి చిటారుకొమ్మ దగరికి వెళ్ళాడు. అక్కడ రెండు లేతవైన చిన్న ఆకులు విశాలమైన ఆకాశంవంక చిరునవ్వు నవ్వుతూ చూస్తున్నాయి. మనిషి ఆ రెంటినీ ప్రేమతో ముద్దు పెట్టుకొన్నాడు. ముద్దుపెట్టుకొంటున్నప్పుడు మంత్రరూపంలో ఏదో సందేశం చెబుతున్నట్లు అనిపించింది.

అడవిలో గల ప్రాణులు నిర్విణ్ణులై చూడసాగాయి. వాళ్ళకు ఏమీ అర్థం కావటం లేదు.

చూస్తూ చూస్తూ వుండగానే ఆ రెండు ఆకులు కంఠం పైకెత్తుకొన్నాయి. వాటికి చైతన్యం కలిగినట్లనిపించింది. అవి తమ యిరువైపుల చూశాయి. క్రిందికి చూచాయి. ఏం కనబడిందో ఏమో అవి వణికిపోసాగాయి. వాటి శరీరంలో ఎరుపుదనం వ్యాప్తమైంది. కొద్ది క్షణాలలో వాటిలో ఏమో మెరుపులా వచ్చేసింది. అవి ఖండాన్ని మొత్తం రూపంలో చూచినట్లనిపించింది. మొత్తం వున్నది. ఖండం ఎక్కడున్నదో కూడ చూచినట్లున్నది.

ఆ మనిషి క్రిందికి దిగి వచ్చాడు. మిగతా వన్యజీవుల ఎదుట నిలబడ్డాడు. మర్రిచెట్టు స్థిరంగాను, ప్రశాంతంగాను యోగ సమాధిలో వున్నట్లు వున్నది. హఠాత్తుగా సమాధినుండి బయట పడింది. మేల్కొన్నది. దానికి తన శిఖరాగ్రం నుండి, లోపలి నుండి, అంతర్హృదయం నుండి ఏదో అనుభూతి కలిగినట్లనిపించింది.

అప్పుడు అన్ని వైపుల ప్రశ్నార్థకంగా మౌనం వ్యాపించింది. ఆ మౌనాన్ని ఛేదిస్తూ మర్రిచెట్టు గంభీరంగా—

"అది ఉన్నది" అంటూ తిరిగి మౌనం వహించింది. మిగతావన్నీ దాని వంక చూచి "తాతా! తాతా!" అని అన్నాయి.

"అది ఉన్నది. అది ఉన్నది" అని తాత నోటినుండి సమాధానం వెలువడింది.

ఎక్కడున్నది? ఎక్కడున్నది?"

"అంతటా ఉన్నది. అంతటా ఉన్నది.

"మరి మనమో?"

"మనం లేము. అది ఉన్నది."

# భవ శంకర దేశిక మే శరణం

వేలూరి సదానందం

కొన్ని శతాబ్దాల క్రిందటిమాట. రెండు వేల సంవత్సరాలు కూడా అయి ఉండవచ్చును. వైశాఖ శుద్ధపంచమి రోజు పునర్వసు నక్షత్రం ఇంకా పొద్దువాలక ప్రకృతి పూలు విరిసి మనోహరంగా ఉన్న వేళ కాలటిలో శివగురువు భార్య ఆర్యాంబకు మగపిల్లడు కలిగెను. అతడే శంకరుడు అనే పేరుత పెరిగి శంకర భగవత్పాదులుగా వాసికెక్కెను. ''శిశురేవ పూర్ణః'' ఈ చంటివాడు పరిపూర్ణుడగునన్న పెద్దల ఆశీర్వచనముచే ఆనందభరితులై తల్లిదండ్రులు ఆ ఏక సంతానమును ఎంతో ముద్దుగా పెంచుతూ ఏడాది వెళ్ళీ వెళ్ళక మునుపే సము చేసిరి. మళయాళముతోబాటు సంస్కృతము, అక్షరములు, గుణింతము, వత్తులు, సంధులు లెస్సగా నేర్చుకొనుచు అయిదోఏట ఉపనయనమైన నాటికి వేదము చదువగల సమర్థుడాయెను. అంతలో తండ్రి శివగురువు చనిపోయెను. ఈ చిన్నవానిని పెంచి పెద్దచేసే భారము తల్లిపై పడెను. తల్లిని ఓదార్చి ''యీ బాంధవ్య బంధనాలన్నీ ఆ కనబడే పూర్ణానదీ ప్రవాహంలో కలిసి విడిపోతున్న కట్టెలవంటివమ్మా! ఎన్నిసార్లు వెడుతున్నామో, వస్తున్నామో, కలుస్తున్నామో, కలిసి విడిపోతున్నామో, చెప్పలేము. ఇంక మనస్సు తిప్పుకొని ఆ గుళ్ళో శ్రీకృష్ణునిపై నిలుపు. నేను ఇంక బ్రహ్మచారిగా ఇక్కడి గురుకులవాసం చేసి విద్యలన్ని నేర్చుకొంటాను'' అని చెప్పెను.

గురువు వద్ద విద్యాభ్యాసంచేస్తూ ఒకనాడు భిక్షకై బయలుదేరి యీ 'ఉన్ని' అంటే చిట్టివాడు ఒక యింటిముందు ఆగెను. ఆ యిల్లాలు ''నాయనా మేం పేదవాళ్ళం. మాకే తిన తిండిలేదు, నీకేమీ యివ్వలేనే'' అనుచు వెతగ్గా చిన్న ఉసిరికాయ కనబడెను. 'ఉన్న బట్ట ఒకటి కట్టుకొని గృహస్థు ఊళ్ళో బిచ్చమెత్తబోయెను'అని ఆమె సంకోచపడుచుండగా ''అమ్మా నేను పసివాడనుకదా నీచేత్తో ఆ ఉసిరికాయనే ఇవ్వమ్మా'' అనగా ఆమె తలుపుచాటునుంచి ఉసిరికాయను ఆ వటువు భిక్షాపాత్రలో వేయగా ఆ యింటి కటిక దారిద్ర్యబాధచూచి వేదనపడి శ్రీ మహాలక్ష్మిని ధ్యానించి,

దద్యాద్దయానుపవనో ద్రవిణాంబుధారా<br>
మస్మిన్నకించనవిహంగశిశౌ విషణ్ణే।<br>
దుష్కర్మధర్మమపనీయ చిరాయ దూరం<br>
నారాయణప్రణయినీనయనాంబువాహః॥

సంపత్కరాణి సకలేంద్రియనందనాని<br>
సామ్రాజ్యదానవిభవాని సరోరుహాక్షి।<br>
త్వద్వందనాని దురితాహరణోద్యతాని<br>
మామేవ మాతరనిశం కలయన్తు మాన్యే॥

కమలే కమలాక్షవల్లభే త్వం<br>
కరుణాపూరతరంగితైరపాంగైః।<br>
అవలోకయ మామకించనానాం<br>
ప్రథమం పాత్రమకృతిమం దయాయాః॥

పేదవాణ్ణి కనికరించి నీ కారుణ్యా ధారామృతమును వర్షింపుము'' అని ఇలా శ్లోకరూపమున వేడుకోగా బంగారు ఉసిరికాయలు ఆ యింట కురిసి నాటినుండి నేటివరకు ఆ యింటి పట్టు సంపన్నమై సువర్ణాట్టమన బంగారులోగిలి అని చెప్పుకుంటూ ఉంటారు.

ఆ నిరుపేదల యింట్లో బంగారు ఉసిరికలుగా కురిసిన కనకధార మాత్రమేగాక అది సంజ్ఞగా శంకరులవల్ల సిద్ధించవలసిన మహాత్కార్యమునకు అనువుగా మానవహృదయకుహారంలోకి దివ్యచైతన్యధార ప్రవహించిన అతీంద్రియఘటన కూడా కావచ్చును.

గురుకులంనుంచి ఇంటికి వచ్చిన తరువాత కొడుకును ఒక యింటివానిని చేయవలెనని ఆర్యాంబ అనుకొనెను. కాని అప్పటికే దృఢ పడుచున్న వైరాగ్యము, ఇంకా ఎనిమిదేళ్ళు నిండకముందే సన్యసించవలెనన్న కుమారుని సంకల్పముచూచి ఏమనుకున్నదో కాని తల్లి అనుమతించకుండ సన్యసించకూడదను మాటపై ఆమెను ఒప్పించుటకు శంకరులు యత్నించుచుండెను. ఒకనాడు ఇంటి ఎదుటి పూర్ణానదిలో శంకరుడు స్నానము చేయుచుండగా మొసలి వాతపడి "అమ్మా! నన్ను మొసలి పట్టుకున్నది. ఇక బతుకను. ఇప్పుడైనా ఆపత్సన్యాసానికి సరే అను" అని మొరపెట్టుకొనెను. ఆర్యాంబ సరే అనేంతలో మొసలి శంకరుని వదిలెను. ఆయుష్యము ఎనిమిదేళ్ళే అయినా యీ ఘటనవలన మరొక ఎనిమిదేళ్ళ ఆయుర్దాయం లభించినట్లు చెబుతారు.

ఆపైన శంకరుడు తల్లి దగ్గర సెలవు తీసికొని తనకు వేదాంతబోధ యథావిధిగా చేయగల గురువును అన్వేషించ బయలుదేరెను. తల్లి పోషణకు తగు ఏర్పాట్లు చేసి బంధువులకు సంరక్షణభారము అప్పగించి "నీకే లోటు ఉండదు" అని ధైర్యం చెప్పి నమస్కరించినపుడు ఆర్యాంబ 'నాయనా నాకు ప్రాణము మీదికి వచ్చినపుడు నువ్వు నాదగ్గిరికి వచ్చి ఉత్తరక్రియలు జరుపుమ'ని చెప్పెను. "ఆ సమయం వచ్చినపుడు నన్ను తలుచుకో. నేను వచ్చి దగ్గిరే ఉంటాన"ని శంకరుడు చెప్పి బయలుదేరెను.

శంకరులు ఒక స్తోత్రములో అతి బాలుడను కడు పసిబిడ్డను అని చెప్పుకొనిరి. సదా ఆ భావమే వారిలో కనబడును. 'పుత్రస్య సమ్యగనుశాసనకర్త్రి' అని తల్లియందు తమకు గల గురుభావమును అప్యాయంగా చెప్పిరి. అంత చిన్న యీడున సన్యసించటం చాల అరుదుకదా! ఆ ఎనిమిదేళ్ళ బాలకుడు కాషాయబట్టలుకట్టుకొని బోడితలతో చెప్పులు లేని కాళ్ళతో భిక్షాపాత్రతో కమండలంతో

మాతా నాస్తి పితా నాస్తి నాస్తి బంధుమిత్ర సహోదరాః
అర్థం నాస్తి గృహం నాస్తి తస్మాత్ జాగ్రత జాగ్రత।

అనే హెచ్చరికతోనా అన్నట్లు శంకరుడు వెనుదిరిగి చూడక ముందుకు సాగిపోతుండగా ఆ తల్లి ఏమనుకొన్నదో తోటివారు ఏమనుకున్నారోగాని దృశ్యప్రపంచపు మోహ మాయలకు నవ్వుకుంటూ వాటిని ఛేదించి దూసుకొని పోగల చిదగ్నిదీప్తదృక్కుతో ఆశువుగా శ్లోకాలు చెప్పుకుంటూ సాగిపోయారని ఊహించవచ్చును.

కదావా విరక్తిః కదావా సుభక్తి
కదావా మహాయోగిసంసేవ్యముక్తిః।
హృదాకాశమధ్యే సదా సంవసన్తం
సదానందరూపం శివం సాంబమీడే॥

హఠల్లంబికా రాజయోగ ప్రభావా
ల్లుఠత్కుండలీవ్యక్తముక్తావకాశాం।
సహస్రారపద్మస్థితాం పారవారాం
సుధామాధురీం సాధురీత్యా పిబన్తిః॥

మహాదేవమన్తర్భజేహం భజేహం
సదా పార్వతీశం భజేహం భజేహం।
సదానందరూపం భజేహం భజేహం
చిదానందరూపం భజేహం భజేహం॥

తల్లివద్ద సెలవు తీసికొని ఆ బాలసన్యాసి కాలటి వీడి గురువును వెతుక్కొనుచు ఊళ్ళు నదులు కొండలు గుట్టలు అడవులలో నడుచుకుంటూ కొంత కాలానికి నర్మదానది ఒడ్డుకు చేరెను. నర్మదాష్టకం అక్కడ చెప్పినదే అయిఉండును. గౌడపాదుల శిష్యులు గోవింద పాదులు ఒక గుహలో సమాధిలో ఉండిరి. గుహఎదుట శంకరుడు వారి దర్శనార్థమై నిల

బడెను. తరువాత గోవిందపాదులు "నాయనా నీవెవరవు?" అని ప్రశ్నింపగా కనబడేవి విన బడేవి తలపుకు వచ్చేవి నామరూపాలు ఇవేవి తాను కానని అన్నీపోగా మిగిలే "శివః కేవలోహం' అని పదిశ్లోకాలతో తన అద్వైతానుభూతిని చెప్పెను. ఆ దశశ్లోకిలో కొన్ని:

న భూమిర్నతోయం న తేజో న వాయు
ర్నఖం నేన్ద్రియం వా న తేషాం సమూహః।
అనైకాంతికత్వాత్ సుషుప్త్యేక సిద్ధ
సదేకోవశిషః శివః కేవలోహం॥

న వర్ణా న వర్ణా శ్రమాచారధర్మా
న మేధారణాధ్యానయోగాదయోపి।
అనాత్మాశ్రయాహంమమాధ్యాసహానాత్
తదేకోవశిషః శివః కేవలోహం॥

న మాతా పితా వా నదేవా న లోకా
న వేదా నయజ్ఞా న తీర్థం బ్రువంతి
సుషుప్తౌ నిరస్తాతిశూన్యాత్మకత్వాత్
తదేకోవశిష్టః శివః కేవలోహం॥

న శాస్తా న శాస్త్రం న శిష్యో న శిక్షా
న చ త్వం న చాహం న చాయం ప్రపంచః
స్వరూపావబోధో వికల్పాసహిష్ణు
స్తదేకోవశిష్టః శివః కేవలోహం॥

అపివ్యాపకత్వాద్ధి తత్త్వప్రయోగాత్
స్వతఃసిద్ధభావాదనన్యాశ్రయత్వాత్।
జగత్ తుచ్ఛమేతత్ సమస్తం తదన్యత్
తదేకోవశిష్టః శివః కేవలోహం॥

న చైకం తదన్యద్ద్వితీయం కుతఃస్యా
న్న వా కేవలత్వం న చాకేవలత్వం।
న శూన్యం న చాశూన్యమద్వైతకత్వాత్
కథం సర్వవేదాన్తసిద్ధం బ్రవీమి॥

ఈ జవాబు విని గోవిందపాదులు శిష్యత్వమును గ్రహించినందుకు సూచనగా పాదములను గురూ వెలుపల మోపిరి. శంకరులు అభివందనముచేసి గురూపదేశముపొంది పరమహంస సన్న్యాస దీక్షనొందిరి. కొంత కాలమునకు గురువుల ఆదేశానుసారము కాశీ క్షేత్రమున బ్రహ్మసూత్రములు, ఉపనిషత్తులు, భగవద్గీత అను ప్రస్థానత్రయమునకు భాష్యము వ్రాయబూని నర్మదా తీరమునుండి కదలి కాశీకి కాలిబాటన వెళ్ళిరి. అచట ఆ బాలసన్న్యాసిని ఆశ్రయించిన శిష్యులలో మొదట సన్న్యాస దీక్షనందినది సనందనుడు. అతడే తరువాత పద్మపాదుడు. ఇతని యందు గురువులకు గల అభిమానమునకు మిగిలిన శిష్యులు బాధపడు చున్నట్లు స్నానము చేయుచున్న శంకరులు గ్రహించి గంగకవతల తమకోసము పొడిబట్టలతో వేచియున్న సనందనుణ్ణి రమ్మని పిలువగా పద్మపాదుడు పిలుపు వింటూనే అడుగడుగుకు పద్మములు వికసించి నీళ్ళపై నడుస్తూ వచ్చెను. అందుకని అతడు పద్మపాదుడు.

మరొక శిష్యుడు శంకరుల వద్దకు వచ్చినపుడు మూగి. శంకరుల ఆశీర్వచనమున పిల్లవానికి మాటలురావచ్చునని తండ్రి వెంటబెట్టుకొని వచ్చి సంగతి చెప్పుకొనెను. "నువ్వు ఎవరవు నాయనా" అని శంకరులు ఆ కుర్రవానిని పలుకరించిరి. అతడు వెంటనే స్ఫురిహా వచ్చినట్లై.

"నిత్యోపలబ్ధి స్వరూపోఽహమాత్మా" అనే మకుటంతో 11 శ్లోకములు చెప్పి 12వ శ్లోకమును ఇలా ముగించెను:

ఉపాధౌయథా భేదతా సన్మణీనాం
తథా భేదతా బుద్ధి భేదేషు తేపి।
యథాచంద్రికాణాం జలే చంచలత్వం
తథా చంచలత్వం తవాపీహ విష్ణో॥

ఇంత స్ఫుటంగా ఆ పిల్లడు అహమాత్మా అన్నది విని అరచేత ఉసిరకాయలాగా జ్ఞానసిద్ధి అగుట గ్రహించి ఎంతో సంతోషించి దగ్గిరికి తీసికొని సన్న్యాసదీక్ష యిచ్చి శంకరులు హస్తామలకుడు అని పేరుపెట్టిరి. ఈ 12శ్లోకములకు శంకరులు స్వయముగా భాష్యము వ్రాసి తమ రచనలతో వాటిని అమరము చేసినందున వాటి ప్రాశస్త్యం గ్రహించవచ్చును.

ఆ తరువాత కాలనాథుడు అనే మరొక చిన్నవాడు శంకరుల వద్దకు వచ్చెను. ఎంతో ఉత్సాహంతో శ్రద్ధతో భగవత్పాదుల శరణు జొచ్చి సన్యసించవలెననే సంకల్పంతో

భవ శంకర దేశిక మే శరణం

అనే మకుటంతో-రచింపసుకరినమైన-తోటక వృత్తంలో శంకర దేశికాష్టకం అని పేరు పొందిన శ్లోకాలలో గురుస్తుతి చేసెను:

> విదితాఖిలశాస్త్ర సుధాజలధే
> మహితోపనిషత్కథితార్థనిధే।
> హృదయే కలయే విమలం చరణం
> భవ శంకర దేశిక మే శరణం॥
>
> కరుణావరుణాలయ పాలయమాం
> భవసాగరదుఃఖవిదూనహృదం।
> రచయాఖిల దర్శన తత్త్వవిదం
> భవ శంకర దేశిక మే శరణం॥
>
> గురుపుంగవ పుంగవ కేతన తే
> సమతామయతాం నహికోపి సుధీః।
> శరణాగత వత్సల తత్త్వనిధే
> భవ శంకర దేశిక మే శరణం॥
>
> విదితా న మయా విశదైక కళా
> న చ కించన కాంచనమస్తిగురో।
> ద్రుతమేవ విధేహి కృపాం సహజాం
> భవశంకర దేశికమే శరణం॥

కాశీలో ఉండగా ఒకరోజు లతో గంగా స్నానానికి వెడుతుండగా భయంకరంగా ఉన్న కుక్కలు నాలుగింటిని వెంట పెట్టుకొని ఒకడు తమవైపే రావటం చూచి శంకరులు ఎడంగా పొమ్మని రెట్టించి చెప్పెను. అది విని ఆ ఆగంతుకుడు శ్లోకరూపమున ప్రశ్నలు వేసెను. ''ఎడంగా పోవలసినది లేక తొలిగిపోవలసినది ఎవరు? ఏది? ఎవరి నుంచి? దేనినుంచి? అన్ని శరీరాలు అన్నమయాలు కదా. చైతన్యం అయితే చైతన్యం అంతా ఒక్కటేకదా! నీకు యీ భేదభ్రాంతి ఎలా కలిగింది?'' అని అడిగెను. ఈ ప్రశ్నలడిగినది, ప్రశ్నరూపమున తనకు బోధించినది సామాన్యుడు కాదని, తన్ను యీ రూపాన పరీక్షించి ఉపదేశించి, శేషించి ఉన్న భేదలేశమును పోగొట్టవచ్చినది భగవంతుడేనని అవగతమై

ఛండాలోస్తు సతుద్విజోస్తు గురు రిత్యేషా మనీషా మమ'

అనే మకుటంతో మనీషాపంచకం అనే అయిదు శ్లోకాలలో అభేదత్వమును, సర్వాత్మత్వమును, ఏకాత్మత్వమును నిర్ధారణగా చెప్పిరి.

ఆపైన శంకరులు తాము కాశీకి వచ్చిన పనికి పూనుకొని ముందు విష్ణు సహస్రనామమునకు తరువాత ప్రస్థానత్రయమునకు భాష్యములు వ్రాసిరి. పుట్టినప్పటి ఆయుష్యము ఎనిమిదేళ్లే అయినను ఆపత్సన్యాసమప్పుడు గండము గడిచి మరి ఎనిమిదేళ్లు ఆయుష్యము కలిగినట్లు బ్రహ్మసూత్ర భాష్యము వ్రాసినప్పటికి 16 ఏళ్ళు నిండవచ్చినా భాష్యరచనాసత్కార్యము వలన మరి 16 సంవత్సరముల ఆయుష్యము లభించి శంకరులు దేశం నాలుగు చెరగులూ తిరిగి తమ బ్రహ్మానుభూతిని జిజ్ఞాసువులకు బోధించి, ప్రజలను అంతర్ముఖులను చేసి, 'బ్రహ్మ సత్యం జగన్మిథ్యా జీవో బ్రహ్మైవ నాపరః' మీరు అనుకుంటున్నట్లు పంచేంద్రియ బద్ధులు కారు. మీరు బ్రహ్మస్వరూపులు అని చెప్పి హృదయాలలో ఆత్మ తత్త్వమును స్ఫురింపజేశారు.

అనేకులు పాడుకునే భజగోవింద శ్లోకాలు కూడా కాశీవాసపువే. రోజూ తెల్లవారు ఝామున శిష్యులతో గంగా స్నానానికి వెడుతుండగా ముసలిపండితుడు ఒకాయన శిష్యులకు ఎంతసేపూ 'డుకృఞ్ కరణే' అని వ్యాకరణం చెప్పుతూ ఉండేవాడు. అది చెవినిపడి శంకరులు:

"దినమపి రజనీ సాయంప్రాతః శిశిరవసంతౌ
పునరాయాతః
కాలఃక్రీడతి గచ్ఛత్యా యుస్తదపిన ముంచత్యాశావాయుః।
భజగోవిందం భజగోవిందం భజగోవిందం మూఢమతే
ప్రాప్తే సన్నిహితే మరణౌ, నహి నహి
రక్షతి డుకృజ్ కరణే॥

అని ఇదే రీతిగా మరి 12శ్లోకములతో బోధించారు. అంతట అక్కడున్న 14గురు శిష్యులు తలొక శ్లోకము చేర్చి చెప్పారు. శంకరుల రచనలన్నిటిలాగానే ఈ శ్లోకములు కూడ సమగ్రమైనవి. సాధనవిధి చేర్చి సాకల్యముగా వివరించిన అద్వైత తత్త్వోపదేశం హృదయానికి హత్తుకునేట్లు యీ శ్లోకాలలో యిమిడి ఉంది.

ఇలా కాశీనుండి బయలుదేరి సంచరించుచు అద్వైత వేదాంతమును అనుష్ఠిస్తూ ప్రతిస్పందింపజేస్తూ మండనమిశ్రుడు అను కర్మిష్ఠితో వేదాంత చర్చకుదిగి శంకరులాయనను నిరుత్తరుని చేయగా మండనమిశ్రుడు అద్వైతి భావభావితుడై శంకరుల శిష్యుడై సురేశ్వరుడను పేర సన్యాసదీక్షనందెను. శంకరుల ఉపనిషద్భాష్యములు మున్నగు కొన్నింటికి సురేశ్వరులు వ్యాఖ్యానములు రచించి ప్రసిద్ధులైరి.

దిగ్విజయ సంచారక్రమములో శంకరులకు తల్లి ఆర్యాంబకు అంత్యగడియలు దగ్గరకు రానున్నవని స్ఫురించి కాలటివెళ్ళి తల్లికి నమస్కరించిరి. ఆమె పది పన్నెండేళ్ళ తరువాత తన "ఉన్ని"ని చూచి ఎంతో సంతోషించి ఆనాటి ఉదయభాస్కరుడనిపించిన ఉన్ని స్వామియే యీ యోగాగ్నిమయ భగవత్పాదులని గ్రహించి హర్షించి కుమారుని గురువుగా చేసికొని ఆత్మోపదేశమునందెను. శంకరులు అపుడు తల్లి చిత్తమును సమాహితము చేసి శివభుజంగము అనే రెండు స్తోత్రములతో ప్రీతి కల్గించిరి.

తల్లి గతించిన మీదట శంకరులు తల్లిని తలుచుకొని "అమ్మా! నన్ను కనుటకు కని పెంచుటకు, నువ్వు ఎంతటి ఓర్పుతో ఎంత ప్రయాసపడితివో, నిన్నంత అలయించిన నేను నీకేమి చేయగలనమ్మా! చేతులు జోడించి నమస్కరించటం తప్ప" అని శ్లోకరూపంలో చెప్పిరట. ఆ శ్లోకం కేరళ గృహాలలో చదువుకుంటూ ఉంటారట ఇప్పటికీ:

ఆస్తాంతావదియం ప్రసూతి సమయే దుర్వారశూలవ్యథా
నైరుచ్యం తనుశోషణం మలమయీశయ్యా
చ సాంవత్సరీ
ఏకస్యాపి న గర్భభారభరణ క్లేశస్య యస్యాఃక్షమో
దాతుం నిష్కృతిమున్నతోపి తనయఃతస్యై
జనన్యై నమః

తల్లి అపరక్రియలు జరిపి శంకరులు బంధువుల ఆగ్రహానికి గురియైనను లెక్క చేయక "కాపీనవంతః ఖలు భాగ్యవంతః" అనుకొనుచూ తిరిగి యాత్ర ప్రారంభించి దేశం అన్ని ప్రాంతాలు సంచరించి అప్పుడు అస్తవ్యస్తంగా ఉన్న ఆరు మతాలను సరిదిద్ది సన్యాస సంప్రదాయములను క్రమబద్ధం చేసి వెళ్ళిన చోటల్లా పుణ్యక్షేత్రాలను సందర్శించి 32వ యేట దేహం చాలించారు.

ఆంధ్ర దేశంలో శంకరులు సేవించినవి శ్రీశైలక్షేత్రం, తిరుపతి క్షేత్రం ముఖ్యమైనవి. వేంకటేశ్వరస్వామివారి ఆలయంలో ధనాకర్షణ యంత్రం ప్రతిష్ఠించినట్లు ప్రతీతి.

శంకరుల ప్రభావం ప్రపంచ వ్యాపారితో భేదించవచ్చు. వివదించవచ్చు. నిరాకరించవచ్చు. కాని మానవుని తత్త్వవివేచన ఎక్కడ ఏ పరిభాషలో జరిగినా శంకరుల భావనను విస్మరించి యీఢికి రాలేవు.

శంకరుల రచనలు నూటయాభైకి పైగా ఉండును. ప్రస్థానత్రయ భాష్యములే కాక వారు ఆశువుగ ఎన్నో స్తోత్రములు ఉపదేశ గ్రంథములు మరికొన్ని భాష్యములు రచించారు. వారి రచన ఏది పఠించినా మన హృదయం విప్పారుతున్నట్లు స్ఫురణతో స్పందిస్తున్నట్లు ఏదో అనుభవము ఆకాస్నైనా ప్రసరిస్తున్నట్లు అనుభవిస్తాం.

హిమాద్రికలమై అంబుధి సిరాయై అడవులలోని చెట్ల ఆకులన్నీ పెట్టుకొని కూర్చున్నా సరస్వతీదేవి ఎంతకాలం రాసినా ఇంకా కృత్యాదినే ఉండునన్న ఉత్ప్రేక్షతో శంకరులను గురించి ఎంత చెప్పుకున్నా తనివి తీరదు అని తనివి చెందుదాం.

అద్దంలో నీడలు, మేడలు, నగరులు. నిద్రలో కల. కలలో కల. నిద్ర అనిపించే మెలకుల. ఉన్నది లేదనుకోటం లేనిది ఉన్నదనుకోటం. విత్తునుంచి వచ్చిన మహావృక్షం వంటిది సృష్టి. కల్పితం. ఈ ఆభాసను పోగొట్టేది సద్వస్తుస్ఫురణం. బోర్లించిన కుండలోని ఎన్నో చిల్లులలోనుంచి అందున్న దీపం ఎన్నో దీపాలుగా వెలిగినట్లు బాహ్యజ్ఞానప్రకాశం నేను నాది శరీరమే నేను అనే విధంగా పుట్టందులకన్న గుడ్డిగా చిమ్మచీకటిలో తిరుగుచున్నాము. గ్రహణం పట్టిన సూర్యచంద్రుల వలె మాయాధీనుడు జీవుడు. ఆత్మస్ఫురణ కలిగి గాని మేల్కొనడు. అంతవరకు అనేక బాంధవ్యబంధనాలు. నేల నిప్పు మొదలైన అష్టమూర్తుల ద్వారా వాటికాధారమైన ఆత్మను ఎవళ్లు తెలుసుకుంటారో వారిదే సర్వాత్మత్వం. ఈ జ్ఞానోపదేశమును కేవలము మౌనముచేతనే [illegible]ల హృదయాలలో స్ఫురింపజేసే దక్షిణామూర్తికి నమస్కారము.

ఆయన 16ఏళ్ళ చిన్నవాడు. మర్రిచెట్టు క్రింద చిన్ముద్రతో ఎదుట ఉన్న వృద్ధులైన శిష్యులను వీక్షించగా వారి సంశయములన్నీ తొలగి పోతున్నవి. దక్షిణామూర్తి కారుణ్యమూర్తి. మృత్యుంజయుడు జ్ఞానమూర్తి. జ్ఞానఘన విజ్ఞానఘన చైతన్యఘన ఆనందఘనమైన శాంత బ్రహ్మముద్రమోల సృష్టిరొద పొడిపొడియై రాలిపోవుచున్నది. దరిదాపులకు పోలేక ఉద్దీప్తమైన మనస్సు కూడా వెనుకకు తిరిగిపోవుచున్నది. మనస్సుతో పాటు మనస్సు వ్యక్తీకరించిన మాటలు దారి పక్కన రాలిపోతున్నవి. శాంత బ్రహ్మము అనుభవవేద్యము. తెలిసినవానికి తెలుసు. తెలుసునన్నవానికి తెలియదు. దక్షిణామూర్తి కరుణాభరితమైన మౌన వ్యాఖ్యం హృదయంలో స్ఫురించగల పరిపక్వత గలవారికి ఆ బ్రహ్మానుభవం కల్గించుటకు సర్వదా సంసిద్ధుడుగా ఉన్న గురుమూర్తికి ఇదే నమస్కారం.

దక్షిణామూర్తి స్తోత్రం వేదాంత పరంగా యోగపరంగా సాధనపరంగా గొప్పదవటమే గాక విశ్వసాహిత్యంలో కవిత్వంలో చాలా ప్రశస్తమైనది. ఏకశ్లోకినుంచి ఉపదేశ సాహస్రి వరకు ఎన్నో ఎన్నో విధాల రచించిన శంకరులు అన్నింటినీ అపూర్వరీతిని కూర్చారు. దేనికదే పరిపూర్ణం. తత్త్వం, యోగం, ఉపదేశం ప్రతి రచనలోను ఉండి పాఠకులు లేక జిజ్ఞాసువులు అంతర్యాన్ని బట్టి సంస్కారాన్ని బట్టి విద్యుదాఘాతం వలె అనుభవ చోదన కలిగించేవిగా ఉన్నవి. భాష సులువే, మనస్సును పదును బెట్టితే గాని హృదయాన్ని ప్రఫుల్లం చేస్తేగాని గ్రాహ్యం కానిది భావం. పాషాణవదనులమైన మనలను మందస్మిత నయనాలతో పరికించి కారుణ్యధారామృత వర్షముతో బీటలువారి మోడైన మన గుండె

లను కరిగించే శంకరులు లోక శంకరులకు నమస్కారం.

మన నిత్యకృత్యంలో మనకు శంకరుల ఉపదేశం ఏమి? పామరులము అజ్ఞానులము అయిన మనకు ఏమి ఉపాయము? మనస్సు ఎంతసేపూ భోగపరంగా ఊహాప్రపంచం సృష్టించుకొని మోహపడి వినోదిస్తూ ఉంటుంది, ఆ వినోదం గభీలున ఆగి విషాదంగా మారే వరకు మాయ ఏమో సుగ్రాహ్యం కాక పోవచ్చును; కొంచెం వెనక్కి తగ్గి చూచు కుంటే మోహం ఏమో తెలుసుకోటం కష్టం కాదు; తెలుసుకోవలెననే ఇచ్ఛ నిజంగా ఉంటే మోహం తెలుస్తూనే విడిపోతుంది. ఈ జగత్తు మిథ్య సందేహం లేదు. ఈ మోహం మొదలైనవి నిజమైనవే మనం అను భవిస్తున్నాం కనుక. అయితే అవి నిజంగా లేనివి, ఆత్మస్పర్శ కలగ్గానే అంతరించేవి. నిత్య జీవితంలో మాయావాదం త్రికరణ శుద్ధితో కూడిన సాధనకు త్రిశూలం వంటిది.

శంకరుల చరమస్తోత్రమేదో లేక అప్పటి అనుభవం ఏదో మనకి తెలియదు. కాని వారి నిర్వాణషట్కం పఠించుకొని జ్ఞానోన్ముఖుల మగుదముగాక!

మనోబుద్ధ్యహంకారచిత్తాని నాహం
న శ్రోత్రం న జిహ్వే న చ ఘ్రాణనేత్రే।
న చ వ్యోమ భూమిర్న తేజో న వాయు
శ్చిదానందరూపః శివోహం శివోహం॥

అహం ప్రాణసంజ్ఞో న వై పంచవాయు
ర్నవా సప్తధాతుర్నవా పంచకోశః।
న వాక్పాణిపాదౌ న చోపస్థపాయూ
చిదానందరూపః శివోహం శివోహం॥

న పుణ్యం న పాపం న సౌఖ్యం న దుఃఖం
న మంత్రో న తీర్థం న వేదా న యజ్ఞాః
అహం భోజనం నైవ భోజ్యం న భోక్తా
చిదానందరూపః శివోహం శివోహం॥

న మే ద్వేషరాగౌ న మే లోభమోహౌ
మదో నైవ మే నైవ మాత్సర్యభావః
న ధర్మో న చార్థో న కామో న మోక్ష
శ్చిదానందరూపః శివోహం శివోహం॥

న మృత్యుర్న శంకా న మే జాతిభేదః
పితా నైవ మే నైవ మాతా న జన్మ
న బంధుర్న మిత్రం గురుర్నైవ శిష్య
శ్చిదానందరూపః శివోహం శివోహం॥

అహం నిర్వికల్పో నిరాకారరూపో
విభుత్వాచ్చ సర్వత్ర సర్వేంద్రియాణాం
న చాసంగతం నైవ ముక్తిర్న బంధః
శ్చిదానందరూపః శివోహం శివోహం

(ఆకాశవాణి, మద్రాసు-వి కేంద్రం సౌజన్యంతో

---

అల్పబుద్ధియగు నొక యువకుడు శ్రీరామకృష్ణుని సమక్షమున ఎప్పుడును భారతీయశాస్త్రములను నిందించువాడు. ఒకనా డతడు గీతను విశేషముగా ప్రశంసించెను. అంతట శ్రీరామకృష్ణుడిట్లు వచించెను:–''చూచితిరా? ఎవరో ఐరోపా పండితుడు గీతను పొగిడినట్లున్నది–కావున ఈతడును పొగడుచున్నాడు.''

నేను వెంటనే లేచి నిలిచి నమస్కరించి ఆమెతో "అదేమిటమ్మా! జోగిన్‌మా! నీ పాద ధూళితోకూడా సమానం కానివారికి నీ వెందు కలాగ నమస్కరిస్తావు? శాస్త్ర కాలు తగిలి నంతలోనే మించిపోయిందేమిటి?" అని అన్నాను. దానిమీద జోగిన్‌మా "అదేమిటమ్మా! అలాగంటావు? పెద్ద సర్పంలాగే చిన్న సర్పం కూడా సర్పమే. మీరందరు భక్తులమ్మా!" అంటూ బదులు పలికింది.

ఆ సమయంలో నేను అమ్మ ముఖంకేసి చూశాను. కృపార్ద్రమయిన చిరునవ్వు ఆ తరుణంలో ఆమె పెదవిమీద సాక్షాత్కరించింది! అప్పటికే బాగా ఆలస్యమవుతున్నదనుకుని నేను మరిద్దరికి నమస్కరించి, సెలవు తీసుకుని ఇంటికి తిరిగి వచ్చేశాను.

30, జులై, 1918.

స్వామి ప్రేమానంద ఈవేళ పరమపదించారు. సాయంత్రం నేను మాతృదేవిని చూడడానికి వెళ్ళాను. అమ్మ నాకేసి చూచి దుఃఖంతో ఇలాగన్నది. "వచ్చావా? అమ్మా! రా! కూర్చో! నా బాబూరామ్ ఈవేళ మమ్మల్ని విడిచిపెట్టి వెళ్ళిపోయాడు! పొద్దుటి నించి నేనిలాగ దుఃఖిస్తూనే ఉన్నాను." అంటూ ఆమె తిరిగి దుఃఖించింది.

"నా బాబూరామ్ మీదనే నా ప్రాణాలన్ని పెట్టుకున్నాను. మతానికి సంబంధించిన భక్తి విశ్వాసాలు, సామర్థ్యము, హేతువాద శక్తి నా బాబూరామ్‌లో మూర్తీభవించి, గంగానది తీరం అంతా జాజ్వల్యమానంగా వెలిగింపజేశాయి. బాబూరామ్ తల్లిపైపున మగ సంతతి ఎవ్వరులేదు. అందుచేత తండ్రి ఆస్తిఅంతా ఆ ఇల్లాలికి సంక్రమించింది. అందువల్ల ఆమెలో రవంత గర్వం కూడా పెరిగింది. ఆ ఇల్లాలు ఒకప్పుడు "చేతులమీద నడుం మీద నేను బంగారు నగలెన్నో ధరించేదాన్ని. ప్రపంచంలో అందరికన్న గొప్పదానినని భావించే దానిని" అని నాతో అన్నది. ఆమె కొడుకులలో ఒకడు ముందుగానే పోయాడు. చనిపోయే సమయానికి ఆ తల్లికి నలుగురు పిల్లలున్నారు!" అ పైన మరికొంత సేపటికి శారదాదేవి ఒక పెద్ద ఠాకూరు చిత్రపటం పాదాల దగ్గిర శిరస్సునుంచి విశ్రమించింది. ఆ పటం మధ్యహాలులో దక్షిణపు గోడమీద వేలాడుతున్నది. అమ్మ అంతలోనే ఎంతో జాలిగా "ప్రభూ! మీరే నా బాబూరామ్‌ని తీసుకుని వెళ్ళిపోయారు." అని వాపోయింది. ఆ సమయంలో ఆమె గొంతు హృదయ విదారంగా వినిపించింది. అమ్మ ఆక్రోశం వింటూంటే నాకు కళ్ళమ్మట నీళ్లు తిరిగాయి.

31, జూలై 1918.

అమ్మ ప్రేమానందస్వామిని గురించి ప్రసంగిస్తున్నది:

అంతలోనే చంద్రబాబు పైకివచ్చి మా ప్రసంగంలో పాల్గొన్నారు. మిత్రులు, ఠాకూరు భక్తులు ప్రేమానందస్వామి అంత్యక్రియలకు బాగా విరివిగా సొమ్మిచ్చి సాయపడినట్టు చెప్పారు. దానిమీద శారదామాత అందుకుని "వారందరు తమ సొమ్ము చాలా సముచితంగా ఖర్చు చేశారు. భగవానుడు వారికి సంపద ఇచ్చాడు. అది మరింతగా పెంపొంద్ది

స్తాడు.'' అన్నది. చంద్రబాబు నమస్కరించి సెలవు తీసుకుని వెళ్ళిన తరవాత అమ్మ తిరిగి ఇలాగ ప్రసంగించింది.

''చూడు నాయనా! ఎవరయినా ఒకవ్యక్తి ఎంతటి మహనీయుడయినా, మానవశరీరం స్వీకరించిన పిమ్మట దానికి సంబంధించిన దుఃఖాలన్నీ అనుభవించి తీరవలిసినదే! అయితే విభేదం ఏమిటంటే సామాన్య మానవులు దుఃఖిస్తూ మరణిస్తారు. మహనీయులు నవ్వుతూ తమ దేహాలు పరిత్యజిస్తారు. వారికి మృత్యువంటే ఒక ఆట అన్నట్టే స్ఫురిస్తుంది. వారికి వీరికి అదే తేడా!

''ఇక్కడికి వచ్చినప్పుడు బాబూరామ్ చాలా చిన్నవాడు. ఠాకూరు శిష్యునితో కలిసి ఛలోక్తులు విసురుతూంటే నరేంద్ర, బాబూరాము విరగబడి నవ్వుతూండేవారు.

నేనొకనాడు కాశీపూర్‌లో పెద్ద పాలపాత్రతో మేడమీదికి వెళుతున్నాను. అంతలోనే నేను కళ్లుతిరిగి పడిపోయాను. పాలన్నీ కింద ఒలికిపోయాయి. నా కాలిలో ఒక ఎముక బెణికింది. నరేంద్రుడు, బాబూరాము వచ్చి నన్ను లేవనెత్తారు. ఆపైన నా కాలు బాగా వాచింది. అదంతా విన్న తరవాత ఠాకూరు ''అయితే బాబూరామూ, మరి నాగతి ఏమిటి? నా ఆహారం సంగతి ఎవరు గమనిస్తారు? నాకెవరు అన్నం నోటికందిస్తారు?'' అన్నారు. ఆ రోజుల్లో ఆయన ద్రవపదార్థాలే స్వీకరించేవారు. నేనవి తయారుచేసి పైకి తీసుకువెళ్ళి స్వయంగా నోటికందించేదాన్ని. ఆ రోజుల్లో నేను ముక్కెర ధరించేదాన్ని.

అందుచేత ఆయన ముక్కుమీద ముక్కెర రూపంలో సంజ్ఞ చేసి ''అయితే బాబూరామూ, నీవు ఆమె నొక గంపలో కూర్చోబెట్టి నీ శిరస్సు మీద పెట్టుకుని పైకి తీసుకురాలేవా?'' అన్నారు. ఆ మాటమీద బాబూరామ్ నరేంద్రులిద్దరు కడుపులు చెక్కలయ్యేటట్టు నవ్వడం ప్రారంభించారు. ఆయన ఛలోక్తులతో శిష్యులనలాగ నవ్విస్తూండేవారు.

''ఆపైన మూడురోజుల్లో నా కాలివాపు తగ్గిపోయింది. అయినా శిష్యుల ఆసరాతో మేడమీదకి వెళ్ళి ఠాకూరుకు భోజనం పెడుతూండేదాన్ని. ఆ మూడురోజులలోను గోలాప్ మా కాని ఇంకెవరో ఒకరు కాని ద్రవభోజన పదార్థాలు తయారుచేస్తూండేవారు. నరేంద్రుడాయనకవి అందించి భుజింపజేస్తూండేవాడు.

బాబూరామ్ తన జననితో ''నీకు నామీద ఏమాత్రం ప్రేముడి ఉన్నది? ఠాకూరు నన్ను ప్రేమతో చూసినంతగా నీవు నన్నెన్నడు ఆప్యాయంగా ప్రేమించలేవు!'' అని అంటూండేవాడు. దానిమీద అతని తల్లి ''ఏమిటేమిటి? నేను నీ తల్లినిగదా? నిన్నంతగా ప్రేమించలేనూ?'' అని అంటూండేది. ఠాకూరు తమ శిష్యులనంత గొప్పగా అభిమానించేవారు.

నాలుగేళ్ళు నిండిన వయస్సులో బాబూరామ్ ''నేనెన్నడు వివాహమాడను! పెళ్ళి చేసుకుంటే నేను చనిపోతాను!'' అని అంటూండేవాడు. ఠాకూరు ఒకప్పుడు అతనితో ''ఇటుపిమ్మట నా ఆధ్యాత్మిక శరీరంతో నేను లక్ష ముఖాలతో భుజిస్తాను'' అన్నారు. దానిమీద బాబూరాము ''మీ లక్షముఖాల మాట నేను పట్టించుకోను! ఇదే నోటితో మీరు భుజించాలి. ఇదే ముఖంకేసి నేను చూడాలి'' అని అన్నాడు.

చాలా మంది పిల్లలుండడం ఠాకూరుకు రుచించేది కాదు. అది ఆత్మనిగ్రహంలేనితనానికి తార్కాణ' అని ఆయన అభిప్రాయపడేవారు.

ఈవేళ గోలాప్‌మా పరిస్థితి కొంత మెరు

గయింది. పూర్తిగా ఆరోగ్యం కలగడానికి ఇంకా మూడు నెలలు పట్టవచ్చునని ఆమెకు వైద్యం చేస్తున్న డాక్టర్ బిపినబాబు ఈవేళ అన్నారు. దానిమీద అమ్మ అన్నది.

"గ్రహణి అంత త్వరగా తగ్గేరుగత్మకాదు. నేను కూడా ఆరోగ్యం పూర్తిగా తగ్గడానికి మూడుమాసాలు పట్టవచ్చునని అనుకుంటున్నాను. ఠాకూరుకు కూడా గ్రహణి రుగ్మత ధోరణి ఉండేది. దక్షిణేశ్వరంలో వర్షాకాలంలో ఆయన తరుచుగా గ్రహణితో బాధపడుతూండేవారు.

"ఒకసారి ఆయన మీద ఆ రోగం చాలా భయంకరంగా విరుచుకుపడింది. వారణాసి నించి వచ్చానని అంటున్న ఒక బాలిక ఆయనకు వేడికాపడాలతో పరిచర్యలు చేస్తూండేది. జబ్బు నయంకావడానికి సాయపడుతూండేది! నేనప్పుడు ఒక కుటీరంలో ఉండేదాన్ని. ఆమె పరిచర్య చేసేసమయంలో ఆ కుటీరం విడిచి సంగీతగోపురం కింద ఉన్న గదిలో ఉండవలసిన ఆవశ్యత కలిగింది. అది ఆ అమ్మాయి చేసిన ఏర్పాటే. ఆ సందర్భంలో ఆ బాలిక నాతో "ఠాకూరు అంత జబ్బుగా ఉంటే నీ వెలాగ ఇక్కడ ఉండగలవమ్మా!" అని అన్నది. దానిమీద నేను "నేనేమి చెయ్యగలను? హృదయ్ ఠాకూరు పరిచర్యకోసం ఆయనతో ఉంటారు కనక అతనిభార్య ఇక్కడ ఒంటరిగా ఉంటున్నది. ఆమెను విడిచిపెట్టి నేనెలా అక్కడికెళ్ళను?" అన్నాను. దానిమీద ఆమె "మరేం భయంలేదమ్మా! ఆమెతో ఉండడానికి ఇంకెవరినైనా ఏర్పాటుచెయ్యవచ్చును. ఆయన కంత జబ్బుగాఉన్నప్పుడు నీవు ఆకుటీరంలో నుండవలసిన అవసరమేమిఉన్నది?" అన్నది. అందుచేత ఆమెతో బాటు ఉండడానికి నే నాగదికి తిరిగి వచ్చివేశాను. మరికొన్నాళ్ల తరవాత ఠాకూరు ఆరోగ్యం తిన్నబడగానే ఆబాలిక వెళ్ళిపోయింది. ఆమె ఎక్కడికి వెళ్ళిందో నాకేమి తెలియ లేదు. ఆపైన ఎన్నడు ఆమె నా కంట పడలేదు. ఆబాలిక నాకు చాలా సాయపడింది. నేను వారణాసి వెళ్ళినతరవాత ఆమె సంగతి వాకబుచేశాను. కాని ఆమె సంగతి నాకు తెలియలేదు. ఠాకూరుకు ఏదయినా అవకాశం కలిగినప్పుడు కొందరు వ్యక్తులు అలాగే వస్తూండేవారు. ఆతరవాత అదృశ్యులయ్యేవారు."

1, ఆగస్టు, 1918.

నే నీవేళ మాతృదేవిని సందర్శించి నమస్కరించాలని ఆమె నివాసానికి వెళ్ళాను. ఆ తరవాత చాలా సేపటివరకు మేమిద్దరము బేలూరు మఠంలో సన్యాసి శిష్యులను గురించి ముచ్చటించుకున్నాము. ప్రేమానందస్వామి మృతివల్ల బహుశః అమ్మ మనస్సు తన సన్యాసి పుత్రులను గురించి ఆందోళన పడుతూ ఉండవచ్చును. ఇప్పుడామె వారిని గురించి ప్రస్తావించి ఇలాగన్నది.

"ఈ సన్యాసి బాలకులందరు ఒకసారి ఠాకూరును పరీక్షించాలని నిశ్చయించుకున్నారు. వారప్పుడు బారానగర్ మఠంలో ఉన్నారు. తగినంత ఆహారం తీసుకోకుండానే నిరంజన్ మొదలయినవారందరు ఒక్కొక్కప్పుడు తమకాలం అంతా భగవానుని ధ్యాన ప్రార్థనలతోడనే గడిపివేసేవారు. వారొకనాడు తమలో తాము "మనం సమస్తము ఠాకూరుకోసం పరిత్యజించి ఇచ్చటికి వచ్చివేశాము. ఆయన నామం జపిస్తూ కూర్చుంటే మనకాహారం లభించగలదేమో పరీక్షిద్దాము. మనకిప్పుడు ఆహారం లభించాలి. సురేష్ బాబు ఇక్కడికి వచ్చినప్పుడు మనమాయనతో ఏమీ చెప్పవద్దు. భిక్షకోసంకూడా ఎవ్వరు బయలుదేరకూడదు" అనినిశ్చయించుకున్నారు.

అలాగ అనుకున్న పిమ్మట వారందరు దుప్పటీలు కప్పుకొని ధ్యానాలారంభించారు. ఆ వేళ పగలంతా అలాగే గడిచిపోయింది. రాత్రి కూడా కొంత భాగం గడిచిపోయింది. ఆ సమయంలో ఎవరో మరం తలుపు తట్టారు. నరేంద్రుడు ముందుగా లేచి "ఆ వచ్చిన దెవరో చూడండి. ముందుగా ఆ వచ్చిన వారెవరయినా ఏదయినా తీసుకువచ్చారో లేదో చూడండి" అన్నాడు. ఎంతటి అద్భుతము! వారు తలుపు తెరిచి చూసేసరికి ఒక వ్యక్తి గంపనిండా మధురభక్ష్యాలతో ఎదురుగా నిలుచున్నాడు. అతడు గంగానది పక్కనే ఉన్న గోపాలదేవాలయంనించి వచ్చాడు. వారి ఆనందానికిక అంతేలేదు! ఠాకూరు దయ ఎంతటిదో వారికప్పటికి బోధపడింది. వెంటనే వారది ఠాకూరుకు నివేదించి అదే రాత్రివేళ ఆ మధురభక్ష్యాలారగించారు.

ఇలాంటి సంఘటనలింకా చాలా జరిగాయి. ఇంకొకసారి సింధీలో జేఠీపాల్ గృహంనుండి లూచీభక్ష్యాలు వచ్చాయి. ఈ రోజుల్లో బాలసన్యాసులు అన్నివిధాలా సుఖంగానే ఉన్నారు. కాని నరేంద్రుడు, బాబూరాము మొదలయినవారు చాలా యిబ్బందులు పడ్డారు. నా రాఖాలు [బ్రహ్మానందస్వామి]కు అంట్లు తోమవలసిన అవసరం కలిగింది. నరేంద్రుడు ఒకప్పుడు గయా వారణాసీ క్షేత్రాల వైపు వెడుతున్నాడు. ఆ యాత్రాసమయంలో అన్నంలేకుండా రెండురోజులపాటు ఒక చెట్టు నీడన విశ్రమించాడు. ఆ తరవాత అతనికి ఎవరో పిలుస్తున్నట్టు అనిపించింది. కళ్ళు పైకెత్తిచూశాడు. ఒక వ్యక్తి లూచీభక్ష్యాలతో కారపు తీపి తినుబండారాలతోను మంచినీటి కలశంతోను ఎదురుగా నిలుచున్నాడు. "రామ్‌జీ నైవేద్యం తమకోసం తీసుకువచ్చాను. దయచేసి స్వీకరించండి" అన్నాడు. దాని మీద నరేంద్రుడు "నేనెవరినో నీకు తెలియదు. పొరపాటుపడి ఉంటావు. ఇవన్నీ ఇంకెవరికో ఇవ్వమని నీతో చెప్పి ఉంటారు" అన్నాడు. అయినా ఆ వ్యక్తి "కాదు, స్వామీజీ, ఇవన్నీ మీకోసమే నేను తీసుకువచ్చాను. నేను నిద్ర బోతున్నాను. ఆ సమయంలో ఎవరో ఒక వ్యక్తివచ్చి "త్వరగా లే! ఆ చెట్టుకింద కూర్చున్న స్వామిజీకి ఆహారం తీసుకువెళ్ళు!" అని ఆజ్ఞాపించాడు. నేను అది ఏదో కలఅయి ఉంటుందనుకుని పక్కకి ఒత్తిగిలి పడుకున్నాను. అంతలోనే ఆ వ్యక్తి మళ్ళీ నన్ను గట్టిగా కుదిపి లేపి "నేను చెబుతున్నా వినకుండా నిద్రపోతున్నావా? లేచి త్వరగా వెళ్లు!" అని గట్టిగా హుంకరించాడు. ఆ తరవాత నేనది కల అనుకోలేదు. అది ఆ రామ్‌జీ ఆజ్ఞే అని నిశ్చయించుకుని ఈ పదార్థాలన్నింటితోను తొందరగా ఇక్కడికి వచ్చేశాను" అన్నాడు. నరేంద్రుడది విని 'ఆ పదార్థాలన్నీ భగవానుడనుగ్రహించినవే!' అని నిశ్చయించుకుని స్వీకరించాడు.

వేరొకసారి సరిగా ఇటువంటి సంఘటనే తటస్థించినది. నరేంద్రుడు ఆ తరుణంలో ఎడతెరిపిలేకుండా మూడురోజులపాటు పర్వతాలలో పరిభ్రమిస్తున్నాడు. అందువల్ల బాగా బడలి మరుక్షణంలోనే స్పృహతప్పి పడిపోయేటట్టున్నాడు. సరిగా అదే సమయంలో ముస్లిమ్ ఫకీరొకడు అక్కడికి వచ్చి ఫలహారం చేతికందించాడు. దానితో తన ప్రాణం నిలబెట్టుకున్నాడు. నరేంద్రుడు, అమెరికానుంచి తిరిగి వచ్చిన పిమ్మట ఆల్మోరాలో ఒక సమావేశంలో ఆ ఫకీరు ఒకమూల నిలుచున్నట్టు గమనించాడు నరేంద్రుడు. వెంటనే అతని దగ్గిరికి స్వయంగా వెళ్ళి సభా మధ్యభాగంలో

కూర్చుండ జేశాడు. అది గమనించి అక్కడి సభ్యులందరు ఆశ్చర్యంతో నిశ్చేష్టితు లయ్యారు. అయితే నరేంద్రుడు ఆ ఫకీరు తన ప్రాణం కాపాడినట్లు చెప్పి, ఆ కథ అంతా సభ్యులకెరిగించాడు. అంతేకాదు! అతనికి కొంత సొమ్మివ్వబోయాడు. కాని ఆ ఫకీరు ... సహాయం చేశాను బాబూ. తాము నాకు సొమ్మివ్వడానికి? ఇవ్వనక్కర లేదని చెప్పాడు. కాని నరేంద్రుడు దాని కంగీకరించక అతనికి ఆసొమ్మిచ్చాడు.

మఠంలో మొట్టమొదటి దుర్గాపూజా మహోత్సవానికి నరేంద్రుడు నన్ను మఠానికి తీసుకు వచ్చిన విషయం నాకిప్పటికీ గుర్తుంది. అతడు ఇరవైఅయిదు రూపాయలు నాచేతిలో ఉంచి, ఆ సొమ్ము పూజారికివ్వవలసిందని అన్నాడు. ఆ పూజా సందర్భంలో అతడు పధ్నాలుగువందల రూపాయలు ఖర్చుపెట్టాడు. పూజాదివసంనాడు జనం క్రిక్కిరిసిపోయారు. యువసన్యాసులకది చాలా ఇబ్బంది అయింది. ఆ సందర్భంలో నరేంద్రుడు నాదగ్గరికివచ్చి "అమ్మా! నాకు జ్వరం వచ్చేటట్టు చూడు!" అన్నాడు. ఆ మాటలు అతనినోటినుండి వెలువడాయో లేదో, అంతలోనే నరేంద్రుడు జ్వరంతో గజగజ వణికిపోయాడు.

"అయ్యో! ఇదేమిటి? ఇకముందేమవుతుందో గదా!" అన్నాను నేను. దానిమీద నరేంద్రుడిలాగన్నాడు.

"కంగారు పడవద్దమ్మా! కావాలనే నేనీ జ్వరం తెచ్చిపెట్టుకున్నాను. మన సన్యాసియువ కులంతా కాయకష్టం కులా శ్రమపడుతూనే ఉన్నారు. అయినా ఎక్కడో అక్కడ, ఒక చిన్న పొరపాటు జరగక తప్పదు. దానితో నాకు చిరాకు తలకెక్కుతుంది. ఆపైక వారిని చివాట్లు వెయ్యడమో, లేక ఒక రెండు చెంపపెట్టులు పెట్టడమో కూడా జరిగితే జరగవచ్చును. దానికి వాళ్ళు బాధపడడము, నేనాపైన పశ్చాత్తాపడడము కూడా జరగవచ్చును. అందుచేతనే, నేను జ్వరంతో పక్క వెయ్యడమే మంచిదని అనుకున్నాను."

ఆపైన జరగవలసినవన్నీ యథాప్రకారంగా జరిగిపోయిన తరవాత నేను అతనితో "నరేంద్రా! నీవింక లేచి కూర్చోవచ్చును." అన్నాను. "అవునమ్మా! నేనిప్పుడు లేచి కూర్చుంటాను" అన్నాడు నరేంద్రుడు. ఆపైన పూర్ణారోగ్యంతో వెంటనే లేచి కూర్చున్నాడు.

"అదే సందర్భంలో నరేంద్రుడు తన జననిని పూజామహోత్సవం సందర్శించడానికి అక్కడికి తీసుకువచ్చాడు. అయితే ఆమె అక్కడ తోటవంకాయలు, మిరపకాయలు కొయ్యడం ప్రారంభించింది. ఒక తోటలో నుంచి ఇంకొక తోటలోకి వెళ్ళడం మొదలుపెట్టింది. నరేంద్రుడు అది అంతా సాధించినందుకు ఎంతో గర్వపడడం ప్రారంభించింది. అంతలోనే నరేంద్రుడు ఆమె దగ్గరికి వెళ్ళి "అమ్మా! ఏమిటి చేస్తున్నావు నీవు! ఈ వంకాయలు, మిరపకాయలు కొయ్యడం మానేసి, అమ్మ దగ్గిరికి వెళ్లి కూర్చో! నరేంద్రుడే ఇదంతా సాధించాడని అహంకరిస్తున్నావేమో నీవు! కాదమ్మా నరేంద్రుడి చేతిలో ఏమీలేదు. ఎవరి చేతిలో ఉన్నదో, ఆయనే ఇదంతా నిర్వహించాడు" అన్నాడు. ఠాకూరే మఠస్థాపనాది ఘన కార్యాలన్నీ నిర్వహించారని నరేంద్రుని అభిప్రాయం అయ్యో! నా బాబూరామ్ ఇప్పుడు లేడుకదా! ఈ ఏడాది పూజ ఎవరు చేస్తారు?"

—సశేషము.

# నాస్తికుడైతేనేమి?

మదరాసు శ్రీ రామకృష్ణమిషన్ పాఠశాలల సొవనీర్ (1979) నుండి గైకొనబడిన రచన

కాలేజిలో చదువుకొనేరోజుల్లో కమలాకరం అని మాకొక మిత్రుడుండేవాడు. అతణ్ణి చివరిసారిగాచూసి ఎనిమిదేళ్ళకుపైగాఅయింది. అయినా అతని రూపం ఇంకా స్మృతిపథంలో నిలిచేఉంది. నల్లగా పొడుగ్గా ఉండేవాడు. హాస్టల్‌లో మేమున్న రూమ్‌కు ప్రక్కనే అతనికి రూమ్ కుదిరింది. అతనిలో ఏమాకర్షణ ఉందోమరి హాస్టల్‌లో చేరిన పది పదిహేను రోజుల్లోపలే అక్కడున్న అందరికీ ప్రీతిపాత్రుడై పోయాడు. "కమలాకరం చాలా మంచివాడు" అని అందరూ మెచ్చుకొనేవారు. అతను మాకు ప్రక్కరూమ్‌వాడే గనుక మామధ్య అతి త్వరలోనే మంచి చనువు, స్నేహం ఏర్పడింది.

ఒకరోజు నేను మా రూమ్‌మేట్ చక్రధారి, అతణ్ణి వెంటబెట్టుకొని బీచ్‌కి షికారుకని బయలుదేరాము. దారిలో పార్థసారథిగుడి వచ్చింది. లోపలికి పోయి దేవుని దర్శనం చేసుకుందాం అన్న అభిప్రాయం మాకు కలిగింది. కాని కమలాకరం గుడిలోపలికి రావడానికిష్టపడలేదు. "మీరు లోపలికి వెళ్ళి వచ్చేంత దాక ఇక్కడే ఉంటాను. పోయిరండి" అన్నాడు.

"ఏమీ? ఎందుకురావూ? ఫాంట్‌తో ఉన్నావనా?" అంటూ మేము ప్రశ్నలవర్షం కురిపించాము. అతనేమీ జవాబివ్వలేదు. అదొకరకంగా మందహాసం చేస్తూ మౌనంగా ఉండిపోయాడు.

"సరే ఇక్కడే వుండు. ఐదు నిముషాల్లో వచ్చేస్తాం" అని చెప్పి మేము లోపలికి వెళ్ళి దర్శనం చేసుకొని తరువాత కొంత ప్రసాదం కూడా కొనుక్కొని బయటకు వచ్చాము. అంతలోనే మబ్బులు ఎక్కడనుంచి వచ్చాయోమరి ఆకాశాన్ని కమ్ముకుంటున్నాయి. వర్షం వచ్చే సూచనలు కనపడుతున్నాయి. బీచ్‌కి పోవడం మానుకొని హాస్టల్‌కు తిరుగుముఖం పట్టాము. రూమ్‌కు వచ్చాక మేము ఆ ప్రసాదం పొట్లం విప్పి అతనికి కొంత ఇవ్వబోతే, తల అడ్డంగా ఊపుతూ అతను "దాన్ని మీరు దైవప్రసాదంగా భావించి ఇస్తే నేను తీసుకోను. నాకు వాట్లలో నమ్మకం లేదు" అని అన్నాడు. ఇది విని మేము చాలా ఆశ్చర్యపోయాము. ఆశ్చర్యాన్నుండి తేఱుకొని చక్రధారి కొంత అదిలించే కంఠస్వరంతో, "ఏకమల్! నీవు నాస్తికుడవా? ఇన్నాళ్ళు మాకు తెలియదే! ఏమిటి సంగతి? దేవుడు లేడనా నీ ఉద్దేశం?" అంటూ చుర చుర చూచాడు. సమాధానంగా కమలాకరం తొణక్కుండా బెణక్కుండా "నన్ను గురించి నీవేమన్నా అనుకో. నాస్తికవాది యన్నా నా కభ్యంతరం లేదు. భౌతికవాదియన్నా నాకభ్యంతరం లేదు. దేవుడున్నాడా? లేడా? అన్న వ్యర్థ సమస్యతో నాకు పనిలేదు. చేయవలసిన మంచిపనులు చేతినిండుగా చాలా ఉన్నాయి. నీవడిగావు గనుక చెబుతున్నా విను. ఎందుకోమరి చిన్నప్పటినుంచి మతవిషయాల మీద-గుడులు, పూజలు, ప్రసాదాలు, మొక్కుబడులు, వేషాలు, ప్రార్థనలు, మంత్రాలు, తంత్రాలు-వీటిమీద ఒకరకమైన అయిష్టత ఏర్పడింది. వాటి జోలి నాకవసరం లేదు-అవసరం ఉండబోదు." అని అన్నాడు. దానికి చక్రధారి ఏదో బదులు చెప్పబోయేంతలో ఎవరో లోపలికి వచ్చారు. ఆ ప్రసంగం అంతటితో ఆగిపోయింది. కాని తరువాత మేమతణ్ణి వేళాకోళంగా అప్పుడప్పుడూ కమలాకరం అని పిలవడానికి బదులుగా 'నాస్తికాకరం' అని పిలిచే వాళ్లము. దానికతనేమీ కొప్పడేవాడు కాదు.

ఒక ఆదివారంనాడు నేను మా చక్రధారి 'మ్యాట్‌నీ షో'కివెళ్ళి తిరిగివస్తూ హాస్టల్‌లో అడుగు బెట్టేసమయంలోనే, కమలాకరమున్నూ ఎక్కడున్నంచో అప్పుడే రావడం జరిగింది. చక్రధారి అతణ్ని చూసి ఉత్సాహంతో "నీవేసినిమాకెళ్లావు కమల్? 'మేమిద్దరం 'Two Drops From Heaven' అన్న సినిమా చూసి వస్తున్నాము. చాలా బాగుంది. ఫస్ట్‌క్లాస్ సినిమా!" అని అన్నాడు. ఇది విని కమలాకరం మందహాసం చేస్తూ నెమ్మదిగా "చక్రీ! నాకు సినిమాకు వెళ్ళే తీరిక లేదు, కోరిక అంతకుముందే లేదు. బీచ్ ఒడ్డులో ఉండే బెస్తవాళ్ల కాలనీకి వెళ్ళి ఆ పిల్లలకు పాఠం చెప్పి వస్తున్నాను. మీరు కూడ నాతో రోజూ వస్తే బాగుంటుంది. అక్కడ మనం చేయాల్సిన మంచి పనులు చాలా ఉన్నాయి. రేపటినుండి వస్తారా? ఒక గంటసేపు చాలు. ఏమంటారు?" అంటూ నావైపుకూడ దృష్టి సారించాడు. "పరీక్షలొస్తున్నాయే" అంటూ మేము ఒక అసంబద్ధమైన సమాధానం గొణిగి అప్పటికి ఆ చాలెంజినుండి తప్పుకున్నాము.

ఒకరోజు కమలాకరం పెద్దటిన్ను చంకలో బెట్టుకొని రూమ్ రూమ్‌కు వెళ్లి ముక్కలు పంచి పెడుతున్నాడు. "ఏమిటి విశేషం?" అని అతణ్ని అడిగాము. జవాబుగా "మా అమ్మ దీన్ని ఊరి నుండి పంపించారు. నేనొక్కడే దీన్ని దాచుకొని కొన్ని నెలలపాటు తినడంలో ఏమి రుచి ఉంటుంది. ఇక్కడున్న 150మందితో పంచుకొని ఒక్కరోజులో ఖాళీ చేయడంలో ఉండే రుచి చాల ఎక్కువకదా! ఏమంటారు?" అని అన్నాడు. ఇది వినగానే 'గుమ్మడికాయల దొంగా అంటే భుజాలు తడవుకున్నట్లయింది' మా ఇద్దరి పని. మెల్లగా రూమ్‌లో ప్రవేశించాము. ఒక నెలగా మేమిద్దఱమే ప్రత్యేకంగా వాడుకొంటున్న ఆవకాయజాడి అల్‌మేరా నుండి వెక్కిరిస్తూ మమ్మల్ని చూసింది. సిగ్గుతో తలలు వాల్చాము.

ఒకరోజు ఉన్నట్టుండి కమలాకరం మాయమయ్యాడు. ఎక్కడికి పోయాడో ఏమయ్యాడో ఎవ్వరికీ తెలియదు. పదిహేను రోజుల తరువాత ఎక్కణ్ణుంచో వచ్చి హఠాత్తుగా ప్రత్యక్షమయ్యాడు. మనిషి బాగా చిక్కిపోయి ఉన్నాడు. అతణ్ని చూడగానే సంతోషం పట్టలేక హాస్టల్‌లో ఉన్నవాళ్ళందఱూ "కమలాకరం వచ్చాడు కమలాకరం వచ్చాడు" అంటూ కేకలు వేస్తూ చప్పట్లుకొట్టూ అతని చుట్టూ గుంపు చేరారు. తరువాత తరువాత తెలిసింది అతనీ పదిహేను రోజులెక్కడికెళ్లాడనే సంగతి:- ఎక్కడో వరదలు వచ్చాయట! చాలానష్టం కలిగిందట! ఏదో సేవాసంఘానికి సహాయంగా అక్కడికి వెళ్లి ఈ పదిహేనురోజులు రాత్రింబగళ్లు పనిచేసి వచ్చాడట!

ఇలా ఉండగా పెద్దపండగ రోజులు సమీపించాయి. సంక్రాంతిసెలవులు పదిహేను రోజులిచ్చారు. రేపటినుండి సెలవులనగా నేటి సాయంత్రమే ప్రయాణానికి సిద్ధమవుతున్నాడు కమలాకరం. ఇదిచూసి మా చక్రధారి "ఏమిటోయ్ కమల్! అప్పుడే ప్రయాణం కడుతున్నావ్! అంతఅవసరమేమొచ్చింది? ఈ పూటుండి రేపెళ్ళరాదా? మేమిద్దరం ఇంకో వారం ఇక్కడే ఉండబోతున్నాము. క్రికెట్ మ్యాచ్ చూసుకొని తరువాతనే ఇంటికి ప్రయాణం" అని చాలా సంబరంగా చెప్పాడు. ఇది విని కమలాకరం సూట్‌కేస్ సర్దుకుంటూనే ఇలా అన్నాడు:- "చూడు చక్రీ! మీ నాన్నలాగా మానాన్నకూడా రైతు. రైతులకు గవర్నమెంట్ హాలీడేస్ ఏమీ ఉండవు అని నీకూ తెలుసుగా. వాళ్లకు రోజూ పని ఉంటుంది. సెలవులు వచ్చినప్పుడల్లా నేను మా వూరెళ్లి మా నాన్నకు కొంత తీరుబాటు కలి

గించడమో, సహాయంగా ఉండటమో చేస్తుంటాను. అందుకే ఇప్పుడు తొందరగా వెళ్తున్నాను. నీవు కూడా వెళ్లి మీ నాన్నకు ఈ సెలవురోజుల్లో సహాయంగా ఉండరాదా? ఇక్కడెందుకు ఊరక కాలక్షేపం చేస్తూండడం?'' అంటూ తలెత్తి చూశాడు. జవాబు చెప్పడానికి చక్రి అక్కడ లేడు. చివరి మాటలు రుచించక వాడు ఆ వఱకే అక్కణ్ణుంచి పారిపోయాడు.

కమలాకరం విషయమై ఇంకా చెప్పవలసింది చాలా ఉంది. కాని అంతా చెప్పబోవడం లేదు. రెండో సంవత్సరం చివర జరిగిన ఒక సంఘటన మాత్రం వినండి. ఆఁ చెప్పడం మఱచాను-నేను, చక్రధారి ఒక ఊరివాళ్లము. ఒక రోజు మా ఊరికి చెందిన నాగన్న అనే సేద్యగాడు ఏదో పనిమీద పట్టణం వచ్చాడు. ఆ పని ముగించుకొని మా రూమ్‌కు వచ్చాడు. ఆ రాత్రి అక్కడ పడుకొని ప్రొద్దున బండికి తిరిగి వెళ్తానన్నాడు. సరే అన్నాము. నాగన్న తన దగ్గఱున్న గోనెసంచిని ఒకమూల పఱచుకొని దానిమీద చేతిసంచిని తలగడగా పెట్టుకుని పడుకున్నాడు. ''ఉహూఉహూ'' అనిపించే చలిరోజులవి. అతను అలా పడుకున్న తరువాత మేము, పఱుపు-దుప్పటి-దిండ్లతో కూడిన మా సుఖశయ్యలపై మేను వాల్చాము. ఇంతలో కమలాకరం ఏదో పనిఉండి తలుపు తట్టాడు. లైట్ వేసి తలుపు తీశాము. లోపలికి వచ్చాడు. నాగన్నమీద అతని చూపులు పడ్డాయి. ''ఎవరాయన?' అని మమ్ములను ప్రశ్నించాడు. ''మా వూరి పనివాడు. ఏదో పని ఉండి వచ్చాడు. ఈ రాత్రి ఇక్కడుండి రేప్రొద్దున బండికి తిరిగి వెళ్తాడు'' అని అన్నాము. లైట్ వేయడం మాట్లాడడం-ఈ సందడివల్ల నాగన్న కూడా తన పడకనుండి లేచికూర్చుని బిత్తరచూపులతో మా వైపు చూడసాగాడు. కమలాకరం వెంటనే అతని దగ్గరకు వెళ్లి ప్రక్కనే కూర్చొని ఆదరణ ఆప్యాయత ఉట్టిపడే కంఠస్వరంతో-''మీరెప్పుడొచ్చారు? ఏం పనిమీద వచ్చారు? పని పూర్తిఅయిందా? భోజనం చేశారా?'' ఇలాంటి కుశలప్రశ్నలు వేశాడు. నాగన్న అన్నిటికీ తడబడుతూ తడబడుతూ సమాధానాలు చెప్పాడు. కమలాకరం మళ్లీ, ''అలా పడుకున్నారే! మీరెలా నిదురపోగలరు? కప్పుకోడానికి ఏమీ లేదే! చలివేయడం లేదా? ఒక్క నిముషం ఉండండి. మీకు పడక ఏర్పాటు చేస్తాను'' అంటూ తన గదికి వెళ్లి తనచాప, దిండు, దుప్పటి-అంతా తెచ్చి నాగన్నకు చక్కని పడక ఏర్పాటుచేశాడు. నాగన్న ''వద్దుబాబూ వద్దుబాబూ'' అంటున్నా వినిపించుకోలేదు. అతణ్ని బలవంతం చేసి ఆ పడకమీద పడుకోబెట్టి తన గదికి వెళ్లిపోయాడు. ఈ వ్యవహారమంతా చూస్తున్న మా ఇద్దరి మనస్సులు ఎలా అయినవో మీరే ఊహించుకోండి! నాగన్న మా వూరి సేద్యగాడే గదా అని ఎంత ఉపేక్షాభావం కనబరచామో చూడండి! ఏ డబ్బున్నవాడో, పేరున్నవాడో మాకతిథిగా వచ్చిఉంటే అలా ఉపేక్షించే వాళ్ళమా? ఆ అతిథిఏర్పాట్లకు ఎన్ని చిందులు త్రొక్కి ఉండేవాళ్లము! కమలాకరం ఒక ముక్క ఉపన్యాసం కూడా చేయకుండా కేవలం తన ప్రవర్తన ద్వారానే మాకు ఎంత గుణపాఠం నేర్పాడో చూడండి! కమలాకరంలాంటి వాళ్ల నుండి నేర్చుకోవలసిందిగదా నిజమైన చదువు! కాలేజీల్లో ఏమున్నది నేర్చుకోవలసింది?

ఇప్పుడు మిమ్ములను ఒక సులభమైన ప్రశ్న అడుగుతున్నాను. జవాబుచెప్పండి. ''ఆస్తికులం దైవభక్తిపరులం'' అని మురిసిపోయే మేము దేవునికిదగ్గఱా? 'నాస్తికుడు నాస్తిక'డని మేము వేళాకోళం చేసిన కమలాకరం దేవుడికి దగ్గఱా?

# కబీరు వచనామృతము

## కబీరు సాధన

(1)

అనేకులు భక్తులగుదురు గాని భ్రాంతిని బోద్రోలలేరు. భ్రాంతియే కష్టములకెల్ల కష్టము. భ్రాంతియే ఘోర దుఃఖములకును సంశయములకును ఆవాసము. వీరు బ్రహ్మనెరుగరు. భ్రాంతిచే పూజించుచు తిరుగుదురు.— హృదయమునందలి నేత్రమును పెఱికి పారవైచినారు. జీవనముయొక్క తలను నఱికి నిర్జీవము కడ పూజ చేయుదురు. జీవహత్యయందలి ఘోరపాపము జీవమునకు కలుగు దుఃఖము, వేదన-ఇదంతయు వీరాలోచింపరు. నిత్యము జీవహత్య చేసి, వీరు నాలుకను తృప్తి పరుతురు. సాధుసాంగత్యము చేయువాడు ధన్యుడు. విచారణ మూలమున జ్ఞానదృష్టి లభించువాడు ధన్యుడు. నీ సత్యమైన సత్త్వమును గ్రహింపుము. నిర్భయుడవుకమ్ము. నిన్ను నీవు తెలిసికొనుము. అన్నిటి సారమైన బ్రహ్మను లక్ష్యము చేసికొనుము. కబీరిట్లనుచున్నాడు :—నీవు సత్యమువైపు చూడ్కి బఱపుము చూచి తెలిసికొనుము. సకల జీవములను ఉజ్వలమొనర్చి, బ్రహ్మయే ప్రకాశించుచున్నది.

(2)

నీ అమృతసింధువునందు విహరించు ఆస్వాదము లభించుటచే కోరిక నశించినది. బీజము మధ్య వృక్షముయొక్క విస్తారమెట్టులో అటులనే ఈ కోరికలోననే అన్నిరోగములున్నవి.

(3)

ఓ చెలికాడా! జీవించియుండగనే అతనికై ఆసచేయుము. జీవించియుండగనే విని తెలిసికొనుము. ఏలన జీవనమునందే ముక్తియొక్క నివాసము. జీవించియుండగనే కర్మబంధనములు తెగవేని ఇక చచ్చినప్పుడు ముక్తి దొరకుననునాశకవకాశమెక్కడ? దేహత్యాగమగు వెంటనే ఆతనితో మిళనమగునను ఆశ మిథ్య. ఇపుడు కలయిక కలదేని, అపుడును కలయిక యుండును. కాదేని యమపురమే నీ కావాసము. సత్యమవగాహనము చేసుకొనుము. సద్గురునెఱిగికొనుము. సత్యనామమును విశ్వసింపుము. కబీరిట్లనుచున్నాడు :— నేను సాధనమునకు దాసుడను. ఏలన సాధనమే హితకారి.

(4)

కుసుమోద్యానమునకు బోకుము. ఓయీ! కుసుమోద్యానమునకు బోకుము. నీలోననే పుష్పవనము. సహస్రదళమగు కమలముపై కూర్చుండి అతని అపారరూపమునుదర్శింపుము.

(5)

ఓ సాధకా! ఈ తనువు అతని వీణ. కావున ఆతడు దీని తంత్రుల బిగించియు, విడులను ద్రిప్పియు రాగమును వెలువరించుచున్నాడు తంత్రి తెగిపోయెనేని విడి శిథిలమయ్యెనేని యీ ధూళియంత్రము ధూళియందే కలసిపోవును. కబీరిటనుచున్నాడు :—ఓ సోదరా వినుము. కేవలమా బ్రహ్మయే ఆస్వరమును ప్రయోగింపగలడు.

(6)

ఓ సాధూ! భజనముయొక్క రహస్యము కడు గభీరము. పాట పాడి, శాస్త్రము వ్యాఖ్యానమొనరించి, సంసారమును భ్రమింపజేసి సంధ్యాతర్పణము కావించి యేమి లాభము? తత్త్వవిచారణ చేయువేని తల గొఱిగించుకొనినను, జడలు పెంచుకొనినను, ఒడ

లునబూది నలదుకొనినను, పూజార్చనము చేసినను, ఫలహారము కావించినను ఏమి లాభము? ఆతని పరిచయము లేకయే ఎల్లరును మహాత్ములై కూర్చుందురు. విషయాసక్తులగుదురు. జ్ఞానధ్యానముల మర్మమెరుగరు. కేవల మహంకారపు మాటలాడుదురు. ఆ తత్వసీమము, ఆ తలము, మహాగభీరము. దాని మహాధ్యానమం దెవ్వడు నిమగ్నుడై పోవునో ఆతడు కర్మబంధనములనుండి నిర్ముక్తుడు.

(7)

రాత్రిందినములు ఈశ్వరునే ప్రేమింపుము. నేను ఏ కఠినమైనగాని, కఠోరమైనగాని, కార్యము చేయుమని చెప్పుటలేదు. ఒక సత్యపురుషుడు ఎల్లరి వెనుకను వసించియున్నాడు. ఆతనికడ ప్రణతుడవుకమ్ము. ప్రాణమునందు వేదన జాగరిల్లెనేని, నిన్నది సరియైన బాట లోనికి జేకొనిరాగలదు. నీవు నీ గంతవ్యమును చేరగలవు.

(8)

కబీరు చెప్పుచున్నాడు. ఓ సాధూ! దేహము నఖశిఖపర్యంతము విషముతో పరిపూర్ణము. నేడు గలతియను నింపి సుధాపాన మొనర్పుము. నేడు మత్తుడవగుము. నామామృతపు గలతియనుండి త్రాగుము.

(9)

మాయ నేవిధముగా విడనాడుదువో తెలుపుమన్నా! వసనగ్రంథిని త్యజించితిని. కాని వసనము కట్టుకొన మొదలిడితిని. వసనము కట్టుకొనుట త్యజించితిని కాని వసనము చుట్టుకొనుట నభ్యసించితిని. కామమును త్యజించితిని. కాని క్రోధము మిగిలియున్నది. క్రోధము త్యజించితిని కాని లోభము మిగిలియున్నది. లోభము త్యజించితి కాని అహంకారము, అభిమానము, శ్రేష్ఠుడనను గర్వము వచ్చి నిలచినవి. మనస్సు వైరాగ్యముచేత మాయను త్యజించినదిగాని శాస్త్రాక్షరమందు తగుల్కొనినది. కబీరిట్లనుచున్నాడు :–ఓ ప్రియ సాధకా! ఆ సత్యపథము అరుదుగా లభించును.

(10)

భ్రాంతుడై ద్రిమ్మరువానిని మరల నింటికి రావించువాడే నా కెంతయు ప్రియుడు. ఇంటియందే నిజమయిన కలియక. ఇంటియందే జీవితసుఖముయొక్క అనుభవము. ఇల్లు వీడి వనమునకు బోవనేల? బ్రహ్మయే నాకు తత్వమును జూపునేని ఇంటియందే ముక్తుడనగుదును. ఎవడు సహజముగా బ్రహ్మయందు మగ్నుడగునో ఎవని మనస్సు సహజముగా సమాధియందు లగ్నమగునో అతడే నాకెంతయు ప్రియుడు. ఎవడున్మత్తుడో, ఎవడు బ్రహ్మ నెరుగునో, ఎవడు పరమతత్వమును ధ్యానించునో, ఎవడు ప్రేమ వైరాగ్యముల సంగతముచేసి, ఆ సీమముయొక్క రాగిణిని మ్రోయించునో అతడే నాకు ప్రియుడు. కబీరిట్లనుచున్నాడు :–ఇల్లే యుండతగిన తావు. ఇంటియందే బ్రహ్మవస్తువు. ఇల్లే యావస్తువుతో కలయిక నొసగును. నీ విప్పుడెక్కడనున్నావో అక్కడనే యుండుము. నీ కన్నియు లభింపగలవు.

(11)

ఓ సాధూ! ఆ శబ్దమును సాధింపుము. ఆ శబ్దమునుండియే విశ్వము వెలువడినది. ఆ శబ్దమును గ్రహింపుము. ఆ శబ్దమే గురువు. అది వినియే శిష్యుడనైతిని. ఆ శబ్దముయొక్క మర్మమెరిగిన వారలెందరు గలరు! వేదము, పురాణము శబ్దమునే చెప్పుచున్నవి. ఆ శబ్దమునందే సర్వము ప్రతిష్ఠితము మునులు,

సాధకులు ఆ శబ్దము మాటయే చెప్పుదురు. ఆ శబ్దరహస్యమెవ్వరు నెరుగరు. ఆ శబ్దము వినియే గృహస్థుడు విరాగియగును. ఆ శబ్దము వినియే విరాగి అనురాగి యగును. షడ్దర్శనములా శబ్దము విషయమే చెప్పెడిని. వైరాగ్యమును ఆ శబ్దము వైపునకే చూపెడిని. ఆ శబ్దమునుండి జగచ్ఛరీరముత్పన్నమైనది. ఆ శబ్దమే సర్వము ప్రకాశమానము చేయును. కబీరిట్లనుచున్నాడు :—ఆ శబ్దమెచ్చటనుండి వచ్చుచున్నదో అది ఎవడెఱుంగును ?

## (12)

ఈ కంటికి అపురూపమైన దాని రూపము జూపువాడే సద్గురువు, సాధువు. అతడు ప్రాణాయామము, పూజ, ఆచారము లేకయే ఈశ్వరుని లభింపజేయగలడు. తలుపుల నాతడు మూయింపడు. శ్వాసము నిరోధింపజేయడు. ప్రపంచకమును సన్యసించి పరిత్యజించడు. మనస్సెచట దగుల్కొనినను అచ్చట పరమాత్మ దర్శనము కలిగించును. కర్మయందును నిష్కర్మిగానుండజేయు శిక్షనిడును. ఎల్లప్పుడును ఆనందములోన నెచ్చటను లేశమాత్రమైనను భయము లేదు. భోగమునందును యోగమెల్లప్పుడును జాగరూకము జేసి యాతడుంచును. అనంతపూరుషుని యనంతధామమెల్లను వ్యాపించియున్నది. స్థలము, జలము, వాయువు, ఆకాశము—అన్నింటియందును అతడే. శూన్యమునకు బైన వజ్రము వలె గటినమై సాధకుని యాసనము కలదు. లోన నెవ్వడు కలడో అతనినే బైట జూచుచున్నాను. వేరు వస్తువింకొకటియేని కన్పడుట లేదు

## (13)

నేడు గగనమునందు కారుమబ్బుల పిండు వాని గభీరగర్జనము నేడాలకింపుము. తూర్పు దిక్కునుండి వాన ఝిరుఝిర్ధ్వనితో వచ్చుచున్నది. నీ పొలములయొక్క కట్టలను, కన్నములను సరిగా చూసికొనుము. లేదేని యవి నీటితో బొర్లి పోగలవు. ప్రేమ వైరాగ్యములను లతను నేడే రసవర్షమునందు సిక్తము చేసి ముక్తిక్షేత్రమును సంసిద్ధము చేసికొనుము కుశలుడైన కర్షకుడు ధాన్యమును నూర్చి ఇంటికి తెచ్చికొనగలడు అతడు తన రెండు పాత్రలను నింపగలడు. అతడు మునులను, జ్ఞానులను గూడ సంతృప్తులను జేయగలడు.

## (14)

భక్తిపథమతిసూక్ష్మము. అందు కోర్కి లేదు. కోరిమిలేదు. అతని చరణములకడ భక్తుడు లీనుడై పోవును. అన్వేషణము యొక్క ఆనందరసమున పరవశుడగును. చేప నీరములందువలె ప్రేమయొక్క యగాధములందు మునిగియుండును. స్వామియొక్క సేవయందు తన తలనేని యిచ్చుటకు విలంబనము జేయడు. భక్తిరహస్యము కబీరు స్పష్టముచేసి చెప్పుచున్నాడు.

## (15)

సహజముగానే సహజలభ్యునియందు మునిగియుండవలయును. ఒకచోటికి బోనక్కరలేదు. ఒకచోటికి రానక్కరలేదు. జప, తప, ధ్యానములు, రామరహీముల గురించి పాడుట, వీనివలన ప్రయోజనము లేదు. తీర్థవ్రతములన్నియు పరిత్యజించవలయును. మిథ్యాచారములందు బద్ధుడై యుండి ప్రయోజనము లేదు. కబీరిట్లనుచున్నాడు——నా మాట ఎవనికర్థమగునో యతడే యా సాధకుడు. ఎంతవరకు ఆత్మదర్శనము గాలేదో అంతవరకు యోగముచే గాని, జ్ఞానముచే గాని భ్రాంతి దూరము గాదు.

## (16)

ఓ నెచ్చెలీ! ఓ నా హృదయమా! బాగుగ నాలోచింపుము. నిజముగ ప్రేమింతువేని నిదురించెదవేల? నీవాతని గనుగొంటివేని సంపూర్ణముగ నాతనికర్పించుకొనుము. అతని జేకొనుము. మాటి మాటికిని అతనిని బోకొట్టుకొందువేల? కన్నులపైని నిద్దుర గూర్కొని వచ్చెనేని పరుపువైచి బాలీసులు సర్దుట ఏమవసరము? కబీరిట్లనుచున్నాడు:- నేను ప్రేమపథము తెల్పుచున్నాను. తల ఈవలసివచ్చినను చింతయేటికి?

## (17)

ఓసాధూ! సహజమైన కలయికయే శ్రేష్ఠమైనది. స్వామితో మిళనమైన నాటినుండియు మా ప్రేమలీలకవసానము లేదు. నేను కన్నుల మూసికొనను. చెవులనవరుద్ధము చేయను. దేహమును కష్టపెట్టను. కన్నుల దెరచి నగవుప్పతిల జూచుచుందును. ఎల్లెడల నాకా సుందరరూపమే కన్పడును. అతని నామమే యుచ్చరింతును. ఇక నేనేది చూచినను అది యాతనినే స్మరింపజేయును. నేనేమి చేసినను అది యాతని పూజయే యగును. ఉదయమును, అస్తమయమును నాకొక్కటియే. అన్ని ద్వంద్వములును నశించిపోయినవి. ఎచటికి పోయినను అతనికే ప్రదక్షిణము చేయుదును. నేనేమి యొనర్చినను, అదియంతయు ఆతని సేవయే. ఎప్పుడు పండుకొందునో అప్పుడాతని చరణములకడనే ప్రణతుడనగుదును. అతడొకడే నాకు పూజనీయుడు. ఇకనన్యుడు లేడు. నానాలుక మలినవచనముల పరిత్యజించినది. రాత్రిందినములతనినే గానము చేయును. లేచినను, కూర్చున్నను అతనిని మఱువలేను. అతని గానముయొక్క తాళము నా చెవ్వులందట్లే మ్రోయుచున్నది. కబీరిట్లనుచున్నాడు :-నా ప్రాణమున్మత్తమైనది. ఏది ప్రచ్ఛన్నమో అది ప్రకాశము చేసి పాడుచున్నాను. దుఃఖసుఖముకతీతమైన యా పరమసుఖమునందు ఎల్లపుడును మగ్నుడనై యున్నాను.

## (18)

ఆ శబ్దము ఎవ్వని హృదయమునాఘాతించెనో, అతనిని పుష్కరిణి, కూపము, వాపి, ప్రాకారము యివి యేమి ఆపగలవు? ఈటె, సురియ, ఖడ్గము అతనినేమి చేయగలవు?

## (19)

తీర్థములందు నీరు దక్క యేమియు లేదు. అవి నిష్ఫలములని నేనెరుగుదును :-నేను స్నానము చేసి చూసితిని.

ప్రతిమలు జడములు. నే నెరుగుదును, అ మాటాడలేవు-నేను పిలచి చూచితిని.

పురాణము, కొరాను, ఉత్తమాటలు— తెఱ ఎత్తి నేను గనుకొంటిని. కబీరు కేవల మనుభవమందలి మాటలనే చెప్పుచున్నాడు. మిగిలినవన్నియు వట్టి యబద్ధములని యాతడెరుగును.

## (20)

నా తనువు, మనస్సు, ధనము నేడు పణముగా బెట్టితిని. ప్రియతమునితో నేటి యాటలో నా పందెము నోడితినేని నేనాతని వాడను. గెలిచితినేని ప్రియతముడు నావాడు. ఈ ప్రేమఖేలయందు మా యిద్దరి మిళనము నిశ్చితము.

# స్వామి అఖండానంద

డి. వి. బ్రహ్మాజి

విశ్వమతమహాసభలో పాల్గొను నిమిత్తము అమెరికా దేశమునకు బయలుదేరుటకు పూర్వమే వివేకానందస్వామి హృదయాంతరాళమున భారతజనసామాన్యమును ఉద్ధరింప వలెనను దృఢసంకల్పము పొడసూపినది. తన సోదర దేశీయులయిన దరిద్రదీననారాయణుల సముద్ధరణార్థమై కావలసిన ధనసంపాదన నిమిత్తము పశ్చిమ ఖండమున కేగుటకాయన కృతనిశ్చయుడయ్యెను. సంకల్పసిద్ధుడగు స్వామి పశ్చిమఖండమున తన వేదాంత దిగ్విజయముతో బాటుగా భారతదేశజీవనుల దారిద్ర్య నిర్మూలనమునకు వలయు ధనమును కూడ తన ఉపన్యాసములద్వారా సమ కూర్చుకొనుచుండెను. తన అభిప్రాయాలను విశదీకరిస్తూ స్వామి భారతదేశంలోని సోదరసన్యాసులకు అనేక జాబు లను వ్రాయుచుండెడివారు. కాని స్వామి సోదరశిష్యు లలో చాల కొద్దిమంది మాత్రమే మొదట్లో వారి ఆశయా లను ఆమోదించారు. చాలా మందికి మాత్రం-ఆత్మమోక్ష మునకు పాటుపడవలసిన సన్యాసులకు-వివేకానందస్వామి ప్రబోధిస్తున్న కార్యక్రమం ఒక అడ్డుకాగలదని భయం కల్గింది. మొట్టమొదట్లో ఈ విధముగా ఆలోచించిన వారిలో మన అఖండానందస్వామి కూడా ఒకరు. అందు వలననే దీనజనోద్ధరణ విషయమై ప్రబోధిస్తూ వివేకానంద స్వామి వ్రాసిన ఉత్తరాలను స్వామి అఖండానంద తొలుత అంతగా పట్టించుకోలేదు.

అయితే, ఆ తర్వాత కొంతకాలానికి అఖండానంద స్వామి మనోదృక్పథంలో గొప్ప మార్పు వచ్చింది. తీవ్ర మయిన అస్వస్థకు లోనయిన అఖండానందస్వామి గాలి మార్పుకోసం ఖేత్రీనగరంలో ఆరునెలల కాలం ఉండ వలసి వచ్చింది. ఆ ఆరునెలల కాలంలోనూ అఖండానంద స్వామికి అక్కడ గల అన్ని రకాల జనాలతోను బాగా సన్నిహితపరిచయం ఏర్పడింది. ముఖ్యంగా దీనులతోను, దరిద్రులతోను కల్గిన దగ్గరి పరిచయంవల్ల వారి కష్ట సుఖాలు ఆయనకు బాగా అవగతం అయ్యాయి. దానితో, వివేకానందస్వామి ప్రబోధించిన దీనజనోద్ధరణ విష యంలో అఖండానందస్వామికి కూడా దృఢమయిన విశ్వా సం ఏర్పడింది. తాను కూడా నరేంద్రుని అడుగుజాడ లోనే పయనించి దరిద్రనారాయణసముద్ధరణకై నిర్విరా మంగా కృషిచేయాలని ఆయన సంకల్పించుకొన్నారు. వెంటనే వివేకానందస్వామికి జాబు వ్రాసి ఆయన అనుమ తితో 1894లో మన అఖండానందస్వామి తన సేవాకార్యక్రమాన్ని ప్రారంభించారు. ఈ విధంగా, వివేకానందస్వామి ప్రవచించి ప్రబోధించిన దీనజనసేవా కార్యక్రమానికి తొలుదొల్త నాందీవాక్యము పల్కిన సూత్ర ధారి మన అఖండానందస్వామియే!

అఖండానందస్వామికి తల్లిదండ్రులు పెట్టిన పేరు గంగాధరఘటక్. ఈయన కలకత్తానగరంలో 1864లో సెప్టెంబరు 30న జన్మించారు. బాల్యంనుంచీ కూడా గంగాధరుని మనస్సు ఆధ్యాత్మికమార్గం వయిపునే పయనించేది, పిన్ననాటినుండి ఆయన మతసాధనలను పరమ చాదస్తముగా అనుసరించేవాడు. ప్రతిదినము ఆయన కనీసం మూడువేళలా స్నానంచేయుట, స్వయంపాకముసే భుజించుట, గీతాపారాయణము పూర్తిచేయుట గావించెడి వాడు. పురాణగ్రంథ పఠనమునందును, ధ్యానమునందును ఆయనకాసక్తి ఎక్కువ. ఆయన తన 14వ యేట మొట్ట మొదటిసారిగా శ్రీరామకృష్ణపరమహంసను దర్శించారు. బాగ్‌బజారులోని దీననాథబోసు ఇంట్లో తన మిత్రుడయిన హరినాథ ఛటోపాధ్యాయ (తురీయానందస్వామి)తో కలసి గంగాధరుడు శ్రీగురుదేవులను చూచుట జరిగింది. ఆ తర్వాత గంగాధరుడు 1884 సం॥న మరల తన మిత్రు డయిన హరితో కలసి దక్షిణేశ్వరానికి పోయి పరమహం సను దర్శించారు. శ్రీగురుదేవులు తన సహజమయిన వాత్సల్యానురాగములతో ప్రేమపూర్వకముగా గంగాధరుని ఆదరించి చేరదీసి "నీవు ఇదివరకెన్నడయినా నన్ను చూసి ఉన్నావా?" అని ప్రశ్నించారు. దానికి సమాధానంగా గంగాధరుడు తానాయనను ఇదివరలో దీననాథబోసింట్లో చూచియున్న సంగతిని తెలిపారు. ఆ తర్వాత ఆనాటి రాత్రికి అక్కడే ఉండిపోవలసినదిగా శ్రీగురుదేవులాయ నను బలవంతం చేశారు. మరునాడు గంగాధరుడు ఇంటికి తిరిగిపోయేటప్పుడు పరమహంస తన సహజధోరణిలో "నాయనా నీ విచటకు మరల తప్పక రావలెను సుమా" అని ప్రేమపూర్వకముగ హెచ్చరించారు, నాటినుండి గంగాధరుడు తరచు దక్షిణేశ్వరం వెళ్ళి శ్రీరామకృష్ణులను దర్శిస్తూండేవారు. క్రమక్రమముగా గురుశిష్యుల సంబం ధము వికసించసాగింది. శ్రీగురుదేవులను దర్శింపవచ్చిన ప్రతిపర్యాయము గంగాధరునకు ఆయనలోని ఒక వినూత్న తేజః కిరణము దృగ్గోచరం అవుతూండేది,

ఈ విధముగా పరమహంసతో పరిచయం పెరిగినకొద్దీ ఆధ్యాత్మికసాధనామార్గంలో ఆయననుండి గంగాధరుడు ప్రయోగాత్మక శిక్షణను అనాయాసంగా అభ్యాసం చేశారు,

శ్రీగురుదేవుల ఒజ్జరికంలో గంగాధరునిలోని ఛాందస స్వభావంలో మార్పు రాజొచ్చింది. మొదట్లో దేవాలయంలోని అన్నప్రసాదమును పరమహంస తనను ఎక్కడ తినమని బలవంతము చేయునో అను భయముతో గంగాధరుడు పగటిపూట దక్షిణేశ్వరమునకు పోయెడివాడే కాదు. సాయంకాలముననే పోయి, పండ్లు, మిఠాయిలు మాత్రం తీసుకొనెడివాడు. ఇది గ్రహించిన పరమహంస గంగాధరునితో "కాళికి నివేదింపబడిన అన్నము గంగాజలముతో పచనమగుటచే అది ఎంతయో పవిత్రమైనది" అని బోధించిరి. ఆ తర్వాత ఆయన గంగాధరునితో—"నీవు తాంబూలము కూడ ఎందుకు వేసుకొనవు? నరేంద్రనాథుని చూడుము, అతడు రోజూ వంద తమలపాకులయినా నములుతుంటాడు. ఏది దొరికిన దానిని నిస్సంకోచముగా తింటాడు. కాని అతని మనస్సు మాత్రం ఎల్లప్పుడూ అంతర్ముఖమే అయి ఉంటుంది. అతని కళ్లు ఎప్పుడూ ఆకర్షణీయంగా ప్రస్ఫుటంగా కన్పిస్తూంటాయి, కలకత్తా నగరవీధులలో నడుస్తూన్నపుడు అతను దారికి ఇరువయిపులా ఉన్న ఇండ్లనూ, అందలి అలంకారములను, అన్నింటిని కూడా వాటిలో బ్రహ్మమే నిండియున్నట్లు చూస్తాడు. అంతటి మహోన్నతస్థితిలో అతని మనస్సు విహరిస్తూ ఉంటోంది. నీవు ఒక్కసారి పోయి అతనిని తప్పక చూడవలసినది" అని అన్నారు.

శ్రీగురుదేవుని ఆదేశమును అనుసరించి గంగాధరుడు ఆ మరునాడే నరేంద్రనాథుని ఇంటికిపోయి ఆయనను చూచి వచ్చాడు. నరేంద్రుని విషయమై పరమహంస పల్కిన మాటలన్నియు అక్షర సత్యములేనని ఆ ప్రథమ సందర్శనముననే గంగాధరునకు అర్థమయింది. గంగాధరుడు పోవుసరికి నరేంద్రుడు తన చుట్టు ధూళిదూసరితమయిన పరిసరముల గురించిన ఏమాత్రము ధ్యాసయును లేక, ఏకాగ్రచిత్తముతో గ్రంథపఠనము గావించుచుండెను. ఆయన ముఖమునందలి విశాలనేత్రములు మన గంగాధరుని అయస్కాంతాలవలె ఆకర్షించినవి. నరేంద్రుని రూపసంపద, సంభాషణాచాతుర్యము, ఋజువర్తనములయెడల గంగాధరుడెంతగానో అనురక్తుడయ్యెను. ఈ విషయమునంతను గంగాధరుని ముఖతః విన్న రామకృష్ణులాతనితో "నీవు తరచుగ వివేకానందుని కలుసుకొనుము" అని సలహా యిచ్చారు.

కోసిపూర్‌లో శ్రీగురుదేవుని అవసానదినములలో ఆయనకు సేవ చేసిన ధన్యజీవులలో గంగాధరుడు కూడా ఒకడు. ఆతరువాత స్థాపింపబడిన బారానగరు మఠమునకు గంగాధరుడు తరచుగ వచ్చిపోయెడివాడు. వెంటనే ఆ మఠమున చేరుటకు ఆయనకు వీలుకాలేదు. కొంతకాలమయిన పిమ్మట పరివ్రాజకజీవితాన్ని గడపవలెనను తీవ్రకాంక్ష తనలో రేకెత్తగా అఖండానందస్వామి 1887 ఫిబ్రవరినెలలో హిమాలయాలకు, టిబెట్‌కు పర్యటన ప్రారంభించి 1890లో తిరిగి వచ్చారు.

తిరిగి వచ్చిన పిమ్మట మన అఖండానందస్వామి తన నాయకుడయిన స్వామి వివేకానందను కూడా ప్రోత్సహించి ఆయనతోపాటుగా మరల హిమాలయయాత్రకు బయలుదేరారు. కాని, ఈ మారు పర్యటనలో ఇరువురిలోను ఎవరో ఒకరు తరచుగా అనారోగ్యమునకు గురి అవుతూ ఉండేవారు, అందువల్ల తీర్థయాత్ర సవ్యముగా కొనసాగకుండాపోయెను. కర్ణప్రయాగవరకు మాత్రమే వెళ్ళి అక్కడనుండి వెనుకకు మరలారు. ఇద్దరూ కలసి డెహ్రాడూన్ వరకూ తిరిగి వచ్చిన పిదప వైద్యంకోసమై అఖండానందస్వామి మీరట్ పట్టణమునకు చేరుకున్నారు. తర్వాత కొంతకాలమునకు మరల వివేకానందస్వామి అఖండానందస్వామి ఒకచోట కలుసుకొన్నారు. ఇతర శిష్యులు కూడా వీరికి తోడుగా వచ్చి చేరారు. ఇట్లా అందరూ కలసి కొన్ని నెలలు గడపిన పిదప, ఏకాకిగా పరివ్రాజకజీవితాన్ని గడపాలని ఆకాంక్షించి వివేకానంద స్వామి ఎవరికీ చెప్పకుండా అజ్ఞాతముగ దేశసంచారమునకు బయలుదేరారు. వివేకానందుని ఎడబాటును భరించజాలక అఖండానందస్వామి ఆయనను వెదకుకుంటూ బయలుదేరారు. కాని, ప్రతిచోటా అఖండానందస్వామికి ఆశాభంగమే ఎదురయింది. ఎక్కడకు పోయినా, 'వివేకానందస్వామి కొద్దిరోజుల క్రిందటే అక్కడనుంచి వెళ్లిపోయారు' అని తెలిసేది. అయినా విసుగుచెందక అఖండానంద తన గవేషణ కొనసాగించి, చిట్టచివరకు గుజరాత్‌లోని కచ్ ప్రాంతంలో వివేకానందస్వామిని పట్టుకొనగలిగారు. అయితే, తాను ఏకాకిగా ఉండాలి అనే నిశ్చితాభిప్రాయాన్ని వివేకానందస్వామి వెలిబుచ్చడంతో ఎవరికి వారు విడివిడిగా తమ తీర్థయాత్రలు కొనసాగించారు.

అమెరికాలోనున్న వివేకానంద అనుమతితో 1894లో మన అఖండానందస్వామి ప్రారంభించిన సేవా కార్యక్రమం సంగతి మనం మొదట్లోనే తెలుసుకొన్నాం. ఈ కార్యక్రమనిర్వహణలో ఖేత్రీగ్రామం కేంద్రంగా మొదట్లో పని ప్రారంభించారు. ఈ సందర్భంలో స్వామికి ఒక విషయం మాత్రం కొట్టవచ్చినట్లుగా తెలిసివచ్చింది. బీదప్రజల ఇక్కట్లన్నిటికి మూలకారణము వారిలో పాతు

కుపోయిన అజ్ఞానమే. అందువల్ల వారిని నిజముగా బాగు చేయాలి అంటే ముందుగా వారిని విద్యావంతులను చేయాలి అని స్వామి గ్రహించారు. వెన్వెంటనే ఖేత్రీలో నున్న ఇంటింటికి తిరిగి ప్రతివ్యక్తిని స్వయముగా కలసి, వారి పిల్లలను బడికి పంపి విద్యావంతులుగా చేయవలసిన ఆవశ్యకత గురించి నచ్చజెప్పసాగారు. స్వామి కృషివల్ల అచటి పాఠశాలలోని విద్యార్థుల సంఖ్య ఒక్కసారిగా 80 నుంచి 250 పైగా పెరిగింది. ఉపాధ్యాయులుకూడా ఎక్కువ సంఖ్యలో నియమితులయ్యారు. ఆ తర్వాత అఖండానందస్వామి తన కార్యక్రమాన్ని ఖేత్రీకి చుట్టు ప్రక్కల నున్న పల్లెలకు కూడా విస్తరింపజేసారు. పల్లె ప్రజలకోసం క్రొత్తగా అయిదు ప్రాథమికపాఠశాలలను నెలకొల్పారు. ఈ కార్యక్రమం అంతా చూసి ప్రభావితు లయిన ఖేత్రీమహారాజు విద్యావ్యాప్తికోసమై తనవంతుగా ప్రతి సంవత్సరము అయిదువేల రూపాయల వార్షిక చందా ఏర్పాటు చేశారు. అఖండానందస్వామి ప్రోద్బలం మీదనే ఖేత్రీలోని సంస్కృతపాఠశాలను వేదపాఠశాలగా మార్చటం జరిగింది. అందులో చేరిన విద్యార్థుల పుస్తకాలు కూడా కొనలేనిస్థితిలో ఉండటం చూచి స్వామియే కొంత ధనమును ప్రోగుజేసి, పుస్తకాలు కొని వారికి పంచి యిచ్చారు. ఖేత్రీమహారాజు దర్బారు ఉత్సవం జరిగే రోజులలో బీదప్రజలు ఆయనను చూడరాదనే ఆంక్ష ఒకటి ఉండేది. మన స్వామి ఖేత్రీమహారాజుకు నచ్చచెప్పి ఈ నిబంధనను తొలగింపజేశారు.

ఆ తరువాత సంవత్సరమున స్వామి ఉదయపూర్ వెళ్ళారు. అక్కడి భిల్లజాతి ప్రజల దయనీయస్థితిని చూచి ఆయన కలత జెంది ఒక స్నేహితుని సహాయంతో వారందరికి ఒక రోజున మంచి విందు భోజనం ఏర్పాటుచేశారు. రాజపుటానా (ప్రస్తుతం రాజస్థాన్) ప్రాంతములలో పర్యటించి అక్కడక్కడ కొన్ని పాఠశాలలు స్థాపించారు. తిరిగి 1896 సం॥లో ఆలంబజారులో ఏర్పడిన మఠానికి తిరిగి వచ్చారు. ఇక్కడకు వచ్చినా కూడా సేవా తత్పరుడయిన అఖండానందస్వామి తన కార్యనిర్వహణను వీడలేదు. చుట్టుప్రక్కల ప్రదేశాలలో ఎక్కడయినా కలరా వంటి వ్యాధులు ప్రబలినాయని తెలిస్తే చాలు—వెంటనే కార్యరంగమునకురికి, తన విషయం ఏమీ ఆలోచించక, రోగులకు పరిచర్య గావించేవారు. 1897 సం॥లో ఆయన తీర్థయాత్రలు గావించాలి అనే ఉద్దేశముతో గంగానది వెంబడినే ఉత్తర దిశకు ఉన్ముఖులై పర్యటన మొదలుపెట్టారు. దారిలో ముర్షిదాబాద్ జిల్లాలోని ఒక చిన్న గ్రామం చేరుకున్నారు. అక్కడ ఆయనకొక చిన్న మహమ్మదీయ బాలిక ఏడుస్తూ కన్పించింది. నీటికోసమని వచ్చిన ఆ పసిపాప తాను తెచ్చిన కుండను పగలగొట్టింది. ఇంట్లో ఉన్న ఒకే ఒక్క కుండనూ పగలగొట్టినందులకు తల్లిదండ్రులు కొడతారని, అక్కడే ఏడుస్తూ కూర్చుంది. అప్పుడు అఖండానందస్వామి తనవద్ద మిగిలియున్న పావలా (25 పైసలు)లో నుంచి, ఒక కుండను కొని ఆ అమ్మాయికి ఇచ్చారు. ఒక అర్ధణా (ఒక రూపాయి= 16 అణాలు] పెట్టి పేలాలుకూడా కొని ఆ అమ్మాయి ఒళ్ళో పోశారు. ఆ తర్వాత, అక్కడ స్వామి విశ్రాంతి తీసుకొంటూండగా చింకి చిరిగిపోయిన బట్టలలో, కృశించి నీరసించిన పదిపన్నెండుగురు అనాథలు ఆయనను చుట్టుముట్టి తిండికోసం ప్రార్థించారు. పావలాలోను ఖర్చు కాగా మిగిలినదంతా వినియోగించి ఆహారపదార్థాలు కొని వారి కిచ్చివేశారు. ఈ కథ మనకు రంతిదేవుని చరిత్రను స్ఫురణకు తెస్తుంది. క్షామ పరిస్థితులలో అఖండానందస్వామికి కల్గిన మొదటి పరిచయం ఇదే. స్వామి ముందుకు ప్రయాణం చేస్తున్నకొద్దీ హృదయవిదారకమయిన విషాదదృశ్యాలు మరిన్ని గోచరింపసాగాయి. చివరకు 'మాహులా' అనే చోట చేరినాక, స్వామి మరింక ముందుకు సాగలేకపోయారు. అచటి క్షామ పీడితప్రజలకు విముక్తి కల్గించనిదే అడుగు ముందుకు పెట్టరాదనే దృఢసంకల్పంతో అఖండానందస్వామి అక్కడే ఆగిపోయారు. వెంటనే పరిస్థితి అంతా వివరిస్తూ ఆలంబజారు మఠానికి వివరంగా లేఖ వ్రాసి సహాయం పంపమని కోరారు. తత్‌క్షణమే వివేకానందస్వామి ఇద్దరు సన్యాసులను, కొంత ధనాన్ని మాహులాకు పంపించారు. వెంటనే అఖండానందస్వామి పర్యవేక్షణలో; మాహులా, పాంచగావో గ్రామాలు కేంద్రస్థానముగా క్షామనివారణకార్యక్రమం ఆరంభమయింది. 1897 మేనెల 15వ ప్రారంభించిన ఈ క్షామ నివారణ పథకం ఒక సంవత్సరం కాలంపాటు నిరంతరాయంగా కొనసాగింది. ఈ నాడు శ్రీరామకృష్ణమఠము, సేవా సంఘము దేశము నలుమూలలా నిర్వహిస్తున్న సహాయక పునరావాసకార్యక్రమాలకు అన్నింటికి ఆద్యుడు మన అఖండానందస్వామియే అని చెప్పవచ్చు.

క్షామనివారణ కార్యక్రమంలో మన స్వామి నిమగ్నులై యున్న సమయంలోనే ఆయన ఇద్దరు అనాథల విషయం శ్రద్ధ వహించవలసి వచ్చింది. ఈ సంఘటనతో ఒక ఒక అనాథాశ్రమాన్ని నిర్మించాలనే సంకల్పం అఖండానందస్వామిలో ఏర్పడింది. 1898లో ఆయన ''మాహులా''లోనే ''రామకృష్ణాశ్రమం'' పేరిట ఒక

అనాథాశ్రమాన్ని స్థాపించారు. ఈ ఆశ్రమాన్ని ఆ తర్వాత "సార్గచ్ఛి"కి తరలించారు. 13 సం॥ అనంతరము ఈ అనాథాశ్రమానికి "సార్గచ్ఛి"లో ఒక స్వంత భవనం సమకూరింది. అఖండానందస్వామి ఈ సంస్థకు గావించిన సేవ అపూర్వమయినది. తన చివరి క్షణంవరకు స్వామి ఈ ఆశ్రమం అభివృద్ధికోసం తన సర్వశక్తులూ ధారవోసి అహరహమూ పాటుపడ్డారు. అనేక మంది అనాథబాలురు తిండితిప్పలు లేక మాడకుండాను, విద్యాగంధశూన్యులుగా మిగిలిపోయి భ్రష్టులుకాకుండాను, ఈ సంస్థ కాపాడింది. స్వామి ఆధ్వర్యంలో విద్యావ్యాప్తికోసమై ఈ రామకృష్ణాశ్రమం ఒక పగటి పాఠశాలను, ఒక రాత్రి పాఠశాలను నడిపింది. అంతేకాక ఒక వైద్య చికిత్సా శిబిరాన్ని కూడా నిర్వహించింది. 1900 నుంచి 1910 వరకు ఈ ఆశ్రమం ఒక సాంకేతిక శిక్షణాశాలను కూడా నడిపింది. ఇందులో చేరినవారికి నేతపని, కుట్టుపని, వడ్రంగము, పట్టుపరిశ్రమ మున్నగు వృత్తి విద్యలు నేర్పబడేవి. సాంకేతికవస్తుప్రదర్శనలలో ఈ ఆశ్రమంలోని పిల్లలు నిర్మించిన హస్తకళాఖండాలు ఎన్నో బహుమతులు అందుకొన్నాయి.

అఖండానందస్వామి పర్యవేక్షణలో ఈ ఆశ్రమం ఎంతో పురోభివృద్ధి చెందింది. ఆశ్రమంలోని పిల్లల చదువుసంధ్యల విషయంలో మన స్వామి ఎంతో శ్రద్ధ తీసుకునేవారు. అంతేకాక, ఆ బాలుర ఆధ్యాత్మికశిక్షణ విషయంలో కూడా అఖండానందస్వామి ఎంతయో శ్రద్ధ గైకొనెడివారు. బాలురిచేత ఉదయము, సాయంత్రము తప్పనిసరిగ ప్రార్థన చేయించేవారు. రామాయణ, మహాభారతాది గ్రంథములనుండి కమనీయఘట్టములు చదివి వివ్పించి బాలురకు అర్థం అయేటట్లు బోధించేవారు. ఆశ్రమంలో అనాథులను చేర్చుకోవడంలో ఏ విధమయిన వివక్షతా చూపపడేదికాదు. ఆశ్రమంలో చేరినవారిలో కొందరు మహమ్మదీయబాలురు కూడా ఉన్నారు. అఖండానందస్వామి తన బోధనల ద్వారాను, చేతలద్వారాను ఆశ్రమంలోని బాలురను ఆదర్శపథంలో నడిపేవారు. వారిని సేవాకార్యముల వైపు ఆసక్తులను చేసేవారు. చుట్టుప్రక్కల అంటురోగాలు వ్యాపించడంగాని, ఆపదలు వాటిల్లడంగాని సంభవిస్తే అఖండానందస్వామి అచటకు హుటాహుటిని పయనమైపోయేవారు. తాను మార్గదర్శకులుగ నుండి, పిల్లలచేత సేవాకార్యక్రమాలు నిర్వర్తింప జేసేవారు. స్వామి పర్యవేక్షణలో రామకృష్ణాశ్రమం బాలురు వందలాది రోగులకు శుశ్రూషగావించి రక్షించడమేకాక, అంటురోగాలు ప్రబలిన సమయంలో వివిధ నిరోధక చర్యలు తీసుకొని ప్రజల్ని రక్షించియున్నారు. ఒక వంకనిక్కడ రామకృష్ణాశ్రమంలో తల మున్కలుగా కార్యభార నిమగ్నలయి ఉన్నా, అఖండానందస్వామికి ఎంతటి సుమార ప్రాంతాలలో అయినా ప్రజలు ఆపదల పాలయినారన్న వార్త చెవిన పడిన చాలును; అచటకు హుటాహుటిని పరువులెత్తి సహాయకార్యక్రమాలు అమలుజరిపేవారు. బీహారు రాష్ట్రంలోని భగల్పూరు జిల్లాలో ఘోఘా ప్రాంతంలో వరదలురాగా, అఖండానందస్వామి అచటకుపోయి పదివారములపాటు యాభై గ్రామాలలోని వరద బాధితులకు సహాయంచేసి ఆదుకున్నారు. కలరా వ్యాధి సోకిన ప్రజలకు స్వయముగ పరిచర్యలు గావించి రక్షించారు. అదే విధముగా, 1934లో బీహారులో సంభవించిన భూకంపము తాకిడికి నిరాశ్రయులయిన జనులను ఓదార్చుటకు స్వామి గావించిన సేవలు చిరస్మరణీయములు. ఆ సమయంలో స్వామి తాను స్వయముగ మాంఘీర్, భగల్పూర్ ప్రాంతములలో పర్యటించి, శ్రీరామకృష్ణమఠము నిర్వహిస్తున్న పునరావాసకార్యక్రమములకు నూతన ఉత్తేజాన్ని కలుగజేసారు. వాంఛారహితము, అవ్యాజప్రేమాన్వితము అయిన ఈ రకపు సేవాకార్యక్రమంలో స్వామి జీవితం పండి ఫలించినదని చెప్పవచ్చును। ఆయన దృష్టికి కష్టముల పాలైన దీనులందరూ మూర్తీభవించిన దేవతా ప్రతిరూపులే। వారిని సేవించి తరించడమే సరియైన మార్గమని అఖండానందస్వామి విశ్వాసం. "....
..........ఈ దీనులే మీ కర్చనీయులని గ్రహింపుడు. వారిని గూర్చియే స్మరింపుడు. వారి సముద్ధరణార్థమే కృషి చేయుడు. వారి నిమిత్తమే ప్రార్థింపుడు—" అనుచు దరిద్రనారాయణార్చన విషయమై వివేకానందస్వామి యొసంగిన దివ్యసందేశమును అక్షరాలా పాటించి చూపిన ఆదర్శమూర్తి మన అఖండానందస్వామి.

పేరుప్రతిష్ఠలకై ప్రాకులాడక, ప్రశాంతముగా పని చేసుకుపోవడం మన స్వామికి సహజలక్షణం. ఒక ప్రక్క తన ఆరోగ్యం సరిగా లేకపోయినా, సార్గచ్ఛిలోని గ్రామాభివృద్ధి కార్యక్రమాలలో ఆయన ఎడతెగని ఆసక్తిని కనబరచేవారు. 1925లో శ్రీరామకృష్ణమఠమునకు ఉపాధ్యక్షుడుగా ఎన్నికయిన అఖండానందస్వామి, ఆ తర్వాత, శివానందస్వామి నిర్యాణానంతరం 1934లో మఠాధ్యక్షులయ్యారు. అందువల్ల ఆయన బేలూరులో ఉండడం అవసరమయింది. అయినా కూడా, అప్పటికి సార్గచ్ఛి గ్రామం అన్నా అక్కడి కార్యక్రమాలన్నా, ఆశ్రమంలోని అనాథ

బాలురన్నా ఆయన ప్రత్యేకమయిన శ్రద్ధ తీసుకోడం మాత్రం మానలేదు.

అఖండానందస్వామికి గ్రంథపఠనమందు ఆసక్తి మెండు. అనేక విషయముల గూర్చి ఎన్నెన్నో పుస్తకాలు చదివి అపారమయిన విజ్ఞానాన్ని ఆయన ప్రోగుచేసుకొన్నారు. ఆయన జ్ఞాపకశక్తి అత్యంత ఆశ్చర్య జనకమయినది. పైగా, ఆయన గొప్ప సంభాషణాచతురుడు. చేత పైసా అయినా లేకుండా పరివ్రాజకుడుగా ఆయన గావించిన పర్యటనలు, ఆ పర్యటనలలో ఆయన కెదురయిన అనుభవాలు కథలు-గాథలుగా ప్రసిద్ధి కెక్కాయి. పలుభాషలు నేర్చిన పండితుడు మన స్వామి. సంస్కృత, ఆంగ్ల, హిందీ, వంగ భాషలలో ఆయన గొప్ప పండితుడు. టిబెట్టుభాష ఆయనకు కొట్టిన పిండి. వేదసంహితలలోని అనేక భాగాలను ఉటంకిస్తూ, వాటి అర్థాన్ని విడమరిచి చెప్పడం అంటే ఆయనకెంతో ఇష్టమయిన వ్యాసంగం. మాతృభాష (వంగభాష)లో ఆయన చెయితిరిగిన రచయిత. ''టిబెట్టులో మూడు సంవత్సరములు'' —అన్న శీర్షికతో తన స్వానుభవాల్ని గురించి ఉద్బోధన పత్రికలో ఆయన వ్యాసాలు వ్రాస్తుండేవారు. అట్లాగే నిజజీవితంలోని అనుభవాలు—జ్ఞాపకాలు గురించి వసుమతి పత్రికలో ఆయన వ్రాస్తూండేవారు. ఇవి చదువుతున్న పాఠకులకు చక్కని స్ఫూర్తిని కలుగజేసేవి. ప్రజలముందు బహిరంగమయిన ఉపన్యాసములివ్వడం అంటేమాత్రం స్వామికి అంతగా ఇష్టం ఉండేదికాదు. కాని, ఏ విధమయిన పరిశ్రమా అవసరంలేకనే అప్పటికప్పుడు మాట్లాడమన్నా చక్కని ఉపన్యాసం ఈయగల సమర్థుడాయన.

గొప్ప మాటకారి అయిన అఖండానందస్వామి మంచి హాస్యప్రియుడు కూడాను. గంభీరమయిన చర్చ కొనసాగుతున్న సమయంలో, మధ్యమధ్యన పానకములో మిరియపుపొడి మాదిరిగ ఒక చక్కని చమత్కార విషయాన్ని ముచ్చటించి ఆయన శ్రోతలనందర్ని ఆనందపరవశుల్ని గావించేవారు. ఇంతటి హాస్యప్రియుడు కావడం వల్లనే, స్వామిని సోదరశిష్యులుకూడా అప్పుడప్పుడు నిస్సంకోచంగా ఆటలు పట్టించేవారు. ఒకసారి అఖండానందస్వామి బేలూరు మఠమునకు వచ్చి కొన్నినాళ్లుండిన పిమ్మట సార్గచ్ఛికి తిరుగు ప్రయాణమయ్యారు. బ్రహ్మానందస్వామి మాత్రము మరికొన్నాళ్లు బేలూరుమఠమున గడుపవలసినదిగా అఖండానందస్వామిని ఎంతయో బలవంతము చేసారు. కాని, తన ''రామకృష్ణాశ్రమము''నకు పోక తప్పదని అఖండానందస్వామి మరునాటి వేకువనే రైల్వేస్టేషనుకు వెళ్ళి రైలెక్కి ప్రయాణం అగుటకు నిశ్చయించాడు. వేకువనే మన స్వామిని రైల్వేస్టేషనుకు గొనిపోవుటకై బ్రహ్మానందస్వామి ఒక పాలకిని రప్పించి, పల్లకీ బోయీల చెవులో నేదియో రహస్యము చెప్పి అఖండానందస్వామికి వీడ్కోలు పలికెను. మనస్వామి పాలకినెక్కి తెరలు దించి కూర్చొనెను. బోయీలు ''ఓం ఓం సవారి'' అని అనుస్తూ నడుస్తున్నారు. కాని, బ్రహ్మానందస్వామి ఆదేశానుసారము వారు మఠము దాటి బయటకు అడుగుపెట్టనే లేదు. ఆవరణ లోపలనే త్రిప్పి త్రిప్పి తెల్లవారుసరికి పల్లకిని బయలుదేరిన చోటనే దింపిరి. రైల్వేస్టేషనుకు చేరితిననుకొని అఖండానందస్వామి పల్లకి దిగి బయటకురాగా, ఎదురుగా బ్రహ్మానందస్వామి ప్రత్యక్షమై స్వాగతము పల్కెను!! జరిగిన చమత్కారమునకు సోదరశిష్యులిర్వురును పసిబాలకుల సగిది నవ్వుకొనిరి.

శ్రీరామకృష్ణమఠమునకు అధ్యక్షపదవినలంకరించిన పిమ్మట మన అఖండానందస్వామి భక్తులకు దీక్షనొసగవలసిన పని పడింది. ఈ పని మొదట్లో ఆయనకంతగా ఇష్టం ఉండేదికాదు. కాని, రానురాను శిష్యులకు మంత్రదీక్షనివ్వడంలో స్వామికిగల సంశయాలు, బిడియము అన్నీ తొలగిపోయాయి. ఆయన జీవితంలోని చివరి మూడు సంవత్సరములలోను ఆడా, మగా అనే భేదమును కూడ పాటింపక అఖండానందస్వామి అనేకమంది శిష్యులకు మంత్రదీక్షనొసగి అనుగ్రహించారు. అయితే, మంత్రదీక్ష గైకొనెడి వారితో మాత్రం ''నిత్యజీవితములో మీరు అతి పవిత్రమయిన నడవడిక కల్గియుండాలి'' అని పలుకుచేవారు.

ఇంక ఒక సంవత్సరమునకు తాను చనిపోవుదును అనే విషయం స్వామికి స్ఫురించింది. తన శిష్యులలో కొందరికాయన ఈ విషయాన్ని తెలియజేసియున్నారు. ఆ సంవత్సరకాలము అనునిత్యం తన సమక్షమున రామా

యణ పారాయణ జరిపించుకొని వింటూ ఉండేవారు. సార్గచ్ఛిలోని రామకృష్ణ ఆశ్రమంలో వసంతపూజ [వసంత ఋతువులో జరిపే దుర్గామాత ఆరాధనోత్సవం] నిర్వహించాలనే కోరిక కూడా ఆయనకు కల్గింది. కాని ఈ వసంత పూజ విషయంలో అఖండానందస్వామికి ఒక అనుమానం కూడా ఉంది. అంతకుముందు బ్రహ్మానందస్వామి, శివానందస్వామి ఇద్దరూకూడా వసంతపూజ జరపాలని ఆకాంక్షించి, ఆ ఉత్సవ పరిసమాప్తిని చూడకుండానే పరమపదించారు. అందుచేత తానుకూడా ఉత్సవం చూసేవరకు బ్రతుకుతానో లేదో అనే అనుమానం స్వామికి కల్గింది. సార్గచ్ఛిలోని రామకృష్ణాశ్రమంలో ఒక చిన్న కుటీరం నిర్మించి ఆశ్రమవాసులతో ఇట్లా అన్నారు: "దుర్గా పూజను చూచేవరకు నేను జీవించకపోతే; కనీసం దుర్గామాతకు ఈ మంటపాన్ని నిర్మించానన్న సంతృప్తి అయినా నాకు మిగులుతుంది. మిగిలిన కార్యక్రమాన్ని మీరు కొనసాగించి పూర్తిచేయండి."

సార్గచ్ఛిని, అక్కడి ఆశ్రమాన్ని అఖండానందస్వామి ఎంతగా అభిమానించినా; తన ఆఖరు శ్వాసను మాత్రం బేలూరుమఠంలోనే వదలిపెట్టాలని ఆకాంక్షించారు. వివేకానందస్వామి, బ్రహ్మానందస్వామి, శివానందస్వామి మున్నగు తన ప్రియతమసోదరస్వామిబృందపు జ్ఞాపకములతో పవిత్రవంతమయిన బేలూరుమఠంలో తన శరీరాన్ని విడువవలెనని ఆయన అభిమతం. వైద్య సదుపాయం నిమిత్తం అఖండానందస్వామిని 1937లో సార్గచ్ఛినుంచి కలకత్తాలోని బేలూరుమఠానికి తరలించారు. అక్కడనే ఆయన 1937 సం॥ ఫిబ్రవరి ఏడవతేదీన మహాసమాధిగతులయ్యారు.

చనిపోవుటకు ముందు అఖండానందస్వామి మాయావతిలోని అద్వైతాశ్రమానికి ఒక లేఖ వ్రాస్తూ 1927 ఏప్రిలునెల "ప్రబుద్ధభారత" సంచికలో "నవ్యహైందవము" శీర్షికలో ప్రచురితమైన వ్యాసంలోని ఒక సంస్కృత శ్లోకం కావాలని వ్రాశారు. ఆ శ్లోకం ఇది:-

న త్వహం కామయే రాజ్యం న స్వర్గం నాఽపునర్భవం।
కామయే దుఃఖతప్తానాం ప్రాణినామార్తినాశనమ్॥

ఐహికమయిన భూలోకరాజ్యమునుగాని, స్వర్గ రాజ్యమునుగాని నేను కోరుటలేదు. మోక్షమును కూడ నేను ఆకాంక్షించుటలేదు. నేను కోరుకొనునది ఒక్కటే:— శరీరధారులకు ఆపదవచ్చినపుడు వారి ఆపదలు మాన్పి వారికి సుఖంబులు కల్గసేయుట మాత్రమే.

వాస్తవముగా అఖండానందస్వామి జీవితం యావత్తూ ఈ శ్లోకంలోని భావానికి నూరుపాళ్లు అనుగుణముగా గడచినదనడంలో సందేహం ఏమీ లేదు.

# లేక నేను లేను

నీ అందమైన మోవికి
నే మురళి నౌతా!
నీ గుండెలోని గానానికి
నే రూప మౌతా!
యమునా తీరాన
వెన్నెల సమయాన
బ్రతుకు నే మురళి చేసి
నీ మోవికి అందిస్తా!
నీవు పలికించు రాగమే
నా రాగము
నీవు లేక నేను లేననే భావమూ
ఏవిధి త్రిప్పినా!
ఏ చేష్ట చూపినా!
నీదే నీదే భారమూ!!

-బద్వేలి రమేష్.

# ప్రశ్న సరియైనదైతే సమాధానం తప్పక దొరుకుతుంది

స్వామి స్వాత్మానంద

అది 1977 సం॥. ఏ ఋతువు కార్యక్రమము ఆ ఋతువు చేసుకుంటూ పోతూ వుంది. పంటలు బాగా పండి రైతులకు సంతోషాన్ని కలిగించాయి. కాని అన్ని రోజులు మనవి కానటులనే అన్ని ఆశలు మనవి కావు. అక్టోబరు నెలలో వర్షాలు విపరీతంగా తమిళ నాడులో పడ్డాయి. ఎంత ఎక్కువ అంటే చెరువులు, నదులు కట్టలు తెంచుకొని ఊరు, పొలం అనే భేదం లేకుండా అడ్డువచ్చిన ఇండ్లను ధ్వంసించుకొని ధన, ప్రాణాలను బలిగొంటూ ప్రవహించుకొని పోయాయి. ఇదంతా గాలివాన ప్రభావమని మన వాతావరణఅధికారులు చెప్పారు. శ్రీరంగం, తిరుచ్చి, రామనాథపురం మున్నగు ప్రదేశాలు విపరీతంగా నష్టపోయాయి. వీరికి సహాయం చేయుడంకోసం రామకృష్ణమిషన్ మద్రాసువారు ముందుకు వచ్చి సహాయకార్యక్రమాలు మొదలు పెట్టారు. ఇలా మొదలుపెట్టిన కొద్దిరోజులకే పులిమీద పుట్ర అన్నట్లు మరియొక్క విపత్తు వచ్చిపడింది.

తిరుచ్చిజిల్లాను తుడిచిపెట్టుకొని పోయిన గాలివాన తిరుగు ప్రయాణంలో మళ్ళీ నాగపట్టణ ప్రాంతాన్ని తాకవచ్చని అధికారులు అంచనా వేశారు. ప్రకృతి విలయతాండవమాడబోతూవుంటే ఈ అంచనాలు, ఈ లెక్కలు ఏం చేయగలవు? ఈ వార్తలు యిలా వుంటూవుండగానే, మద్రాసు పట్టణాన్ని తాకవచ్చని మరి యొక తాజావార్త వచ్చింది. మద్రాసుపట్టణప్రజలు ఆఫీసులన్నీ వదలివేసి మధ్యాహ్నం 2 గంటలకే యిళ్ళు చేరుకున్నారు. పట్టణపౌరులు, అధికారులు గాలివానకై ఎదురుచూస్తూవున్నారు. కాని పట్టణమంటే తుఫానుకుకూడ భయమేమో! అది మద్రాసును తాకకుండా యింకా ఎగువకు వచ్చి పల్లెలను తాకింది.

పచ్చటి వరిపొలాలు, కృష్ణానది జలాలు చూసి ఆకర్షించబడిందేమో ఈ తుఫాను 19 నవంబరు 1977లో దివ్యసీమగా వున్న దివిసీమను ఒకేఒకగంట వ్యవధిలో దిబ్బలసీమగా మార్చివేసినది. ఆనాటి దృశ్యాలు, ఆర్తనాదాలు, విలాపాలు మహాభారతయుద్ధానికి, కళింగయుద్ధానికి తీసిపోవు. ఎక్కడ చూసిన పీనుగుల ప్రోవులు. పిల్లలు పోయిన తల్లుల విలాపాలు, తల్లులు పోయిన పిల్లల ఆక్రందనలు, భార్యాపిల్లలను పోగొట్టుకొనిన మగవారి దుఃఖము. వీటన్నిటిని చూస్తే ఏ హృదయం చలించదు! ఏ హృదయం ద్రవించదు! ఇందువలననే దేశ, విదేశప్రజలు వెనువెంటనే వారికి చేయూతనిచ్చారు. ఎంతో మంది సహృదయుల సహకారంతో శ్రీరామకృష్ణమిషన్, రాజమహేంద్రవరం ఈ తుఫాను బాధితులకు నవంబరు 22 నుండి తిండి, బట్ట తదితర సౌఖ్యములనిచ్చి వారిని ఆదుకొన్నది.

తక్షణచర్యగా తిండి బట్ట యిచ్చుటయే గాక, శాశ్వతముగ వారికి రక్షణ కల్పించడం ఎంతైనా అవసరం అని ఆ దివిసీమను చూచిన వారికందరికి అనిపించింది. కాని ఎటువంటి రక్షణ కల్పించాలి అనేదే అందరి ప్రశ్న.

ప్రశ్న సరియైనదైతే సమాధానం తప్పక

దొరుకుతుంది అని అందరికి తెలిసిన విషయమే. దివిసీమలో వరదతాకిడికి తట్టుకొని అనేక మంది ప్రాణములను కాపాడిన దేవాలయములు, పాఠశాలలు వీరి ప్రశ్నకు సరియైన సమాధానాలయినవి.

అక్కడ జరిగిన ఒక సంఘటన మన విషయాన్ని ఋజువు చేస్తుంది. దివిసీమలో ఒక మారుమూల గ్రామం 'ఇరాలి'. అక్కడ పాకలు తప్ప మేడలు లేవు. వ్యవసాయ కూలీలైన ఆ ఊరి ప్రజలకు భక్తి ఎక్కువ. అందుచే శ్రీరామునికి మాత్రము ఇటికగోడలతో మంచి మందిరం కట్టి ఆయనను అందులో ప్రతిష్ఠ చేసారు. 1977 సం॥ నవంబరు 19వ తారీఖున ఎవరి పనులలో వారు తిరుగుతున్నారు. ఉదయంనుంచి పడుతున్న వాన తుంపర్లు మధ్యాహ్నం ఆగిపోయాయి. అందువల్ల యింటిలోని జనం పైకి వచ్చి వారి వారి పనులలో తిరుగుతున్నారు. ఒకగంటవరకు వాతావరణం ఆహ్లాదకరంగానే వుంది. ఆ తరువాత చిరు గాలి వీచడం ప్రారంభించింది : ఆ గాలి చూస్తూవుండగానే పెద్దదవుతూ వచ్చింది. ఆ గాలి ఒత్తిడి చూసి తాటాకులు ఎగిరిపోతాయేమో యని దొరికిన తాడు పెట్టి గట్టిగ పాకలను కట్టారు. కాని ఏం లాభం? గాలి ధాటికి పెద్దపెద్ద యినుప దూలాలే రూపురేఖలు లేక వంకర్లు తిరిగిపోతే ఈ తాటాకులు ఎక్కడ ఆగుతాయి! అసహాయస్థితిలో వారు ఆకాశం పైకి చూస్తే నల్లటి కారుమేఘాలు అన్ని వైపులనుండి కమ్ముకుంటున్నాయి. వచ్చే ప్రమాదాన్ని గుర్తించి ఆ ఊరిపెద్ద ఆ ఊరి వారినందరిని రామాలయంలోకి వచ్చివేయమని లు వేయడం మొదలుపెట్టాడు. ఆ కేకలు విని అందరు దేవాలయంలోకి దారి తీసారు. అక్కడ చోటు లేక కొందరు దగ్గరగ వున్న ఒక పెద్ద మట్టిగోడల యింటిలో తలదాచుకున్నారు. వర్షం పెద్దదవుతూ వచ్చింది అదే సమయంలో సముద్రంలో గాలిపే కాంతి, పెద్దశబ్దం అందరిని ఆశ్చర్యపరచింది. అప్పటికి షుమారు సాయంత్రం గం. 3-30 అవుతుంది. అంతే సముద్రంనుండి వెల్లువ ప్రచండవేగంతో ప్రజలలోకి చొచ్చుకు వచ్చింది. ఆ ప్రవాహవేగానికి ఆవులు గేదెలు, కోళ్ళు, ఇండ్లలో వున్న సామాన్లు బెండు ముక్కలలాగ కొట్టుకుపోవడం మొదలు పెట్టాయి. మట్టిగోడలు నానిపడే చప్పుళ్లు అందరికి వినవస్తున్నాయి. ఇక ఆ మట్టి యింట్లో వుంటే ప్రయోజనం లేదని అక్కడ వున్న ఇరువదిమంది రెండు అంగలలో చేరగల రామాలయంవైపు పరుగెత్తారు. కాని ప్రవాహవేగానికి తట్టుకోలేక వారిలో పదహారుమంది అందరూ చూస్తూ వుండగ కొట్టుకుపోయారు. ఎవరు మాత్రం ఏం చేయగలరు? రక్షించాలనే కోరిక వున్నా ఎవరు ఏం చేయలేకపోయారు. అప్పటి ఆ గ్రామస్థుల స్థితి ఎవరూ వర్ణించలేరు. గుడికి చేరిన నలుగురిని లోపలకు తీసుకొని కొంత ఊరట పొందారు.

ఏదో గండం గడిచింది. గుడిలోని వారేనా క్షేమంగా వున్నారనుకొంటే అదీ జరగలేదు. సిమ్మెంటు పూతలేని అడుసుతో కట్టిన ఆ రామాలయం వెనుకగోడ ఉన్నట్లుండి నేల కొరిగిపోయింది. ఆ గోడ పడడం అక్కడున్న వారు మాయంకావడం ఒకసారే జరిగింది. ఇక మిగిలిన ప్రజలందరు ఖంగారు పడిపోయి దిక్కుతోచక ఆ రామాలయానికి వున్న యినప ఊచలు పట్టుకొని ప్రాణాల్ని కాపాడుకున్నారు.

ఈ వెల్లువ వచ్చినప్పుడు ఎంత మందిని పొట్టన పెట్టుకుందో వెనుకకు తిరిగిపోయే

టప్పుడు అంతకన్నా ఎక్కువ మందిని బలిగొన్నదని అచ్చటివారి అభిప్రాయము. ఈ విధంగా నానా భీభత్సము చేసిన ఆ వెల్లువ ధాటికి ఆగినవి ఊళ్లో వున్న సిమ్మెంటు కట్టడాలే. అందుచేత, స్వచ్ఛంద సంస్థలు ప్రభుత్వం ఈ ఉప్పెన బాధితులకు సిమ్మెంటు కట్టడాలే యివ్వాలని నిర్ణయించారు.

ప్రభుత్వమునకు అండదండగా వుండి ఈ స్వచ్ఛండసంస్థలు కార్యరంగంలో ప్రవేశించాయి. వీటిలో ముఖ్యమైనవి: (శ్రీ)రామకృష్ణ మిషన్ (2) ఆర్. ఎస్. ఎస్. (3) రెడ్ క్రాస్ (4) టాటా (5) ఆర్. టి. సి. (6) ఆర్. & బి. యింక యిలాంటివి ఎన్నో.

శ్రీరామకృష్ణామిషన్ వారు పెద్ద ఎత్తున కార్యరంగంలో దిగారు. ఆ నాటి నష్టం, దుఃఖము చూసిన ఎవరైనా కష్టానికి వెనుకాడకుండ ముందుకు రారా! మిషన్ వారు మొత్తము ఒక వేయి యిండ్లు కట్టడానికి పూనుకున్నారు. ఎటువంటి యిండ్లు కట్టాలో తెలిసినప్పటికి ఎలా కట్టాలో అన్న అంశం మీద చాలా ప్రశ్నలు మొలకెత్తాయి. అప్పటికి నలుగురికి తెలిసిన కట్టడాలను, క్రొత్తగా ప్రవేశపెట్టిన కట్టడాలను పరిశీలించారు. అన్నిటిలోకి ఆర్. కృష్ణ అయ్యర్ (మద్రాసు)గారి, కట్టే పద్ధతి, ఇంటినమూనా మిషన్ వారికి నచ్చింది. ఆవిధంగా భవననిర్మాణము చేయగలమని రామకృష్ణమిషన్ వారు ఆంధ్ర ప్రదేశ్ గవర్నమెంటుకు తెలియజేసారు. అచ్చటి నిపుణులు, విదేశీ నిపుణులు కలసి ఈ పద్ధతి మంచిదే అని చెప్పాక మిషన్ వారు జనవరి 8వ తారీఖు 1978 సం॥లో కృష్ణానది పాయనానుకొనియున్న పులిగడ్డ అనే ఊరి వద్ద వారి నివాసమేర్పరచుకొని, కట్టడానికి పనికి వచ్చే యంత్రసామగ్రినంత అక్కడ నెలకొల్పారు.

మనం నిత్యం చూసే ఇండ్ల నిర్మాణంకన్న ఈ యింటి నిర్మాణం వేరు. అందువల్ల ఆ యింటి నిర్మాణం గురించి యిక్కడ వివరంగా తెలుసుకుందాము. ఈ యిల్లు 12 అంగుళాల చతురం కలిగిన సిమ్మెంటు రాళ్లతో కడతారు. 10 అంగుళాల చతురం కలిగిన సిమ్మెంటు రాళ్ళతో యింటి కప్పు కడతారు. గోడ మందం నాలుగు అంగుళాలు మాత్రమే. గుమ్మాలు సిమ్మెంటుతో చేస్తారు. కట్టడంలో ఉపయోగించే 12" 10" రాళ్ళను ఎలా చేస్తారు? దీనికి విద్యుచ్ఛక్తితో నడిచే బామ్మాప్రెస్సును ఉపయోగిస్తారు. 12" కు సరిపోయే మూసలో సిమ్మెంటు, యిసుక 1 : 5 నిష్పత్తిలో బాగా కలిపి ఆ మిశ్రమాన్ని ఆ మూసలో పోసి ఆ మూసను బామ్మాప్రెస్సు కింద పెట్టి నొక్కుతారు. అలా నొక్కినప్పుడు 2 టన్నులు ఒత్తిడి ఆ సిమ్మెంటు మిశ్రమముపై బడుతుంది. ఆ తరువాత దానిని తీసి ఒకరోజు ఆరపెట్టి నీళ్లలో పదిరోజులవరకు నానపెడతారు. ఈ సిమ్మెంటు రాళ్ళు ఎన్నిరోజులు నీళ్లలో నానితే అంత గట్టిగ తయారవుతాయి. ఈ పదిరోజుల తరువాత ఎండలో మూడురోజులు ఎండనిస్తారు. ఇప్పటికి కట్టడపు రాళ్లలో ఒక భాగం తయారయ్యిందన్నమాట. ఈ రాళ్లను వేరొక చోటికి తీసుకువెళ్లి అంచువెంబడి ఒక అంగుళములోనికి అంగుళంన్నర ఎత్తు, అంగుళంన్నర వెడల్పుగల చిన్న సిమ్మెంటు చట్టాన్ని కట్టి దానిపైన మరియొక రాయిని అతికిస్తారు. అప్పటికి ఒక కట్టడపు రాయి తయారవుతుంది. ఒక మాటలో చెప్పాలంటే పదకొండు అంగుళాల సిమ్మెంటు చట్రానికి పన్నెండు అంగు

శాల రెండు సిమ్మెంటు రాళ్లను చెరొక ప్రక్క సిమ్మెంటుతో అతికిస్తారన్నమాట. ఈ చట్రం వల్ల అతికించిన రెండు రాళ్ళ మధ్యన ఖాళీ ఏర్పడుతుంది. ఈ ఖాళీవల్ల బయట వేడికన్న ఇంటిలోపల వేడి రెండు, మూడు డిగ్రీలు తక్కువ వుంటుంది. గుమ్మాలు, కిటికీలు మాత్రము మామూలుగ ఆర్. సి. సి తో చేస్తారు.

ఈ యిల్లు కట్టడంలో కూడా ఒక ప్రత్యేకత వుంది. దీనికి లోతు పునాది అవసరం లేదు. రెండున్నర అడుగుల లోతులో పునాది త్రవ్వి, ఆర్. సి. సి.తో "ప్లింత్ బిము వలె" పునాది వేస్తారు. అడుగు, అడుగుకు 8 మి. మీటర్ల యినుప చువ్వలను ఈ పునాదికి అతికిస్తారు. ఇక పునాదినుండే కట్టడం ప్రారంభం అవుతుంది. ఈ పునాది నుండి వచ్చిన యినప చువ్వలు నిలువుగ కప్పుదాకా పోతాయి. ఈ నిలువుగ ఉన్న చువ్వలకు యింటి పరిధిలో అడ్డంగా అడుగడుగికి యింకొక చువ్వవస్తుంది. అంటే యిల్లు మొత్తం అడ్డంగా, నిలువుగా వున్న బయటకు కనబడని యినుప చువ్వలతో గట్టిగ కట్టబడి వుంటుంది. ఆ యినుప చువ్వల మధ్యనున్న చదరపు ఖాళీలలో ముందుగా తయారుచేసిన సిమ్మెంటు రాళ్లను పెట్టి వాటి మధ్య ఖాళీని సిమ్మెంటు, కంకర, యిసుక మిశ్రమంతో కూరుతారు. ఇలా ఒక యింటి నాలుగువైపుల గోడలు కట్టడానికి 638 సిమ్మెంటు రాళ్ళు పడతాయి. ఇంటి మూలలు గట్టిగ వుండడానికి 8 మి. మి. టార్ అనే యినుప చువ్వలను ఉపయోగిస్తారు. ఇలా గోడలను పూర్తిగ కట్టిన తరువాత నడికప్పు కడతారు. కట్టేపద్ధతి ఒకటే అయినా అక్కడ 8 మి. మి. టార్ యినుప చువ్వను 10" రాయిని ఉపయోగిస్తారు. నడికప్పుకు 186 రాళ్ళు పడతాయి.

ఈ పద్ధతిలో కట్టిన యిండ్లలోని సదుపాయాలు ఇవి:- తుఫాను, ఉప్పెనలను యిది తట్టుకోగలదు. ఎందువలనంటే 12 అంగుళాల చదరంతో అల్లిన యినుప చువ్వలు గట్టిబలాన్ని యిస్తాయి. మనం పెకేజిపెట్టెను స్టీలుపట్టీతో బిగిస్తాము ఎందుకో తెలుసా! అది విడిపోకుండా వుండడానికి. అది ఎలా సాధ్యం? ఒక బిందువు ఎక్కువ ఒత్తిడికి గురి అయినప్పుడు ఈ స్టీలు పట్టీ ఆపీడనాన్ని మిగతా చోటులకు బదిలీ చేస్తుంది. అదే విధంగా, గాలిపీడనానికి, వరద తాకిడికి సాధారణంయింటిలో ఒక ప్రక్క మాత్రమే గురి అవుతుంది. దానిని ఇంటిలో యితర గోడలు పంచుకోవు. అందువల్ల తాకిడికి తట్టుకోలేని గోడలు పడిపోతాయి. కాని ఇక్కడ ఈ చువ్వల చట్టం వల్ల ఈవరద ఒత్తిడి మిగతా గోడలు పంచుకుంటాయి.

రెండవ ఉపయోగం ఏమిటంటే ప్రమాదవశాన్నైనా గోడ మొత్తం కూలిపోడానికి ఆస్కారం లేదు. ఒకటి రెండు రాళ్ళుపోయినా ఈ జల్లెడవల్ల గోడ కూలిపోదు. మూడవ ఉపయోగం ఏమిటంటే వరద చాలా ఎత్తుగ వచ్చినప్పుడు యింటి కప్పు ఎక్కి కూర్చోవచ్చు. ఇల్లు సిమ్మెంటుది కావడంచేత నాని పడిపోతుందనే భయంలేదు. ఇన్ని ఉపయోగాలు ఉండబట్టి ఈ నమూనాను శ్రీ రామకృష్ణమిషన్ వారు అంగీకరించి దాని ప్రకారము యిండ్లు కట్టున్నారు.

"శ్రేయాంసి బహువిఘ్నాని" అనే ఆర్యోక్తి వుంది. ఇంత బృహత్కార్యాన్ని చేబట్టిన రామకృష్ణమిషన్ వారికి అడుగడుగున ఆటంకాలే ఎదురయ్యాయి. వాటిలో ముఖ్యమయినవి

సరియైన రోడ్లు లేకపోవడం. మిషన్ వారు దత్తత తీసుకున్న గ్రామాలన్నీ మారుమూల గ్రామాలే. రోడ్డు సౌకర్యాలు వరద ముందు నుంచే లేవు. అటువంటి స్థలాలకు తయారు చేసిన రాళ్లు, యినుపఊసలు, సిమ్మెంటు, యిసుక తీసుకు వెళ్లాలంటే సాధ్యమా! ఏ లారీవాడు, ఎంత డబ్బిచ్చినా ముందుకు వచ్చే వాడు కాదు. అందువల్ల పని చాలా వెనుక పడింది. అటువంటి సమయంలో మరియొక దారి లేక మిషన్ వారే ఒకలారీ కొన్నారు. దానికి సాయంగా పశ్చిమ వంగరాష్ట్రప్రభుత్వం, సేవాకార్యక్రమాలకుగాను బేలూరు మఠాని కిచ్చిన రెండు జపానులారీలను మఠం అవనిగడ్డకు పంపించింది. ఈ మూడు లారీల సహాయంతో పొలాలగట్ల వెంబడి అతికష్టం మీద ఇండ్లు కట్టే ప్రాంతాలకు సామానులను చేర్చే వారు. ఈ ప్రయాణాలలో ఎన్నోసార్లు తమ ప్రాణాలను కూడా లెక్క-చేయకుండా డ్రైవర్లు ఆ లారీలను నడిపారు. పొలాలనుండి లారీలు పోనీయకుండ అచ్చటి వ్యవసాయదారులు అడ్డు పడుతూ నానాయిబ్బంది పెట్టేవారు. వారిని నయానా, భయాన నచ్చచెప్పవలసి వచ్చేది. ఇలా కొనుక్కో-డానికి తిండిగింజలు లేక, త్రాగడానికి నీళ్ళు లేక పనివారు నానా యిబ్బందిపడి ఆఖరుకు ఎలా అవుతేనే పని పూర్తి చేసారు.

మారుమూల గ్రామాలకు వెళ్లి అక్కడ ఈ సిమ్మెంటు, కాంక్రీటు యిండ్లు కట్టడమే ఒక మహాకార్యంగా వుంటే బజారులో సిమ్మెంటు, ఉక్కు-ఊచలు దొరకడం బ్రహ్మ కార్యం అయ్యింది. కొన్నివేల టన్నులు సిమ్మెంటు, యినుపఊచలు ఈ కట్టడానికి ఉపయోగించారు. కాని యివి మార్కెట్టులో అంత సులభంగా లభ్యంకాలేదు. వర్తకులు చెప్పిన రేటు యిస్తామని వారి గుమ్మంముందో లేక ప్రభుత్వ కార్యాలయాల ముందో గంటలు కాదు, రోజుల తరబడి కూర్చొని వారు విసుగుతో విదిల్చినవి అతి జాగర్తగా తీసుకో వలసి వచ్చేది.

ఎన్ని కష్టాలు వచ్చినా, ఎన్ని అడ్డంకులు ఎదురైనా శ్రీ రామకృష్ణమిషన్ వారు శ్రీ రామకృష్ణుని ఆశీర్వాదములతో, వివేకానంద స్వామి ధైర్య విశ్వాసాలతో, శ్రీ శారదామాత కరుణతో దివిసీమలో యిండ్ల నిర్మాణ కార్యక్రమాన్ని చాలామట్టుకు పూర్తిచేశారు.

శ్రీ రామకృష్ణమిషన్ వారు దత్తత తీసుకొన్న గ్రామాలు అక్క-డ కట్టిన యిండ్ల వివరాలు యివి:- ఒకప్పుడు పాలకాయ తిప్ప అనబడే గ్రామాన్ని పరమహంసపురంగా 112 ఇండ్లతోను, ఒక సమాజమందిరంతోను తీర్చి దిద్దారు. రామకృష్ణపురం (గొల్లపాలెం)లో 229యిండ్లు, ఒక సమాజమందిరము కట్టారు. వివేకానందపురం (ఇరాలి)లో 148 గృహాలు ఒక సమాజమందిరం కట్టారు. నరేంద్రపురం (ఉల్లిపాలెం)లో 144యిండ్లు, స్వతంత్రపురంలో 112 యిండ్లు, కృష్ణాపురంలో 22యిండ్లు, శ్రీరాంపురంలో 41యిండ్లు, ద్వారకలో 14 యిండ్లు, ఊటగుండెంలో 187యిండ్లు నిర్మించారు. ఇప్పటికి 954యిండ్లు, 2 సమాజమందిరములు పూర్తి అయినవి. (ఒక సమాజమందిరము నిర్మాణములో వున్నది) మిగిలిన 46 యిండ్లు బసవన్నపాలెంలో నిర్మిస్తారు. ఇవేగాక రామకృష్ణాపురం, నరేంద్రపురంలో పడిపోయిన రామాలయాలను పునర్నిర్మిస్తున్నారు. ఈ మిగిలిన కార్యం కూడా త్వరగా పూర్తి కావస్తుంది.

ఇంతటి పెద్ద నిర్మాణానికి మిషన్‌కు డబ్బు ఎక్కడి నుండి వచ్చింది? ఒకొక్క యింటికి మిషనువారు ఖర్చుచేసిన సొమ్ము 5,500 రూపాయలు. అటువంటి 1,000 యిండ్లకు 55లక్షలరూపాయలు ఖర్చు. ఒకొక్క సమాజమందిరమునకు సరాసరి 2½లక్షల రూపాయలు ఖర్చు అయినది. ముప్పది అయిదు లక్షల రూపాయలు ప్రజలు, దేశ, విదేశ సంస్థలు భూరివిరాళాలు* మిషన్ వారికిచ్చి ఆదుకున్నాయి. ఆంధ్రరాష్ట్ర ప్రభుత్వము ఇరువది అయిదు లక్షలు సహాయనిధిగా యిచ్చింది.

ఇట్లు ప్రభుత్వము, ప్రజలు ఏకమై ఉప్పెనతో కొట్టుకుపోగా మిగిలినవారికి తలదాచుకోడానికే కాక ముందు ముందు ఆపదలను తట్టుకోడానికి కూడా అనువైన గృహాలను నిర్మించగలిగారు.

*భూరివిరాళా లిచ్చినవారు:

ఎన్. టి. ఆర్, ఎ. ఎన్. ఆర్ బృందం – 9,00,000 రూ.
ఈనాడు (హైదరాబాదు) – 8,79,000 ,,
ఇండియన్ ఎక్స్‌ప్రెస్ హైదరాబాదు – 8,00,000 ,,
టిండాల్ అల్యూమినియమ్ సంస్థ (బెంగుళూరు) – 2,00,000 ,,
సింధీ అసోసియేషన్ (బెంగుళూరు) – 1,50,000 ,,
ఆంధ్రభూమి (హైదరాబాదు) – 1,25,000 ,,



సమాజమందిరము, ఇరాలి (వివేకానందపురం)

# బాలల శారదాదేవి

బి. ఎస్. ఆర్. ఆంజనేయులు

## బేలూరు మఠం

శ్రీరామకృష్ణదేవుడు మహాసమాధి చెందిన తర్వాత సన్యాసం తీసుకున్న వారిలో నరేంద్రుడు ముఖ్యుడు. అతడే స్వామి వివేకానంద. కాలినడకమీద దేశం అంత చూచాడు. ఎక్కడ చూచినా ప్రజలబాధ ఆయనకు కనుపించింది.

"ఇంత గొప్పదేశం యిలా అయిపోయింది. దీన్ని పూర్వపుస్థితికి తీసుకురావటం యెలాగ?" అనే దిగులు కలిగింది. కన్యాకుమారి వెళ్లాడు. అక్కడ సముద్రంలో కొంత దూరంలో ఒక గుట్ట వున్నది. ఈదుకుంటూ దాన్ని చేరి దానిపై ధ్యానంచేశాడు. శ్రీరామకృష్ణ దేవుడు సముద్రంమీద నడుస్తూ స్వామిజీని పిలుస్తున్నట్లు కనిపించింది. ఇతరదేశాలకు పోవాలనీ, అక్కడ మనధర్మం బోధించి, ధనం సంపాదించి ఈ దేశప్రజలకు సాయం చెయ్యాలని తోచింది. కాని పోవటానికి నిర్ణయం తీసుకోలేకపోయినాడు.

అర్జునుడు భారతయుద్ధం చెయ్యాలని వచ్చాడు. కాని తన బంధువులను చంపాల్సి వస్తే ఏమీతోచలేదు. కృష్ణుణ్ణి శరణుజొచ్చాడు. అదేవిధంగా తల్లిఅయిన శారదాదేవికి తన సంగతి వ్రాశాడు.

అప్పుడు శారదాదేవికి ఒక దృశ్యం కనుపించింది. శ్రీరామకృష్ణదేవుడు గంగలో దిగాడు. దానిలో ఆయన శరీరం కరిగిపోయింది. వివేకానందుడు ఆ జలంతీసి "జయ శ్రీరామ కృష్ణ" అని అంటూ ప్రజలమీద చల్లుతున్నట్లు చూచింది. వెంటనే ఆమె వివేకానందుని ఆశీర్వదిస్తూ యితరదేశాలకు పొమ్మని ఉత్తరం వ్రాసింది.

1893 సం॥ మే 31 వ తేదిన ఆయన అమెరికా బయలుదేరాడు. అక్కడ సర్వమత మహాసభలో ఉపన్యసించాడు. దానితో ఆయనకు గొప్పపేరు వచ్చింది. ఆయన ఉపన్యాసాలు విన్నతర్వాత అక్కడివారికి భారత దేశపు గొప్పతనం అర్థమయింది. వారు ఈదేశాన్ని గౌరవించారు. మనదేశం తిరిగివచ్చినతర్వాత 1899 జనవరిలో గంగ ఒడ్డున ఒక మఠం కట్టించాడు. అది దక్షిణేశ్వరానికి ఆవలి ఒడ్డున ఉన్నది. దానినే బేలూరుమఠం అంటారు. ఆ మఠంలో శ్రీరామకృష్ణదేవుని ప్రతిష్ఠింపజేశాడు. శ్రీరామకృష్ణుని బోధనలు యిక్కడనుండే ప్రపంచం నలుమూలలకు వ్యాప్తిచెందుతున్నాయి. అక్కడ శ్రీశారదాదేవి పాదధూళికూడా ఉంచాడు. ఆ ధూళి యీరోజుకుకూడా పూజింపబడుతున్నది. శారదాదేవి అంటే వివేకానంద స్వామికి ఎంతగౌరవమో చూడండి. ఆమఠంచూచి శారదాదేవి ఎంతో సంతృప్తిపడింది.

తల్లి దీవెన పొందుచు తనయుడేగి<br>
అమెరికాయందు చాల ప్రఖ్యాతిగాంచె<br>
వచ్చి బేలూరులో గురువరుని పేర<br>
ప్రేమ గట్టించె శ్రీరామకృష్ణ మఠము.

సంపాదకులు : స్వామి తన్మయానంద.

శ్రీ ఎమ్. బాలసుందరంగారిచే ఫ్రీడమ్ ప్రెస్, (మద్రాసు-600 021) న ముద్రింపబడి.

స్వామి తన్మయానందవారిచే శ్రీ రామకృష్ణమఠము (మద్రాసు-600 004) నుండి ప్రచురింపబడినది.

# శ్రీ రామకృష్ణ మఠ ప్రచురణములు

| పుస్తకము | వెల |
|---|---|
| శ్రీ రామకృష్ణ కథామృతము | 8-00 |
| శ్రీ రామకృష్ణ జీవితచరిత్ర | 10-00 |
| శ్రీ రామకృష్ణ బోధామృతము | 8-00 |
| శ్రీ రామకృష్ణోపనిషత్తు | 3-75 |
| శ్రీ రామకృష్ణపరమహంస నీతికథారత్నములు | 2-50 |
| గురూపదేశములు | 2-00 |
| నా గురుదేవుడు | 1-25 |
| శ్రీ రామకృష్ణ దివ్యవాణి | 1-50 |
| శ్రీ రామకృష్ణ పరమహంస జీవిత సంగ్రహము | 0-75 |
| ఆరాత్రికము మరియు | |
| శ్రీ రామనామ సంకీర్తనము | 0-50 |
| శ్రీ శారదాదేవి జీవిత చరిత్ర | 4-00 |
| శ్రీ శారదాదేవి | 2-50 |
| శ్రీ శారదా సూక్తి నవనీతము | 0-80 |
| శ్రీ వివేకానంద జీవిత చరిత్ర | 4-00 |
| బాలల వివేకానందుడు | 2-00 |
| శ్రీ వివేకానంద సంపూర్ణగ్రంథావళి | |
| 8 సంపుటముల పూర్తిసెట్టు (సాదా) | 55-00 |
| .. .. (క్యాలికో) | 61-00 |
| విడి సంపుటములు ఒక్కొక్కటి (సాదా) | 5-00 |
| .. .. (క్యాలికో) | 6-50 |
| స్వామి శిష్య సంవాదములు | 10-50 |
| సందేశ తరంగిణి (మొదటి భాగము) | 4-00 |
| .. (రెండవ భాగము) | 5-50 |
| భారత యువజనులారా! | 3-00 |
| ప్రబోధ రత్నాకరము | 8-75 |
| రాజయోగము | 6-25 |
| కర్మయోగము | 4-00 |
| భక్తియోగము | 4-00 |
| శ్రీ వివేకానందలేఖావళి (మొదటిభాగము) | 2-25 |
| .. (రెండవభాగము) | 3-00 |
| హిందూ మతము | 4-00 |

| పుస్తకము | వెల |
|---|---|
| వివేక సూర్యోదయము | 4-00 |
| అనుష్ఠాన వేదాంతము | 2-50 |
| ప్రాచ్యము - పాశ్చాత్యము | 1-25 |
| కులము, సంస్కృతి, సామ్యవాదము | 3-00 |
| భారతదేశము | 2-00 |
| భారతీయ మహిళ | 2-00 |
| నా జీవితము, జీవిత కార్యము | 1-25 |
| శ్రీ రామకృష్ణ సేవాసంస్థ : తదాదర్శములు | 0-50 |
| షికాగో నగరోపన్యాసములు | 1-00 |
| శ్రీ వివేకానంద శంఖారావము | 0-80 |
| నవీన భారత దేశము | 0-40 |
| సర్వం విష్ణుమయం జగత్ | 0-35 |
| శ్రీ వివేకానంద సింహగర్జనలు | 0-20 |
| బ్రహ్మానంద బోధనలు | 4-75 |
| తాపత్రయ చికిత్స | 0-60 |
| ముక్తిమార్గము | 0-30 |
| పారమార్థిక సంభాషణలు | 6-50 |
| నారద భక్తి సూత్రములు | 4-00 |
| శ్రీ దొడ్డ భాగవతము-మూడవ సంపుటము | 7-50 |
| దేవీమాహాత్మ్యము | 4-00 |
| శ్రీ మద్భగవద్గీత | 8-00 |
| శ్రీ మద్భగవద్గీత చిన్నసైజు | 3-00 |
| పారాయణగీత తాత్పర్యసహితము | 8-75 |
| .. మూలము | 2-00 |
| కఠోపనిషత్తు | 2-00 |
| గిరీశచంద్ర | 1-00 |
| భక్తిమార్గము | 1-00 |
| శ్రీకృష్ణవాణి | 0-80 |
| బుద్ధవాచ | 0-80 |
| క్రీస్తు సూక్తిమాల | 0-80 |
| మహమ్మదు సూక్తి మంజరి | 0-80 |
| శ్రీ విష్ణుసహస్రనామ స్తోత్రము | 1-25 |

ఇవియేకాక ఆంగ్ల, సంస్కృత, తమిళ, హిందీ, కన్నడ గ్రంథములును.

వేదాంత కేసరి (ఆంగ్లము) శ్రీ రామకృష్ణ విజయము (తమిళము)

అను మాసపత్రికలును, శ్రీ రామకృష్ణ పరమహంస, శ్రీ శారదాదేవి, శ్రీ వివేకానందస్వామి మున్నగువారి ఛాయాచిత్రములు, త్రివర్ణ చిత్రములు, తైలచిత్రములు మున్నగున వెన్నియో మా యొద్ద లభింప గలవు.

అడ్రెసు : మేనేజరు, శ్రీ రామకృష్ణ మఠము, మైలాపూరు, మద్రాసు - 600 004

సంవత్సర చందా రూ. 10-00 జీవిత చందా రూ. 125-00 విడి సంచిక 1-00 రూ

# శ్రీ రామకృష్ణ కథామృతము

నేడే కొనండి! (ప్రథమ భాగము) పదేపదే చదవండి!

శ్రీ "మ.—" చే వంగభాషలో విరచితమైన మూలగ్రంథమునుండి అనూదితము. నవభారత నిర్మాతయగు శ్రీ వివేకానందస్వామికి శ్రీరామకృష్ణ పరమహంస గురుదేవుడు. ఆ పరమహంసదేవుని దివ్య వచనామృతమును శ్రీ "మ.—" ఆనంద తన్మయతతో తాను వినినది వినినట్లుగ ఐదు భాగములుగ గ్రంథస్థ మొనర్చెను. అందు ప్రథమ భాగమిది.

ఆ అవతారమూర్తియొక్క వచనములు ఈ పుటలయందు మనస్సును పూర్తిగ ఆకట్టుకొనునట్లుగ అనువదింపబడినవి. వీనిలో పరిష్కరింపబడని తత్త్వవిషయిక సమస్యలేదు. తొలగింపబడని ఆధ్యాత్మిక సంశయము లేదు. వివరింపబడని ఆత్మవికాసక విషయములేదు. ఆసక్తికరము. ఆధ్యాత్మికులకు ఒక వరప్రసాదము.

వెల : సాదా : రూ. 8–00

పుటలు : 240 + VIII ప్రథమ ముద్రణము కాలికో : రూ. 12–00

# శ్రీ రామకృష్ణ జీవిత చరిత్ర

రచయిత : శ్రీ చిరంతనానందస్వామి

వంగభాషలోని మూలప్రమాణ గ్రంథముల ననుసరించి రచింపబడినది. ఇందు శ్రీ రామకృష్ణుని జీవితాంశములు మృదుమధురమగు తేటతెనుగున సమగ్రముగ వివరింపబడినవి. ఢిల్లీ సాహిత్య అకాడెమీ వారిచే ఉత్తమోత్తమ గ్రంథముగ నిర్ణయింపబడినవి.

శ్రీ రామకృష్ణ జీవితచరిత్ర ఆద్యంతము ఆత్మవైభవమే. దివ్యవైభవమే. ఇదియొక దెస కావ్యము. ఇంకొకదెస చరిత్రము వెరసి తత్త్వ సంహిత. లేక దివ్య కావ్యము. ఈ శ్రీ రామకృష్ణ జీవిత చరిత్ర శారదాకంఠమున ఓంకారఘంట। రోమాంచముల పంట.

—శ్రీ వేలూరి శివరామశాస్త్రి.

....విమర్శక చక్రవర్తి....కీ. శే. శ్రీ కట్టమంచి రామలింగారెడ్డిగారి శ్లాఘామోదములనందిన మీ పూర్వ గ్రంథముల విధి రచనావైదగ్ధ్యమున....మించియున్నది. విషయౌదాత్త్యము రచనౌదాత్త్యముగా పరిణమించుట స్వాభావికమే కదా సిద్ధహస్తుల చేతులతో।

—శ్రీ కందుకూరి మల్లికార్జునం.

It is bound to communicate to the **reader** the beauty and power of Sri Ramakrishna's life. —**Sri S. Radhakrishnan.**

Classic...authentic...It will be a very **valuable addition** to the Telugu literature. —The Hindu.

పుటలు : 478 + XXX వెల : రూ. 10–00

ఇట్లు వ్రాయుడు : మేనేజరు, శ్రీ రామకృష్ణమఠము, మైలాపూర్, మద్రాసు-600 004.

# శ్రీ రామకృష్ణ ప్రభ

సంపుటము 36 1979 - ఆగస్టు సంచిక 8

## విషయసూచిక



---

ఆగస్టు సెప్టంబరులో జరుగనున్న గోదావరి పుష్కరమహోత్సవములకు లక్షలాది యాత్రికులు రాజమహేంద్రవరము రానున్నారు. ఈ సందర్భమున రాజమహేంద్రవరము లోని శ్రీ రామకృష్ణ ఆశ్రమము ఒక పుస్తకశాలను ఏర్పాటు చేయబోవుచున్నది. శ్రీ రామకృష్ణమఠము ప్రచురణలన్నియు అక్కడ లభించగలవని తెలియజేయుచున్నాము.

---

శ్రీ రామకృష్ణ ప్రభ

సంవత్సర చందా: రూ. 10-00. జీవిత చందా: రూ. 125-00.

శ్రీ రామకృష్ణమఠము,

మైలాపూర్, మద్రాసు-600-004.

# చందాదారులకు - గమనిక

* శ్రీ రామకృష్ణప్రభ (ఆధ్యాత్మిక మాసపత్రిక) ప్రతి ఇంగ్లీషునెల మొదటివారములో వెలువడును.

* సంవత్సరచందా పది రూపాయలు.

* జీవితచందా నూటపాతిక రూపాయలు.

* జీవితచందాదారులు కాగోరియు ఒక్కసారిగా నూటపాతిక రూపాయలు చెల్లించలేనివారు, వాయిదాలపై (ప్రతిసారి పదిరూపాయలకు తక్కువగాకుండ) ఒక సంవత్సరకాలములో మొత్తము పైకమును చెల్లించవచ్చును.

* జీవితచందాదారులయిన ఐదేండ్లతరువాత, ఏకారణముచేనైననూ, చందా రద్దు చేసుకొనగోరువారికి, మొత్తము పైకము వాపసు చేయబడును.

* చందాదారులు కాగోరువారు ఏనెలనుండియైనను చందాదారులు కావచ్చును.

* చందాపైకమును మనియార్డర్ద్వారాగాని, పోస్టల్ ఆర్డర్ద్వారాగాని, బ్యాంక్ డ్రాఫ్ట్ద్వారాగాని ముందుగానే పంపవలెను.

* క్రొత్తగా చందాదారులుగా చేరువారు "క్రొత్త చందాదారుడను" అని తెలియజేయవలసినదిగా మనవి.

* చందాదారులయినవారు, తమ చందానంబరును (R. p.....................) గుర్తుంచుకొని ఉత్తర ప్రత్యుత్తరములలో దానిని ఉదాహరించవలెను.

> (ప్రతినెల పోస్టుద్వారా మీ కందజేయబడు రామకృష్ణప్రభ కవరుపైనుండు మీ విలాసము మీద, మీ చందానంబరు గుర్తింపబడియుండును. గమనించగలరు.)

* మీరు వ్రాయు ఉత్తరములందు, M. O. కూపనులందు మీ విలాసమును, చందానంబరును స్పష్టముగా వ్రాయవలసినదిగా మనవి.

* మీ అడ్రసు మారినపుడు మాకాసంగతి తెలియజేయగలరు.

* ప్రత్యుత్తరమపేక్షించెడి ఉత్తరములు వ్రాయువారు రిప్లయికార్డుగాని, తగినన్ని స్టాంపులుగాని పంపగలరు.

* రామకృష్ణ మఠము, మద్రాసు-4 నుండి వెలువడు అన్ని పుస్తకములధరపై రామకృష్ణ ప్రభ చందాదారులకు 5 శాతము తగ్గింపు కలదు.

# శ్రీరామకృష్ణప్రభ

సంపుటము 36 1979 – ఆగస్టు సంచిక 8

## నీ ఇంటికి ద్వారాలెన్నో

నీ ఇంటికి ద్వారాలెన్నో
దేనిగుండా రావాలో నేను ?

ప్రతి వాకిలివద్ద ఎంతోగుంపు
ఎలా వెళ్లాలో కదా నేను ?

దండిస్తారు ద్వారపాలకులు
రమ్మంటారు ఒక వరుసలో
అందరూ గ్రుద్దుకుంటూంటే ఎలా నేనువెళ్లేది?
నీ ఇంటికి ద్వారాలెన్నో దేనిగుండా రావాలో నేను ?

నీవంటే నాకెంతో ఆకర్షణ
అయితే ఇక్కడ నాలో ఎంతో సంఘర్షణ
ఈ అస్తవ్యస్తంలో దేనికని నిన్ను పిలువను?
నీ ఇంటికి ద్వారాలెన్నో, దేనిగుండా రావాలో నేను ?

నీ వైభవ కల్పనలో జగత్తు మరచి
జనం మురిసిపోతూంటే
ఎలా నిన్ను విడిచేది, ఎలా నిన్ను మరచేది?
నీ ఇంటికి ద్వారాలెన్నో దేనిగుండా రావాలో నేను?

అందరూ వెళ్ళిపోతూన్నారు
ఇంకా నావంతు రాదేమిటి?
ఇక్కడే ఓ కుటీరం వేయనా
ఆసీనుడై నీ పాట పాడేనా
ఇట తిరంగా ఉండిపోనా
అతిథివై నీవు నాగడప తొక్కితే
నీ తృప్తికై ఈ బ్రతుకునే ధారపోస్తా
నీ ఇంటికి ద్వారాలెన్నో
దేనిగుండా రావాలో నేను?

శ్రీ మైథిలీ శరణ్ గుప్తగారి హిందీగేయమునకిది అనువాదము.

అనువదించినవారు : కృష్ణప్రియ

# వేదాంతదుందుభి

స్వయముగా మన హృదయమునందును ప్రతి జీవియందును భగవంతుని గనజాలనిచో, వానిని గాంచుటకై యెచటికి బోవుట? "నీవే స్త్రీవి, నీవే పురుషుడవు, నీవే బాలికవు, నీవే బాలుడవు. కఱ్ఱనూతగా గొని తూగాడు వృద్ధుడవును నీవే. బలగర్వమున సంచరించు యువకుడవును నీవే." నీవే విశ్వమున గల సర్వము, విశ్వమునందలి యద్భుతము. అద్వితీయమునగు తత్త్వమవు, సజీవ ప్రత్యక్షదైవమవు. ఇయ్యది సాంప్రదాయికమగు భగవద్భావమునకు, — భగవంతుడెచ్చటనో తెర చాటున, అదృశ్యుడై, అగోచరుడై యుండునని తెలుపు పరంపరాగత భగవద్భావమునకు కేవల విరుద్ధముగా నున్నట్లనేకులకు దోపవచ్చును. తాము చెప్పినదానికెల్ల చిత్తమనుచు, దమ మందలింపులకు జెవియొగ్గుచు, మనకోసము తాము నిర్ణయించిన మార్గమును జవదాటక వర్తించిన యెడల, - మరణానంతరము భగవన్ముఖారవిందమును గాంచగల్గునట్లు చేయుటకు మనకధికారపత్రము నిచ్చెదమని మతగురువులు మనకభయహస్తమిచ్చుచుందురు! ఈ స్వర్గాదిభావములన్నియు అర్థరహిత మతాచార్య కైతవమునకు మాఱురూపములుగానిచో, మఱేమి?

భయమువలన నీతిధర్మములు వికాసము చెందునని భావించుటెట్లు? అసంభవము. "ఎచట నొకడన్యునిగాంచునో, ఎచట నొకడన్యుని బాధించునో, అదంతయు మాయ. అన్యునిగాంచకుండునప్పుడు, అన్యుని బాధింపకుండునప్పుడు, సర్వమాత్మమయమై భాసించునప్పుడు, ఎవ్వరి నెవ్వరు చూచుట? దేని నెవ్వరు కనుగొనుట!" సర్వమాత్మయే, సర్వము నేనే. ఇట్లు భావించు జీవుడు నిర్మలుడై యొప్పును. వానికే ప్రేమ యననేమో యర్థమగును. భయమువలన ప్రేమ కలుగజాలదు; ప్రేమనిలయము స్వాతంత్ర్యము, స్వేచ్ఛ. లోకమును నిజముగా ప్రేమింపనారంభించునప్పుడే విశ్వమానవ సౌభ్రాత్రమనగానేమో, మానవకోటి యనగానేమో, మనకు బోధపడగలదు.

విముక్తులు కండు, స్వతంత్రులు కండు; ఎవ్వరిసాయము నపేక్షింపకుడు. మీ జీవితమును గూర్చి మీరు సింహావలోకనమొనర్చితిరేని, ఇతరుల సాయమునకై సదా వ్యర్థప్రయత్నమొనర్చుచుంటిరనియునట్టి దెన్నడును ప్రాపింపనేలేదనియు గ్రహింతురని నా నిశ్చయము. ఏదేని సాయము లభించియుండెనా, అదియంతయు మీయందుండియే వెలువడియున్నది. స్వయముగా మీరు దేనికై కృషిచేసితిరో తత్ఫలమునే మీరు వడసియుందురు.

ఆశనువిడనాడుమని వేదాంతయు చాటును. మీ రాశపడుటెందులకు? సర్వము మీకుండనే యున్నది—కాదు, మీరే సర్వము, దేనికై మీరాశపడుట? ఒక రాజునకు పిచ్చియెత్తి తన దేశపురాజును గాంచవలయునని పరుగులిడగడగినాడట! తానే రాజైయుండ తనకు రాజు గాన్పించుటెట్లు? తన దేశమున ప్రతి పట్టణమునను, ప్రతిగ్రామమునను, ఇంటింటను వెదకులాడుచు, ఏడ్చుచు, బొబ్బలిడుచు నాతడు తిరుగాడినను రాజును గనజాలడు, - తానే రాజుగదా! మనమే బ్రహ్మమని తెలిసికొని బ్రహ్మదర్శనమునకై యీ మార్గాన్వేషణము విరమించుట మేలు; బ్రహ్మమని తెలిసికొనినచో, సుఖులమై సంతృప్తులమగుదుము. ఈ వెఱ్ఱివెదకులాటలన్నిటిని గట్టిపెట్టి, నాటకరంగమున నటకునివలె నీ విశ్వమున మీ మీ పాత్రానుగుణముగా నటింపుడు.

అటు లోనర్చితిరా, దృశ్యమంతయు మాఱిపోవును; శాశ్వత కారాగారమగుటకు బదులుగా నీ విశ్వమే క్రీడారంగముగా పరిణమించును; స్పర్ధకు పుట్టినిల్లగుటకు బదులు కుసుమ వికాసములతో, భ్రమరక్రీడలతో నొప్పారు సంతత వసంతనిలయమై శోభించును. ఇంతకు ముందు నరకప్రాయముగానున్న ఈప్రపంచము స్వర్గధామమై వెలయును. బద్ధుని కన్నుల కిది ఘోరయాతనానిలయము; బుద్ధుని కన్నులకో, ముక్తునికన్నులకో, ఆనందనిలయము. ఈ జీవనమే విశ్వజీవనము, స్వర్గనరకము లన్నియు నిచటనే యున్నవి. మానవుని మూలరూపములగు సమస్త దేవతలును నిచ్చటనేయున్నారు. దేవతలు తమకు ప్రతిరూపముగా మానవుని సృజింపలేదు. మానవుడే దేవతలను సృజించి యున్నాడు. ఇక నిచ్చటనే మానవ ప్రతిరూపులగు ఇంద్రుడు, వరుణుడు, విశ్వమందలి సమస్తదేవతలును గలరు. మన చిన్న చిన్న ప్రతిరూపములను మనమే మనయందుండి వెలువఱచుచున్నాము; ఈ దేవతలకు మూలికరూపములము మనమే, మనమే పూజనీయ దేవతలము, యథార్థదేవతలము; మనకంటె నన్యులు లేరు. ఇదియే వేదాంతము. ఇదియే యాచరణపరత్వము. ముక్తులమైనంతనే మతిహీనులమై సమాజమును విడనాడి, యే యరణ్యమునందో, కొండగుహాయందో మరణించుటకై పరుగెత్తనక్కఱలేదు, ఉన్నతావుననే యుందము, — విశేషమేమన, యథార్థము మనకు బోధపడును, — అంతియే. పూర్వదృశ్యమే నిలిచియుండును, కాని నూతనార్థముతో వెలయును. విశ్వమనగా నేమో మనకింకను తెలియదు; ముక్తిమూలముననే యది యెట్టిదో, దాని స్వభావమేమో తెలియగలదు. నియమమనియు విధియనియు ప్రారబ్ధమనియు చెప్పబడునదంతయు మన స్వభావమున సత్యాల్పాంశమునకు మాత్రమే వర్తించునని మనకపుడు తెలియగలదు. అది కేవలము మొకవైపు, రెండవ వైపున ముక్తి భాసించుచునే యున్నది, కాని యది మనకు దెలియలేదు. వేటకాండ్రచే తఱుమబడుచు, తన్ను రక్షించుకొనుటకై మొగము నేలను దాచుకొను కుందేటివలె దోషవిముక్తులమగుటకై మనము వ్యర్థప్రయత్న మొనర్చుచుంటిమి. మాయామోహితులమై మన స్వభావమును మఱవ యత్నించుచుంటిమి, కాని మఱవజాలకుంటిమి; అది మనలను సదా మేల్కొల్పుచు, భాషించుచునేయున్నది; మన భగవదన్వేషణము, దేవతాన్వేషణము, లేదా, బాహ్యమోక్షాన్వేషణమంతయు మన యథార్థస్వభావాన్వేషణమే కాని మఱియొకటి కాదు. మనకు వినవచ్చిన వాణిని మనము వేఱుగా తలంచితిమి. అది యగ్నియందుండియో, యొకానొక దేవతయందుండియో, సూర్యునియందుండియో, చంద్రునియందుండియో, నక్షత్రములనుండియో వెలువడినదని భ్రమించితిమి, కాని తుదకది మనయందుండియే వెలువడిన దని గ్రహించితిమి. నిత్యమోక్షమునుగూర్చి చాటు నీ శాశ్వతవాణి మనయందే కలదు. తదీయగాన వాహిని నిరంతరము ప్రవహించుచునే యున్నది. ఈ యాత్మగానమునందలి యొకయంశమే భూమియై, నియమమై, యీవిశ్వమై యున్నది, కాని యది యెప్పుడును మనదే, మనదిగనే యుండును. ఒక్కమాటలో చెప్పనెడ, మానవుని యథార్థస్థితిని గ్రహించుటయే వేదాంతాశయము; ప్రత్యక్ష బ్రహ్మస్వరూపమగు మీ సోదరమానవుని మీరు పూజింపగలరనుటయే వేదాంత సందేశము.

# శ్రీ రామకృష్ణ కథామృతము

(రెండవ భాగము)

## అధ్యాయము – 19

### దక్షిణేశ్వరమున ఈశానాది భక్తులతో

నేడు 1884 అక్టోబరు 11వ తేది శని వారము మధ్యాహ్నము రెండు గంటలైనది. శ్రీ రామకృష్ణులు చిన్నమంచముపై పరుండి మాట్లాడు చుండిరి. మాస్టరు, ప్రియముఖర్జీ నేలపై కూర్చొని యుండిరి. యదుమల్లికుని గురించి ప్రసంగము వచ్చెను అన్నిటికి లెక్కలుకట్టు స్వభావమతనిది.

శ్రీరామకృష్ణులు: యదుమల్లికుని ఇంటికి పోతిని. "బండి బాడుగ ఎంత" అని మొదటనే మమ్ములనడిగెను. "మూడురూపాయల రెండణాలు" అని ఎవరో చెప్పిరి. అటుపై నన్ను అడిగెను. అంతటితో ఆగక వాళ్ళింటి స్వంత మనిషి నొకనిని బండివానివద్దకు పోయి కనుక్కొనిరమ్మని పంపెను. "బండివాలా మూడు రూపాయల నాలగణాలు" అని చెప్పెను. (అందరు నవ్వుదురు) మరల మా దగ్గఱకు పరుగెత్తుచూ వచ్చి "బండి బాడుగ ఎంతో చెప్పండి" అనెను.

ఒక దళారీ వచ్చి "పెద్దబజారులో 4 అంఖాల స్థలము అమ్మకమునకున్నది. కొంటారా?" అనెను. "ధరెంత?" అని యదుమల్లిక్ అడిగెను. దళారీ ధర చెప్పెను. కాని యదుమల్లిక్ "ధర తగ్గించి ఈయరా?" యని బేరము చేయుచుండెను. అంత నే విట్లంటిని: "కొనేది లేదు – ఏమీ లేదు అనవసరముగ బేరముచేయుట ఎందులకు?" దాని కతడు నావైపు తిరిగి నవ్వెను. ఆ యదుమల్లిక్ ఇంటికి ఒక చుట్టము వచ్చియుండెను. అతని కన్నులు చూడగనే, అతని స్వభావము కపట స్వభావమని తెలిసికొని వెంటనే వానితో ఇట్లంటిని: "ఇంత జిత్తులమారితనము మంచిది కాదు నాయనా! కాకికూడ చాల జిత్తులు నేర్చిన పక్షియే. కాని దాని మనస్సంతా ఎప్పుడూ ఉచ్ఛిష్టము మీదనే లగ్నమై ఉండును." ఈ మాటలకు అతని ముఖము చిన్నబోయినది.

శ్రీరామకృష్ణులు: (ప్రియనాథునితో) మీ హరి చాలా మంచివాడు.

ప్రియనాథుడు: పసిబిడ్డ స్వభావము తప్ప అతనిలో చెప్పుకోదగ్గ గొప్పదనము ఏముంది?

నారాయణ్: అతడు భార్యను "అమ్మా! అని పిలుచునట.

శ్రీరామకృష్ణులు: అదేమిటి! నేనే అట్లా పిలువలేకున్నాను. అతడెట్లు పిలుచుచున్నాడు

ఒక భక్తుడు: జితేంద్రియుడగుటెట్లో సెలవిచ్చెదరా?

శ్రీరామకృష్ణులు: జితేంద్రియుడగుట ఎట్లో తెలియునా? దీనికొక ఉపాయము కలదు. తనపై ప్రకృతిభావము ఆరోపించుకొన్నచో ఇంద్రియముల జయింపవచ్చును. నేనును అట్లే చేసితిని. సఖీభావములో కఠోరసాధనలు చేసితిని. స్త్రీవలె చీరకట్టి నగలు ధరించి భగవంతునికి హారతులిచ్చెడివాడను. ఆ సమయమున పురుషుడను భావనయే నాకు లేదాయె. అట్లు కానిపక్షమున భార్యను ఎనిమిది నెలల పాటు నాకూడనే యుండుటకు అనుమతి ఇచ్చి యుందునా? మే మిరువురము జగజ్జనని సఖుల మనియే భావించెడివాడను. ఒకనాడు నేను భావావేశములోనుండ భార్య నన్నిట్లు ప్రశ్నిం

చెను. ''నే నెవరను?'' వెంటనే నేను ''నీవు ఆనందమయివగు నా తల్లి వి'' అంటిని.

శ్రీకృష్ణుడు రాసమండలమునకు పోయెను. అచ్చట తానే ప్రకృతిగ మారెను. అందు చేతనే రాసమండలమున శ్రీకృష్ణునికి స్త్రీ వేషము వేయుదురు. స్వయముగ ప్రకృతి రూపమును ధరించనిచో ప్రకృతితోడ క్రీడించుటకు అధికారము కలుగదు సుమా! ఆధ్యాత్మికసాధనల చేయు కాలమున చాల జాగరూకుడై నడచుకోవలెను. సాధనలచేసి భగవద్దర్శనమైన పిదప భయము లేదు. అదెట్లన మెట్లెక్కునపుడు జాగ్రత్తగా ఎక్కవలెను. ఎగురుట, దుముకుట, గంతులువేయుట చేయరాదు. మిద్దెపై కెక్కిన పిదప భయము లేదు. ఇష్టమువచ్చినట్లు గంతులు వేయవచ్చును. అట్లే సాధనలు చేయునపుడు స్త్రీలకు దూరముగా ఉండుటయే మంచిది. భగవద్దర్శనమైన పిమ్మట ఎట్లున్నను భయము లేదు.

భక్తుడు : మహాశయా! ధ్యానమునుగూర్చి కొంత వివరించుడు.

శ్రీరామకృష్ణులు : ధ్యాననిమగ్నుడైనవాని లక్షణములు చాల గలవు. అతడు జడునివలె నిశ్చలముగ నుండును. ఏదో జడపదార్థ మనుకొని కాకివచ్చి తలపై కూర్చొనును. ఇది ఒక లక్షణము. కన్నులు తెఱచుకొనికూడ ధ్యానము చేయవచ్చును. మాట్లాడుచున్నప్పుడు గూడ ధ్యానము చేయవచ్చును. అదెట్లో తెలియునా? పంటినొప్పితో బాధపడుచున్న వానివలె. పంటినొప్పితో బాధపడుచున్నవాడు పనులన్నింటిని చేయుచుండునేగాని వాని మనస్సంతయు నొప్పిమీదనేసుమా. అట్లే కన్నులు తెఱచుకొని పనిచేయుచు మాట్లాడుచు కూడ ధ్యానము చేయవచ్చును. —సశేషము.

## విరోధాశయుపు గాలి

పగలు, రాత్రి
వస్తున్నాయి
పోతున్నాయి
శిశిరము, వసంతము
సూర్యోదయ సూర్యాస్తమయాలు
గతులు తప్పడం లేదు.

కాని
గతిస్తున్నది నీ ఆయుస్సు
పరమపద విరోధాశయపుగాలి
త్యజించడం లేదు నిన్ను.

—తూములూరు కార్తికేయశర్మ

# భగవద్గీత - భక్తి ప్రాధాన్యము

తెలికేపల్లి లక్ష్మీనారాయణ

అష్టా దశాధ్యాయ విస్తృత శ్రీ గీతా సామ్రాజ్యమునందు ప్రథమ షట్కమయిన కర్మసిద్ధాంతము, తృతీయ షట్కమయిన జ్ఞానసిద్ధాంతము సేవించుచుండగా మధ్యమ షట్కమను మిఱుమిట్లుగొల్పు సువర్ణ సింహాసనముపై భక్తి సిద్ధాంతము శ్రీ మహారాజ్ఞివలె కొలువుండి విరాజిల్లుచున్నది. భగవద్గీతయందు విషాద బ్రహ్మ, బుద్ధి అభ్యాస అనన్య, యజ్ఞ, సన్న్యాసయోగములుకూడ నున్నను భక్తి, కర్మ, జ్ఞానయోగములు ముఖ్యములు. ఆచార్య శంకరుల వంటి జ్ఞానావతారులు గీతాపర్యవసానము జ్ఞానమని నిర్ణయించిరి. తిలక్ మహాశయునివంటి కర్మయోగులు గీతాబోధ కర్మసిద్ధాంతమనే భావించిరి. శ్రీ మద్రామానుజుల వంటి మహాభాగవతులు గీతను మథించి భక్త్యమృతమును వెలికిదీసిరి. కన్నతల్లివలె గీత సాధకులందరికిని తన చల్లని ఒడిని ఒసగుచున్నది.

గీతాశాస్త్రము భక్తిసిద్ధాంతమునుపదేశించుచు కర్మ జ్ఞాన యోగముల నప్రధానముగ బోధించుచున్నదని యామునాచార్యుడు భావించినాడు. భగవద్గీతను పరిచయముచేయుచు భగవద్రామానుజులు భగద్గీతా ప్రతిపాదితము సాధన భక్తి యోగములని స్థిరీకరించిరి. "యోగినామపి సర్వేషాం మద్గతేనాంతరాత్మనా శ్రద్ధవాన్ భజతే యోమాం సమేయుక్తతమోమతః" అను శ్లోకము వలన భగవద్గీతయందు భక్తి యోగమునకు అన్ని యోగములకంటె ఉన్నతస్థానమీయబడినదని శ్రీ మద్రామానుజులు భావించినారు. "సర్వధర్మాన్ పరిత్యజ్యమామేకం శరణం వ్రజ" అను గీతాచార్యుని మంత్రోపదేశము భగవద్రామానుజుల ప్రపత్తి సిద్ధాంతమునకు ప్రాణముపోసినది. "స్వవిహిత వృత్త్యా భక్త్యా భగవదారాధనమేవ పరమోధర్మః" అని శ్రీమధ్వాచార్యులవారు గీతా సారాంశమును నుడువుచు గీతయందలి భక్తి ప్రాధాన్యమును స్పష్టముచేసిరి.

శ్రీ వల్లభాచార్యుల శుద్ధాద్వైత సిద్ధాంతము ప్రతిపాదించు సాధనము భక్తియే. భక్తిపూర్ణతను వల్లభులు పుష్టి యనిరి. భగవంతునకు అనన్య చింతనతో ఆత్మార్పణము చేసికొనుటయే పుష్టిసిద్ధాంతలక్షణము.

అనన్యాశ్చింతయంతో మాం యేజనాః పర్యుపాసతే
తేషాం నిత్యాభియుక్తానాం యోగక్షేమం వహామ్యహమ్॥

అను గీతా శ్లోకమునుండి వల్లభులు పుష్టిసిద్ధాంతమునకు స్ఫూర్తిని గ్రహించినారు. వల్లభుల దృష్టిలో భగవద్గీత శరణాగతిని బోధించుచున్నది. అందుచే నాతడు "శ్రీకృష్ణశ్శరణం మమ" అను మంత్రమునే సర్వులకు బోధించినాడు. భగవంతుడు తనకు తాను భక్తునికి వ్యక్తముచేసికొనిన భక్తుడు క్షేమమును పొందును. ఇందుకు భక్తియే సాధనము. కనుక భక్తియే గీతా ప్రబోధమని వల్లభులు భావించిరి.

ఈ తీరున మహాత్ములందరు భక్తియే గీతామతమని అభిప్రాయపడిరి.

"భగవద్గీతాశాస్త్రముయొక్క ఉపక్రమోపసంహారములను పరిశీలించినను భక్తి సిద్ధాంతమునకు శీర్షమయిన శరణాగతి స్పష్టమగుచున్నది. "అశోచ్యానన్వశోచస్త్వమ్" అను శ్లోకముతో గీతోపదేశము ప్రారంభమగుచున్నది. ఈ ఉపక్రమమునకు బీజము

కార్పణ్యదోషోపహత స్వభావః పృచ్ఛామి త్వాం
సమ్మూఢచేతాః
యచ్ఛ్రేయస్స్యాన్నిశ్చితం బ్రూహి తన్మే శిష్యస్తేహం
శాధి మాం త్వాం ప్రపన్నమ్॥

అను శ్లోకమునందు కనిపించుచున్నది. ఇందలి 'ప్రపన్న' పదముచే అర్జునుని శరణాగతభావమే వ్యంజితమగుచున్నది.

గీతోపదేశము "సర్వధర్మాన్ పరిత్యజ్యమామేకం శరణం వ్రజ" అను ఉపసంహారమును కలిగియున్నది. ఇందలి భగవదాజ్ఞయైన "శరణంవ్రజ" ప్రపత్తి భక్తిని నొక్కి చెప్పుచున్నది. ఈ విధముగ భగవద్గీత ఉపక్రమోపసంహారములు భక్తిప్రాధాన్యమును ఉద్ఘోషించుచున్నవి.

భగవద్గీత యందలి ప్రతి అధ్యాయమునందును భక్తి అంతర్వాహినియై ప్రవహించుచున్నది. మచ్చునకు కొన్ని ముఖ్యమైనవానిని పరిశీలింతము.

విశ్వరూపసందర్శన యోగమున—

భక్త్యా త్వనన్యయా శక్య అహమేవంవిధో ఽర్జున।
జ్ఞాతుం ద్రష్టుంచ తత్త్వేన ప్రవేష్టుంచ పరన్తప॥

విశ్వరూపమును తెలిసికొనుటగాని, దర్శించుటగాని, అందు లీనమగుటకాని, అనన్య భక్తిచేతనే సాధ్యమగునని స్వామి స్వయముగా ప్రకటించుచున్నాడు.

అక్షరపరబ్రహ్మయోగమున పరమపురుషుడగు పర

మాత్మ అనన్యభక్తిచేతనే లభ్యమగునని శ్రీకృష్ణుడు హెచ్చరించుచున్నాడు. అఖండమైన జ్ఞానోపదేశముతోఁ

గూడిన గుణత్రయ విభాగ యోగమందును—

మాంచయోఽవ్యభిచారేణ భక్తియోగేన సేవతే
సగుణాన్సమతీత్యైతాన్ బ్రహ్మభూయాయ కల్పతే।

ఎవడు అచంచలమైన భక్తియోగముచే నన్ను సేవించుచున్నాడో అతడే త్రిగుణముల నతిక్రమించినవాడై బ్రహ్మసాక్షాత్కారమునకర్హుడగుచున్నాడని స్వామి భక్తియోగ్యతను ప్రశంసించును.

మోక్ష సన్యాస యోగమందు భక్తిచేతనే తనను ఎవరైనను తెలిసికొనగలరని "భక్త్యామామభిజానాతి" (18-54) అని శ్రీకృష్ణమూర్తి సత్యమును వెలువరించుచున్నాడు.

రాజవిద్యా రాజగుహ్య యోగమున

"నమేభక్తః ప్రణశ్యతి" (9-31)

నా భక్తు డెన్నడును నశింపడని భక్తలోకమునకు స్వామి అభయమొసగుచున్నాడు.

రాజ విద్యా రాజగుహ్య యోగమునందు

మన్మనా భవ మద్భక్తో మద్యాజీ మాం నమస్కురు
మామేవైష్యసి యుక్త్వైవమాత్మానం మత్పరాయణః॥

మనస్సును నాయందు నిల్పుము, నా భక్తుడవు కమ్ము, నన్ను పూజింపుము, నాకు నమస్కృతి చేయుము. ఇట్లు నాకు శరణాగతుడవై మనసును నా యందు నిల్పిన నన్నే పొందెదవని స్వామియే భక్తిపథమును నిర్దేశించుచు భక్తి మహిమను గుర్తింపచేయుచున్నాడు.

ఈ విధముగా భక్తి భగవద్గీతయందపారప్రాముఖ్యమును గడించినది.

కర్మ, ధ్యాన, జ్ఞాన, యోగముల ఫలమే భక్తి—

కురుక్షేత్ర సమరమునకు సిద్ధమయిన సవ్యసాచి ఎదిరి వర్గమందు తన బాంధవులను జూచుసరికి మోహగ్రస్తుడగును. క్షత్రియోచితమగు ధర్మమును విస్మరించి అతడు కార్పణ్యదోషోపహతుడగును. అంతర్యామి అర్జునుని మోహము తొలగుటకై గీతాబోధ ప్రారంభించును

మోహము అజ్ఞానముచే కలుగుచున్నది. అజ్ఞానము జ్ఞానముచే నశించును. అందుచే శిష్యుడయి ప్రపత్తి చేసిన పార్థునికి కృష్ణపరమాత్మ ఆత్మజ్ఞానము నుపదేశించును. అదియే సాంఖ్యయోగము.

శ్రవణము చేసినంతమాత్రాన ఆత్మజ్ఞానము అనుభవమునకు రాదు. మనన, నిదిధ్యాసములందులకు ఆవశ్యకములు. ఇట్టి మననముచేయు విధానము నిష్కామకర్మాచరణమని స్వామి పల్కును. ఇదియే కర్మయోగము.

విజ్ఞానమునకు మననము మానసికము. అది శారీరకము గాదు. అయినను ప్రారంభమున శరీరము, మననము చేయుటలో, మనసుకు దోహదము చేయును. మనసు నిష్కామకర్మ విధానసహాయమునుబొంది మననము నారంభించును. మననము శరీరక ప్రవృత్తివలన పరిపక్వము గాదు. ధారణ ధ్యానాదులీ ప్రయోజనమునకు కావలసియున్నవి. అందుచే భగవానుడు ధ్యానయోగమును బోధించును.

ఈ ధ్యానయోగ సాధనచే మనసు పరిపక్వమగును. తరువాత నిదిధ్యాసనము (నిరంతర ధ్యానము) అలవడును. ఇందువలన ఆత్మసాక్షాత్కారము గలుగును. ఆత్మసాక్షాత్కారము నందిన మహాత్ముడు సమస్తమునందు తనను, తనయందు సమస్త భూతములనుగాంచి ఆత్మానందతృప్తుడై యుండును. సమస్తసృష్టియెడల నిర్హేతుకమయిన నిరతిశయమయిన ప్రేమ తొణికిసలాడును. ఇట్టి పరిశుద్ధమయిన ప్రేమయే భక్తియని భగవానుడు స్పష్టము చేయును. ఇదియే భక్తియోగము.

ఇట్టి భక్తి, సాంఖ్య కర్మ ధ్యానయోగముల సాధనానంతరము సహజముగా సిద్ధించును. అందుచే జ్ఞాన, కర్మ, ధ్యానయోగముల ఫలము భక్తియని భగవానుడు విశదము చేయును. ఇట్టి భక్తుడు తన ఆత్మయే యని స్వామి మనసారా వాక్రుచ్చును.

## గీతా ప్రతిపాదిత భక్తులు:—

చతుర్విధా భజన్తే మాం జనా సుకృతినోఽర్జున
ఆర్తోజిజ్ఞాసురర్థార్థీ జ్ఞానీ చ భరతర్షభ॥

హే భరతర్షభా! విపన్నుడు, తత్త్వజిజ్ఞాసువు, అర్థకామి, తత్త్వజ్ఞాని అను పుణ్యాత్ములు నల్వురు నన్ను భజించుచున్నారు.

భగవద్గీత ప్రతిపాదిత భక్తికీ శ్లోకము ఆత్మసదృశమయినది. ఈ శ్లోకము శాండిల్య నారద భక్తిసూత్రములలో పరవళ్ళుత్రొక్కుచు శ్రీమద్భాగవత మహాసాగరమున లీనమగుచున్నది.

1. ఆర్తుడు:- తస్కర వ్యాఘ్రరోగాదులచే భీతుడయి ఆపన్నుడయినవాడు (శ్రీ) శంకర

దులు). ఐశ్వర్యముపోయి స్థితిలేనివాడై మరల నైశ్వర్యమును కోరువాడు (శ్రీమద్రామానుజులు). శత్రువ్యాధ్యాదులచే బాధపడుచు అట్టి బాధయొక్క నివృత్తిని కోరువాడు (శ్రీ మధుసూదన సరస్వతులు) దేహసంబంధములయిన దుఃఖముతో పీడింపబడువాడు (శ్రీ సత్య సాయి బాబా). బాధింపబడి దుఃఖములకు లోనయి నష్టములచే పీడితుడయినవాడు (డాక్టర్ సర్వేపల్లి రాధాకృష్ణన్).

ఆదర్శము:- జరాసంధ కారాగారవాసులగు రాజులు, మొసలిచే పట్టుబడిన గజేంద్రుడు. ద్రౌపదీదేవి.

2. జిజ్ఞాసు:- భగవత్తత్త్వమును తెలిసికొనగోరువాడు (భగవత్పాదశంకరులు). ప్రకృతి సంబంధములేని ఆత్మస్వరూపమును (కైవల్యమును) కోరు ముముక్షువు (శ్రీ మధుసూదన సరస్వతులు). భక్తితోకూడిన నిజాయితీపరుడయిన సత్యాన్వేషకుడు (డాక్టర్ సర్వేపల్లి రాధాకృష్ణన్). ఆత్మస్వరూపమైన పరమాత్మను తెలిసికొనగోరి అనేక సద్గ్రంథములతో సదాలోచనలతో విచారము సలుపుచు సాన్నిధ్యప్రాప్తిని బడయుగోరువాడు (శ్రీ సత్య సాయిబాబా).

ఆదర్శము:- ముచికుందుడు, మైథిలుడగు జనకుడు, ఉద్ధవుడు.

3. అర్థార్థి:- ధనకాముడు (శ్రీ శంకరులు) ఐశ్వర్యమును పొందకుండుటచే ఐశ్వర్యమును కోరువాడు (శ్రీ మద్రామానుజులు). ఇహలోకమునగాని పరలోకమునగాని యేది భోగోపకరణమో అట్టి దానిని గోరువాడు (శ్రీ మధుసూదన సరస్వతులు). తన ప్రాపంచిక స్థితిని అభివృద్ధిచేసికొనదలచువాడు (డాక్టర్ సర్వేపల్లి రాధాకృష్ణన్). ధన కనక వస్తు వాహనములతో పదవి పేరు ప్రతిష్ఠలతో పుత్ర పౌత్రాభివృద్ధిని గోరువాడు (శ్రీ సత్య (సాయిబాబా).

ఆదర్శము:- సుగ్రీవుడు, విభీషణుడు, ఉపమన్యువు ఈ లోకమున అర్థార్థులు. ధృవుడు పరలోకమున అర్థార్థి.

4. జ్ఞాని:- విష్ణువుయొక్క తత్త్వము నెఱిగినవాడు (శ్రీ శంకరుడు). ఆత్మస్వరూపము భగవంతునకు శేషభూతముగా ఎఱిగి భగవంతుని పొందగోరువాడు (శ్రీమద్రామానుజుడు). భగవత్తత్త్వ సాక్షాత్కారముచే నిత్యముక్తుడు (శ్రీ మధుసూదన సరస్వతులు). జ్ఞానముకలిగినవాడు (డాక్టర్ రాధాకృష్ణన్). నిరంతరము భగవత్తత్త్వ

ఆదర్శము:- సనకాదులు, నారద, ప్రహ్లాద, పృథు చక్రవర్తి, శుకాదులు.

మాయోపహతులగు పండితులు భగవంతుని భజింపకున్నారు. భగవద్విముఖులగు ఆసురీస్వభావుల మాట వేరుగ చెప్ప నవసరములేదు. పూర్వజన్మమందు సుకృతము చేసికొన్న పుణ్యాత్ములు మాత్రమే భగవంతుని భజింపగలుగుదురు. అనేక సహస్ర జన్మములయందాచరింపబడిన తపోదాన సమాధులచే నశించిన పాపముకల మనుష్యులకు శ్రీకృష్ణునియందు భక్తి జనించును. భగవంతుని భజించు ఇట్టి పుణ్యాత్ములు ఆర్తుడు, జిజ్ఞాసువు, అర్థార్థి, జ్ఞాని అనియు నాలుగు విధములు. మొదటి ముగ్గురు కామనా సహితులు. కనుక వీరు కామ్యభక్తులు. జ్ఞాని కామనారహితుడు. నిష్కామభక్తుడితడు. ఆర్త, జిజ్ఞాసు, అర్థార్థుల భక్తి, 'అనేకభక్తి' వీరు తాముకోరు వస్తువులయందు, విషయములందు, భూతములయందు, భగవంతునియందు అన్నిటియందును ప్రేమను (భక్తిని) ప్రవహింపచేతురు. అందుచే వీరి భక్తి, అనేకభక్తి అనబడును. జ్ఞానిచేయు భక్తి 'ఏకభక్తి' అగును. స్వాత్మరూపమగు భగవంతునియందే అనురక్తి కలిగియుండుట 'ఏకభక్తి'. జ్ఞాని నిత్యముక్తుడయి (నిరంతరము) భగవంతుని స్వాత్మరూపముగా నపరోక్షజ్ఞానముతో నెఱిగి భజించును, ఇచ్చట 'జ్ఞానీచ' అని చెప్పుటచే 'చ'కారము వలన నిష్కామభక్తులను సూచింపబడుదురు.

ఈ ఏకభక్తుడు భగవంతుని ప్రియతముడు. అందుచే నితడు శ్రేష్ఠుడు. భగవంతుడతనికి నత్యంత ప్రియుడు. ఇట్టి భక్తుడు వాసుదేవుని సర్వమందును దర్శించును. ఇతడు వాసుదేవుని తన ఆత్మగాగుర్తించుటచే వాసుదేవుని మిక్కిలి ప్రేమించును. భగవంతుడు సుజ్ఞానిని తన ఆత్మగా భావించుటచే నాతనిని మిక్కిలి ప్రేమించును.

ఏకభక్తుడయిన జ్ఞాని, బోధ (జ్ఞాన) దృష్టిచే భగవద్రూపుడు. అయినను దేహముండువరకు అతడు భగవద్భక్తుడనియే వ్యవహరింపబడును. "వాయువాకాశమందు విలీనమైనపుడు వాయుత్వము వేరుగానుండదు. అటులే భగవంతునిలో నేకమైన ఏకభక్తుడు భగవంతుడే అగును.

ఇట్టి ఏకభక్తుల స్వభావమును ముప్పదియైదు కళ్యాణ గుణములుగా శ్రీకృష్ణభగవానుడు భక్తియోగమందలి 13-19 వ శ్లోకము వరకు వివరించును. అవి క్రమముగా 1. ఏ ప్రాణిని ద్వేషింపకుండుట. 2. మైత్రి. 3. కరుణ. 4. మమత్వము లేకుండుట. 5. నిరహంకారము. 6. సుఖ

దుఃఖములయందు సమత్వము. 7. ఓర్పు. 8. నిత్య సంతుష్టి. 9. మనోనిగ్రహము. 10. దృఢనిశ్చయము. 11. మనోబుద్ధులను భగవంతునకు సమర్పించుట. 12. లోకమువలన తానుగాని, తనవలన లోకముగాని భయపడకుండుట. 13. హర్షము, క్రోధము, భయము లేకుండుట. 14. దేనియందును అపేక్ష లేకుండుట. 15. శుచిత్వముకలిగియుండుట. 16. కార్యసామర్థ్యము. 17. తాటస్థ్యము 18. మనోవ్యాకులత్వము లేకుండుట. 19. సర్వకర్మఫలత్యాగము. 20. హర్షములేకుండుట. 21. ద్వేషము లేకుండుట. 22. శోకము లేకుండుట. 23. కోరిక లేకుండుట. 24. శుభాశుభ పరిత్యాగము. 25. శత్రుమిత్రులందు సమత్వము. 26. మానావమానములందు సమభావము. 27. శీతోష్ణములందు సమత్వము. 28. సుఖదుఃఖములందు సమభావము. 29. సంగవర్జిత్వము. 30. నిందాస్తుతులందు సమత్వము. 31. మౌనము. 32. దొరికిన దానితో సంతుష్టి. 33. నివాసమునందభిమానము లేకుండుట. 34. స్థిరబుద్ధి. 35. భగవంతునియందు భక్తి. ఇట్టి కళ్యాణగుణ సముపేతుడైన మహాత్ముని, భక్తియోగమునందు స్వామి స్వయముగా "భక్తిమాన్ మేప్రియో నరః" అని పౌనఃపున్యముగా ప్రశంసించుచున్నాడు.

ఆర్త, జిజ్ఞాసు, అర్థార్థులు తమ కోరికనీడేర్చుకొనుటకు భగవంతుని ఒక సాధనముగా భావించి ప్రేమింతురు. జ్ఞానభక్తుడు తన ఆత్మయే యయినందువలన నతని నత్యంతముగా భగవంతుడు ప్రేమించును. ఈ సందర్భమున జ్ఞానేశ్వర మహారాజ్ ఒక చక్కని ఉపమానమును చెప్పిరి. కామ్యభక్తులు గోమాతను బంధించి పాలుత్రాగు వారిని బోలుదురు. ఏకభక్తుడయిన జ్ఞాని గోవత్సము వంటివాడు. గోవత్సము క్షీరపానముచేయుటకు గోమాతను బంధింపనవసరము లేదు. తన వత్సమునకు క్షీరమును కుడుపవలెనని ఆ తల్లి ఉత్కంఠపడుచుండును. జ్ఞాని భక్తుల విషయములో భగవంతు డీ తీరున ప్రవర్తించును.

ఈ చతుర్విధభక్తులలో మొదటి మూడింటిని గౌణభక్తి యని, నాల్గవభక్తిని పరాభక్తియని శాండిల్య, నారదభక్తి సూత్రములు నుడువుచున్నవి.

పరాభక్తుని లేక ఏకభక్తుని భగవంతుడు ప్రశంసించుటచే గౌణభక్తులయిన ఆర్తాదులను అతడు ఉపేక్షచేయునా యని సంశయమొందవచ్చును. భగవంతుడట్టి సంశయమును విచ్ఛేదముచేయుచు, గౌణభక్తులనుగూడ ఉదారులని (ఉత్కృష్టులని) ప్రశంసించును. "కోరిక ఉండుట ఒక దోషమయినను, పాటి మానవుని ఆశ్రయింపక సర్వేశ్వరుని ఆశ్రయించుటలో రెండవదోషము వానిని అంటకున్నది. రెండు దోషములు కలవానికంటెను ఒకదోషము కలవాడు ఉత్తమస్థాయికి చెందినవాడేకదా! అని శ్రీ సత్యసాయిబాబావారు ఆర్తాదుల ఔదార్యమును సమర్థించుచున్నారు. తమ అభీష్టసిద్ధికి భగవంతుడే గతియని విశ్వసించి భజించు వీరు అహంకార మమకారగ్రస్తులగు గురుదేవతాధిక్కారులకంటె సర్వవిధముల శ్రేష్ఠులే. కోరికతో భగవంతుని చేరువాడు కూడ మహాత్ముడే. కామ్యభక్తులు ప్రేమతో భగవంతుని భజించి ఏదయినా కోరిన భగవంతుడు దానిని నెఱవేర్చును. భక్తభగవానుల నడుమ ప్రేమల మారకమున్నది.

కామ్యభక్తులలో జిజ్ఞాసువు సాక్షాత్తుగా మాయ నతిక్రమించుచున్నాడు. ఆర్తుడు అర్థార్థియు జిజ్ఞాసను పొంది తద్ద్వారా మాయనతిక్రమించెదరు. ఇదియే ఈ ముగ్గురి విశేషము. ఆర్తునకు, అర్థార్థికిని జిజ్ఞాసుత్వము సంభవించుటవలన, జిజ్ఞాసువునకు ఆర్తిత్వజ్ఞానోపకరణార్థిత్వము సంభవించుటవలన ఆర్తఅర్థాదులకంటె జిజ్ఞాసువు ఉత్కృష్టుడు. ఆర్తుడు అర్థార్థుడు క్రమముగా విషయవిచారణచేసి సాధనలతో, విశ్వాసములతో జిజ్ఞాసువుగ పరిపక్వము చెంది దానిద్వారా ఏకభక్తుడయి (జ్ఞానియై) పరిణతని చెందుచున్నాడు. ఈ కామ్యభక్తులు, నిష్కామభక్తుల సాంగత్యముచేతనయినను, మహాత్ముల అనుగ్రహలేశముచేతనయినను సంస్కారము పొంది పరాభక్తులుగ రూపొందవచ్చును. కాలవ్యవధానముండవచ్చునుగాని భక్తులందరును భగవంతునిలో లీనమగుట తథ్యము. అందుచేతనే కళ్యాణమయమయిన భక్తిపదమున ప్రయాణించు ఏ భక్తుడైనను భంగము చెందడు. భగవానుడు "నమే భక్తః ప్రణశ్యతి" అని పాంచజన్యమును పూరించుచున్నాడు.

భక్తగణములోని జ్ఞాని ఆత్మవేత్తయై కృతకృత్యుడయినాడు. అతడు భగవంతుని భజించుట యెటుల పొసగునని శంకించనవసరములేదు. ఎవని అనుగ్రహమువలన ఆత్మజ్ఞానమనెడి మహాలాభము ప్రాప్తించెనో అట్టివానిని కృతజ్ఞుడయిన జ్ఞాని మరువగలడా? అసంభవము. అందుచే జ్ఞానికూడ భక్తిచేయుట అతనికి సహజము, సమంజసము అగుచున్నది.

### నవవిధాదిభక్తిరీతులు:—

సఖ్యభక్తి:- పార్థుడు శ్రీకృష్ణుని "హే కృష్ణ! హే యాదవ! హే సఖే!" అని సంబోధించుచు సఖ్యము

నెఱపెడువాడు. కృష్ణపరమాత్మకూడ అర్జునుని సఖునిగా ప్రేమించెడివాడు. అందుచేతనే ఉత్తమోత్తముడయిన జ్ఞానయోగియును భక్తుడవును. "మీదు మిక్కిలి స్నేహితుడగుటచేత నీకు చెప్పుచున్నా"ననెను. స్వామి సఖ్యభక్తిని సర్వోత్తమముగా ఎన్నుకొనినాడని ఇందువలన స్పష్టమగుచున్నది. అంతటితో నాగక "పాండవులలో అర్జునుడు తానేనని స్నేహాతిశయముతో తన సఖ్యభక్తునితో తాదాత్మ్యము నొందుచున్నాడు.

మాధుర్య భక్తి:- మాధవుని బంధువుగా సఖుడుగానే తలచిన పార్థునికి విశ్వరూపదర్శనముతో వివేకనేత్రము విప్పారినది. పరంధాముని పశ్చాత్తప్త హృదయముతో మన్నించుమని ప్రార్థించుచు-

పితేవ పుత్రస్య సఖేవ సఖ్యుః
ప్రియః ప్రియాయార్హసి దేవ సోఢుమ్ (11-44)

దేవా! తండ్రి కొడుకుయొక్కయు, స్నేహితుడు స్నేహితునియొక్కయు, ప్రియుడు ప్రేయసి యొక్కయు లోపములను సహించునట్లు నీవు నా అపరాధములను సహింపుమని ప్రార్థించును. ప్రేయసీప్రియుల భావనచే నిచట నొక విచిత్రమైన మాధుర్యభక్తి ప్రకటితమగుచున్నది.

శాంతభక్తి:-

తస్మాత్ప్రణమ్య ప్రణిధాయకాయం
ప్రసాదయే త్వామహమీశమీడ్యమ్॥ (11-44)

నీవు పూజనీయుడవు, ఈశ్వరుడవు, నన్ననుగ్రహింపుమని అర్జునుడు శ్రీకృష్ణుని ప్రార్థించును. ఇందలి భక్తి శాంత భక్తి.

శ్రవణభక్తి:-

మచ్చిత్తాః మద్గతప్రాణాః బోధయన్తః పరస్పరమ్
కథయన్తశ్చమాం నిత్యం తుష్యంతి చ రమన్తిచ

విభూతియోగమునందు శ్రీకృష్ణభగవానుడు తన భక్తుల స్వభావమును చెప్పుచున్నాడు, "నాయందు మనసు గలవారు, నా కొరకు ప్రాణములర్పించువారు, నన్ను గూర్చి పరస్పరము బోధించుకొనుచు, నా కథలను ముచ్చటించుకొనుచు ఎల్లప్పుడును ఆనందించుచున్నారు." ఇందు పేర్కొనబడిన కథలను చెప్పుకొనుచు రమించుట శ్రవణ భక్తి అనబడును. తన భక్తులు కాదలచుకొనినవారికి స్వామి చేయుచున్న ఉపదేశమీ శ్రవణభక్తి. "గీత నెవడు శ్రవణము చేయునో అట్టివాడు పుణ్యకర్మలొనర్చువారి శుభలోకములను పొందునని స్వామి పల్కుటచే శ్రవణభక్తికి గీతయందు ప్రాముఖ్యము కలదని స్పష్టమగుచున్నది. జిజ్ఞాసువయిన అర్జునుడు శ్రీకృష్ణ గీతాబోధను శ్రవణముకావించుట శ్రవణభక్తి యగును గదా!

కీర్తనవందనములు:-

సతతం కీర్తయన్తో మాం యతన్తశ్చ దృఢవ్రతాః।
నమస్యంతశ్చమాం భక్త్యా నిత్యయుక్తా ఉపాసతే॥

"దైవీప్రకృతికలవారు సతతము నన్ను కీర్తించుచు, దృఢవ్రతనిష్ఠులై ప్రయత్నించుచు, భక్తితో నమస్కరించుచు సదా చిత్తము నాయందు నిల్పినవారలై ఉపాసించుచున్నార"ని కృష్ణుడనును. ఇందలి 'సతతం' అను పదమును తంత్రీవాద్యములతోడననునర్థమును కూడ చెప్పుకొనవచ్చును. ఇందు స్వామి, కీర్తన, వందన భక్తులను ప్రోత్సహించుచున్నాడు.

స్మరణభక్తి:- తస్మాత్సర్వేషు కాలేషుమామనుస్మర అన్నికాలములయందును తనను స్మరింపవలసినదని భగవానుడు స్మరణభక్తిని ప్రబోధించుచున్నాడు.

అనన్యచేతా స్సతతం యోమాం స్మరతి నిత్యశః।
తస్యాహం సులభః పార్థ! నిత్యయుక్తస్యయోగినః

"ఎవడనన్యచిత్తుడై నను గూర్చి నిత్యము స్మరించుచుండునో అట్టివానికి నేను సులభసాధ్యుడన"ని స్వామి స్మరణభక్తి యొక్క సౌలభ్యమును చెప్పుచున్నాడు.

స్తోత్రభక్తి:- విశ్వరూపదర్శనయోగమందు "పశ్యామి దేవాం స్తవ దేవదేహే" నుండి "నహి ప్రజానామితవ ప్రవృత్తి" వరకు 'స్థానే హృషీకేశ తవ ప్రకీర్త్యా' నుండి 'సహస్రబాహోభవ విశ్వమూర్తే' వరకు గల అర్జునుని ఆవేశపూరితమయిన భక్తిని వెల్లడించుచున్నది.

మాహాత్మ్య భక్తి:- "ప్రపంచములోని మాహాత్మ్యము లన్నియు భగవంతుని ప్రభావములే అని తెలిసికొని ఈ మహత్వములతో అతనిని గాంచి భజింపవచ్చును". దీనిని మాహాత్మ్య భక్తి అననగును.

ఆదిత్యానామహం విష్ణుర్జ్యోతిషాం రవిరంశుమాన్
మరీచిర్మరుతామస్మి నక్షత్రణామహం శశీ॥

"నేను ద్వాదశాదిత్యులలో విష్ణువనెడు ఆదిత్యుడను. జ్యోతులలో విశ్వవ్యాపిరశ్మియుక్తుడగు సూర్యుడను, మరుద్గణ సప్తకమున అవహనాముడగు మరీచిని, నక్షత్రములలో చంద్రుడను నేనే."

కృష్ణభగవానుడు ఇట్టి శ్రేష్ఠములగు విభూతులను పార్థ

నకు చూపించును. ఈ విభూతి మాహాత్మ్యమునకు విజయుడు ప్రవర్తుడయ్యెను.

పూజా భక్తి:-

పత్రం, పుష్పం, ఫలం, తోయం యో మే భక్త్యా ప్రయచ్ఛతి
తదహం భక్త్యుపహృతమశ్నామి ప్రయతాత్మనః

"కుంతీకుమారా! ఎవడు నాకు భక్తితో పత్రమునో, పుష్పమునో, ఫలమునో, జలమునయినను అర్పించు చున్నాడో శుద్ధచిత్తుడగు ఆ నిష్కామభక్తుడు భక్తితో చేసిన పూజ స్వీకరించు చున్నాన"ని స్వామి పలుకు చున్నాడు. ఇట్టి పూజాభక్తికి స్వామి సంతుష్టుడగును.

సమర్పణ భక్తి:-

యత్కరోషి యదశ్నాసి యజ్జుహోషి దదాసి యత్
యత్తపస్యసి కౌంతేయ తత్కురుష్వ మదర్పణమ్.

"అర్జునా! నీ వాచరించు శాస్త్రప్రసిద్ధములగు కర్మములను, వ్యవహారములను, నీవు భుజించువానిని, నీ తపోదాన హోమములను నా కర్పణచేయుము. "భగవంతునకు సర్వ సమర్పణచేయుటయే సమర్పణ భక్తి. ఈ భాగవతుల భక్తికి గీత మూలమయియున్నది.

సాత్త్వికభక్తి:-

అఫలాకాంక్షిభిర్యజ్ఞో విధిదృష్టో య ఇజ్యతే
యష్టవ్యమేవేతి మనస్సమాధాయ స సాత్త్వికః.

శాస్త్రోక్తమయినదియు, ఫలాపేక్షరహితముగా చేయబడి నదియు, మనసును నిశ్చలముగా నుంచి కర్తవ్యమని భావనచేయుచు చేయబడు యజ్ఞము గాని, పూజగాని, సాత్త్విక భక్తితో చేయబడినది యగును. భాగవతుల సాత్త్వికభక్తిని గీత ఇట్లు నిర్వచించు చున్నది.

రాజసిక భక్తి:-

అభిసంధాయ తు ఫలం దంభార్థమపి చైవయత్
ఇజ్యతే భరతశ్రేష్ఠ తం యజ్ఞం విద్ధి రాజసమ్.

భరతవంశ శ్రేష్ఠుడవగు అర్జునా! ఫలమును గోరియు, దంబముకొఱకు గావింపబడు యజ్ఞము లేక పూజ రాజసిక భక్తితో గూడినది యగునని పరమాత్మ ప్రస్తావించెను.

తామసిక భక్తి:-

విధిహీనమసృష్టాన్నం మంత్రహీనమదక్షిణం
శ్రద్ధావిరహితం యజ్ఞం తామసం పరిచక్షతే,

విధిని అతిక్రమించి నివేదనములేకను, దక్షిణరహితముగ అశ్రద్ధతో చేయబడు యజ్ఞము లేక పూజ తామసిక భక్తితో చేయబడునది యగునని పేర్కొనబడెను.

శరణాగత భక్తి:-ఇతరవిధముల సాధింప సాధ్యపడని తన కోరికలను "భగవాన్! నీవే యుపాయమెనెరవేర్పు మని ప్రార్థించుటయే ప్రపత్తి అని భరతాచార్యుడు ప్రపత్తిని నిర్వచించెను. తన ప్రేమపాత్రముల నన్నింటిని సర్వార్పణముగావించుట, దాని మంచిచెడ్డలతో సహా నర్పించుట శరణాగతభక్తి యగుచున్నది. ఈ ప్రపత్తి భక్తి.

సర్వధర్మాన్ పరిత్యజ్య మామేకం శరణం వ్రజ
అహం త్వా సర్వపాపేభ్యో మోక్షయిష్యామి మా శుచ

అను శ్రీ గీతాచార్యుని అభయ ప్రధానమునందు భక్తి పుష్పరిణియై అలరారుచున్నది. సమస్త ధర్మాధర్మముల అనుష్టానమును పరిత్యజించి పరమేశ్వరుడనగు నన్ను ఒక్కనినే శరణు కోరుము. ఇట్టి దృఢబుద్ధికల నిన్ను నేను ధర్మాధర్మ బంధనములగు పుణ్యపాపముల నుండి ముక్తునొనర్తును కనుక శోకింపకుమని శ్రీకృష్ణ భగవానుడు సమస్త భక్తలోకమునకు అభయమొసగు చున్నాడు, శ్రీమద్భగవద్గీతకు బీజమైన ఈ శరణాగత భక్తి శ్రీమద్భాగవతమునందు సహస్రాధిక శాఖా సమన్వితమై మధుర రసఫల సంభరిత దివ్యకల్పవృక్షముగా విరాజిల్లుచున్నది.

## భగవద్గీతా ప్రతిపాదిత భక్తి విశిష్టత :—

అంత్యజాలును, కృష్యాది నిరతులగు వైశ్యులను, అధ్యయనరహితులగు స్త్రీ శూద్రులు గూడ భగవానుని భజించి మోక్షమును పొందవచ్చునని భగవద్గీత ఔదార్యముతో చెప్పుచున్నది. భగవద్గీతా భక్తి పథము సువిశాలమై సకల భక్తి హృదయులకు తాను అవకాశమిచ్చునట్టిది. భగవానుడు భావగ్రాహి. అందుచే బుధులు భావసమన్వితులై తనను భజించుచున్నారని స్వామి పల్కెను. భక్తుడు తనను ఆసక్తితో భజింపవలెనని భగవానుడు కోరుకొనును. ఈ ఆసక్తియే తదనంతరం శాండిల్య నారదభక్తిసూత్ర నిర్మాణమునకు మార్గమేర్పరచినది.

భగవద్గీత సామాన్య భక్తితో సంతృప్తిపడునట్టిదికాదు. అది అనన్యభక్తి లేక పరాభక్తినపేక్షించును. అందువలననే భక్తి భావన భగవద్గీతలో ఉన్నత శిఖరములకెక్కినది. ఈ అనన్యభక్తి భగవద్గీతయందు పెక్కు పర్యాయములు కీర్తింప

ప్రియుడు. కనుకనే అట్టి భక్తుని భవసాగరము నుండి ఉద్ధరింతునని స్వామి ప్రతిన చేయుచున్నాడు.

తేషామహం సముద్ధర్తా మృత్యు సంసార సాగరాత్
భవామి నచిరాత్పార్థ మయ్యావేశిత చేతసామ్.

భగవంతునియందు తొలుత యత్నపూర్వకమయినభక్తి యేర్పడుచున్నది. ఈ ప్రీతి కల్పితమైనను దృఢ భావనచే అంతఃకరణ శుద్ధికి హేతువగుచున్నది. ఈ భక్తి పరిపక్వమగుచున్నకొలది అంతఃకరణము శుద్ధమగుచుండును. ప్రారంభమున గల ఈ ప్రేమయే అపరాభక్తి యనబడుచున్నది. ఇది హృదయమును పావనము చేయుచు పరోక్ష జ్ఞానమును కల్గించును. పరోక్షజ్ఞాని ధ్యాననిష్ఠచే అపరోక్ష జ్ఞానమును పొందును. అపరోక్ష జ్ఞానము పరాభక్తిని కలిగించును. అపరాభక్తి పరిపక్వతచే ఆత్మ సాక్షాత్కార సాధనమగుటవలన అపరాభక్తి సాధనముగా పరిగణింపబడుచున్నది. అపరాభక్తి సాధనముచే పరోక్షజ్ఞానము తద్వారా అపరోక్షజ్ఞానము, అపరోక్ష జ్ఞాన ప్రాప్త్యనంతరము స్వాభావిక(పరా) భక్తి యేర్పడుచున్నదని గీతా తాత్పర్యము. ఈ పరాభక్తి విశేషమయినదని గీతాసారము.

ఇట్టి యపరోక్ష జ్ఞానభక్తుడు సర్వమందును వాసుదేవుని దర్శించును. సమదర్శనుడయి అద్వేష్టాది గుణములతో ఒప్పారును. ఇట్టి భక్తుడు భగవంతునకత్యంతప్రియుడు. ఈ పరాభక్తుడు ఆత్మానుభూతిచే సర్వమును ప్రేమించుచుండును. అతడు నిరంతర సమాధ్యవస్థయందు లీనమగును. ఈ అవస్థ అభివృద్ధికాగా శరీరము సహజముగా శీర్ణమగును. అంతట విదేహముక్తి లభించును. శరీర త్యాగానంతరమితని ఆత్మ అన్యమార్గమవలంబింపక స్వయముగా సర్వ వ్యాపకమగు బ్రహ్మ స్వరూపమునందు లీనమగును. ఇట్టి పరాభక్తుడే వాస్తవముగ భగవంతుని అనుభవపూర్వకముగా గ్రహింపగలుగుచున్నాడు. ఇట్టి జ్ఞానభక్తుడు స్వయముగా భగవంతుని ఆత్మయే. ఈ పరాభక్తి గీతయందు అనన్యభక్తి, ఏకాంతభక్తి, అవ్యభిచారభక్తిగా పేర్కొనబడినది.

## సగుణ నిర్గుణోపాసనలు :—

భగవద్గీతలో భక్తి, ఉపాసనలు సమానార్థకములుగ వాడబడినవి. వీనిని భేద, అభేదోపాసనలని కూడ యందురు. గీతాశాస్త్రమునననుసరించి సగుణ నిర్గుణోపాసనల ఫలము సమానము. అనిర్వచనీయమును అప్రమేయమును, ప్రమాణాతీతమును, కూటస్థమును, అచలమును, నిత్య నిర్గుణ బ్రహ్మము నుపాసించువారలు నన్నేపొందుదురని స్వామి అభయమిచ్చుచున్నాడు. ఇట్టి నిర్గుణోపాసన దేహాభిమానులకు క్లిష్టమయినది. అయినను సగుణోపాసకులు కూడ తన అనుగ్రహముచే సునాయాసముగ సిద్ధి పొందవచ్చునని స్వామి కరుణించుచున్నాడు. "ఎవరు సమస్త కర్మములను నాకర్పించి నాయందాసక్తితో నైకాంతికమగు భక్తి యోగమున నన్నుపాసించుచున్నారో వారిని జనన మరణ రూపమగు సంసారసాగరమునుండి ఉద్ధరింతు"నని స్వామి ప్రతిన చేయుచున్నాడు. ఇట్టి సగుణోపాసకులును శ్రేష్ఠులేయని స్వామి స్వయముగా ధృవపరచెను. అంత మాత్రమే కాక ఇట్టి సగుణోపాసకులు దేహాంతమున తనయందే లీనమగుదురని "ఇందు సందేహములేదని" భగవానుడు అభయ ప్రదానము చేయుచున్నాడు. ఈ తీరున సగుణ నిర్గుణోపాసనలు గీతయందు ప్రతిపాదింపబడినవి. ఈ రెండింటి ఫలితముయొక్కటే, యీ రీతిని సమత్వమై రక్తిగాంచును.

భక్తుడే నిజమైన కర్మయోగి, ధ్యానయోగి, జ్ఞాని. సమస్తకర్మములను భగవంతుని కర్పించి కర్మఫలమునందు గాక భగవంతునియందు ఆసక్తిగొనునట్టి నిష్కామ కర్మయోగి శ్రేష్ఠుడగు భక్తుడు.

భక్తుడు అపరాభక్తి యోగము ద్వారా ధ్యానించును. సమాధిని కూడ పొందును. సమాధివలన పరాభక్తిని పొందుచున్నాడు. భక్తుడు పూర్ణధ్యానయోగి యగుచున్నాడు.

భక్తులలో జ్ఞాని ఉన్నతునిగా పేర్కొనబడినాడు. పరాభక్తుడే భగవంతుని అనుభవపూర్వకముగా తెలిసికొనగలిగిన అపరోక్ష జ్ఞానియని ఇంతకుముందు విదితము చేయబడినది. ఇట్టి ఏకాంత భక్తుని భగవానుడు తనకభిన్నునిగా భావించును. అందుచే భక్తుడు నిజమయిన జ్ఞానయోగియని భగవంతుడే ప్రశంసించుచున్నాడు.

భక్తుడు వసంతఋతువువలె లోకమునకు కళ్యాణమును గూర్చువాడు. అతడొక పూర్ణ కర్మయోగియై, ధ్యానయోగియై, జ్ఞానయోగియై, సదా భగవంతుని యందు రమించుచు, సర్వభూతములయందు నిహితుడై యున్న భగవంతునియందు రతుడై యుండును. పరమభాగవతుని శీలమిది.

ఈతనికి దేనితోడను వైషమ్యముండదు. దేనియందును ద్వేషముండదు. ఇతడహంకార రహితుడు, ఇతడు భగవంతుని ద్వేషించువారిని గూడ ద్వేషింపడు. ఇట్టి భక్త

జీవనమే ముక్తి జీవనము అందుచేతనే మహాజ్ఞానులైన వ్యాస శంకరాదులుకూడ మహాభాగవతులై భాగవతమును, వివిధ స్తోత్రాదులను విరచించి తాము తరించి, లోకమునకు తరణోపాయము జేకూర్చిరి.

## భగవద్గీత - భాగవతము :—

వైష్ణవ సిద్ధాంతమునకు భాగవతమువలె శ్రీమద్భగవద్గీతకూడ అతి ప్రధాన గ్రంథముగ పరిగణింపబడుచున్నది. భాగవతమతమే గీతయందలి సమన్వయత్త్వమునకాధారభూతమయినది. భాగవత సిద్ధాంతము, గీతయు నొకటేయని సూచింపబడినది. "వైష్ణవముగ పరిణమించిన అతి ప్రాచీనమగు భాగవతసిద్ధాంతముల వివరణ ఇందు కలదని" ఆచార్య రాధాకుముద ముఖర్జీ నుడివెను. వాసుదేవ కృష్ణునిచే నెలకొల్పబడిన, మహాభారతమున చేర్పబడిన భాగవత సిద్ధాంతముయొక్క ప్రాచీనత్వమును. ఉత్తమమునయిన వివరణము భగవద్గీతా శాస్త్రమున కలదని సర్కార్ పండితు డభిప్రాయపడెను.

భాగవతకులశేఖరుడయిన దేవర్షి నారదుఁడు భాగవత సిద్ధాంతమును బ్రహ్మమానస పుత్రుడయిన సనత్కుమారుని నుండి గ్రహించెను. తనివిచెందని ఆ తాపసి ఆ పుణ్యభావమును శ్వేతద్వీపమున శ్రీమన్నారాయణుని నుండి బదరికాశ్రమమున నరనారాయణులనుండి గ్రహించెను. పారాశరుడా భాగవత సిద్ధాంతమును మహాభారత విష్ణు పురాణములందు నుద్ధరించెను.

శ్రీకృష్ణుడు పరమభాగవత సిద్ధాంతమును గీత రూపమున పునఃప్రతిష్ఠ గావించెను. వ్యాసుడు అట భాగవత శాస్త్రరూపమున దాని నుద్ధరించినట్లు సూక్ష్మమగు భాగవత సిద్ధాంత ప్రచారకత కూడ కలదు. అందుచే భగవద్గీతా ఉపనిషత్తుల ఆత్మతత్త్వమునకే గాక భాగవతుల భక్తి విశేషములకును పుట్టినిల్లయి శోభిల్లుచున్నది. భాగవత సిద్ధాంత ప్రచారక మహాగ్రంథముగ గూడ నిది పరిగణింపబడుచున్నది.

భగవద్గీతయందు ప్రతిపాదింపబడిన వాసుదేవ (ఏకాంతిక పరా) భక్తి భాగవతమందు చక్కగా పరిపోషింపబడినది. అందుచే "ఏకాంతుల ఆచరణము—గతులు" భగవద్గీతయందు సాక్షాత్కరించును. ఈ భక్తి సిద్ధాంతమునకు ప్రహ్లాద అంబరీషాదులు భాగవతమందు ప్రాణభూతులై కనువిందుచేతురు. ప్రహ్లాదుడు మదపుటేనుగుచే త్రొక్కింపబడినను గోవిందనామము వీడలేదు. నిప్పులలో త్రోయించినను నీరజాక్షుని సంస్మరణము వీడలేదు. అట్లే అంబరీషుడు సర్వకర్మలను హరివశము చేసి పరవశుడయిన పరమభాగవతుడు. గత జీవితమెంత దురాచారములతో నిండియున్నను. మానవుడు వర్తమానమందు అనన్య భక్తిని పొందినచో మాననీయ సాధువే" యగునని భగవానుడు తీర్మానించెను. భాగవతమందు ధర్మము మఱింత విస్తృతిగాంచి సోదాహరణముగా నిరూపితము. మనసు అన్యాసక్తమయినను నాలుకతో నారాయణ నామముచ్చరించిన చాలును. అతడు స్వామి ఒడిని అవశ్యము పొందునని భాగవత భావము, ఇందుకు అజామిళోపాఖ్యానాదులు నిదర్శనములు. అన్నింటికన్న పరాకాష్ఠమయినది, ఆత్మసమర్పణము, సర్వధర్మములు పరిత్యజించి, భగవానునకు ఆత్మ సమర్పణము గావించుకొన్న గోపికల భక్తియే మునీంద్రులకు నారాదాదులకును ఆదర్శప్రాయమైనది.

ఈ తీరున భగవద్గీతాసూత్రములకు భాగవత కథలు వ్యాఖ్యానములుగను, దివ్యమూర్తులుగను విరాజిల్లుచున్నవి. భగవద్గీతా భాగవతములకు నాయకుడు నందనందుడే. అనన్య భక్తియే రసము, ఆస్వాదించుట సహృదయ ధర్మము.

> కదా వారాణస్యామమరతటినీ రోధసి వసన్
> వసానః కౌపీనం శిరసి నిదధానో ఽఞ్జలిపుటమ్
> అయే గౌరీనాథ ! త్రిపుర ! హర ! శంభో ! త్రిణయన :
> ప్రసీదేతి క్రోశన్నిమిషమివ నేష్యామి దివసాన్ ॥
>
> -భర్తృహరి.

# మాతృదేవి చరణసన్నిధి

ఆంగ్ల గ్రంథము: **ఎట్ ది హోలీమదర్స్ ఫీట్**

అనువాదము: **పి. గణపతిశాస్త్రి**

9, సెప్టెంబరు, 1918.

నా కింతకుమునుపు జబ్బు చేసింది. ఇప్పుడు కొంచెం నింపాదిగా ఉన్నది. సాయంకాలం ప్రార్థనలయిన పిమ్మట మాతృదేవి సందర్శనానికి వెళ్ళాను. ఆమె పడుకుని ఉన్నది. నన్ను చూడగానే "ఏంతల్లీ, బాగున్నావా? జబ్బుపడిన పిమ్మట బాగా కోలుకున్నావా?" అని అడిగింది. దానిమీద నేను బాగున్నానని సమాధానం చెప్పాను. ఆ తరవాత అమ్మ మా కుటుంబాన్ని గురించి ప్రశ్నించి ఇలాగన్నది:

"సరళ నిన్న శ్రీ రామకృష్ణ కథామృతం నించి కొంతభాగం చదివింది. ఎంతటి మహనీయములయిన సూక్తులవి! ఇవ్వన్నీ ఇలాగ జరుగుతాయని ఆ రోజుల్లో నేను అనుకోనే లేదు! ఎంతటి మహనీయవ్యక్తి ఈ పృథ్వి మీద అవతరించారు! అసంఖ్యాకులాయన ముఖతః జీవిత సత్యస్వరూపం సాక్షాత్కరించుకున్నారు. ఎంతటి ఆనందంతో తొణికిసలాడుతూ ఉండేవారాయన! ప్రతిదినము కలకల నవ్వులతోను, మాటలతోను, పాటలతోను, కథలతోను ఇట్టే గడిచిపోయేది. ఆయనలో మానసిక ప్రశాంతి లేకపోవడం నేనెన్నడు గమనించలేదు. అత్యద్భుతంగా నాతో ప్రసంగిస్తూ ఉండేవారాయన! అయ్యో! నాకు కూడా చదువు అబ్బిఉంటే నేనుకూడా ఆయన మాటలన్నీ పుస్తకాల్లో వ్రాసి భద్రపరిచి ఉండేదాన్ని. ఎక్కడున్నావమ్మా, సరళా! ఈవేళ మళ్ళీ మరికొంతభాగం చదువు తల్లీ!"

సరళ, రామకృష్ణ కథామృతం నుండి చదవడం మొదలు పెట్టింది.

అది రాఖాల్ (స్వామీ బ్రహ్మానంద) తండ్రి వచ్చిన ఘట్టంతో ప్రారంభమవుతుంది. అమ్మ ఆ భాగం వింటూ ఇలాగన్నది:

"రాఖాలు తండ్రితో ఠాకూరేమన్నారో విన్నావా? రాఖాలు గురించి ప్రసంగిస్తూ అతడు సంప్రదాయ విజ్ఞానఖండమని ప్రశంసించారు! ఆ విధంగా రాఖాలు తండ్రినాయన సంతోషపెడుతూండేవారు. ఆయన రాగానే ఠాకూరు తోటంతా చూపించేవారు. మంచి ఫలహారాలతోను, ప్రసంగాలతోను విందులు చేసేవారు. తన దగ్గిర ఉంచకుండా రాఖాలును ఆయన తమవెంట పెట్టుకునిపోతారేమో అని ఠాకూరు భయం. అందుచేతనే రాఖాలుతండ్రినాయన ఎంతో ఆత్మీయంగా ఆదరిస్తూండేవారు. రాఖాలు కొక సవతి తల్లి ఉండేది. ఆమె దక్షిణేశ్వరానికి వచ్చినప్పుడల్లా ఠాకూరు రాఖాలుతో "ఆమె విషయంలో చాలా మర్యాదగా నడుచుకో! ఆమె ఎడల చాలా భయభక్తులతో నడుచుకుంటూ అప్పగించిన పనులన్నీ శ్రద్ధగా చేస్తూండు! అందువల్ల నీ సవతితల్లి నీకు తనమీద ఎంతో ఆపేక్ష ఉన్నదని ఆనందిస్తుంది. తెలిసిందా?" అని హెచ్చరిస్తూండేవారు. ఆ కథ చదవడంతో మరి కొంతసేపు గడచిన తరవాత మేము పనిమనిషి బృంద, ఆమె లూచీల వ్యవహారము ఉన్న ఘట్టానికి వచ్చాము. అపైన శారదామాత అన్నది.

"ఆ బృంద నిజంగా చాలా చిత్రమయిన

మనిషే! సందేహం లేదు! ఆమె తనకు రావలిసిన లూచీలు తక్కువయితే చాలా పెద్దగొడవ చేసేది. అప్పుడామె ఇలాగ కేకలు పెడుతూండేది.

"ఒక్క లూచీకూడా లేకుండా నా భాగం కూడా కాజేస్తున్నారే! ఎంతెంతటి పెద్ద కుటుంబాలలోనించి వచ్చిన అబ్బాయిలమ్మా వీరంతాను!"

ఆమె మాటలు శిష్యులెవరయినా వింటారేమోనని ఠాకూరు భయపడుతూండేవారు! ఒకనాడాయన పొద్దున్నే నా గదికి వచ్చి ఇలాగన్నారు :

"ఇదిగో! చూడు, బృందకేమీ మిగల లేదు! ఆమె కోసం ఏదయినా వండి సిద్ధం చెయ్యి! లేకపోతే ఏదయినా పెద్ద గొడవ లేవదీస్తుంది మరి!"

ఆ తరవాత బృంద రాగానే ఆమెతో నేను "ఈవేళ ఏమీ మిగలలేదమ్మా! నీ కోసం ప్రత్యేకించి ఏదయినా తయారుచేస్తాను లే! అన్నాను. దానిమీద ఆమె 'ప్రత్యేకించి నా కోసం మీరేమి తయారుచెయ్యనక్కర లేదు. ఆ పదార్థాలన్నీ నాకిప్పించండి. నేను తయారుచేసుకుంటానులెండి" అన్నది. అందుచేత నేను, నెయ్యి, గోధుమపిండి, బంగాళా దుంపలు ఇంకా మిగిలిన తినుబండారాలు ఆమెకిచ్చే ఏర్పాటు చేశాను.

ఆ అధ్యాయం ముగియగానే సరళక్క జబ్బుపడిన గోలాప్‌మా పరిచర్య కోసమని ఆమె దగ్గిరికి వెళ్ళింది. ఆ తరవాత శారదాదేవి తిరిగి నెమ్మదిగా మొదలు పెట్టింది. ఠాకూరు భగవానుని గురించి తప్ప మరి ఏ విషయాన్ని గురించి ప్రసంగించేవారు కారు. నాతో ఇల్లాగనేవారు :

"మానవ శరీరం ఎంతటి పనికిమాలినదో చూడు! ఈవేళ ఇక్కడ కనిపిస్తుంది. రేపటితో అదృశ్యమయిపోతుంది. ఇక జీవితకాలంలో అంతట ఏమేమో దుఃఖాలు, కష్టాలూను. భగవానుడొక్కడే శాశ్వత సత్యస్వరూపుడు. ఆ భగవానుని ప్రార్థనవల్లనే మానవునికి శ్రేయస్సు కలుగుతుంది. శరీరమన్నది అనేక జటిలసమస్యల కాలవాలము.

ఇటీవల బిలాస్ (స్వామి విశ్వేశ్వరానంద) వచ్చి "అమ్మా, మేము చాలా జాగ్రత్తగా ఉండాలమ్మా! ఆఖరికి మా మనస్సులో కూడా ఏదయినా చెడు తలపు మొలకెత్తుతుందేమో అన్న భయంతో మేమెంతో జాగ్రత్తగా ఉండాలి!" అన్నాడు. ఆ మాట నీకు అర్థమయిందనుకుంటాను. వారు పరిశుభ్రమయిన శ్వేతవసనం వంటివారు. ఇక మిగిలిన ఐహిక విషయాభిలాషులెల్లరు నల్లని వస్త్రాల వంటివారు. వానిమీద సిరామరకలు కూడా కనిపించవు. కాని తెల్లని వస్త్రంమీద ఒక చిన్న మరకకూడా స్పష్టంగా కనబడిపోతుంది. శరీరధారణమే పాపాల కాలవాలము...అందుకనే ఠాకూరు "ప్రపంచం పరిత్యజించిన మీరు చాలా జాగ్రత్తగా ఉండాలి!" అని హెచ్చరించేవారు.

ఇద్దరు ముగ్గురు పిల్లలు కలిగిన తరవాత ఆత్మనిగ్రహం అవలంబించాలని ఠాకూరు సలహా ఇస్తూండేవారు. దానిమీద నే నడిగాను.

"అయితే ఈ జన్మలో స్త్రీకి భర్త దైవము, గురువు అని అంటారు. పెనిమిటి సేవతోనే స్త్రీకి ముక్తి లభిస్తుందని మన ధర్మశాస్త్రాలుద్ఘోషిస్తున్నాయి. ఇదే విధంగా సాయుజ్యం కూడా లభిసుందని

శాస్త్రాలు వక్కాణిస్తున్నాయి. అయితే ఎవరయినా స్త్రీ తన భర్త అభీష్టానికి వ్యతిరేకంగా ఆయనతో వాదించి ఆత్మనిగ్రహం అవలంబిస్తే అది పాపం అవుతుందా?''

దానితో మాతృదేవి అందుకుని ''అది భగవానునికోసమయితే పాపం కాజాలదు. అందుచేత ఇంద్రియనిగ్రహం తప్పకుండా అవలంబించి తీరాలి. అందుచేత వితంతువులకోసం అన్ని నియమాలు, నిష్ఠలు ఏర్పాటు చేసారు.

''ఠాకూరుకు ఒక్క భగవానుని మీదనే తక్క ఇక దేనిమీద ఏ మాత్రము ఆసక్తి ఉండేది కాదు. ఒకప్పుడాయన నన్ను కూర్చోబెట్టి షోడశపూజ చేశారు. అప్పుడాయన నా పూజలో ఉపయోగించిన చీరలు చిన్న చిన్న శంఖాలు తాపడం చేసిన గాజులు, ఇంకా మిగిలిన ఇతర వస్తువులు కొన్ని నా దగ్గిర ఉండిపోయాయి. అవ్వన్ని ఏమిచేసేదని ఆయన్ని నే నప్పుడు అడిగాను.

దానిమీద ఆయన రవంతసేపాలోచించి ''అవ్వన్ని నీవు మీ అమ్మగారి కివ్వవచ్చును'' అని అన్నారు. అప్పటికి మా నాయన ఇంకా జీవించే ఉన్నారు. ఠాకూరు మళ్ళీ అంతలోనే అందుకుని ''ఇయితే ఒక్క మాట! అవ్వన్నీ మీ అమ్మగారికి దానం చేసేటప్పుడు మీ అమ్మగారు నీ వైయక్తిక జనయిత్రి అని మాత్రం భావించరాదు. మీ అమ్మగారిని కేవలము ప్రపంచజనని అని మాత్రమే భావించాలి'' అని హితవుపదేశించారు.

4, సెప్టెంబరు, 1918.

మాతృదేవి జపమాలతో జపం చేసుకుంటూంది. అప్పటికి సాయంకాల ప్రార్థనలయిపోయాయి. నేను రాధూ భర్తకోసం వండిన వంటకాలు కొన్ని నాతో తీసుకువచ్చాను. అవి ఆయన గదిలోకి తీసుకునివెళ్ళవలసిందని అమ్మ రాధూతో చెప్పింది. నే నా తరవాత తిరిగి వచ్చి నా స్థానంలో కూర్చున్నాను. మాతృదేవి విశేషాలేమిటని ప్రశ్నించింది. అంతలోనే నళిని అక్క అమ్మ మేనగోడలు ఒకామె అక్కడికివచ్చి శారదాదేవితో ఇలా గన్నది:

''నాకు మరింత సంతోషం కలిగించు తల్లీ! నాకు రవంతయినా మనశ్శాంతి లేదు. అంతే కాదు. నా కింక బ్రతకాలనికూడా లేదు. నాకేమి ఆస్తి ఉన్నా అదంతా విల్లుద్వారా నీపేర వ్రాస్తాను. నేను చనిపోయిన తరవాత నీ వది నీ యిష్టం వచ్చినట్టు వినియోగించవచ్చును.''

దానిమీద అమ్మ నవ్వి ''నీ వెప్పుడు చనిపోతావని అనుకుంటున్నావు?'' అని ప్రశ్నించింది. ఆపైన శారదాదేవి మరింత తీవ్రంగా మారిపోయి తిరిగి ఇలా గన్నది:

''అలాంటప్పుడు నీవు నెమ్మదిగా ఇంటికి వెళ్ళిపో! ఇటువంటి ప్రదేశంలో లేనిపోని గొడవ చెయ్యడం మానెయ్యడం మంచిది. ఇలాంటి ప్రదేశంలో ఇంత గగ్గరగా ఉండి... ఆపై మాతృదేవి రవంతసేపు తన్నుతాను నిగ్రహించుకుని ''ఇటువంటి పవిత్రులయిన స్వాముల సమీపంలోను ఠాకూరు సాన్నిధ్యంలోను ప్రశాంతి లభించకపోయిన తరవాత మరి నన్నేమి చెయ్యమన్నావో చెప్పు!...నీకెటువంటి క్లిష్టపరిస్థితులే లేని వసతులేర్పడ్డాయో చూడు. ఈ జీవితంలో మంచి అంతా నీ విట్టే స్వీకరించి ఉండవలసింది. కాని నీ వెటువంటి ప్రదేశంలో ఉన్నావో నీవు గుర్తించడం లేదు. ఈ మంచి అవకాశం కాస్తా చెయ్యిదాటిపోగానే అప్పుడు నీ కవగత

మవుతుంది. ఇప్పుడు కాదు! నీ మనస్సులో చెడు గూడుకట్టుకుని ఉన్నది. అందుచేతనే నీకు రవంతయినా ప్రశాంతి లభించడంలేదు. సోమరితనంవల్ల నీకు తల తిరిగింది. నీ లోలోపల అసలు మంచి ఆలోచన అన్నది ఎన్నడు బయలుదేరదా? ఎంతటి అపవిత్రమయిన మనస్సు నీది!''

అలాగన్న తరవాత అమ్మ తిరిగి నవ్వి నావైపు చూచి అందుకున్నది.

''చూడమ్మా! ఠాకూరు నా బ్రతుకుతో ఎలాగ వినోదిస్తున్నారో! ఎటువంటి పుట్టింటి వారితో నాకెటువంటి అనుబంధాలేర్పడ్డాయో గమనించావా? ఎటువంటి దుస్సాంగత్యంలో నా జీవితం గడుపవలసివస్తున్నదో చూడు! నా చిన్నమరదలు వట్టి పిచ్చిది! ఇంక యీ నళిని ఉన్మాదావస్థ సరిహద్దులో పోరాడుతున్నది. ఇంక రాధూకేసి చూస్తే వేరే ఏమి చెప్పనే అక్కరలేదు! ఎటువంటి మూర్ఖురాలిని పెంచి పెద్దదాన్ని చేశాను నేను. ఆమెలో అణువంతయినా జ్ఞానం లేదు.

అదిగో చూడు! ఆ వరండా గోడమీద ఎలాగ ఆనుకుని చూస్తున్నదో! ఆవిడ పని మిటి వెంటనే ఇంటికి రావాలని ఎదురుచూస్తున్నది! ఆ సంగీతం నృత్యాల కోసమని అతడొకవేళ చల్లచల్లగా జారుకుంటాడేమోనని ఆమె భయం! ఇక ఇప్పుడు ఇంటికి తిరిగిరానే రాడేమో అని ఆందోళన! రాత్రింబగళ్ళు అతనిని అలాగే కనిపెట్టి చూస్తూంటుంది. ఎంతటి వ్యామోహం! రాధూలో అంతటి రాగావేశం ఉన్నదని నే నెప్పుడు ఊహించనే లేదు.''

ఆ తరవాత ఆమె మేనగోడలు ముఖం చిన్నబుచ్చుకుని అక్కడినించి లేచి తన పడక గదిలోకి వెళ్ళిపోయింది.

మాతృదేవత తిరిగి ఇలాగన్నది:

''ఈ జన్మ లభించినందుకే మానవుడెంతో కృతజ్ఞుడయి ఉండాలి. నీ యావచ్ఛక్తి విని యోగించి త్రికరణశుద్ధితో ఆ భగవానుని ప్రార్థించుకో! ప్రతి వ్యక్తీ సర్వదా శ్రమించి కర్తవ్య నిర్వహణం కొనసాగిస్తూనే ఉండాలి. కష్టించి పనిచెయ్యనిదే ఎవరయినా ఏదయినా సాధించారా? సాంసారిక విధులన్ని యథా ప్రకారంగా నిర్వర్తిస్తూనే ప్రార్థనకోసం కొంత సమయం ప్రత్యేకించాలి.

ఈ సందర్భంలో నా విషయమే కొంత నే నిక్కడ ముచ్చటిస్తాను. నేను దక్షిణేశ్వరంలో ఉన్నప్పుడు తెల్లవారుజామున మూడు గంటలకే లేచి ప్రార్థన ప్రారంభించేదాన్ని. ఆ సమయంలో నాకు బాహ్యప్రపంచ స్పృహే ఉండేది కాదు. వెన్నెల కాస్తున్న ఒకనాటి రాత్రివేళ సంగీత గోపురం పక్కనే ఉన్న మెట్లకింద ధ్యానం కొనసాగిస్తున్నాను. అప్పుడా పరిసరంఅంతా పరమ ప్రశాంతంగా ఉన్నది. ఆ సమయంలో ఠాకూరు ఆ ప్రాంతంలో ఉత్తరదిశలో ఉన్న అడవి ప్రదేశానికి వెడుతున్నట్టు కూడా నేను గుర్తించలేదు. ప్రతిరోజు తెల్లవారు జామున ఆయన కదే కార్యక్రమం. సామాన్యంగా ఇతర సమయాల్లో నా కాయన పాదరక్షల సవ్వడి వినిపించేది. ఆవేళ గంభీరధ్యానంలో ఉన్నాను నేను.

—సశేషము.

# కబీరు వచనామృతము

(రెండవ భాగము)

## కబీరు పరీక్ష 1

అందఱి యందును నా స్వామి సాక్షియై యున్నాడు. బ్రహ్మ, విష్ణువు, రుద్రుడు, ఈశ్వరుడు ఎల్లరును వ్యా

పంచతన్మాత్రలనియు, పంచవింశతితత్వము లనియు చెప్పుకొను ఈ వాదములన్నిటి నుండియూ మనసును విడివడజేయుము. ఇవన్నియు జగత్తును భ్రమింపజేయుచున్నవి. అతడు అకార, ఉకార, మకారము మొదలగు మాత్రలకతీతుడు. జాగ్రత్స్వప్న సుషుప్తి తురీయావస్థలకావలివాడు. సత్త్వము, రజస్సు, తమస్సు, నిర్గుణము - ఈ యన్నిటి చేతను అతడు బద్ధుడు కాడు.

స్థూలము, సూక్ష్మము, కారణము, మహాకారణము ఇవన్నియు అతని భోగమునకు మాత్రమే. విశ్వము, తేజము, పరాగము, ఆత్మ వీనిలో ఒకదాని యందును అతనిసార మెరుగబడదు. పరా, పశ్యంతీ, మధ్యమా వైఖరులను నాలుగువాణుల మతిమునసనుసరించి యాతడు ప్రవర్తింపడు.

పంచకోశములను పరీక్షించినను వాని యందు సారమగు సత్యము చిక్కదు. అయ్యది పంచజ్ఞానేంద్రియములందుగాని, పంచకర్మేంద్రియములందుగాని, అంతఃకరణమైన మనస్సునందుగాని దొరకదు.

కూర్మ, శేష, కృకలాస, ధనంజయ, దేవదత్తములను పంచప్రాణములందును ఆతడెచ్చట కాన్పించును?

పదునాల్గు ఇంద్రియము లందును - వీనిచే లభించు జ్ఞానమందును, ఆ నిర్లక్షణుడు చూపట్టడు. ''తత్'' పదము, ''త్వమ్'' పదము, ''అసి'' పదము కలియగానగు నీ ''తత్త్వమసి'' యను వాక్యమే ఆ లక్ష్యమును ప్రకాశింపజేయును.

జహల్లక్షణ మాతడు జహత్తని చెప్పును. అజహాత్తాతడజహత్తని చెప్పును (అనగా, యే శబ్దముచే నాతనిని జెప్పిననూ అతడు దాని కతీతుడు).

ప్రియతముడు లభించినప్పుడాతడే సత్యస్వరమును లక్షింప చేయును. సారమగు స్వరమును ఆతడే జాగరించును.

కబీరిట్లనుచున్నాడు:— ఎవడు భిన్న భిన్నముల నన్నిటిని సంగతిచేసి పాడగలడో అతడే పరిపూర్ణుడు.

నా యూరి వార్తలను దెలియజెప్పగలవారెవ్వరేని, ఇచట గలరా?

మేఘములేకయే యఖండధారగా వర్షించును. మెరపుదీవలులేకయే యచట మెఱయుచుండును. శశిభానులు లేక యచ్చట ప్రకాశించుచుండును. అచటనే సారస్వరము నివసించును.

అచటననుపమైన మహావృక్షము కలదు, దానికి కొమ్మలు లేవాకులు లేవు, ఎండలేదు, నీడలేదు. పువ్వులు లేనిదియే యచ్చట భ్రమరము గుంజనధ్వని యొనర్చును. ఆధారము లేకయే యచట ఫలములు ఫలించును. ఉచ్చము, నీచము, జాతి, పంక్తి యచట లేవు. ఆ నిరంతర కాంతియందు త్రిగుణములు ప్రవేశింపలేవు. హర్ష, శోకములచట లేవు. జరామరణములు లేవు. బంధ మోక్షములు లేవు. అఖండపురియానగరము పేరు. సాధుజనులచట నివసింతురు. వారలకది సహజధామము.

అచట బుట్టువు లేదు, చావులేదు, రాక లేదు పోకలేదు. కబీరనుచున్నాడు:— సత్యమును జేరినవాడే దాన సంపూర్ణముగా చేరగలడు.

నేను రాను, నేను బోను, చావను, బ్రదుకను; స్వామితో గూడి యమృతరసమును గ్రోలుదును. కొందరు మెక్కాకు బోవుదురు, కొందరు కాశికి బోవుదురు. వా రిద్దరి మెడలకును ఉరి పడినది. కొందరు వేదిని బూజింతురు, కొందరు గోరీని పూజింతురు, ఇద్దరి మతిని చోరుడు హరించినాడు. కబీరనుచున్నాడు:- వినుమోనరుడా! నాకు నావాడును లేడు, పరుడును లేడు.

## 4

ఓరీ, చెవిటీ! అమరపదజ్ఞానము నీ చేరువ నుండి అతిదూరము వ్యాపించియున్నది. ఎవ్వ డెరుగునో అతనికది కడు సమీపమునందే కలదు. సకల ఘటములనది హరించుచున్నది.

సకలఘటములందు జాపట్టినను, అమరపదజ్ఞానము దూరమే. ఎవ్వడెరుగునో అతనికి జేరువ; కాని ఎఱుగనివానికది ఆకాశము వలె శూన్యము.

హిందూ ముసల్మానులు కలసి నాచెప్పు వది గ్రహింపుడు. ఆద్యంతములపై, యుగయుగాంతరములపై చూడ్కిని బఱపి కనుగొనుడు.

## 6

తనువు రతమయ్యోనేని మనసు బ్రవర్తించును. మనసు రతమయ్యోనేని తనువు ప్రవర్తించును. తనువు, మనము ఎప్పుడేకమగునో అపుడే సాధకుని హంస యందురు.

తెలియమి కడ స్వర్గనరకములు, హరిని తెలిసినకడ స్వర్గనరకములు లేవు.

ఏ భయముచే భవలోకమువారలు భయపడుదురో ఆ భయము నాకు లేదు.

పాప పుణ్యముల శంక నాకు లేదు. స్వర్గనరకములకు నేను బోను. కబీరు చెప్పెడిని వినుమోసాధూ! నే నెచ్చటగలనో, సరిగా వచ్చుటనే సమాహితుడనగుదును.

## 8

ఓ పండితుడా! హృదయమున విచారించి చూడుమెవడు పురుషుడో, ఎవడు నారియో.

ఆతడు ప్రతిఘటమునందునను సమానముగనుండి మాట్లాడుచున్నాడు. అనుపమాతని చరిత్ర; ఏ పేరుచేతనాతని బిలుతును? ఆతనికి వర్ణములేదు, రూపములేదు. "నీవు" "నేను" యని యూరక బలికదవేమి? ఓ వెర్రివాడా! నీకేమి, నాకేమి?

రాముడు, ఖుదా, శివుడు, శక్తి ఒక్కటియే. అతని కరుణ ఇంత యని యెట్లు వర్ణింతును? వేదము, పురాణము, కితాబు, కొరాను నానావిధములుగా వతనిని దెల్పుచున్నవి. హిందువులు, ముసల్మానులు, జైనులు, యోగులు ఎవ్వరును ఈ రహస్యము నెరుగకున్నారు. ఆరు దర్శనములును ఎవ్వని ఆజ్ఞయో, అతని పేరిటనే మనసు మానసించుచున్నది. కబీరు చెప్పుచున్నాడు:- ఎల్లరును తాము కడుచతురులమని తలంచుచు, నన్ను మాత్రము వెఱ్ఱివాడవనుచున్నారు.

## కబీరు ఉపదేశములు

తెలిసికొనుమో పండితుడా! నిర్వాణ పదమును తెలిసికొనుము. సంజ తర్వాత సూర్యుడెక్కడ నివసించును? ఉచ్చము, నీచము, పర్వతము, మన్ను, ఇటుక, యచట లేవు. గానము లేకయే, యచట గీతముప్పతిలుచున్నది. అచట మందిరము లేదు, కోరిక లేదు, పిపాసలేదు, అచట వేయిధేనువులు పాలిచ్చుచున్నవి. అచట నిత్యమమావాస్య, నిత్యము పూర్ణిమ, నిత్యము నవగ్రహములు పంక్తిగా నివసించును.

నేను మిమ్ముల ప్రశ్న చేయుదునో పండితులారా! హృదయమను వస్తువును మీరెన్నడు గ్రహింతురు? కబీరిట్లనుచున్నాడు :—ఇంత మాత్రము నీవెరుగవేని, ఓ గురూ! ఏశబ్దము నీ చెవిని బడినది?

### 10

ఓ పండితుడా! తెలిసికొనుము, తెలిసికొనుము, చేతనతోడను, మనస్సుతోడను, తెలిసికొనుము. ఒకప్పుడు పరిపూర్ణమై పొర్లిపోవుచు ప్రవహించును, ఒకప్పుడు ఇగిరిపోవును, ఒకప్పుడు లేచును, ఒకప్పుడు మునిగిపోవును. రత్నము దొరకలేదు. తలమందుట లేదు.

అచ్చట పుష్కరిణి లేదు, ఘట్టము కట్టినాడు; కమలవనమచ్చట లేదు. కమలములకచ్చట వెదకుచున్నాడు.

కబీరు చెప్పుచున్నాడు :—ఇది మనస్సు యొక్క భ్రమ. చమత్కారమునకు, కోరిక కలదేని, ఊరక కూర్చుండవచ్చును.

### 1

ఓ మూర్ఖుడా! మాటిమాటికిని ఏమి తలచుచున్నావు? అతనితో గలసిపొమ్ము. పారము చేరుటకిచ్చగలదేని, నావికునితో గలియవలయును.

నిన్ను జూచుకొనవెంతువేని, అద్దము శుభ్రము చేయుచుండుము. అద్దముపై మలినము కలదేని, చూడ్కి యెట్లు లభింపగలదు?

### 2

ఆకాశమధ్యము నందాత్మ యెచ్చట నాసీనమై యున్నదో, అచట జ్యోతియొక్క సంగీతము భాసించుచున్నది. శుభ్రస్వరూపముయొక్క రాగమచ్చట జూచుచున్నది. స్వామి యచ్చట విహరించును. అతని ఒక రోమపు టుజ్వలతచే, కోటి సూర్యచంద్రులు కప్పబడి పోవుచున్నారు. ఆ పారమున నొక్క నగరు కలదు. అచట అమృతధార వర్షించుచున్నది.

కబీరు చెప్పుచున్నాడు :—ధర్మదాసా, వినుము పురుషుని దర్బారు లక్ష్యమందుంచుము.

### 3

పేదవై, కాలయాపనము చేయుము. ఓ మూఢుడా, దేనికి నీకి గర్వము? ఈ శరీరమును జూచియా నీకింత యదరిపాటు! లేబరమన్న నీకింత భయమేమిటికి? వైభవభోగమునందు మత్తుడవై నరకాగ్ని నేల ప్రజ్వలించుకొనెదవు? అభిమానము వదలుము. జ్ఞానము నలవరించుకొనుము. సద్గురు సహాయముచే సంసార సముద్రమును దరింపుము.

కబీరనుచున్నాడు :— జీవించియుండియే మృత్యువు నెఱిగిన సాధకుడరుదు.

### 4

ఓ హృదయమా! పరమాత్మ, పరమ

గురువు నీ చెంగటనే యున్నాడు. మేల్కొనుము. మేల్కొనుము.

నీ ప్రియతముని పాదముల కడకు బరుగిడుము; నీ ప్రభువు నీతలచెంతనే యున్నాడు. యుగయుగాంతరముల నుండియు నిదురించుచున్నావు. నేటి ప్రభాతమందైననూ మేల్కొనవా!

## 5

నా ప్రాణమిట్లనుచున్నది :— ఓ శరీరమా! నీకును, నాకును సంగమింక వలదు. నీవంటి మిత్రుడు పలుమారులు లభించెను. కాని యెవ్వరి సంగమునందును, ఇట్లు లీనము కానైతిని!

## 6

ఓ పథికుడా! బహుదూరము పోవలసి యున్నది. ఇంకను నిదురించెదవేల? ఓ నిద్రితుడా! మేల్కొనుము, ఓ చంచలుడా, విచారించి చూడుము. ఇంత నిద్ర తగదు. నది కడుగభీరము. నీనావ కడు ప్రాతపడినది. కబీరిట్లనుచున్నాడు :—వడ్డీలోభముచే మూల ధనము పోగొట్టుకొనకుము.

ఓ మనసా! నీవేపారమునకు చేరనెంచుచున్నావు? నీ సమ్ముఖమునందు, పథికుడెవ్వడును లేదు, పదమేదియును లేదు.

అచ్చట గతి యెక్కడ? స్థితియెక్కడ? అచట జలములేదు, నావలేదు, నావికుడు లేడు, నావను లాగుటకు పగ్గమును లేదు, పగ్గము లాగుటకు మనుష్యుడు లేడు. అచట భూమిలేదు. ఆకాశములేదు, కాలములేదు, పారములేదు, కూలములేదు, అచ్చట తనువు లేదు, మనసులేదు. ఆత్మపిపాసను జల్లార్చెడి స్థలమెచ్చట? ఆ శూన్యమున నికేదియు లభింపదు. బలవంతుడవై నీ తనువునందే ప్రవేశింపుము. ప్రతిష్ఠ నీకచటనే దొరకకలదు. మాటిమాటికిని విచారించుము. ఓ హృదయమా! నీ వెచటికిని బోకుము.

కబీరిట్లనుచున్నాడు :— కల్పనలన్నియు ఎచ్చట నున్నవో నీవచ్చటనే స్థిరముగా నిలబడుము.

## 8

ఓ హంసా! నీ పురాతన కథలను తెల్పుము, నీవే దేశముననుండి వచ్చుచున్నావు? నీవే పారమున కెగిరిపోదువు? నీ వెచట విశ్రమింతువు? ఓ హంసా! నీవు దేనికై వెదకుచున్నావు?

ఓ హంసా, ఈ ప్రభాతమునందు మేల్కొనుము, లెమ్ము, నాతోరమ్ము. ఆ దేశమున, సంశయ శోకములు లేవు, మృత్యువు, భయము కానరాదు. అచ్చటి వసంతవనములు పుష్పించినవి. "అతడే నేను" అను పరిమళము ప్రసరించుచున్నది. హృదయ భ్రమరము పరిమళమందున్మత్తమైనది. అన్యసుఖమభిలషించుట లేదు.

బ్రహ్మాండమున కావల, ఆ పరమసుందరుడగు ప్రభువున్నాడు. ఇప్పటినుండి, అతనిని మరువను, కబీరిట్లనుచున్నాడు :—ఓ అన్నా! ఇట్టి సుసమయము మరలరాదు.

## 10

ప్రతి శరీరమునందు స్వామియగు నాతడొక్కడే రమించుచున్నాడు. పరుష వాక్యముల నెవ్వరిని పలుకకుము.

ధన యౌవనములకై గర్వపడకు. ఈ తనువు మిథ్య. పంచరంగుల చీరమాత్రమే.

# పోతన - హరికీర్తన

బద్వేలి రమేష్

తెలుగు వారికి భాగవతామృతమును పంచి ధన్యులను చేసిన ధన్యచరిత పోతన. కైవల్య పదాన్ని ఉద్దేశించి లిఖించిన భాగవతం ఎందరి జీవితాలనో పునీతం చేసింది.

పోతన, ఋషి. అతని భాగవత చిత్రణలో ఋషితత్వం జాలువారుతూంటుంది. పోతన భగవంతుణ్ణి పెక్కురీతులుగా ఆరాధించాడు. కొన్ని పద్యాలను చదువుతూంటే ఆ ఆరాధన ఎంత విలక్షణమైనదని ఉల్లము పొంగి ఆనంద నాట్యమాడుతుంది.

*　　*　　*

మకరేంద్రునితో పోరాడి పోరాడి డస్సి పోయిన గజేంద్రుడు ఆ భగవంతుణ్ణి ప్రార్థించాడు. ఆ ప్రార్థన ఎంతో ఎత్తుకు ఎదిగి పోయింది. దివ్యభావాన్ని పొదిగి ఒప్పారింది.

లోకంబులు లోకేశులు
లోకస్థులు దెగిన దుది నలోకంబగు పెం
జీకటి కవ్వల నెవ్వం
డేకాకృతి వెలుగు నతని నే సేవింతున్

అంతా నశించినా, ఆ చీకటి ఆవరించినా ఆ చీకటి, దట్టమైన చీకటికవతల ఒకేరీతిగా ఆ భగవంతుణ్ణి సేవిస్తానంటున్నాడు. పోతన గురి ఎంత విలక్షణమైనది. ఈ ఆరాధనలో ఎంత విశాల భావన ఉంది. హృదయ కళ్మలం కడిగే నిర్మల జలం వంటిదీ పద్యభావము.

*　　*　　*

అక్రూరుడు మధురానగరానికి రామ కృష్ణులను రథంలో తీసుకొని వెళ్తున్నాడు. దారిలో యమున వచ్చింది. స్నాన జపాదు లాచరించదలిచి అక్రూరుడు రామకృష్ణుల వద్ద సెలవు తీసుకొని యమునాజలంలో జలక మాడసాగాడు. అప్పుడు యమునలో రామ కృష్ణుల రూపాలు కన్పించాయి. ఆశ్చర్య మైంది. అక్రూరుడు వెను తిరికి తన రథంవేపు చూశాడు. అక్కడా రామకృష్ణులు ఎప్పటి వలె ఉన్నారు. అక్కడ రథంలో వారు, ఇక్కడ నీటిలో వారు. అక్రూరుడు ఆనందంలో మునక లేశాడు. అతనికి జ్ఞానోదయమైంది.

తిరిగి వచ్చిన అక్రూరుణ్ణి స్మితవదనుడైన హరి ఇలా అడిగాడు.

"ఏమిటి అక్రూరా! ఇంత ఆలస్యంగా వచ్చావు. చూస్తే యమున దగ్గరగానే ఉంది. నీవు వెళ్ళి చాలా సేపయింది. ఇక్కడ కానని వింతలు ఆ నీటిలో కన్పించాయా?"

ఈ ప్రశ్నకు అక్రూరునితో జవాబును పోతన చెప్పించిన రీతి విలక్షణంగా ఉంది.

నీలో లేవి చోద్యము
లేలోకములందు జెప్ప రీశ్వర నీటన
వేలన్ వింగివి నున్నవె?
నీలో జోద్యంబు లెల్లనెగడె మహాత్మా

ఈ చిన్ని కందపద్యం భగవంతుని రూపాన్ని ప్రతిబింబించిన దర్పణంలా నిలచింది. చోద్యాలన్నీ నీలోనే ఉన్నాయి ఇంక అంతా నీవే. ఎంత చక్కని దర్శనం!

*　　*　　*

చక్రి చింతన అలవడితే ఆ జీవితం ఎలా ఉంటుంది తన ధోరణిని మార్చుకోమని చెప్పినా మార్చుకుంటుందా? మందార మక రందాన్ని గ్రోలిన తుమ్మెద ఉమ్మెత్త పూల కడకు వెళ్ళమంటే వెళ్తుందా అని ప్రశ్నిస్తాడు పోతన.

అంతే కాదు చక్రి చింతనలేని జీవిత మెలాంటిది! ఆ జీవితం నీటి బుడగలాంటిం దన్నాడు.

నీటిబుడగలు పుడుతూంటాయి వెంటనే పగు లుతూంటాయి. ఈ జీవితాలకు మోక్షం లేదు.

రుక్మిణిని గైకొని వెళ్ళిపోతున్న కృష్ణుని చూసి రేగిపోయిన రుక్మి హరిని నిందిస్తూ అన్న మాటల్లోకూడ గొప్పగా హరికీర్తన దాగుంది.

> మా సరివాడవా? మా పాప గొనిపోవ
> నేపాటిగలవాడ వేదివంశ
> మెందు జన్మించితి వెక్కడ బెరిగితి
> వెయ్యది నడవడి యెవ్వడెఱుగు
> మానహీనుడవు మర్యాదలును లేవు;
> మాయగైకొని మలయరావు;
> విజరూపమున శత్రునివహంబుపై బోవు
> వసుదేశుడవుగావు; వావిలేదు;

ఈ నిందలో హరికీర్తన ఉంది. భగవంతుణ్ణి గుణరహితుడవని దుష్టపాత్రలచేతకూడ కీర్తింపచేశాడు పోతన.

ఇక ఆ భగవంతుడు ఎదురుగా నిలిచి వరాలొసగినపుడు ఏమని కోరాలి? ఏ ఆనందాలను వాంఛించాలి? అన్న ప్రశ్నలకు పోతన చక్కని మార్గంకూడ సూచించాడు.

కంసవధ నిమిత్తం మధురకు రామకృష్ణులు వెళ్ళినపుడు వారు సుదాముడనే మాలాకారుని ఇంట ఆతిథ్యం స్వీకరిస్తారు. సుదాముని మృదు హృదయానికి, వినయానికి మెచ్చిన భగవంతుడు నీకేంకావాలో కోరుకొమ్మంటాడు. అప్పుడు సుదాముడు కోరిన కోరిక మోక్షానికి తలుపు తెరచింది.

> "నీ పాద కమలముల సేవయు
> నీ పాదార్చకులతోడి నెయ్యమును, నితాం
> తాపార భూత దయయును,
> దాపసమందార నాకు దయసేయగదే!"

* * *

భాగవతాన్ని చదువుతున్న సమయంలో ఒక కవి యన్న మాటలే గురుతొస్తూంటాయి.

> అఘమర్షణస్నానమాచరించును విష్ణు
> వతని భక్తిరసామృతాబ్ధిలోన
> అతని వేదాంతవీథులనరుగు నరుని
> దరిసి కనుగీటు ముక్తి కాంతాలలామ
> అతని భాగవతాలయమ్మతిథితతికి
> విష్ణుకీర్తనామృతంలో విందులిడును,

భాగవత చిత్రణలో భగవంతుని దర్శించి కైవల్యపదం అందుకొన్న పోతన ధన్యుడు. అతని భాగవత పఠనలో జన్మరాహిత్యము తథ్యము.

## ఓ మనసా! మళ్ళీ ఒక్కసారి ఆలోచించు

యం. నర్సింలు

ఓ నవకాలంలోని నవమనసా!
నరుని నరనరంలో కదులుతున్న
అశాంతికి కారణమేదో!
ఆతురతగా ఆలోచించు.
శాంతి కావాలనుకుంటావు
అశాంతి దరిచేరకుంటావు,
మాయలమారి మానవుని మనసా!
గతులుదప్పిన ఇంద్రియములు
వక్రమార్గములోన నిన్ను
సక్రమముగ నడిపించుచున్నవి,
పెడమార్గములోన పెట్టిన
ఇరుకు మార్గములోన పట్టిన
మూలకారణమేదో మనసా
ముందుగా ఆలోచించుకొనుము.
భగవంతునియందు ముందు
పూర్ణ విశ్వాసమును పొందుము,
పాపభీతిని పరిమార్చివైచి
సద్వర్తన చెంత జేరుము.
సర్వవ్యాపి భగవానుడని
సతతము మనసేలువాడని

సత్యమెరిగి మసలుకొనుము
నిత్యమతని సేవజేయుము.
ధర్మజీవిత పరిధిలోన
శాంతి పథమును శంకుస్థాపన జేయుము,
మానవుని జన్మ
మహా రైలు జంక్షన్ లాంటిది,
తూర్పు, పశ్చిమ, దిశల దేశలకు
కదులుచుండును రైలుబండ్లు,
మతిజెడి మన గమ్యమును జేరు
దిశను దప్పి దిశకు ఎక్కిన,
చేరుకొందుము సదాపరిపింతుము.
ఉన్నస్థానె కూరుచున్న
అసలే ఉండదు గమ్యస్థానము.
మనసా! తలచుకుంటే చేస్తావు
మహా యోగిగా
లేకుంటే మార్చగలవు మహాభోగిగా,
కానిచో కావచ్చు సదారోగిగా,
మనసా నీకుంది నాణ్యమైన బుద్ధి
శిక్షణ విచక్షణ చేసే వివేకముంది.
సాధుసంఘము సతతము నీ చెంత ఉంది.
ఇటుక బట్టీలు పెట్టి గోడకడితె
అందకుండా పైకిపోతావ్,
గోయ్యిత్రవ్వి గతులుదప్పితె
సాంతమూ దిగజారిపోతావ్,
నీవుజేసే పనినిబట్టి
ఆలోచించే నీ మతినిబట్టి
కదులు చుండును
మంచి చెడుగుల గతులు నీలో,
ధవళవుజు ప్రాంతానికి వైరుతగిలి ఉన్నట్లు
నీళ్ళట్యాంకుకు చక్కని కొలాయిగొట్టమున్నట్లు
మనసా! పరమాత్మతో నీవు సంలగ్నమైతే,
జ్ఞానశాంతులు పొంగదలవు.
సత్ పురుషుల సాంగత్యములతో
సత్ గ్రంథము పఠనములతో
సద్ మార్గమున పర్గిడుము మనసా,
మన తప్పాడు గడియారాలలో టైముగని
వార్తావాహిని విని టైము సవరించినట్లు
మనసా! సాదుపురుషుల బోధనలతో
గీత గ్రంథపు పఠనములతో
సతతము మేల్కొనుము మనసా!
అతని సన్నిధానము జేరుకొనుము,
కష్టసుఖములు వద్దంటే మానవు,
చావు పుట్టుకలు చాలంటే కుదురదు,
మనసా! క్షణిక సుఖములు చాలంటే వదలవు
పరమపురుషుని ప్రణుతిజేయవు,
దేహభోగములకొరకై
దేశలుదప్పి తిర్గుచుందువు,
"కామకాంచన కోరికలకై
కాదన్నదండిగ పర్గులిడుదువు,
అనుక్షణం పనికిమాలిన
పనులలో నీ కాలయాపన
అనుభవించే దేహసుఖములు
అరిగిపోయే సబ్బులాంటిది,
అన్ని అవనీతి పనులను
అనుసరిస్తున్నావు మనసా!!
మాటి మాటికి మళ్ళిరాదు
మర్మమెరిగి మసలుకొనుము."
ఇపుడె చేసుకోవాలి జన్మసార్థకం
లేనిచో ఉన్నదంతా నిరర్థకం
భోగ దుర్వినియోగాలు జేయకు,
యోగివై సదా సద్వినియోగాలు చేయుము,
ప్రాపంచిక విషయ సుఖములు
పలు విషములతోన భరితం, అది
గ్రహించిన వానికి కల్గుతుంది మరణం
సదా విషయాలు చవిచూసితె
పీడిపోతుంది ఆధ్యాత్మికజీవనం,
"తిని తిని నీ పల్లూడిపోయినాయి
తినాలన ఆశ చావలేదు,

చూడాలనే కాంక్ష తీరలేదు,
అనుభవించి అనుభవించి
కాయమంతా ముసలాయె
ఇంకా! ఏదానిపైన మురిపెమ్ము తీరలేదు.
ప్రాపంచిక విషయాలమీద
భోగవాంఛల భాగాలమీద
తనివి తీరేదెపుడు? మనసా!
తరించేదింకెపుడు మనసా?"
ఆశలకు ఆశలెపుడు తీరదు,
దానికి నోరు ఆకాశంవలె విశాలం
కడుపుమాత్రం కడలివలె సువిశాలం,
మనసా ఆశలెపుడు ఆరేవికావు తీరేవికావు,
అదిగో! అని చవిచూపిస్తావు
మానవుని మాయలో ముంచుతావు,
మనసా! నిన్ను నమ్మిన మానవులు
పరమ సంతోషంగ ఉన్నారా?
లేదు, లేదు, పశువులుగ మారుతున్నారు,
కలికాలపు మాయ నీకు లంచమించినట్లు
భోగలాలసతను చూపించి
మృత్యుదేవత నిన్ను నోట్లో వేసుకుంటుంది.
అలవాటు పడినవానికి జైలే బాగున్నట్లు
అనాదిగ మానవున్ని అంటుకొని
పునాదిలేని సుఖశాంతుల్ని అందిస్తున్నావు
ఇదే సుఖమని నమ్మిస్తావు
అశాశ్వత సుఖాలకై ప్రాకులాడమంటావు.
బుద్ధిగల రామచిలుక బూరుగుకాయలకై
కాచుకున్నట్లు, ఎపుడూ
అసార సుఖాలకై అర్రులు చాస్తుంటావు,
ఉన్నతుడైన మానవుడు చివరకు
ఉత్తవాడై ఊడిపోతున్నాడు.
నరునిలోని నాణ్యమైన మనసా!
కర్తవ్యమేమో కడసారిలోనైనా ఆలోచించు.
పనికిరాని కడివెడు కబుర్ల కంటె
గరిటెడంతచాలు ఘనమైన కార్యశూరత్వం,
మనసా మరొక్కసారి మననంచేసుకో
మానవుని మహనీయుడిగ మార్చేగుణమేదో!
గుర్తెరిగి మసలుకో.
"మనసా!! నేటి మానవతా
వేష భూషణాలకు,
ధనానికి, బలానికి, ఇచ్చింది విలువ.
ధర్మాన్ని దైవాన్ని
పాతాళానికి తరిమింది నిలువున,
అలంకార అహంకారాలతో
కాలం గడుపుతున్నావు,
మాన మర్యాదాలు వదిలి
గుణహీనురాలవై కదులుతున్నావు,
గుడ్డలుజూసి గుడ్‌మార్నింగులు కొడుతున్నావు.
మనసా! మానవుని మన్నుపాలు చేస్తున్నావు,
కర్మం, ధర్మం, పుణ్యంతో పనిలేదంటావు
సతతం అప్పుచేసి పప్పుకూడు
నా సిద్ధాంత మంటావు.
ఇంద్రియ సుఖాలకై ఇరుకుమార్గాన్ని
ప్రవేశిస్తావు,
భక్తిభజన గీతమ్ములంటె
బహుభారమంటావు,
భగవంతుడే లేడంటావు.
మనసా! నిన్ను కోసి చూస్తే
నీ కోశంలో ఉన్నాయి,
దంభం, దర్పం, అజ్ఞానం.
నాణ్యమైన మానవునిలో
మహామృగమువై తిర్గుచున్నావు.
గతులుదప్పి భ్రమిస్తున్నావు
ఇక!...నీగతి అధోగతి,"
జ్ఞానధనం సంపాదించు,
ప్రతిసారి పరమాత్మయందు
దృష్టిసి సారించు.
"మనసా!!! మళ్ళీరాదీ జన్మ
చివరిసారి మరొక్కసారి ఆలోచించు
ప్రతిక్షణం పరమాత్మను పలవరించు."

# శ్రీ రామకృష్ణపరమహంస

రాపాక ప్రకాశరావు

పరిత్రాణాయ సాధూనాం వినాశాయ చ దుష్కృతామ్
ధర్మసంస్థాపనార్థాయ సంభవామి యుగే యుగే

శ్రీ కృష్ణపరమాత్మ పై శ్లోకమును కురుక్షేత్రమున పాండవ, కౌరవ సేనలమధ్య, నవంబరు, 3067 క్రీ. పూ. అర్జునునకు బోధించిన విషయము. ధర్మసంరక్షణమునకై, ఆస్తికత్వమును ప్రతిపాదించుటకై, భగవంతుడు భారతదేశమున అప్పుడప్పుడనేకరూపములలో నవతరించినాడు. అద్వైతమును స్థాపించుటకై శ్రీ శంకరాచార్యరూపమున 8*వ శతాబ్దములో (క్రీ. శ. 788) మఱియు 19వ శతాబ్దమున శ్రీ రామకృష్ణపరమహంసగను అవతరించినాడు. అయితే యీ రామకృష్ణావతార మెందులకవసరమైనది అని ప్రశ్నిస్తే భారతదేశములోని అప్పటి పరిస్థితులను పరిశీలించినచో వారి అవతారావశ్యకత బోధపడగలదు.

*

భారతదేశము 19వ శతాబ్దములో తన రాజకీయ స్వాతంత్ర్యమును పూర్తిగా గోలుపోయి బ్రిటిషువారి హస్తగతమైనది. ఇంగ్లీషువారు కలకత్తా (వంగదేశము) నగరమునుండి తమ పరిపాలన సాగించటము మొదలుపెట్టినారు. వారు తమ రాజకీయ ఆశయములు సాధించుటకై పాశ్చాత్య విద్యను ప్రవేశ పెట్టినారు. కలకత్తా, బొంబాయి, మరియు మద్రాసు విశ్వవిద్యాలయములు స్థాపించబడినవి. క్రైస్తవ మతాధికారులు ఎన్నో కళాశాలలను దేశమందు స్థాపించి పాశ్చాత్య విద్యతో పాటు తమ మతమును గూడా బోధించ మొదలిడినారు. యీ కళాశాలలందు భౌతిక శాస్త్రము, రసాయన శాస్త్రము, పాశ్చాత్య వైద్య కళాశాలలందు అల్లోపథిక్ వైద్య విధానము మొదలగునవి బోధింపబడ సాగినవి. యీ విద్యయందు ముఖ్యముగా అనుభవిక పద్ధతికి ఎక్కువ ప్రాముఖ్యత యివ్వబడినది. భారతీయ యువకులు యీ కళాశాలలందు విద్య నభ్యసించటము మొదలు పెట్టినారు. పారిశ్రామికీకరణము, వ్యాపారీకరణము, మఱియు సాంకేతిక పరిజ్ఞానములతో వీరు అపరిమితముగా ప్రభావితులైనారు. వీరికి భారతీయ విజ్ఞానముపై మఱియు భారతదేశ సంస్కృతి, నాగరికతలపై అభిమానము సన్నగిల్లినది. పాశ్చాత్య విద్య, జీవనవిధానముపై గౌరవము ఎక్కువైనది. యిందుకు కారణము అవి పరిపాలించువారికి సంబంధించినవై, జీవనోపాధి కలిగించెడి మార్గమును చూపించెడివగుటయే. వారికి క్రైస్తవ మతముపై అభిమానము గూడా హెచ్చుకాజొచ్చినది. సనాతన మతమన్న చాలామంది యువకులకు తెలియనే తెలియదు. కొందరి దృష్టిలో భారతీయ మతము మూఢనమ్మకాలతో కూడుకొన్నదిగను, విగ్రహారాధన, కులభేదము, అస్పృశ్యత మొదలగు అనేక దురాచారములతో కూడుకొన్నదిగా నుండెను. ఇవన్నియు గాక సనాతన మతము కర్మసిద్ధాంతముపై ఆధారపడి, అదృష్టమునకు లోబడి యున్నదన్న భావము వారిలో ప్రబలమై యుండెను. పాశ్చాత్య

* తెలంగ్ గారు శ్రీ శంకరభగవత్పాదులు 6వ శతాబ్దములో అవతరించినారనియు, కొందరు జ్యోతిష పండితులు వారి అవతారము 2049 సంవత్సరముల పూర్వమని అభిప్రాయపడుచున్నారు, 8వ శతాబ్దమని మాక్స్‌ముల్లరు, చరిత్రకారులభిప్రాయపడుచున్నారు.

విద్య నభ్యసించువారిలో చాలామంది నాస్తికత్వముపై ఎక్కువ మక్కువ జూపుచుండిరి. మరికొందరు క్రైస్తవమతమును అభిమానించుచుండిరి. కొందరు మతాంతరులైరి. వైద్యశాస్త్రము నభ్యసించువారు కుతర్కము చేయ మొదలిడినారు. వారు "మేము మత్తుమందిచ్చి శస్త్రచికిత్స జేయునప్పుడు శరీరములోని ఏ భాగమందును మాకు ఆత్మ కనుపించలేద"ని పరిహసించుచుండిరి. సనాతన ధర్మము, ఆత్మ, పరమాత్మ మొదలగు విషయములను వారికి దెలుపువారు లేకుండిరి అట్టి పరిస్థితులలో శ్రీ రాజా రామమోహనరాయలు బ్రహ్మసమాజమును స్థాపించెను. ఈ మతము వివేచనా వాదమునకు దగ్గఱగానూ, సాంఘిక సంస్కరణానుసారముగ నుండెను. రాజా రామమోహనరాయల తర్వాత కేశవ చంద్రసేనుడు దానికి పూర్తిగ క్రైస్తవ మత స్వరూపమిచ్చెను. అందువలన పాశ్చాత్య విద్య నభ్యసించు భారతీయ యువకులు బ్రహ్మసమాజము యెడల సుముఖులైరి. శ్రీ రామకృష్ణుని ముఖ్య శిష్యవర్గములోని కొందరు మొదట యీ మతమునందభిమానముగల వారే! వీరిలో నరేంద్రుడు (శ్రీ వివేకానంద స్వామి) మఱియు తారకుడు (శ్రీ శివానంద స్వామి) ముఖ్యులు. వీరు శ్రీ కేశవచంద్ర సేనుని ప్రభావమునకు ఆకర్షితులై బ్రహ్మసమాజ సమావేశములకు రాకపోకలను సాగించుచుండిరి కాని వారికి కావలసినది అందువల్ల లభించలేదు. భారతీయ విద్యాధికులైన యువకులకు ఆధ్యాత్మిక దాహము తీర్చువారెంతో అవసరమైయుండిరి.

సనాతన ధర్మమన్న నేమి? వేదములలోని వాక్యములు సత్యములు. ఉపనిషత్తులు ఎవరో మేధావులు సృష్టించిన వాక్యములు గావు. అవి మహర్షుల అనుభూతులు. భారతీయ ధర్మము సత్యముపై ఆధారపడియున్నది- అను విషయములు నిరూపించువారు కావలసి వచ్చెను. విద్యార్థులు, విద్యాధికులు "నీవు భగవంతుని జూచితివా?" అని ప్రశ్నించినచో నిర్భయముగా మాట్లాడక, "చూచితిని, స్పష్టముగా జూచితిని, యిప్పుడు నిన్ను చూచుచున్నట్లే చూచితిని. కోరినచో నీకును జూపించగలను" అని ఖచ్చితముగా ఉత్తరమిచ్చువారు ఎంతో అవసరమై యుండిరి. అటువంటి అవసరమును దీర్చుటకై శ్రీ రామకృష్ణ పరమహంస అవతరించెను.

భారతీయమతము సనాతనధర్మము. దానికి ఒక పుట్టుక లేదు. స్థాపించిన ప్రవక్త లేడు. అది శాశ్వతమైనది. లోకానికంతా చెందినది. అను విషయములను మఱియు సకల ఉపనిషత్సారమైన, శ్రీ పుష్పదంత* విరచితమైన శివమహిమ్న స్తోత్రములోని

> త్రయీ సాంఖ్యం యోగః పశుపతిమతం వైష్ణవమితి
> ప్రభిన్నే ప్రస్థానే పరమిదమదః పథ్యమితి చ
> రుచీనాం వైచిత్ర్యాదృజుకుటిల నానాపథ జుషాం
> నృణామేకో గమ్యస్త్వ మసి పయసామర్ణవయివ

సత్యమును శ్రీరామకృష్ణులు అవతరించి నిరూపించిరి.

"నేను తెలియపరుచు విషయములను గుడ్డిగా నమ్మవద్దు. మీరు స్వయముగా పరీక్షించి అవి సత్యమని తెలుసుకున్న తర్వాతనే నమ్మవలసినద"ని ప్రబోధించినాడు. అద్వైతము, శాక్తేయము, వైష్ణవము, బౌద్ధము, క్రైస్తవము, ఇస్లాము మతము లన్నిటిని గురువుల ద్వారా సాధన జేసి, అనుభూతి నొంది యీ

* ఈ పుష్పదంతుడొకానొక గంధర్వుడని మాత్రమే తెలియును. ఇతర వివరములేమియు దెలియవు.

మతములన్నియు పరమేశ్వరుని జేరు మార్గములు, యిది సత్యము అని నిరూపించినాడు. తన జీవితమునే సాదృశ్యముగ జూపి యిదే భారతీయ మతమని చాటినాడు. ఎవరు ఎటువంటి క్లిష్ట సమస్యలను తన ముందుంచినా, లేక కఠినమైన ప్రశ్న వేసినా, సునాయాసముగా చిన్న చిన్న ఉపమానములతో హృదయమునకు హత్తుకునేటట్లుగా సమాధాన మిచ్చి వారిని సమ్మోహితులను జేసినాడు. ఉదాహరణకు :

ప్రశ్న : "భగవంతుడు సర్వవ్యాపి యగునేని మనకేల కాన్పించడు?"

జవాబు : "దట్టముగా నాచు కప్పియున్న చెరువును చూచి అందులో నీరు లేదందువు. నీటిని చూడగోరుదువేని నాచును తొలగింపుము. మాయ క్రమ్మిన నీ కనులకు భగవంతుడు కానవచ్చుట లేదని ఊరక చింతింతువు. అతనిని దర్శింపగోరుదువేని ముందు నీ కన్నులపై క్రమ్మిన మాయను తొలగించుకొనుము."

ఇటువంటి అనేకమైన ఉపమానములచే మహోన్నతమైన సత్యమును చాటి విద్యావంతులకు భారతీయ ధర్మముపై మక్కువ కలుగ జేసినాడు. శ్రీవారి వాక్కులు "రామకృష్ణ ఉపనిషత్" రూపము దాల్చినవి. యిప్పటికి మనకు లభ్యమైన 228 ఉపనిషత్తులకు యీ ఉపనిషత్తు జోడైనది. శ్రీ రామకృష్ణులను గురించి పండిత జవహార్‌లాల్ గారు తమ "డిస్కవరీ ఆఫ్ ఇండియా"లో "Sri Ramakrishna, a simple man, no Scholar but a man of faith and not interested in Social reform as such. He was in direct line with Chaitanya and other Indian Saints. Essentially religious and broad minded, in his search for selfrealization he went to Moslem and Christian mystics and lived with them for Years following their Strict routines... ..People who went to visit him and some who were even inclined to scoff at this simple man of faith were powerfully influenced and many who had been completely westernized felt that here was something they had missed ....." అని వ్రాసినారు.

19వ శతాబ్దములో భారతదేశము ఆధ్యాత్మికముగా అతి క్లిష్ట పరిస్థితిలో నున్నప్పుడు, సనాతన ధర్మముయొక్క సత్యమును శాశ్వతత్వమును నిరూపించి ధర్మస్థాపన గావించుటకై శ్రీ రామకృష్ణులవతరించినారు. సనాతన ధర్మములోని ఒక విశిష్టమైన అంశము, "మానవ సేవయే మాధవ సేవ, దరిద్రనారాయణ సేవయే పరమాత్మకృష్టమైనద"ను సత్యమును దెలిపి మతమును ఒక నూతన దృక్కోణము నుండి జూచి ఆచరించవలసినదిగా చాటినారు. అందుకే శ్రీ వివేకానంద స్వామి, గురుదేవులను

స్థాపకాయ చ ధర్మస్య, సర్వధర్మ స్వరూపిణే
అవతార వరిష్ఠాయ రామకృష్ణాయ తే నమః

అని స్తుతించినారు.

# ఏకంసత్ విప్రా బహుధా వదంతి

చీమలకొండ ఉమారామలింగమూర్తి

హిందువులు శివుడు, విష్ణువు, గణపతి, కాళి, సూర్యుడు, ఇత్యాది బహు దేవతలను పూజింతురని (Polytheist) ఇతర మతస్థులు విమర్శింతురు. హిందువులలోనే విష్ణువును పూజించువారు తామే అధికులమనియు, శివుని పూజించువారు తామే అధికులమనియు ఎవరు ఏ దేవతను పూజించుచున్నారో వారే అధికులమనియు సంకుచిత స్వభావము కల్గియుందురు. ఇతర మతస్థులగు క్రైస్తవులు, మహమ్మదీయులు వారి మతమే గొప్పది అనుకొనుటలో ఆశ్చర్యముండదు. దేవుని గూర్చి వేదములు ఏమి చెప్పుచున్నవో ఇతర మతములకు చెందిన ప్రముఖులు ఏమి చెప్పుచున్నారో పరిశీలించినచో యథార్థము తెలియగలదు.

వేదాంతములైన ఉపనిషత్తులు భగవంతుని ఇట్లు వర్ణించినవి. 'ఏకంసత్ విప్రా బహుధా వదంతి.' దీని భావమును ఇట్లు చెప్పవచ్చును. సత్పదార్థమగు భగవంతుడు ఒక్కడే. విజ్ఞులు దానిని బహువిధముల వర్ణించుచున్నారు. (Reality or God is one. Learned men name Him differently).

భగవద్గీతలో ఇట్లు చెప్పబడినది.

> వాయుర్యమో ఒగ్నిర్వరుణ శ్శశాంకః
> ప్రజాపతి స్త్వం ప్రపితామహశ్చ

వాయువు, యముడు, అగ్ని, వరుణుడు, ఇంద్రుడు, బ్రహ్మదేవుడు, మహావిష్ణువును నీవే.

ఈ దిగువ శ్లోకము యొక్క భావము కూడ ఈ అభిప్రాయమునే రూఢి చేయుచున్నది.

> ఆకాశాత్పతితం తోయం యథాగచ్ఛతి సాగరం
> సర్వదేవ నమస్కారః కేశవం ప్రతి గచ్ఛతి

ఆకాశమునుండి పడెడు వర్షపునీరు సముద్రమును చేరునట్లు అన్ని దేవతలకు చేయబడు నమస్కారములు ఏకైక దేవుడగు కేశవునే చేరును.

ఈ సంగతిని గ్రహించుటకు కొన్ని ఉదాహరణములను పరిశీలింతము. (1) ఆకలి అనేది ఒకటే కాని రుచులలో భేదముకలదు. ఇష్టానిష్టములలో స్వాతంత్ర్యము ఉండవలసినదే. అటులనే దేవుడు ఒకడైనను భక్తులు విభిన్న పద్ధతులలో తమ ఇష్టదైవమును ప్రార్థించుటలో తప్పులేదు. (2) నామరూపములు మానః ప్రవృత్తుల ఫలితములే. నీటిని తమిళములో 'తణ్ణి' అనియు, మళయాళములో 'వెళ్లి' అనియు, సంస్కృతములో 'జలం' అనియు, హిందీలో 'పానీ' అనియు, లాటిన్ లో 'ఆక్వా' (aqua)అనియు, ఇంగ్లీషులో 'వాటర్' అనియు పిలుచుచున్నను వీనిచే పిలువబడు పదార్థము ఒకటే. ఏ పేరుతో దానిని త్రాగినను దాహము తీరునుకదా! అందువలన అందరు ఒకే దైవమును పూజించవలెనని నిర్బంధించుటకంటె ఎవరి ఇష్టప్రకారము వారు వారి ఇష్టదైవమును పూజించుట మేలు. అట్టి స్వాతంత్ర్యము హిందువులకు గలదు.

ఆంగ్ల పండితుడైన మాక్సుముల్లర్ ఇట్లు వ్రాసెను. "The Vedic faith is somthimes called chrematheistic physiolatry or Henotheism in which each divinity is in turn worshiped as if it were the greatest or the only God recognised for the time being... Henotheism is an imperfect kind of Monotheism in which God is thought of as one only because others had not presented themselves to the mind, a monotheism of which

polytheism is not the contradiction but the natural devolopment." దీని భావమును ఇట్లు చెప్పవచ్చును. 'వివిధ ప్రయోజనముల కొరకు వేరువేరు రూపములుగల దేవతలను పూజింపమని వేదములు బోధించు మతము చెప్పుట నిజమే. అయినప్పటికి తన ఇష్టదైవమును పూజించుచున్నంతసేపు ఆ దేవతయే ఏకైక దేవుడను నమ్మకము ఉండనే ఉన్నది. వేరు వేరు నామరూపములు గల దేవతలను పూజించుట (సాధనలో) అపరిపక్వస్థితిగను, దేవుడొకడే యని పూజించుట పరిపక్వ స్థితిగను భావించవచ్చును. అందువలన బహు దేవతారాధన ఏకైక దేవుని ఆరాధించుటకు ప్రాతిపదిక మాత్రమే. వీనిలో వైరుధ్యము ఏమాత్రము లేదు '

రామకృష్ణపరమహంసయొక్క దృక్పథమును పరిశీలింతము. బాల్యమున అతడు వివిధ దేవతల చిత్రములను ప్రతిమలను చేయుచుండెడివాడు. దక్షిణేశ్వరమునందలి శివాలయములోను విష్ణ్వాలయములోను ప్రారంభమునను కాళీమాత ఆలయములో తరువాతను అచంచలమగు శ్రద్ధాభక్తులతో పూజలు సల్పుచుండెడివాడు. ఆయా దేవాలయములలో మకాము చేయు వివిధ మతములకు చెందిన సాధువులను కలసికొని రామకృష్ణుడు వారితో ముచ్చటించుచుండెడివాడు. అందువలన మత సామరస్యము, మత సహనములకు అనువైన వాతావరణములో అతడు పెరిగెను. మంత్ర తంత్ర ఉపాసనాది సాధనలలో నిష్ణాతుడై అద్వైత భావము పరిపక్వము చెందిన పిదప రామకృష్ణుడు ఇతర మత విధానములను కూడ సాధన చేసినట్లు ఆయన జీవిత చరిత్రవలన తెలియుచున్నది. దక్షిణేశ్వర పరిసరములలో నున్న గోవిందరాయ్ అను నాతడు ఇస్లామును స్వీకరించినవాడని తెలిసికొని ఆయన ఉపదేశానుసారము అల్లాను స్మరించుచు, నియమ బద్ధముగా నమాజు చేయుచు మూడు రోజులలోనే రామకృష్ణుడు అల్లాను సాక్షాత్కరించుకొనెనట. మరి కొంతకాలమునకు దక్షిణేశ్వర ప్రాంతమునందే గల శంభు చరణ్ అను క్రైస్తవ అభిమాని నుండి బైబిల్ విని ఆ మతమునందు చెప్పబడిన సాధనలను ప్రయత్నించి త్వరలోనే జీసస్‌నుకూడ సాక్షాత్కరించుకొనెనట. ఇటులనే బుద్ధుడు, మహావీరుడు, సిక్కుమతగురువులు — వీరిందరిపట్ల గౌరవ భావముకల్గి వారు పరమేశ్వరుని అవతారములే యని విశ్వసించెడువాడు. మతములన్నియు పరస్పర పూరకములు (Complementary) మాత్రమే అనియు పరస్పర విరుద్ధములు (Contradictory) కావనియు గ్రహించెను ఏనుగును తాకి చూచిన అర్గురు గ్రుడ్డివారును, ఊసరవిల్లిని వర్ణించిన వివిధ ప్రేక్షకులును తమ తప్పు తెలిసికొని, తాము సేకరించిన సమాచారము సంపూర్ణము కాదనియు, అసలు వస్తువులో వారి సమాచారము కొంత భాగము మాత్రమేననియు గ్రహించిన చందమున ఏ రూపముననైనను ఏ పేరుతోనైనను ఏ మతమునందైనను మనము ధ్యానించునది అనంతుడగు పరమాత్మలోని ఒక అంశ మాత్రమే యనియు గుర్తించవలసి యున్నది. రామకృష్ణుడు ఈ తీరున సర్వ ధర్మ సమన్వయము సాధించుటచే ఆయన ప్రియ శిష్యుడగు వివేకానందుడు ఇట్లు ఉద్ఘాటించెను. "To proclaim and make clear the fundamental unity underlying all religions was the mission of my Master. అన్ని మతముల ప్రాథమిక సూత్రములు ఒకటేయని స్పష్టీకరించి

వ్యాపింపచేయుటయే మా గురువర్యుల ఉద్దేశము.''

ఈత నేర్చుకొనువారికి ఆరంభమున ఒక తెప్ప ఆధారమగును. ఈత నేర్చిన తరువాత తెప్పతో పని లేదు. అటులనే బహు దేవతారాధన వలన సగుణ బ్రహ్మోపాసన అలవడును. సగుణ బ్రహ్మోపాసన కాలక్రమమున నిర్గుణ బ్రహ్మోపాసనకు దారితీయును అని రామకృష్ణుడు బోధించెను. సత్ పదార్థమగు బ్రహ్మమును తెలిసికొనుటయే ప్రతి మతము యొక్క గమ్యము అనియు మనము పూజించు విగ్రహముగాని జపించు నామముగాని ధ్యానించు రూపముగాని అందులకు సాధనము మాత్రమే యని అతడు వక్కాణించెను. సమాధియనెడు ఉత్కృష్టస్మారకస్థితి (Super Consciousness) అను సముద్రము లోతును కనుగొనుటకు విగ్రహారాధన ఒక సాధనము అని రామకృష్ణుడు చెప్పెను. (Ramakrishna looked upon an image as merely a symbol — a stick to plumb the depth of the ocean of Consciousness). కన్ను, చెవి మొదలగు ఇంద్రియములకు గోచరముకాని (అవ్యక్తమైన) నిర్గుణోపాసనకంటె వ్యక్తమగు (నామరూప సహితమగు) సగుణ బ్రహ్మోపాసన సులభమని శ్రీమద్భగవద్గీతయందు ఇట్లు చెప్పబడినది.

> క్లేశోఽధికతరస్తేషామవ్యక్తాసక్తచేతసామ్
> అవ్యక్తా హి గతిర్దుఃఖం దేహవద్భిరవాప్యతే

తాత్పర్యము—నిర్గుణ బ్రహ్మమునందు ఆసక్తి కలవారికి దేహాభిమానమును త్యజించుటయను విచారము అధికము. అందువలన దేహాభిమానులకు నిర్గుణ బ్రహ్మోపాసన దుస్సాధ్యము. (సగుణ బ్రహ్మోపాసన సాధ్యమని సూచింపబడినది) అద్వైత మత స్థాపకుడగు ఆది శంకరులు కూడ నిర్గుణోపాసనకు సగుణోపాసన ప్రాతిపదికగాన అందులకు పంచాయతనములను పూజించుట స్తోత్రములతో ధ్యానించుట అవసరమని భావించి, వీనిని వ్యాప్తిలోనికి తీసికొనివచ్చెను.

పూజించుచున్న తాను (Worshipper) వేరు పూజింపబడు దైవము వేరు అనెడు ద్వైత భావమునందల సాధకుడు సాధనయను నిచ్చెన అట్టడుగు మెట్టులోనున్నాడు. సాధన కొనసాగిన కొలది ఆ నిచ్చెన పై మెట్టు చేరుసరికి — సాధన పరిపక్వమగుసరికి — భగవంతుడు సర్వాంతర్యామియనియు సృష్టియందలి నిఖిల భూతములు ఆయన అంశమే యనియు, అతనికి (సాధకునకు) అవగతమగును. ఈ తీరున అర్చనాదికర్మలవలన భక్తి అభివృద్ధినొంది, అద్వైత భావము బలపడును. ప్రాపంచిక కోరికలవైపునకు పయనించు మనస్సును మళ్లించి భగవంతునిపై కేంద్రీకరింపచేయుటకు విగ్రహారాధన అవసరము. రామకృష్ణుడు కాళీమాతను అర్చించుటచే, ప్రతినిత్యము ఆమెను ధ్యానించుటకు అలవడి ఆమె సాక్షాత్కారమును పొందగల్గినటులనే సాధకుడు తన యిష్టదైవమును పూజించుటతో ప్రారంభించి, ద్వైతభావమును విడనాడి అద్వైతభావమును కాలక్రమమున పొందగలడు. అట్టి అద్వైత భావము స్థిరపడిననాడు ఏ దేవతను పూజించినను పరమాత్మను పూజించినట్లే అనియు, ఏ మతము నవలంబించినను గమ్యము ఒకటే అనియు గ్రహించును.

గాంధి మహాత్మునికి ప్రియతమమగు కీర్తనలో వర్ణించిన తీరున 'ఈశ్వర, అల్లా తేరే నామ్' ఈశ్వరుడన్నను అల్లా అన్నను భగవంతుని వివిధ నామములు మాత్రమేయను ద్వ

నిశ్చయము కల్గినచో మతోన్మాదమునకు తావుండదుకదా! సర్వమతసామరస్యము, ప్రపంచశాంతికి లోకకళ్యాణమునకు అవసరము. సంకుచితస్వభావము అను అజ్ఞానమును నశింపచేసి జ్ఞానమనెడు వెలుగులోనికి గొనిపొమ్మనియు, నశించు స్వభావముగల శరీరమునుండి నాశనములేని మోక్షము కలుగ చేయమనియు చెప్పెడు ఈ దిగువ ప్రార్థనను సదా మననము చేయుదుముగాక!

అసతోమా సద్గమయ
తమసోమా జ్యోతిర్గమయ
మృత్యోర్మాఽమృతం గమయ

Lead me from falsehood to Truth, from darkness to light from death to Immortality.

## ఎన్నాళ్ళీ తమోముద్ర!

డాక్టర్ బొడ్డుపల్లి పురుషోత్తం

ఎన్నాళ్ళీ తమో ముద్ర!
ఎన్నాళ్ళీ గాఢ నిద్ర!!

చీకట్లను బోకార్చుచు
లోకబంధు వుదయించెను
దశ దిశలును వికసించెను
ద్విజసంతానము కూసెను॥ ఎన్నాళ్ళీ

కళానిలయ మిలాతలము
వెలుగొనుము నీ భూమియె
రసపుత్త్రుడ వీవేరా!
రస రాజ్యము నీదేరా॥ ఎన్నాళ్ళీ

అచంచలము నీ లక్ష్యము
అచిరద్యుతి నీ మార్గము
క్షుద్రత్వము విడనాడుము
దక్షత్వము ప్రదర్శింపు॥ ఎన్నాళ్ళీ

లలిత కళోపాసనచే
లాలిత్యము నార్జింపుము
వివిధ శాస్త్ర విజ్ఞతచే
వైదుష్యము సంతరింపు!! ఎన్నాళ్ళీ

కవివైనా నీవేగా
యకుడవైన నీవేగా!
చిత్రలేఖకుడ వీవే
శిల్పివైన నీవేగా ఎన్నాళ్ళీ

తత్త్వవేత్తవైన నీవె
సత్యము సర్వము నీవే
గుర్తింపుము నీలోగల
గుట్టులన్ని తుగముట్టగ॥ ఎన్నాళ్ళీ

# దివ్య పథము

హిందీ మూలం :
శ్రీ సుధాకర్ జీ

స్వేచ్ఛానువాదం :
సూరంపూడి విశ్వేశ్వరరావు

ఇటలీ దేశపు మహాసైన్యాధిపతి గరిబాల్డీ యిల్లు. నలువైపులా దట్టంగా అలుముకున్న నీరవనిశీథిని. ఆకస్మికంగా ఆ చీకట్లో యింటి ప్రాంగణంలో ఎవరో పడిన చప్పుడు అయింది. ఆగంతకుడు విసుగూ వేదన నిండిన స్వరంతో అన్నాడు—

"గరిబాల్డీ యింటికి వచ్చిన వారంతా కాళ్ళు చేతులు విరగగొట్టుకుని బాధపడడం అవసరమా."

స్వరం గుర్తించకుండగనే గరిబాల్డీ తన భార్యతో అన్నాడు — "చూడు — ఎవరో మహానుభావులు వచ్చినట్టున్నారు. వారికి కొంచెం వెలురు చూపించు"

ఆయన భార్య కొంచెం కలవరపడి అంది-

"చేతిలో పైసాకూడా లేందే కొవ్వొత్తి కొనడం ఎలా? వారికి దీపం చూపడం ఎలా సాధ్యం"

వివశుడై గరిబాల్డీ స్వయముగా లేచి ఆగంతకుని హస్తాన్ని పట్టుకుని స్నేహాసిక్త స్వరంతో అన్నాడు—

"మిత్రవరా! ఇంటిలో దీపమునకు ఏర్పాటు ఏమీ లేదు బాబూ! నా వెనుకే రండి. మీకు ఏదీ దెబ్బ తగలదు"

ఎడ్మిరల్ లీన్ ఆశ్చర్య సమ్మిళిత స్వరంతో అన్నాడు—

"మహాసైన్యాధిపతి యింటనే యింత చీకటా...?

కంఠస్వరాన్ని గుర్తుపట్టి గరిబాల్డీ అన్నాడు—

"ఓహో ఎడ్మిరల్! మీరా? క్షమించండి".

కొంచెం ఆగి ఆయనే మళ్ళా అన్నారు.

"యుద్ధమంత్రినుండి ___ ్య సంచాలన బాధ్యత స్వీకరించినప్పుడు నాకు నా కుటుంబా నికి భోజనమునకు మాత్రమే నియామకం జరి గింది కాని అందులో కొవ్వొత్తుల ప్రసక్తి లేదు. అందుకని...పోనీలెండి ముఖములు చూచుకొనక పోయినా మనం సంభాషణ సాగించవచ్చునుకదా"

వారిద్దరూ సంభాషించుకున్న తర్వాత ఎడ్మి రల్ శెలవుగైకొని తక్షణం యుద్ధమంత్రిని కలుసుకొని గరిబాల్డీ వద్దకు విశేషంగా ధనాన్ని పంపించాడు. మర్నాడు భార్య గరి బాల్డీని అడిగింది.

"ఈధనంతో కొవ్వొత్తులుకొనవచ్చునా?"

"ఏమాత్రం వీలులేదు. ఏమంటే దీనితో నేను కొవ్వొవత్తులు కొనవచ్చుననే ఆదేశం లేదు గనుక." చాల శాంతము గంభీరమూ నిండిన స్వరంతో గరిబాల్డీ అన్నాడు.

ఆ రోజునే గరిబాల్డీ సర్వధనాన్ని సైని కులకు వితరణ చేసివేశాడు. దేశానికి శాంతి పుంజమునందించే ఆ మహనీయుని ఇంట అంధ కారమే చోటు చేసుకుంది.

మూర్తీభవించిన యిట్టి త్యాగధనులే వసుధాస్థలిని అమరసీమను చేయగల శిల్పాచా ర్యులు. ఇట్టి మహనీయుల పునీత ఆచరణము చేతనే మానవత్వము సుసంపన్నము అవుతుంది. దేనిలోపంవల్ల మనస్సు వ్యథాసంక్షుభిత మవు తుందో అట్టిది విసర్జించడమే త్యాగమవుతుంది. తమ ధనాగారంలోని యేదో కొద్దిపాటి అంశాన్ని పేదలకు పంచితే అది త్యాగం అని పించుకోదు. దేశబంధు చిత్తరంజనదాసు జీవితంనుండికూడ యిట్టి ప్రేరణాత్మక ప్రసంగం దొరకగలదు.

నామమాత్రనికైన సుమసౌరభాల గుబాళింపులూ సౌకుమార్యంతో సంపర్కంలేక నిరంతరమూ శూలసదృశకంటకాకీర్ణమై వేదన ప్రసాదిస్తూ పథికుల నాహ్వానించే పథమే త్యాగపథము. ఆ దివ్యపథానుగామియైన మహనీయుడు దేశబంధు చిత్తరంజనుడు.

ఆ రోజు చిత్తరంజనదాసు ఆలీపూర్ కుట్ర కేసుకు సంబంధించిన విషయ పరిశీలనలో నిమగ్నులై యున్నారు. శ్రీ అరవిందులు ఇంకా యితర విప్లవకారులయిన దేశభక్తులను రక్షించడంకోసం రేయిబవళ్లు నిద్రాహారాలు మాని సాక్ష్యాధారాలను సేకరిస్తున్నారు. ఒకరోజున ఒక వ్యాపారి 'ఈరోజున ఈయన వద్ద నుండి నాకు రావలసిన రెండు లక్షల రూపాయలు వసూలుచేస్తేకాని యిక్కడ నుంచి కదిలేది లేదుఅనే స్థిరనిశ్చయంతో ఆయన సమ్ముఖంలో కూర్చునియున్నాడు. దేశబంధు వీరి నుండి యీ ధనముకూడ జాతీయ మహాయజ్ఞంలో గ్రుమ్మరించడానికే తీసుకున్నారు. ఆ సమయంలో దేశబంధు వద్దకు ఒక సంపన్నుడు వచ్చాడు. ఆయన తన వ్యాజ్యములో వాదించవలసినదిగా దేశబంధుని అర్థిస్తున్నాడు. కాని ఆ మహనీయునికి రెప్పపాటు కాలమయినా విరామం ఎక్కడ? వచ్చిన ఆ పెద్దమనిషి చిత్తరంజనునికి తక్షణమే ఐదులక్షల రొక్కమును యివ్వడానికి కూడా సంసిద్ధుడయ్యాడు. కాని చిత్తరంజనుడు శాంతమూ వినయమూ తొణికిసలాడే స్వరంతో జవాబిచ్చారు—"బాబూ! మహాత్ములైన దేశభక్తుల ప్రాణముల ముందు మీ ఐదులక్షల విలువ ఏ మాత్రం? నేను ఎవరి ప్రాణ సంరక్షణార్థం యీ దావాలో నిమగ్నుడనయ్యానో దానికి ప్రత్యామ్నాయంగా మీ సర్వసంపదలు గుమ్మరించినా అగణ్యమే అవుతుంది నా"

తన రెండు లక్షలూ ఏమైనాసరే యీాయన వద్దనుండి వసూలుచేసుకోవాలని వచ్చిన ఆ మహాశయుడు యిది విని లజ్జాభారంతో అవనతవదనుడయ్యాడు. ఈ త్యాగదేవత సమ్ముఖంలో ఆయనకు తన తుచ్ఛసంకల్పానికి ఘోరమైన ఆత్మగ్లాని కలిగింది. వెంటనే తన చెక్ బుక్ తీసి శ్రద్ధాభిభూతుడయి దానిని దేశబంధు ముందుంచి అన్నాడు–నేను "మీ నుండి నా డబ్బు యీనాడు ఏమైనాసరే వసూలు చేసుకోవాలనే స్థిరసంకల్పంతో వచ్చాను. కాని అవధులులేని మీ త్యాగ సంపదముందు కుబేరుని యావత్తు సంపదకూడా తక్కువే అని తెలుసుకున్నాను. నా క్షుద్రత్వాన్ని క్షమించమని అర్థిస్తున్నాను. మీకు ఎంత ధనం కావలసినా యీ చెక్కులో వ్రాయండి. దేశంకోసం యీ నా అల్పమైన కానుకను స్వీకరించండి: మీకు సాటి మీరే."

నిజమైన త్యాగంయొక్క ప్రభావము యిక్కరీతిని ఉంటుంది. త్యాగపూర్ణ జీవితంయొక దేనలుప్రైపులా ప్రభామండలం ఏర్పడుతుంది. ఆ ప్రభామండలంనుంచి వెలువడే కిరణాలు స్వార్థపరులైన జనులలోకూడ త్యాగపూర్ణమైన వెలుగులను నింపుతాయి. సేనాపతి సర్ ఫిలిప్‌సిడ్నీ జీవితం ఇంగ్లండుకేకాక విశ్వమంతటా కాంతిపుంజమేలా అయింది? ఎలిజబత్ రాణి సభలో విరాజిల్లే యీ రత్నం తన కలంతో విప్లవ గీతములను సృష్టించడంలో ఎంత నిపుణత్వం చూపారో రణభూమిలో శస్త్ర సంచాలనలోకూడా అంతే దక్షతను చూపారు. జుటఫేన్ యుద్ధరంగంలో పోరాడుతూ యీ వీరుడు గాయపడ్డాడు. గాయముల వేదనతో అతని కంఠం ఎండుకు పోతోంది.

ఒక అనుచీరుడు అతి యత్నంమీద ఎక్కడ నుంచో ఒక గ్లాసుడు మంచినీరు తెగలిగాడు. ఆ నీటిని తృషాకులుడైన ఆ వీరసైనికుని నోటి కందించబోయే క్షణంలో "ఒక గ్రుక్కెడి నీటికోసం ఆక్రోశించే ఒక ఆర్తనాదం అతని చెవిలో పడింది. సమీపంలో గాయాలతో పడియుండిన ఒక సామాన్య సైనికుని యీ ఆకులపాటుతో నిండిన యాచనతో ఫిలిప్ కరుణార్ద్రిభూత చేతస్కుడయ్యాడు. తాను దాహంతో పీడింపబడుతున్నా తన నోటికి సమీపంలో ఉన్న ఆ మంచినీటి గ్లాసును ఆ గాయపడిన సైనికుని నోటికందించాడు. అంత వేదనలో ఫిలిప్ ముఖంమీద త్యాగ సంజనిత కాంతి ప్రస్ఫుటంగా ఉంది — "మిత్రమా! మంచినీరు నాకంటె నీకే అవుస రంబాబూ" అస్పష్టమైన మాటల్లో యింత మాత్రమే ఫిలిప్ చెప్పగలిగాడు. కొద్ది క్షణ ముల తర్వాత దాహంతో విలవిలలాడి యీ లోకాన్ని విడిచిపోయాడు. ఒక సాధారణ సైనికుని తృషను తొలగించడానికి తను దాహంతోనే బలి అయిపోయాడు. కాని యీ ఆత్మోత్సర్గము యీ దివ్య మంత్రానికి ఊపిరి పోసింది — ఆత్మరక్షణ మానవ స్వభావమే అయినా ఆత్మోత్సర్గం దేవత్వానికి సోపానం.

ఈ ఉత్సర్గము—త్యాగముయొక్క గొప్ప దనము, దుఃఖపీడితుడు ఆర్తుడు అయిన మాన వుని జోలిలో ఏ కొద్దిపాటో దానం చేయడం లోనే లేదు. సుఖ ఆనందముల మోహమును వీడి తన సర్వస్వమును మానవత్వ చరణరా జీవములయందు సమర్పణ చేయడంలో ఉత్సర్గ దీప్తి ప్రకటితమవుతుంది. భామాశాహా, రంతిదేవుడు, దధీచి యొక్క త్యాగము యీ కోవకు చెందినదే. ఇది సర్వదా అనుప్రాణితమై యుంటుంది.

మానవ జీవితమునకు అంతిమ సుఖముగా భావింపబడే మోక్షకామనను త్యాగం చేయ డంకంటె మిన్నయైన దానం ఏముంటుంది. చరిత్ర పుటలలో అంకితమైన బందా బైరాగి గాధకూడ యిట్టిదే. రాజ వైభవాన్ని త్యాగ మొనర్చిన రాజకుమారుడొకడు మోక్షార్థియై అరణ్యంలో సాధనలో లీనమయి యున్నాడు. గురుగోవిందసింహు తన అశ్వముమీదనుండి దిగి యీ రాజకుమారుణ్ణి చేరుకుంటాడు. అత నికి ప్రబోధాన్ని కలిగిస్తూ ఆయన ఇలా అన్నారు — "ఈనాడు దేశము యావత్తూ శత్రుపాదా ఘాతములతో ఆక్రాంతమయి యుంది. నీ తల్లుల సోదరీమణుల మాన మర్యాదలు రక్షణలేని పరిస్థితిలోనుండగా నీవు వ్యక్తిగత మోక్షకామివి అవుతావా? స్వార్థాన్ని వీడి ఓ యువక సన్యాసీ! మాతృ గౌరవాన్ని రక్షించు." ఈ శబ్దముల గర్భిత మైన సమ్మోహన మంత్రముతో ముగ్ధుడయి ఆ మోక్షకామియైన యువకుడు మృగాసనాన్ని విడిచి నిలబడతాడు. జపమాలను విడచి మాతృభూమి సంరక్షణకు బయలుదేరుతాడు. మోక్షేచ్ఛనుకూడా కాలదన్నిన యీ యోగి పుంగవుని చరిత్ర బందాబైరాగి అనే పేరుతో చిరముద్ర వేసింది.

ఉత్సర్గ పథము చాల వికటమైనది. ఈ బాటపై పయనం సాగిస్తూ చివరకు ఆ బాటగా తమ్ము మలచుకున్న పాంథుల పాదముల గుర్తులు సర్వులకూ నిత్యనూతనములు చిర సుందరములు, చిరస్మరణీయములు.

(కల్యాణ్ సౌజన్యముతో)

ప్రజలను కష్టాలనుండి దుఃఖాలనుండి ఆపదలనుండి రక్షించగలవాడే ప్రజానాయకుడు కాదగినవాడు. శ్రీకృష్ణునిలో ప్రకటమైన ప్రజానాయకలక్షణాలు కొన్నింటిని ఇప్పుడు చాల సంగ్రహంగా స్మరిస్తాము.

(1) ప్రజానాయకునకుండవలసిన ప్రధాన లక్షణం శక్తిసామర్థ్యం. శ్రీకృష్ణునకుండినదా అంటే ఉండినది-అపారంగానే ఉండినది. దీనికి దుర్యోధనుడే సాక్ష్యం. కురుక్షేత్రసంగ్రామంలో భీష్ముడు పడిపోయాక దుర్యోధనుడు ద్రోణుణ్ణి సేనాధిపతి చేస్తాడు. దానికా బ్రాహ్మణుడు పొంగిపోయి, "దుర్యోధనా! నీకేం వరం కావాలో కోరుకో తీరుస్తాను" అంటాడు. ధర్మరాజును సజీవంగా పట్టి ఇమ్మని కోరుకుంటాడు దుర్యోధనుడు. ఈ కోరిక విని ద్రోణుడు ఆశ్చర్యంతో "ఆహా! అజాతశత్రువనే పేరు అతనికే చెల్లింది. అతణ్ణి చంపమని కోరడానికి బదులు సజీవంగా పట్టి తెమ్మంటున్నావు. అలా పట్టి తెచ్చాక సగంరాజ్యం అతనికిచ్చి గౌరవించి పంపాలనా నీ వుద్దేశం?" అని ప్రశ్నిస్తాడు. సమాధానంగా దుర్యోధనుడు తల అడ్డంగా ఊపుతూ "ఆచార్యా! అటువంటి ఉద్దేశం నాకే మాత్రం లేదు. అతణ్ణి చంపితే చాలా అపాయమని ఆలోచిస్తున్నాను. ఎందుకంటే పాండవులు, ముఖ్యంగా అర్జునుడు కోపంతో రెచ్చిపోయి మనల్నందర్నీ చంపివేయగలరు. ఒకవేళ మనం వాళ్ళ కోపవేగానికి తట్టుకొని నిలబడి వాళ్ళందర్నీ హతమార్చగలమనుకున్నా, కృష్ణుడొకడున్నాడుగదా! వాడూరకుంటాడా? చక్రంతో మనల్నందర్నీ చంపి కుంతికి పట్టం కట్టగలడు. కాబట్టి ధర్మరాజును చంపమనికోరడం తెలివైన పనికాదు. అతణ్ణే బంధించి తెస్తే మళ్ళీ జూదంలో ఓడించి అడవులకు పంపవచ్చునని నా వుద్దేశం" అని అంటాడు. కృష్ణుని శక్తి సామర్థ్యం దుర్యోధనుడే అంగీకరించినట్లు పై వృత్తాంతంవల్ల తెలుస్తుందిగదా!

(2) తనకున్న శక్తిసామర్థ్యాన్ని స్వార్థానికిగాక పరార్థానికే వినియోగించే ఔదార్యం కలిగి ఉండుట ప్రజానాయకునకు ఉండవలసిన మరొక ముఖ్య లక్షణం. ఈ లక్షణం, యౌవనంలో అడుగుబెట్టకముందే శ్రీకృష్ణునిలో ఎలా వ్యక్తమైందో చూడండి:- వృష్టిభోజ అంధకులనే యాదవగణాలు అంతఃకలహాలతోను అనైకమత్యంతోను బలహీనులైపోగా దాన్ని ఆసరాగా తీసుకొని వారి మధ్యలోనే కంసుడనే ఒక కర్కోటకుడు తలఎత్తి, వారందరినీ లోబరచుకొని నానాబాధలు పెట్టసాగాడు. తరతరాలుగా స్వాతంత్ర్య జీవనం గడిపిన యాదవగణాలకు ఈ దుష్ట నియంతృత్వం దుస్సహమనిపించింది. కాని చేసేదేమీ లేక చాలమంది చెల్లాచెదరయి అడవులకు కొండలకు ప్రక్కరాజ్యాలకు పారిపోసాగారు. తక్కిన వారు బానిసత్వంలో మ్రగ్గిపోసాగారు. ఇలా ఉండగా, నందగోకులంలో పుట్టి పెరుగుతున్న కృష్ణుడనే ఒక అసాధారణ బాలుడు, తమ వంశీయుల దుస్థితికి మూలకారణమేమిటో స్పష్టంగా తెలుసుకున్నాడు. మూలకారణం కంసుడు. వెంటనే వాణ్ణి చంపివేస్తాడు. చెదరిపోయిన యాదవగణాలన్నిటికి తిరిగి సంఘటిత పఱచి వాళ్లను ఒక బలమైన వ్యవస్థగా తీర్చిదిద్ది ఆ గణతంత్రానికి ఉగ్రసేనుడనే ఒక వృద్ధుణ్ణి అధ్యక్షునిగా నియమిస్తాడు. ఇంత చేసినవాడు, తానే అధ్యక్షుడు కావాలనుకుంటే కాదని అడ్డుచెప్పేవారెవరూ ఉండరు. కాని కృష్ణుడు ఆ గౌరవాన్ని ఒక వృద్ధునికే వదలిపెట్టి తానుమాత్రం ఒక సాధారణ పౌరుడుగా ఉండటానికే ఇష్టపడ్డాడు.

(3) ఇరుగు పొరుగున అన్యాయం అక్రమం అధర్మం చెలరేగుతుంటే చూస్తూ ఊరకుండక

దానికి తగిన ప్రతిక్రియ చేయడమనేది మరో ముఖ్యమైన ప్రజానాయకలక్షణము. శ్రీకృష్ణునిలో వున్న ఈ నాయకలక్షణానికి ఒక ఉదాహరణ వినండి :— కృష్ణుని సమకాలీనుడైన జరాసంధుడనే ఒక బలశాలి మగధరాజ్యాన్ని పాలిస్తుంటాడు. ఎన్నో మంచి గుణాలున్నవాడేగాని ఒక పెద్దదుర్గుణం అతనిలో చోటు చేసుకొంది. అతను భైరవారాధకుడు. మంచి పుష్పాలు ఫలాలు అర్పించి దేవుణ్ణి ఆరాధించడం అనే పద్ధతి సుతరాం అతనికి నచ్చదు. ఉత్తములైన మానవుల శిరస్సులను బలిగా ఇచ్చి దేవుణ్ణి ఆరాధించడమంటేనే అతనికి ప్రీతి. ఉత్తములను ఎన్నిక చెయ్యడం ఎట్లా? అతని దృష్టిలో రాజ్యాలు ఏలేవారే ఉత్తములు కాబట్టి వారిని ఒక్కొక్కరినిగా బంధించి తీసుకొచ్చి చెరసాలలో పెట్టసాగాడు. వెంటనే బలి యివ్వలేదు. అల్పసంఖ్యతో దేవుడు తృప్తి పడడని పెద్దసంఖ్యతో దేవుణ్ణి ఒక్కసారిగా తృప్తిపఱచదలచి చాలామంది రాజులను పట్టుకొచ్చి చెరసాలల్లో భద్రపఱచసాగాడు. జరాసంధుడిలా రాజులను సేకరిస్తుండగా కృష్ణునకీ పరమదారుణమైన వార్త అందింది. అన్యాయంగా బలికాబోతున్న ఆ దీనులనందరీ ఎలాగైనా రక్షించాలని కంకణం కట్టుకున్నాడు. సైన్యసన్నాహాలతో వెళ్ళి జరాసంధుణ్ణి సాధించడం జరిగేపని కాదని కృష్ణునికి తెలుసు కాబట్టి యుక్తితో భీముడిద్వారా అతణ్ణి చంపించి ఆ రాజులందర్నీ రక్షిస్తాడు. ఆ మగధ రాజ్యానికి జరాసంధుని కొడుకునే రాజుగా నియమించి తిరిగి తనదేశం చేరుకుంటాడు.

(4) లోకకల్యాణం నిమిత్తం ఇష్టబంధువులకు అప్రియం ఆచరించవలసి వచ్చినా వెనుకంజ వేయకుండుట అనేది ప్రజానాయకులకుండవలసిన మరొక ముఖ్యలక్షణం. శ్రీకృష్ణునిలో ఉన్న ఈ నాయకలక్షణానికి ఒక ఉదాహరణ వినండి:— కౌరవులకు పాండవులకు యుద్ధం వచ్చినప్పుడు దేశమంతా రెండు వర్గాలుగా విడిపోయింది. చాలామంది నాయకుల నిర్ణయాలు ధర్మాధర్మాలనుబట్టి గాక రాగద్వేషాలననుసరించి జరిగింది. ఉదా॥ శల్యుడు, నకుల సహదేవులకు మేనమామ అయినా పాండవ పక్షం చేరలేదు. కౌరవ పక్షంలో చేర్తాడు. కారణం ఏమంటే, అతనికి శ్రీకృష్ణుడంటే పడదు. రథసారథ్యంలో తనకున్నంత నేర్పు శ్రీకృష్ణునకున్నదే అన్న స్పర్ధ, ద్వేషమే యీ పడకపోవడానికి కారణం. శ్రీకృష్ణుడు పాండవపక్షంలో వుంటాడు గనక, ధర్మాధర్మాల సంగతి దేవుడెరుగు తాను మాత్రం కౌరవపక్షంలోనే వుండాలని నిర్ణయిస్తాడు. ద్రోణుడూ ఈ రకమే. అతనికి ద్రుపదుడంటే పడదు. ద్రుపదుడు పాండవపక్షంలో వుంటాడని తెలుసు కాబట్టి తాను కౌరవపక్షంలోనే వుండిపోవాలని చాలా ఏండ్లముందతే నిర్ణయం తీసుకుంటాడు. ఇక యాదవుల సంగతికి వస్తే వాళ్ళూ యింతే. సాత్యకి కృతవర్మలకు పరస్పరం పడదు. సాత్యకి పాండవుల తరపున ప్రచారానికి దిగగా కృతవర్మ దుర్యోధనుడి తరపున ప్రచారానికి దిగాడు. చివరకు యాదవగణాలను ఇద్దరూ చెరిసగం పంచుకున్నారు. ఇలా యాదవగణాలు రెండుగా చీలిపోయేసరికి బలరాముడు సందిగ్ధావస్థలో పడతాడు. కౌరవ పక్షానికి 'జై' అంటే సాత్యకి వర్గంవాళ్ళ మనస్సులు నొప్పించినట్లవుతుంది; పాండవ పక్షానికి 'జై' అంటే కృతవర్మ వర్గంవాళ్ళ మనస్సులు నొప్పించినట్లవుతుంది; రెండువర్గాల వాళ్ళూ తనకు కావలసిన వారే. కాబట్టి ఏ వర్గానికీ అప్రియం కలిగించడం ఇష్టంలేక తాటస్థ్యభావం వహించి తీర్థయాత్రలకు వెళ్ళిపోతాడు. కృష్ణుడు మాత్రం బంధువుల అనుయాయుల ఇష్టాఇష్టాలను ప్రియాప్రియాలను ఏ మాత్రం లక్ష్యపెట్టక ధర్మం వున్న పాండవ పక్షానికి సహాయంగా నిలబడతాడు.

# బాలల శారదాదేవి

బి. ఎస్. ఆర్. ఆంజనేయులు

## మాతృ మందిరం

అది 1909 వ సంవత్సరము. మాతృదేవికి యిప్పుడు యాబదిఆరవఏడు. శ్రీరామకృష్ణ దేవుడు నిర్యాణముచెంది 23 సంవత్సరాలయింది. ఇన్నిరోజులు మాతృదేవికి వుండటానికి స్థిరమైనచోటు లేదు.

బేలూరు మఠానికి శారదానందస్వామి ప్రధాన కార్యదర్శి. మాతృదేవి అంటే ఆయనకు యెంతో భక్తి. ఆంజనేయస్వామి, రాములవారికి బంటులాగా సేవచేశాడు. రాముల వారు ఎక్కడవుంటే ఆంజనేయస్వామి అక్కడే వుండేవాడు. ఆయన ఆజ్ఞలేకుండా రాముల వారి దగ్గరకు పోలేము. అదేవిధంగా శశిమహరాజ్ కూడా శ్రీరామకృష్ణదేవుని సేవించాడు.

శారదాదేవి విషయంలో శారదానందస్వామికూడ అలాగే యున్నారు. మాతృదేవి సుఖంగా వుండటానికి మూడంతస్థుల మేడ 1909 కట్టించారు. రామకృష్ణమిషన్‌కు ఉద్బోధన్ అనే బెంగాలీ మాసపత్రిక వుంది. దాని కార్యాలయం క్రిందిభాగంలో పెట్టారు. పై అంతస్తులో మాతృదేవి నివాసము. ఆమె మేనకోడళ్లు రాధు, మాకు. నళిని, రాధుతల్లి సురబాల కూడా అక్కడే వుండేవాళ్ళు. మాతృదేవి వుండటంవల్ల ఈ భవనానికి మాతృమందిరం అనే పేరు వచ్చింది. దాన్ని ఉద్బోధన్ ఆఫీసు అని కూడా అంటారు.

ఈ భవనం క్రిందిఅంతస్తులో మెట్లప్రక్కగా ఒకచిన్నగది ఉన్నది. దానిలో శారదా నందస్వామి వుండేవారు. ఎవరన్నా తెలియనివారు అడిగితే ''నేను శారదాదేవి గేటుకాచే కాపలావాణ్ణి'' అని చెప్పేవాడు. తాను రామకృష్ణమిషన్ ప్రధానకార్యదర్శి అయినా, బేలూరు మఠంలో వుండకుండా ఈ చిన్న గదిలోనే వుండేవాడు. మాతృ మందిరాన్ని కట్టించటానికి, ఎంతో శ్రమపడటమే కాకుండా అప్పుకూడా చేశాడు. ఆ అప్పు తీర్చటానికి ఎంతో కష్టపడి శ్రీరామకృష్ణ లీలాప్రసంగం అనే గొప్పగ్రంథాన్ని వ్రాశాడు. మీరు పెద్దవాళ్ళయినతర్వాత దాన్ని చదివితే మీకు ఎన్నోవిషయాలు తెలుస్తాయి. మాతృదేవికి బంటులాగా సేవచేశాడు గాబట్టే 'శారదానంద' అనే పేరు ఆయనకు సార్థకమైపోయింది.

ఎటుల రాముని హనుమ తానెపుడు గొలిచె  
శ్రద్ధతో నెట్లు గురుసేవ శశి యొనర్చె  
నటులె సేవించె శారదానందుడన్న  
స్వామి శ్రీ మాతృదేవిని సంతతమ్ము

సంపాదకులు: స్వామి తన్మయానంద.

శ్రీ ఎమ్. బాలసుందరంగారిచే ఫ్రీడమ్ ప్రెస్, (మద్రాసు-600 021) న ముద్రింపబడి.

స్వామి తన్మయానందవారిచే శ్రీ రామకృష్ణమఠము (మద్రాసు-600 004) నుండి ప్రచురింపబడినది.

# మా ప్రచురణావళి

| గ్రంథము | వెల |
|---|---|
| శ్రీ రామకృష్ణ కథామృతము | |
| శ్రీ రామకృష్ణ జీవితచరిత్ర | |
| శ్రీ రామకృష్ణ బోధామృతము | 3.00 |
| శ్రీ రామకృష్ణోపనిషత్తు | 3.75 |
| శ్రీ రామకృష్ణపరమహంస నీతికథారత్నములు | 2.50 |
| గురూపదేశములు | 2.00 |
| నా గురుదేవుడు | 1.25 |
| శ్రీ రామకృష్ణ దివ్యవాణి | 1.50 |
| శ్రీ రామకృష్ణ పరమహంస జీవిత సంగ్రహము | 0.75 |
| అష్టోత్తరశతము మరియు | |
| శ్రీ రామనామ సంకీర్తనము | 0.50 |
| శ్రీ శారదాదేవి జీవిత చరిత్ర | 4.00 |
| శ్రీ శారదాదేవి | 2.50 |
| శ్రీ శారదా సూక్తి నవనీతము | 0.80 |
| శ్రీ వివేకానంద జీవిత చరిత్ర | 4.00 |
| బాలల వివేకానందుడు | 2.00 |
| శ్రీ వివేకానంద సంపూర్ణగ్రంథావళి | |
| 9 సంపుటముల పూర్తిసెట్టు (సాదా) | 55.00 |
| .. .. (క్యాలికో) | 61.00 |
| విడి సంపుటములు ఒక్కొక్కటి (సాదా) | 5.00 |
| .. .. (క్యాలికో) | 6.50 |
| స్వామి శిష్య సంవాదములు | 10.50 |
| సందేశ తరంగిణి (మొదటి భాగము) | 4.00 |
| .. (రెండవ భాగము) | 5.50 |
| భారత యువజనులారా! | 3.00 |
| ప్రబోధ రత్నాకరము | 3.75 |
| రాజయోగము | 6.25 |
| కర్మయోగము | 4.00 |
| భక్తియోగము | 4.00 |
| శ్రీ వివేకానందలేఖావళి (మొదటిభాగము) | 2.25 |
| .. (రెండవభాగము) | 3.00 |
| హిందూ మతము | 4.00 |
| వివేక చూడామణి | 4.00 |
| అనుష్ఠాన వేదాంతము | 3.50 |
| ప్రాచ్యము - పాశ్చాత్యము | 1.25 |
| కులము, సంస్కృతి, సామ్యవాదము | 3.00 |
| భారతదేశము | 2.00 |
| భారతీయ మహిళ | 2.00 |
| నా జీవితము, జీవిత కార్యము | 1.25 |
| శ్రీ రామకృష్ణ సేవాసంస్థ: తదాదర్శములు | 0.50 |
| చికాగో నగరోపన్యాసములు | 1.00 |
| శ్రీ వివేకానంద శంఖారావము | 0.80 |
| నవీన భారత దేశము | 0.40 |
| సర్వం విష్ణుమయం జగత్ | 0.35 |
| శ్రీ వివేకానంద సింహగర్జనలు | 0.20 |
| బ్రహ్మానంద బోధనలు | 4.75 |
| తాపత్రయ చికిత్స | 0.80 |
| ముక్తిమార్గము | 0.30 |
| పారమార్థిక సంభాషణలు | 8.50 |
| నారద భక్తి సూత్రములు | 4.00 |
| శ్రీ దొడ్డ భాగవతము-మూడవ సంపుటము | 7.50 |
| దేవీమాహాత్మ్యము | 4.00 |
| శ్రీ మద్భగవద్గీత | 9.00 |
| శ్రీ మద్భగవద్గీత చిన్నసైజు | 3.00 |
| పారాయణగీత తాత్పర్యసహితము | 8.75 |
| .. మూలము | 2.00 |
| కఠోపనిషత్తు | 2.00 |
| గిరీశచంద్ర | 1.00 |
| భక్తిమార్గము | 1.00 |
| శ్రీకృష్ణవాణి | 0.80 |
| బుద్ధవాచ | 0.80 |
| క్రీస్తు సూక్తిమాల | 0.80 |
| మహమ్మదు సూక్తి మంజరి | 0.80 |
| శ్రీ విష్ణుసహస్రనామ స్తోత్రము | 1.25 |

ఇవియేకాక ఆంగ్ల, సంస్కృత, తమిళ, హిందీ, కన్నడ గ్రంథములును.

వేదాంత కేసరి (ఆంగ్లము) శ్రీ రామకృష్ణ విజయము (తమిళము)

అను మాసపత్రికలును, శ్రీ రామకృష్ణ పరమహంస, శ్రీ శారదాదేవి, శ్రీ వివేకానందస్వామి మున్నగువారి ఛాయాచిత్రములు, త్రివర్ణ చిత్రములు, తైలచిత్రములు మున్నగున వెన్నియో మా యొద్ద లభింప గలవు.

అడ్రెసు: మేనేజరు, శ్రీ రామకృష్ణ మఠము, మైలాపూరు, మద్రాసు - 600 004

సంవత్సర చందా రూ. 10-00 జీవిత చందా రూ. 125-00 విడి సంచిక 1-00 రూ

# శ్రీ రామకృష్ణ ప్రభ

ఆత్మనో మోక్షార్థం జగద్ధితాయ చ

సంపుటము 36 సంచిక 7 జూలై 1979





# శ్రీ రామకృష్ణ కథామృతము

నేడే కొనండి! (ప్రథమ భాగము) పదేపదే చదవండి!

శ్రీ "మ.—" చే వంగభాషలో విరచితమైన మూలగ్రంథమునుండి అనూదితము. నవభారత నిర్మాతయగు శ్రీ వివేకానందస్వామికి శ్రీరామకృష్ణ పరమహంస గురుదేవుడు. ఆ పరమహంసదేవుని దివ్య వచనామృతమును శ్రీ "మ.—" ఆనంద తన్మయతతో తాను వినినది వినినట్లుగ ఐదు భాగములుగ గ్రంథస్థ మొనర్చెను. అందు ప్రథమ భాగమిది.

ఆ అవతారమూర్తియొక్క వచనములు ఈ పుటలయందు మనస్సును పూర్తిగ ఆకట్టుకొనునట్లుగ అనువదింపబడినవి. వీనిలో పరిష్కరింపబడని తత్త్వవిషయిక సమస్యలేదు. తొలగింపబడని ఆధ్యాత్మిక సంశయము లేదు. వివరింపబడని ఆత్మవికాసక విషయములేదు. ఆసక్తికరము. ఆధ్యాత్మికులకు ఒక వరప్రసాదము.

వెల : సాదా : రూ. 8–00

పుటలు : 240 + VIII ప్రథమ ముద్రణము కాలికో : రూ. 12–00

# శ్రీ రామకృష్ణ జీవిత చరిత్ర

రచయిత : శ్రీ చిరంతనానందస్వామి

వంగభాషలోని మూలప్రమాణ గ్రంథముల ననుసరించి రచింపబడినది. ఇందు శ్రీ రామకృష్ణుని జీవితాంశములు మృదుమధురమగు తేటతెనుగున సమగ్రముగ వివరింపబడినవి. ఢిల్లీ సాహిత్య అకాడెమీ వారిచే ఉత్తమోత్తమ గ్రంథముగ నిర్ణయింపబడినవి.

శ్రీ రామకృష్ణ జీవితచరిత్ర ఆద్యంతము ఆత్మవైభవమే. దివ్యవైభవమే. ఇదియొక దెస కావ్యము. ఇంకొకదెస చరిత్రము వెరసి తత్త్వ సంహిత. లేక దివ్య కావ్యము. ఈ శ్రీ రామకృష్ణ జీవిత చరిత్ర శారదాకంఠమున ఓంకారఘంట; రోమాంచముల పంట.

—శ్రీ వేలూరి శివరామశాస్త్రి.

....విమర్శక చక్రవర్తి....కీ. శే. శ్రీ కట్టమంచి రామలింగారెడ్డిగారి శ్లాఘామోదములనందిన మీ పూర్వ గ్రంథముల వలె ఇది రచనావైదగ్ధ్యమున....మించియున్నది. విషయౌదాత్త్యము రచనౌదాత్త్యముగా పరిణమించుట స్వాభావికమే కదా సిద్ధహస్తుల చేతులతో!

—శ్రీ కందుకూరి మల్లికార్జునం.

It is bound to communicate to the **reader** the beauty and power of Sri Ramakrishna's life. **—Sri S. Radhakrishnan.**

**Classic...authentic...It will be a very valuable addition to the Telugu literature.**
**—The Hindu.**

పుటలు : 478 + XXX వెల : రూ. 10–00

ఇట్లు వ్రాయుడు : మేనేజరు, శ్రీ రామకృష్ణ మఠము, మైలాపూర్, మద్రాసు-600 004.

# శ్రీ రామకృష్ణ ప్రభ

సంపుటము 38　　　　1979 - జూలై　　　　సంచిక 7

## విషయసూచిక



గమనిక:-రామకృష్ణప్రభ, జూన్ సంచికలో ప్రచురితమైన "జగద్గురు శంకరుల ప్రజ్ఞాపారమ్యము" అను రచన గావించిన రచయిత పేరు పొరపాటున ఆ సంచికలో సూచింపబడలేదు. ఆ రచన గావించిన వారు డా॥ రత్నాకర బాలరాజు (తెలుగు శాఖాధ్యక్షులు-ప్రభుత్వకళాశాల-అనంతపురము)

శ్రీ రామకృష్ణ ప్రభ

సంవత్సర చందా: రూ. 10-00.　　జీవిత చందా: రూ. 125-00.

శ్రీ రామకృష్ణమఠము,

మైలాపూర్, మద్రాసు-600-004.

# చందాదారులకు - గమనిక

- శ్రీ రామకృష్ణప్రభ (ఆధ్యాత్మిక మాసపత్రిక) ప్రతి ఇంగ్లీషునెల మొదటివారములో వెలువడును.

- సంవత్సరచందా పది రూపాయలు.

- జీవితచందా నూటపాతిక రూపాయలు.

- జీవితచందాదారులు కాగోరియు ఒక్కసారిగా నూటపాతిక రూపాయలు చెల్లించలేనివారు, వాయిదాలపై (ప్రతిసారి పదిరూపాయలకు తక్కువగాకుండ) ఒక సంవత్సరకాలములో మొత్తము పైకమును చెల్లింపవచ్చును.

- జీవితచందాదారులయిన ఐదేండ్లతరువాత, ఏకారణముచేనైననూ, చందా రద్దు చేసుకొనగోరువారికి, మొత్తము పైకము వాపసు చేయబడును.

- చందాదారులు కాగోరువారు ఏనెలనుండియైనను చందాదారులు కావచ్చును.

- చందాపైకమును మనియార్డర్ద్వారాగాని, పోస్టల్ ఆర్డర్ద్వారాగాని, బ్యాంక్ డ్రాఫ్ట్ద్వారాగాని ముందుగానే పంపవలెను.

- క్రొత్తగా చందాదారులుగా చేరువారు "క్రొత్త చందాదారుడను" అని తెలియజేయవలసినదిగా మనవి.

- చందాదారులయినవారు, తమ చందానంబరును (R. P. ...............) గుర్తుంచుకొని ఉత్తర ప్రత్యుత్తరములలో దానిని ఉదాహరింపవలెను.

  (ప్రతినెల పోస్టుద్వారా మీ కందజేయబడు రామకృష్ణప్రభ కవరుపైనుండు మీ విలాసము మీద, మీ చందానంబరు గుర్తింపబడియుండును. గమనించగలరు.)

- మీరు వ్రాయు ఉత్తరములందు, M. O. కూపనులందు మీ విలాసమును, చందానంబరును స్పష్టముగా వ్రాయవలసినదిగా మనవి.

- మీ అడ్రసు మారినపుడు మాకాసంగతి తెలియజేయగలరు.

- ప్రత్యుత్తరమపేక్షించెడి ఉత్తరములు వ్రాయువారు రిప్లయికార్డుగాని, తగినన్ని స్టాంపులుగాని పంపగలరు.

- రామకృష్ణ మఠము, మద్రాసు-4 నుండి వెలువడు అన్ని పుస్తకములపై రామకృష్ణ ప్రభ చందాదారులకు 6 శాతము తగ్గింపు కలదు.

# శ్రీరామకృష్ణప్రభ

సంపుటము 36 | 1979 - జూలై | సంచిక 7

## నృసింహాష్టకము

శ్రీశ! జగదీశ! పరమేశ! చిత్ప్రకాశ!
భాస్కర సహస్ర సంకాశ! పాపనాశ!
వందనములు, నీ పాదారవిందములకు,
సింహశైల నివాస! లక్ష్మీనృసింహా!

స్వామి! భవదీయ విభ్రమ జనకమైన
మూర్తిని సృజింపగను చతుర్ముఖునివశమె?
నిన్ను నీవె సృజించుకొంటివి గదయ్య!
కోటి ప్రణతులు నీకు, లక్ష్మీనృసింహా!

ధరణి మహదాశ్రయమ్ము కర్తవ్యమగుట
నరునకు, పరాత్పరుండవై, వరలు నిన్ను
నమ్మితిని, నన్ను బ్రోచు భారమ్ము నీది;
సింహశైల నివాస! లక్ష్మీనృసింహా!

తులసిదళములతోడను, జలముతోడ,
పూలతో, ఫలముతోడ ముదమునంది
పరమపదమును గూర్చెడి ప్రభుడవీవు
క్షితిని, నీసాటి యెవరు, లక్ష్మీనృసింహా!

భక్తులొందెడి బాధలు బాపుటకును
నీవు బాధలు బడెదవు నిన్ను బోలు
భక్తరక్షామణిగలండె, వసుధయందు
సింహశైల నివాస! లక్ష్మీనృసింహా!

హరి! హరి! యటంచు, నీ నామమనవరతము
మానసంబున భక్తితో స్మరణజేసి
నీ కరుణను, ప్రహ్లాదుడు, నిస్తులమగు
శ్రేయమందెనుగాదె? లక్ష్మీనృసింహా!

ఖనిజమైన, మృత్తికమైన, గ్రావమైన,
దారువైనను నీ కృపాకారణమున
వర్ణనాతీత వైభవాస్పదమునగుచు,
పూజలందునుగాదె? ప్రభూ! నృసింహా!

రాక్షసౌఘ శిక్షణము, నీ వీక్షణంబు,
నిస్తుల సుఖంబునకు త్రోవ, నీదు సేవ,
భానుతీక్ష్ణాంశు నఖములు, నీనఖములు
శుభకరములు, నీ కరములు, ప్రభు! నృసింహా!

పావకీన చరిత్రంబు దలపనట్టి
వాసరంబులు, కల్మష ధూసరములు,
ఆదిదేవ! నీ పూజతో నలరనట్టి
ఘటిక, విషఘటిక, బుధసఖా! నృసింహా!

భోగిరాట్ భోగరాజిత పుణ్యమూర్తి!
సాధు హృద్వర్తి! జగదేక చక్రవర్తి!
యతివరేణ్య! శరణ్య! నిన్నాత్మదలతు;
సింహశైలనివాస! లక్ష్మీనృసింహా!

—కూరెళ్ళ రామనరసింగరావు.

# శ్రీ రామకృష్ణ కథామృతము
(రెండవ భాగము)

## అధ్యాయము - 18

### కలకత్తాలో అధరసేనుని ఇంట భక్తులతో

1884 అక్టోబరు 1 వ తేదీ బుధవారము

శ్రీరామకృష్ణులు దక్షిణేశ్వరము నుండి అధరుని ఇంటికి బండీలో వచ్చుచుండిరి. నారాయణ్, గంగాధర్ వారితోనుండిరి. దారిలో శ్రీరామకృష్ణులకు భావావేశము కలిగి తనలో తాను ఇట్లు మాట్లాడుచుండిరి. 'జపమాల తీసికొని జపించనా? ఈ శివలింగము స్వయం భూలింగము.' బండి అధరుని ఇల్లుచేరినది. అచట చాలమంది భక్తులు గుమికూడి యుండిరి. గాయకుడగు వైష్ణవచరణుడు వచ్చియుండెను. అధరుడు శ్రీరామకృష్ణుల ఆదేశానుసారము ప్రతిరోజు ఆఫీసునుండి తిరిగివచ్చి వైష్ణవచరణుని ర్తనలు వినును. అతడు చాల మధురముగ పాడును. నేడును సంకీర్తనలు జరుగును. శ్రీరామకృష్ణులు ముంగిలిలో ప్రవేశింపగనే భక్తులులేచి వారికి మ్రొక్కిరి. శ్రీరామకృష్ణులు నవ్వుచూ కూర్చొనిరి. భక్తులు కూడ కూర్చొనిరి. కేదారుడు, విజయుడు వచ్చి ప్రణమిల్లిరి. శ్రీరామకృష్ణులు నారాయణుని, బాబూరామ్‌ను వారిద్దరికి నమస్కారములు చేయుడని చెప్పిరి. వారిద్దరు అట్లనే నమస్కరించునపుడు కేదార విజయులతో రామకృష్ణులు "మీరు వీరలకు భక్తి కలుగునట్లుగ ఆశీర్వదింపుడు" అనిరి. భక్తులు తదేకదృష్టితో బాబూరాం నారాయణుల వైపు చూచుచుండిరి.

శ్రీరామకృష్ణులు (కేదారాది భక్తులతో) మిమ్ములను దారిలో చూడడం మంచిదైనది. లేకున్న మీరు దక్షిణేశ్వరమునకు పోయి యుందురుకదా! భగవంతుని ఇచ్ఛ—ఇచ్చటనే చూడడమైనది.

కేదార్ (వినయముగ చేతులు జోడించి) "ఈశ్వర సంకల్పము మీ సంకల్పము ఒకటే గదా" అనిరి. ఈ మాట విని శ్రీరామకృష్ణులు నవ్వుచుండిరి. వైష్ణచరణుడు కృష్ణలీల పాటలు పాడనారంభించెను. రాసలీల సంకీర్తన ముగించి అటుపై రాధాకృష్ణుల లీలలగూర్చిన పాట నారంభింపగనే శ్రీరామకృష్ణులు ప్రేమోన్మాదముతో నృత్యము చేయనారంభించిరి. వారితోబాటు భక్తులును సంకీర్తనలు పాడుచు నృత్యముచేసిరి. సంకీర్త ముగిసెను. నృత్యము చేసి చేసి బాగా అలసినందున భక్తశిఖామణులందరు నేలపై చతికిలబడిరి.

శ్రీరామకృష్ణులు (విజయునితో) 'ఈయన చక్కగ పాడునుకదా?' అని వైష్ణవచరణుని వైపు తిరిగి 'శ్రీగౌరంగ సుందర' అను పాట పాడమనిరి. వైష్ణవచరణుడు చెప్పినదే తడవుగ పాడనారంభించెను.

గౌరాంగసుందర నవనటవర తపతకాంచనకాయ

.... .... .... .... .... .... .... .... .... ....

పాట ముగిసినవెంటనే 'పాట ఎట్లున్నది?' అని విజయుని అడుగగా నాతడు తన్మయీ భావమును మోమున ప్రకటించుచూ అద్భుతము అద్భుతము అద్భుతము' అని ముమ్మారు గట్టిగా అఱచి చెప్పెను. తరువాత శ్రీరామకృష్ణులు స్వయముగా గౌరాంగ ప్రేమను వర్ణించునొక పాటను పాడిరి. మఱియు వారితో కంఠము కలిపెను. ఆ పాట ముగిసిన వెంటనే వైష్ణవచరణుడు హరినామసంకీర్తన నెత్తుకొనెను. కీర్తన పూర్తిచేసి వెంటనే దుర్గాదేవి పాటనొకటి పాడనారంభించెను. శ్రీరామకృష్ణ

లాతని మధ్యలో ఆపి ఆ పాట పాడవలసిన రీతిని పాడి చూపించిరి. వైష్ణవచరణ్ శ్రీరామ కృష్ణులు బోధించిన రీతిలోనే పాట సాగించెను. ఆ పాటలోని కొన్ని పాదములను శ్రీరామ కృష్ణులు కూడ గాయకునితో బాటు పాడిరి.

చల అచల తుమిమా—తుమి సూక్ష్మస్థూల
సృష్టి స్థితి ప్రలయ తుమిమా తుమి విశ్వమూల
త్రిలోకజననీ తుమి, త్రిలోకతారిణీ
సకలేతు శక్తి తుమి, మా తోమార్ శక్తి తుమి.

(అమ్మా! చరాచరములు నీవే. స్థూల సూక్ష్మములు నీవే. సృష్టి స్థితి లయములు నీవే. ఈ విశ్వమునకు మూలము నీవే. త్రిలోకములకు తల్లివి నీవే. ఈ లోకమును తరింపజేయు దానవు నీవే. సకల పదార్థముల శక్తివి నీవే.)

సంకీర్తనలు ముగియగనే కేదారుడు మరి కొందఱు భక్తులు తమ ఇండ్లకు పోవుటకై లేచిరి. కేదారుడు శ్రీరామకృష్ణులకు ప్రణమిల్లి 'ఇక శెలవు తీసికొనెదము' అనెను. కేదార్ వెళ్ళిపోవుటకు ముందు 'బంగవాసి' పత్రిక సంపాదకుడు జోగీంద్రుడు వచ్చి శ్రీరామ కృష్ణులకు మ్రొక్కి కూర్చొనెను- అంతట సాకార నిరాకారముల గూర్చిన చర్చ తల ఎత్తెను.

శ్రీరామకృష్ణులు :- అతడు సాకారుడు, నిరాకారుడున్ను. ఇంకను ఎన్ని రకములవాడో మన మెరుగము. అట్టితరి మొండి పట్టుదలతో నాతడిటువంటి వాడే అటువంటివాడే అని చెప్ప దగునా?

జోగీంద్ర:- బ్రహ్మసమాజము వారి వింత వినండి. ఆ సమాజములో పన్నెండ్ల బాలుడు కూడ నిరాకార బ్రహ్మమునే చూచునట!

శ్రీరామకృష్ణులు (నవ్వుచూ) అహా! ఈయన ఎంత చక్కగా చెప్పిరి! అంగీ సరిగా తొడుగుటకు చేతగాని కఱ్ఱవాళ్లు సహితము అక్కడ నిరాకారమునే ధ్యానింతురట!

అధరుడు : శివనాథబాబుగారు సాకారమును ఒప్పుకొనరా?

విజయుడు: అది వారి పొరపాటు. శ్రీరామ కృష్ణులు చెప్పునట్లుగ భగవంతుని స్వరూపము ఊసరవెల్లి చందము. ఒక్కొక్కప్పుడు ఒక్కొక్కరికి ఒక్కొక్క విధముగ కనిపించును. ధ్యానించుచుంటి ఎన్నో దేవతామూర్తులను చూచితిని. ఆ దేవతామూర్తులు ఏమేమో నాతో చెప్పునట్లు తోచెడిది. అప్పుడు నేనిట్ల నెడివాడను; "నేను శ్రీరామకృష్ణుల కడకు పోయెదను. వారే నాకంతయు విశదపరచ గలరు.

శ్రీరామకృష్ణులు: నీవు ధ్యానమున చూచినది యథార్థమే.

కేదారుడు: భక్తులకొఱకు భగవానుడు సాకారమూర్తియగును. భగవత్ప్రేమలో భక్తుడు సాకారమూర్తిని దర్శించును. ధృవుడు శ్రీ మహావిష్ణువును దర్శించినపుడు "నీ కుండలములు కదలుట లేదేమి!" అని ప్రశ్నింప నారాయణుడు "నీవు కదలించినచో కదలును" అనెను.

శ్రీరామకృష్ణులు: అన్నియు ఒప్పుకొనవలసినదే. సాకారము నిరాకారము అన్నింటిని ఒప్పుకొని తీరవలసినదే. నేను కాళికాలయములో ధ్యానించుచుండ రమణియను వేశ్య రూపమున దేవిని చూచితిని. అంత "అమ్మా! నీవీ రూపమున కూడ ఉన్నావా?" అంటిని. భగవంతుడు ఎవరికి ఎప్పుడు ఏ రూపములో దర్శనమిచ్చునో తెలియదనియే నేను చెప్పునది.

విజయుడు:—అతడు అనంతశక్తిస్వరూపుడు. అతడు ఏ రూపములోనైననూ అగపడగలడు. మానవులు ధూళిలోని ఒక రేణువుతో తుల్యులు. అట్టివారు భగవంతుని ఫలానా అని నిర్ధారణ చేయుట వెఱ్ఱితనముగాక మరే మగును!

శ్రీరామకృష్ణులు: ఏదో కొంచము భగవద్గీత, భాగవతము, వేదాంతము చదువుకొనిన పండింతంమన్యులు, భగవంతుని సంపూర్ణముగ నెఱిగితిమని విఱ్ఱవీగుచుందురు. ఒక కథవినుము: ఒక చిన్ని ఎఱ్ఱచీమ ఒక పెద్ద చక్కెర కొండ వద్దకు పోయెను. ఒక్క కణము మ్రింగగనే దాని కడుపు నిండిపోయెను. ఇంకొక్క కణము నోటకఱచి తన కన్నమునకు తెచ్చుకొనుచు దారిలోనిట్లు తలపోసెను. "మఱొకసారి వెళ్ళి ఆ కొండనంతయు ఒక్కసారిగా నోట కఱచుకొని నా కన్నమునకు తెచ్చి దాచుకొందును." (అందరు నవ్వుదురు.)

—సశేషము.

## "జోహారులు"

మానవత్వమ్ము ప్రబోధింప
సమానత్వమ్ము సాధింప
సనాతనధర్మ మెరింగింప
దివ్యసందేశంబు ప్రబోధింప
మహిలో వెలసిన మహనీయుడు
పరమహంసగామారిన గదాధరుడు
వంగదేశమయిన బెంగాలులో
గంగ ప్రవహించే పుణ్యభూమిలో
జగన్మాతకు ప్రియ పుత్రుండై
తోతాపురికి ప్రియ శిష్యుండై
జగద్గురువై జన్మించినాడు
జ్ఞానబోధనలు బోధించినాడు
పరిత్యాగ మొనరించి
పరమహంసగ మారిన,
ప్రేమ సందేశంబు నందించి
జగన్మాతతో జేరిన
రామకృష్ణా జోహారులు
అందుకోవయ్యా జోహారులు.

—మునుగోటి శ్రీనివాసమూర్తి.

# గాయత్రీమంత్రార్థము

భూతపురి సుబ్రహ్మణ్యశర్మ

గాయత్రీశబ్దమునకు చంద్రచెట్టనియు గాయత్రీఛందస్సనియు గాయత్రీమంత్రమనియు మూడు పేర్లున్నవి. వైద్యపరముగా గాయత్రికి చంద్రచెట్టని చెప్పునప్పుడు 'గాయంతం వైద్యం త్రాయత ఇతి గాయత్రీ' అనవలెను. అట్లు అనుటలో గాయంతులనగా వైద్యులు, వారిని రక్షించునది అని అర్థము. గాయత్రిని ఛందస్సుపరముగ మంత్రపరముగా అర్థము చెప్పుకొన్నప్పుడు 'గాయంతం త్రాయత ఇతి గాయత్రీ' అనగా తనను జపించు వారిని రక్షించునది అని అర్థము. ఉపాసకులు గాయత్రీమంత్రమును జపింతురు. కవులు గాయత్రీఛందస్సునారాధించి శ్లోకరచన చేయుదురు. ఇరువురిని కాపాడునది గాయత్రి. 'ఛన్దయత్యాహ్లాదయతీతి ఛందః' అనగా సంతోషపెట్టునది. 'మన్యత ఇతి మంత్రః' అనగా విచారింపబడునది. కవులు ఛందస్సులో (గాయత్రీఛందస్సు) ఆనందపడుదురు. ఉపాసకులు గాయత్రీమంత్రమును విచారించి ముక్తులగుదురు. ఇందులకు ప్రమాణము పరాశరస్మృతి. పరాశరమహర్షి 'విచారాత్ జాయతే ముక్తిః' అని ప్రవచించుటవలన జ్ఞానులకు విచారమవసరము-ఇట్టి విచారము కలవారు లోకమున చాల అరుదు. అందువలనే 'జ్ఞానీ త్రైలోక్యదుర్లభమ్' అని చెప్పబడినది

ఉపనీతులైనవారు త్రిసంధ్యలలో గాయత్రీ మంత్రమును జపింపవలెను. సంధ్యాకాలములోనే గాయత్రీ మంత్రమును ఎందులకు జపింపవలయుననగా ఇందులకు వేదము "సంధ్యాముపాసీత" అని చెప్పుచున్నది. సంధ్యాకాలిక దేవత చిచ్ఛక్తి రూపమైనది. ఆమెను సేవించుకొనుచు నాచమనంబు మొదలు నమస్కారము వఱకు సంధ్యావందన కర్మను ఆచరింపవలయును. "యా సంధ్యా సా జగత్సూతిర్మాయాతీతా హి నిష్కళా। ఈశ్వరీ కేవలా శక్తి స్తత్త్వత్రయసముద్భవా। ధ్యాత్వార్కమండలగతాం సావిత్రీం వై జపేద్ద్విజః" సంధ్యాకాలిక దేవత మాయాతీతురాలు, నిష్కళాస్వరూపురాలు, జగత్తులకు జననియునైన చిచ్ఛక్తిరూపురాలగు పరదేవతయని తెలియవలయును. సూర్యమండల నివాసియగు నిట్టి దేవతను గాయత్రీ మంత్రముచే ఉపనయనమైనవాడు ధ్యానము సేయవలయును. కనుక సంధ్య అనగా చిచ్ఛక్తి రూపముగు పరదేవత అని ఎఱుంగవలయును.

వ్యాసమహర్షి "ఉపాస్తే సంధివేళాయాం నిశాయాం దివసస్య చ। తామేవ సంధ్యా తస్మాత్తు ప్రవదంతి మనీషిణః" సాయం ప్రాతఃకాలములయందు సేవింపబడుచున్న దేవత సంధ్యయని పండితులగువారలు చెప్పుచున్నారని చెప్పెను. యాజ్ఞవల్క్యుడు "సంధౌ సంధ్యాముపాసీత నాస్తగే నోద్గతే రవౌ" సూర్యోదయ సూర్యాస్తమయములు గాక మునుపు సంధికాలమునందు సంధ్యాకాలిక దేవతను సేవింపవలయునని పల్కెను. "ఉద్యంతమస్తంయంతమాదిత్యాది" సంధ్యాశబ్దముచే ప్రతిపాదింపబడు సూర్యుని పరబ్రహ్మముగా ధ్యానముసేసి ఇహపరలోక సుఖములను ఉపాసకుడనుభవించుచున్నాడు. మఱియు వ్యాసమహర్షి "తదేవం ప్రతిపద్యేత గాయత్రీం బ్రహ్మణా సహ। సోహమస్మీత్యుపాసీత విధినా యేన కేనచిత్" ఏ విధిచేతనైనను, నేను బ్రహ్మస్వరూపమైతినని తలచి గాయత్రీ

దేవతయే పరబ్రహ్మ స్వరూపమని ఉపాసనఁ జేయవలయునని చెప్పెను. "గాయత్రీం చింతయేద్యస్తు హృత్పద్మే సముపస్థితామ్। ధర్మాధర్మ వినిర్ముక్తస్సయాతి పరమాంగతిం-" హృదయ పద్మమునందుండెడి గాయత్రీ దేవతను సేవించినవారు ధర్మాధర్మములయందుఁ జిక్కుకొనక పరమపదమును బొందుదురు.

ఇట్లనేక శ్రుతిస్మృతులు గాయత్రిని, చిచ్ఛక్తి రూపముగా పరబ్రహ్మస్వరూపముగా ప్రతిపాదించుచున్నవి. ఇట్టి సంధ్యావందన కర్మయందు అర్ఘ్యప్రదానము - గాయత్రీజపము-సూర్యోపస్థానమను మూఁడు కర్మలును ప్రధాన కర్మలు. మిగిలిన మార్జనాదికము వాటి కవయవములు. "అపరార్కే శాఖాంతరే। ఓంకార వ్యాహృతి పూర్వాం గాయత్రీం బ్రాహ్మణో జపేత్। త్రిష్టుభంచైవ రాజన్యో జగతీం వైశ్య ఏవచ" ఓంకారమును ముందుంచి వ్యాహృతిత్రయమును పిదపఁ జేర్చి బ్రాహ్మణులు గాయత్రీ ఛందరూపంబగు గాయత్రీ మంత్రమును జపించవలయును. రాజులు త్రిష్టుప్ఛందస్సును జపించవలయును. వైశ్యులు జగతీచ్ఛందంబును జపించవలయును. "సర్వే గాయత్రీమ్" సకల జనులను గాయత్రీ దేవతోపాసనను జేయవలయును అను ప్రమాణము వలన గాయత్రీ జపమునందఱు చేయవలెనని ఎఱుంగవలయును. "ఓమిత్యేకాక్షరమ్" మొదలగు మంత్రములు గాయత్రీ జపాంగములు. సంధ్యాత్రయమునందును అర్ఘ్య ప్రదానము ముఖ్య కర్మయని యెఱుంగవలయును. "పూర్వాభిముఖాస్సంధ్యాయాం గాయత్ర్యభిమంత్రితా ఆప ఊర్ధ్వం విక్షిపంతి" సంధ్యాకాలమునందు పూర్వ దిగభిముఖులై, గాయత్రిచే నభిమంత్రితములగు నుదకములను మీఁదికి నెగురవేయుచున్నారని వేదమందుఁ జెప్పఁబడుటచేత ఆశౌచకాలమందు చేయఁగూడదు. "తదుక్తం స్మృత్యంతరే। స్వాధ్యాయ జపహోమూ దేనాశౌచేవర్జయేత్సదా" ఆ శౌచకాలమందు వేద పాఠము గాయత్రీ జపము హోమమును జేయఁగూడదు.

ఇఁక సంధ్యాకాలమెద్దియనిన:-

"సంధౌ సంధ్యాముపాసీత" సంధికాలమున సంధ్యావందనము నాచరింపవలయును. "సజ్యోతిషోదర్శనాత్సంధిః" అర్ధాస్తమిత సూర్యదర్శన కాలము మొదలుకొని నక్షత్రోదయ పర్యంతము సంధికాలము. "అర్ధాస్తమిత కాలాద్యస్సంధిరాతారకోదయాత్। తత్ర సంధ్యాముపాసీత సాయంప్రాతస్సమాహితః" సగము సూర్యుఁడు గ్రుంకినది మొదలు నక్షత్రోదయము వఱకునుండు కాలము సంధికాలమని నిర్ణయింపఁబడెను. "ఉదయాత్ ప్రాకనీ సంధ్యా ఘటికాత్రయముచ్యతే। సాయం సంధ్యా త్రిఘటికా అస్తాదుపరి భాస్వతః" మూఁడు గడియలు సూర్యోదయమునకు ముందు ప్రాతస్సంధికాలమనియు సూర్యాస్తమయమునకు ముందు మూఁడు గడియలు సాయంకాల సంధియనియుఁ జెప్పఁబడెను. ఇట్లే ధర్మసింధువునందు "సంధ్యాకాలస్తు సూర్యాస్తాత్ పూర్వం త్రిఘటికాః అస్తానంతరం త్రిఘటికాః సంధ్యాకాలః" అని చెప్పుటవలన సూర్యాస్తమయమునకు ముందు మూఁడు గడియలు అస్తమయానంతరము మూఁడు గడియలు అని సంధ్యాకాలమును విశేషించి ధర్మసింధువు చెప్పినది. ఈ విధమును పాటింపవచ్చును.

ఇట్లుపాసింపఁబడు సంధ్యావందనములోని గాయత్రీమంత్రార్థమును మనము తప్పక తెలిసికొనవలెను. ఏలనన ఆపస్తంబమహాముని లోకులనుద్దేశించి సూత్రీకరించునపుడు

"తమసోవా ఏష తమః ప్రవిశతి యమవిద్వాను పనయతే యశ్చావిద్వానితి హి బ్రాహ్మణమ్" చీకటివలన చీకటియే కలుగునటుల తెలివి లేనివానివలన ఉపనయనంబును బొందిన వాఁడు తెలివిలేనివాఁడగును అని నుడివెను. కనుక ఉపనయనము జేయువాఁడు పండితుఁడై యుండవలెను. మంత్రార్థపరిజ్ఞానసిద్ధికొరకే, ధనవంతుఁడును సమర్థుఁడును పండితుఁడు నగు వాఁడు యాగంబునకధికారియని చెప్పఁ బడెను. "స్వాధ్యాయోఽధ్యేతవ్యః" వేదాధ్యయనము చేయవలయుననగా కేవల వేదమును జదువుటకాదు. అర్థజ్ఞానోత్పత్తికిఁ గారణంబు లగు తర్క వ్యాకరణాది శాస్త్రంబులను గూడఁ జదువవలయును గాని యర్థజ్ఞానము పొందక వేదాధ్యయనము సేయుమని చెప్పుట కాదు. కనుక మంత్రార్థమును దెలియవలెను.

గాయత్రీ శిరోమంత్రమునకర్థము :-

ఆపః=ఉదకము, జ్యోతిః=తేజస్సు, రసః=మధురాదిరసము, అమృతమ్=దేవతలయన్నము, బ్రహ్మ=సామవేదము, భూర్భువస్సువః=భూరాదిలోకంబులు, ఓమ్=బ్రహ్మస్వరూపము. ఈ ఓంకారస్వరూపమును గూర్చి "ఓమిత్యేకాక్షరం బ్రహ్మ వ్యాహరన్మామనుస్మరన్, యః ప్రయాతి త్యజన్ దేహం స యాతి పరమాంగతిమ్" అని భగవద్గీతయు "సర్వే వేదా యత్పదమామనన్తి తపాంసి సర్వాణి చ యద్వదన్తి, యదిచ్ఛన్తో బ్రహ్మచర్యం చరన్తి తత్తేపదం సంగ్రహేణ బ్రవీమ్యోమిత్యేతత్" అని కఠోపనిషత్తు తెలుపుచున్నవి. పరబ్రహ్మమును దెలియఁజేయు ఓంకారమూలముగాఁ గాని విగ్రహము నెదుట నుంచుకొని పాదాది కిరీటాంతము ఆభరణ విశిష్టములగు అవయవములను క్రమక్రమముగా ధ్యానించుచుఁదుదకు విగ్రహమంతయు ధ్యానమున కెట్లలవడునో యట్లు అకార మకారములలో నొక్కొక్క యక్షరమును స్మరించుచుఁ గ్రమముగా నోంకారస్మరణ చేసినఁగాని తద్ద్వారా పరబ్రహ్మానుభవము క్రమముగాఁ గలుగదని పరబ్రహ్మ ప్రాప్తి సాధనముగా మందమధ్యమాధికారుల నిమిత్తమై యుద్దేశింపఁబడిన యోంకారము యొక్క యుపాసనము ముక్తిప్రదమగునని గీతాకఠోపనిషత్తుల భావము.

గాయత్రీమంత్రమునకు శ్రీ విద్యారణ్య మహర్షులవారి భాష్యము :

"తదిత్యవాఙ్మనోగమ్యం ధ్యేయం సవితృమండలే। సవితుః సకలోత్పత్తిస్థితిసంహారకారిణః। వరేణ్యమాశ్రయణీయం యదాధారమిదంజగత్। భర్గః స్వసాక్షాత్కారేణ అవిద్యా తత్కార్యదాహకమ్। దేవస్య ద్యోతమానస్య స్వానందాత్ క్రీడతోపివా। ధీమహి అహం సఏవేతి తేనైవాభేదసిద్ధయే। ధియః అంతః కరణవృత్తీశ్చ ప్రత్యక్ప్రవణ చారిణీః। య ఇతి అలింగధర్మం యత్సత్యజ్ఞానాదిలక్షణమ్। నః అస్మాకం బహుధాధ్యస్త భిన్నభేదదృశాం తథా ప్రచోదయాత్ ప్రేరయేచ్చ ప్రార్థనేయం వీక్ష్యతే"

పైన వ్రాయఁబడిన విద్యారణ్యులవారి భాష్యము నాధారముతో క్రింద గాయత్రీ మంత్రార్థము నిర్ధారింపఁబడినది.

దేవస్య=ఉదయా సమయములచేత లోక యాత్రలను జేయుచున్న దేవుఁడైనట్టి-లేక-ఉదయాస్తమయములచేతఁ గ్రాడువలె ప్రకాశించుచున్న దేవుఁడైనట్టి-లేక ధ్యానము చేయువాని యొక్క హృదయకమలములో బ్రకాశించుచున్నట్టి దేవుఁడైనట్టి - లేక - స్వర్గ లోకంబునఁ బ్రకాశించుచున్న దేవుఁడైనట్టి, సవితుః=సకల జనులయొక్క పుట్టుకకు హేతువైనట్టి సూర్యునియొక్క, వరేణ్యమ్=భక్తులచేతఁ గోరఁదగినట్టి, తత్=ప్రసిద్ధమైనట్టి,

భర్గః=అజ్ఞానమునుబోఁగొట్టునట్టి సూర్యాత్మకమగు తేజస్సును, దీమహి=ధ్యానమును జేయుచున్నాము, యః=ఏ సూర్యుఁడు, నః=మాకు, ధియః=యోగ్యంబగు బుద్ధివృత్తులను, ప్రచోదయాత్=ప్రేరణ చేయునో.

మఱియొకయర్థము — దేవస్య= సకల లోకంబులయందును ప్రకాశించునట్టి, సవితుః=జగత్కారణుఁడైనట్టి, తస్య=ఆ ప్రసిద్ధుఁడైన శివునియొక్క, వరేణ్యమ్=కొనియాడఁదగినట్టి, తత్=ప్రసిద్ధమైనట్టి, భర్గః=తేజస్సును, ధీమహి=ధ్యానమును జేయుచున్నాము. యః= ఏ శివుఁడు, నః=మాకు, ధియః=మంచి బుద్ధులను, ప్రచోదయాత్= ప్రేరణ చేయునో.

తాత్పర్యము : ఉదయాస్తమయములచేత లోకయాత్రను జేయుచు రజ్జువువలెఁ ప్రకాశించుచున్నట్టి సకల జనులయొక్క యుత్పత్తికి ''అగ్నౌ ప్రాస్తాహుతిస్సమ్యగాదిత్యము పతిష్ఠతే। ఆదిత్యాజ్జాయతే వృష్టిః వృష్టేరన్నం తతః ప్రజా'' అన్నట్లు కారణభూతుఁడగు సూర్యునియొక్క ప్రసిద్ధమైనట్టి భక్తులచేత మిగుల సంతోషముతోఁ గొనియాడఁదగినట్టి సూర్యాత్మకమగు తేజస్సును ధ్యానము సేయుచున్నాము. ఏ సూర్యుఁడు మాకు యోగ్యములగు బుద్ధివృత్తులను ప్రేరణను జేయుచున్నాఁడో యట్టి సూర్యునియొక్క తేజస్సును ప్రార్థనఁ జేయుచున్నామని యెఱుంగవలయును. సూర్యాత్మకమగు తేజస్సునకు శివతేజస్సునకు భేదమించుకైనను లేదు కనుక శివస్వరూపమగు సూర్యతేజస్సును ధ్యానము చేయుచున్నామని ముఖ్యాభిప్రాయము.

ఈ గాయత్రీమంత్రమునందు 'వరేణ్యా' మను చోట నాలుగక్షరములని తెలియవలెను. వాల్మీకి విరచితమైన గాయత్రీ రామాయణము ద్వారా నాలుగక్షరములు 'వరేణ్యా'మను చోటనున్నవని తేటతెల్లమగును. గాయత్రీ రామాయణమునందలి ఇర్వదినాల్గు శ్లోకములు క్రింద ఉదహరించుచున్నాను. తెలిసికొనుఁడు.

తపస్స్వాధ్యాయనిరతం తపస్వీ వాగ్విదాంవరమ్।
నారదం పరిపప్రచ్ఛ వాల్మీకిర్మునిపుంగవమ్॥
స హత్వా రాక్షసాన్ సర్వాన్ యజ్ఞఘ్నాన్ రఘునందనః।
ఋషిభిః పూజితస్సమ్యగ్యథేన్ద్రో విజయీ పురా॥
విశ్వామిత్రః స ధర్మాత్మా శ్రుత్వా జనకభాషితం
వత్స రామ ధనుః పశ్య ఇతి రాఘవమబ్రవీత్॥
తుష్టావస్య తదావంశం ప్రవిశ్య స విశాంపతేః
శయనీయం నరేంద్రస్య తదాసాద్య వ్యతిష్ఠత॥
వనవాసం హి సంఖ్యాయ వాసాంస్యాభరణానిచ।
భర్తారమను గచ్ఛంత్యై సీతాయై శ్వశురో దదౌ॥
రాజా సత్యం చ ధర్మం చ రాజా కులవతాంకులమ్।
రాజా మాతా పితాచైవ రాజా హితకరో నృణామ్॥
నిరీక్ష్య స ముహూర్తం తు దదర్శ భరతో గురుం।
ఉటజే రామమాసీనం జటావల్కలధారిణం॥
యదిబుద్ధిః కృతా ద్రష్టుమగస్త్యం తం మహామునిం।
అద్యైవగమనే బుద్ధిం రోచయస్వ మహాయశాః॥
భరతస్యార్యపుత్రస్య శ్వశ్రూణాం మమ చ ప్రభో।
మృగరూపమిదం వ్యక్తం విస్మయం జనయిష్యతి॥
గచ్ఛ శీఘ్రమితో రామ సుగ్రీవం తం మహాబలం।
వయస్యం తం కురు క్షిప్రమితో గత్వాద్య రాఘవః॥
దేశకాలౌ ప్రతీక్షస్వ క్షమమాణః ప్రియాప్రియే।
సుఖదుఃఖసహః కాలే సుగ్రీవవశగో భవ॥
వంద్యాస్తేతు తపస్సిద్ధా స్తపసా వీతకల్మషాః।
ప్రష్టవ్యాచాపి సీతాయాః ప్రవృత్తింవినయాన్వితైః॥
స నిర్జిత్యపురీం శ్రేష్ఠాం లంకాం తాం కామరూపిణీం।
విక్రమేణ మహాతేజా హనుమాన్కపిసత్తమః॥
ధన్యా దేవాస్సగంధర్వాస్సిద్ధాశ్చ పరమర్షయః।
మమ పశ్యంతి యే నథం రామం రాజీవలోచనం॥
మంగళాభిముఖీ తస్య సా తదాసీన్మహాకపేః।
ఉపతస్థే విశాలాక్షీ ప్రయతా హవ్యవాహనమ్॥
హితం మహార్థం మృదుపూర్వసంహితం।

వ్యతీతకాలాయతి సంప్రతీక్షమం।
విశమ్యత ద్వాక్యముపస్థితజ్వరః ।
ప్రసంగవానుత్తరమేతదబ్రవీత్ ॥
ధర్మాత్మా రక్షసాం శ్రేష్ఠః సంప్రాప్తోఽయం విభీషణః।
లంకైశ్వర్యం ధ్రువం శ్రీమానయం ప్రాప్నోత్యకంటకం ॥
యో వజ్రపాతాశనిసన్నిపాతాన్న చుక్షుభే నాపి చచాల రాజా।
స రామబాణాభిహతో భృశార్తశ్చచాల చాపం చ ముమోచ వీరః ॥
యస్య విక్రమమాసాద్య రాక్షసా నిధనం గతాః।
తం మన్యే రాఘవం వీరం నారాయణమనామయమ్ ॥
న తే దదృశిరే రామం దహంతమరివాహినీమ్।
మోహితాః పరమాస్త్రేణ గాంధర్వేణ మహాత్మనా ॥
ప్రణమ్య దేవతాభ్యశ్చ బ్రాహ్మణేభ్యశ్చ మైథిలీ।
బద్ధాంజలిపుటా చేదమువాచాగ్నిసమీపతః ॥
చలనాత్పర్వతేంద్రస్య గణా దేవాశ్చ కంపితాః।
చచాల పార్వతీ చాపి తదాశ్లిష్టా మహేశ్వరమ్ ॥
దారాః పుత్రాః పురం రాష్ట్రం భోగాచ్ఛాదనభాజనం।
సర్వమేవావిభక్తం నో భవిష్యతి హరీశ్వర ॥
యామేవ రాత్రిం శత్రుఘ్నః పర్ణశాలాం సమావిశత్।
తామేవ రాత్రిం సీతాఽపి ప్రసూతా దారకద్వయం ॥

ఈ గాయత్రీ మంత్రము మూఁడుపాదములు కలది. అనఁగా ఋగ్యజుస్సామములను మూఁడు వేదంబులవలన నుత్పన్నమైనది. కనుకనే యీ గాయత్రీ మంత్రోపదేశంబును బొందిన వారలకు నథర్వణవేదోత్పన్నమగు నాలుగవపాదమును జపించుటకధికారము లేదు. అథర్వణ వేదంబువలనఁబుట్టిన పాదంబును గూడ నభ్యసింపఁ గోరినవారు మరల నుపనయనంబు నథర్వణ వేదమంత్రములచేతఁ జేసికొని యభ్యసింపవలయును. అట్టి నాల్గవ పాద మెద్దియనిన "పరోరజసేసావదోమ్" సత్వరజస్తమో గుణాత్మకమగు ప్రకృతి కంటె వేఱగు పరమాత్మ మాకు సుఖములనిచ్చుగాత యని యీ నాల్గవ పాదమునకుఁ దాత్పర్యము. సగుణోపాసకులకు త్రిపదాగాయత్రీమంత్రము యోగ్యమైనదనియు నిర్గుణోపాసకులకుఁ జతుష్పదాగాయత్రీమంత్రము యుక్తమైనదని విజ్ఞుల యభిప్రాయము. ప్రతి మంత్రమునకు నైదంగములుత్పన్నములగుచున్నవి. అవియేవి యన ఋషి, దేవత, ఛందస్సు, రూపము, వినియోగము. ఋషి యనఁగా మంత్రద్రష్ట. 'ఋషయః మంత్రద్రష్టారః' అని శబ్దార్థము. మంత్రద్రష్ట యనఁగా మంత్ర మహిమను దర్శించినవాఁడు. ఇట్టి మహనీయుఁడు విశ్వామిత్రుఁడీ గాయత్రీమంత్రమునకు ఋషి. దేవత, సవిత. సకల జగత్సృష్టి స్థితిలయ కారణుఁడగు పరమాత్మయే దేవత. ఇతఁడే సవితృశబ్దవాచ్యుఁడు. ఛందస్సనఁగా పాదముల యొక్క అక్షరసంఖ్యను దెలుపునది. రూపమనఁగా మంత్రాక్షరసంఖ్య, పాదములు మున్నగువిషయములను దెలుపునది మంత్రము యొక్క స్వరూపము. వినియోగమనఁగా మంత్రోపయోగమును దెలుపునది. మంత్రోపాసకులీ యైదింటిని చక్కఁగాఁదెలిసికొని జపించినచో మంత్రఫలమును బొందఁగలరు. ఇదియునుఁగాక బీజము, శక్తి, కీలకము, న్యాసము, ధ్యానము, కవచము, హృదయము, మాల, పంజరము, అర్గళము, స్తోత్రము, దిగ్బంధము, దిగ్విమోకము అనునీ పదమూఁడును మంత్రోపాసకులకు మంత్రసిద్ధి కలుగుటకు ముఖ్యావసరములై యున్నవి.

ఛందస్సనఁగా వేదమంత్రమందలి పాదవిభజనమును పాదమునకు గురువులు లఘువులైన యక్షరముల సంఖ్యను నిర్ణయించునది యని తెలియుచున్నది. అవియేవియన గాయత్రీఋష్యాదిన్యాసములో ఉక్త, అత్యుక్త, మధ్య, ప్రతిష్ఠ, సుప్రతిష్ఠ, గాయత్రి, ఉష్ణిక్కు, అనుష్టుపు, బృహతి, పంక్తి, త్రిష్టుప్పు, జగతి,

అతిజగతి, శర్వరి, అతిశర్వరి, అష్టి, అత్యష్టి, ధృతి, అతిధృతి, కృతి, ప్రకృతి, ఆకృతి, వికృతి, సంకృతి, అభికృతి, ఉద్ధృతి, అను ఇర్వదియారు ఛందస్సులు. గాయత్రీఛందస్సువలన బ్రహ్మ విద్యాప్రాప్తి లభించుచున్నది. ఇట్లు గాయత్రీ మంత్రార్థమును దెలిసికొనుటకు దేవీభాగవత మున గాయత్రీ సహస్రనామావళి, గాయత్ర్యుతనిషత్తు, సావిత్ర్యుపనిషత్తు, గాయత్రీ కవచము, గాయత్రీహృదయము, గాయత్రీ స్తోత్రము, గాయత్రీ ఋష్యాదికములనునంశము లున్నవి. వీనిని పరిశోధించినవారు గాయత్రీ మాహాత్మ్యమును దెలిసికొనఁగలరు.

వాయించరా! బాల
గోపాల నీ మురళి
వాయించరా!

మదిని మల్లెలు పూయ
ముదముతో నీ 'వేణు
వు'ను ఊది ఘనతాప
మును హరించిన తండ్రి! ॥వా॥

మాయ జాలములోన
మర్మమెరుగక యుంటి
మాధవా! దయజూపి
మాయ దాటించరా! ॥వా॥

విశ్వమానవ ప్రేమ
వికసించి పూయగా
చీకటై చన్న్రతుకు
వేకువై వెలఁగొంద

శిఖిపింఛమౌళి! నీ
చేయూత నిచ్చి నా
ఎదలోన యెద కలిపి
ఏకమై పోవగా ॥వా॥

— నిమ్మల అర్జుగౌడు

# మేళన ముహూర్తం

మూలము
పండిత గోవింద వల్లభపంతు

అనువాదము
బద్వేలి రమేష్

వాసవదత్తను చూస్తేచాలు ఎంత రూపసి! అన్పించక మానదు. కమలంకన్న కోమలమైన దేహం, నునుసిగ్గుతో వాలిపోయే ఆ కళ్ళు, కోయిల గీతికన్న సొంపయిన ఆమె స్వరమాధురి. ఆమె అందాన్ని వర్ణించడానికి ఈ ఉపమానాలూ సరిపోవేమో అన్న అనుమానం వస్తుంది. ఆమె అంత అద్భుత సౌందర్యరాశి.

ఒకనాటి ఉషోదయవేళ ఆమె ఇంటి ప్రాంగణాన భిక్షువు నిల్చున్నాడు. మంచి యవ్వనంలో తీరయిన ఆకృతిలో ఉన్న ఆ తేజస్విని చూసి వాసవదత్త ముగ్ధురాలైంది. ఒకసారి చూసింది, వందసార్లు చూసింది అలాగే ఇక చూస్తూండిపోయింది.

ఆ భిక్షువు పేరు ఉపగుప్తుడు. లౌకికానికి అతడు బికారి. అలౌకికంగా చూస్తే మహారాజు, మనస్సును మించిన వస్తువు పుడమిన లేదు. దాన్ని జయించినవాడు. అతడు ఇక విశ్వవిజేత. నిర్మలమయిన అతనికళ్ళు ఎప్పుడూ ఏవో దివ్య సందేశాలనిస్తూన్నట్లుంటాయి.

తన సౌందర్యంతో ప్రపంచాన్ని చిత్తుగా ఓడించగల వేశ్య వాసవదత్త ఒక సన్యాసిని చూసి మురిసిపోవడం విచిత్రమే. ఇది ఎలా దారితీస్తుందో? భిక్షువు పిలుపుకు మైమరపు నుండి తెప్పరిల్లి ఒయ్యారంగా వచ్చి ఇలా అంది.

“భిక్షువూ! భిక్షపాత్రను ముందుకుచాపు.”

“నీ చేతులు ఖాళీగా ఉన్నాయి. ఏమి ఇవ్వాలని నీ ఉద్దేశం,” ఆశ్చర్యంగా అడిగాడు.

“నీ ప్రపంచంలో కన్పించనిది, నీవు అనుభవించనిది.” భావగర్భితంగా అంది.

“అంటే?”

“ఇవి రిక్తహస్తాలుకావు.”

“నీ చేతులకున్న ఆభరణాలతో నేనేమి చేసుకోగలను?”

“ఖాళీ చేతులు కావు. నేనీ చేతులతో ప్రేమాలింగనం చేస్తాను. ఇది గ్రహించని అబోధయువకుడా! ఆలోచించుకో. నా చెంగుగాలి సోకితే చాలునని మహారాజులు తపిస్తారు.” కించిత్ గర్వం మెరసింది ఆమె కళ్ళలో.

“దీని అర్థం?”

“ఇంకా వివరం చేయాలా భిక్షపాత్రను ముందుకు తీసుకురా. నా హృదయం అర్పిస్తాను. ఈ సుందరదేహం ఇలా కావిగుడ్డలకు పరిమితం చేయడం సబబుకాదు. దయచేయి. ఈ విశ్వసామ్రాజ్ఞి సౌందర్యరాశి నీకు దాసిగా కాగలదు. లోపలకివచ్చి పావనం చెయ్.”

ఉపగుప్తుని ముఖమండలంలో లేత నవ్వు విరిసి మాయమయింది. మౌనంగా నిల్చున్నాడు.

“జవాబు ఇవ్వు భిక్షువూ!”

“నాకు ఎన్నో కారణాలవల్ల ఇప్పుడు వీలు కుదరదు.” అతను అన్నాడు.

“అయితే ఎప్పుడు వస్తావు?”

“కొన్నిదినాలతర్వాత”, భిక్షువు వెళ్ళిపోయాడు.

వాసవదత్త హృదయం అవమానంతో కృంగిపోయింది, ‘కేవలం ఒక భిక్షువు తన

సౌందర్యంపట్ల ఎంత తిరస్కారం చూపాడు? చూసాను ఆ రోజు దాకా.' పంతంగా మన సులో అనుకున్న ఆమె చిన్నగా నవ్వుకొంది కూడా. ఆ నవ్వుకి అర్థం ఆ భిక్షువు ఏనాటి కయినా పల్టీ కొట్టేవాడే తన అందచందాల ముందు. అదీ ఆమె గర్వం.

తనకున్న అల్ప జీవనప్రమాణంలో ఒక వెలుగు వెలిగి సంధ్య మాయమయింది. అప్పుడే తూర్పున చంద్రోదయమైంది. గంగా నది ఒడ్డున దట్టమైన అడవిలో ఉప గుప్తుడు వెళుతూన్నాడు. జంతువుల అరపులు వింతగా వినవస్తూంటే ఓ చెంపన గంగానది సవ్వడి మెల్లగా పాట పాడుతూంది.

ఇంతలో సింహగర్జన ఆ ప్రదేశమంతా లింగుమంది. ఉపగుప్తుడు అటుచూశాడు. తన మీదకి దూకడానికి సిద్ధంగావుంది సింహం. కరుణగా చూశాడు. కాని సింహంలోని రాక్షసప్రవృత్తిపై కరుణ పని చేయలేదు. ఉపగుప్తుడు తలవంచి దానికి ఆహారంగా కావ డానికినిల్చున్నాడు. ఒక్క-క్షణం ఇక మృత్యువు వచ్చిందనీ తలపోశాడు.

ఇంతలో మెరపులా ఒక బాణం వచ్చి సింహం ప్రాణాల్ని తీసింది. కోరపల్లు కసిక్కున మెడమీద దిగుతుందని భావించిన ఉపగుప్తు నికి హీనంగా సింహగర్జన విన్పించడం విస్మ యంలో ముంచెత్తింది. తలెత్తి చూడగానే కాస్త దూరంగా గుండెదాపుల బాణం దిగ బడిన సింహం పడి ఉన్నది. అది గిలగిలా తన్నుకొంటూంది. ఆశ్చర్యంనుంచి తేరుకోక ముందే చిక్కని పొదరింటినుంచి ఒక వేట కాడు బయటికి వచ్చాడు. అతని చేతిలోని విల్లు బాణాలు సింహంతకునికిగా సూచి స్తున్నాయి.

"సింహం నీకేమపకారం చేసిందని చంపావు?" బాధచే బొంగురయిన కంఠంతో భిక్షువు అడిగాడు. ఈ ప్రశ్న విలుకానికి విస్మయం కల్గించింది. వాని మనసు తర్క-వితర్కంలో ఊగిసలాడింది క్షణం. సింహం-అపరాధం ఇలా అనుకొంటూ భిక్షువు చెంత చేరాడు. ఉపగుప్తుని కరుణాదృక్కులు వేట కాడిహృదయాన్ని మీటి ఏవో సందేశాలివ్వ సాగాయి. కొద్దిక్షణాలు దొర్లిపోయాయి నిశ్శబ్దంగా. తటాలున వేటకాడు భిక్షువుని పాదస్పర్శచేసి "ఇదే నా ఆఖరి హత్య" అని అక్కణ్ణుంచి వెళ్ళిపోయాడు. భిక్షువుకు ఆనందం కల్గింది కాసేపు. ఆ వెంటనే సింహంకేసిచూసి కర్తవ్యం గుర్తొచ్చి ఎంతో శ్రమకులోనై ఆ సింహాన్ని గంగానదిఒడ్డుకు తీసుకెళ్ళాడు. దాని గుండెలోని బాణం మెల్లగా లాగివేశా డు. సింహం హీనంగా మూల్గింది. ఛాతీనుండి రక్తం అవిరామంగా కారుతూంది. నిట్టూర్పుగా లేచి ఉపగుప్తుడు గంగాజలాన్ని దోసిళ్ళతో తెచ్చి రక్తం కారకుండా కడుగసాగాడు.

గంగానది నీటిఅద్దాన వెన్నెల ప్రతిబింబి స్తూంది. ఉపగుప్తుని వేపు ఓ పడవ రాసాగింది. సన్నగా మధురగానం చెవుల సోకగానే ఒక్క-నిమిషం ఉపగుప్తుడు అటుకేసి చూసి మళ్ళీ సింహం సేవలో లీనమయిపోయాడు.

పడవ ఒడ్డుకు చేరింది. అందులోనుంచి వాసవదత్త దిగింది. ఆమె మంజీరాల ధ్వనికి ఉపగుప్తుడు ఆమెను చూశాడు. ఇరువురి చూపులు కల్సుకొన్నాయి. కమ్మని వాతా వరణంలో ఉపగుప్తుడు ఇలా సాక్షాత్కరించ డం వాసవదత్తకు ఆనందం, ఆశ్చర్యం రెండూ ఒకేసారి కలిగినాయి.

"భిక్షువూ! ఇక్కడ ఏమి చేస్తున్నావు. అమ్మో ఏమిటి సింహానికి పరిచర్య చేస్తున్నావు. ఏమిటి నీ అమాయకం. దానికి ప్రాణదానం చేసినా అది గుర్తిస్తుందా? ప్రాణ దాతనయినా చంపడానికి వెనుదీయదు. ఇది నిన్ను నాశనం చేస్తుంది."

"లలనా! నీవు పొరబడుతున్నావు. దీని ఆకారం చేష్టలు భయంకరమయినవని అంటున్నావు. నిజమే కావచ్చు. అయినా కోరిక కంటే భయంకరమైంది కాదు. మోహాంకంటే శత్రువు కాదు. ఆ రాగద్వేషాలు మనిషిని బంధిస్తాయి. సర్వనాశనం చేస్తాయి. వాటి కన్నా ఇది భయంకరమైందా?"

ఉపగుప్తుని మాటల భావం వాసవదత్తకు బొత్తిగా బోధపడలేదు. సంభాషణను మరో వేపు త్రిప్పుతూ ప్రేమగా అంది.

"నీ కోసం క్షణం క్షణాం ప్రతీక్షిస్తూన్నాను. నీవు దయచూడలేదు. మరచిపోయావా?"

"లేదు మరచిపోలేదు. నేను వస్తాను. కొన్ని రోజుల తర్వాత తప్పకుండా రాగలను."

"ఇప్పుడే రావూ భిక్షువూ! ఇంత మంచి తరుణంరాదు. వెన్నెల కనుపండువుగా సౌందర్యాన్ని స్పర్శిస్తూంది. నీవు నా ఇంటి అంధకారాన్ని వచ్చి దూరం చెయ్యవూ!" తియగా బ్రతిమాలింది.

ఉపగుప్తుడు సింహానికి ఇంకా సేవ చేస్తున్నాడు.

"నీవు నీ సౌందర్యాస్త్రించేత నన్ను గాయపరిచినావు. నాకూ ప్రాణదానం చేయాలి."

"శాస్త్ర ఓపికపట్టు సుందరీ! నేను తప్పకుండా వస్తాను."

"ఎప్పుడు వచ్చేది? నీరాకకోసం నా కన్నులు ఎదురుచూసి చూసి వాటికాంతి హీనమైనపుడా? లేక రోజులు గడచి గడచి ఈ యవ్వనం కరగిపోయినపుడా? ఎప్పుడు?" చిరుకోపం చిందులాడింది ఆమె గొంతులో.

"

"ఎప్పుడు వచ్చేది?"

"ఈ జీవితంలోనే."

"ఈ జీవితంలోనా? దీనికి ఎంతో కాలం ఉంది."

"అయితే?"

"ఈ క్షణంలో వస్తానను."

"లేదు."

"పోనీ ఈ నెలలో."

"ఈ ఏడాదిలోనే వస్తాను. ఇది సత్యమని భావించు."

"ఆ రోజు కోసం నేను ఎదురు చూస్తూంటాను." కవ్వింపుగా చూస్తూ వెళ్ళిపోయింది.

ఉపగుప్తుడు ప్రాణం కోల్పోయిన సింహాన్ని చూస్తూండిపోయాడు.

ఋతువులన్నీ ఒకటొక్కటే పలకరించి వెళ్తూన్నాయి. అయినా భిక్షువు రాలేదు. వాసవదత్త ప్రతిరేయీ ఎదురుచూడ్డం-అతడు రాకపోవడం- నిరాశ చెందడం దుఃఖించడం జరుగుతూంది. భిక్షువు వస్తాడన్న ఆశ క్రమంగా ఆమెలో సన్నగిల్లసాగింది.

ఆ రాత్రి వాసవదత్త మహలు పెక్కు దీపాలతో అలంకరించబడింది. ఆమె దివ్యంగా అలంకరించుకొని తన ప్రేమికుడయిన లక్ష

పతిని ఆహ్వానిస్తూ ఎదురు వచ్చింది. కాలం మృదువుగా సాగుతూంది. వాళ్ళు సురాపానం చేసి ఇహలోకాన్ని మరచిపోయారు. లక్ష్యపతి మత్తుగా ఓ పక్క సోలిపోయాడు. వాసవ దత్తకు మెళకువ ఉంది. ఆమె సురాపానం చెయ్యలేదు. అతని ముందు చేసినట్లు నటించింది. వాసవదత్త లేచి నిద్రపోతున్న పశువు లాగున్న లక్ష్యపతిని తేరిపారిచూసి వికటంగా నవ్వుకొంది. వెంటనే పరుపు క్రింద జాగ్రత్తగా దాచిన కత్తితీసి లక్ష్యపతి గుండెల్లోకి సూటిగా పొడిచింది. అతను వికృతంగా అరచి ప్రాణాలు వదిలాడు. వాసవదత్త సౌందర్యానికి చిత్తయి పోయే ఎందరి రసికుల్లోనో లక్ష్యపతి ఒకడు. ఇతడంటే ఆమె ఇష్టం చూపుతుంది. కారణం అతడు గొప్ప ధనవంతుడని. లక్ష్యపతి శవాన్ని చూసి ఆమెకు ఇప్పుడు చెమటలు పట్టసాగాయి. అతని మృతశరీరంమీద ఉన్న విలువయిన ఆభరణాలను తొలగించే యత్నమై అతనికి దగ్గరగా కూర్చుంది. ఇంతలో 'వాసవదత్తా' అన్న పిలుపుకు ఆమె వణికిపోయింది. ధైర్యం కూడ దీసుకొని కిటికీ తలుపురెక్క సగం తీసి 'ఎవరూ?' అంది.

'నేను భిక్షువును.'

'నువ్వా వచ్చావా?'

'లేదు, వెంటనే మళ్ళీవస్తాను.'

'మరి ఈ అసమయంలో వచ్చావే?'

'విహారంచేస్తూ వచ్చాను. నిన్ను పలక రిద్దామని అన్పించింది. అవునూ నువ్వు నిద్ర పోతున్నావా, మేల్కొన్నావా?'

'నేను మేల్కొనే ఉన్నాను.'

''అయితే కళ్ళు మూసుకొని ఎందు కున్నావో. వస్తాను నేనిక.'

'ఆగు, నీ ప్రతిజ్ఞ గుర్తుందా?'

'ఉంది.'

'ఈ ఏడాదిలో నన్ను కలుస్తానని మాట ఇచ్చినావు మరిచిపోలేదు కదా!'

'ఇంకా ఎన్నిరోజులున్నాయి సంవత్సరం ముగియడానికి?'

'కేవలం పక్షంరోజులు.'

'ఇంతలోనే వస్తాను.'

'అబద్ధం చెప్పకు, నువ్వు నన్ను మోసగిస్తు న్నావు.'

'సత్యం నా ధర్మం. కపటం నేనెన్నడూ ఎరుగను.'

ఉపగుప్తుడు గంభీరమయిన ఆ చీకటిలోంచి మాయమయి పోయినాడు. వాసవదత్త కిటికీ రెక్కను మూసేసింది.

వాసవదత్త నేరం బయటపడింది. ఆమెను రాజు విచారించి శిక్ష క్రింద, కురూపిని చేయించాడు. కాళ్ళూ చేతులు కోల్పోయిన వాసవ దత్త రాజ్యం పొలిమేరల్లో వదలబడి ఉంది.

తాను ఒక ప్రియుణ్ణి కలవాలని పదిహేను రోజులవిమ్మట మీరు శిక్ష విధించండని వాసవ దత్త ఎంత బ్రతిమాలినా ఎవరూ వినలేదు.

ఆమె ఒంటిమీద మూగే ఈగల రొదలో, కాకులు పొడుస్తూంటే దీనంగా విలపించ సాగింది. ఆమె దేహం సౌందర్యంచూసి పరవ శించిన ప్రియులంతా నేడు అసహ్యించుకొంటు న్నారు. రోతగా దూరం దూరంగా చూస్తూ వెళ్తున్నారు. ఆమెకిది సహించరానిదిగా ఉంది.

ఇంతటి దీనమయిన స్థితిలో ఆమె శిరస్సును ఓ కరుణహస్తం స్పృశించింది. కళ్లు తెరవడానికి శక్తిలేని ఆమె 'ఎవరూ' అంది క్షీణ స్వరాన.

'నేను'

ఆ స్వరం లీలగా గుర్తు రాసాగింది.

'భిక్షువూ'

'అవును'

'వెళ్ళిపో. ఎందుకువచ్చావు, నన్ను గేలి చేయాలనా?'

'తిరిగి పొమ్మనడానికేనా నన్ను రమ్మన్నది. నీవు పిలిచినందుకేగా నేను వచ్చింది. నా మాట ప్రకారం ఏడాదిలోపలే వచ్చాను. ఇంకా రెండురోజులుంది నా గడువు ముగియడానికి.'

'అయ్యో, సౌందర్యరాశిగా పిలిచినపుడు నీవు రాలేదైతివి. ఇప్పుడు కురూపిని. కడుపు తరుక్కుపోయే స్థితిలోఉన్న నన్ను కలియడానికి మంచి మూర్తమే నిర్ణయించుకొన్నావు.'

'పిచ్చిదానా! నేను నీవద్ద ఇంద్రియ సుఖం కోరివచ్చాననుకొన్నావా? లేదు. ఈ తోలుతిత్తి సుఖములశాశ్వతమయినవి. ఈనాడు నీ ధనం, సుఖం నీ స్థితని చూసి ఏం ఊరడిస్తున్నాయి. నీ వద్దకు నేను వచ్చాను. నీ కోసం ఏం చెయ్యమన్నా చేస్తాను.'

అతని మాటలకు ఆమెకు కనువిప్పు కలుగసాగింది.

'ఏం సెలవివ్వగలను. నీ మాటలు నన్ను వివేకిని చేస్తూన్నాయి. ఇన్నాళ్ళూ నేను ఒక స్వప్నాన్ని జీవితసత్యమనకున్నాను. మరుమరీచికలవెంట పరుగుతీశాను. అంతా శూన్యం అని తెల్సింది. ఇప్పుడు ఇక ఏమి చెప్పగలను? నీవు నావద్దకురా, నీ స్పర్శచే నాకేదో ఆనందం కల్గుతూంది. పవిత్రుడా ఇక నీవే మాట్లాడు.''

'సామ్ము కోసమయి మనసారా ప్రేమించిన లక్ష్యపతిని చంపి ఇంత చేసుకొన్నావు.'

'ఓహ్, నీవు ముందుగావచ్చి నా కళ్ళు ఎందుకు తెరవవైతివి. ఎంతమంచి ముహూర్తం నిర్ణయించుకొన్నావు భిక్షువూ నన్ను కలియడానికి,' నిట్టూరుస్తూ వ్యంగ్యంగా అన్నది.

'అయినా ఇప్పుడేం మించిపోయింది. జీవితం ఎంతో ఉంది. భగవంతుని సాన్నిధ్యంలో నీ బ్రతుకు హంసగీతి కాగలదు. వివేచన తెచ్చుకో. మన ఈ మేళన ముహూర్తం ఎంత విలక్షణమైనదో,' ఉపగుప్తుడు ఇలా అంటూ ఆమెను చూశాడు. అతని చూపుల్లోనుంచి ఏదో వెలుగు ఆమెను చేరసాగింది.

# కబీరు వచనామృతము

## కబీరు ప్రేమ

### 1

నా భర్తతో భర్తృగృహమునకు వచ్చితిని కాని అతనితో నుండనైతిని. అతని ఆస్వాద మెఱుగనైతిని. స్వప్నమువలె నా యౌవ్వనము గడచిపోయినది.

వివాహమునాడు చెలులు మంగళగీతములను బాడి, సుఖదుఃఖముల పసుపును నా తలపై నిడి స్నానము చేయించిరి. వివాహము జరిగిపోయెను. కాని నా స్వామిని విడనాడి మఱలివచ్చితిని. బాటయందు నా బంధుగులెంతయునోదార్ప ప్రయత్నించిరి, కబీరనుచున్నాడు—నేడు నా ప్రియుని గృహమునకు బోయెదను. సకల సంకటములను దాటి, వల్లభుని చేరి మంగళతూరి మ్రోయింతును.

### 2

నేటికి అష్ట కష్టములబడిన తర్వాత ప్రియతముడరుదెంచినాడు. అతనిచేత సిందూరపు భరణి.

స్వామియెడ ధృఢమైన ప్రత్యయము నిల్పుకొనుము. అతనిని నిబిడముగా ప్రేమింపుము. అల్లవినుము వాద్యము మ్రోయుచున్నది.

అగ్నియందు చనిపోయినంతనే సతికాదు. రణమొనరించినంతనే వీరుడుకాడు. విరహాగ్ని హృదయమును దరికొల్పినపుడే పూర్ణ పదము ప్రాప్తించును.

ఈ మలిన జగము అతని నామమున గ్రుంకినపుడే శుచియగును.

కబీరనుచున్నాడు :—భక్తిని విడువకుము. పడుచుచు, లేచుచును, ఉచ్చమునకధిరోహింపుము.

అల్లదిగో ఆ మ్రోయుచున్న అనాహత వాద్యపు మెలుంగది వినబడుటలేదా ? మందిర మధ్యముననే ఆనందపు వీణయందలి రసతంత్రులు, మృదుమధురముగా మీటబడుచున్నవి. ఇక దానిని వినుటకై ఎచటికో వెటకు బోవనేల! కాజీ కేవలము కొరానును వెదకును. అన్యులకుపదేశించుచున్నాడు. కాని, ఈ ప్రేమయందు ప్రియుడు కాడేని, అతడు కాజీయైననేమి, గీజీయైననేమి ?

యోగి తన బట్టలకెఱ్ఱరంగు వైచుచున్నాడు. కాని ఆ పెరిమపు రంగు యిసుమంత యేనియు నెఱుగడేని, తన బట్టలకు రంగులేసుకొని లాభమేమి ?

కబీరిట్లనుచున్నాడు :— నేను మందిరమందుడనీ, వాతాయనమునందుండనీ, పట్నవాసమునందుండనీ, పుష్పోద్యానమునందుండనీ, నేను నిజము పల్కుచున్నాను. ప్రతి నిమిషముననూ, నా ప్రభువు నాయందు రమించుచునే యున్నాడు.

### 4

ఓయమ్మలాడీ ! నీ ప్రియతముని యింటికి బోవలయు దినము సమీపించినది, చిత్తమును ప్రబోధించుము. ఆ యింట రాత్రిందివములు, వెలుగు మిఱుమిట్లు గొలుపుచు ప్రజ్వలించుచున్నది. అతని ప్రేమద్వారమున వైరాగ్యమును సంపాదించుము.

ఎవడు ప్రియతముని యందలి రాగముచే రంజితుడో అతడే ధన్యుడు.

అజరమును అమరమును అగు ఆ గృహమును ప్రవేశించి, యచట విశ్రమింపుము. నిర్భయుడవై యచట నిద్రింపుము.

భర్తృగృహమునకు నా చీరెకు రంగు వైచుకొని వచ్చితిని. అతడేరంగుతో రంగు వైచెనో దాని రహస్యమెరుగకున్నాను. ఏ చాకలియు ఆ రంగు బోగొట్టలేడు. ఆ వస్త్రమును ధరించియే నేను పెనిమిటి ఇంటికి పోవుచున్నాను. ఊరివారు నన్ను మూఢురాలని పరిహసించుచున్నారు.

## 6

మేల్కొనుము ఓ నా ప్రేమ విలాసినీ, మేల్కొనుము. ఏటికి నీవు మోహనిద్రయందు మగ్నురాలవైయున్నావు? లేచి భజనయందు బ్రవృత్తురాలవుకమ్ము. నీ సర్వదేహము నుండియు, సుమధురధ్వనియైన రాగిణి యుప్పతిలుచున్నది-చిత్తముతో దాని నొకమారాలకింపుము. రెండు చేతులను జోడించి, అతని చరణములకడ బ్రణతవై అచల భక్తితో బ్రార్థింపుము.

## 7

అన్నా! స్వామితో గలయిక యెంత కష్టము! చాతకము పిపాసచే ప్రాణముబోవుచున్ననూ, వృష్టిజలమునకే వేచియుండును. అన్యజలములనాసచేయదు. మృగము సంగీతమునందలి ప్రేమచే నాకృష్టురాలై ముందుకు నడచిపోవును. ఆ సంగీతమును వినుచునే ప్రాణమర్పించును. ఇంచుకయు భీతము కాదు. సతి చితాగ్నిపై నధిరోహించును. ప్రియతముని బాటయే యామె మనమును హరించును అగ్నిని జూచి ఇసుమంతయు భయపడదు. చిరనవ్వుతో తన యాసనమందు బ్రవేశించును.

'తనువే నేను' అనుభ్రమను త్యజింపుము. నిర్భయుడవై అతని గుణగానము చేయుము.

కబీరిట్లనుచున్నాడు:- సాధూ! వినుము లేదేని నీ జన్మ వ్యర్థము.

## 8

ప్రభాతమైనది, రాత్రి గడచిపోయినది. ఓ సహచరీ! హృదయము కరగునట్లు మంగళగానమొనర్పుము. ఆకాశమును నింపుచూ పుష్పములు వికసించినవి – అమృతరససించన చేనమృతఫలము ఫలించినది.

## 9

ఎచ్చట బాట యగమ్యమో, మబ్బులు లేకయే ఎచట వాన కురియునో, ఎచట దామిని లేక మెఱయునో అచట అమృతము వర్షించుచున్నది. ఆ శోభ ఏమని చెప్పుదును? నిరంతరము అచట అనాహతరాగిణి నినదించుచున్నది. ఏ స్వరమును ఎవరు పాడుచున్నారు?

## 10

స్వామి సర్వమును ఇచ్చినాడు—ఇచ్చుట కింకేమియు మిగులలేదు. నేనే అభాగ్యురాలను సుఖమును వీడి దుఃఖమును జేకొంటిని. ప్రియుని భవనమున కేగితినికాని అతని సాంగత్యము చేసితిని కాదు.

కబీరు తెలుపుచున్నాడు — మనమున బోధమును చేకూర్చుము. యుగ యుగమున నీ యాత్మగౌరవమున రాచరికము చేయుము.

## 11

ఓ బికారీ! నీ ప్రేమచే నన్నాకరించుకొంటివి! నా యింట నిదురించుచుంటిని. ఓ బికారీ! నీ సంగీతముస్వరముచే నాఘాతించి మేల్కొల్పితివి!

ఓ బికారీ! భవసముద్రమునందు మునిగి

పోవుచుంటిని. చేయూతనిచ్చి నన్ను రక్షించితివి!

ఒక్కటియే పల్కు. రెండవది లేదు. ఓ బికారీ! నాచే స్వరబంధనములను త్రెంప చేసితివి!

కబీరనుచున్నాడు:- ఓ బికారీ! నా ప్రాణము నందు, నీ ప్రాణము మేళన మొనర్చితివి.

## 12

ఏ మురళీధ్వని విని ఆనందముచే నా హృదయము పులకితమగుచున్నది? దీపము లేకయే జ్యోతి వెలుగుచున్నది.

కందము లేకయే కమలము వికసించు చున్నది. పూవులు పిండులు పిండులుగా బూచు చున్నవి.

చకోరము చంద్రునియందు చిత్తము సమర్పించుచున్నది. చాతకము స్వాతివర్షము నందు.

కాని ప్రియుడెవ్వనిమీది ప్రేమచే జీవన మంతయు సంఘాతము చేసినాడు?

## 13

ఓ సఖి! ఇక పుట్టింటనుండుట బాగుకాదు. నా భర్త నగరము పరమసుందరము. అచటికి పోవువారు తిరిగిరారు. అచట సూర్యునకు, చంద్రునకు, వాయువునకు, వరుణునకు ప్రవేశము లేదు. నాకబురునచ్చటికెవరుకొనిపోదురు? ఈనావ్యథ నా స్వామికెవ్వరు తెలిపెదరు?

ప్రాణము నన్ను ముందు నడమని వేగిరించు చున్నది. కాని కంటికి బాట కనబడుట లేదు. మఱియు బాటయందు స్థిరముగా నిలచియుండుటకు కూడ కష్టమగుచున్నది. ఓ చెలీ! ఏ విధమున బతి గృహమున చేరుదును. విరహము కడుబాధించుచున్నది. ఆ ప్రియతముడు తక్క నింకెవ్వరును లేరా బాట చూపువారు? కబీరడుగుచున్నాడు:- ఎట్లా ప్రియుతముని జూడగల్గుదును? నా ప్రాణమునందలి ఈ జ్వాల ఎట్లు చల్లారును?

## 14

ఓ ప్రియతమా! నీ యట్టాలిక, అత్యుచ్చము. నేను చూడవచ్చుచున్నాను. చంద్ర సూర్యుల కోటి దీపములు ప్రజ్వలించుచున్నవి. ఐనను దారి తప్పిపోయితిని.

## 15

ఈ గగనమునుండి అమృతము స్యందించు చున్నది- గగనమున రణఝునఝుంకార ముతో వాద్యము మ్రోగుచున్నది. చంద్రుడు లేకయే వెన్నెల కాయుచున్నది. అచట పరమ సౌందర్యము దృష్టిగోచరమగుచున్నది. అమృతపురుషుని సంభోగము కొరకు దశ దిశ లందునూ తాళము పడుచున్నది. కబీరు చెప్పు చున్నాడు. "ఓ సాధూ! వినుము, అమరుడైన వాడెప్పుడునూ మరణింపడు.

## 16

ఆ సీమయొక్క మురళి నిరంతరము మ్రోగుచున్నది. దాని ఝుంకారము ప్రేమ.

ఎప్పుడు ప్రేమ, సీమలన్నింటిని అతిక్రమించునో, అప్పుడది సత్యలోకమును చేరును.

ఎట్టి సుగంధమెల్లడలను వ్యాపించుచున్నది! దాని కంతము లేదు. ఎచ్చటను దానికడ్డ లేదు.

ఈ రాగిణియొక్క రూపము కోటి భానువుల వలె సుజ్వలము. పోల్క లేని రీతి సత్యధ్వనుల యావీణ ఝుంకృతమగుచున్నది.

## 17

ప్రియతముడు నాపై దనపెరిమపు రంగును జిల్కినాడు. ఆతని స్వరాఘాతము, నా ప్రాణమునందు దగుల్కొనినది. నా శరీర మంతయు విద్ధమైపోయినది. ఇప్పుడేయౌషధ మును, ఏ మూలికయు పనిచేయుదు. పాపము వైద్యులేమి చేయుదురు? సురలు, మునులు, నరులు, సాధులు, సన్యాసులు, ఎవ్వరును దానిని దుది ముట్టింప లేరు.

కబీరు తెల్పుచున్నాడు—స్వామి యన్ని రాగములచేతను రంజితుడు. మఱియు అన్ని రాగములకంటెను భిన్నుడు.

## 18

నేడు నా స్వామితో జనుచున్నాను. నదీ తీరమునందు నా ప్రభువు లభించినాడు. కాన నా జీవనము సుఖమధురధారవలె బ్రవహించు చున్నది. కబీరనుచున్నాడు– "విను మోయన్నా ఇపుడు నేను రెండు కూలములను అతిక్రమించి పోవుచున్నాను.

## 19

నెచ్చెలీ, వల్లభునికొఱకు నా మనము వ్యాకులపడుచున్నది! నా యౌవనము వికసించి నది. విరహవ్యథ నా హృదయమునలమట పెట్టుచున్నది.

ఇంకను జ్ఞానముయొక్క సందుగొందు లందే డ్రిమ్మరుచుచున్నాను. కాని యాతని కబురిచ్చుటనే వినవచ్చినది.

నేను ప్రియతముని లేఖనందుకొంటిని. ఈ యుత్తరమునందు మాటలకందని సందేశము కలదు. ఇక మరణమునకై భయపడను.

కబీరు చెప్పుచున్నాడు—ఓ నెచ్చెలీ! నేన వినాశినే వరముగా బొందితిని.

## 20

ప్రియతముని విరహముచే నా హృదయము వేదనాపూరితమైనది. పగలు సుఖము లేదు. రాత్రి నిదుర లేదు. నా దుఃఖము నెవ్వరి యెదుట వెళ్లబోసికొందును? రాత్రి చీకటి, ఘడియలు గడిచిపోవుచున్నవి. ప్రభువు లేమి మాటిమాటికిని భయముతో గంపించు చున్నాను. కబీరిట్లనుచున్నాడు — ఓ ప్రియ సఖుడా! వినుము ప్రభువు కలయికయందు దక్క వేరొకట సుఖములేదు.

## 21

రేబవలు చెలులతో నాడుకొంటిని, ఇప్పుడు కడుభయమగుచున్నది. నా పెనిమిటి మేడ మిగుల ఎత్తు. ఆరోహించుట యెట్లాయని నా ప్రాణము కంపించుచున్నది.

ప్రాణేశ్వరునితో సుఖముగోరుదునేని సిగ్గును విడనాడవలయును. ప్రియతమునితో హృదయ మును మేళవింపవలయును, మేలిముసుగు సవ రింపవలయును. దేహమంతటితోను ఆతని గలియవలయును. నయనములు పెరిమపుటా రతిని వెలగింపవలయును.

కబీరనుచున్నాడు — "ఓ సఖీ, వినుము, ప్రేమయే దీనిని తెలిసికొనగలదు. ప్రియ తమునికొఱకు నీవు వ్యాకులపడుట యెఱుగవేని, నీ దేహమునలంకరించుకొనుట వృథ. నీ కన్నుల కాటుక పెట్టుకొనుట వృథ.

# మాతృదేవి చరణసన్నిధి

ఆంగ్ల గ్రంథము:
ఎట్ ది హోలీమదర్స్ ఫీట్

అనువాదము:
పి. గణపతిశాస్త్రి

22 ఆగస్టు 1918.

ఈవేళ సాయంత్రం శారదాదేవిని చూడడానికి వెళ్లాను. ఆమె తన మంచంపక్కన నేలమీద చాప పరుచుకుని పండుకున్నది. నేను ఆమెకు సాష్టాంగనమస్కారం చేసి, అనేక విషయాలు ముచ్చటించిన తరవాత "నేనిక్కడ చాలా కాలంనుంచి ఉంటున్నానమ్మా! నేనిక మా కాళీఘాట్ ఇంటికి వెళ్ళడం మంచిదంటావా, అమ్మా!" అని అడిగాను. దానిమీద అమ్మ నాకిలాగ హితవుపదేశించింది.

"ఇంకా కొంతకాలం ఇక్కడ ఉండమ్మా! తీరా అక్కడికి వెళ్లాక, ఇక్కడికి తీరా బాగా రాలేవు! నీవు ఒక్కనాడు రాకపోతే ఎందుకు రాలేదా? అని నేనాశ్చర్యపోతుంటాను. ఉదాహరణకు నిన్న నీవు ఇక్కడికి రాలేదు. నీకేదైనా జబ్బు చేసిందేమోనని నేనాందోళన పడ్డాను. నీవుగాని, ఈవేళ వచ్చి ఉండకపోతే నీ సంగతి కనుక్కోడానికి వంటమనిషిని పంపించి ఉండేదాన్ని. అయితే ఒకవేళ భర్తకు ఆరోగ్యం బాగుండకపోతే, లేక ఆయన నిన్నక్కడికి రమ్మంటున్నారని అనుకుంటే నీవు తప్పకుండా వెళ్ళవలసిందే!"

నేను: ఆయన అన్నివిధాలా సుఖంగా ఉన్నా, నేనింతకాలం మా చెల్లెలిగారి ఇంటిలో ఎందుకుండాలని లోకులు విమర్శిస్తారు. నేను నా భర్తగారిని గురించి సంసారాన్నిగురించి ఇంకా ఎక్కువ శ్రద్ధ వహించాలని వారంటారు.

అమ్మ: నీవు నీ సంసారానికి చాలా కాలం నుంచే సేవ చేస్తున్నావు. లోకుల మాటలను గురించి పట్టించుకోకు. లోకుల తీరే అంత! అదీగాక ఆశ్వయుజమాసం పూజ సెలవుల్లో నీవు ఎలాగు వెళ్ళాలికదా!

దానిమీద నేనిలాగన్నాను. "నా సంసారాన్ని గురించి ఎన్నడు నేనింతగా శ్రద్ధవహించలేదు. ఇప్పుడు నాకున్న ఆందోళన అంతా నిన్ను తరుచుగా చూడలేకపోతానేమో అనే! అంతే!

"అయితే ఆందోళన పడవలిసిందిక ఏమి ఉంది? ఈ నెల అంతా నీవు ఇక్కడ ఉండవచ్చును." అని భరవసా ఇచ్చింది, అమ్మ.

మాతృదేవిని సందర్శించడానికి ఒకామె వచ్చిందని ఒక బ్రహ్మచారి లోపలికి వచ్చి చెప్పాడు. అప్పటికే అమ్మ బాగా అలిసిపోయి పడుకుని విశ్రాంతి తీసుకుంటున్నది. ఆ వార్త విని అమ్మ చిరాకుపడి లేచి కూర్చున్నది. మరి కొంతసేపటికి తానే చక్కగా అలంకరించుకున్న ఒకామె వచ్చి, మాతృదేవి పరుపు దగ్గిర కూర్చుని ఆమె పాదాలదగ్గిర శిరస్సుంచి నమస్కరించింది. దానిమీద మాతృదేవి "నా పాదాలు స్పృశించవలసిన అవసరంలేదు. అక్కణ్ణించి నమస్కరించవచ్చును" అన్నది. ఆ తరవాత మాతృదేవి ఆమె క్షేమసమాచారాలడిగింది.

దానిమీద ఆ మహిళ "అమ్మా! మా ఆయన జబ్బుగా ఉన్నారని నీ వెరుగుదువు గదా!" అన్నది.

అమ్మ: అవును. ఆ మాట విన్నాను. ఇప్పుడాయన పరిస్థితి ఎలాగున్నది? ఆ జబ్బేమిటి? వైద్యం ఎవరు చేస్తున్నారు.

"అది డయబిటిస్. డాక్టరు జాగ్రత్తగా వైద్యం చేస్తున్నారు. కడుపులో నీరు చేరింది. కాళ్లు కొంచెం వాస్తున్నాయి. ప్రమాదకరమయిన పరిస్థితి అని డాక్టర్లంటున్నారు. కాని నాకా వైద్యుల మాటలమీద నమ్మకం లేదు. అమ్మా! నీవే ఏదో దారి చూపించాలి. ఆయనకు నింపాదిగా ఉంటుందని నీ వంటే చాలు నమ్మా!" అని అన్నదామె.

దానిమీద మాతృదేవి "నాకేమి తెలుసు నమ్మా! అంతా ఆ ఠాకూర్! ఆయన మీదనే అంతా ఆధారపడి ఉన్నది. ఠాకూరు ఆ జబ్బు నయం చేస్తే అంతా నింపాదిగా ఉంటుంది. నేనాయన్ని ప్రార్థిస్తాను." అని సమాధానం చెప్పింది.

"అంతేనమ్మా! నాకు కావలిసినదంతే! నీ వర్థిస్తే ఆయన తిరస్కరిస్తారా?" అన్నది ఆ మహిళ.

అలా గంటూనే ఆమె అమ్మ పాదాలమీద శిరస్సుంచి కుమిలి కుమిలి దుఃఖించింది.

అమ్మ ఆపైన "నీ భర్తప్రాణాలు రక్షించవలిసినదని ఠాకూరును వేడుకో!" అంటూ ఓదార్చింది.

23 ఆగస్టు 1918.

నేనీవేళ శారదాదేవిని సందర్శించడానికి వెళ్లేసరికి అక్కడ ఉన్నవారందరు ఒక భక్తురాలిని గురించి, చర్చిస్తున్నారు. ఆ సందర్భంలో మాతృదేవి అన్నది. "ఆవిడ కోడలివిషయంలో చాలా ఖచ్చితంగా వ్యవహరిస్తుంది. అది తెలివయిన పనేనా? పగ్గం బాగా వదులుగా పట్టుకోవడం చాలా మంచిది. పాపం ఆ అమ్మాయి చాలా చిన్నది. మంచి దుస్తులు వేసుకుని, కన్నుని వంటకాటెందుకారగించకూడదు? ఆ పిల్ల బెదిరిస్తున్నట్టు ఆత్మహత్య చేసుకున్నా, ఇల్లు విడిచి వెళ్ళిపోయినా ఏమి జరుగుతుంది."

ఆ తరవాత నాకేసి చూసి అమ్మ అలాగే తన ప్రసంగం కొనసాగించింది. "ఆమె కాలికి మరికొంత పారాణి పెట్టుకుంటే తప్పేమిటి? ఆమె తన భర్త నెన్నడు సందర్శించలేదు. అందులోను ఈ అమ్మాయి భర్త సన్యసించాడు. నేను అక్షయం ఠాకూరును సందర్శించ వచ్చును. ఆయనకు అన్నపానాలమర్చగలను. పిలిస్తే దగ్గిరికి వెళ్లగలను. పిలిపించకపోతే రెండు మాసాలదాకా ఆయన దగ్గిరికే వెళ్లలేను. అంతదాగా సంగీత గోపురంకింద గదిలోనే ఉండిపోయాను. దూరంనించే నమస్కరించే దాన్ని. ఠాకూరు "ఆమె పేరు శారద. ఆమె విద్యాధిదేవత సరస్వతి. అందుచేతనే అలంకారాలంటే ఆమెకంత ప్రీతి" అని అంటూండే వారు. ఆ తరవాత ఒకప్పుడు ఆయన హృదయ్‌తో "నీ పెట్టిలో ఎంత సొమ్ముందో చూడు. అందమయిన కంకణాలు రెండు చేయించు." అన్నారు.

ఆ సమయంలో ఠాకూరుకు జబ్బుచేసింది. అయినా ఆయన మూడు వందరూపాయలతో బంగారుకంకణాలు చేయించారు. అయితే తమంతట తామెన్నడు ఆయన సొమ్ము చేతితో తాకలేదు.

ఠాకూరు దివంగతులయిన పిమ్మట నేనిక్కడికి రావాలని నిశ్చయించడం జరిగింది. ఆ రోజుల్లో నేను కామార్పుకూర్‌లో ఉండేదాన్ని. "ఆమె అక్కడికి వెళ్లి అంతమంది యువకులమధ్య ఎలాగ ఉండగలుగుతుంది?" అని చాలామంది అన్నారు. నేనిక్కడికి వచ్చి ఉండబోతున్నానని నాకు అంతకుమునుపే తెలు

సును. అయినా ఈ విషయమయి చాలామంది అభిప్రాయాలడిగాను. నలుగురి ఆలోచనల ధోరణికి అవకాశం ఇవ్వాలిగదా!''

అయితే మరి కొంతమంది ''వారందరు నీ శిష్యులు అందుచేత నీవక్కడికి వెళ్ళి తీరవలిసిందే!'' అన్నారు. అయినా మరికొంతమంది అభిప్రాయాలు కూడా తెలుసుకోవాలని అనుకున్నాను. ఆ తరవాత నేను మా గ్రామంలో ప్రసన్నమాయి అను ఒకవృద్ధురాలినీ విషయం ప్రశ్నించాను. ఆమె చాలా విజ్ఞురాలు. ఆమె దైవభీతి పాపభీతి ఉన్న మనిషి. ఆమెమాటంటే అందరు గౌరవించేవారు. నా ప్రశ్నమీద ఆమె ఇలాగన్నది.

''తప్పకుండా నీవు వెళ్ళి తీరవలిసిందేనమ్మా! వారందరు నీ శిష్యులు. అందుచేత నీ కుమారులు. ఇందులో అసలు చర్చించడానికేమి ఉంది? నీవు వెడుతున్నావన్నమాటె!''

''ఇది విన్న తరవాత చాలామంది తమ అంగీకారం వ్యక్తీకరించారు. అందుకనే నేనిక్కడికి వచ్చి వేశాను. జయరాంబాటి నుంచి వచ్చినపిల్లని కూడా నామీది అభిమానంతో ఇక్కడివారెంతో ఆప్యాయంగా చూస్తున్నారని నీకు తెలుసుగా?

''మా శారద నాశ మతిలేని పెనిమిటికిచ్చి పెళ్ళిచేశామమ్మా! సామాన్యస్త్రీలలాగ సంసారసౌఖ్యంగాని, 'అమ్మా' అని పిలిచే కన్న కుమారులు కాని లేనప్పుడు ఇక ఏమని చెప్పుకోను?'' అని మా అమ్మ అప్పుడప్పుడు దుఃఖిస్తూ ఉండేది. దానిమీద ఠాకూరు ఒక నాడు ''ఈ విషయం కోసం మీరు దుఃఖించవసరం లేదమ్మా! ఆమెకసంఖ్యాకులయిన కుమారులుంటారు. వారెల్లప్పుడు పిలిచే 'అమ్మా! అమ్మా!' అన్న పిలుపుతో ఆమె చెవులకింక నొప్పిపుడుతుంది!'' అని అన్నారు. ఆయన చెప్పింది. నిజం! సరిగా ఆయన అన్నట్టే జరిగింది.''

అప్పటికే బాగా ఆలస్యం అయింది. అందుచేత అమ్మదగ్గిర సెలవు తీసుకుని నేనింటికి వెళ్లాను.

ఈవేళ మధ్యాహ్నం విపరీతంగా వాన కురుస్తూంది. అమ్మ సందర్శనానికి వెళ్లే సమయం సమీపించినకొద్ది, చీకటి పడుతూండడంవల్ల - 'నేనెలాగ వెళ్లగలనా?' అని ఆశ్చర్యపడ్డాను. అయితే శోకహరణ్ సలహామీద ఒంటిమీద వానకోటు కప్పుగొని నెమ్మదిగా అమ్మ సందర్శనానికి బయలుదేరాను. వర్షంతోబాటు తీవ్రంగా గాలి విసిరికొడుతూంది. అయినా పట్టరాని ఆనందం నన్ను ముమ్ముందుకు పంపించింది. ఆ సంతోషం మాటలతో అభివర్ణించలేను. ఆ వేషంతో సన్న్యాసులెవ్వరయినా నన్ను చూడగలరేమో అన్న బిడియంతో నేను పెరటి దారమ్మటే లోపలికి వెళ్ళాను.

నేనావిధంగా లోపల అడుగుపెట్టేసరికి శారదామాత నన్నుచూస్తూనే కలకలనవ్వింది. కాని నేను పాదాభివందనం చేసిన తరవాత నా తడిదుస్తులు ఆమె పాదాలకు తగిలాయి. నేను వేసుకున్న ముసుగు బాగా తడిసింది. అందుచేత అమ్మ చాలా కంగారుపడి ''ఇదేమిటి నీవు బాగా తడిసిపోయావే! వెంటనే వెళ్ళి బట్టలు మార్చుకో!'' అని ఆజ్ఞాపించింది. ఆపైన ''ఇదిగో! రాధూచీర కట్టుకో!'' అని నిర్దేశించింది.

దానిమీద నేను ''ఇదిగో చూడమ్మా! నీ అంతట నీవేచూడు! నేనంత ఎక్కువగా తడిసిపోలేదు. ఒక్క తలదగ్గిరే రవంత ఎక్కువగా తడిశానంతే! అంత చీరమార్చుకోవలిసినంతటి అవసరమేమిలేదు.'' అన్నాను. అమ్మ నన్ను

పరిశీలనగా చూసి "అవునమ్మా! నీ వన్నది నిజమే!" అన్నది.

ఆ తరవాత మేమిద్దరము జయరాంబాటిని గురించి ముచ్చటించుకున్నాము. ఆ సందర్భంలో శారదామాత ఇలాగన్నది.

"ఒకప్పుడు మా ఊరి ప్రాంతంలో భయంకరమయిన క్షామం తాండవించినది. [1871] ఆకలితో అల్లల్లాడి పోతున్న వారెంతోమంది మా ఇంటికి వచ్చేవారు. మేము గత సంవత్సరం వాడుకోగా మిగిలిన ధాన్యం అంతా ఒక చోట జాగ్రత్తచేశాము. మా నాయన, ఆ ధాన్యం అంతా దంపించిన బియ్యంతో పప్పు దినుసులు కలిపించి పులగం తయారు చేయించేవారు. అది పెద్ద పెద్ద కుండలలో జాగ్రత్త చేయించేవారు.

ఆ పైన "పైనించి వచ్చేవారికి ఇంట్లో వారికి ఇదే ఆహారం. ఒక్క మా శారదకు మాత్రం కొంచెం సన్నని బియ్యంతో పులగం తయారు చేయించాలి. మా బంగారుతల్లికి అదే పెట్టాలి!" అని అంటూండేవారు. ఒక్కొక్కప్పుడు చాలామంది జనం రావడంవల్ల పులగం అంతా అయిపోయి మళ్ళీ వండవలిసిన అవసరం కలుగుతూండేది.

అది వేడి వేడిగా తయారు కాగానే చల్లబరచడానికి నేను విసనకర్రతో విసురుతూండేదాన్ని. అనేకులన్నార్తులు ఆ పులగంకోసం వేచిఉండడమే దానికొక ప్రధాన కారణం. ఆ రోజుల్లో ఒక స్త్రీ అక్కడికి వచ్చింది. ఆమె జుట్టంతా తైలసంస్కారం లేక బొత్తిగా చిందర వందరగా ఉంది. మనిషి ధోరణి చూస్తే మతి తప్పినట్టు కనిపించింది. ఆమె వస్తూనే పశువుల కని తొట్టెలోపోసిన అన్నంగంజి అదేపనిగా తాగడం ప్రారంభించింది. ఇంట్లో పులగం సిద్ధంగా ఉన్నదని అది తినవచ్చునని మేమెన్నో మారులు బతిమాలుకున్నాము. కాని ఆమె మా మాట బొత్తిగా చెవికెక్కనియ్యలేదు. ఆకటిచిచ్చుయాతన అటువంటిది!

ఈ ఏడు నేనీమధ్యన మా పల్లెటూరి ఇంట్లో ఉన్నప్పుడు బాగా జబ్బుపడ్డాను. ఆ సమయంలో అర్ధరాత్రివేళ నాకు భరించరానంత ఆకలి వేసింది. పట్టపగలంతా పనిచేసిన సరళ, మొదలయిన వారంతా గాఢనిద్రలోఉన్నారు. వారిని మేలుకొలపడం న్యాయంకాదనిపించింది. నేనల్లాగే, పరుపుమీద పడుకుని పక్క అంతా గాలించాను. నా కక్కడ అటుకులతో నింపిన చిన్న పళ్లెం ఒకటి కనిపించింది. ఆ పైన నా తలగడ దగ్గిర రెండు బిస్కట్లుకూడా కనిపించాయి. ఎంతో సంబరపడి ఆ అటుకులతో బాటు ఆ బిస్కట్టుతిని, నా పక్కనే ఉన్న కూజాలో మంచినీళ్లు తాగాను. నేనప్పుడు ఏమిచేస్తున్నానో తెలియనంతటి విపరీతమయిన ఆకలి వేసింది నా కప్పుడు!

ఆ కథంతా చెబుతూ అమ్మ కలకల నవ్వింది.

రెండు రోజుల తరవాత శారదాదేవి పచ్చికబయలుపక్కనే ఉన్న వరాండాలో కూర్చుని జపమాలతో జపం చేస్తున్నది. అమ్మ ఆమె గదిలో కనిపించకపోయేసరికి నేనక్కడికి వెళ్ళాను. నన్ను చూస్తూనే అమ్మ! "ఇదిగో వచ్చావే? కూర్చోతల్లీ!" అన్నది. తన జపం ముగియగానే జపమాలిక ఉంచే సంచీ నుదుటి కద్దుకుని అది ఒక పక్కన ఉంచింది. ఆరోజుల్లో అమ్మ గదికెదురుగా ఒక ఖాళీజాగా ఉండేది. దానికి పశ్చిమంగా ఉన్న ప్రదేశంలో చిన్న చిన్న పెంకుటిళ్లలో బీదలు కొందరు అద్దెల

కుండేవారు. వారిని గురించి ప్రస్తావించి అమ్మ ఇలాగన్నది.

"చూడు! పగలంతా వాళ్లు ఎంత కష్టపడి పనిచేసి సాయంకాలం ఎంత హాయిగా విశ్రమిస్తున్నారో చూడు! నిరుపేదలు, నిత్యము ఏవేవో వేదనలనుభవించేవారు నిజంగా ఎంతో అదృష్టవంతులు". ఇవేమాటలు ఏసుక్రీస్తు అన్నట్టు నేను బైబిలులో చదివాను. అమ్మ నోటమ్మట కూడా ఆ మాటలే విన్నాను...

ఇంచుమించుగా ఇదే సమయంలోనే నొకసారి అమ్మ సందర్శనానికి వెళ్ళాను. ఒక సన్యాసి శారదాదేవికి సాష్టాంగ నమస్కారం చెయ్యడానికి అక్కడికి వచ్చి అన్నాడు.

"అమ్మా! ఒక్కొక్కప్పుడు నా మనస్సు అల్లకల్లోలమయి విశ్రాంతి శూన్యమయి పోతుందెందుచేత? నీమీద నిశ్చలబుద్ధి కలుగదెందుచేత? అనవసరమయిన బాహ్యాలోచనలేమో నాలో లోపలికి చొచ్చుకు వస్తాయెందుచేత? అమ్మా! స్వల్ప విషయాలు కోరినంతలోనే అందవస్తాయి. ఇది ఇలాగే జరుగుతూంది. అయితే మరి నీసాక్షాత్కారభాగ్యం నాకెన్నటికి లభించదా? ప్రశాంతి నాకెలాగ లభిస్తుందో శాస్త్ర సెలవీయరాదా, తల్లీ! మరి నీ అనుగ్రహం నాకెన్నటికి లభించదా? ఈ మధ్యన నాకేంకుచేతనో దివ్యదర్శనాలంతగా కనిపించడంలేదు! నీ దివ్యసాక్షాత్కార భాగ్యం లభించకపోతే! మరి ఈ వ్యర్థజీవితం వల్ల ప్రయోజనమేమిటి? ఈ బ్రతుకు ఎంత శీఘ్రంగా అంతమయితే అంతమంచిది."

దానిమీద శారదామాత ఈ తీరులో ఆతనినోదార్చినది.

"ఏమిటి నాయనా, ఏమిటంటున్నావు? నీవావిధంగా ఆలోచించరాదు. దివ్యదృశ్యాలు ప్రతిదినము సాక్షాత్కరిస్తాయా? "నీవు గాలం విసిరి నిరీక్షించినా ప్రతిరోజు పెద్దచేప దొరుకుతుందా?" అని ఠాకూరు అంటూండేవారు. నీ సాధన సంపత్తితో ప్రతిదినము మిక్కిలి జాగరూకతతో నిరీక్షిస్తే ఎప్పుడో అప్పుడు నీకొకతోడు లభిస్తుందేమో! లేక ఏ చేప దొరకక పోయినా పోవచ్చును. అంతమాత్రంచేత ఎదురుచూడడం మానవద్దు! చిరకాలం ప్రార్థన కొనసాగించు! తెలిసిందా?"

దానిమీద జోగేన్‌మా అందుకుని "అవును! మొట్టమొదట ఏకాగ్రత సాధ్యపడక పోయినా అదే కాలాంతరంలో అలవడుతుంది" అన్నది. ఆ పైన మాతృదేవి ఇలాగన్నది.

"నీవు కనుగొన్న దానిని పిడిచిపెట్టక దానిమీదనే నీ మనస్సంతా కేంద్రీకరించి నిలుపుకో! 'నా కెవ్వరు లేకపోయినా అమ్మ ఉన్నది' అని గట్టిగా భావించుకో! తనవారికందరికి అంత్యకాలంలో తాను సాక్షాత్కరించగలనని, తన వెంటబెట్టుకుని పోగలనని ఠాకూరు తమ దేహం చాలించేముందు మనతో చెప్పలేదా?"

—సశేషము.

---

సత్యజ్ఞాన సూర్యుని దివ్యతేజస్సును మేము వరించుచున్నామని, అది మా చిత్తవృత్తులకు వెడుగడయై వెలయనభిలషించుచున్నామనీ, గాయత్రీ మంత్రార్థం. సూర్యుడు క్రిందికి దిగివచ్చెడి దివ్యతేజస్సునకు ప్రతీక. ఆ తేజస్సు క్రిందికి దిగివచ్చి మన చిత్తవృత్తులను ప్రేరేపించి సన్మార్గమున నడిపించాలన్న ఆశయాన్నే గాయత్రి అభివ్యక్తం చేస్తున్నది.

-అరవింద.

# నిమిత్తమాత్రం భవ సవ్యసాచిన్

చీమలకొండ ఉమారామలింగమూర్తి

నరత్వం దుర్లభంలోకే
విద్యా తత్ర సుదుర్లభా
కవిత్వం దుర్లభం తత్ర
శక్తిస్తత్ర సుదుర్లభా

మానవుడై పుట్టుట దుర్లభము. విద్యావంతుడగుట ఇంకను దుర్లభము. కవిత్వము అబ్బుటయు దుర్లభమే. శక్తిసంపన్నుడగుట అత్యంత దుర్లభము.

జంతువులలో అగ్రగణ్యుడై హేతువాద ప్రావీణ్యముగలిగి అపారమైన తెలివితేటలు గలవాడై బుద్ధిబలముతో ఎట్టి జటిలమైన సమస్యనైనను అవగాహన చేసికొనగల ప్రజ్ఞ కల్గియుండుట సుకృతమే. నేటి బుద్ధిమంతులు ప్రత్యక్షముగ గోచరించు దానినే అంగీకరింతురు. పరోక్షమైన వేదశాస్త్రములను నమ్ముటకు సిద్ధపడరు. ప్రాపంచిక జీవితమును సుఖవంతము చేయుటెట్లు అనియే ఆలోచింతురు. ఈ దృక్పథముతోనే అనేక అద్భుత విషయములు కనుగొనబడుచున్నవి. అట్టి దృక్పథము ఎంతవరకు సమంజసమో గమనింతము.

మనకు కల్గెడు ఆలోచనలు మంచివి కావచ్చును లేదా చెడ్డవి కావచ్చును. వివేకము లేని మనుజుడు మంచిచెడ్డలతో నిమిత్తము లేకయే తన ఆలోచనా సరళినిబట్టి తన కోరికలను సఫలీకృతము ఒనర్చుటకే నిశ్చయించును. వివేకము కలిగిన మనుజుడు ఆ కోరికల మంచిచెడ్డలను అంచనావేసి మంచివైనచో వానిని సఫలీకృతమొనర్చుకొనును. చెడ్డవైనచో వానిని విడనాడుటకు ప్రయత్నించును. ఈ మంచి చెడ్డలను నిర్ణయించు దానిని అంతరాత్మ అందుము. దీనినే అంతఃకరణము, అంతర్వాణి (Conscience or inner voice) అనియు అందురు. దీనినే మనలోని దైవత్వమన వచ్చును. అంతరాత్మ ప్రబోధము ననుసరించినచో మనము తప్పటడుగు (False step) వేయుట జరుగదు.

కొన్ని పరిస్థితులలో అంతరాత్మ ఒక నిశ్చయమునకు రాలేకపోవచ్చును. ఆంగ్లమున …లో నాటకములను వ్రాసి విభిన్న పాత్రలను లెక్కకుమీరి చిత్రించి ఆనాటి సాంఘిక జీవనమునకు దర్పణము పట్టిన షేక్స్పియరు మహాకవి హామ్లెట్ (Hamlet) అను నాటకమునగల ఈ దిగువ వాక్యములు ఈ విషయమునే స్పష్టము చేసినవి.

Thus Conscience does make Cowards of us all
And thus the native hue of resolution
Is sicklied over with pale cast of thought
And enterprises of great pith and moment
With this regard their currents turn away
And love the name of action.

దీని భావమును ఇట్లు చెప్పవచ్చును. "మన అంతరాత్మ మనలను పిరికి పందలుగ చేయును. మన ఆలోచనా పరంపరవలన మనోనిశ్చయము చల్లబడి, చేయవలసిన బృహత్కార్యములు క్రియారూపము ధరించక అనిశ్చిత పరిస్థితి ఏర్పడును."

అందువలన కార్యశూరులు అంతరాత్మపై ఎల్లపుడు ఆధారపడి యుండరాదు. అంతరాత్మపై ఎప్పుడు ఆధారపడియుండవలెనో కాళిదాసు మహాకవి శాకుంతలమున ఇట్లు చెప్పినాడు.

సతాం హి సందేహపదేషు వస్తుషు
ప్రమాణమంతఃకరణప్రవృత్తయః

భావము-సందేహనివృత్తి అగుటకు ఇతర సాధనములేవియు లేనపుడు సత్పురుషులు అంతఃకరణముపై ఆధారపడి యుందురు.

ఇతర సాధనములేవియు లేనప్పుడే అంతః కరణముపై ఆధారపడియుండవలెనుగాన ఇతర సాధన లేవియో తెలిసికొనవలసియున్నది.

(i) శ్రుతులు (వేదములు) (ii) స్మృతులు (శాస్త్రములు) (iii) సాధుపురుషుల ఆచరణ (ఆచారశ్చసాధూనాం)—వీనిని ఇదే క్రమమున మనము ప్రమాణములుగా తీసికొనవలెననియు అవి లభ్యము కానియెడలనే అంతః కరణముపై ఆధారపడి యుండవలెననియు పెద్దలు చెప్పుదురు. శ్రుతులు జనసామాన్యమునకు గ్రాహ్యములుకావు. కావున వేదాంతములగు ఉపనిషత్తుల సారమైన భగవద్గీతయందు శ్రీ కృష్ణపరమాత్మ ఒసంగిన సలహాను గమనింతము.

> తస్మాచ్ఛాస్త్రం ప్రమాణంతే కార్యాకార్య వ్యవస్థితౌ
> జ్ఞాత్వా శాస్త్రవిధానోక్తం కర్మకర్తుమిహార్హసి.

తాత్పర్యము — కావున శాస్త్రములను ప్రమాణములని నమ్మి శాస్త్ర సమ్మతములైన కర్మలను శాస్త్రబాహ్యములైన కర్మలను తెలిసికొని శాస్త్రోక్తములైన కర్మలను ఒనర్చుటయే అర్థము.

ఏనాడో శ్రీ కృష్ణపరమాత్మ చెప్పిన సలహాను నమ్ముటకు ప్రస్తుత యువకులు సంసిద్ధులు కారు. అందువలన సాధుపురుషుల ఆచరణకూడ పరిగణించవలయును. మన దేశనాయకులలో అగ్రగణ్యులలో నొకరగు బాలగంగాధర తిలక్ గీతను Gospel of work (నిష్కామ కర్మను ప్రబోధించు మత గ్రంథము) అని వర్ణించిరి. మన జాతి పితయగు గాంధిమహాత్ముడు ఇట్లు వ్రాకుచ్చెను "When doubts haunt me, when disappointments stare me in the face and when I see not a ray of light on the horizon, I turn to Bhagavad Gita and find a verse to Comfort me. సంశయములు నన్నావరించినపుడు సంకటములు సంప్రాప్తమైనపుడు నిరాశా నిరుత్సాహములు జనించినపుడు నేను భగవద్గీతను తెరచి చూతును. అందు ఏదియో ఒక శ్లోకము నన్నూరడించును."

వివేకానందుడిట్లు నుడివెను. "The reconciliation of different paths of Dharma and work without desire or attachment—are the two special characteristics of Gita సర్వధర్మ సమన్వయము, నిష్కామకర్మ-అను రెండును గీతయొక్క ప్రధాన లక్షణములు." అందువలన గీత యొసంగిన సందేశమును పఠించి దానిని ఆచరించుటయే మన ధ్యేయమై యుండవలెను. అట్టి దివ్య సందేశమును తెలిసికొందము.

మనము మనస్సుచేగాని శరీరముచేగాని వాక్కుచేగాని ఏదియోపనిని (కర్మను) చేయుచుందుము. మన మనస్సులో సత్సంకల్పములుగాని దుస్సంకల్పములుగాని కల్గుచుండును. శరీరమందలి కరచరణాద్యవయవములచే సత్కృత్యములనుగాని దుష్కృత్యములనుగాని చేయుచుందుము. నోటితో మంచి మాటలను గాని అనరాని మాటలనుగాని అనుచుందుము. ఇవన్నియు కర్మలే. సత్కర్మలవలన సుఖమును దుష్కర్మలవలన దుఃఖమును ప్రాప్తించును. మనమెత్తిన జన్మలన్నిటిలోను చేసిన కర్మల ఫలితమును అనుభవించుటకు ఒక జన్మ చాలదు. ఈ తీరున జన్మ పరంపరగల్గుటయే సంసారమనబడును. మానవుడు హృదయాంతరమున ఈశ్వరాంశయే (Everyman is potentially divine) అయినను అతడొనర్చిన కర్మ ఫలము ననుభవించుటకు సంసారవలయములో చిక్కుకొనియున్నాడు. అందువలన సంసారమనునది కర్మఫలము ననుభవించుటకే ఏర్పడినది. సుఖముల ననుభవించుటకు ఇష్టపడుదుముగాని దుఃఖముల ననుభవించుటకు ఇష్టపడము.

సుఖముల ననుభవించవలెనన్నచో మంచి కర్మలనే చేయవలెను. దుష్కర్మలను చేయరాదు. అయితే సత్కర్మలనే చేసినను ఆ కర్మల ఫలమగు సుఖమును అనుభవించుటకు సైతము మరల జన్మ ఎత్తవలసినదేకదా యను సందేహము కల్గుట సహజము. అందువలన సత్కర్మలను చేయుటయు మంచిదికాదని తోచును. సుఖదుఃఖములు రెండును సంసారమున బంధించునవే. సుఖములు బంగారు సంకెళ్ళను, దుఃఖములు ఇనుప సంకెళ్ళను మాత్రమే. మొత్తముమీద మనలను బంధించుటకు రెండును (సుఖదుఃఖములు) సంకెళ్లవంటివే. ఎట్టి సంకెళ్ళతోనైనను బంధింపబడుటకు ఎవ్వరును ఇచ్ఛగింపరుకదా!

ఏ పనిని (కర్మను) చేయక ఊరకుండుట సాధ్యముకాదు కనుక మంచి కర్మలనే చేయుమని మన శాస్త్రములు చెప్పుచున్నవి. మంచి కర్మలను చేయుటవలన స్వర్గము దుష్కర్మలవలన నరకాదులును లభించుననియు శాస్త్రములు దెలియచేసినమాట నిజమే అయినను అందలి అంతరార్థమును గ్రహించవలసియున్నది. ఈ ఉదాహరణమును గమనింపుడు. బాలురచే ఔషధమును సేవింపచేయవలచిన తల్లిదండ్రులు బాలురకు మధుర పదార్థములను ఎరచూపి, బుజ్జగించి వానిని తినుటయందు ఆసక్తిగల్గించి మందును సేవింపచేయుదురు. మందు త్రాగనిచో బూచిని చూపి బెదిరింతురు. తల్లి దండ్రుల అభిప్రాయము తమ బిడ్డ నిరంతరము మధురపదార్థములనుగాని మందునుగాని సేవింపవలెననికాదు. అతడు ఆరోగ్యముగ నుండవలెననియే. ఇటులనే భగవద్రూపులగు వేదములు సంసార హేతువులగు కర్మలనుండి విముక్తికలుగచేయుటకే అవాంతరఫలితములగు స్వర్గసుఖములు నిత్యముకావనియు, క్షీణేపుణ్యే మర్త్యలోకం విశంతి' అను గీతావాక్యానుసారము పుణ్యము క్షీణించిన వెంటనే మానవలోకమున మరల జన్మించవలెనని చెప్పినవి.

జన్మరాహిత్యమగుటకు సంసార సాగరమునుండి బయట పడుటకు—సత్కర్మలను కూడ చేయరాదని చెప్పుచున్నవి. కర్మలను చేయకుండుటకు కర్మసన్యాసము అందురు. అయితే పైన చెప్పినట్లు కర్మ చేయకుండుట సాధ్యము కాదుగాన కర్మసన్యాసము అను పదమునకుగల విస్తృతార్థమును తెలిసికొందము. భగవద్గీతయందు కర్మలు, కర్మ అకర్మ వికర్మ అను మూడు విధములని చెప్పబడినది. ఒక పనిని చేసినను దానివలన బంధము కలుగకుండునట్లు చేసినచో ఆ పని చేయనట్లేకదా! (Work done without any result is as good as work which is not done). ఈ కర్మను నేను చేయుచుంటినను అహం భావము (ego) లేని విధమున—ఈ పనికి నేను కర్తను (doer) అను అభిప్రాయము లేని విధమున—ఈ కర్మవలన ఫలానా ఫలము రావలెనని కోరని విధమున ఎట్టి కర్మ చేసినప్పటికి అది బంధము (Attachment) ను కలుగచేయదు కావున అట్టి పనిచేసియు చేయనట్లే అగును. ఈ ఉదాహరణమును పరిశీలింపుము. ఇద్దరు పురుషులు యజ్ఞములు (పవిత్ర కార్యములు) చేయుచున్నారనుకొనుము. ఒకడు స్వర్గమును కోరి యజ్ఞము చేయుచున్నచో, అతడు స్వర్గ ఫలము ననుభవించును, రెండవవాడు కోరిక లేకుండగను, యజ్ఞము చేయుట అతని ధర్మమనియు (Duty), అది భగవంతుని ప్రీతికొరకుగాని లోకశ్రేయస్సు కొరకుగాని చేసినచో అతనికి ఫలమేమియురాదుగాన అతడు ఆ యజ్ఞమును చేయనట్లే అగును. మరియొక

సంగతిని గమనింతము. కర్మచేయకపోయినను చేసినట్లే అగుటయు సంభవమే. ఈ ఉదాహరణమును పరిశీలింపుము. నీటి ఒడ్డున ఒక కొంగ అర్ధనిమీలితనేత్రమై ధ్యానించుచున్నట్లు కనుపించినను దాని మనస్సు చేపలపైననే ఉండుటచే అది (మానసిక) కర్మను చేయుచునే ఉన్నదికదా! అందువలన కర్మ, అకర్మ, వికర్మలఅర్థమును ఇట్లు చెప్పవచ్చును. (1) కర్మ=చేయదగిన కర్మ (2) అకర్మ=కర్మ చేసియు బంధము లేని విధమున చేయుట (3) వికర్మ=చేయరాని పనిచేయుట.

దీనివలన (i) మనము నిషిద్ధకర్మలను చేయరాదనియు (ii) సత్కర్మలను నిష్కామముగను కర్తృత్వరహితముగను చేయవలెననియు స్పష్టము. కర్మఫలజనితసంసారమునుండి విముక్తి లభించుటకు ఇదియే మార్గమని గీత బోధించుచున్నదని తెలియును. కర్మచేయకుండ ఉండలేముగాన దానిని చేయవలసినదే. అట్లు చేయుటలో 'నేను' చేయుచుంటినను అహంభావముగాని ఫలాపేక్షను ఆశించుటగాని ఉండరాదు. కాలిలో ఒక ముల్లు గుచ్చుకొనినపుడు ఆ ముల్లును తీయుటకు మరియొకముల్లు (సూది) ఉపయోగించినట్లు ఒక (కామ్య) కర్మవలన కలిగిన బంధమునుండి విముక్తియగుటకు మరియొక (నిష్కామ) కర్మను చేయుట అవసరము. ఈ తీరున నిష్కామముగను కర్తృత్వరహితముగను చేసిన పనిని Work for work's sake లేక disinterested work అని ఆంగ్లమున అందురు. (Disinterested work is work not biased by self-seeking; but it is not uninteresting work). నిష్కామ కర్మ యనగా ఆసక్తిరహిత కృత్యమని పొరపడరాదు. ఇట్టి కర్మలెట్లుండునో ఈ దిగువ ఉదాహరణములవలన స్పష్టమగును.

ధనవంతుడు తనవద్దనున్న ధనమునకు తానే యజమాని యనుకొనుటవలనను తానే ధర్మము చేయుచుంటిననుకొనుట వలనను అహంకార మమకారములు ఏర్పడును. ఈ తరుణ చేసిన దానము వలన పుణ్యము లభించి దాని ఫలము ననుభవించుటకు మరల జన్మ ఎత్తవలసియుండును. అట్లుగాక తనవద్దనున్న ధనము భగవంతునిదే యనియు తాను దానికి ధర్మకర్తను మాత్రమే యనియు దానిని ఇతరులకిచ్చుట యనగా మానవాకారములో నున్న భగవంతునకిచ్చుట యనియు భావించి నచో నిష్కామముగను కర్తృత్వరహితముగను చేసినట్లగును. ఈ భావమే బైబిల్‌నందు ఇట్లు చెప్పబడినది. 'Giving to the poor is lending to God' బీదలకు ఇచ్చుట యనగా భగవంతునివద్ద దాచుకొనుటయే'. ఇదే తీరున విద్యాధనమునుగాని జ్ఞానధనమునుగాని మనకు గల తదితర ప్రజ్ఞనుగాని ఇతరులకుపయోగించుటయే అర్థము. ఏదైన మంచి పనిని చేయునపుడు ఫలాపేక్ష లేకపోయినను ఆపని వలన లాభమును పొందిన ఇతరులు తనను మెచ్చుకొందురనియు తనకు కీర్తి వచ్చుననియు అభిప్రాయముకూడ ఉండరాదు. ఆ పని చేయుట తన ధర్మముగాన అట్లు చేసితినని భావించవలెను. ఇట్టి సదవకాశమును భగవంతుడు తనకు కలుగచేసినందులకు భగవంతునికి కృతజ్ఞత తెలియచేయుచు భగవంతుని చేతిలో తాను ఒక సాధనము మాత్రమే—నిమిత్తము మాత్రమే—యని భావించవలెను.

పోస్టుమన్ (Postman) ఉత్తరములు బట్వాడా చేయునపుడు ఆ ఉత్తరములలోని మంచి చెడ్డలతో అతనికి సంబంధములేదు. అందలి మంచి వార్తలకు అతడు సంతోషింపడు; చెడ్డవార్తలకు కలతనొందడు. ఇతరులకు

ఆ ఉత్తరములనిచ్చుటయే అతని బాధ్యత. చిరునామాదారులు (Addressee) పొందు సుఖ దుఃఖములకు అతను బాధ్యుడుకాడు. అతడు తపాలా శాఖ యొక్క విధిని నిర్విషయముగ —ఆశాఖ యొక్క నిమిత్తమాత్రుడుగ (As a mere instrument or agent of the postal Deparment) చేయుటవలన అతనికి సుఖ దుఃఖములుండవు. న్యాయాధికారి తన విధి నిర్వహణలో దోషిని విడుదల చేయుటవలనగాని, దోషికి కఠినశిక్ష వేయుటలోగాని సుఖదుఃఖములను పొందడు. మనముకూడ దేవుని చేతిలో ఒక సాధనమువంటి వారమనియు, ఆ పనులను చేయించునది భగవంతుడే యనియు, మనము నిమిత్తమాత్రులమే యనియు గ్రహించినచో ఆ పనులవలన మనకేమియు సుఖదుఃఖములు కలుగవు.

మన జీవిత పరమావధి ఆత్మసాక్షాత్కారము (భగవత్సాక్షాత్కారము) పొందుట. యోగమనగా భగవంతునితో సంయోగము చెందుట. భగవద్గీతయందు 'యోగః కర్మసు కౌశలం' అని చెప్పబడినది. అందువలన కర్మాచరణమునకు నేర్పరితనము కూడ అవసరము. కర్మాచరణమును పరమేశ్వర ప్రీత్యర్థము, లోకోపకారార్థము చేయవలమునుగాక, కడు సమర్థతతో చేయుట అవసరము. యుద్ధమునందు బంధువులను గురువులను చంపవలసి వచ్చుచున్నదను శోకమోహములు గల్గిన అర్జునునకు తన స్వధర్మమగు యుద్ధమును నిష్కామముగను సంగరహితముగను చేయుమని కృష్ణభగవానుడు అతనికి బోధించి నిమిత్తమాత్రుడుగనుండుమని చెప్పుటలో ఆంతర్యమిదియే. అందువలన శ్రుతులు స్మృతులు సాధుజనుల ఆచరణ—ఇవియే మనకు మార్గదర్శకములు. అవి లభించనపుడు అంతరాత్మ ప్రబోధమును పాటించి నిర్దుష్టజీవనమును గడుపుదుముగాక.

మే నెలలో, తుఫానుకు దెబ్బతిన్న ప్రకాశం, నెల్లూరు జిల్లాలలోని కొన్ని గ్రామములలో రామకృష్ణమిషన్ రెండు లక్షల రూపాయల వ్యయముతో సహాయ కార్యక్రమము నిర్వహించినది. 209 బస్తాల బియ్యము, 3762 దోవతులు, 4034 చీరలు, 1100 దుప్పట్లు, 430 దీపములు, 60 లాంతర్లు, 1104 చాపలు, 600 అల్యూమినియమ్ పాత్రలు,-బాధితకుటుంబములకు పంచిపెట్టబడినవి.

# భాగవత భక్తి - కులశేఖరాళ్వారులు

కె. లక్ష్మీప్రసాద్

'భాగవతులు' అనగా భగవంతునికి సంబంధించినవారు, భక్తులు అని యర్థము. భక్తులను సేవించి ఆనందింపచేయుటనే భాగవత కైంకర్యము లేక తదీయారాధనము అందురు. ఇది ముముక్షువులకు అత్యంత ఆవశ్యకమగు సాధన. ఇంతకుమించి సులభతరము, ఫలప్రదమునైన ఉపాయము వేరులేదు. భక్తి సంప్రదాయములన్నింటియందును, ముఖ్యముగా శ్రీ వైష్ణవ సాంప్రదాయమున ఈ తదీయారాధనకు అత్యంత ప్రాముఖ్యము - మూలసూత్రములైన మంత్రదీక్షాలాభము, ఆచార్యాధీనాచరణము మున్నగు వానికంటెకూడ అధిక ప్రాముఖ్యము-ఈయబడినది. భగవద్భక్తులను ఆదరముగా గొనివచ్చి, వారికి సేవదీరునట్లు ఉపచారములుజేసి, అర్ఘ్యపాద్యములొసగి, భక్ష్య భోజ్యాదులచే సంతృప్తునుచేసి ఆనందపరచి వారి ప్రసాద శేషమును భక్తితో స్వీకరించుటను తదీయారాధనమందురు. ప్రపత్తి మార్గమున ఆత్మోన్నతి నందుటకు భగవద్భక్తలకు ఆతిథ్యమిడి సేవించుటకంటె సులభమైన ఉపాయము లేదు.

సంశయగ్రస్తులైనవారికి భక్తులననేకులను పూజించుటకంటె తిన్నగా భగవంతునొక్కని ధ్యానించుట మంచిది కదాయని తోచవచ్చు. కాని తిన్నగా భగవంతుని సేవించుటకంటె భాగవతులను (భక్తులను) సేవించుటకే ఫలమధికముగా చెప్పబడినది. "సిద్ధిర్భవతి నావేతి, సంశయోఽచ్యుత సేవినామ్, న తు తత్పరిచర్యాత్మనామ్." (భగవంతుని సేవించువారికి సిద్ధి కలుగునో లేదో సంశయము. కాని అతని భక్తులను సేవించువారికి సంశయము లేదు.)

రామకృష్ణులు తమ సుందర సరళ బెంగాలీలో 'భక్తేర్ హృదయ్, భగవానేర్ బైఠక్ ఖానా' అని చెప్పువారు. భక్తుని హృదయము భగవంతుని వీధిచావడి (Drawing Room). భగవంతుని కలియగోరితివా, నీకు అక్కడ లభింపగలడు అని వారి దివ్యసూక్తి. (ఒక జమీందారుకు అనేక భవనములు, మేడలు, ఎస్టేట్లు ఉండవచ్చును. కాని సాధారణముగా ఒక వీధిచావడి (Drawing Room) యందే ఆయన ప్రజలను కలిసికొనుచుండును కదా!)

భక్తుని హృదయము భగవంతుని నివాస స్థానము. ఒక సేవకుని, దాసుని శారీరక మానసిక కర్మలన్నియు యజమానికే చెందియున్నట్లు భక్తుని కార్యములన్నియు భగవంతునికే చెందియుండును. భక్తుడెన్నడు తనకొరకాలోచించుకొనడు. ప్రభువుకొరకే ఆలోచించుచు అతని ఆజ్ఞావర్తియైయుండును. మన చేతులు, కాళ్ళు మన సంకల్పములకనుసారముగా అనేక పనులు చేయుచుండును. ఆ కార్యములన్నియు మనము చేయునట్లే భావింతుము కాని, అవి వాటివాటి పనులు చేసికొనుచున్నవని చెప్పముకదా! అట్లే ఒక భగవద్దాసుడు చేయు చింతనలు, కర్మలు ప్రభువైన భగవంతునికే చెందును కాని అతనికి చెందవు. ఇక అట్టి భక్తునికి చేయు సేవ, కైంకర్యము భగవంతునికి చెందుటలో సంశయమేమి!

'భగవత, భక్త, భగవాన్', 'గురు, కృష్ణ, వైష్ణవ' అనుచు రామకృష్ణులు ప్రతిదినము స్మరించుచుండువారు. భక్తుడు, భగవంతుడు; భగవంతుడు, భాగవతము ఏకమనియు, గురువు కృష్ణుడు వైష్ణవుడు ఒక్కరే అనియు భావము.

అందుచేత భక్తులను సేవించినచో తిన్నగా భగవంతునే సేవించినవారమగుదుము. ఒకప్పుడు భగవంతునికి మనము చేయు సేవలను, పూజలను ఆయన స్వీకరించునో లేదో తెలియదు. కాని భగవద్భక్తులను సేవించితిమా, నిశ్చయముగా భగవత్సేవ చేసినవారమగుదుము.

ఈ విధముగా భాగవత సేవచేసి పరిపూర్ణత్వమునందిన వారి చరిత్రలు మిక్కిలి ఆనందకరముగానుండును. ముఖ్యముగ కులశేఖరాళ్వారులు, తిరుమంగై ఆళ్వారులు చూపిన భాగవత భక్తి విశ్వప్రసిద్ధము, నిరుపమానము. అట్లే నేటి కాలమున శ్రీరామకృష్ణుల సాక్షాత్ శిష్యులై ఆదర్శ భక్తునిగా పేరొందిన నాగమహాశయులు భాగవతకైంకర్యమున చూపిన శ్రద్ధ లోకమునకు మార్గదర్శకము.

శ్రీ మహావిష్ణువు యొక్క అంతరంగ భక్తులలో అతిశయ మహా భక్తులైనవారు ఆళ్వారులు. 'ఆళ్వారు' అనగా మునిగినవాడు అని యర్థము. భగవంతుని అసంఖ్యాక కళ్యాణ గుణములు అను సముద్రమున మునిగియుండి, ఆయనయొక్క నిరంతర సంశ్లేష వాంఛచే తనివితీరక సతతము భగవంతుని దివ్య వైభవములను భక్తిపూర్వకముగ ధ్యానించుట యందే నిమగ్నులైనవారు ఆళ్వారులు. వీరు నిత్యముక్తులు. భగవంతుని సంతత పార్షదులైయుండియు, అపుడపుడు దోషయుక్తులైన, భ్రమితులైన లోకులకు నిజమైన భక్తియనసేమో గుర్తు చేయుటకని భగవదాదేశమున భూమిపై అవతరించుచుందురు. వీరి పరాభక్తిని అర్థము చేసికొనవలెనన్న లౌక్యబుద్ధిని, తర్క బుద్ధిని వదలి ఋజుత్వము పూనవలెను.

శ్రీ కులశేఖరుడు క్రీ.పూ. 3102వ సంవత్సరమున కేరళదేశమండలి చోళ పట్టణమున దృఢవ్రతమహారాజుకు తపఃఫలమున పుత్రుడై జన్మించినవారు. కాలక్రమమున కులశేఖరుడు సమర్థుడగు రాజై కేరళ దేశపు చక్రవర్తి పదవి నధిష్ఠించి సమగ్రముగ పరిపాలించెను. రాజు స్వయముగ పరాక్రమవంతుడగుటచే అంతఃకలహములు లేక శత్రుభయము లేక రాజ్యము సుభిక్షముగ నుండెడిది. ఇట్లు చక్రవర్తియైనను కులశేఖరుని సహజస్థితియగు విష్ణుభక్తి ఇసుమంతయు చలింపలేదు. స్వస్వభావమై భగవద్గుణ వైభవాసక్తిని వదలక, కామక్రోధాదులను దరిచేరనీయక, భగవత్కైంకర్య రూపముగ రాజ్యమును పాలించుచు విష్ణువుయొక్క దాసానుదాసుడై యుండువాడు. రాజు ప్రభావమున రాజ్యమంతటను ఒక విధమైన ఆధ్యాత్మిక వాతావరణము నిరంతరము నెలకొని యుండెడిది.

కులశేఖరుని హృదయమందెల్లపుడు అత్యంత తీవ్రమై, అసాధారణమైన భక్తి ప్రవాహము అంతర్వాహినివలె నుండెడిది. ఇతడు స్వయముగ రాజైనను హరిభక్తులతో కలసి విష్ణు కథలు వినుచు భక్తిరసానందమున దినదినము కొంతకాలము గడుపుట పరిపాటి. రాజుతో బాటు సహస్రాధిక సంఖ్యలో భక్తులు కూర్చుండిన మహాసభలో ప్రతిదినము ఉత్తమ భాగవతులు భాగవత రామాయణాది చరిత్రలనతిశ్రవణానందముగ ప్రవచించుచుందువారు. చూచువారికా వైభవమెంతో నేత్రోత్సవముగ నుండెడిది. శ్రీమద్రామాయణము శ్రవణము చేయుచున్నపుడు రాజు తన కులదైవమగు శ్రీరామచంద్రుని అంతరంగమున గాంచుచు, అంతర్నేత్రమున ఆయన కథ జరుగుచున్నట్లే దర్శించుచుండువాడు. భక్తి పారవశ్యము కలిగి ఒడలు పులకరించ ఆనందాశ్రువులు రాల్చుచుండువాడు. ఒకనా

డిట్లు ఏకాగ్రతతో రామాయణము వినుచుండ, ఖరదూషణ సంగ్రామఘట్టము వివరింపబడుచుండెను. పదునాలుగు వేలమంది భీమబలులైన రాక్షసులు రథారూఢులై శ్రీరామచంద్రునిపై దాడి చేసిరనియు, భగవంతుడైన కోదండరాముడు వారినొక్కడై ప్రతిఘటించనెంచెననియు, ఋషులు ఈ యుద్ధమెట్లు జరుగునా యని ఆశ్చర్యముతో చూచుచుండిరనియు అతిరమ్యముగ వర్ణింపబడుచుండెను.

శ్రీరామభక్తాగ్రేసరుడైన కులశేఖరుడు అంతరంగమున ఈ సంఘటన కండ్ల ఎదుట జరుగుచున్నట్లు కాంచుచుండెను. ఏకాకియైన స్వామికేమి యాపదకల్గునోయను ఆందోళన తీవ్రమయ్యెను. ఏమైనను స్వామికాకష్టము నివారింపవలెనను ఉత్కంఠ అధికమయ్యెను. భక్తిభావముప్పొంగి, ప్రాణప్రియుడైన స్వామికావిపత్సమయమున తోడ్పడనెంచి అకస్మాత్తుగా లేచి, ''ఇదిగో, ఆ దుర్మార్గులను నేనిపుడు సంహరింతు''నని ఆయుధము చేతబట్టి యుద్ధమునకు ఉద్యుక్తుడయ్యెను. రాజుయొక్క ఆవేశముచూచి ప్రజలు నిశ్చేష్టులైరి. ఇంతలో కొందరు బ్రాహ్మణులు తెలివిగలవారై గట్టిగ కొన్ని శ్లోకములు పఠింపసాగిరి. 'చతుర్దశ సహస్ర సంఖ్యాకులైన ఆ రాక్షసులను అందరిని వీరాధివీరుడైన శ్రీరామచంద్రుడొకడే బాణమున అర్ధ నిమిషములో సంహరించివేసెననియు, తోడనే శ్రీ సీతాదేవి ఆనందాతిరేకమున ఆయనను గాఢాలింగనము చేసికొన్నదనియు' ఈ శ్లోకముల కర్థము. అది విని రాజు హర్షముచెంది శాంతించి యుద్ధప్రయత్నము విరమించెనట.

ఇది పరాభక్తి. సామాన్య భక్తియందు భక్తునికి భగవంతుడు సర్వశక్తిమంతుడుగా, రక్షకుడుగా తోచును. కాని ఆ భక్తి పరాకాష్ఠ నందినపుడు భగవంతునిపై నిష్కల్మష ప్రేమ కలిగి, భక్తుడు తానే భగవంతుని రక్షింపపూనుకొనును. స్వామికెప్పుడేయాపద కలుగునోయని నిరంతరము ఆయన క్షేమమునే వాంఛించుచుండును. జ్ఞానము కంటె ఉన్నతమైన ఈ భక్తి నందగోకులమున గోపికలకు, యశోదాదులకు కలిగినది.

ఇట్లే మఱియొక దినమున రామాయణ కథాగానము జరుగుచుండెను. శ్రీరామలక్ష్మణులు కుటీరమున లేకుండ చూచి, రావణుడను రాక్షసుడు మాయా భిక్షుకరూపియై సీతను దొంగిలించుకొనిపోవుచు, సముద్రము దాటి లంకవైపు పోయెనని వర్ణింపబడుచుండెను. రాజైన కులశేఖరుడు వినుచు వినుచు తన భక్తిని నిగ్రహించుకొనలేకపోయెను. భక్తిభావము కట్టలు త్రెంచుకొని పొంగ క్రోధారుణ నేత్రుడై గర్జించుచు లేచి, ''ఓరీ రాక్షసా! నిన్నిపుడే చంపెదను. నా తల్లిని విడువు'' మనుచు సాయుధుడై లంఘించి పరుగెత్తసాగెను. రాజు భక్తి పారవశ్యమున సముద్రమువైపు అతివేగముగ పోవుచుండగ: రెప్పపాటులో జరిగిన ఈ సంఘటనకు నివ్వెరపడి మంత్రులు, సేనలు, ప్రజలు రాజును కాపాడ వెనుక పరువులెత్తసాగిరి కాని అందుకొనలేకపోవుచుండిరి. భీకరావేశమున నున్న రాజు సముద్రమును సమీపించుచుండెను. ఆతడు నీటమునిగిపోవునేమోయని సర్వజనులు ఆందోళితులగుచుండిరి. ఇంతలో భక్తవత్సలుడైన సాక్షాత్ శ్రీరామచంద్రుడు మందస్మితవదనారవిందుడై, కోదండపాణియై, లక్ష్మణుడు వెంట రాగా, సీతాదేవికి చేయూత నిచ్చి నడపించుకొనుచు దివ్యప్రకాశము వెలుగొంద

ఆకాశమార్గమున సముద్రముపైనుండి వచ్చుచున్నట్లు కులశేఖరునికి దర్శనమిచ్చెనట.

"రావణుని సపరివారముగ సంహరించితిననిʼʼ చిరునగవుతో శ్రీరామచంద్రుడు చెప్పుచున్నట్లు గాంచి కులశేఖరుడు ఆనందపరవశుడై తన ప్రాణదైవమగు సీతాలక్ష్మణ సమేతుడైన యా దేవుని ప్రేమప్రవాహముప్పొంగ గద్గద కంఠమున స్తుతించి ధన్యుడయ్యెనట. హనుమదాదులకు మాత్రమే సాధ్యమగు ఈ భక్తి సామాన్యులకగోచరము. అనేక తపస్వులకు మునులకు అప్రాప్యము.

ఇంతటి మహాభక్తుడై భగవద్దర్శన మహాభాగ్యమునందినవాడైనను భాగవతసేవయనిన కులశేఖర మహారాజుకు ప్రాణతుల్యము. ప్రతిదినము భగవద్భక్తులను గొనివచ్చి స్వయముగా సేవించి యానందించనిదే రాజునకు తోచెడిది కాదు. దినదినము వైష్ణవుల ననేకుల నారాధించి, వారికి వస్త్ర వాహనాది కానుకలిచ్చుటనిన రాజుకు బ్రహ్మానందము. విష్ణుభక్తులతో సంభాషణము చేయుచుండ ఆతనికి అమృతము త్రాగుచున్నట్లుండెడిది.

ఒకనాడిట్లు సంభాషించుచుండ శ్రీరంగనాథ క్షేత్ర మహిమలను రాజు భాగవతోత్తముల ద్వారా వినుట తటసించెను. రంగనాథుని వైభవమును దర్శించని జన్మ వ్యర్థమని తలచి యాత్రకై సర్వసన్నద్ధములు చేయుడని మంత్రులకాజ్ఞాపించెను. రాజ్యములోని భక్తజనులందరు కూడ వచ్చుటకు వీలుగా చాటింపు వేయబడెను. కాని రాజుయొక్క భక్త్యావేశము నెరిగిన మంత్రులకిది సమస్యయయ్యెను. కులశేఖరుడు శ్రీరంగనాథుని దర్శించిన, ఆ భగవద్వైభవమున తన్మయుడై తిరిగి రాకపోవచ్చుననియు, రాజ్యమున అరాచకమేర్పడుననియు వారూహించిరి. సరిగా శ్రీరంగయాత్రకు బయలుదేరు సమయమున రాజునకెదురుగా సాంప్రదాయకులు, నిరంతర భగవత్కీర్తనారతులునగు భాగవతోత్తములైన వైష్ణవులు అతిథులుగా వచ్చిరి. భాగవత సేవా మహాభాగ్యము కలిగెనని సంతసించి రాజు వారికి ఆతిథ్యమిడి సేవించి వెళ్ళవలెనని ప్రయాణము మరునాటికి మార్చెను. ఇట్లు దినదినము మంత్రులు భగవద్భక్తులను గొనివచ్చుటయు కులశేఖరులు శ్రీరంగయాత్రను ఆ నాటికి విరమించుటయు జరుగుచునే యుండెను. ఇట్లనేక సంవత్సరములు రాజుయొక్క శ్రీరంగయాత్ర చాటింపబడుటయు, భాగవతోత్తములు రాగా వారి సేవకై ప్రయాణము వాయిదా వేయుటయు జరుగుచునేయుండెను.

భగవంతుని యందవ్యాజ ప్రేమభక్తి కలిగిన కులశేఖరునికి ఆతని దర్శన మహాభాగ్యము కంటె భగవద్భక్తుల యందలి ప్రేమయే ముఖ్యమయ్యెను. అందుచేతనే భగవద్భక్తి యొక్క పరిపక్వదశ భాగవత భక్తి యని చెప్పుదురు.

"ఘుష్యతే యస్య నగరే రంగయాత్రా దినేదినే
తమహం శిరసా వందే రాజానం కులశేఖరమ్॥ʼʼ

"ఎవరి నగరమందు దినదినము శ్రీరంగ ప్రయాణ సన్నాహము ఘోషింపబడునో ఆ కులశేఖర మహారాజుకు శిరసా నమస్కరించుదుముʼʼ-అని కులశేఖరులీనాటికి కూడ స్తుతింపబడుచున్నారు.

ఇట్లు జరుగుచుండ రాజుకుగల భాగవత భక్తివలన రాచకార్యములు కుంటుపడుచున్నవనియు, వైష్ణవాతిథ్యమునకు మితి లేకుండ నున్నదనియు శంకించి మంత్రులురాజునకు వైష్ణవులపై అప్రీతి కలిగింప ఉపాయము

పన్నిరి. ఒక శ్రీరామనవమినాడు శ్రీ సీతా కళ్యాణ మహోత్సవము జరుగుచుండ స్వామి నలంకరించు నగలలో నొక ముత్యాలహారమును చాకచక్యముగ మంత్రులు దాచి వైచిరి. అర్చకులైన వైష్ణవులే హారము నపహరించిరను వాదము వ్యాపింపచేసిరి. విష్ణు పరిచారకులట్టి పనిచేయుట సంభవముకాదని రాజునకు తెలియును. మంత్రులను తోడ్కొని దేవ మందిరమున స్వామి యెదుట నిలబడి భగవత్సేవా నిరతులైన వైష్ణవులు చోరులే యైనచో నే నిపుడే మరణింతును గాక యని ప్రతినచేసి తనకుతానే శిక్ష విధించుకొన నెంచెను. వెంటనే మంత్రులు నిజము చెప్పి హారము తెప్పించి క్షమాపణ వేడిరి.

కాలక్రమమున కులశేఖరుడు ఐహిక విక్షేపముల నుండి తొలగి కాలమంతయు భగవత్సేవాపరము చేయనెంచెను. రాజ్యమును కుమారునకొప్పగించి అంతరంగులగు భాగవతోత్తములను కొందరిని వెంట నిడుకొని అమితోత్సాహమున చిరకాల వాంఛితమైన శ్రీరంగ యాత్రకరిగెను. శ్రీరంగనాథుని దర్శనమున పులకితాంతరంగుడై బ్రహ్మానందమందెను. అచట తన సర్వస్వము స్వామికర్పణగా సమర్పించెను. ఆ దివ్యక్షేత్రమున నివాసమేర్పరచుకొని నిత్యము భగవత్సేవ, భాగవతకైంకర్యము తనివితీర చేసికొనుచునుండెను. అనేక ఇతర పుణ్యక్షేత్రములను కూడ అపుడపుడు దర్శించుచు భాగవతులతో కలసి భక్తిరసపానమున మత్తుడై ఆనందముననుండెను.

తాను తరించుటయే గాక, లోకమును తరింప చేయనెంచిన కులశేఖరులు భక్తజనులకు హితము చేయగోరి 'ముకుందమాల'యను సుందరస్తోత్రమును రచించి శాశ్వత లోకోపకారము గావించిరి. భక్తిరసము ఘనీభవించిన కలకండయా అన్నట్లు తోచు ఈస్తోత్రము నొకసారి చవిచూచినవారెవరైనను నిత్యము స్మరించుచునే యుందురు. ఇట్లే 'పెరుమాళ్ తిరుమొళి'(ప్రి) అను నూరు పాశురముల ద్రవిడ ప్రబంధము ద్వారా శ్రీరంగనాథ, శ్రీ వేంకటేశ్వరాది ప్రత్యక్షదేవుల వైభవము నతి సుందరముగ గానముచేసి భక్తిభావమును లోకమంత వ్యాపింప జేసిరి.

చక్రవర్తియై సర్వభోగభాగ్యములరచేత నున్నను, ఈ మహారాజు తిరుపతి వేంకటేశ్వరుని స్తుతించుచు, పెరుమాళ్ తిరుమొళి(ప్రి) యందొక పాశురమున ఇట్లు వాపోయిరి. 'అయ్యో, వేంకటేశ్వరుని కోవెలకొక మెట్టునై యుండినచో నెంత బాగుండెడిది! ఆ దేవదేవుని నిత్యము దర్శించుచు దర్శనార్థులైన భాగవతోత్తముల పాదధూళి శిరసున ధరించుచు ఆనందనిమగ్నుడనై యుండువాడను కదా!'

ముకుందమాలా స్తోత్రమూలమున లోకులకు హితము చేయగోరి వారిని సంబోధించి ఇట్లు ప్రవచించిరి. "ఓ మర్త్యులారా! మీకు పరమ శ్రేయమేదో సంక్షేపముగ చెప్పుచున్నాను వినుడు. ఆపదలనెడి కెరటములతో నిండిన సంసారమను సముద్రమధ్యమున నున్న మీరు అనేక విషయజ్ఞానములను వదలి మనసార భగవంతుని స్మరింపుడు. చావు పుట్టుకలనెడి ఘోరవ్యాధికి మహానుభావులచే కనిపెట్టబడిన కృష్ణనామమను అమృతమును ఔషధముగా సేవింపుడు. ఇక నిరంతరమైన అఖండమైన ఆనందము పొందుదురు."

ఇట్లే భక్తుల పక్షమున చేరి భగవంతునీ విధముగ ప్రార్థించుచున్నారు. "ఓ పుండరీకాక్షా! నీ ఎదుట అంజలి చేయుచు వంచబడిన

శిరసుతో, గగుర్పొడిచిన అవయవములతో, గద్గదమైన కంఠముతో, పొంగి పొరలు ప్రేమ బాష్పములు కల కన్నులతో, నిత్యము నీ చరణారవిందయుగళధ్యానమను అమృతమును నిరంతరము ఆస్వాదించుచు నా జీవితము సంపన్నమగునట్లు అనుగ్రహింపుము. ఓ మాధవా! క్షీణపుణ్యులై మీయందు భక్తిహీనులైన వారిని క్షణకాలమైనను నేను చూడకుందును గాక. ఓ జగన్నాథా! నీవు లేదను వారల నెన్నడు తలపులోనైన స్మరించకుందును గాక. జన్మజన్మాంతరముల యందెప్పుడును నీ పరిచర్య చేయక నేనుండకుందును గాక".

ఇక మానవజీవిత పరమసాఫల్యము కోరనెంచి, ఈ సుందర ప్రసిద్ధ శ్లోకమునిట్లనుగ్రహించిరి.

"మజ్జన్మనః ఫలమిదం మధుకైటభారే
మత్ప్రార్థనీయ మదనుగ్రహ ఏష ఏవ
త్వత్ భృత్య భృత్య పరిచారక భృత్య భృత్య
భృత్యస్య భృత్య ఇతి మాం స్మర లోకనాథ."

'కృష్ణా! నా జన్మకీఫలము నొసంగుము. నా యందు నీ కృప ప్రసరింప చేసి ఈ కోరిక నెరవేర్చుము. నీ దాసుల దాసుల దాసుల దాసుల దాసుల దాసుల దాసునిగా నన్ను అనుగ్రహింపుము. ఇదే నా ప్రార్థన.'

స్వయముగా భగవంతునికే దాసులమై యుండుట కోరదగినది కాదు. భగవద్భక్తుల దాసులమై యుండుటయే సాధింపదగిన జీవిత సాఫల్యమని వీరి తాత్పర్యము.

ఇట్లు కులశేఖరమహారాజు భగవద్భక్తి, భాగవత భక్తుల యందు పరిపూర్ణత్వము సాధించి, కులశేఖర ఆళ్వారులై ధార్మిక జనులందరికి స్తవనీయులై శాశ్వతులైరి. భక్తిమార్గావలంబులైనవారికి నాటినుండి నేటివరకు మార్గదర్శకులై రామానుజాది మహనీయుల చేతనే గాక అసంఖ్యాక భక్తులచే నిత్యము 'తమహం శిరసా వందే రాజానం కులశేఖరమ్' అనుచు దిన దినము ప్రస్తుతింపబడుచున్నారు. విశిష్టాద్వైతసంప్రదాయకులు వీరిని శ్రీ మహావిష్ణువు యొక్క కౌస్తుభాలంకారాంశగా గుర్తించి పూజించుచుందురు. శ్రీమద్రామానుజులంతటివారు కులశేఖరుని 'పెరుమాళ్' (భగవంతుడు) అని స్తుతించిరి.

మంగళకరుడైన శ్రీ హరి యొక్క కళ్యాణ గుణములను వర్ణించి వర్ణించి చల్లని హాయి గొలుపు భక్తియొక్క ఉజ్జ్వల ప్రకాశమును, కౌస్తుభమణివలె నలు దిక్కుల వ్యాపింప జేయుచు కులశేఖరుడు సకలగుణపరిపూర్ణత్వము చెంది భగవంతుడే అయ్యెనట.

విఖ్యాత రాజర్షి కులేఒవ తీర్య
వితత్య భూమౌ భగవత్ప్రభావం
విరించి రుద్రాది సురైరగమ్యం
విష్ణోః పదం సమ్యగవాప ధీరః.

# స్వామి విజ్ఞానానంద

డి. వి. బ్రహ్మాజీ

ఒకానొక సందర్భమున వినోదార్థము జగద్గురువు శ్రీరామకృష్ణునితో కుస్తీపట్టు పట్టి గోడకు నెట్టిన శిష్యజగజెట్టియే స్వామి విజ్ఞానానంద. స్వామి బ్రహ్మానంద ఈయనను గురించి — "విజ్ఞానానందుడు గుప్త బ్రహ్మజ్ఞాని, తెలిసినట్లుగా ఎవరికిని పట్టుబడువాడు కాడు." అని నుడివెడివారు. సన్యాసాశ్రమ స్వీకారమునకు ముందు విజ్ఞానానందస్వామి మొదటి పేరు హరిప్రసన్న చటోపాధ్యాయ. దక్షిణేశ్వరమునకు చాలదగ్గరలో-కొలది మైళ్ల దూరముననేగల బెల్ఘారియా గ్రామమున 1868 సం॥వ అక్టోబరు నెల 30వ తారీఖున హరిప్రసన్న జన్మించెను.

హైస్కూలులో చదువుకొంటూన్న సమయంలోనే, తన 13వ ఏటనే హరిప్రసన్న మొట్టమొదటిసారిగా శ్రీ గురుదేవులను చూడటం జరిగింది. కాని, అప్పటికి చాలా చిన్నతనము కావటంవల్ల శ్రీరామకృష్ణుని దర్శనం ఆయనను అంతగా ప్రభావితం గావించలేదు. ఆ తర్వాత మరికొన్ని సంవత్సరములకు, కళాశాల విద్యార్థిగా స్వామి, శరత్ చంద్రచటర్జి (స్వామి శారదానంద) తోను మరియొక మిత్రునితోను కలసి దక్షిణేశ్వరమునకేగి పరమహంసను సందర్శించుట సంభవించింది. తనయెడల శ్రీరామకృష్ణులు కనబరచిన సహజ నైసర్గిక వాత్సల్యాభిమానములు హరిప్రసన్నను ఎంతగానో ఆకర్షించాయి. తేటతేట మాటలలో గురుదేవులొసగిన విజ్ఞానపూరితమయిన వాక్కులు హరిప్రసన్నను బాగా ఆకట్టుకొన్నాయి. ఆనాడు ఆయన తన ఇంటికి తిరిగిపోవుసరికి బాగా ఆలస్యం అయిపోయింది. విషయం తెలుసుకొన్న తల్లి హరిప్రసన్నను బాగా చీవాట్లు పెట్టింది. "అనేకమంది యువకుల మనస్సులను పాడుచేసిన ఆ పిచ్చి బ్రాహ్మణునివద్దకు ఏమి బావుకుందామని పోయావు?" అని మందలించినదామె. వైరాగ్య భావమును ప్రబోధించి బాలురను సంసార విముఖుల నొనరించుచున్నాడనియే శ్రీ గురుదేవునిపై ఆమె అక్కసు. ఆ తర్వాత తర్వాత ఈ విషయాన్ని గురించి ముచ్చటిస్తు స్వామి విజ్ఞానానంద ఇట్లా అనేవారు. — "ఆనాడు శ్రీరామకృష్ణ గురుదేవుల ప్రభావానికి కనుక లోను కాకుండ ఉన్నట్లయితే నేను ఈనాడు ఎక్కడ ఉండేవాడినోగదా! ప్రాపంచిక చింతన మనే పాప పంకిలంలో పడి పొర్లాడుతు అధోగతిలో చరిస్తూ ఉండవలసివచ్చేది."

ఆనాటినుండి మన హరిప్రసన్న అప్పుడప్పుడు దక్షిణేశ్వరం వచ్చి శ్రీ గురుదేవులను చూచి వెళ్లేవారు. పరమహంస ఆయన నెంతో ఆదరముగ అభిమానించేవారు. ఒకనాడు శ్రీరామకృష్ణుల కోర్కెపై హరిప్రసన్నుడక్కడనే నిద్రపోయారు. శిష్యుని కోసం ఆ రాత్రి ప్రత్యేకముగా భోజన సదుపాయం ఏర్పాటు చేశారు. [రాత్రులందు పరమహంస ఏమీ తీసుకోరు.] తన గదిలోనే హరిప్రసన్నను పడుకోమని తానే స్వయముగా దోమతెర దించిపెట్టారు. శిష్యుల యెడల ఆ గురువర్యుని ప్రేమానురాగములట్టివి! ఆయన హరిప్రసన్నతో ఆనాడు ఇట్లా అన్నారు— "మిమ్మల్ని నేను ఎందుకింతగా ప్రేమిస్తున్నానో తెలుసా? మీరందరూ కూడా నాకు కావల్సిన ముఖ్యులని ఆ లోకేశ్వరి నాకు తెలియజేసింది."

ఒకనాడు శ్రీ గురుదేవులు హరిప్రసన్నతో "నీవిచ్చటకు ఈ మధ్యన వచ్చుటలేదు. కారణమేమి?" రావలసినదిగా కబురంపినను రాకపోవుచున్నావే?" అని ప్రశ్నింపగా, హరిప్రసన్నుడు "నాకు ఎందుకో ఇక్కడికి రావాలెనని ఆలోచనాభావమే కల్గుటలేదు." అని నిర్మొహమాటముగా జవాబిచ్చెను. అది విన్న పిమ్మట శ్రీరామకృష్ణులాయనతో "నీవు ధ్యానం చేస్తుంటావు, అవునా?" అని వివరమడిగారు. దానికి హరిప్రసన్న "అవునండీ నేను ధ్యానం చేస్తాను. కాని సరియైన ధ్యానం కుదరడం ఎట్లా?" అని ప్రశ్నించారు. అది విని శ్రీగురుదేవులు హరిప్రసన్నను దగ్గరగా పిలచి ఆయన నాలుకపై మంత్రాక్షరములను లిఖించి, పంచవటికిపోయి ధ్యానం చెయ్యవలసినదిగ ఆదేశించారు. పరమహంస స్పర్శమాత్రమున హరిప్రసన్నలో ఒక అపూర్వమయిన ఆధ్యాత్మికశక్తి ప్రజ్వరిల్లింది. ధ్యానంలో కూర్చోగానె బాహ్యవిషయ స్మరణ నశించి గాఢ సమాధిస్థితి వశమయింది.

శ్రీరామకృష్ణులు తన శిష్యులయెడల ఎంతటి ఆత్మీయతతో మసలేవారో ఈ క్రింది సంఘటన మనకు ఋజువుచేస్తుంది. దక్షిణేశ్వరంలో శ్రీరామకృష్ణుడు నివసించే ఇంటి వరండాలో ఒకసారి పరమహంస మన హరిప్రసన్నను తనతో కుస్తీ పట్టవలసినదిగా సవాలుచేశారు. మంచి ఆజానుబాహువు, దృఢకాయుడునయిన హరిప్రసన్నుడు సులభంగానే ఆ జగద్గురువును చిత్తుజేసి ఒక గోడకు త్రోసివేశారు. దానిపై శ్రీగురుదేవులు మందహాసపూర్వకంగా—"ఒకప్పుడు నేనూ గొప్ప బలాఢ్యుణ్ణే. కాని ఇప్పుడు బలహీనుణ్ణి కావడంవల్ల నువ్వు గెలువగల్గినావు." అన్నారట! కుస్తీపట్టినపుడు పరమహంసతో కల్గిన సంపర్కమువల్ల ఆయననుంచి తనకు ఒక అపూర్వమయిన శక్తిప్రసారం జరిగినట్లుగా అనుభూతం అయినదని స్వామి విజ్ఞానానంద భావించారు.

శ్రీరామకృష్ణులతో హరిప్రసన్న గడపిన కాలం అతి కొద్దిదే అయినా, ఆయన ఆ కొద్ది సమయంలోనే శ్రీ గురుదేవులనుండి అనేక విషయాలు గ్రహించారు. ఇతరుల కంఠస్వరములను అనుకరించుటలో పరమహంస గొప్ప నిపుణుడు. జనులయొక్క మాటలలో, చూపులలో, నడకలలో, కదలికలలో సామాన్య దృష్టికి కన్పించని సూక్ష్మవైచిత్ర్యములను ఆయన మహానైపుణ్యముతో అనుకరించి చూచువారలను కడుపుబ్బ నవ్వించగలరు. నర్తకియగు వేశ్య నొకామెను చూచి ఆమెయొక్క నటనను శ్రీరామకృష్ణుడప్పుడు చమత్కారపూర్వకముగా అనుకరించి అభినయించి తమ్ము నవ్వులలో ముంచెత్తెడివారని విజ్ఞానానందస్వామి తన శిష్యులకెరిగించియున్నారు. పరమహంస శరీరమాపాదమస్తకము ఒక దివ్యశక్తితో ప్రజ్వలనము అగుచుండెడిదనియు, కేవలము ఆయన సన్నిధిని నిలచినమాత్రముననే భక్తులకు ఆనందానుభూతి యొనగూడెడిదనియు తాము అనుభవపూర్వకముగా తెలుసుకొన్న విషయమును విజ్ఞానానందస్వామి తన శిష్యులతో ముచ్చటించెడివారు. ఎట్టి మానవుడైనను సరియే వాని జన్మసంస్కార బంధములను అవలీలగా ఛేదించి ముక్తి మార్గమున గొనిపోగల్గిన శక్తి శ్రీ గురుదేవులకు గలదను సత్యముకూడ విజ్ఞానానందస్వామి స్వానుభవపూర్వకముగ చాటి చెప్పిన సత్యమే.

సాధకులగువారికి శ్రీరామకృష్ణులు హరిప్రసన్నకొసగిన ఈ క్రింది హితవాక్యము శిరో

ధార్యము— "పనాదురువన్నె బంగరురీతి శీల సంపద కల్గియేయుండనీ, భగవంతుని మీద ప్రేమచే నేలపైబడి దొరలునంతటి భక్తురాలే కానీ, ఎంతటిదైనను సరే—స్త్రీ వైపునకు దృష్టిని సారించుట అపాయకరము జాగ్రత్త."

ఒకసారి రామకృష్ణులు మన విజ్ఞానానందస్వామితో "ఇంటింటికిని పోయి నీకు కావలసిన ఆహారమును నీవు బిచ్చమెత్తుకొన గలవా?" అని ప్రశ్నించారు. తానట్లు తప్పక చేయగలనని హరిప్రసన్న జవాబిచ్చెను. నాటి నుండి హరిప్రసన్నకు నిశ్చలమైన వైరాగ్యాభిలాషను కల్గించి ప్రోదిచేయుటకు పరమహంస ప్రయత్నించెను.

రామకృష్ణులు మహాసమాధి చెందు సమయమున ఇతర శిష్యులవలె హరిప్రసన్న దచ్చట లేడు. ఆ కాలమునందాయన బీహారు రాష్ట్రమునందలి బంకీపూరను గ్రామమున నుండెను. కాని శ్రీ గురుదేవుని అవసాన సమయమునందు తనకాయన దివ్యదర్శనము కన్పించినదని విజ్ఞానానందస్వామి చెప్పెడివారు. భౌతికముగ చేరువనే లేకపోయినను మానసికముగ గురుశిష్యుల సాన్నిహిత్యము విడదీయ రానిదికదా!

విజ్ఞానానందస్వామి పాట్నా కళాశాల నుంచి పట్టభద్రుడయిన పిమ్మట పూనా నగరమున సివిల్ ఇంజినీరింగు శిక్షణనందెను. సివిల్ ఇంజినీరింగులో డిగ్రీ తీసుకొన్న పిదప విజ్ఞానానందస్వామి ప్రభుత్వ సేవలో చేరి అతిత్వరలో జిల్లా ఇంజనీరుగా ఉన్నతపదవి నధిష్టించారు. ఉద్యోగం చేస్తున్న కాలంలో నిష్కల్మషమయిన మనస్సుకు, సత్ప్రవర్తనకు, నీతికి నిజాయితీకి హరిప్రసన్న పేరుగాంచారు. ఆ సరికే పరమహంస నిర్యాణం చెందటమూ, హరిప్రసన్న సోదర శిష్యులు సన్యాసాశ్రమాన్ని స్వీకరించి బారానగర్‌లో మఠాన్ని స్థాపించటమూ జరిగినాయి. ఉద్యోగ రీత్యా హరిప్రసన్న ఎక్కడున్నా ఆ ప్రదేశము సోదర (సన్యాస) శిష్య బృందానికి విడిది అయ్యేది. ఆయనకూడా సన్యాసాశ్రమం స్వీకరించాలని ఎంతగానో ఆతృత జెందేవారు. కాని, తల్లియెడ గల ఆయన బాధ్యత మాత్రం అందుకు వీలుకల్పించ లేదు. అయితే, కొన్ని సంవత్సరములపాటు ఉద్యోగం చేశాక తన తల్లి జీవితము సుఖవంతముగా కొనసాగుటకు అవసరమయిన ధనాన్ని పోగు జేసి, వెన్వెంటనే హరిప్రసన్న సన్యసించి విజ్ఞానానంద నామాన్ని స్వీకరించి రామకృష్ణ మఠంలో చేరిపోయారు. అప్పటికి మఠము బారానగర్‌నుండి ఆలంబాజారుకు మార్చబడింది. తర్వాత కొద్దికాలముననే, 1896లో వివేకానందస్వామి తన పాశ్చాత్య దిగ్విజయయాత్ర ముగించుకొని మాతృదేశం తిరిగి వచ్చారు. విజ్ఞానానందస్వామి వివేకానందస్వామితో కలసి రాజపుటానా మున్నగు ప్రాంతాలు యాత్రలుచేసివచ్చారు.

బారానగరునుండి ఆలంబజారునకు మార్చబడిన మఠము తుదకు 1899 సం॥న బేలూరునకు మార్చబడినది. ఈ బేలూరను గ్రామము కలకత్తా నగరమునకు ఎగువ ప్రాంతమున, సుమారు 4 మైళ్ల దూరమున పవిత్ర భాగీరథీ నదీ తీరమున విరాజిల్లుచున్నది. వివేకానంద స్వామిచే ప్రతిష్ఠాపనము గావింపబడిన ఈ మఠము ఈనాడు శ్రీరామకృష్ణసంస్థ కంతకును ప్రధాన కేంద్రమై అలరారుచున్నది. అందలి శ్రీరామకృష్ణాలయము మనోజ్ఞ దివ్య సుందరమై విరాజిల్లుచున్నది. ఈ ఆలయ అంతర్భాగమున సజీవ చైతన్యముతో నొప్పా

రుచు-భావసమాధిస్థితిలో కూర్చున్న శ్రీ రామకృష్ణుల విగ్రహరాజము సముద్దీప్తమై వెలుగొందుచున్నది. ఇట్టి పవిత్ర ఆలయనిర్మాణ మంతయు మన విజ్ఞానానందస్వామి పర్యవేక్షణ మునసే అమలు జరిగియున్నది. మనస్వామిపేరు గాంచిన గొప్ప సివిల్ ఇంజనీరు కావడంవల్ల శ్రీరామకృష్ణమఠము వారిచే నిర్మింపబడు నిర్మాణములలో ఆయన సలహా సహకార ములు తప్పక గ్రహింపబడుచుండెడివి. వారణాశిలోని "రామకృష్ణ మిషన్ హోమ్ ఆఫ్ సర్వీసు"కు సంబంధించిన గృహముల నిర్మాణమునందును, బేలూరులోని స్వామి వివేకానంద దేవాలయ నిర్మాణమునందును స్వామి విజ్ఞానానంద అత్యంతశ్రద్ధతో పర్యవేక్షణ గావించియున్నారు.

విజ్ఞానానందస్వామి పర్యవేక్షణలో బేలూరు మఠనిర్మాణము కొనసాగుచుండగా ఒక చమత్కారమయిన సంఘటన జరిగింది. ఒక నాడు మఠనిర్మాణానికి అత్యంతావసరమయిన సామగ్రి కొంత రావలసి ఉంది. మరునాటికి ఆ సామగ్రి అందకపోతే నిర్మాణం కొనసాగే టట్లులేదు. ఆ సామగ్రి అంతా మరునాటికి పడవలలో తప్పక చేరగలదని స్వామి బ్రహ్మానంద హామీ ఇచ్చారు. కాని మన విజ్ఞానానంద స్వామికి మాత్రం ఈ విషయమై అంతగా నమ్మకంలేదు. (కంట్రాక్టర్లు ఏవిధంగా పని చేసేదీ ఆయనకు స్వానుభవంలో బాగా తెలుసు) దానిపై స్వాములవార్లు ఇరువురూ పందెంకాశారు — తెల్లవారేసరికి పడవలో సామగ్రి వస్తుందని బ్రహ్మానందస్వామి, రాదని విజ్ఞానానందస్వామి పందెం పెట్టుకొన్నారు. ఆ రాత్రి ఇద్దరూ సరిగా నిద్రపోయారు. మర్నాడు వేకువనే లేచి విజ్ఞానానందస్వామి నది వద్దకు పోయి పడవ యేదీ రావటంలేదని చూచి, తిరిగివచ్చి గాఢంగా నిద్రపోయారు. ఆ తర్వాత కొంతసేపటికి బ్రహ్మానందస్వామి లేచి నదివద్దకు పోయేసరికి పడవ వస్తోందని చూచి ఆనందంగా తిరిగివచ్చి సుఖంగా నిద్ర పోయారు. కొంతసేపటికి తెల్లవారింది. ఇద్దరూ లేచారు. మన స్వామి వెంటనే బ్రహ్మానంద స్వామి వద్దకుపోయి—పడవ రానేలేదు అని అనుకుంటూ—తన పందెమిమ్మని, అడిగారు. కాని, త్వరలోనే పడవ తీరంచేరిన అసలు సంగతి విజ్ఞానానందస్వామికి అవగతమయింది. వెంటనే హాస్యంగా "నాదగ్గర ఇప్పుడు డబ్బు ఏమీలేదు. ఆ పందెంకూడా నా తరఫున నీవే ఇచ్చుకో." అని సమాధానమిచ్చారు. శ్రీ రామకృష్ణ మఠమునందలి సన్యాసుల జీవితాలు నిస్సారముగా నీరసముగానాక హాస్య రసస్ఫోర కముగా. చమత్కారములతో కూడి ఉండేవని నిరూపించే ఇట్లాంటి సంఘటనలు మనకు కోకొల్లలుగా కన్పిస్తాయి.

పరివ్రాజకుడుగా మన స్వామి దేశం అంతా పర్యటిస్తూ 1900 ప్రాంతములో అలహాబాదు నగరం చేరుకున్నారు. అంతకు పూర్వమే అక్కడ ఆధ్యాత్మికవివేచనాపరులయిన కొందరు భక్తులు అలహాబాదులో "బ్రహ్మావాదిని సంఘము" అనే సంస్థ నొకదానిని స్థాపించారు. శ్రీ రామకృష్ణమఠమునకు చెందిన గొప్ప స్వాములవారు వచ్చినారని విని వారంతా విజ్ఞానానందస్వామిని దర్శించి తమను సరియైన మార్గములో నడిపించవలసినదిగా ప్రార్థించారు. వారికోరికనంగీకరించి మన స్వామి అక్కడనే 8 సం॥లు గడిపారు. ఈ కాలమంతా ఆయన కఠోరతపశ్చర్య కొనసాగిస్తూ, స్వయంపాకము మాత్రమే గ్రహిస్తూ గడిపారు. తర్వాత ఇక్కడ శ్రీరామకృష్ణ మఠ విభాగము నొకదానిని స్థాపించి ఆధ్యాత్మిక సాధ

నలో పలువురికి ఆదర్శప్రాయులై జీవితం సాగించారు.

మన విజ్ఞానానందస్వామి చాలా మితభాషి. ఎక్కువగా మాట్లాడటం ఆయనకు ఇష్టంగా ఉండేదికాదు. పెద్దగా వేదాంతాన్ని గురించి తనతో చర్చించే ఉద్దేశంతో వచ్చేవారందరికీ ఆయన ఇచ్చే సలహా ఇది: "చిన్నతనంలో మీరు కాపీ (చూచివ్రాతకు ఒరవడి) పుస్తకాలలో చదువుకున్న నీతివాక్యాలను పాటించండి చాలు! ఎల్లపుడు సత్యమునే పలుకుము; ఇతరుల వస్తువులు వారికి తెలియకుండా గ్రహించుటయే దొంగతనము, దొంగతనము చేయరాదు, జీవహింస మహాపాపము — మున్నగునవి ఆచరణలో పెడితే చాలు. అదే ఆధ్యాత్మికౌన్నత్యానికి దారితీస్తుంది."

లౌకిక, ఆధ్యాత్మిక విద్యలు రెండింటి యందును విజ్ఞానానందస్వామి గొప్ప ప్రజ్ఞావంతుడు. "ఇంజనీరింగు" విషయంపైనను, "నీటి సరఫరా విధానాలు" (Water works) మీదను ఆయన వంగభాషలో రెండు గొప్ప ప్రామాణిక గ్రంథాలు రచించారు. నారద పాంచరాత్రమును, దేవీభాగవతమును, ఖగోళ శాస్త్రానికి సంబంధించిన వరాహమిహిరుని రచన సూర్యసిద్ధాంతమును, జ్యోతిష శాస్త్రమునకు సంబంధించిన వరహామిహిరుని రచన బృహజ్జాతకమును మన విజ్ఞానానంద స్వామి సంస్కృతమునుండి ఆంగ్లభాషలోకి చక్కగ అనువదించి యున్నారు. ఈ అనువాదములలో ఆయన అచ్చటచ్చట వెల్లడించిన సూక్ష్మ విషయములు జిజ్ఞాసులకెల్లరకును తలమానికములై యొప్పారుచున్నవి. పాంచరాత్రమున మన స్వామి తెలియబరచిన మంత్రతత్త్వము, దేవతా తత్త్వము, సాధనా రహస్యము మున్నగు విషయములు సాధకుడు కావలెనన్న అభిలాషకల్గిన ప్రతి వ్యక్తియు అవశ్యము తెలిసికొనవలసియున్నది. అట్లే దేవీభాగవతమును అనువదించు సందర్భమున పీఠికలో విజ్ఞానానందస్వామి చేసియున్న సూక్ష్మమీమాంస పాండితీస్ఫోరకమై విరాజిల్లుచున్నది. రామాయణమును సంస్కృతము నుండి ఆంగ్లమునకనువాదము చేయుచు మధ్యలో ఆ అనువాదము పూర్తికాకుండనే స్వామి స్వర్గస్థులైరి.

1934లో స్వామి శివానంద నిర్యాణానంతరము మన విజ్ఞానానందస్వామి రామకృష్ణ సంస్థకు ఉపాధ్యక్షులయ్యారు. ఆ తర్వాత, 1937 మార్చి నెలలో, అప్పటి సంస్థ అధ్యక్షుడయిన స్వామి అఖండానంద మహాసమాధి చెందిన పిమ్మట రామకృష్ణసంస్థకు విజ్ఞానానందస్వామి (4వ) అధ్యక్షపదవి నలంకరించారు. పదవిలో నుండగనే మన స్వామి విస్తృతంగా దేశం అంతటా పర్యటించారు. కొలంబో నగరంలోను, రంగూన్‌లో ఉన్న రామకృష్ణ సంస్థలను పర్యవేక్షించారు.

విజ్ఞానానందస్వామి పూర్తిగ నరనరమున వైరాగ్య భావమును జీర్ణించుకొన్న మహామనీషి. స్వంత శిష్యులొసగిన కానుకలను కూడా ఆయన స్వీకరించేవారుకాదు. ఒకసారి సంపన్నుడయిన శిష్యుడొకరు స్వామికి విలువయిన ధనమును ఒక పర్సులోనుంచి బహూకరింపబోగా స్వామి అతనితో "ఈ ధనాన్ని దాచుకొనడానికి నీ దగ్గర సరయిన చోటు లేనట్లు కన్పిస్తోంది. అందుకని ఆ ధనాన్ని దాచిపెట్టే జరువుని నా నెత్తిమీద రుద్దదామని అనుకొంటున్నావా?" అని వేళాకోళం చేశారు. ఎంతటి అనారోగ్యస్థితిలో బాధ పడుతున్నాసరే మన స్వామి ఏ విధమయిన మందునూ స్వీకరించేవారుకాదు; పైగా ఎవరి

చేతా పరకమయిన సేవలూ చేయించుకొనే వారు కాదు కూడాను. చివరి రోజులలో స్వామి శరీరంనిండా అనేకమయిన రుగ్మతలు చోటు చేసుకొన్నాయి. ఇది చూచి బాగా ధనికురాలైన భక్తురాలు ఒకామె స్వామితో "కలకత్తాలో బాగా ప్రసిద్ధిచెందిన వైద్యునిచేత మీకు చికిత్స చేయిస్తాను. అనుజ్ఞ ఇవ్వండి." అని ప్రార్థించింది. దానికి స్వామి ఆమెతో "నీవు చెప్పినవాళ్ళందరికన్నా కూడా గొప్పవాడయిన వైద్యునివద్దనే నేను ప్రస్తుతం వైద్యం చేయించుకొంటున్నాను." అని అన్నారు. అదివిని ఆమె కుతూహలంతో స్వామీ ఆ వైద్యునిపేరేమిటి?" అని ప్రశ్నించింది. దానికి స్వామి చిరునవ్వుతో "సాక్షాత్తు ఆ పరమేశ్వరుడే నాకు వైద్యుడు." అని అన్నారు!! చివరకు అలహాబాదు నగరంలో 1938 ఏప్రియల్ 25న మన విజ్ఞానానంద స్వామి భౌతికకాయాన్ని త్యజించి బ్రహ్మైక్యమునందారు.

శ్రీ రామకృష్ణపరమహంసయొక్కయు, శ్రీ వివేకానందస్వామియొక్కయు, శ్రీ శారదాదేవియొక్కయు దివ్యచరిత్రములను ఆంధ్రభాషయందు రచించుటయేకాక, రామకృష్ణమతమునకు చెందిన అనేక అపూర్వ గ్రంథములను అనువదించి ఆంధ్రలోకమునకు మహోపకార మొనర్చియున్న చిరంతనానంద స్వామి ఈ విజ్ఞానానందస్వామివారి శిష్యులే అని మనము స్మరించుట ముఖ్యము.

## పూజాసుమం

అవనిలో నీవు
అంబరంలో నీవు
నీటి అద్దంలో నీవు
నిప్పు ముద్దలో నీవు
వీచేగాలిలో నీవు
పూచే పూలలో నీవు
అంతా నీవే—
అన్నిటా నీవే—
అణువణువున నిండి
అలరించు నిన్ను
ఏమని పిలువను?
ఎలా కొలువను?

అన్నింటా
నిను కాంచుతూ,
అద్వైత విపంచి
వాయించుతూ,
క్షణం.... క్షణం
నీ తలపుల్లో
వికసించు
నా జీవన సుమం—
భగవాన్!
ఉంచనా నీ ముంగిట....
పాడనా
సాగనా నీదారుల....
ఊగనా ఆనందడోల....

—కృష్ణప్రియ

# బాలల శారదాదేవి

బి. ఎస్. ఆర్. ఆంజనేయులు

## జయరాంబాటిలో ఉన్నప్పుడు

అద్దె యిండ్లలోనున్న పది సంవత్సరాలలో మాతృదేవి అప్పుడప్పుడు జయరాంబాటి పోతూయుండేది. అక్కడ పల్లెటూరి పద్ధతుల ప్రకారమే వుండేది. తన గొప్పతనము ఎవ్వరికి తెలియనిచ్చేదికాదు. ఆవూరివారికి, తన యింటిలోని వారికి ఆమె 'సారూ' లేక 'శారద' గానే మెలగేది. ఒకసారి ఆమె యిలాచెప్పింది: "సుఖంగాను, శాంతంగాను వుండాలంటే సర్దుకోటం నేర్చుకోవాలి. ఎక్కడవున్నా, ఎప్పుడువున్నా దానిని కలిగినట్లుగా ఉండాలి." జయరాంబాటిలో మాతృదేవి అలాగే వున్నది.

అక్కడ ఆమెకు యెన్నో యిబ్బందులు. నలుగురు తమ్ముళ్ళలో ముగ్గురికి చదువులేదు. వాళ్లు ఎప్పుడూ పోట్లాడుకునేవారు. ఒక్కొక్కసారి యిద్దరు దెబ్బలాడుకుంటుంటే ఆమె తీస్తువుండేది. వాళ్ళ మూఢత్వాన్ని చూచి నవ్వుకునేది. ఎప్పుడూ డబ్బుకొరకు వారు ఆమెను పీడించేవారు. అయినా ఆమె శాంతంగానే వుండేది. కష్టపడి పనిచేస్తూనే వుండేది.

నాలుగోతమ్ముడు అభయచరణుడు. అతడు చదువుకున్నాడు. ఉద్యోగంకూడ చేశాడు. కాని చిన్నతనంలోనే చనిపోయినాడు. అతని భార్యపేరు సురబాల. ఆమె పిచ్చిదయింది. ఆ పిచ్చిలో ఆమెకు 'రాధు' అనే ఆడపిల్ల పుట్టింది. ఆమె ఆపిల్లను సరిగా పెంచేదికాదు. ఒకసారి సురబాల అరుస్తూ పోతుంటే, వెనకాల ఏడుస్తూ 'రాధు' పాకుతున్నది. ఇది మాతృదేవి చూచింది. ఆమె ప్రేమ పొంగారింది. జాలిపడి ఆపిల్లను తీసుకొని చంకకెత్తుకున్నది. వెంటనే శ్రీరామకృష్ణదేవుడు కనుపించి యిలా అన్నారు "నీవు వున్నన్నిరోజులు ఈ పిల్లను పెట్టుకో. ఇది నీకు ఆధారం. ఈపిల్ల యోగమాయ సుమా!"

మాతృదేవి, రామకృష్ణదేవుని పని చెయ్యాలిసింది చాలా వున్నది. ఆమె మనస్సు దేనినో అంటిపెట్టుకొని యుంటేగాని ఆమె జీవించియుండదు. ఆమె చాలారోజులు జీవిస్తేగాని ఆయన పని జరగదు. అందుకే గురుదేవుడు ఆమెకు యీబంధం తగిలించారు.

మేనగోడలి స్థితిచూచి లోనక్రుంగి
ఎత్తుకొనగానే గురుదేవుడెదుటనిల్చి
"పట్టు నీకిది భువినుండ పట్టుకొమ్మ
మాయ యీబిడ్డ" యనిచెప్పి మాయమయ్యె

సంపాదకులు : స్వామి తన్మయానంద.

శ్రీ ఎమ్. బాలసుందరంగారిచే ఫ్రీడమ్ ప్రెస్, (మద్రాసు-600 021) న ముద్రింపబడి.

స్వామి తన్మయానందవారిచే శ్రీ రామకృష్ణమఠము (మద్రాసు-600 004) నుండి ప్రచురింపబడినది.

# శ్రీ రామకృష్ణ మఠ ప్రచురణలు

| | | | |
|---|---|---|---|
| శ్రీ రామకృష్ణ కథామృతము | 8.00 | నివేదిత : [illegible] | 4.00 |
| శ్రీ రామకృష్ణ జీవితచరిత్ర | 10.00 | [illegible] వేదాంతం | 2.50 |
| శ్రీ రామకృష్ణ బోధామృతము | | ప్రాచ్య[illegible] | 1.25 |
| శ్రీ రామకృష్ణోపనిషత్తు | | కులము, [illegible] | 3.00 |
| శ్రీ రామకృష్ణపరమహంస నీతికథారత్నములు | 2.50 | భారతదేశము | 3.00 |
| గురూపదేశములు | 2.00 | భారతీయ మహిళ | 2.00 |
| నా గురుదేవుడు | 1.25 | నా జీవితము, జీవిత కార్యము | 1.25 |
| శ్రీ రామకృష్ణ దివ్యవాణి | 1.50 | శ్రీ రామకృష్ణ సేవాసంఘ : తదాదర్శములు | 0.50 |
| శ్రీ రామకృష్ణ పరమహంస జీవిత సంగ్రహం | 0.75 | చికాగో నగరోపన్యాసములు | 1.00 |
| ఆరాత్రికము మరియు | | శ్రీ వివేకానంద శంఖారావము | 0.80 |
| శ్రీ రామనామ సంకీర్తనము | 0.50 | నవీన భారత దేశము | 0.40 |
| శ్రీ శారదాదేవి జీవిత చరిత్ర | 4.00 | సర్వం విష్ణుమయం జగత్ | 0.35 |
| శ్రీ శారదాదేవి | 2.50 | శ్రీ వివేకానంద సింహగర్జనలు | 0.20 |
| శ్రీ శారదా సూక్తి నవనీతము | 0.80 | బ్రహ్మానంద బోధనలు | 4.75 |
| శ్రీ వివేకానంద జీవిత చరిత్ర | 4.00 | తాపత్రయ చికిత్స | 0.60 |
| బాలల వివేకానందుడు | 2.00 | ముక్తిమార్గము | 0.30 |
| శ్రీ వివేకానంద సంపూర్ణగ్రంథావళి | | పారమార్థిక సంభాషణలు | 6.50 |
| 8 సంపుటముల పూర్తిసెట్టు (సాదా) | 56.00 | నారద భక్తి సూత్రములు | 4.00 |
| .. .. (క్యాలికో) | 61.00 | శ్రీ దొడ్డ భాగవతము-మూడవ సంపుటము | 7.50 |
| విడి సంపుటములు ఒక్కొక్కటి (సాదా) | 5.00 | దేవీమాహాత్మ్యము | 4.00 |
| .. .. (క్యాలికో) | 6.50 | శ్రీ మద్భగవద్గీత | 8.00 |
| స్వామి శిష్య సంవాదములు | 10.50 | శ్రీ మద్భగవద్గీత చిన్నసైజు | 3.00 |
| సందేశ తరంగిణి (మొదటి భాగము) | 4.00 | పారాయణగీత తాత్పర్యసహితము | 3.75 |
| .. (రెండవ భాగము) | 5.50 | .. మూలము | 2.00 |
| భారత యువజనులారా! | 3.00 | కఠోపనిషత్తు | 3.00 |
| ప్రబోధ రత్నాకరము | 3.75 | గిరీశచంద్ర | 1.00 |
| రాజయోగము | 6.25 | భక్తిమార్గము | 1.00 |
| కర్మయోగము | 4.00 | శ్రీకృష్ణవాణి | 0.80 |
| భక్తియోగము | 4.00 | బుద్ధఉవాచ | 0.80 |
| శ్రీ వివేకానందలేఖావళి (మొదటిభాగము) | 2.25 | క్రీస్తు సూక్తిమాల | 0.80 |
| .. (రెండవభాగము) | 3.00 | మహమ్మదు సూక్తి మంజరి | 0.80 |
| హిందూ మతము | 4.00 | శ్రీ విష్ణుసహస్రనామ స్తోత్రము | 1.25 |

ఇవియేకాక ఆంగ్ల, సంస్కృత, తమిళ, హిందీ, కన్నడ గ్రంథములును,

వేదాంత కేసరి (ఆంగ్లము) శ్రీ రామకృష్ణ విజయము (తమిళము)

అను మాసపత్రికలును, శ్రీ రామకృష్ణ పరమహంస, శ్రీ శారదాదేవి, శ్రీ వివేకానందస్వామి మున్నగువారి ఛాయాచిత్రములు, త్రివర్ణ చిత్రములు, తైలచిత్రములు మున్నగున వెన్నియో మా యొద్ద లభించ గలవు.

దెసు : మేనేజరు.      మో[illegible]

# శ్రీ రామకృష్ణ కథామృతము

నేడే కొనండి! (ప్రథమ భాగము) పదేపదే చదవండి!

శ్రీ "మ.—" చే వంగభాషలో విరచితమైన మూలగ్రంథమునుండి అనూదితము. నవభారత నిర్మాతయగు శ్రీ వివేకానందస్వామికి శ్రీరామకృష్ణ పరమహంస గురుదేవుడు. ఆ పరమహంసదేవుని దివ్య వచనామృతమును శ్రీ "మ.—" ఆనంద తన్మయతతో తాను వినినది వినినట్లుగ ఐదు భాగములుగ గ్రంథస్థ మొనర్చెను. అందు ప్రథమ భాగమిది.

ఆ అవతారమూర్తియొక్క వచనములు ఈ పుటలయందు మనస్సును పూర్తిగ ఆకట్టుకొనునట్లుగ అనువదింపబడినవి. వీనిలో పరిష్కరింపబడని తత్త్వవిషయిక సమస్యలేదు, తొలగింపబడని ఆధ్యాత్మిక సంశయము లేదు. వివరింపబడని ఆత్మవికాసక విషయములేదు. ఆసక్తికరము. ఆధ్యాత్మికులకు ఒక వరప్రసాదము.

వెల : సాదా : రూ. 8-00

పుటలు : 240 + VIII ప్రథమ ముద్రణము కాలికో : రూ. 12-00

# శ్రీ రామకృష్ణ జీవిత చరిత్ర

రచయిత : శ్రీ చిరంతనానందస్వామి

వంగభాషలోని మూలప్రమాణ గ్రంథముల ననుసరించి రచింపబడినది. ఇందు శ్రీ రామకృష్ణుని జీవితాంశములు మృదుమధురమగు తేటతెనుగున సమగ్రముగ వివరింపబడినవి. ఢిల్లీ సాహిత్య అకాడెమీ వారిచే ఉత్తమోత్తమ గ్రంథముగ నిర్ణయింపబడినవి.

శ్రీ రామకృష్ణ జీవితచరిత్ర అద్యంతము ఆత్మవైభవమే. దివ్యవైభవమే. ఇదియొక దెస కావ్యము. ఇంకొకదెస చరిత్రము వెరపి తత్త్వ సంహిత. లేక దివ్య కావ్యము. ఈ శ్రీ రామకృష్ణ జీవిత చరిత్ర శారదాకంఠమున ఓంకారఘంట; రోమాంచముల పంట.

—శ్రీ వేలూరి శివరామశాస్త్రి.

....విమర్శక చక్రవర్తి....కీ. శే. శ్రీ కట్టమంచి రామలింగారెడ్డిగారి శ్లాఘామోదములనందిన మీ పూర్వ గ్రంథముల వివి రచనావైదగ్ధ్యమున....మించియున్నది. విషయౌదాత్త్యము రచనౌదాత్త్యముగా పరిణమించుట స్వాభావికమే కదా సిద్ధహస్తుల చేతులతో!

-శ్రీ కందుకూరి మల్లికార్జునం.

It is bound to communicate to the reader the beauty and power of Sri Ramakrishna's life. —Sri S. Radhakrishnan.

Classic...authentic...It will be a very valuable addition to the Telugu literature. —The Hindu.

పుటలు : 478 + XXX వెల : రూ. 10-00

ఇట్లు వ్రాయుడు : మేనేజరు, శ్రీ రామకృష్ణ మఠము, మైలాపూర్, మద్రాసు-600 004.

# శ్రీ రామకృష్ణ ప్రభ

సంపుటము 36 | 1979 - సెప్టెంబరు | సంచిక 9

## విషయ సూచిక



గమనిక:—ఈసంచికలో, రామకృష్ణ కథామృతము ప్రచురింపబడలేదు.

---


## శ్రీ రామకృష్ణ ప్రభ

**సంవత్సర చందా: రూ. 10-00.** **జీవిత చందా: రూ. 125-00.**

శ్రీ రామకృష్ణమఠము,

మైలాపూర్, మద్రాసు–600-004.

# చందాదారులకు - గమనిక

* శ్రీ రామకృష్ణప్రభ (ఆధ్యాత్మిక మాసపత్రిక) ప్రతి ఇంగ్లీషునెల మొదటివారములో వెలువడును.

* సంవత్సరచందా పది రూపాయలు.

* జీవితచందా నూటపాతిక రూపాయలు.

* జీవితచందాదారులు కాగోరియు ఒక్కసారిగా నూటపాతిక రూపాయలు చెల్లించలేనివారు, వాయిదాలపై (ప్రతిసారి పదిరూపాయలకు తక్కువగాకుండ) ఒక సంవత్సరకాలములో మొత్తము పైకమును చెల్లించవచ్చును.

* జీవితచందాదారులయిన ఐదేండ్ల తరువాత, ఏకారణముచేతనైననూ, చందా రద్దు చేసుకొనగోరువారికి, మొత్తము పైకము వాపసు చేయబడును.

* చందాదారులు కాగోరువారు ఏనెలనుండియైనను చందాదారులు కావచ్చును.

* చందాపైకమును మనియార్డర్‌ద్వారాగాని, పోస్టల్ ఆర్డర్‌ద్వారాగాని, బ్యాంక్ డ్రాఫ్ట్‌ద్వారాగాని ముందుగానే పంపవలెను.

* క్రొత్తగా చందాదారులుగా చేరువారు "క్రొత్త చందాదారుడను" అని తెలియజేయవలసినదిగా మనవి.

* చందాదారులయినవారు, తమ చందానంబరును (R. p.………………) గుర్తుంచుకొని ఉత్తర ప్రత్యుత్తరములలో దానిని ఉదాహరించవలెను.

(ప్రతినెల పోస్టుద్వారా మీ కందజేయబడు రామకృష్ణప్రభ కవరుపైనుండు మీ విలాసము మీద, మీ చందానంబరు గుర్తింపబడియుండును. గమనించగలరు.)

* మీరు వ్రాయు ఉత్తరములందు, M. O. కూపనులందు మీ విలాసమును, చందానంబరును స్పష్టముగా వ్రాయవలసినదిగా మనవి.

* మీ అడ్రసు మారినపుడు మాకాసంగతి తెలియజేయగలరు.

* ప్రత్యుత్తరమపేక్షించెడి ఉత్తరములు వ్రాయువారు రిప్లయికార్డుగాని, తగినన్ని స్టాంపులుగాని పంపగలరు.

* రామకృష్ణ మఠము, మద్రాసు-4 నుండి వెలువడు అన్ని పుస్తకములధరపై రామకృష్ణ ప్రభ చందాదారులకు 5 శాతము తగ్గింపు కలదు.

# శ్రీ రామకృష్ణ ప్రభ

సంపుటము 36 | 1979 – సెప్టెంబరు | సంచిక 9


## శ్రీ దేవీ సం రనము

—సేకరణ : కె. లక్ష్మీప్రసాద్

నమస్తే శరణ్యే శివే సానుకంపే
నమస్తే జగద్వ్యాపికే విశ్వరూపే
నమస్తే జగద్వంద్య పాదారవిందే
నమస్తే జగత్తారిణి త్రాహి దుర్గే

శరణదాయినీ! శివే! కరుణామయీ! జగత్తంతయు వ్యాపించిన దేవీ! విశ్వరూపిణీ! సర్వ జగత్తుకు వంద్యమైన పాదారవిందములు కల తల్లీ! సంసారము నుండి తరింపచేయు దేవీ! దుర్గా నీకు నమస్కారములు, రక్షింపుము.

నమస్తే జగత్ చింత్యమన స్వరూపే
నమస్తే మహాయోగిని జ్ఞానదీపే
నమస్తే సదానందనందస్వరూపే
నమస్తే జగత్తారిణి త్రాహి దుర్గే

జగత్తుచే చింతింపబడు స్వరూపము కల దేవీ, మహాయోగినీ, జ్ఞానదీపమా, నిత్యము ఆనందముచే ప్రకాశించు స్వరూపముగల తల్లీ, సంసారతారిణీ, దుర్గా నమస్కారము. శరణిచ్చి రక్షింపుము.

అనాథస్య దీనస్య తృష్ణాతురస్య
భయార్తస్య భీతస్య బద్ధస్య జంతోః
త్వమేకా గతిర్దేవి నిస్తార కర్త్రీ
నమస్తే జగత్తారిణి త్రాహి దుర్గే

అనాథులైన వారికి, దీనులైనవారికి, తృష్ణలచే ఆందోళితులైనవారికి, ఆకలిగొన్న వారికి, భయభీతులై బద్ధులైన (మా వంటి) జీవులను తరింపచేయుటకు, దేవీ, నీ వొక్కతివే దిక్కు. (అట్టి) సంసారతారిణీ, దుర్గా, నీకు నమస్సు, రక్షింపుము.

అరణ్యే రణే దారుణే శత్రు మధ్యే
అనలే సాగరే ప్రాంతరే రాజగేహే
త్వమేకాగతిర్దేవి నిస్తారహేతుః
నమస్తే జగత్తారిణి త్రాహి దుర్గే

అరణ్య మధ్యమున నున్నను దారుణ యుద్ధ మధ్యమున భీకరశత్రువులచే చుట్టిబడి యున్నను, అగ్నిలో, సముద్ర మధ్యములో చిక్కుకొన్నను, భూమిపై గాని రాజగృహమందు (భోగముల నడుమ)గాని నే నెక్కడ నున్నను దేవీ, నన్ను తరింపచేయు ఉపాయము నీవు మాత్రమే. సంసారతారిణివగు దుర్గా, నీకు ప్రణామము. కాపాడి రక్షింపుము.

అపారే మహాదుస్తరేఽత్యంత ఘోరే
విపత్సాగరే మజ్జతాం దేహభాజాం
త్వమేకా గతిర్దేవి నిస్తార నౌకా
నమస్తే జగత్తారిణి త్రాహి దుర్గే

అపారమై, దాటుటకు శక్యము కానిదై అత్యంత ఘోరవిపత్తులనెడి ఒడ్డులేని సముద్ర మధ్యమున చిక్కుకొన్న గృహాభాజనులైన జీవులకు, దేవీ, నీ వొక్కతెవే దరిచేర్పు నౌకవు. అట్టి సంసారతారిణీ, దుర్గా, శరణు, రక్షింపుము.

నమో దేవి దుర్గే శివే భీమనాథే
సరస్వత్యరుంధత్యమోఘ స్వరూపే
విభూతిః శచీ కాలరాత్రిః సతీ త్వం
నమస్తే జగత్తారిణి త్రాహి దుర్గే

ఓ దేవీ, దుర్గా, శివస్వరూపిణీ, భీమనాథుని పత్నీ నీకు నమస్కారము, అమోఘస్వరూపిణీ

వగు దేవీ, నీవే సరస్వతివి, నీవే అరుంధతివి, శచివి, సమస్త సంపదలు నీవే, గాఢాంధకారములోని తేజస్సు నీవే. జగత్తును తరింపచేయు ఓ దుర్గా ప్రణామము. రక్షింపుము.

*   *   *

(రామప్రసాదు, కమలాకాంతుడు మున్నగు వారి కీర్తనలను శ్రీరామకృష్ణులు భావపూరితులై పాడుచు, పాడించుకొని వినుచు తన్మయత్వమునందెడివారు. కొన్ని కీర్తనల సారాంశమిచట పొందుపరచబడినది.)

1. తల్లీ! "దుర్గా, దుర్గా" యనుచు నేను నిన్ను స్మరించుచున్నచో ఆఖరిక్షణమున ఈ దీనుని తప్పక తరింపజేయుదువు. నేను గో బ్రాహ్మణ భ్రూణ హత్యలు, సురాపానము మున్నగు పాపములెల చేసినను సరే. ఓ సర్వసంహారిణీ, నా పాతకములన్నిటిని హరించి రెప్పపాటులో బ్రహ్మపదవినధిష్ఠింపజేయుదువు.

2. త్రిగుణ ధారిణీ, పరాత్పరా, ఓ తారా! నీవే నా తల్లివి. నీవు దీనులను కరుణింతువని, విపన్నుల దుఃఖమును హరించుదువని నాకు తెలియును. తల్లీ, నీవే సంధ్య, గాయిత్రివి నీవే. నీవే జగద్ధాత్రివి. అమ్మా, నీవు అసహాయులకు రక్షకురాలవు. సదాశివుని మనోహారిణివి. దేవీ! జలము, స్థలములో, జగత్తుకు మూలకారణములో నీవే విరాజమానవై యున్నావు. సాకార రూపిణివై అన్ని ఘటముల యందు వున్నను నీవు నిరాకారిణివి కదా!

3. ఓ హృదయానందకారిణీ, దేవీ, నా ప్రాణప్రియ దైవమా! వచ్చి నా హృదయ సింహాసనమధిష్ఠించు తల్లీ! నా కంటికి విందుగా నీ దర్శనము నెల్లప్పుడు చేసికొనుచుందును. పుట్టినప్పటినుండి నీ కొరకై నీ ముఖమువైపు చూచుచు నిరీక్షించుచుంటిని కదా! అమ్మా ఇన్నాళ్ళూ నేనెంతటి దుఃఖమనుభవించుచున్నానో నీ వెరుగుదువు. ఓ ఆనందమయీ! ఒక్కసారి నా హృదయపద్మమును వికసింపజేసి అక్కడ నీ ప్రకాశము వ్యాపింపచేయుము.

4. నా తల్లి కాళి ఎట్లుండునో ఎవరెరుగుదురు? షట్ దర్శనములకు (ఆరు శాస్త్రములు) ఆమె దర్శనము లభింపలేదు. మూలాధారమున, సహస్రారమున యోగులు నిత్యము ఆమెను ధ్యానించుచుందురు. ఆమె పద్మవనములో హంసినియై హంసతో క్రీడించుచుండును. ఆమె ఆత్మారాముని ఆత్మ. ప్రణవమునకు ప్రమాణము. ఆమె ఇచ్ఛామయి. తన ఇచ్ఛానుసారముగనే ఘట-ఘటమునందు విరాజిల్లుచున్నది. ఈ బ్రహ్మాండమంతయు ఎవరి ఉదరములో నున్నదో, అట్టి తల్లి ఎంతటిదో ఊహించగలవా? దేవి యొక్క మహాత్మ్యమును మహాదేవుడే ఎరుగును. ఇంకెవరు తెలియగలరు? ఆమెను తెలిసికొనవలెనను లోకుల ప్రయాస చూచి రామప్రసాదుకు నవ్వు వచ్చుచున్నది. అపారసాగరము నెవ్వరైన ఈది దాటగలరా? ఇంత తెలిసినను నా మనస్సు ఏదో చిన్నపిల్లవలె చంద్రుని అందుకొనుటకు చెయ్యి చాచుచున్నది

5. అమ్మా, నీ అంతటి తల్లి నాకుండగా (నన్ను కాపాడుచుండగా) నేను మేల్కొని యుండగానే నా ఇంట దొంగతనము జరుగుచున్నది కదా! తల్లీ ఈ దుఃఖము నన్ను బాధపెట్టుచున్నది. నీ నామము స్మరించుదమని మనసులో అనుకొందును. కాని అట్లు చేయకనే కాలము గడచిపోవుచున్నది కదా! ఆహా! గ్రహించితిని, తెలిసికొంటిని. తల్లీ, ఇదంతయు నీ చాతుర్యమని నా కర్థమయినది. నీవే నా మనసును సైగచేసి సంసారమున నుంచితివి.

6. ఓ మనసా! ప్రియమైన తల్లి శ్యామను యత్నపూర్వకముగా హృదయములో నిలుపుకొనుము. నీవు, నేను తప్ప ఇంకెవ్వరు చూడ

కుండునట్లామెను అంతరంగమున దాచు కొనుము. కామాదులను మోసగించి, ఓ మనసా, ఏకాంతముగ మనమామె దర్శనము చేసికొందుము. 'అమ్మా, అమ్మా' అని పిలుచుటకు జిహ్వను మాత్రము తోడుగా నుంచుకొనుము. కురుచులు, కుమంత్రులను (దుష్టకోరికలు, దురాలోచనలు) చుట్టుపక్కల తిరుగనీయకుండ, జ్ఞాన(వివేక)ములనే రెండు నేత్రములను ఫహారాదారుగా నుంచుము

7. అమ్మా, ఆనందమయివైన తల్లీ, (నీవు ఆనందమయివై వుండి) నన్ను మాత్రము నిరానందునిగా చేయకు. (నన్నానందము లేనివానిగా చేయకు). నీ చరణ ద్వయము మించి నా మనస్సు కేమియు తెలియదు. అమ్మా, చివరికి యముడు నన్ను దోషి అన్నచో (శిక్షింపనెంచినచో) నేనేమి చెప్పవలెను తల్లీ? భవానీ, భవానీ అనుచు భవ సాగరము దాటిపోవుదునని నా ఆశ. నన్ను ఈ అపార సముద్రమున నీవు ముంచుదువని నేను కలలోకూడతలచ లేదు కదా! రాత్రి పగలు దుర్గా నామమే స్మరించుచున్నాను. అయినను నా ఈ అసంఖ్యాక దుఃఖములకంతు లేదు. ఓ హరసుందరీ! ఈ మాటు నేను మరణించినచో, నీ దుర్గా నామము ఇంకెవ్వరు స్మరించరు గమనించుకో!

8. ఓ తారిణీ, దుర్గా, నన్ను తరింపచేయుము. ఈ మాటు శీఘ్రముగా తరింపజేయుము. అమ్మా, జీవులందరు యమునివల్ల భయభీతులగుచున్నారు. ఓ జగజ్జననీ, సంసార పాలినీ! లోకులను మోహింపచేయు మాయా స్వరూపిణివగు తల్లీ! నీవే యశోద గర్భమున జనించి శ్రీహరికి లీలా సహకారిణివై తివి. బృందావనమున రాధవై వ్రజవల్లభునితో విహరించితివి. ఓ అమ్మా, నీవే గిరిజవు. గోప భనయవు, గోవింద మనోహారిణివి నీవే. నీవే సద్గతిదాయినివగు గంగవు. ఓ శివా, ఓ సనాతనీ, సదానందమయీ, సర్వస్వరూపిణీ, ఓ నిర్గుణ సగుణ స్వరూపిణీ, ఓ సదాశివుని ప్రియురాలా! నీ మహిమలనెవ్వరరుగుదురు!

9. అమ్మా, నీ సంతానముపై నీ కెంత ప్రేమ! నీ వాత్సల్యము తలచిన నా కన్నులు ప్రేమాశ్రువులతో నిండుచున్నవి. నేను పుట్టినప్పటినుండి నీ శ్రీచరణముల ముందర ఎన్నెన్ని అపరాధములు చేసితినో! అయినను, నీవు నా ముఖమువైపు ప్రేమపూర్ణమైన కన్నులతో చూచుచున్నావు. మధుర స్వరముతో నన్ను పిలుచుచున్నావు. సంగతి తలచిన నారెండు కన్నులు ప్రేమధారలు వర్షించుచున్నవి. అమ్మా, ఈ అహైతుక ప్రేమభారము నేను మోయగలనా! నీ స్నేహ వాత్సల్యము చూచి నా హృదయము విదీర్ణమగుచున్నది. నీ ప్రేమ చూచి నా ప్రాణాలు విహ్వలమై రోధించుచున్నవి.

10. ఆహా! నా మనోమధుపము (మనస్సనే తుమ్మెద) శ్యామా పదములనెడి నీలపద్మమున విహరించుచున్నది. కామాది పుష్పములలో నుండు విషములనే తేనె ఇప్పుడు చేదుగా (తుచ్ఛముగా) తోచుచున్నది. తల్లి చరణముల శ్యామ వర్ణములో మనస్సనే తుమ్మెద నలుపు ఏకమై (కనబడకుండ) పోయినది. ఇక పంచతత్వములు ఆధారము లేక మాయమయినది. కమలాకాంతుని ఆశ ఇన్నాళ్ళకు పూర్ణమయినది. సుఖదుఃఖములు రెండును సమానముగనే వెనుకకు పోయినవి. కేవలము ఆనంద తరంగములే పొంగుచున్నవి.

11. అమ్మా, నేను నీ శరణములోని వాడను-నీకు శరణాగతుడను. అమ్మా, నేను శరీరసుఖము కోరుకొనుట లేదు,

అష్టసిద్ధులు కోరుకొనుట లేదు, కేవలం నేను కోరునది నీ శ్రీపాదపద్మములయందు శుద్ధ (పవిత్ర)భక్తి-నిష్కామ, నిర్మల, అహైతుక భక్తి (కలుగుగాక యని) మాత్రమే. మరియు అమ్మా, నీ భువన మోహినియగు మాయకు ముగ్ధుడను కానట్లుచేసి—నీ మాయా సంసారములోని కామ కాంచనలపై ఎప్పటికిని ప్రేమ కలుగకుండునట్లు చూడు తల్లీ. అమ్మా, నీవు తప్ప నాకు ఇంకెవ్వరూ లేరు. నేను భజన హీనుడను, సాధనహీనుడను, జ్ఞాన హీనుడను, భక్తి హీనుడను. కృపచేసి నీ శ్రీపాద పద్మముల యందు భక్తి నొసంగుము.

# భక్తరసికుడు

## స్వామి దయాత్మానంద

వసంతఋతువు మంచిచెడు అనే విచక్షణ లేకుండా ప్రతి హృదయాన్ని ఆహ్లాదంతో పరిపూర్ణం చేస్తుంది. అహైతుక కరుణాసింధువులైన మహాపురుషుల జీవితాలు వసంతఋతువుతో పోల్చబడ్డాయి. ఐతే అవి శాశ్వత వసంతాలు. జాతి, మత, కుల, వయోభేదాల్ని గణించకుండా మహాత్ములు తమ కృపాకటాక్షాలను అందరిమీద సమంగానే వర్షించుతారు. వారి హృదయాలు ప్రేమతో పరిపూర్ణాలు! జీవితాలు నిస్వార్థపూరితాలు, పవిత్రవంతములు కావటంచేత వారి సంపర్కం కల్గిన ప్రతి మానవహృదయం తమ సంస్కార, గ్రహణశక్తి భేదానుసారం ఏ కొంచెమో పవిత్రతో, నిస్వార్థబుద్ధితో, భగవద్భక్తితో, ఆనందంతో రంజితమౌతుంది.

శ్రీ రామకృష్ణుల జీవితంకూడ దీనికి ప్రమాణం. వారి సంపర్కం కల్గిన ప్రతి హృదయం ప్రేమ, భక్తి, జ్ఞాన, వైరాగ్యాదులతో ఇతో వృద్ధిపొంది మరింత ఉత్సాహంతో దేవునివైపు అగ్రసరమయ్యేది; భగవత్సాక్షాత్కారమే జీవితంయొక్క పరమ లక్ష్యం! అదే శాశ్వతానందప్రదాయకమనే భావన మరింత దృఢమయ్యేది.

భక్తరసికుని జీవితగాథకూడ దీన్నే స్పష్టంగా నిరూపిస్తుంది. శ్రీరామకృష్ణ-రసిక లీలకు శ్రీ రామలాల్ చట్టోపాధ్యాయ ప్రత్యక్ష సాక్షి. శ్రీ రామలాల్ శ్రీరామకృష్ణుల మేనల్లుడు. ఈ సంఘటనలు జరిగినప్పుడతడు దక్షిణేశ్వరం కాళికాలయంలో ముఖ్యపూజారి. 'అప్పుడతడు పూజాదిపనులు చెయ్యటమే కాక అవకాశం దొరికినప్పుడల్లా శ్రీరామకృష్ణుల సేవ చేసేవారు. తన కళ్ళ ఎదుటనే జరిగిన ఈ సంఘటనలను అతడు చాలా సంవత్సరాల తర్వాత 'శ్రీ కుముద్ బంధు సేన్' అనే భక్తునితో చెప్పారు. శ్రీ రామలాల్ చట్టోపాధ్యాయను భక్తులు 'రామలాల్ దాదా' (అన్న) అనే పిలిచేవారు. ఇక 'సేన్' భక్తునితో చెప్పిన 'రసిక కథ'ను రామలాల్ దాదా నోటి నుండే విందాం.

'అప్పుడు నేను కాళికాలయంలో ముఖ్య పూజారిని. ఒకరోజు మధ్యాహ్నం మామ తన గది వరండాలో కూర్చొని విశ్రామం తీసుకొంటున్నారు. ఏదో పని సందర్భంలో రసికుడు అదే సమయంలో ఆ ప్రక్కకు రావడం జరిగింది. రసికుణ్ణి చూసి మామ లేచి నిల్చొని అతణ్ణి చూపెడుతూ, ''చూడు, రసికుడు

సామాన్యుడు కాడు. మనుష్యరూపంలో జన్మించిన దేవలోకవాసి'' అని నాతో అన్నారు. [illegible] పుణ్యులైన వారికి అంతా భగవన్మయంగానే కన్పించుతుంది కనుక రసికుడు దేవలోకవాసి అని చెప్పినా ఇది మామ అప్పుడప్పుడు భావావస్థలో పల్కే విధమేననుకొని నేనాయన మాటల్ని అంతగా లక్ష్యపెట్టలేదు. ఎందుకంటే నేను రసికణ్ణి బాగా ఎరిగినవాడినే. కాళికాలయం ఊడ్చి శుభ్రం చెయ్యటం, మార్గాలు శుభ్రం చెయ్యటం, మరుగుదొడ్లు పరిష్కారం చెయ్యటం- ఈ పనుల్ని చేసే 'పాకీవాడు' రసికుడు. ఆలయానికి కొద్దిదూరంలోనే దక్షిణేశ్వర గ్రామంలోనే 'పాకీపల్లె'లో ఒక చిన్న ఇల్లో ఉండేవాడు రసికుడు. మా ఇల్లు కూడ అతని ఇంటికి దగ్గరే. అతనికి భార్యా, బిడ్డలు ఉన్నారు. రోజూ ప్రొద్దున్నే ఇక్కడకొచ్చి తన పనిని మాత్రం చక్కగా, శ్రద్ధగా చేసి వెళ్లేవాడు. రసికుడు నిమ్నకులంలో పుట్టినవాడైనా చాలా మంచివాడు. దేవుడంటే భక్తి, విశ్వాసం కలవాడు. శ్రీరామకృష్ణులంటే అతడికెంతో భక్తి. పనిచేసేటప్పుడెప్పుడైనా దారిలో మామను చూట్టం జరిగితే భయభక్తులతో నమస్కారం చేసేవాడు. అతి వినయంతో ఒక ప్రక్కకి జరిగి మామ పోయ్యేంతవరకు చేతులు జోడించుకొనే ఉండేవాడు. మామకూడ చిరునవ్వుతో రసికణ్ణి చూసేవారు. అప్పుడప్పుడిట్లా జరుగుతుండేది.'

'పంచవటికి ఉత్తర పశ్చిమ దిక్కున కొద్ది దూరంలో దేవదారు వృక్షాలతో గూడిన చిన్న వనం ఉండేది. మామ అక్కడకు తన బాహ్యకృత్యాలకోసం వెళ్ళేవారు. ఒకరోజు మామ ఆప్రక్కకు పోవటం తటస్థించింది. తువ్వాలు, నీళ్ళచెంబుతో నేనూ మామను అనుసరించే వెళ్ళాను. దారిలో రసికుడు కన్పడ్డాడు. మామను చూసి అతడు వినయంగా దారి ప్రక్కకు జరిగి నిల్చున్నాడు. శౌచం ముగించుకొని తిరిగి వచ్చేటప్పుడు కూడ రసికుడు అక్కడే నిల్చొని ఉండటం గమనించాను. కొంచెం ఆశ్చర్యపడ్డాను కూడ. మామను చూసిన తక్షణం రసికుడు తన నడుం గుడ్డను మెడలో వేసుకొని శ్రీరామకృష్ణుల కాళ్ళపైబడి సాష్టాంగ ప్రణామం చేసాడు. మామకూడ నవ్వుతూ "బాగుండావా!" అని కుశలమడిగారు. రసికుడు లేచి నించొని విషాద ముఖంతో, "బాబూ! తక్కువ కులంలో పుట్టిన దౌర్భాగ్యంవల్ల మీ సత్సంగ భాగ్యం నుండి వంచితుణ్ణయ్యాను. అందరి భక్తులవల్లే మీతో కలిసి మెలిసి తిరిగే పుణ్యం నాకు లేదు. మీరు దేవుని కీర్తనలు, పాటలు పాడేటప్పుడు, మాట్లాడేటప్పుడు దగ్గరనుంచి విని ఆనందించాలనే కోర్కె ఉన్నా అది తీరేది కాదుగదా! మీ దగ్గరనే కూర్చొని అందరితోపాటు మీ ఉపదేశామృతాన్ని వినే భాగ్యం నాకు లేదుగదా'' అని తన మనస్సులో ఇంతకాలం అణచుకుంటూ వస్తున్న ఆలోచనల్ని వ్యక్తం చేసాడు. నిజంగా రసికుడు చదువులేనివాడైనా, నిమ్నకులంలోపుట్టినవాడైనా, సామాన్యుడుగాడని మామ మొదటి నుండే గ్రహించాడు. అందుకే చాల భక్తి చూపెట్టేవాడు. జాతి వైషమ్యాలు కొంచెం ఎక్కువగానే ఉండటంవల్ల మామదగ్గరకు రావటం గాని, మిగతా భక్తులందరితో కలిసితిరగలేనే అని తన మనస్సులోనే దుఃఖించుతూ ఉండేవాడు. మామను చూసినప్పుడల్లా దూరం నుండే నమస్కారం చేసేవాడుగాని, సాధారణంగా వచ్చి కాళ్ళను స్పృశించేవాడు కాడు. ఐనా ఆరోజు ఇంతకాలం ఎంతో

కష్టంతో అణచుకుంటున్న తన దుఃఖాన్ని ఆపుకోలేక అంతా మామదగ్గర వెలిబుచ్చాడు. మామకూడ అతణ్ణి ఎన్నో విధాల ఊరడించటానికి ప్రయత్నం చేశాడు. "అనవసరంగా దుఃఖపడవద్దు. నీవు మనుష్యుడిగా జన్మించావు గదా! అంతకంటె గొప్ప సౌభాగ్యం వుందా? మనుష్యుడు మాత్రమే దేవుణ్ణి చూడగలడు, సాక్షాత్కారం చేసుకోగలడు. నువ్వు చేసే పనిమాత్రం తక్కువా? సాక్షాత్తు జగన్మాత దేవాలయాన్ని శుభ్రం చేస్తున్నావు గదా. ఎంతోమంది భక్తులు, సాధువులు, సాధకులు ఈ పవిత్ర స్థలాన్ని సందర్శించి తమ పాద ధూళిని ప్రసాదించారు. ఇటువంటి పుణ్యస్థలంలో దొరికిన పనిని అమ్మపూజగా భావించి చెయ్యి. జగన్మాత దృష్టిలో ఎక్కువ తక్కువ భేదం లేదు. ఆమె దృష్టిలో అందరూ సమానమే. ఐతే ఎవరు శ్రద్ధాభక్తులతో తమ పనులను చక్కగా నిర్వర్తిస్తారో వారికి అమ్మ కృప లభించుతుంది. ఒక్కసారి అమ్మ కృప లభించినవారికింకేమి చింత? వారు ముక్తులైపోతారు చూడు" అని ఎన్నో విధాల సదుపదేశం చేసారు మామ.'

'ఐనా రసికుడి దుఃఖంమాత్రం తగ్గలేదు. మామ ఊరడించేకొద్దీ రసికుడి దుఃఖం ఇంకా ఎక్కువ కాసాగింది. మామ కాళ్ళమీద తల పెట్టి రసికుడు వెక్కివెక్కి ఏడవసాగాడు. ఆ దృశ్యాన్ని చూస్తున్న నాకుకూడ కళ్ళలో నీరు తిరిగాయి. ఇదిట్లా జరుగుతుండగా మామ హఠాత్తుగా గభీర సమాధిస్థులయ్యారు. చాలా సేపటివరకు ఆ సమాధిభంగం కాలేదు. అంతవరకూ రసికుడు మామకాళ్ళను పట్టుకొని ఏడుస్తూనే ఉన్నాడు. చివరికి మామకు కొంచెం చైతన్యం వచ్చింది. గంభీరముఖంతో మామ రసికుణ్ణి చూసి "ఐతే నీకేమి కావాలి?" అని అడిగారు. రసికుడు ఏడుస్తూనే, "బాబా! నాకు సాధన, భజన అంటే ఏమిటో తెలియదు. తెలిసినా చెయ్యగల్గే సమర్థత నాకు లేదు. చివరికి నాగతి ఏమవుతుందో తెలీదు. నువ్వు నా అంత్యకాలంలో వచ్చి స్వయంగా చేతులు పట్టుకొని తీసుకువెళ్లి నన్ను తరించు" అని ప్రార్థించాడు. "సరే,అలాగే" అని పల్కి మామ కూడ తన గదికి తిరిగి వెళ్ళారు. ఎవరైనా మామను గురువు అని గాని, కర్త (యజమాని) అనిగాని, బాబా (తండ్రి) అని గాని పిలిస్తే చాలా విసుక్కునే వారు కాని మధురబాబు, రసికుడు మాత్రం మామను "బాబా" అనే పిలుస్తూండేవారు. మామకూడ వారిని ఏమీ అనేవారు కాదు. తన గదికి వెళ్లేముందు మామ మళ్ళీ రసికుడికి ఇట్లా చెప్పారు. "చూడు నీ ఇంటి దగ్గర కొన్ని తులసీ మొక్కల్ని నాటు. ప్రతిదినం ఉదయం సాయంత్రం తులసీకాననం క్రింద కూర్చొని హరినామ సంకీర్తనం చెయ్యి" అని చెప్పి వెళ్ళారు. రసికుడు కూడ కన్నీళ్లు పైగుడ్డతో తుడుచుకుంటూ తన పని చెయ్యసాగాడు. మామ చెప్పినట్లే అతడు తన ఇంటి ముందొక తులసీకాననం నాటి రోజూ ఉదయం, సాయంత్రం తప్పకుండా భక్తిశ్రద్ధలతో హరినామ సంకీర్తనం చేసేవాడు. కొన్నేళ్లు యిట్లా జరిగింది. ముసలివాడు కావటంవల్ల క్రమంగా పని విడిచిపెట్టి ఇంట్లోనే ఉండిపోయాడు.'

'కాలక్రమంలో మామ శరీరాన్ని విడిచిపెట్టి పొయ్యాడు. దానికి సరిగా రెండు సంవత్సరాల తర్వాత సంగతి. ఒకరోజు నేను ఇంటినుండి దేవాలయం వస్తున్నాను. దారిలో రసికుడి భార్య కనపడింది. రసికుడు ఎట్లా ఉన్నాడని అడిగాను. ఆమె ఏడుస్తూ, రసికుని ఒళ్ళు బాగలేదని, ఏదో రోగంతో చాల

బాధపడుతున్నాడని చెప్పింది. కొడుకులు మంచి వైద్యుల్ని రప్పించి చూపించారు గాని వారు చెప్పిన మందులు మాత్రం తీసుకోనని రసికుడు హఠం చేసాడు. ఒక్క దేవుని చరణామృతం తప్ప ఇంకేమీ తీసుకోనని అతడు ఖచ్చితంగా చెప్పటంవల్ల భార్య దేవాలయానికే రావటం, నేను చూడటం జరిగింది. నేను త్వరగా మందిరానికి వెళ్ళి కొన్ని తులసీ ఆకులతో కూడా రాధాకాంతుని చరణామృతాన్ని తీసుకొచ్చి ఆమెకిచ్చి పంపాను.'

'కొద్దిరోజులిట్లా గడిచింతర్వాత కూడా రసికుడి సంగతేమీ తెలియక పోవటంవల్ల నా మనస్సు కొంచెం ఆందోళనతో నిండింది. అందుకే ఒకరోజు వాళ్లింటికి వెళ్ళాను. నన్ను చూడగానే రసికుడి భార్యాబిడ్డలు ఏడవటం మొదలుపెట్టారు. కొద్దిరోజుల ముందే రసికుడు శరీరం విడిచి వెళ్ళిపోయాడట. కుతూహలం కొద్దీ అతడు ఎట్లా పొయ్యాడో చెప్పమని ఆమెని అడగ్గా ఆమె ఏడుస్తూనే ఇట్లా చెప్పింది.

''మీరిచ్చిన చరణామృతం తాగినతర్వాత ఆయన కొంచెం బాగయినట్లు కన్పడ్డాడు. కొన్నిరోజులు బాగున్నాడు కూడా. రోజూ తప్పకుండా హరినామకీర్తనం చేసేవాడు. ఒక రోజు మేమందరం పనికివెళ్ళి మధ్యాహ్నం తిరిగొచ్చాం. మేం వచ్చిన వెంటనే మమ్మల్ని పిల్చి 'చూడు, ఇవ్వాళ బాబా వచ్చాడు. ఈ రోజే మళ్ళీ వచ్చి నన్ను తీసుకెళ్తానని చెప్పాడు, మీరందరూ త్వరగా భోజనం చెయ్యండి', అని మమ్మల్ని త్వరపెట్టాడు. మేంకూడా తొందరగానే భోజనం ముగించుకొచ్చాం, రాగానే నన్ను తులసీకాననం దగ్గరకు తీసుకెళ్ళమని అడిగాడు. మధ్యాహ్నం వేళ, ఎండ విపరీతంగా ఉందని ఎంత చెప్పినా వినక మళ్ళీ మళ్ళీ అడగటంవల్ల చేసేదేమీ లేక ఆయన్ని తులసీకాననం దగ్గరికి తీసుకెళ్లాం. ఒక చాప పరచి దానిమీద ఆయన్ని పడుకోపెట్టాం. ఆయన మమ్మల్నందర్నీ తన దగ్గరనే కూర్చొని హరినామ సంకీర్తనం చెయ్యమని చెప్పాడు. మేము కూడ హరినామ సంకీర్తనం చెయ్యడం మొదలుపెట్టాం. ఆయన తన జపమాలను తీసుకొని జపంచెయ్యటం మొదలుపెట్టాడు. ఇట్లా కొంతసేపు జరిగింది. అప్పుడాయన హఠాత్తుగా, 'బాబా! వచ్చావా? చూడండి, బాబా వచ్చి నన్ను రమ్మని చెప్తున్నాడు. నా చేతులు పట్టుకుని తీసుకువెళుతున్నాడు. బాబా! ఆహా! నువ్వెంత అందంగా కన్పడుతున్నావు. నీ దేహం ఎంత చక్కగా వెలుగుతోంది!' అని అంటూనే ప్రాణం విడిచాడు.''

'నేను కూడ వారిని ఊరడించి నా కళ్ళ ఎదుటనే జరిగిన ఈ సంఘటనలన్నిటినీ తల్చుకుంటూ తిరిగి వచ్చాను' అని రామలాల్ దాదా రసికుని కథను ముగించాడు.

నిజంగా శ్రద్ధాభక్తుల్తో ఒక్కసారి శరణమని పల్కిన భక్తులకు ముక్తి ఎంత సులభమో గదా! జయ భగవాన్ రామకృష్ణ! జయ భక్త రసిక!

(శ్రీ సేన్ 1895వ సంవత్సరంలో దక్షిణేశ్వరం సందర్శించినప్పుడు శ్రీ రామలాల్ దాదా వారికీ 'రసిక లీల'ని చెప్పారు. దాన్నే శ్రీ సేన్ 1958 మార్చి 'ప్రబుద్ధ భారత'లో ప్రకటించారు. ఈ పై రచనకు ముఖ్యమైన ఆధారం వీరి లేఖనమే.-రచయిత)

# మాతృదేవి చరణసన్నిధి

ఆంగ్ల గ్రంథము:
**ఎట్ ది హోలీమదర్స్ ఫీట్**

అనువాదము:
**పి. గణపతిశాస్త్రి**

ఆ రోజుల్లో నా ఆకారమే వేరుగా ఉండేది. నే నప్పుడు కొన్ని నగలు, ఎర్రంచుల చీర ధరించేదాన్ని. ఆ చీర చెరగు నా భుజాలనుండి జారి, గాలిలో రెపరెపలాడుతూంది. అయినా ఆ సంగతి నాకేమీ తెలియనే తెలియదు! జోగీన్ (యోగానందస్వామి) అప్పటికింకా చిన్నవాడు. అతడు జలకలశంతో ఠాకూరు పక్కనేఉండి, ఆ పరిస్థితిలో నన్ను చూశాడు. నేనప్పుడు ఎంత హాయిగా ఉండేదాన్ని! ఒకనాటి రాత్రి పరిపూర్ణచంద్రబింబం కేసి చూసి "నీ కిరణాలలాగే నా హృదయంకూడా నిర్మలంగా ఉండేటట్టు అనుగ్రహించవలసింది" అని ప్రార్థించాను. అప్పుడప్పుడు అలాగే ప్రార్థిస్తూ ఉండేదాన్ని. అలాగే ప్రార్థిస్తూ ధ్యానం చేస్తూంటే ఠాకూరు నాతో ప్రసంగిస్తూ వెంటనే నా కోరికలన్నీ నెరవేరుస్తున్నట్టే ఉండేది. ఆ సమయంలో నా హృదయాంతరాళంలో పరిపూర్ణ ప్రశాంతి అలముకుంటూ ఉండేది. అప్పుడు నా మనస్సెంత అత్యద్భుతంగా పరిణమించింది!

నేనొకనాడు ధ్యానం చేస్తూండగా పనిమనిషి బృంద నా ఎదురుగా ఒక లోహపు పాత్ర జారవిడిచింది. దానితో నా గుండెలో పెద్ద పిడుగు పడినంత సవ్వడి వినిపించింది!"

అలాగంటూనే అమ్మ కళ్ళమ్మట నీళ్ళు పెట్టుకున్నది. అంతలోనే మాతృదేవి తిరిగి అంటున్నది.

"నీవు ధ్యానం కొనసాగించిన కొద్దీ నాలో ఉన్న ఆ భగవానుడు నీలోను, దీనాతిదీనులయినవారిలోను కూడా ఉన్నాడని అవగతమవుతుంది. నిజమయిన వినయం అప్పుడే నీకవగతమవుతుంది."

ఆ తరవాత మాతృదేవి అప్పుడే లోపలికి వెళ్ళిన తన బంధువును ద్దేశించి ప్రసంగిస్తూ ఇలాగన్నది.

"జయరాంబాటిలో బెండెలకింద చుట్టలు తయారుచేసే తక్కువ కులం స్త్రీలు కొందరు అవికొన్ని తయారుచేసి మా కివ్వడానికి వచ్చారు. "అవి అక్కడ పెట్టండమ్మా!" అన్నాను నేను. అత్యంత జాగరూకతతో వారలాగే చేశారు. అంతలోనే ఆమె రుసరుసలారంభించింది. వారు మా వస్తువులు కొన్ని ముట్టుకున్నారని అవి పారవెయ్యాలని నిందించడం ప్రారంభించింది. "మీరు కడజాతివారన్న మాటే మరిచిపోయారా? ఆ చుట్టలలాగ అంత దగ్గిరలో ఉంచుతారా?" అంటూ గద్దించింది.

వారా ధోరణి గమనించి చాలా భయపడ్డారు. కాని నేను వారి నోదార్చాను.

"మీరేం భయపడకండి! మీ కేలాంటి ఇబ్బంది రాదులెండి!" ఆపైన నేను అటుకులు కొనుక్కోడానికి వారికి కొంత సొమ్మిచ్చాను. ఆమె ధోరణి అటువంటిది! ఆమె కవకతెల్లవారు జామునే లేచి నా వరండాకు ఉత్తర భాగంలో కూర్చుని ధ్యానం చెయ్యడం మొదలుపెడితే చాలు! తప్పకుండా ఆమెకందువల్ల ప్రశాంతి లభించి తీరుతుంది! కాని అలాగ ఎన్నడు చెయ్యదు! ఆపైన తన మనస్సుబొత్తిగా స్థిమితంగా లేదని వాపోతుంది. ఆమెలో ఉన్న ఈ అశాంతి ఏమిటి? ఆ రోజుల్లో నాకు అటువంటి అశాంతి అంటే ఏమిటో తెలియనే తెలియదు! ఇప్పుడు ఆమెవంటి వారివల్లనే నా కింతటి అశాంతి ఏర్పడుతున్నది. ఏదో ఒక దుర్ముహూర్తంలో నా చిట్టచివరి మరదలు మా ఇంట అడుగుపెట్టింది. నేను, ఆమె కుమార్తె రాధు

కష్టసుఖాల కన్నింటికి బాధ్యత వహించడం ప్రారంభించాను. నా కష్టాలన్ని వెంటనే ప్రారంభమయ్యాయి.

"వారందరిని వెళ్ళిపొమ్మనండి! వారిక్కడ ఉండడం నా కిష్టం లేదు! ఎంతటి విచిత్రమయిన పిల్లలు నా మేనగోడళ్ళు! నా హితవు బొత్తిగా చెవికెక్కనియ్యరు వాళ్లు! ఆడవాళ్ళు అంతటి విడ్డూరంగా ఉండడం నేనెక్కడ చూడలేదు!" దానిమీద గోలాప్‌మా అందుకున్నది.

"చూడు! రాధూ ఎంతటి విచిత్రంగా చీర సింగారించుకున్నదో చూడు! తన పెనిమిటికి తనమీద బాగా ప్రేమ కలగడానికి అదే మార్గమని ఆలోచిస్తూందిలా ఉంది."

అంతలోనే అమ్మ అందుకున్నది.

"ఠాకూరు నా ఎడల ఎంతదయగా ఉండే వారు! నా మనస్సు నొప్పించేమాట ఒక్కటి కూడ ఆయన నోటినుండి ఎన్నడు వెలువడలేదు! దక్షిణేశ్వరంలో ఉన్నప్పుడు నేను ఒకనాడు ఆయన గదిలోకి ఆహారం తీసుకు వెళ్లాను. నేను లక్ష్మినని అనుకున్నారాయన. అందుచేత బొత్తిగా చిన్నవారిని ఉద్దేశించి అన్నట్టు "నీవు వెళ్ళిపోయేటప్పుడు ఆ తలుపు దగ్గిరిగా వేసి వెళ్ళిపో!" అన్నారు. నేను 'అలాగే' అన్నాను. నా గొంతు సవ్వడి విని, వెంటనే ఆయన నన్ను గుర్తుపట్టి ఎంతో కంగారుపడ్డారు! "అయ్యో! నీవా! నేను నీవనుకోలేదు! లక్ష్మి అనుకున్నాను. నేను నిన్ను అలాగ పిలిచినందుకు వేరొక విధంగా అనుకోవనుకుంటాను." అన్నారు. "ఆఁ దానికేమిటిలెండి!" అని నెమ్మదిగా సర్ది వేశాను నేను! ఆయన ఎన్నడు ఏ విధంగాను నన్ను అమర్యాదగా చూడలేదు! సదా నా క్షేమం సంగతి కనుక్కుంటూ ఉండేవారు. ఠాకూరు తరుచుగా ఇలాగంటూండేవారు.

"ఎల్లప్పుడు ఏదో పనిచేస్తూనే ఉండాలి. మహిళలెన్నడు పని, పాటు లేకుండా ఉండ కూడదు. అలాగ ఉంటే వట్టి వ్యర్థములయిన చెడుతలపోతలెన్నో బయలుదేరుతూంటాయి"

ఒకనాడాయన జనపనార తాళ్ళు కొన్ని నా చేతికందించి "ఇవి అన్ని కాస్త ఉట్టెలకింద అల్లి పెట్టు! నేను మన శిష్యులకోసం వానిలో, లూచీలు తియ్యని తినుబండారాలు జాగ్రత్త చేస్తాను" అన్నారు. నేనలాగ ఆయన చెప్పి నట్టు ఉట్టెలు తయారుచేసి ఆయనకిచ్చాను. మోటుగా ఉన్న జనపనార కూరి తలగడలు తయారుచేశాను. ఇప్పుడు సున్నితమయిన తలగడలు చాపలుఉన్నా, నేను ఆ రోజుల్లోకన్న ఎక్కువసేపు నిద్రపోవడం లేదు. నాటికి, నేటికి నాకేవిధమయిన తేడా కనిపించడంలేదు.

"నా జీవితంలో ఎంతటి విచిత్రమయిన సంఘటనలు జరిగాయి! గోలాఫ్ జోగేన్ మాలతో బాటు మరికొందరు ఆ సంఘటనలన్ని బాగా ఎరుగుదురు! ఏదయినా ఒక పని జరిగితే బాగుండునని నేను అనుకునేదాన్ని! ఒక్కొక్కప్పుడు ఏవయినా తినుబండారాలు తినాలని కూడా అనుకుంటూ ఉండేదాన్ని. ఆ భగవానుడు నా కోరికలన్ని ఏదో విధంగా నెరవేరుస్తూండేవాడు!

ఆహా! దక్షిణేశ్వరంలో ఆ రోజులెంతో అత్యద్భుతంగా సాగిపోయాయి తల్లీ! ఠాకూరు ఆ రోజుల్లో కీర్తనలు, పాటలు పాడుతూండేవారు! నేను నా గది తడకల వెనకాల గంటల తరబడి చేతులు రెండు జోడించి నిలబడి ఆనంద పారవశ్యంతో ఆలకిస్తూండేదాన్ని. అవి ఆనందం తొణికిసలాడిన దివసాలు! రాత్రింబవళ్లు అదే పనిగా జనం వస్తూండేవారు! ఆ భగవానుని గురించిన ప్రసంగాలే జరుగుతూండేవి! పాపం,

కష్టమన్న పిల్లవాడు తాను సంసార కూపంలో పడిపోగలనేమో అన్న భయంతో ఆత్మహత్య చేసుకున్నాడు! "ఆ పిల్లవాడు ఆత్మహత్య చేసుకున్నాడు గదా! అది పాపం కాదా?" అని శిష్యుడు ఒకడు ప్రశ్నించాడు. ఠాకూరు దాని మీద "ఆ పిల్లవాడు భగవానుని కోసం తన శరీరం విసర్జించాడు గదా! అది పాపమెలాగ అవుతుంది. అయితే నేనిప్పుడు నీతో చెప్పిన, మాట ఇంకెవ్వరితోను అనవద్దు! అందువల్ల నిన్ను అపార్థం చేసుకునే అవకాశముంది!" అన్నారు. అయితే ఈనాడు ఆయన మాటలన్ని అచ్చుపడిపోయాయి!"

అమ్మ తిరిగి ఇంకా ఇలాగన్నది.

మనస్సు ఒక మదించిన ఏనుగువంటిది తల్లీ! అది ఝంఝామారుతంలా ముందుకురుకుతుంది! అందువల్ల ఎల్లప్పుడు మంచి చెడుగుల వివేచన చాలా అవసరం! అంతేకాదు! ఆ భగవానుని సాక్షాత్కారం కోసం రాత్రింబవళ్లు ఎంతో కష్టించి సాధన కొనసాగించాలి! ఆ సమయంలో నా మనస్సు ఎటువంటి పరిస్థితిలో ఉండేదంటే రాత్రివేళ ఎవరయినా మురళి మ్రోగిస్తూంటే నా మనస్సు ఆనంద తన్మయతతో ఉద్రూతలూగుతూండేది! అదీ, నేను దక్షిణేశ్వరంలో ఉన్నప్పటి పరిస్థితి! ఆ భగవానుడే, వేణువు ఊదుతున్నట్టు నాకనిపిస్తూండేది! ఆ తరుణంలో వెంటనే నేను సముద్రంలోనికి, వెళ్ళి పడేదాన్ని! ఆ తరువాత బేలూరులో ఉన్నప్పుడు కూడా నా కెంతో హాయిగా ఉండేది! ధ్యానవాతావరణంతో బేలూరు ఆ సమయంలో ఎంతో ప్రశాంతంగా ఉండేది. అందుచేతనే నరేంద్రుడు బేలూరులో తనకొక స్థానం ప్రత్యేకించాలని కోరుతూండేవాడు. ఇప్పుడు నేనున్న ఇల్లు నలుగు కాటాల నేలలో నిర్మించారు. [కలకత్తాలో ఉద్బోధన, కార్యాలయము] ఇది కేదారదాసు ఇచ్చిన భూమి.

పేరొకనాడు అమ్మ ఉద్బోధన కార్యాలయంలో ఉత్తరపు వైపు వరాండాలో కూర్చున్నది. ఆ సమయంలో ఒక యువకుడు అక్కడికి వచ్చి అమ్మతో, ప్రసంగించడం ప్రారంభించాడు. అతడు సామాన్య సాంసారిక జీవితం గడుపుతున్నాడు. ఆ యువకుడు శారదామాత చరణాలమీద శిరస్సుంచి, విన్నవించాడు.

"అమ్మా, జీవితంలో నేను అనేక విధాలయిన యాతనలనుభవించాను. అయితే నీవే నా గురుమూర్తివి! దైవతానివి! ఇంతకన్న నాకేమి తెలియదు! నీ దగ్గిర కూడా విన్నవించుకోలేని దుశ్చర్యలెన్నో చేశాను నేను! కాని నీ కరుణ సర్వదా నన్ను సంరక్షిస్తూనే ఉన్నది!"

మాతృదేవి అతని తల నిమురుతూ, "తల్లికి తనయుడు ఎల్లప్పుడు తనయుడే!" అంటూ ఓదార్చింది! దానిమీద అతడన్నాడు. "అవును తల్లీ! నేనెరుగుదును! నీవల్లే నాకింతటి కారుణ్యం లభించింది! కనక నీ దయ అంత తేలికగా లభించగలదని నేనెన్నడు భావించకుందును గాక!"

19 సెప్టెంబరు, 1918. సాయంత్రం ఎనిమిది గంటలయింది. అమ్మ పరుపు పక్కనే నేలమీద ఒక చాప పరిచారు. మాతృదేవత దాని మీద మేను వాల్చడానికి సిద్ధపడుతూంది. నేనక్కడికి వెళ్ళగానే ఆమె "రా అమ్మా! నా దగ్గిర కూర్చో! చూడమ్మా, సరళా! ఈవిడకేమయినా ఫలహారం తీసుకురా! పగలంతా చాలా కష్టపడి పనిచేసి వచ్చిందీమె!" అని ఆనందంతో అన్నది. నేను వద్దు వద్దని అంటున్నా అమ్మ వినిపించుకోలేదు

"ప్రతి వారు తమ ఆరోగ్యం జాగ్రత్తగా కాపాడుకుంటూ ఉండాలమ్మా! సమతకేసి

చూడు! ముగ్గురు పిల్లలు కలగగానే ముసలి దయిపోయింది!'' అన్నది.

ఆ తరవాత అమ్మ తన ఒళ్ళు వాపుల సంగతి ప్రస్తావించి ఇలాగన్నది.

''దీనికర్థమేమిటి? చాలా మందికి ఇలాంటి వాపులు వస్తూంటాయి, పోతుంటాయి. కాని నా ఒంట్లో ఏదయినా రుగ్మత ప్రవేశిస్తే అది నా ఒళ్లు విడిచిపెట్టి వెళ్ళడానికి ఇష్టపడదు! తమ దర్శనంకోసం వచ్చిన వారి దుఃఖాలు, రోగాలు, తమను స్పృశించిన వారి వేదనలు, తమ శరీరంలోనే నివసిస్తూంటాయని, అవి మరి విడిచి వెళ్ళవని ఠాకూరు అంటూండేవారు! నా వ్యవహారంలో కూడా సరిగా అలాగే జరుగుతున్నదని అనుకుంటాను.

ఠాకూరు జబ్బుగా ఉన్న సమయంలో కొంత మంది శిష్యులు దక్షిణేశ్వరంలో అమ్మవారికి నివేదించడానికని కొన్ని నైవేద్యాలతో వస్తూండేవారు. కాని ఠాకూరు కాశీపూరులో ఉన్నారని విని, వారు తిన్నగా అక్కడికివచ్చి, ఆయన చిత్రపటానికి ఆ పదార్థాలన్ని నివేదించేవారు. ఠాకూరు అది గమనించి ''జగన్మాత కుద్దేశించిన ద్రవ్యాలు నాకు నివేదించడం చాలా తప్పు!'' అని అంటూండేవారు.

'అయన అంతటి జబ్బు పరిస్థితిలో వున్నప్పుడు అటువంటి పని చేస్తే ఏమి జరుగుతుందో!' అని నేను చాలా కంగారు పడుతూండేదాన్ని! 'ఎందుకలాంటి పని చేస్తారు' అని కంగారుపడుతూండేదాన్ని. కాని ఆ తరువాత, ఆ రాత్రి వేళ ఆయన నాతో యిలాగన్నారు. ''అనవసరంగా ఆత్రపడకు. క్రమ క్రమముగా ప్రతిఇంట అర్చనలర్పిస్తూంటారు. జనం ఈ శరీరాన్ని ''

అంతకుమును పెన్నడు ఆయన తమరిని గురించి ''నేను'' అని నిర్దేశించి వుండలేదు. ఈ తలగడ, ఇది, అనిమాత్రమే తమ శరీరాన్ని గురించి నిర్దేశిస్తూండేవారు. ఆయన తమ దేహాన్ని గురించి ఆ విధంగా ప్రసంగించడానికి అదే మొదటిసారి!

ఈ జీవితంలో నాకు అనేక విధాలయిన మనుష్యులతో పరిచయం కలిగింది. రాణీ రాసమణి పౌత్రుడు త్రైలోక్యుడు నాకు నెలకేడు రూపాయలిచ్చేవాడు. ఠాకూరు పరమపదించిన పిమ్మట దక్షిణేశ్వర దేవాలయం ఖజానాగుమాస్తాతో మరికొందరు ఏకీభవించి ఆ సొమ్ము నాకివ్వకుండా నిలిపివేయించారు చాలా మంది బంధువులు కూడా నేను చాలా సాధారణ పని తననీ నా సంగతే ఆలోచించక వారందరితోను ఏకీభవించారు. నాకిచ్చే సొమ్ము నిలిపించవద్దని నరేంద్రుడు వారికనేక విధాల నచ్చజెప్పాడు. అయినా వారందరు ఆ సొమ్ము నాకివ్వకుండా నిలిపివేయించారు. కాని చూడమ్మా ఠాకూరు ఆశీర్వాదంవల్ల నేనెన్నడు సొమ్ముకోసం రవంతయినా ఇబ్బంది పడలేదు! ఎందుకలాంటి ఇబ్బంది కలుగుతుంది, భగవానుని స్మరించే వారికి ఎన్నడు ఎటువంటి లోటురాదని ఠాకూరు నాతో అంటూండేవారు.

ఆయన పరమపదించిన తరవాత ''ఠాకూరు దుస్తులు ఎవరు తీసుకోవాలి?'' అన్న విషయంపై వివాదం చెలరేగింది. ఆయన వస్త్రాలన్ని ఎంతో జాగరూకతతో భద్రపరచేవారికే నిజంగా ఆ దుస్తులన్ని చెందాలి. చిట్ట చివరికి శిష్యులే ఆయన దుస్తులన్ని మూటకట్టి ఒక పెట్టెలోఉంచి ఆ పెట్టె బలరాంబాబు ఇంటి మధ్యగదిలో ఉంచారు. కాని ఆ భగవానుని సంకల్పం ఎటువైపున్నదో ఎవరికి తెలుస్తుంది!

ఆ ఇంటి పనిమనిషి ఒకడు ఆ పెట్టె రహస్యంగా తెరిచి ఆ దుస్తుల్లో చాలావరకు కాజేసి అవన్ని విక్రయించి సొమ్ము చేసుకున్నాడు. ఆ ఇంటి మధ్యగది అటువంటి వస్తువులుంచడానికి తగిన ప్రదేశంకాదు. ఆ పెట్టె నలుగురూ కూర్చునే చోటకాక, వేరొక గదిలో భద్రపరిచి ఉండ వలసింది. ఆ విధంగా పోగా మిగిలిన దుస్తుల్లో కొన్ని మాత్రమే ఇప్పుడు బేలూరు మఠంలో ఉన్నాయి.

మా మామగారు చాలా నియమనిష్ఠలున్న ధృఢచిత్తులు. ఆయన ఎవ్వరివద్ద నుండి దాన ధర్మాలు స్వీకరించేవారు కారు. ఇంటికి ఎవర యినా ఏమయినా వస్తువులిస్తామని వస్తే అవి స్వీకరించరాదని గట్టి కట్టడి చేశారాయన. అయితే ఎవరైనా ఏవస్తువయినా రహస్యంగా తీసుకువస్తే మా అత్తగారు ఒక్కొక్కప్పుడు అది స్వీకరించి దానితో వంటచేస్తూండేవారు. ఆ పైన కులదైవతం రఘువీర్‌కు అది నివేదించి ఇంట్లో అందరికీ వడ్డించేవారు. కాని మా మామగారికి ఆ సంగతి తెలిస్తే భగ్గుమని మండి పడేవారు!

మా మామగారికి భగవానునిమీద అచం చలమయిన భక్తివున్నది. శీతలాదేవి మీద కూడా అటువంటి భక్తి ఏర్పడింది. ఆమె ఎప్పుడు ఆయననంటిపెట్టుకుని తిరుగుతుండేది.

మా మామగారు తెల్లవారుజామునే లేచి పూలు సేకరిస్తూండేవారు. ఒకనాడాయన పూలకోసం లాహాల తోటలోకి వెళ్ళారు. ఆ పైన ఇంచుమించుగా తొమ్మిదేళ్లున్న ఒక బాలిక ఆయన దగ్గిరికి వచ్చి "బాబా! మీరు ఇటు కేసి రండి! ఈ కొమ్మలన్ని పూలతో ఒరిగి పోతున్నాయి. నేనా కొమ్మలు వంచి పట్టు కుంటాను, మీరు పూలు కోసుకుందురుగాని!" అని ప్రోత్సహించింది. దానిమీద ఆయన "ఇంత పెంద్రాళ్లే ఇక్కడికి వచ్చావే! ఎవరి అమ్మాయివమ్మా నీవు?" అని ప్రశ్నించారు. దానిమీద ఆ బాలిక "నేనే హావల్దారుల అమ్మాయిని!" అని సమాధానం చెప్పింది.

ఆయన అంతటి సాధువర్తనులు కనకనే భగవానుడే ఆయన కుమారుడయి అవతరిం చాడు. ఆయన వచ్చిన తరవాత ఆయన అను చరులందరు అటుపిమ్మట వచ్చారు. నరేన్, రాఖాల్, బాబూరామ్, భవనాథ్, మన్మోహన్ మొదలయిన వారందరు ఆయన అనుచర వర్గంలోని వారే! ఇంకా ఇటువంటి ఎంతో మంది వున్నారు.

హరిదాసి అన్న అమ్మాయి నవద్వీప్ వెళ్ళే దారిలో కామార్పుకూరు వచ్చి అక్కడ బస చేసింది. నేనంటే ఆమెకెంతో భక్తి ఆత్మీ యత ఏర్పడ్డాయి. ఆమె నమ్మిక ఎంత మహ నీయమయినది! ఠాకూరు జన్మస్థలంనించి ధూళి సేకరించి అది ఎంతో జాగ్రత్తగా భద్ర పరుచుకున్నదామె. హరిదాసి అప్పుడప్పుడు "గౌరాంగ ప్రభువు జన్మించిన నవద్వీప మిదే. ఇక వేరే ఇంకొక నవద్వీపానికి వెళ్ళవలసిన అవసరమేమిటి?" అని అంటూండేది. ఆమె నమ్మిక, భక్తి ప్రపత్తులు అంత లోతయినవి!

ఠాకూరు పరమపదించిన పిమ్మట సర్వ సంగ పరిత్యాగి అయిన ఒక సన్యాసి ఒరిస్సా నించి వచ్చి కామార్పుకూరులో ఉండి పోయాడు. నేనాయనకు బియ్యము, పప్పు దినుసులు మొదలయిన నిత్యావసర వస్తువు లన్ని అందిస్తూండేదాన్ని. పొద్దున్న, సాయం త్రము, ఆయన దగ్గిరికి వెళ్ళి "బాబుగారూ! సుఖంగా వున్నారా?" అని పలకరించేదాన్ని

ఆయనకొక పూరిల్లు నిర్మించడానికి నేను ఎంతో ఇబ్బంది పడవలసివచ్చింది. ప్రతిదినము ఆకాశం నిండా మబ్బులు కమ్ముకుని కుండ పోతగా వర్షం కురుస్తుందేమో అన్న భయం కలుగుతుండేది. నేనప్పుడు చేతులు జోడించి ప్రార్థించేదాన్ని.

"ప్రభూ! కొన్నినాళ్ళాగండి! ఆయన పూరిల్లు పూర్తి అయిన తరవాత ఎంతగా కురిపించాలంటే అంతగాను వాన కురిపించ వచ్చును!" మా పల్లె ప్రజకూడ పూరిల్లు నిర్మించడానికి కావలసిన సామగ్రిలో చాలా భాగం సాయం చేసింది. ఆ పూరింటి నిర్మాణం ఎలాగో పూర్తి అయింది. అయితే మరికొన్ని రోజులలోనే ఆ సన్న్యాసి ఆ పూరింటిలోనే మరణించారు.

(సశేషం)

# వేదము

వేదర్షియగు వామదేవుడు ఒకసూక్తమును "విధాతవగు నోయగ్నీ! జ్ఞానవంతుడవును కవియును నైన నిన్నుద్దేశించి (విదుషేతవయే) ప్రాపకములు (నీదాని) 'గుహ్యార్థ'ములును (నిణ్యా) ఉద్ఘాటింపవలసిన యర్థము కలట్టివియును (నివచనా) అగు ఈ పలుకులెల్లను (విశ్వావచాంసి) జ్ఞానముచే ప్రేరితుడనై (విప్రః) మననముల తోడను (మతిభిః) ఉచ్చారణములతోడను (ఉక్థైః) స్తవముగా నుడివినాను (అశంపిషం)" 8-101-15; 1-189-8; అని ముగించినాడు. ఈ గుహ్యార్థముద్ఘాటింపఁబడినదా?

ప్రళయమునందు నష్టమైపోయిన వేదము, విష్ణువుయొక్క ప్రథమావతారముచే ఉద్ధరింపఁబడెనని, యుగాంతములందంతర్హితమైపోవు శ్రుతి యుగాదులయందు స్వయంభువు అగు బ్రహ్మచే ఋషులద్వారమున ఆవిష్కృతమగునని, ద్వాపరాంతమున కృష్ణద్వైపాయనుఁడగు వ్యాసుఁడు మంత్రములను సమీకరించి సంహితల నేర్పాటుచేసెనని చెప్పెడు సాంప్రదాయికుల యీ గాథలయందు మంత్రములును, వాని యర్థమును మఱుఁగు పడిపోవుచుండగా దానిని నిలుపుటకై చేయఁబడిన ప్రయత్నములు సూచింపఁబడినవని మనమూహింపవచ్చును. 'మంత్రముల కర్థమే లేదు' అని కౌత్సుని మతమనిచెప్పి, యాస్కుఁడు "స్థాణువుయొక్క అపరాధముకాదోయీ, అంధుడు దానిని చూడలేడేని అని యీ మతమును ఖండించుచున్నాఁడు. మంత్రార్థము లుప్తప్రాయమైపోయిన దశయందును మఱల దానిని నిర్ణయించి ప్రచారముచేయుటకు యత్నము జరుగకపూర్వమును కౌత్సునిదిగాఁ జెప్పఁబడిన యిట్టి వాదమంకురించియుండును. మంత్రములనవగతములై పోవుట చాలమారులు తటస్థించినది, వానియర్థము నుద్ధరించుటకు ప్రయత్నించుట చాలమారులు జరిగినవి. అట్టి యుద్ధరణప్రయత్నమును యాస్కాచార్యుఁ డొకమాటు నిర్వహించినాడు: అంతకుపూర్వము బ్రాహ్మణములందొకమారు నిర్వహింపబడినవి; ఇటీవల పదునాల్గవ శతాబ్దమునందు వైదికమార్గప్రవర్తకుఁడైన శ్రీ వీరబుక్కభూపాలుని యాజ్ఞచేత విజయనగర సామ్రాజ్యధురంధరుఁడైన సాయణాచార్యునిచే నిర్వహింపఁబడినది.

మంత్రయుగముయొక్క వాఙ్మయమునందు లుప్తమైపోవఁగా మిగిలినభాగము సంహితయని సహజ కారణములబట్టియు సంప్రదాయమునుబట్టియు ఊహ చేయవచ్చును. కాని యీ మంత్రయుగమెంతకాలము వ్యాపించినది, కాలక్రమమున నీ మంత్రములు భాషపరిణామమునననుసరించి యెంత సంస్కరింపఁబడినది నిర్ణ యించుటకవకాశములేదు. పెక్కు పురుషాంతరముల ఋషులు సూక్తద్రష్టలుగాఁ జెప్పఁబడియున్నారు. మఱియును 'పూర్వులగు పితరులు' మంత్రభాగములందు దివ్యులుగా, అర్ధదేవతలుగా స్తుతింపఁబడుచున్నారు.

—వేలూరి చంద్రశేఖరం.

# మంత్ర మహిమ

కాశావఝ్ఝల రామకోటిశాస్త్రి

దేవుని కృపకు పాత్రుడు కావలయుననిన భగవంతుని గూర్చిన మంత్రమే శరణ్యము. "మంతారం త్రాయత ఇతి మంత్రః" ఎవరైతే తనను మననము చేయుదురో అట్టివారిని శబ్దశక్తి చేతను, అర్థబోధన చేతను కాపాడుటయే మంత్రమనబడును.

మానవునకు ప్రేమనో, భయమునో, సుఖమునో, దుఃఖమునో, ఉత్సాహశక్తినో, ప్రభుశక్తినో, ఎట్టి యనుభవములు కలిగించవలెనన్న అందులకు పరమసాధనము ధ్వని. మనకంటె అధిక శక్తివంతులయిన దేవతా విశేషములకు మన అభీష్టములను విన్నవించి వారి వారి యనుగ్రహావిశేషములను మనకు కలిగింపఁజేయు ధ్వని విశేషములనే బీజాక్షరములందురు. వీటి సంపుటీకరణమునే మంత్రములందురు. వాయువు కంటే వేగవంతమైనది, శక్తివంతమైనది శబ్దము. శబ్దము కంటే వేగవంతమైనది, శక్తివంతమైనదియు కాంతి. కాంతికంటే వేగవంతమైనది, శక్తివంతమైనది విద్యుత్తు. విద్యుత్తుకంటే వేగవంతమైనది, శక్తివంతమైనది మానసశక్తి. మానసశక్తికంటే వేగవంతమైనది, శక్తివంతమైనది ఆత్మశక్తి. ఈ ఆత్మశక్తి శ్రియఃపతి సంబంధమగు పరాశక్తి యొక్క అంశమే.

కేవలము క్షణమునకు కొన్ని గజములు మాత్రమే ప్రయాణము జేయుగల శబ్దము విద్యుత్తుతో గలిసి శబ్దవిస్తరణ కేంద్రము ద్వారా ఆకసమున ప్రసరింపఁజేయఁబడినచో ఒక్క క్షణములోనే వేలకొలది మైళ్ళవఱకు ప్రసరించగలుగుచున్నది. ఆ శబ్దమే మానసిక శక్తితోను మఱియు ఆత్మశక్తితోను మేళవించి ఆత్మమనస్సుల కేంద్రమగు హృదయ కేంద్రముద్వారా ప్రసరింపఁజేయుబడినచో అది లోకలోకాంతరములవఱకు ప్రసరించి అచ్చట ఈ శబ్దమును స్వీకరించుటకుద్దేశింపబడినట్టి దేవతా విశేషములకందజేయును. కనుకనే శబ్దాత్మకములైన మంత్రములను పురశ్చరణ ద్వారా మానసిన ఆధ్యాత్మిక శక్తులతో మేళవింపఁజేసి జపించుటయను ప్రసారప్రక్రియ నవలంభించినచో తద్ద్వారా ఈ మంత్రములు తత్తదధిష్ఠాన దేవతలకు మన ప్రార్థనలను అందింపజేసి మన యభీష్టములను సిద్ధింపఁజేయుచున్నవి. దీనిచేతనే మంత్రశబ్దము సార్థకమగుచున్నది. మంత్రమనగా మననము చేయువానిని రక్షించునది అని పెద్దలందురు.

భగవత్కటాక్షమునకు కారణభూతములై భగవంతుని యొక్క స్వరూప, రూప, గుణ, విభవ, ఐశ్వర్య చేష్టాశక్తులను ప్రకటితము జేయునట్టి. బీజాక్షరములతో గూడుకొన్నట్టి మంత్రములు భగవన్మాత్ర లనఁబడును. ఇట్టి భగవన్మాత్రములనబడునది ఎన్ని? అసంఖ్యేయములు, అనూహ్యములు. ఏలననగా? భగవంతుని రూప, గుణ, విభవ, ఐశ్వర్య, చేష్టా శక్తులకు పరిమితసంఖ్య యున్ననేకదా తత్ప్రతిపాదకములగు మంత్రములకు పరిమితియు, సంఖ్యయునుండును. కాన భగవంతుని గుణములు, శక్తులు, చేష్టలు, అవతారములు వలెనే తత్ప్రతిపాదకములైన భగవన్మంత్రములును అసంఖ్యేయములు.

యతోవాచో నివర్తంతే అప్రాప్య మనసా సహ

భగవంతుని గుఱించి వేదపురుషుఁడే వాక్కులతోఁ చెప్పజాలకపోయెను. మనస్సులో నూహించజాలకపోయెను. అందుచే వేద వాక్కులు మనస్సుతోసహా ఆ భగవద్వర్ణనము నుండి విరమించుకొనవలసి వచ్చెను.

# జ్ఞాన విపంచి

## బద్వేలి రమేష్

ప్రియమైన ఆనందూ,

నీ గురించి వివరాలు తెలియడంలేదు. ఎప్పటికప్పుడు నీ విషయాలందరికంటే నా కెలాగో ఉంటుంది. ఏమిటో మన ఇద్దరి స్నేహంలో ఉన్న ఇది. ఎంతకూ అర్థంకాదు

ఈ మధ్య నేను నీకు ఉత్తరాలు వ్రాయ లేదుకదూ! నా ఆరోగ్యం ఇప్పుడంతంత మాత్రంగా ఉంది. మునుపటిలాగా నా జీవితం హుషారుగా లేదు. అప్పుడు నా వయస్సు ఏభయియయినా నేను పాతికేళ్ల కుర్రవాడిలాగ ఉండేవాణ్ణి. ఇప్పుడు నాకు ఏభయిఒకటి. ఈ ఒక్క సంవత్సరం పెరుగుదలలో నేను ఎంత తరిగిపోయాను!?

ఇక్కడ నాకు, యాంత్రికంగా పలకరించే వాళ్లు, సరయిన వేళలకు మందులిచ్చేవాళ్లు, నా తిండి తిప్పల్లో పొరబాటు రాకుండా జాగ్రత్తగా కనిపెట్టేవాళ్లు. ఓహ్! నేను బందీని ఖరీదయిన బందీని. నా ఇల్లు నాకు జైలులాగా ఉంది. ఈ జైలునుంచి నేను బయటపడాలంటే, నేను మృత్యువు ముంగిలిలోకి వెళ్ళాల్సిందే. నీకు తెలియదుగాని నా కిప్పుడు అనుక్షణం చావుగురించే యోచనలు. అయ్యో! ఇంత త్వరగా లోకం విడిచి వెళ్ళిపోవాలేయన్న బాధ నన్ను వెంటాడుతూంది.

జీవితంలో మరణం తప్పదా? దేవుడెంత కఠినుడు అని నిందిస్తూ గడపుతూంటాను. నా భావాలు నీకు నవ్వుపుట్టిస్తుంటాయి కదూ? నవ్వుకోరా. నీవు వేదాంతివి. నీ ధోరణే వేరు. బాగా నవ్వుకో.

నువ్వు త్వరగా రావాలి. నా యీ ప్రాణం పోయేలోగా నిన్ను చూడాలి. నీతో కల్సి గడపాలి.

మిగతా విషయాలు సమక్షంలో.

మూర్తి ఉత్తరాన్ని చదువుకొని, ఏదో నిశ్చయించుకొన్న వానిలా తల పంకించాడు ఆనందు.

కొమ్మలమీద ఒకటే అల్లరిచేస్తూ ఎగురుతూన్న గువ్వల్ని చూస్తూన్నాను. వాటి అరపులు మన కర్థంకావు. కాని అదొక భాష. ఆ భాష వాటికే తెలియాలి. ఐనా అవేవో ఊసులాడుకొంటున్నాయని, ఏవో సంకేతాలను అందచేసుకొంటున్నాయని అనుకోగలము మనం.

"ఈ చల్లగాలి ఒంటికి అంత మంచిది కాదంటే మీరు పట్టించుకోరు."

పెద్దకోడలు నిర్మల తెచ్చిపెట్టుకొన్న కోపంతో అంటూ నా భుజాలకి శాలువా కప్పింది.

"నాకీగాలి ఎంత బాగా ఉంటుందో, మీ కేం తెల్సునమ్మా?"

"మామూలు సమయంలో అయితే చాలా బాగా ఉంటుంది. మరిప్పుడు ఆరోగ్యం బాగా లేదు కదా!"

ఏదో జవాబు చెప్పాలనున్నా నేను చెప్పలేకపోయాను. కోడలు నవ్వుతూ చూసి నాకు మందు ఇచ్చింది. అయిష్టంగా తీసుకొని త్రాగాను. ఆమె వెళ్ళిపోతూంటే కృపాను పంపమని అడిగాను

"వాడెందుకు మామయ్యా! అసలే ఆకతాయివెధవ. మీదపడి కోతిలా గెంతితేగాని వానికి తోచదు. మీరు భరాయించలేరు." నిర్మలమాటలు నాకు కోపం తెప్పించాయి.

"ఎలాగూ త్వరగా ఛస్తాను. నా రాజీగా నన్ను బ్రతకనివ్వండి

"అబ్బ! ఏమిటాపశకునం మాటలు; మంచి చెప్పినా కష్టమే మీతో? ఎప్పుడూ అలా చనిపోతానన్న ధోరణిలో, ఖేదంగా మాట్లాడ వద్దని ఎన్నిసార్లు చెప్పాను? పుటక ఉన్నాక చావు తప్పదుకదా? తెలిసి తెలిసీ పెద్దలైన మీరే ఇలా మాట్లాడ్డం చిత్రంగా ఉంది!"

'రేపో మాపో వెళ్ళేవాణ్ణి, నా తొందర నీకేం తెల్సును?

"ఎవరు ముందు ఎవరు వెనక ఎవరికెరుక మామయ్యా. చావు లిస్టు ఎవరికీ తెలియదు. మీరు ప్రశాంతంగా ఉండాలి. భగవంతుడు ఎన్నో అనువులు మనకేర్పాటు చేసినప్పుడు లేనిపోని యోచనల్లో ఉన్న అమరికను చెరుపుకోవడం ఎందుకు? చిన్నదాన్నని చులకనగా తీసుకోకండి. మీరు ధైర్యంగా ఉండాలి. అప్పుడే అంతా బాగా ఉంటుంది."

ఇంకా నిర్మల నాకేదో చెబుతూంది. ఇంతలో "మీ స్నేహితులు ఆనందులు వచ్చారు"ని మా అబ్బాయి వచ్చి చెప్పగా నేను సంబరపడుతూ లేచాను.

ఆనందుడి ఎత్తయిన విగ్రహం. నాయంత వయసే వాడిది. అయినా నాకన్న ఆరోగ్యంగా అగపిస్తాడు. పాలనురగలాంటి దుస్తు లేసుకొని ప్రశాంతంగా నన్ను చూస్తున్న ఆనందు నా కళ్ళకు దివ్యజ్యోతిలా తలపించాడు. వాని కళ్ళలోని నిలకడయిన వెలుగు నాకెంతో తృప్తి నిచ్చింది. పరస్పరం కుశలప్రశ్న లేసుకొన్నాము. ఎంతోసేపు సంభాషణం చేశాము.

రాత్రయింది. మసక వెన్నెల ఆకాశంలో వెలుగుతూంది. ఇంతలో భోజనానికి పిలుపు వచ్చింది. నాకూ, ఆనందుకు కోడలుపిల్ల వడ్డిస్తూంది. ఆనందుకు మైసూర్ పాక్ వడ్డించింది. బహుశ ఆనందు వచ్చాడని ఈ సంబరం చేశారు కాబోలు. నాకు మైసూర్ పాక్ పడ లేదు. నేనడగలేదు. పైగా నేను తినకూడదని ఆనందుతో చెప్పాను.

లోపలమాత్రం నాకు కోడలుపిల్లమీద కోపం చిమ చిమలాడుతూంది. అదే నా భార్య ఉంటే నన్నిలా ఆరడిపెట్టేదా అనుకున్నాను. నా భార్య చనిపోతూ— "మీ ఒడిలో ఇలా నేను మరణించడం నాకెంత ఆనందంగా ఉందో-"అన్న తుదిమాటలు గురుతొచ్చాయి. చివరికి మరణంపట్ల దానికి లేని భయం నాకెందుకు కల్గుతుందో, నేనంత అజ్ఞానినా?

భోజనం ముగించినాక నేనూ ఆనందు చాలాసేపు మాట్లాడుకొన్నాం. ఈసారి ఆనందు తను భవిష్యత్ లో చేయదల్చుకొన్న సంగతులన్నీ ఏకరువుపెట్టాడు. వాడి ఉత్సాహం నాకెంతో ముచ్చటేసింది. అలాగే వింటూ వుండిపోయాను.

## 3

రెండు రోజులు ఆనందుతో బాగా గడిచాయి. రేపో మాపో వెళతానని వాడన్నాడు. వానికెన్నో పనులు, వాడు సామాన్య వ్యక్తి కాదు. ప్రతినెలా కొద్దిరోజులు వేదాంత సంబంధమయిన ఉపన్యాసాలు పలుచోట్ల ఇస్తూంటాడు. అలాంటి వ్యక్తిని సాదాగా తనతో ఉండమనడం ఉచితం కాదన్పించింది. అందుకే మౌనంగా అంగీకరించాను. వాడు వెళ్ళిపోయాడు. వెళుతూ నాతో అన్నమాటలే ఇంకా రింగుమంటున్నాయి.

"నీ బాధను నేను తప్పించగలనా! నీ బాధను నువ్వనుభవించాల్సిందే. ఆ బాధను

భరించగలశక్తిని మొదట సంపాదించు, జీవితాన్ని జ్ఞానిలా పరిశీలించు'' అన్నాడు.

అవాళ మా ఇంట్లో అంతా ఫోటోలు తీయించుకొంటున్నారు. ఫోటోగ్రాఫర్ ఓపిగ్గా ఫోటోలు తీస్తున్నాడు. కొడుకులు కోడళ్ళు నన్నూ రమ్మన్నారు. నేను రానని మొండికేశాను. నాకు తెల్సు వీళ్ళంతా నాతో కల్సి ఫోటోలు తీయించుకోవాలని నిశ్చయించుకొన్నారు. నేను త్వరలో చనిపోతానని వీరికి తెలుసు. నాకేదైనా పెద్దవ్యాధి రాలేదుకదా! వెంటనే డాక్టరుకు ఫోను చెయ్యబోయాను. నిజం తెల్సుకోవాలన్న తొందర, భయం ఇంకా ఏవేవో భావాలు ... వణుకుతున్న చేతితో డయల్ తిప్పుతూంటే నాకు ఉత్తరం వచ్చిందని, మనవడు కవర్ ఇచ్చిపోయాడు. అది తర్వాత చదవవచ్చునని డాక్టరుకు ఫోన్ చేశాను. అవతల డాక్టర్ విన్పించాడు. ఉన్న సంగతి తెల్పమని గట్టిగా అడిగాను.

అనవసరంగా గాభరాపడవద్దు. పిచ్చి పిచ్చిగా ఆలోచించకండి. ఇలాంటి విషయాలపై కాన్సంట్రేట్ (Concentrate) చెయ్యొద్దు బుర్ర నంటూ చదవసాగాడు. విసుగ్గా ఫోన్ పెట్టేసి ఉత్తరం ఎవరిదా అని చూశాను. ఆనందుది. ఉత్సాహంగా కవరు చింపి చదివాను. విషయం తెల్సాక నా ముఖం పాలిపోయింది. నా కొడుకును పిలిచాను. వాడు వచ్చాడు. ఫోటోగ్రాఫర్ వున్నాడా అన్నాను. ఉన్నాడని చెప్పాడు. పద మీతో బాటు నేను ఫోటో తీయించుకుంటాను. నా నిర్ణయం ఇలా మలుపుతిరుగుతుందని ఊహించని వాడు సంబరంగా చెప్పడానికి వెళ్ళాడు బయటకి.

ఆనంద్ ఉత్తరంలోని విషయమే పదేపదే గుర్తొస్తూంది. ఏమిటి ఆనందుకు బ్లడ్ కేన్సరా (Blood Cancer)! ఇక్కణ్ణుంచి వెళ్లాక అది బాగా ముదిరిపోయిందట. ఈ సంగతి నాతో అనలేదే ఇంత భయంకర సత్యాన్ని వాడెలా పొట్టలో దాచుకొన్నాడు. ఎంత స్తిమితంగా ఉన్నాడు!! నిజంగా ఆనందు జ్ఞాని. తెల్సుకుంటే జడుపు పుట్టించే వాని స్థితిముందు తన స్థితి ఏపాటిది. నేను నిజంగా ఒట్టి ఫూల్ (Fool), ఎంత పిరికివాణ్ణి!

''గ్రాండ్ ఫా...డాడీ పిలుస్తున్నాడు రావాలి'' అంటూ కృప వచ్చాడు. ఆలోచనలు చెదరిపోయాయి.

మనవడి చెయ్యి పట్టుకొని లేచాను. నాకు నా గురించి దిగులు లేదు; ఆనందుకు ఏమీ కారాదని మనసులో వుంది-ఇదేమి నీ వెర్రి? పండుటాకు రాలకుండా ఉంటుందా? అని ఆనందు నవ్వినట్లుగా అన్పించింది. ఆ నవ్వు నాలోని జ్ఞానవిపంచిని మీటింది. ఆ విపంచి రాగాలలో జీవితసమగ్రం నాకు విన్పించి నట్లయింది.

# భక్తిరస పరిపాకము

టి. కార్తికేయ శర్మ

భక్తి అన్నది రసాత్మక అనుభూతి. జనన మరణముల ఆవాగమన చక్రంలో పరిభ్ర మిస్తున్న మానవునికి ఉచ్ఛస్థితి కలిగించునది భక్తిరసామృత తత్వమే.

చావు పుట్టుకలు సృష్టిసహజాలు. పుట్టిన వాడు గిట్టక తప్పదు. గిట్టినవాడు పుట్టక తప్పదు. చావు పుట్టుకలనుంచి తప్పించుకొనుట అసాధ్యము. కావున జన్మ మరణాల పట్ల శోకించుట వివేకము అనుపించుకొనదు. ఈ సృష్టిరహస్యాన్ని తెలియచేస్తూ కృష్ణ పరమాత్ముడు పాండవ మధ్యమునితో ఇలా పలికెను—

జాతస్యహి ధ్రువోర్మృత్యుర్ధ్రువం జన్మ మృతస్యచ
తస్మాదపరిహార్యేఽర్థే న త్వం శోచితుమర్హసి

జీవులకు పుట్టుట-గిట్టుట తప్పదు. జన్మించిన ప్రతి ఒక్కడూ ఈ జన్మ మరణ చక్రంలో తిరుగాడవలసినదే. అందుకే శంకరభగవత్పాదులు యిలా వాక్రుచ్చారు—

పునరపి జననం, పునరపి మరణం
పునరపి జననీజఠరే శయనమ్

దీనికి అంతమే లేదా? యీ సమస్యకు పరిష్కారం ఏమిటి? అన్న ప్రశ్నలు ఉదయించినపుడు పలువురు అమృతత్వసారమైన భక్తిరసపరిపాకాన్ని పరిష్కారమార్గముగా సూచించడము జరిగినది. మందు రోగాన్ని నివారిస్తుంది. మరి, ఈ జన్మ మరణాలన్న రోగాలను నివారించే శాశ్వత ఔషధం ఏమిటి? దీనికి సమాధానంగా పురుషసూక్తంలో ఇలా చెప్పబడినది.

త్వమేవమ్ విద్వానమృత ఇహ భవతి
నాన్యఃపంథా విద్యతే అయనాయ.

ఆత్మ స్వరూపాన్ని అవగతము చేసుకోవడమే ఈ సమస్యలకు పరిష్కారము. ఆత్మనెఱింగినవాడు, అమృతతత్వాన్ని అర్థం చేసుకొని, స్వీకరించగలడు. కఠోపనిషత్తులో ఇలా చెప్పబడినది.

యదా సర్వే ప్రముచ్యన్తే కామా యేఽస్య హృది శ్రితాః
అథ మర్త్యోఽమృతో భవత్యత్ర బ్రహ్మ సమశ్నుతే

హృదయము వాంఛాతీతమై, నిష్కల్మషముగా రూపొందినవాడు, ఆత్మతత్వాన్ని గ్రహించి బ్రహ్మస్థితిని పొందలగము.

''జన్తూనాం నరజన్మ దుర్లభమ్'' అన్నది ఆర్యోక్తి. 'జ్ఞానము' మానవుడికి ప్రసాదింపబడిన మహత్తర వరము. జ్ఞాన సహాయముతో ఆత్మపరిశీలన చేసుకోవడము ఎంతైనా అవసరము. ఆత్మజ్ఞానమే మోక్షముగా పరిగణింపబడుతుంది. మోక్షము ఉత్తమ పురుషార్థము ''భక్త్యా జ్ఞానమ్ ప్రజాయతే'' మోక్షము లేక ఆత్మజ్ఞాన సముపార్జనకు సాధనము భక్తి. కరుణరసాసముద్రుడైన భగవానుని ప్రేమించుటే భక్తి అనబడును. ప్రేమా-శ్రద్ధల సంయోగము భక్తి. భగవానుని సేవలో తొమ్మిది రూపాలు కానవస్తయి-1. శ్రవణము 2. కీర్తనము 3. విష్ణుస్మరణము 4. పాదసేవనము 5. అర్చనము 6. వందనము 7. దాస్యము 8. ఆరాధన 9. ఆత్మసమర్పణ. ఆత్మార్పణమే అనన్యభక్తి. ఆత్మార్పణము అంటే ఏమిటి? అమిత శ్రద్ధతో, నిరహంకార చిత్తముతో భగవంతుని ఆరాధించుటను 'ఆత్మార్పణ' లేక 'ఆత్మ నివేదన' అనవచ్చును. అందుచేతనే అట్లాటి వారిని నేను రక్షిస్తాను అని శ్రీకృష్ణపరమాత్మ పాండవ మధ్యమునికి అభయమొసంగెను—

అనన్యాశ్చిన్తయన్తో మామ్ యే జనాః పర్యుపాసతే
తేషాం నిత్యాభియుక్తానామ్ యోగక్షేమం వహామ్యహమ్

కిరీటి భగవంతుని శరణుజొచ్చినాడు—

"శాధిమామ్ త్వామ్ ప్రపన్నమ్... కాబట్టి, శరణన్న వానిని భగవంతుడే రక్షిస్తాడు.

వాంఛాతీతముగా, భగవానుని ఆరాధించుట అందరకూ సాధ్యమగునా? ఆయుస్సు, సమయాసమయముల పరిధిలో మానవుకు చిక్కకొని నాడా? అన్న ప్రశ్న పరంపరలు మానవుడిని అనునిత్యము వేధిస్తున్నవి. ప్రహ్లాదుడే ఈ ప్రశ్నలకు చక్కటి సమాధానము అతడు పసివాడు. పంచశరద్వయస్కుడు అయిన ప్రహ్లాదుడు ఆ చిఱుత ప్రాయములోనే భగవానుని శరణుజొచ్చి, ఆ భగవానునిలో తాదాత్మ్యము చెందుట జగద్విదితము.

ఏ కార్యమునైనా ఆచరించునపుడు భగవదర్పితము అనుకొని ఆచరించుట భక్తి. సాధనమువలన పనులు సమకూరుతాయి. వ్యర్థాలాపములకు దూరముగా యుండుట, సద్వర్తనము, సత్కార్యాచరణము, సార్వజనీన ప్రేమ– ఈ భావములే మనిషిని ఉచ్ఛస్థితికి చేరుస్తవి. దైవప్రార్థనవలన ఆత్మ నిష్కళంకమై ఉన్నతగతిని పొందుతుంది.

"There is no peace without the grace of God, and there is no grace of God without prayer. That is why I ask you all to observe the habit of prayer, prayer should proceed from the heart"

—M. K. Gandhi.

భగవంతుని కృపాకటాక్షము లేనిదే శాంతి అలభ్యము. ప్రార్థన ద్వారా శాంతిని పొందగలము. ఆ ప్రార్థన కూడ నిలకడయైన మనస్సుచేత చేయబడవలయును. చర్చిలో గాంధీ మహాత్ముడు యింకా యిలా అంటారు.

"నిజానికి, కష్టకాలములో నా మనసుకు శాంతి కలిగించునది దైవప్రార్థనయే. నిరాశలో ఆవృతమైన మనస్సున ఆశాజ్యోతి వెలిగించునది భగవత్ప్రార్థన. ప్రార్థన లేకున్న నేను పిచ్చివాడిని అయిపొయ్యెడివాడను."

భక్తి రసామృతసారాన్ని గురించి చర్చించే ఈ సమయంలో జీసస్ క్రీస్తు పలికిన పలుకులు జ్ఞాపకము ఉంచుకొనదగినవి.

"ఓ మానవుడా! యీ రోజో లేక రేపో మరణించక తప్పదు. కావున మోసపోకుము. చెడు సహవాసములను త్యజింపుము. జాగ్రత్తగా వర్తించుము. పాపములను విడనాడి భగవానుని ధ్యానించుము."

భక్తిని గురించి బుద్ధ భగవానుని పలుకులు ఇవి– "శిష్టాచారము అన్నది భక్తికి మూలము (విత్తువంటిది). భక్తి వర్షసాదృశ్యము. ప్రయత్నము లేక కార్యాచరణము నాగలివంటిది. వివేకము ఎద్దులాంటిది. మనస్సు కళ్లెముతో సమానము. శ్రద్ధ అనే కొరడా చెడుత్రోవ నుంచి మంచి మార్గమునకు మరలించు సాధనము. ఈ ఉపకరణములతో భ్రమనాశము అను వ్యవసాయ మొనర్చిన భక్తిరసామృతము సిద్ధించును."

ఏకాగ్ర చిత్తముతో భగవంతుని ధ్యానించుట ద్వారా ఆత్మశాంతి, శాశ్వత ఆనందము సిద్ధించునని యింతవరకు చర్చించితిమి. సృష్టిలోని ప్రతిజీవి ఇందులకు అర్హమే. ఆత్మానందము పొందుటకు సన్యసించుట పరిష్కారము కాజాలదు. గృహస్థాశ్రమము స్వీకరించినవారు ఆత్మానందము పొందజాలరు అను అపవాదు లేకపోలేదు. కాని యిది భ్రాంతి మాత్రమే. యీ విషయ నిరూపణలో శ్రీరామకృష్ణ పరమహంస వ్యక్తీకరించిన భావములు స్మరింపదగినవి. —

"సాధకుడు గృహస్థు అయినను, గృహోపభోగములు అతనిని ఆకర్షింపజాలవు. అతడు

గృహస్థాశ్రమమును స్వీకరించినను కర్మిష్ఠుడై జన్మ సార్థక్యమునకు యత్నించును.''

యీ మార్గమునే అవలంబించి ఆయన జన్మ సార్థక్యత పొందినారన్నది అందరకూ తెలిసినదే.

వైజ్ఞానికముగా దేశము ఎంతో పురోగమించుచున్నది. ఇది ఎంతైనా ముదావహము. నైతికోన్నతి జరుగనినాడు, వైజ్ఞానికముగా పురోగమించిననూ, ఆ ఉన్నతి ఉన్నతిగా పరిగణింపబడజాలదు. ఆధ్యాత్మిక చైతన్యమే సంస్కృతి. దీనిని మరచుట అవివేకము. "Where Physics ends, there Philosophy begins" వైజ్ఞానిక ఉన్నతి చరమలక్ష్యము ఆత్మోన్నతి అన్న సత్యాన్ని మనము కాదనజాలము. ఎంత గొప్ప వైజ్ఞానికుడయినను భగవద్ధ్యానములోనే శాంతిని పొందగలడు అన్నది నిర్వివాదాంశము.

# గురువులను మించిన శిష్యులు

## చీమలకొండ ఉమారామలింగమూర్తి

వేదవ్యాసుడు వేదములను విభజించి వేదాంతసారమగు మద్భగవద్గీత అంతర్భాగముగా గల్గిన పంచమవేదమనబడు మహాభారతమును రచించుటయేగాక ప్రస్థానత్రయములో నొకటియగు బ్రహ్మసూత్రములకు కూడ ఆయనయే కర్తృత్వమును వహించెను. అట్టి బ్రహ్మజ్ఞాని పుత్రుడును శిష్యుడును అగు శుకుని వర్ణించుచు మద్భాగవతమును ఆంధ్రీకరించి అమరజీవియైన పోతన వ్రాసిన పద్యమును గమనింతము

శుకుడు గోచియులేక పైజన జూచి తోయములందు ం
జకు జలింపక చీరలొల్లక చల్లులాడెడి దేవక
న్యకలు హా శుకయంచు వెన్క జనంగ వ్యాసుని జూచి యం
శుకములన్ ధరియించి సిగ్గున స్రుక్కిరందరు ధీనిధీ

దిగంబరియు తరుణ వయస్కుడును అగు తన కుమారుని గని సిగ్గు చెందక వస్త్రములను ధరింపక, తాను ముదుసలి అయ్యును వస్త్రము ధరించియున్నను తనను జూచి లజ్జనొంది చీరలను ధరించిన దేవకన్యకలను చూచి వ్యాసుడు కారణమడుగగా వారేమి చెప్పిరో చూడుడు. "నీ పుత్రుడగు శుకుడు స్త్రీపురుషుల నెడు భేద దృష్టిలేక యుండువాడు. అతడు నిర్వికల్పుడు. అతనికిని నీకును చాలా తేడా కలదు.'' జితేంద్రియుడైన పుత్రుని గని వ్యాసుడు ధన్యుడాయెనని సూచింపబడినది. 'పుత్రాదిచ్ఛేత్ పరాజయమ్' అను వాక్యానుసారము తన పుత్రునిచే తాను జయింపబడవలెనని (తన పుత్రుడు తనను మించినవాడు కావలెనని) తండ్రి కాంక్షించుట స్వభావము. అటులనే తన శిష్యుడు తనకంటె అధికుడు కావలెనని గురువు వాంఛించుటయు సహజమే.

పై పద్యమును చదివిన నవీనులు ఇది పోతన కవితాచాతుర్యమేగాని, అసంభవమని త్రోసిపుచ్చుదురు. రామకృష్ణ పరమహంస యొక్కయు వివేకానందుని యొక్కయు జీవిత చరిత్రలను పరిశీలించినచో, ఇది ఉత్ప్రేక్ష కానేకాదనియు సద్గురువు కొరకు శిష్యులు తహతహలాడుటయు, మంచి శిష్యుడు ఎప్పుడు లభించునాయని గురువులు ఎదురుచూచుటయు వ్యక్తమగును. రామకృష్ణుడును వివేకానందుడును గురువులను మించిన శిష్యులెట్లైనది పరిశీలింతము.

వంశ పారంపర్యముగా లభించిన అర్చక వృత్తిని నిర్వర్తించుచు భక్తిమార్గము నలవరచుకొని రామకృష్ణుడు సుఖదుఃఖములను నిందాస్తుతులనుఅశ్మ కాంచనములను(రాతిని, బంగారమును) సమభావముతో చూచుచు ద్వంద్వాతీతుడయ్యెను. ఆధ్యాత్మికకృషియందు అంతటితో తృప్తినొందక కాళీమాతను సాక్షాత్కరింప చేసికొనవలెనను తీవ్రవాంఛతో నుండగా తంత్ర శాస్త్ర ప్రావీణ్యురాలగు భైరవి బ్రాహ్మణి దక్షిణేశ్వరము వచ్చుట తటస్థించెను. ఆమె, రామకృష్ణుని చూచినంతనే 'నాయనా! నీవు ఇచ్చట వుంటివా? నీకొరకే ఇన్నాళ్ళనుండియు వెదకుచు ఇచ్చటకు వచ్చితిని' అని చెప్పుట చూడగా తగిన గురువు కొరకు శిష్యుడును తగిన శిష్యుని కొరకు గురువును తహతహలాడుటయు, తగిన శిష్యుని వెదకికొనుచు గురువు వచ్చుటయు ద్యోతకమగును. ఆమె సహాయమున తంత్రవిద్యనభ్యసించి సవికల్పసమాధిని వశీకృతము చేసికొని రామకృష్ణుడు కాళీదేవి సాక్షాత్కారమును పొందెను. తాను వేరు కాళీదేవి వేరు అను ద్వైతభావము నశించనందున రామకృష్ణునికి ఇంకను తృప్తి కలగలేదు.

మరి కొన్నాళ్ళకు అద్వైత వేదాంతమున నిష్ణాతుడగు తోతాపురియను యోగిపుంగవుడు దక్షిణేశ్వరమునకు వచ్చుటయు రామకృష్ణుని కలయుటయు సంభవించెను. రామకృష్ణునికి అద్వైతవేదాంతమును నేర్పవలెనని అతనికి సంకల్పము కల్గెను. కాళీదేవి అనుమతిని రామకృష్ణుడు కోరగా అందులకే అతడు వచ్చెననియు తప్పక అభ్యసింపుమనియు ఆమె అనుమతించుట చూడగా తోతాపురి రామకృష్ణుని వెదకుచు వచ్చినట్లు కనుపించును. తోతాపురి వద్ద దీక్షను గైకొని ఆ ప్రకారము సాధనచేసి రామకృష్ణుడు ఒకేఒక రోజులో నిర్వికల్ప సమాధిని సాధించి బ్రహ్మసాక్షాత్కారము నొందెనట. నలుబది సంవత్సరముల నిరంతర కృషివలనగాని తనకు సాధ్యముకాని నిర్వికల్ప సమాధి తన శిష్యుడగు రామకృష్ణునికి ఒక్క రోజులోనే సాధ్యమగుటగాంచి తోతాపురి నివ్వెరబోయెనట. ఈ తీరున రామకృష్ణుడు పరమహంసయై గురువును మించిన శిష్యుడాయెను.

రామకృష్ణునికి అంతటితో కూడ తృప్తి కలుగలేదు. నిర్వికల్పసమాధి వలన బ్రహ్మసాక్షాత్కారమును పొంది తానొక్కడే ముక్తుడగుట స్వార్థమగునని అతడు ఎంచెను. సుప్రసిద్ధ ఫ్రెంచి రచయిత రోమారోలా (Romain Rolland) చమత్కరించినట్లు "She (Kali) threw him back to the shores of life from the depths of the ocean of Nirvi Kalpa Samadhi నిర్వికల్పసమాధి యను సముద్ర గర్భమునుండి పరోపకార జీవనమును ఒడ్డునకు కాళీమాత అతనిని నెట్టివేసెను'' సోదర మానవులపట్ల కేవలము దయాదాక్షిణ్యాల వలననే గాక మానవశరీరమను ఆలయములోనున్న భగవంతుని సేవించవలెనను దృక్పథముతో (మానవసేవయే మాధవసేవ యను దృఢ నిశ్చయముతో) ఆధ్యాత్మిక జ్ఞానము కార్యరూపమును దాల్చునట్లు సాంఘికసేవకు అంకితమయ్యెను. ధనికులగు మధుర్ దంపతులతో కాశీ అలహాబాదు మధుర బృందావనము ఇత్యాది పుణ్యక్షేత్రములను సందర్శించునపుడు క్షామమునకు గురియై ఆకలిబాధలకు అల్లల్లాడు వారిని, పంటలు విఫలమై ఈతిబాధలకులోనైన రైతులను చూచి, జాలిచెంది మధుర్ దంపతుల హృదయములో పరివర్తనము గావించి, దీనులను కాపాడుటలో రామకృష్ణుని సాంఘికసేవ ప్రారంభమయ్యెను. ఈ కృషిలో అతనికి విద్యా

ధికులును ధనసంపన్నులును సంఘసంస్కర్తలును అగు అనేకమంది పెద్దలతో పరిచయము కలెను.

అదే సమయమున ఆంగ్లవిద్యాపారంగతుడును మేధావియు వాగ్వాదపటిమయందు దిట్టయు ప్రాక్పశ్చిమ వేదాంత శాస్త్రములను క్షుణ్ణముగ అభ్యసించినట్టియు ఆధునిక విజ్ఞాన శాస్త్రాధ్యయనము చేసినట్టియు అయిన నరేంద్రుడు (వివేకానందుని పూర్వాశ్రమనామము) రామకృష్ణుని గొప్పతనమును గూర్చి విని అందలి యథార్థమును గ్రహించవలెనని, అతనిని సమీపించెను. నరేంద్రునిలో గోచరించు అసమాన ప్రతిభను గ్రహించిన రామకృష్ణుని భావములను ఒక సుప్రసిద్ధకవి ఇట్లు వర్ణించెను. పొదుగు నిండా పాలు గల ఆవు ఎచ్చటనోనున్న తన లేగదూడ కొరకు ఎట్లు తహతహలాడునో అట్లులనే రామకృష్ణుడు కూడ తగిన శిష్యుడు ఎప్పుడు లభించునాయని ఉవ్విళ్ళూరుచుండెనట. హేతువాదమునే నమ్మెడు నరేంద్రునకు రామకృష్ణునకు ఇట్లు సంభాషణ జరిగెను. "అయ్యా, తమరు దేవుని ఉనికిని నమ్ముదురా!" "ఆ". "ఎట్లు!" "నిన్ను చూచునట్లే దేవునికూడ దర్శింతును. అయితే ఇంతకంటె తీక్ష్ణమైన మరియొక విధమున చర్మ చక్షువులతో నరేంద్రుని దర్శించు విధముననే సమాధియందు జ్ఞాన చక్షువులతో దేవుని దర్శింతునని అతని అభిప్రాయము. నరేంద్రునికింకను నమ్మకము కలుగలేదు. అనేక సిద్ధులను బడసిన రామకృష్ణుడు ఒకనాడు నరేంద్రుని కాలి వ్రేలిని తన కాలివ్రేలితో నొక్కిపట్టి, తన అరచేతిని అతని శిరస్సుపై నుంచుసరికి తన ఆధ్యాత్మికశక్తి అతనిలోనికి ప్రసరించుటతోడనే నరేంద్రునికి సమాధిస్థితి లభ్యమై కుటుగుటతో అతని మనసు నందుగల సర్వ సందేహములు నశించి ఆస్తికుడాయెను. తనకు ప్రాప్తించిన ఆధ్యాత్మిక జ్ఞాన సంపదకు తగిన వారసుడు లభించెనని రామకృష్ణుడు సంతసించెను.

పరస్త్రీలయందేగాక తాను వివాహమాడిన శారదామణి యందు సైతము కాళీమాతను దర్శించి తన జితేంద్రియత్వమును చాటిన రామకృష్ణునికి ఒకమార్వాడీ పదివేలరూపాయలమొత్తమును సమర్పింపగా, రామకృష్ణుడు దానిని తిరస్కరించుటయేగాక ఆ మార్వాడీని మందలించెనట. తన గురువునకు కనకమునందుగల దృఢవైరాగ్యమును పరీక్షింపనెంచి, అతడు గదిలో లేనిసమయమున అతని పాన్పుక్రింద వివేకానందుడు కొన్ని నాణెములనుంచగా రామకృష్ణుడు తిరిగి వచ్చిన పిదప పాన్పుపై కూర్చుండుటకు సందేహించి ప్రక్కదులుపుసరికి ఆ నాణెములు బయటపడుట చూచి, చిరునవ్వుతో రామకృష్ణుడు వివేకానందునితో ఇట్లనెనట "యోగిని క్షుణ్ణముగ పరీక్షింపవలసినదే." అందువలన గురువాక్యములందు నమ్మకము ఉండవలసినదే. కాని అట్టినమ్మకము గ్రుడ్డినమ్మకము కారాదు. హేతువాదమునకు నిలబడిన నమ్మకము దృఢతరమగును. హేతువాదమును శ్రద్ధయు పరస్పర విరుద్ధములుగాక పరస్పర పూరకములుగనుండవలెను. They must be Complementary but not Contradictory), ఈ తీరున రామకృష్ణుని వేదాంతము వివేకానందుని చేతిలోపడుసరికి, బంగారమునకు పరిమళము అబ్బినట్లాయెను.

నిరంతర ఆధ్యాత్మిక కృషివలన కాలనియమము ప్రకారము నిద్రాహారములు లేనందున రామకృష్ణుని శరీరము కృశించుటయేగాక, అవిరళ కలవలన అతడు తీవ్రముగు క

వ్యాధికి గురిఅయ్యెను. ప్రాపంచిక జీవితము ఇక కొద్ది సంవత్సరములేయని అతనికి తోచినది. ఈ కాలముననే అతని ప్రియతమ శిష్యుడును భాష్యకారుడును అగు నరేంద్రుడు వచ్చుట తటస్థించెను. ప్రస్థాన త్రయమనబడు ఉపనిషత్తులు బ్రహ్మసూత్రములు భగవద్గీతలకు భాష్యములు వ్రాసి, అవి ప్రజలకు సుబోధకమగునట్లు ఆది శంకరులు కృషిచేసిన తీరుననే రామకృష్ణుని ఆశయమగు మానవసేవయే మాధవ సేవ యను సేవాధర్మమును ప్రపంచవ్యాప్తి గావించి అద్వైత వేదాంతము కైనందిన జీవితమందు కూడ ఆచరించుటకు సాధ్యమేయని ఋజువు చేసిన ఘనత వివేకానందునికి దక్కినది. రామకృష్ణ పరమహంసకును వివేకానందునికిని ఏర్పడిన దృఢానుబంధము హైందవ ఆధ్యాత్మిక శాస్త్రమునకు పుష్టిని చేకూర్చినది. చిన్నచిన్న ల ద్వారాను సామాన్య ఉపమానముల ద్వారాను రామకృష్ణుడు తన మాతృభాషలో బెంగాల్‌లో చేసిన బోధలు వివేకానందుని వాక్పటిమ ద్వారా హేతువాదమునకు నిలబడు అద్వైతవేదాంతబోధగామారి, హిందూ మతము, హిందూ సంస్కృతి ప్రాక్పశ్చిమము లందు వ్యాపింపబడుటయేగాక, రామకృష్ణుడు ఆశించిన మానవసేవ నొనర్చుటకు ఖండ ఖండాంతరముల అనేక రామకృష్ణమతములు స్థాపింపబడుటతో పాటు యావజ్జీవితమును అందులకు అంకితమొనర్చు సేవకులు లెక్కకు మీరి లభించుచు మానవసేవ ద్వారా మాధవ సేవ చేయుచునే ఉన్నారు. వేదాంతమను వాయువును రామకృష్ణపరమహంస వివేకానందుని శరీరములో ప్రవేశపెట్టగా దానికి స్వరము కల్పించి వాక్కును చేకూర్చి పాశ్చాత్యులకును పాశ్చాత్య వ్యామోహామునకు లోనైన హిందువులకును సులభ గ్రాహ్యమగునట్లుచేసి వివేకానందుడు గురువును మించిన శిష్యుడాయెను

## నర-నారయణ

దీవెనకోసం నేవచ్చాను
కరములు మోడ్చి నిలిచాను
ఈయరా దీవెనను గోవింద
మది నీకే అంకితం స్వామి.

హృదయంలోన కలతలు రేగె
కన్నులలోన కాంతులు తొలిగె
వెన్నెల వన్నెల చిన్నెలు చేపి
నన్ను దరిచేర్చరా స్వామి
వేకువలోన చీకటిలోన
తీరము దొరకని పయనములోన
నారాయణ సన్నిధి నరునికి పెన్నిధి
నర నారాయణ బంధమె అదిగా।

కృష్ణప్రియ

# భగవత్పూజనము యొక్క స్వరూపము

హిందీమూలం :

**శ్రీ జయకాంతజీఝా**

తెనుగుసేత :

**సూరంపూడి విశ్వేశ్వరరావు**

ఏకనాథుడు హృదయమునందు ప్రభు సందర్శనమును గాంచుచు గంగోత్తరీయొక్క పవిత్రజలములను కావడియందుంచుకొని తన మిత్రులతో కాశీమీదుగా రామేశ్వరమునకు పోవుచుండెను. అక్కడకుచేరి ఆ జలముతో ప్రభుని అభిషేకమొనర్చెడి తలంపుతో యీ యాత్ర సాగించుచుండెను. అది గ్రీష్మఋతువు. ఆ మధ్యాహ్నపు మండుటెండలో పిపాసపీడతో వ్యధితమైన ఒక గాడిదను అతడు యిసుక మైదానంమీద గాంచెను. ఆలస్యమొనరింపక కావడిని దింపి గంగోత్తరీపావన తోయములను ఆ గాడిద నోటియందుపోసి మరణాసన్నమయిన యాగాడిదను ఏకానాథుడు రక్షించెను. ఏకానాథుని యితర అనుచరులు మాత్రము యింత పరిశ్రమతో గొనితేబడిన యీ దుర్లభ జలము వ్యర్థమయినందులకు దుఃఖపడిరి. వారి యీ దుఃఖహేతువును గ్రహించిన ఏకనాథుడు వారికి యిట్లు వివరించెను—"ఏకమాత్రుడైన పరమాత్మ సర్వత్ర పరిపూర్ణుడై విరాజిల్లుచున్నాడు. నా పూజలను భగవానుడు ఇచ్చటనే స్వీకరించాడు" అని.

మనము విశ్వరూపుడయిన భగవంతుని పూజను మన దినచర్యయందు సమ్మిళితమొనర్చిననాడు మన జీవితములే పూజామయములు కాగలవు. మన పూజ సర్వాంగములను సంతరించుకొనును. భగవానుని పూజ సమాప్తిని చెందిన యనంతరము మనము స్వాయముగా ప్రసాదమును గ్రహింతుము. శీతము అనుభూతము కాగానే మన శరీరములను వస్త్రములతో కప్పుకొందుము. శరీరరోగ నివృత్తి కొరకు ఔషధసేవ యొనరింతుము. మున పూజించిన భగవానుడే వివిధ రూపముల మనపూజల నందుకొనుటకు వచ్చునన్న సంగతిని గుర్తింపము. ఆభగవానుడే భక్తుని రూపమున భిక్షకై కరుణాక్రందన చేయుచున్నాడు. ఆ భగవానుడు సుందరవస్త్రములలో అలంకృతుడయి పేదలకు వస్త్రదానమును గురించి ముచ్చటించుటకురాగా రెండవ రూపమున శీతబాధతో వ్యాకులుడైన యాచకునివలె ద్వారమువద్ద గోచరించుచున్నాడు. ఈ లాటి సందర్భములయందు ఆ భగవానుడే మననుండి వివిధ రూపముల అర్చనలను గొనుటకు వచ్చు విషయమును విస్మరించుచున్నాము. కావుననే వారిపట్ల మనము దుర్వ్యవహారమొనర్చుచున్నాము. సర్వవ్యాపకుడైన పరమాత్మ యొక్క జ్ఞానము లేకపోవుటచేతనే మన భగవంతుని పూజ అసంపూర్ణముగానే యుండిపోవుచున్నది.

శాస్త్రము ఇట్లు చెప్పుచున్నది—

ఏవకేన ప్రకారేణ యస్యకస్యాపి దేహినః
సంతోషం జనయేత్ ప్రాజ్ఞస్తదేవేశ్వరపూజనమ్॥

అనగా—ఏ సాధనవల్లనైనను ఏ దేహధారికైనను సుఖమునుకలిగించుటయే భగవత్పూజనము కాగలదు. అన్ని దేహములయందును జీవరూపమున ఒక్కడే ప్రభువు విరాజమానుడైయున్నాడు. కావుననే ఏ జీవికైనను సుఖమును కలిగించుట ఈశ్వరార్చనమే యగుచున్నది. పిపీలికాదులకు అన్నమిడుట అగణిత జీవరాసుల తృప్తిపరచుటయే కావున భగవత్పూజనమే అగుచున్నది. అదేవిధముగా క్షుదాపీడితులకు అన్నదానము చేయుట; ఆర్తాగ్రస్తులకు మధురమైన అనునయ వాక్య

ములతో బాధోపశమనము గావించుట; అశిక్షితులకు విద్యాదానమొసంగుట; వైద్యునిగా రోగులకుచికిత్సచేయుట. మృదుసంభాషణమున వారిని తుష్టులనుగావించుట నిజమైన అర్థములో భగవంతుని అర్చించుటయే అగుచున్నది. భగవంతుని పూజ యింత సులభమని మనకు గ్రాహ్యమయిననాడు ఏ రూపమునైనను సర్వవ్యాపకుని సేవించుటకు మన జీవిత సర్వస్వమును వెచ్చింపగలము. బాలురు-వృద్ధులు, విద్వాంసులు - మూర్ఖులు, స్త్రీలు - పురుషులు సర్వులూ యీ మార్గావలంబులు కాగలరు.

అప్పుడప్పుడు విశ్వరూపుడైన భగవంతుని పూజించుటకు యోగ్యములయిన సాధన మన వద్ద లేదనెడి భావన కలుగుచుండును. కాని యిది మన మనోభ్రమ మాత్రమే. వాస్తవమునకు మనయందు ఈశ్వరార్చనమొనర్చెడి వాంఛ యుండవలెను. ఆ వాంఛ యున్నచో మనద్వారా అయ్యెడి ప్రతి ఒక కర్మయందున భగవానుని పూజింపగలము. మనము దుకాణదారులమయిన మనవద్దకే తెంచెడి కొనుగోలుదార్లను భగవత్స్వరూపులుగా భావించి యుక్తమగు మూల్యమునకు సమ్మాన పూర్వకముగా వస్తువులను విక్రయింతుము. చికిత్సకులమయిన, రోగులయందు పరమాత్మను సందర్శింపగలము. ఉపాధ్యాయులమైన విద్యార్థులయందు విశ్వరూపుడు భాసించగలడు. మనము ఏ క్షేత్రమందున్నను ఏ పరిస్థితిలో ఏ పని చేయుచున్నను ఆయా క్షేత్రములయందు ఆయా పరిస్థితులలో భగవత్ సందర్శానుభూతిని పొంది ప్రతివ్యక్తిలోను భగవంతుని గాంచగలము. మన జీవితములను పూజామయమొనర్పసంసిద్ధులగుచో ప్రభుశక్తి మనలను సముద్ధరింపగలదు. ఏ వేషములో భగవానుడు మననుండి పూజలనందుకొన తలంచునో దానికి అనువగు పూజామసామగ్రిని మొదటనే మన వద్దకు పంపినట్లు అనుభూతము కాగలదు. ఆ సామగ్రులను మనస్ఫూర్తిగా ఉపయోగించుటవల్లనే మన జీవితములు పూజామయములు కాగలవు. ఈ విధముగా ప్రభువుని కలుసుకొనుట శీఘ్రముగా జరుగగలదు.

భగవానునితో మనకుగల సంబంధము అనాదియు, శాశ్వతమును ఏకరసమయియుండునదియును. ఈసంబంధము నిర్హేతుకము, నిర్మలము, అనంతమైన ప్రేమపూర్ణము. అందుచేతనే పరమేశ్వరుడు మనకు సర్వస్వదానమొనరించుచున్నాడు. ఆయన ప్రేమ శక్తి సామర్థ్యములకు పరిమితులు లేవు. ఆయన సర్వసమర్థుడు, సర్వజ్ఞాన శోభితుడు. అతీతవర్తమాన భవిష్యత్తులోని అణువణువూ ఆయనకు విదితమే. అగణిత విశ్వబ్రహ్మాండమున ఎప్పుడు ఎక్కడ ఏది జరిగెనో ముందు జరుగబోవునో ఆయనకు పూర్తిగా తెలియును. అందుచేతనే ఆయన సంకల్పమున ఏకొంచమును పొరపాటు జరుగదు. ఇట్టి సర్వేశ్వరునితో మనకున్న సంబంధము నెరిగి ఆయనపై విశ్వాసమును ఏకమాత్రముగానుంచి మన కార్యక్షేత్రమున దిగిన విజయము సంతోషము మనలను వరించుటకు సంసిద్ధముగా నుండును. మనద్వారా భగవంతుని నిజమైన పూజ జరుగును

ఇచ్చట ఆలోచించవలసిన విషయమొక్కటి. మనము నిత్యమూ మహామహిమగలభగవానునితో కలిసియున్నప్పుడు, ఆయన సర్వదా మన వెంట నుండునప్పుడు మనము ఆయనమీదనే ఎందుకు ఆధారపడియుండము? ఎందుచేతననగా మన అంతరాళమున విరాజిల్లెడు ప్రభుదేవుని మనము ఎరుగము గనుక. ఇంద్రియముల ప్రవాహము బయటనుండి అంతర్ముఖము కానంతవరకు భగవంతుని దిశకు

మళ్ళింపబడనంతవరకు మన యింద్రియములు తమ గుణములవైపునకే పరుగులు తీయుచుండును. మన హృదయములు తమోమయమయిన ఆ సురభావములతో నిండియుండును. ఏ కర్మలను చేయుటవల్ల ఈ జీవితమునందును జీవితానంతరము పరలోకమునందును కళ్యాణము జరుగుననెడి విషయము ఎప్పుడును తెలియదు. కావున మనము భగవంతుని యందు దృఢమైన సమ్మకమును కలిగియుండి గంభీరముగా యోచింపవలెను. హృదయము నందు భగవంతుని దివ్యజ్యోతి జాగృతమైనప్పుడు సమస్త విశ్వమునందు భగవానుడు విరాజిల్లుచున్నట్లును ప్రతిక్షణమునందున ఆయున ఉనికిని గమనించగలము. ఈ స్థితియందు స్వ-పర భేదములుగాని శత్రుమిత్ర భావములుగాని యుండవు. సర్వత్ర ఒక అఖండశక్తి, ఆత్మ శక్తి-భగవంతునిశక్తి అనుభూతముకాగలదు. అప్పుడు ప్రతివస్తువు మనకన్నుల ఎదుట భగవంతుని పరమసుందరఆనందమయలీలగా గోచరించును. మనకు భగవానుని మంగళ మయస్పర్శ ప్రాప్తింపనారంభించును.

భగవంతుని పూజలు కొన్ని యితరములైనవి యున్నను అవి సర్వజన సులభములు కావు.

"రాగాద్యదుష్టం హృదయం వాగదుష్టానృతాదినా
హింసాదిరహితః కాయః కేశవారాధనత్రయమ్

భగవంతుని ఆరాధనకు మూడు సాధనలు కలవు. మొదటి సాధన-రాగాద్యదుష్టం హృదయం-హృదయమును రాగాదిక్లేశములతో కలుషితము కానీయరాదు. ఏలనన యీ క్లేశములు అంతఃకరణయందు స్థిరముగా నుండి తమోగుణముచేత ఆవృతమగును. ఫలితముగా అది ఈశ్వరునకు సమ్ముఖము కాజాలదు. కావున భగవత్పూజనము కొరకు అంతఃకరణ నిర్మలముగా నుండుట పరమావశ్యకమై యున్నది. రాగాది పంచక్లేశములు (అవిద్యా, అస్మితా, రాగము, ద్వేషము, అభినివేశము) అంతఃకరణనుండి బయలు వెడలనంతవరకు అది నిర్మలముకాదు. మన భగవత్పూజనము అసంపూర్ణముగా నుండగలదు.

'వాగదుష్టానృతాదినా' అనునది రెండవ సాధనము- అనగా వాక్కును అసత్యాది దోషములతో దూషితమొనరింపకుండుట. అనగా వాక్కును సత్యభాషణముతో పవిత్రముగా నుంచుట. సత్యాచరణమెట్లొనరింపవలయునో ఈ శ్లోకమువలన స్పష్టమగుచున్నది.-

సత్యంబ్రూయాత్ ప్రియం బ్రూయాన్న బ్రూయాత్ సత్యమప్రియమ్
ప్రియం చ నానృతం బ్రూయాదేష ధర్మః సనాతనః

సత్యమునే చెప్పవలయును కాని మధురమైన వాక్కులలోనే చెప్పవలయును. క్రోధావేశముతో కాని కఠోరవాక్కులతో గాని చెప్పరాదు. దీనివలన వినువాని హృదయము క్షోభించును. సత్యభాషణమనెడి తపోభంగము కలుగగలదు. ప్రియముగా నుండువచనమైనను అసత్యమే యగుచో చెప్పరాదు (ఇతరుల ముఖస్తుతి చేయుటకొరకు యిట్లు మాట్లాడుట జరుగును)

మూడవసాధన - హింసాదిరహితఃకాయః- అనగా శరీరమును హింసాది దుష్కర్మలనుండి వేరుగానుంచుట. హింస కాయికము, వాచికము, మానసికము అని మూడు విధములు.

శరీరముద్వారా అస్త్ర శస్త్రములతో నొనర్చునది కాయికహింస.

కఠోరమైన వాణితో యితరుల హృదయమును నొప్పించుట వాచికహింస.

మానసికంగా యితరుల చెడ్డను కోరుటగాని యితరులకు చెడ్డ కలిగినప్పుడు ఆనందించుట కాని మానసికహింస.

పైన చెప్పబడిన మూడు విధములయిన హింసలనుండి ముక్తులు కావలసినదిగా వ్యాస భగవానులు చెప్పుచున్నారు.

శ్రూయతాం ధర్మసర్వస్వం శ్రుత్వాచైవావధార్యతామ్
ఆత్మనః ప్రతికూలాని పరేషాం న సమాచరేత్ ॥

అనగా "సర్వ ధర్మములసారము తెలిగించుచున్నాను సావధానుడవై వినుము. ఒక చెవితో విని మరియొక చెవితో విడిచిపెట్టకుము. హృదయమునందు ధారణమొనర్చి దానిని నీ జీవితమున గ్రహింపుము. ఆత్మనః ప్రతికూలాని - ఏ వ్యవహారము నీకు ప్రతికూలమో అట్టి వ్యవహారమును 'పరేషాం న సమాచరేత్' ఇతరుల ఎడల ఎప్పుడునూ చేయకుము.

ఈ మాటనే శ్రీకృష్ణభగవానులు గీతయందు చెప్పియున్నారు—

ఆత్మౌపమ్యేన సర్వత్ర సమం పశ్యతి యోఽర్జున।
సుఖం వా యది వా దుఃఖం సయోగీపరమోమతః ॥

"ఓ అర్జునా! ఏ యోగి సర్వప్రాణులయందును తనతో సమానమగు సుఖదుఃఖములను చూడగలుతున్నాడో అతనిని నేను యోగులలో శ్రేష్ఠునిగా తలంచుచున్నాను."

ఈ విధముగా త్రివిధ ప్రకారములయిన తనను విముక్తునిగా నుంచుటయే నిజమైన దైవారాధన.

ఇంతకంటెను ఉత్కృష్టమయిన భగవత్పూజనముకలదు. అది చిరకాలము సాధనమొనర్చిన యనంతరము తనంతట తానే సాధ్యమగును. ఆ అవస్థలో ఉన్నతశ్రేణికి చెందిన భక్తుడు భగవన్నుతి చేయుచు ఆయనతో తదాకారమునొంది అనుచున్నాడు- "ఓ ప్రభూ! నీవు నా శరీరమనెడి మందిరమున ఆత్మరూపుడవై విరాజిల్లు పరమశివుడవు. నాబుద్ధియే గిరిజానందిని ఉమ. నా ప్రాణములు నీ సహచరులు. విషయభోగములనుభవించెడి యీ శరీరమునందున్న యింద్రియముల ద్వారా నీయొక్క పూజ జరుగుచుండును. చరణముల ద్వారా జరిగెడి సంచరణయే నీ పరిక్రమ కాగలదు. నావాణిచేత ఉచ్చరితమగుశబ్దముల వల్ల నీ స్తోత్రము జరుగుచున్నది. ఈ విధముగా నా ద్వారా జరిగెడి కాయిక, వాచిక, మానసిక క్రియలన్నింటిచేతను నీ పూజ జరుగుచున్నది."

ఇట్టి అవస్థలో భక్తుని దేహాధ్యాస సర్వదా తొలగిపోవును. సర్వాత్మభావము పూర్ణరూపమున పరిపుష్టముకాగదు. ఈ స్థితినే జ్ఞాని యొక్క సహజ సమాధి దశయందురు. దీని యందు సాధకుని దేహాభిమానము నిర్మూలమగును. పరమాత్మ స్వయముగా చరాచర భూతమాత్రులయందు ఆత్మరూపమున విరాజిల్లును అనెడి భావము దృఢమగును. సమస్త ఇంద్రియవ్యాపారములు భగవత్పూజన స్వరూపములు కాగలవు.

పైన పేర్కొనబడినవిధముగ తమ ఆసక్తిని యోగ్యత ననుసరించి ఏవిధముగా పూజించినను అన్నివిధములగు పూజనములు సంపూర్ణములు కాగలవు. భగవంతుడు మన జీవితములను పూజమయమొనర్చునుగాక

(కల్యాణ్ సౌజన్యంతో)

# కబీరు వచనామృతము

(రెండవ భాగము)

## కబీరు సాధన

1

ఓ మనమా! నీ వలమటపడి దుఃఖమున మునుగుదువు. నీ ప్రతి పనియు శ్రాంతిని గలిగించుచున్నది. కడకొకనాడు నీకు బశ్చాత్తాపము కలుగును. నేను వేఱను జ్ఞానముతో జీవి యెంతవరకుండునో, అంతవరకును, కన్నులముందు తెరపడియుండును. ఎపుడు జన్మమృత్యువుల యవనిక భిన్నమైపోవునో, అపుడానందరసము నీ యందు స్థిరమగును.

దేనికావల నింకేమియు లేదో, ఆ మతమే అన్నిటికంటె బరిపూర్ణమైనది.

కబీరిట్లనుచున్నాడు :—చంచలమైన మనస్సును బిగ్గపట్టి ధృవమొనర్పుము.

ఎవ్వడు నిన్ను కూలమునకు చేర్చగలడో ఆతని బ్రేమింపుము. ప్రేమయందు తక్కమనుష్యునకిచ్చటను ఉనికి దొరకదు. ఈశ్వరనామమునందెప్పుడు ప్రీతి పొడమునో అప్పుడే సత్యము లభించును. ఆ ప్రీతియే అమరాదరమగు గృహమునకు గొంపోవును. భవజలమునందిక బడవలసిన యవుసరము లేదు.

నదినుండి నదీజలము భిన్నముకాదు; సద్గురువు జెప్పెనేని ఆ విధముగనే హృదయమును, హృదయమును గలసి ఏకమైపోవును.

దాసుడగు కబీరు విచారించి, మాటి మాటికివి ఇట్లు ఘోషించుచున్నాడు. అహంత నశించినప్పుడే స్వామి లభించును. అప్పుడే ఆ గృహము పొందనగును.

నీటియందును నిర్భాగ్యుడగు చాకలి పిపాసచే జచ్చుచున్నాడు. జలమందు నిలుచుండియు ఆ మూర్ఖుడు జలమును ద్రావనేరడు—ఆ జలము అత్యంతము నిర్మలము. అక్కటా! అక్కటా! తన ఘటముయొక్క మర్మము నెఱగడు, ఏ జలముపైన వతనియాస? ఒక్క క్షణమునందా నిర్భాగ్యుడేడ్చుచున్నాడు. ఇంకొక క్షణమున బట్టనుతుకుచున్నాడు. మఱియొక క్షణమున చాటక్కృము వహించుచున్నాడు. మూర్ఖుడు సరియైన సబ్బును దెచ్చుటలేదు. సాధకుని కడనే యది కలదు. ప్రాబడియున్న డాగు పోవుటలేదు. ఐనను ప్రతినెలయు హతభాగ్యుడుతుకుచునే యున్నాడు. అతడా డాగును గదలింపలేకున్నాడు.

కబీరిట్లనుచున్నాడు :—వినుమో సాధూ! అన్నము కలిగిననూ హతభాగ్యుడుపవాసము చేయుచున్నాడు.

4

మాటలు చెప్పుటయందు గడు చతురుడు; కాని స్మరణము చేయుటయందే అపటువు. సారసత్యమును విడనాడి, అసత్యముతో సాంగత్యము చేయుచున్నాడు. కావున, మాయ నిన్నే విధమున నాట్యమాడించుచున్నదో ఆయా విధమున నాడుచున్నావు.

కబీరిట్లనుచున్నాడు :—హరి ఎన్నడు లభించునో అప్పుడే హరిజనుడు సత్యమగును.

ఇంటింటను దీపము వెలుగుచున్నది. కాని ఓ గ్రుడ్డీ నీవు చూడలేకున్నావు! ఎప్పుడో ఒకనాడు హఠాత్తుగా చూడగలవు. అంతట మృత్యుపాశము వెంటనే జారిపోః

చెప్పుటకు గాని, వినుటకు గాని ఏమియును లేదు. చేయుటకును ఏమియు లేదు. బ్రదికి యుండగనే ఎవ్వాడు మరణించినట్లుండునో, ఆతడు మరల మరణింపడు.

యోగి ఏకాంతమున వియోగియైయుండును. కావుననే అతడాగ్రహము, బహు దూరమని చెప్పుచున్నాడు. నీ ప్రభువు చెంగటనే యున్నాడు. ఐననూ; అతనికొరకై ఖర్జూరవృక్షము నెక్కుచున్నావు!

ఇంటింటను బ్రవేశించి బ్రాహ్మణుడు దీక్ష యొసగుచు దిరుగుచున్నాడు. జీవితమూల మందలి యుత్సవము, నీ ప్రక్కనే కలదు, ఐననూ పూజించుట కొరకు పాషాణమును బ్రతిష్ఠించినావు.

కబీరిట్లనుచున్నాడు :—"నా ప్రభువింత మధురమని నేనెట్లు తెలుపగలను ? యోగము, జలము, పుణ్యము, పాపము-అతనికడనేమియును గావు.

జీవించియుండగనే ఎవడు ముక్తుడో ఆతడే నిశ్చయముగా ముక్తుడు. ఎంతవరకు జీవనము ముక్తము కాదో, అంతవరకును సుఖదుఃఖములనుభవింపక తప్పదు. తీర్థవాసము చేసిన ముక్తి దొరకదు. నేలపై శయనించిన ముక్తి దొరకదు. భ్రమనతిక్రమించినపుడె బంధనమునుండి ముక్తి దొరకును. అపుడెచ్చట నిచ్ఛ కలదో అచట ప్రవేశించును. భ్రమనతిక్రమింపని వాడెప్పుడును బంధనమునందే యుండును. ఆతడెందును బ్రవేశింపనసమర్థుడు.

## 7

ఓ అప్రతిష్ఠిత దేవా! నిన్నెవ్వరు సేవింతురు ? ప్రతిష్ఠిత దేవతనే ఎల్లరును బూజింతురు. ప్రత్యహమును అతనికే అర్చలర్పింతురు.

ఎవడు పూర్ణుడో, ఎవ్వాడు ప్రభువో ఆయ ఖండబ్రహ్మ నెవ్వరు అన్వేషింపరు. అందఱు దశావతారములను నిరంజనుడందురు. కాని యవతారమెప్పుడును పరమాత్మ కానేరడు. అతడు తన కర్మఫలములనుభవించును. స్వతంత్రుడైన కర్త వేఱొకడు. యోగి, యతి, తపస్వి, సన్యాసి వాదులాడుకొనుచు జచ్చుచున్నారు.

కబీరిట్లనుచున్నాడు :—ఓ సాధూ! ఎవ్వాడు ప్రేమ యొక్క శుభ్రజ్యోతిని లక్షించునో ఆతడే నెఱవేరినాడు.

## 8

ఓ సాధూ! ఎవడు నిజమైన ప్రేమయొక్క గలతియను నింపి, తాను ద్రావి నాకు ద్రావ నిచ్చునో, ఆ సద్గురువు కొఱకే నా ప్రాణము వ్యాకులపడుచున్నది.

అతడు కనులముందున్న పరదాను దూరగించి, బ్రహ్మను దరిసింపచేయును. అనాహత సంగీతమును, నాకు శ్రవణగోచరము చేయించును.

సుఖమును, దుఃఖమును ఒకటే యని యాతడు చూపించును. పలుకునంతయు నాతడు ప్రేమతో నింపును.

కబీరిట్లనుచున్నాడు :—ఎవ్వనికట్టి సద్గురువు కలడో, ఆతనికింక భయములేదు. అభయపదమును ఆతడు నిశ్చయముగా చేరగలడు.

## 9

ఏ సన్యాసి గురువును బ్రాపింపచేయునో, ఆతని సన్యాసమే అత్యాశ్చర్యమైనది, శోక

సంశయముల నివారించి, తరువాత శరీరమును నిర్మలమొనర్చును.

## 10

సంధ్యాతిమిరము కడు గంభీరమగుచున్నది. ప్రేమయొక్క దట్టపునీడలచే తనువును, మనమును ఆచ్ఛాదితమగుచున్నది.

పడమటవైపు కిటికిని దెరచి ప్రేమ గగనమందు లీనమై పొమ్ము. చేతః కమలము యొక్క దళములనుండి స్రవించు మధుర మధువును గ్రోలుము. నీ దేహమునందానంద తరంగములను గ్రహింపుము. ఆ సముద్రతలము నందెట్టి శోభ! వినుము, వినుము, అచట శంఖములు, ఘంటలు, సన్నాయిూలు, వీని వాద్యము మ్రోయుచున్నది.

కబీరిట్లనుచున్నాడు :—చూడు సోదరా! చూడుము ఈ ఘటమునందే ఆ అమర ప్రభువు కలడు.

## 11

ఓ అన్నా సద్గురువును తెలిసికొనుము.

వేదము, పురాణము, భాగవతము, గీత, వీనియందందరు దృఢబద్ధులగుదురు, కాని ఓ చెలికాడా! ఎవ్వడు బ్రహ్మనే గురువుగా దెలియునో ఆతని జన్మయే సఫలము.

జగత్తునందొక్కడే సద్గురువు. ఆతడు భవ బంధనములూడ్చివైచును.

కబీరిట్లనుచున్నాడు :—జగత్తునందలి గురువులు, చచ్చి, సచ్చి, మరల మరల బుట్టుచున్నారు.

## 12

ఓయీా! ఆ అసీమపువాణిని విని, ఆ అసీమపు బరిచయము లభించి నేను విరాగినైతిని. ఈ అనంతమును అంతవంతమొనర్చుకూలముల జూచు గ్రుడ్డితనమును విడనాడితిని. అప్పుడు నేనెన్నో వట్టిమాటలు విని విని బహుదినములు ఆటంకము కల్గించుకొంటిని.

ఇప్పుడు అంతరగతమును ఆదిమమును అగు శాశ్వతకథను కొంచెము కొంచెము తెలిసికొనగల్గుచున్నాను. ఇప్పుడు కల్పన యుపగతమగుచున్నది. సంగతి ప్రకాశించుచున్నది. తత్సంభోగమునందు రుచిపొడముచున్నది. లాలస, లోభము, మమత, మోహము వాని యుపకర్షణమాగిపోయినది.

చంచలత మాన్పి మనమును నిశ్చలమొనర్చితిని. ప్రేమ, వైరాగ్యములు మనమందు సుస్థిరముగా నున్నవి. కబీరిట్లనుచున్నాడు :— సద్గురు దయచేనప్రధృష్యమగు నా రాజధాని లక్షించితిని.

## 13

సద్గురువు నా చేయి పట్టుకొని రక్షించెను. లేదేని కొట్టుకొని పోవువాడను. నా మనమిప్పుడు కామక్రోధముల రెంటిని త్యజించినది, అయ్యాది విషయములందిక ప్రవేశింపదు.

కబీరిట్లనుచున్నాడు :—వినిమో నెచ్చెలీ! నా మనము సీమమును వీడి అసీమమును చేరినది.

## 14

హరి తన్నుతానే దాచికొనును. హరి తన్ను దానే యాశ్చర్యముగా నావిష్కరించుకొనును. హరియే కాఠిన్యము యొక్క యావరణమందు నన్నుంచినాడు. హరియే నాద్వైధమును బోద్రోలినాడు.

హరియే సుఖమును, దుఃఖమును నాకు బల్కినాడు. హరియే మరల వీని ద్వంద్వముల మాన్పించినాడు. హరి చరణములకడ నా తనువును, మనమును సమర్పింతును. ప్రాణమును త్యజింతును, కాని హరిని మరువని

## 15

స్వామియొక్క రంగు తగుల్కొనినది. సత్యము యొక్క రంగు తగుల్కొనినది. సంశయము నా మనస్సునందుండి పలాయన మొనర్చినది. నేను హఠత్వమును వహించి వేదురునై యున్నంతవరకును, నా ప్రియుడు నోరు కదల్చి యించుక యేనియు పలక డయ్యెను. కాని యీ దాసి యెప్పుడాతని చరణధూళికడ ప్రణతయయ్యెనో, ప్రభువు తన హృదయమును దెరచివైచెను.

సత్యమును దలపోయు మనసునకాతడు కడుచేరువ. అసత్యమునందు మానసించు మనమునందుండి యాతడు పలాయనమొన ర్చును.

లోకులవలన లజ్జ, కులమునందలి మర్యాద దారము వలె ద్రెంపివైచితిని.

కబీరిట్లనుచున్నాడు :—వినుము, వినుమో యన్నా, నా భాగ్యము జాగరిల్లుచున్నది.

## 16

ఈ జగత్సునందే ప్రేమచే, అపారమగు జీవనము లభించునో, ఆ ప్రేమయే నాకు ప్రాణమువలె ప్రియము.

కమలము జలమునందే యుండి జలమందే వికసించును. కాని జలము కమలపత్రముల నంటుకొనలేదు. అయ్యవి నీటియందు, చాటున కావలిగా వికసించును. నాకు ప్రేమయును అట్టిద.

సతి చితిపై నెక్కును, ప్రేమయొక్క యానతినుల్లంఘింపదు. తాను కాలి చచ్చి పోవును. ఇతరులను దుఃఖపీడితులను జేయును కాని ప్రేమ మర్యాదను నిలువబెట్టును. నాకు ప్రియమైన ప్రేమయు నట్టిద.

భవసాగరము తరించుటకు సాధ్యముకాదు. కాని ప్రవాహమునకెల్లలు లేవు. లోతును, మితిలేదు. కబీరిట్లనుచున్నాడు. అన్నా, ఆల కింపుము. దానిని దాటినవారరుదు.

## 17

ఆ ప్రేమమయుడైన ప్రియుని సంగము లభించినతోడనే నేనును ప్రేమపూరితుడనైతిని. జాతి, వర్ణము, కులము, కర్మ అన్నియును దూరమునకు బలాయనమైపోయెను. స్పర్శమణి స్పృశించినంతనే ఇనుము బంగారమైపోయినది. దానిని ఇనుమని ఇంకెవ్వరును అనరు! రమ్ము. చూడుము. స్పర్శమణి యొక్క మహాత్వము వెనుకటి ఇనుమే ఇపుడు మూల్యమైనది.

కబీరిట్లనుచున్నాడు:—ఇదియే సత్యఖేల. పూవును, దైలమును కలసి పూదైలమై పోయినవి.

## 18

నా కన్నులు నిమీలితములగునట్లొన ర్పుము. ఓ సాధూ, హృదయమునందు నేను ప్రీతిని నిలువరింతును.

ఏదినమాతని చూడ్కిని చూచితినో ఆ దినము నుండియే దుష్టపరాక్రమముకల మృత్యువు యొక్క భయమంతయును రూపు మాసినది. సద్గురువు ఎప్పుడు కరుణించెనో అప్పుడే నన్ను ముక్తుని జేసెను. అప్పుడు లక్ష లక్షల బంధనములన్నియు తమంతట తాము యూడిపోయెను. అప్పటినుండియు గురువు నా నిత్యసంగి. అతడెప్పుడును, పెరిమపుగలతియ నుండి త్రావుచుండును. అతడెప్పుడును ప్రేమ మాదనముచే నున్మత్తుడు.

ఏ పర్యంతము సత్యవస్తువుతో బరిచయము కాదో, అంతవరకును మిథ్యాకామము. ఉజాల

మైన జ్యోతియందు ప్రియతముడెప్పుడును నా కన్నుల చెంగట ప్రకాశించుచున్నాడు. ఉన్మనమను గృహమందు నా నివాసము. ఎల్లరి చూడ్కి బాటయందును ఆయవినాశి నిలిచియే యున్నాడు. కాని సాధకుడెవ్వడో, క్వాచిత్కముగా నాతనిని తెలియును.

కబీరిట్లనుచున్నాడు:— ఈ రహోద్వారము నెవ్వడు తెరచివైచునో, ఆతడే తెలియును.

## 19

నామనస్సు యొక్క మలినము పోకున్నది. ఎట్లు కడిగివైతునో తెలియకున్నది. ఊరి చెరువునందుగడు మురికినీరు. చాకలి విషయములందత్యంతము పిపాసి, మలినవస్త్రమును మిగుల జీర్ణము.

కబీరిట్లనుచున్నాడు:—ఇది ఈ మలినమగు జీర్ణవస్త్రము యొక్క సౌభాగ్యము. సద్గురువు లభించినాడు. వస్త్రమునిందలి డాగులన్నియు రూపరినవి.

## 20

ఆ సద్గురుని రహస్యము మనుష్యుడెరుగడు. తన బుద్ధిమీదనే యతడాధారపడును. గురువు మొదలు జీవిని భవసముద్రమునందు బడవైచి తిరిగి యానందసాగరములోనికాతని గ్రహించును.

నా దృష్టినాతడు, మొదట నెల్లలందు బంధించి, తిరిగి యాతడే యంతరమునందనిమమైన దృష్టిని వివృత మొనర్చును.

కబీరిట్లనుచున్నాడు:—విచారించి చూడుము. సంసారమున గురుదేవునితో సమానుడెవ్వడును లేడు.

# అవ్యక్తం

విన్నాను
నక్షత్రాలు పాడుతాయని
ఆవరించింది
నిస్తబ్దత అంతటా
నా చెవులను
సారించాను
ఆకాశంవైపుకు
కాని వినిపించలేదు
కోటానుకోట్ల
కంఠస్వరాల
అనాహతనాదము

వేకువన
ఆకాశం కారుస్తోన్న
దుఃఖాశ్రువులు
తుషార బిందువులు
ఆ బిందువుల్లో
వెతుక్కుంటున్నాను
అవ్యక్తరూపాన్ని

ఆకాశంలో
స్వరాల పల్లవులు
భూతలంలో
తారల అశ్రుబిందువులు
వీటి మధ్యలో
వెతుక్కుంటున్నాను
నిశ్శబ్ద స్వరాన్ని
అవ్యక్తరూపాన్ని

—రోహిణి

# స్వామి శారదానంద

**డి. వి. బ్రహ్మాజీ**

అన్ని ప్రేమలలోకి అత్యంత ఉత్కృష్టమయినది మాతృప్రేమ. "కుపుత్రో జాయతేక్వచిత్, కుమాతానభవతి" అని గదా ఆచార్య శ్రీ శంకరుల ప్రవచనము. తల్లితన బిడ్డలనందరను ఒకేరీతిగ అవ్యాజానురాగములతో పాలించి పోషిస్తుంది. అయితే సామాన్యంగా ఒక జననియొక్క ప్రేమ తన బిడ్డలవరకు మాత్రమే పరిమితం అయి వుంటుంది. మాతృశ్రీ శారదాదేవి "అందరికీ తల్లి." ఆమె సాక్షాత్తు "అమ్మలగన్నయమ్మ". కనుకనే ఒకసారి విదేశంలో తయారయిన మిల్లుగుడ్డలు వాడటం కూడదని చెప్పిన బ్రహ్మచారితో మాతృదేవి "ఈ గుడ్డను తయారు చేసిన ఆ తెల్లవారు కూడా నా బిడ్డలేకాని అన్యులుకారు గదా" అని పలికింది. ఎల్లప్రాణులపైన ఒకే రీతిగా ప్రేమామృతమును వర్షించిన జగజ్జనని శ్రీ శారదాదేవి. ఆమె అనురాగమునకు అడ్డుగోడలుగాని, వాత్సల్యమునకు అవధులుగాని లేనేలేవు. మాతృదేవి జన్మస్థానమయిన జయరాంబాటిలో అంజద్ అనే మహమ్మదీయుడొకడుండే వాడు. అతడు సకల దుర్గణములకు ఆటపట్టు. ఆతతాయి. కాని మాతృదేవి వానిని కూడ "తన బిడ్డలలో" ఒకనిగా ప్రేమించి ఆదరించెడిది. ఒకసారి అంజద్‌కు కడుపునిండా అన్నంపెట్టి పంపమని శారదాదేవి తన మేనకోడలయిన నళినిని కోరింది. నళినికి మాత్రం అంజద్ అంటే భయము, అసహ్యము. వరండాలో ఒక చివరగా అంజద్‌ను కుర్చో బెట్టి దూరంగా ఉండి వాని విస్తరిలో అన్నం విసిరి పడేస్తోంది. ఇది చూచి మాతృదేవి సహించలేకపోయింది. వెంటనే నళిని చేతిలోని పళ్ళెం లాక్కొని అంజద్‌కు చేరువనే కూర్చొని ఆప్యాయంగా కొసరి కొసరి వడ్డిస్తూ ప్రేమతో కడుపునిండా తినిపించింది. అన్నం తిన్న తర్వాత ఆ ఎంగిలి విస్తరాకును తానే తీసి శుభ్రంచేసింది. అది చూచి నళిని "అత్తా ఏమి పని ఇది? నీ కులం చెడిపోదా?" అని ప్రశ్నింపగా శారదామాత "నాకు శరత్ ఎట్లాంటి బిడ్డయో అంజద్ కూడా అట్టివాడే." అని జవాబిచ్చింది. దొంగ, ఖూనీకోరు, పరమదుర్మార్గుడు అయిన అంజద్ కూడా, పుణ్యాత్ముడు, శీలవంతుడు అయిన శరత్‌వలెనే తనకు ప్రేమాస్పదుడని మాతృదేవి తెలియజేసింది.

ఈ సందర్భముగా సకల సద్గుణాలకు ఆశ్రయుడుగా పేర్కొనబడిన శరత్, శ్రీ స్వామి శారదానందయే. ఈయన మొదటిపేరు శరచ్చంద్ర చక్రవర్తి. రామకృష్ణానందస్వామిగా పేరుగాంచిన శశిభూషణ చక్రవర్తియు, మన శరచ్చంద్ర చక్రవర్తి ఇద్దరును పెదతండ్రి పిన తండ్రుల బిడ్డలు. వీరిలో శ్రీ రామకృష్ణానందస్వామి శ్రీరామకృష్ణపరమహంసకు శ్రీశారదానందస్వామి మాతృదేవికి అంకితమయినారని చెప్పవచ్చును. శారదానందస్వామి దృష్టిలో శ్రీ శారదామాతకు, గురుదేవులకు ఏ విధమయిన భేదమును లేదు. ఇద్దరూ ఒక్కటే.

ఒకసారి దక్షిణేశ్వరంలో ఒక వింత సంఘటన జరిగింది. పరమానంద పరవశులై ఉల్లాసస్థితిలో ఉన్న శ్రీ గురుదేవులు ఒక యువకుని ఒడిలో కూర్చొని ఉన్నారు. అందరూ ఆశ్చర్యంగా చూస్తున్నారు. కొంత సేపటికి పరమహంస అక్కడ నుండి లేచి చుట్టూ వున్న వారితో "ఈ యువకుడు ఎంత బరువు తట్టుకోగలడు అని చూస్తున్నాను." అని అన్నారు. పైకి మామూలుగా కన్పించే పరమహంస ఈ పలుకులలో ఎంతో అంతరార్థం నిగూఢమయి ఉంది. శ్రీ గురుదేవుల పరీక్షలో ఆనాడు ఉత్తీర్ణుడయిన శ్రీ శారదానందస్వామి ఆ తర్వాత తర్వాత శ్రీ రామకృష్ణ వ్యవస్థకు కార్యదర్శిగా అత్యంత సమర్థవంతముగా పనిజేసి కష్టనిష్ఠూరములను సాహసముగా నెదుర్కొని ఆ మహాసంస్థయొక్క కార్యభారమునంతను సునాయాసముగ నిర్వహించి నిలబడినాడు. విధి నిర్వహణలో శ్రీ శారదానందస్వామి విజయమునకు మూలకారణములు రెండు:- మొదటిది శ్రీ గురుదేవులయందు స్వామికి గల అచంచలమయిన తిరుగులేని దృఢవిశ్వాసము. రెండవది ఎట్టి విషమపరిస్థితులలోను అధైర్యం చెందక నిశ్చలముగా నుండగల్గిన ప్రశాంతచిత్తము. ఎంతటి చిక్కు సమస్య ఎదురయినప్పటికి కూడ స్వామి చెక్కుదరని చిరునగవుతో "మన గురుదేవుతే అన్నీ సరిదిద్దుతారు. మనం ఏమీ కంగారు పడవలసిన పనిలేదు." అని ప్రశాంతముగా ధైర్యం చెబుతూ ఉండేవారు. స్థితప్రజ్ఞునకు ఉదాహరణరూపమే స్వామి శారదానంద.

సన్యాసాశ్రమ స్వీకారానికి ముందు శారదానందస్వామి పేరు శరత్‌చంద్ర చక్రవర్తి. వీరి తండ్రిగారు గిరీష్‌చంద్ర చక్రవర్తి. వీరిది కలకత్తా నగరమునకు చెందిన సంపన్నమైన శ్రోత్రియకుటుంబము. శరత్‌చంద్ర చక్రవర్తి 1865 సంవత్సరము డిశెంబరు నెల 23 వ తేదీ శనివారం నాడు జననమందారు. వంగదేశంలో శనివారం అంత శుభప్రదమయిన జన్మదినం కాదనే అభిప్రాయం ప్రబలంగా ఉండేది. అందువలన ఈ బాలుని భవిష్యత్తు ఏరకంగా ఉంటుందోనని బంధువులంతా ఆందోళన పడసాగారు. కాని, ఆ బంధువులలోనున్న ప్రఖ్యాతజ్యోతిష్కుడు ఒకరు ఈ

బాలుని విషయమై ఆందోళన అనవసరమనియు, తన వంశమునకంతయు వన్నె తెచ్చు మహానుభావుడు కాగలడనియు నొక్కి చెప్పారు.

వస్తుతః శరత్ చంద్రునిది అత్యంత శాంతస్వభావము. ప్రవర్తన అతి సరళమయినది. మేధాశక్తి అత్యంత సునిశితము. చిన్నతనం నుంచి కూడ చదువులో శరత్‌చంద్రుడు అసాధారణమయిన ప్రతిభను వ్యక్తపరచెడివాడు. ప్రతి పరీక్షయందును ఆయన ప్రప్రథముడుగా నుత్తీర్ణుడగుచుండెడివాడు. ఒక్క చదువు విషయంలో మాత్రమే కాకుండా వక్తృత్వపు పోటీలలోను, ఇతర సాంస్కృతిక వ్యాసంగములలోను కూడా శరత్ మునుముందు ఉండెడివాడు. ప్రతినిత్యము కసరత్తు, వ్యాయామము చేస్తూ బలిష్ఠమయిన దృఢశరీరమును పెంపొందించుకొన్న శరత్ చంద్రుడు వయస్సుకుమించి పెద్దగా కన్పించెడివాడు.

బాల్యంనుంచి కూడా శారదానందునికి దైవచింతన ఎక్కువగా నుండెడిది. చిన్నతనంలో తన తల్లిచేసే పూజా కార్యక్రమం అంతటిని అమిత శ్రద్ధగా పరిశీలించి చూస్తూ ఆ తర్వాత తాను స్నేహితులతో ఆటలాడుకొనునపుడు తాను చూచినదంతయు చక్కగా చేసి వారికి చూపించెడివాడు. ఉపనయనమయిన పిమ్మట ఆయన ప్రతినిత్యము స్నాన సంధ్యాద్యనుష్ఠానము నంతయు క్రమం తప్పకుండా చక్కగా నెరవేర్చుచు ఉండెడివాడు.

పసితనమునుండియు శారదానందుని ప్రకృతి మర్యాదాపూర్వకముగ నుండెడిది. ఇతరులను ఎవరిని కూడ నిందించుటగాని, ఒకరితో పరుషంగా మాట్లాడటంగాని, అన్యుల మనస్సు నొప్పించుటగాని శరత్‌చంద్రుని యందు కంచు కాగడావేసి వెదకినను కానరావు. స్వామి హృదయము అత్యంత దయార్ద్రమయినది. బడికి పోవునపుడు తన టిఫిను ఖర్చుకోసం ఇంట్లో వాళ్ళిచ్చిన డబ్బులను సాటి విద్యార్థులలో బీదవారికై వినియోగించెడివాడు. తాను ధరించెడి దుస్తులను కూడ అప్పుడప్పుడు ఆయన బీద పాదలకు దానము చేయుచుండెడివాడు. శరత్‌చంద్రుడి ఇంటిప్రక్కనే ఉండే ఇంట్లో పనిచేసే సేవకురాలు ఒకసారి కలరావ్యాధి సోకి బాధపడసాగింది. ఆమె యజమాని ఆమెకు సోకిన వ్యాధి తీవ్రతను గుర్తించి కూడా తగిన చికిత్స జరిపించకుండా, ఆమెను ఇంట్లో ఒక మూలకు తరిమివేసి "చస్తేదావు" అని ఆమె కర్మకు ఆమెను వదలివేశాడు. ఈ విషయం బాలుడయిన శరత్‌చంద్రునకు తెల్సింది. వెన్వెంటనే శారదానందుడామెకడకు పోయి స్వయముగా పరిచర్యలుగావించి, వైద్య సహాయం అందునట్లు చూచినాడు. కాని, చివరకామె మృత్యువాత బడక తప్పినదికాదు. ఆమె అంత్యక్రియలకైన ఖర్చుకూడ తానే భరించి శ్రద్ధగా జరిపించినాడు శరత్ చంద్రుడు.

ఎంతటి భయంకరమయిన అంటువ్యాధితో బాధపడుతున్న రోగులనయినాసరే మన స్వామి నిర్భయముగా సమీపించి, ఆదరముగా పలుకరించి, అవసరమయిన సహాయం అందించెడివారు. వయస్సుపైబడిన ముసలితనంలో కూడా స్వామి రోగులయెడ కన్పరచెడి శ్రద్ధాసక్తులలో ఏమియు మార్పురాలేదు. స్వామి చివరి రోజులలో జరిగిన ఒక సంఘటన ఆర్తులయెడ ఆయనకు గల ఆదరాన్ని తెలియజేస్తుంది. ముదుసలి అయిన శారదానంద స్వామి ఒకనాటి సాయంత్రం తన నివాసం విడిచి బయటకు బయలుదేరారు. ఆయన ఎక్కడకు పోవుచున్నదీ తెలియక సహాయంగా ఉండటానికై ఆయన వెనుకనే సేవకుడొకడు అనుసరింపసాగాడు. పోయి పోయి, స్వామి ఒక హోటలులో పైన గదిలోనున్న ఒక రోగిష్టి వ్యక్తి వద్దకు చేరి కుశలప్రసంగం గావిస్తున్నారు. ఆ రోగి మహా భయంకరమయిన క్షయవ్యాధితో బాధపడుతున్నాడు. అతడు మాట్లాడుతుంటే నోటినుండి కఫము జారి పడుతోంది. అట్లాంటి స్థితిలోనున్న ఆ రోగి తాను కొన్ని ఫలములను కోసి స్వామికి అర్పింపగా ఆయన ఆదరపూర్వకముగా స్వీకరించినాడు. ఇది చూస్తున్న సేవకునికి మాత్రం మతిపోయింది. తిరిగి నివాసమునకు వచ్చిన పిమ్మట ఆ సేవకుడు శారదానందస్వామిని తీవ్రముగా మందలించినాడు. క్షయవ్యాధితో బాధపడు రోగి దరిజేరుటకే భయపడుదుమే. అట్టిది ఆ రోగి యిచ్చిన ఫలములు స్వీకరించుటయా! దీనికి శారదానందస్వామి ప్రశాంతముగా నవ్వుచు "ప్రేమతోను భక్తితోను సమర్పించిన ఆహారం ఎట్లాంటిదయినా సరే ఏ హానియు చేయదని శ్రీగురుదేవులు చెప్పెడివారు." అని జవాబిచ్చారు.

విద్యార్థిదశలో శరత్‌చంద్రునిపై కేశవచంద్రసేన్ ప్రభావం పడింది. బ్రహ్మ సమాజమునకు తరచుగాపోవుచు, ఆ సమాజ విధానంలో ధ్యానముచేయుట మున్నగునవి చక్కగ అలవాటు చేసుకున్నారు. 1882 లో శరత్ చంద్రుడు విశ్వవిద్యాలయ ప్రవేశ పరీక్షలో నుత్తీర్ణుడై, మరునటి సంవత్సరము కళాశాలలో ప్రవేశించెను. వీరి జ్ఞాతి శశిభూషణచక్రవర్తి కూడా వీరి కుటుంబంతోనే కలసి నివసిస్తూ కళాశాల విద్యనభ్యసించుచుండెడివాడు.

శ్రీ గురుదేవుని దర్శించివచ్చిన బ్రహ్మసమాజ సభ్యుల వలన శశి, శరత్తులు శ్రీ రామకృష్ణుని గురించి తెలుసు

కొన్నారు. ఈ మహాపురుషుని ఒకసారి చూచి రావలెనని వారనుకొన్నారు. 1883 సం॥ అక్టోబరు నెలలో ఒకరోజున సోదరులిరువురు దక్షిణేశ్వర దేవాలయపు తోటలోనికివచ్చి మధ్యాహ్నం అంతా సంతోషముగా గడపి సాయంత్రం శ్రీ గురుదేవుల దర్శనం చేసుకున్నారు. ఆ సమయంలో పరమహంస తనగదిలో చిన్న కర్రమంచము మీదకూర్చొని యున్నారు. వచ్చిన బాలురను మందహాస పూర్వకముగ ఆదరించి కూర్చుండబెట్టి వారి యోగక్షేమాలన్నిటిని విప రంగా అడిగి తెలుసుకొన్న పరమహంస వారు తరుచుగ బ్రహ్మ సమాజమునకు పోయి ధ్యానించెడివారని విని సంతోషించారు. "ఇటుకలను, పెంకులను కాల్చుటకు ముందు, అవి పచ్చి పచ్చిగా ఉన్నప్పుడే వానిపై వ్యాపార ముద్రలను (Trade Names) అచ్చొత్తి ఆపిమ్మటవానిని కాల్చిన యెడల ఆ ముద్రలు చెరగిపోకుండా నిలచి ఉంటాయి. అటులనే ఆధ్యాత్మికముగా కొంత పరిపక్వత నొందినపిమ్మట జనులు జీవనవ్యాపారరంగమున ప్రవేశిం చినచో సంసారలంపటపు బురద అంటదు. అట్లుగాక ఈ నాడు బాల్యముననే వివాహితులగుట వలన జనులు తమ చదువుకూడ పూర్తికాకుండగనే బిడ్డలకు తండ్రులై వారి పోషణ నిమిత్తము ధనార్జనాసక్తులై సంసార జంజాటమున పడి కొట్టుమిట్టాడుచున్నారు. అందువలన భగవంతుని గూర్చి ఆలోచించుటకు అవకాశమే వారికి లభించుట లేదు."— అని శ్రీ గురుదేవులు ఆనాడు బోధించారు. సంసార బంధమునకంతయు పెండ్లియే మూలకారణమని తెల్పుచు తాను గావించిన ఉపదేశమునకనుగుణముగా శశి, శరత్తులచే బైబిల్ గ్రంథములోని కొన్ని పేజీలను ఆ రోజున చదివించెను. ఆ పుటలలో వివాహమును గురించి క్రీస్తు అభిప్రాయము విశదీకరింప బడియుండెను. "తల్లి కడుపున జన్మించు సమయముననే కొందరు జన్మతః నపుంసకులై జన్మించుచున్నారు; మరి కొంతమంది పురుషులు మధ్యలో నపుంసకులుగా చేయబడుచున్నారు; కొంతమంది స్వర్గరాజ్యమునకై తమంతతామే ఐచ్ఛికముగ నపుంసకులగు చున్నారు. ఈ రకమయిన పవిత్ర జీవితము నవలంబింప గలవారు అట్లు చేయదగును"— ఇట్లు చదివించిన పిమ్మట శ్రీ గురుదేవులు "సంసార బంధమునకెల్ల వివాహమే మూలకారణము". అని మరల నొక్కిచెప్పారు. పరమ హంస గావించిన ఈ ఉపదేశము శశి, శరత్తులలో వైరాగ్య భావమును పెంపొందించి వారికి క్రొత్తవెల్గును చూపించింది. ఆనాటి నుండి తమకు కళాశాల శెలవుదినములయిన గురు వారములలో శరత్చంద్రుడు ప్రతి గురువారమును దక్షిణే శ్వరమునకు వెళ్ళి వచ్చుచుండెడివాడు.

ఒకనాడు శ్రీ గురుదేవులు తన గదిలో భక్తబృందముతో ప్రసంగించుచుండిరి మన శరత్ కూడ అక్కడనే యున్నాడు. ప్రసంగవశమున సిద్ధి వరప్రసాదియగు వినాయ కుని గురించి ప్రసంగము తటస్థించెను. గణేశునకు గల సత్యశీలము, నిష్కామ కర్మపరాయణత, తన తల్లియగు జగజ్జననియెడల అతనికి గల దృఢమయిన భక్తి మున్నగు సద్గుణములను శ్రీ గురుదేవులు ఎంతయో కొనియాడు చుండిరి. గణేశుని దివ్య స్వభావము వ్యక్తీకరించు పౌరాణిక గాథలను కూడ కొన్నింటిని పరమహంస ఆనాడు శ్రోతలకు వినిపించి ఆనందపరచెను. అది అంతయు వినుచున్న శరత్చంద్రుడు ఆవేశపరవశుడై "ఔను గణేశుడనిన నాకెంతయో ఇష్టము. అతడే నా ఇష్టదైవము" అని ఉద్రేకముతో ప్రకటించెను. కాని, తన శిష్యుని నిజతత్త్వము నెఱింగియున్న శ్రీ గురుదేవులు అతనిని చక్కదిద్దుచు "అట్లుకాదు. నీ ఇష్టదైవము పరమశివుడే కాని, గణేశుడు కాదు. నీయందు శివుని అంశము ప్రస్ఫుటముగా గలదు. ఎల్లపుడు నిన్ను నీవు శివునిగను, నన్ను పరాశక్తిగను భావించుచుండుము. నీకు గల శక్తి అంతటికిని ఆధార కేంద్రమును నేనే అని గుర్తెరుంగుము." అని బోధించెను. పరమహంస పల్కులలోని పరమార్థమును శరత్చంద్రుడు చక్కగా అర్థము చేసికొనెను. శివుని గుణవిశేషములగు శాంతము, స్థయిర్యము, శమము, దమము, నిర్హేతుకము నిర్వ్యాజమునయిన కారుణ్య భావము మున్నగు లక్షణము లన్నియు శారదానందస్వామి జీవితములో మనకభివ్యక్త మగుచుండును. తన ఆధ్యాత్మిక జీవనమునను, రామకృష్ణ వ్యవస్థ నిర్వహణమునందును, శ్రీ రామకృష్ణోద్యమ వ్యాప్తియందును శ్రీ గురుదేవుల శక్తిసంపదయే తనకు అండయని శారదానందస్వామి దృఢవిశ్వాసముతో కృషి జేసి కృతార్థుడయ్యెను.

మరియొక పర్యాయము పరమహంస శరత్చంద్రునితో "నీవు ఆ పరమాత్మను ఏ రూపములో చూడగోరు చున్నావు? నీ ధ్యాన సమయమున ఏయే దివ్యదృశ్యములను చూచుటకు ఉత్సహించెదవు?" అని ప్రశ్నించారు. దానికి జవాబుగ శరత్చంద్రుడు "నా ధ్యానములో నేను భగవం తుని ఒక ప్రత్యేకరూపములో చూడనిష్టపడను. ఈ ప్రపం చమునందుగల సకల జీవులయందును ఆతనినే చూడవలె నని నా ఆకాంక్ష. దివ్యదర్శనములతో నాకు పనిలేదు." అని జవాబిచ్చెను. శ్రీ గురుదేవులు శరత్చంద్రుని పల్కులు విని చిరు దరహాసముతో "పరమార్థ సిద్ధి విషయంలో నీవు చెప్పినది పరాకాష్ఠ. ఒక్కసారిగ ఆ స్థితిని అందు కొనుట సాధ్యంకాదు." అని చెప్పారు. అందులకు సహా

భానముగ శరత్తు ఇట్లు జవాబిచ్చెను: "అంతకు తక్కువ నాకు అవసరములేదు. ఆ ఉన్నతస్థితినందుకొనువరకు అదే లక్ష్యముతో నా సాధనలను కొనసాగిస్తాను." అని పల్కిన పల్కులు శ్రీ గురుదేవులకు ఆనందం ఒన గూర్చాయి.

పూర్వజన్మమున క్రీస్తు ప్రభువునకు అనుచరులుగ నున్న ఇర్వురు దివ్య పురుషులే నేడు శశిభూషణ, శరత్ చంద్రుల రూపమున భూమిపై నవతరించిరని పరమహంస అప్పుడప్పుడు ప్రకటించు చుండెడివారు.

శ్రీ రామకృష్ణులను దర్శించక ముందే శరత్ చంద్రుడు నరేంద్రనాథుని ఒకనాడు కలసియుండెను. కాని, ఆనాడు నరేంద్రుని యెడల శరత్తునకు అంతమంచి అభిప్రాయము కలుగలేదు. ఈ సంఘటన అనంతరం కొన్ని నెలలు జరిగి పోయినవి. శ్రీ రామకృష్ణులు తరచుగ తన ప్రసంగములలో నరేంద్రనాథుని ప్రశంసించుట శరత్తు వినియుండెను. శ్రీ గురుదేవులచే ఇంతగా కొనియాడబడుచున్న ఈ మహానుభావుని స్వయముగా గాంచి అతనితో పరిచయం గావించుకొనవలెనని శరత్‌చంద్రుడు ఉవ్విళ్లూరుచుండెను. శ్రీ రామకృష్ణులనుండి నరేంద్రుని చిరునామా గ్రహించి శరత్‌చంద్రుడు నరేంద్రుని గృహమునకేగెను. తానిదివరకు దురభిప్రాయం ఏర్పరచుకొన్న వ్యక్తియే ఈ "మహా పురుషుడు" అని తెలిసి సంభ్రమ చకితుడయినాడు శరత్ చంద్రుడు। పరిచయం పెరిగినకొద్దీ నరేంద్రనాథుని ఔన్న త్యము శరత్‌చంద్రునకు అవగతము కాజొచ్చింది. రాను రాను వారిమధ్య అనుబంధము దృఢతరమై వర్ధిల్లెను. ఆధ్యాత్మిక విషయములగురించి చర్చించుకొనుచు మిత్రు లిరువురు కలకత్తానగర వీధులలో కాలం ఎట్లా జరిగిపో తున్నదీ గుర్తించకుండా గడిపివేశేవారు. వారి ప్రసంగము అర్ధరాత్రి దాటినా పూర్తయేదికాదు. ఒకసారి చిత్రమయిన సన్నివేశం తటస్థించింది. ప్రసంగం సందర్భంలో రాత్రి చాలా ప్రొద్దుపోయింది. శారదానందుని ఇంటివద్ద విడిచి పెట్టుటకై నరేంద్రుడు ఆతనినను సరించి వచ్చెను. ప్రసంగములో మునిగినవారి మనఃస్థితి చిత్రముగా నుండెను. శరత్తు ఇంటికి చేరినపిమ్మట, నరేంద్రనాథుడొక్కడూ ఇంటికి ఒంటరిగాపోతాడని భావించి శరత్‌చంద్రుడు ఆతనిని వారి ఇంటివరకు అనుసరించెను। మరల ఇదే పద్ధతి. ఇంటిలోకి పోవలెనను సంగతి మరచి ఒకరిని ఒకరు అనుసరించి తిరుగుచు కాలక్షేపము గావించారు।। వీరిరువురి మధ్యను పెంపొందుతున్న స్నేహవల్లరిని గాంచి ముగ్ధులై శ్రీ గురుదేవులు ఆనందముతో "గృహిణికి (జగజ్జననికి ఏ పాత్రమీద ఏ మూత చక్కగా సరిపోతుందో (అంటే: ఎవరికి ఎవరితో స్నేహం బలపడితే బాగుండునో) బాగా తెలుసు" అన్నారు.

కళాశాలలో విద్యనభ్యసించుటకు "డాక్టరుకోర్సు"లో ప్రవేశించారు. కాని, ఇంతలో పరమహంస తీవ్రముగ వ్యాధిగ్రస్తులు కావడం జరిగింది. తన సర్వస్వము ధార వోసి శ్రీ గురుదేవుల సంరక్షణను వహింపదలచి శరత్ చంద్రుడు గావించిన సపర్యలు అనితరసాధ్యములు. గురు దేవుడే తన సర్వస్వము అని నమ్మిన శరత్తు గురు సేవయే మోక్షసాధనా మార్గమని గుర్తించినాడు. తన యోగ పరమహంస పరిరక్షింపగలడను అచంచల విశ్వాసముతో గురుదేవులకు ఆత్మసమర్పణము గావించుకొన్న ధన్యాత్ముడు మన శరత్‌చంద్ర చక్రవర్తి. 1886 జనవరి ఒకటవతేదీనాడు శ్రీ రామకృష్ణులకు శరీర మున కొంత సౌఖ్యము కలిగినట్లు తోచినది. క్రిందకు దిగి తోటలో మెల్లమెల్లన శ్రీ గురుదేవులు అడుగులిడుచు విహరింపజొచ్చిరి. తనను చేరవచ్చిన శిష్యులతో "మిమ్ముల నందరను ఆశీర్వదించుచున్నాను. మీరందరు జ్ఞాన వికాసమునందెదరుగాక." అని కటాక్షించి ఆనందపారవశ్య స్థితినందెను. అంతవరకును, పరమహంసను తాకి తమ పాపభారముచే ఆయన శరీరము యాతనపడుటగాంచి, ఆయనను అంటరాదని తాము ఏర్పరచుకొన్న కట్టుబాటును మరచిపోయి, గురుదేవుల పాదధూళిని తలదాల్చుటకై పరుగులిడి వచ్చారు. వాత్సల్యమే రూపుదాల్చినట్లున్న పరమ హంస వారిని స్పృశించి, ఆశీర్వదింపసాగెను. ఈ మహా దవకాశాన్ని వినియోగించుకోడానికి అందరూ ఒకర్ని త్రోసుకుంటూ మరియొకరు ముందుకు రాసాగినారు. కాని సేవాకార్య నిమగ్నులయి ఉన్న లాటూ, శరత్తులుమాత్రం తమ పని విడచిరాలేదు. ఈ విషయమై తనను ప్రశ్నించిన వారితో శరత్‌చంద్రుడు "శ్రీ రామకృష్ణులు నాకు అత్యంత ప్రియమైన వ్యక్తి. నాకు ఏదయినా అవసరమని శ్రీ గురు దేవులు భావించెడి యెడల ఆయనయే నాకు అడుగకనే దానిని తనంతటతాను అనుగ్రహిస్తారు. అనవసరముగా నేను ఆందోళన చెందుట యెందులకు?" అని జవాబిచ్చారు.

శ్రీ రామకృష్ణ పరమహంస మహాసమాధి చెందిన అనంతరము శరత్‌చంద్రుడు తన నివాస గృహమునకు మరలిపోయి తండ్రితో నివసింపసాగెను. కాని, వివేకానంద స్వామి, బ్రహ్మానందస్వామి మున్నగు తన స్నేహితులను చూచుటకు ఆయన తరచుగ బారానగరు ఆశ్రమమునకు పోయి వచ్చుచుండెడివారు. వారుకూడ శరత్‌చంద్రుని చూచుటకు కలకత్తాలోని ఆయన ఇంటికి వెళ్ళుచుండెడి

వారు. ఇది శరత్‌చంద్రుని తండ్రియైన గిరీష్‌చంద్ర చక్రవర్తిగార్కి ఎంత మాత్రమును ఇష్టముండెడిది కాదు. అసలు మొట్టమొదట్లో ఆయనకు తన కుమారుడు శ్రీ రామకృష్ణులవద్దకు పోవుటకూడ నచ్చెడిదికాదు. తమ కులగురువయిన జగన్నాధ తర్కాలంకార్ వంటి మహాపడింతుని కాదని, తన కుమారుడు ఒక బడుగు బ్రాహ్మణుడు నిరక్షరాస్యుడునయిన రామకృష్ణుని దర్శించుటకు తరచుగ దక్షిణేశ్వరమునకు పోవుట ఆయనకు ఎంత మాత్రము సహింపరానిదయ్యెను. మహామంత్రశాస్త్రవేత్త, పండితుడునయిన జగన్నాధ తర్కాలంకార్‌తో పోలిస్తే రామకృష్ణుడు ఎంత "అల్పుడో" నిరూపించి, తన కుమారుని "కళ్ళు తెరిపించాలని" ఆయన నిశ్చయించుకొన్నాడు. అందుకోసమాయన ఒకరోజు తనతోబాటుగ జగన్నాధపండితునిగూడ వెంటబెట్టుకొని దక్షిణేశ్వరము చేరెను. తమ కులగురువుతో రామకృష్ణుని సంవాదమునకు పురికొల్పి జగన్నాధుని "ఔన్నత్యమును" తన కుమారునకు "తెలియజెప్పవలె". నని ఆయన ప్రయత్నము॥ కాని గిరీష్‌చంద్రుడు అనుకున్నది యొకటి, జరిగినది మరియొకటి॥ పరమహంసతో కొంత తడవు భాషించునరికే విద్యాపారంగతుడయిన జగన్నాధ తర్కాలంకారునకు శ్రీ గురుదేవుల ప్రచండ జ్ఞాన తేజము అవగతమయి ఆయనముందు తన అల్పత్వం తెలిసి వచ్చింది. గిరీష్‌చంద్రునితో ఆయన వెంటనే "నీ కుమారునకు శ్రీ రామకృష్ణులవంటి గురువర్యుడు లభించటమే ఒక మహద్భాగ్యము. అంతకుమించిన అదృష్టం మరియొకటి లేదు." అని తెలియజెప్పి నచ్చచెప్పారు. రామకృష్ణులు జీవించి ఉన్నంతవరకు తన కుమారుడు ఆయనను అనుసరించి ఉండటం బాగానే ఉందిగాని, ఆయన నిర్యాణానంతరముకూడ తనకుమార్డు సన్యాసులతో కలసి మెలసి తిరగటం ఆయనకెంతమాత్రము సమ్మతింపరానిదయ్యెను. ఎంతచెప్పినా తనకుమార్డు వినకపోవటంతో కోపంవచ్చిన గిరీష్‌చంద్రుడు తన కుమారుని ఒకగదిలో బంధించి యుంచెను. ఈ నిర్బంధము శరత్‌చంద్రున కెంతమాత్రమును సహింపరాకుండెను. ఎట్లో ఇంటినుండి తప్పించుకొని పారిపోయి ఆయన బారానగరు ఆశ్రమమును చేరుకొనగల్గెను. సన్యాసాశ్రమమును స్వీకరించి ఆయన శారదానంద నామము దాల్చెను.

శారదానంద స్వామి కంఠస్వరము మధురాతి మధురమయినది. తన శ్రావ్యగాత్ర ధ్వనితో ఆయన గీతములను ఆలపిస్తూ ఉంచే ఆ ధ్వని కలకూజితముకన్న కడు శ్రవణపేయముగ నుండెడిది. బారానగరు మఠమున ఒక రాత్రిపూట శారదానందస్వామి తన కుసుమకోమల కంఠముతో మృదుమధురముగా పాటలు పాడుతున్నారు. ఆశ్రమమునకు చుట్టుప్రక్కలనున్న జనులీపాటలు విని ఎవరో గొప్పగాయని నోటినుండి ఈ గీతములు వెలువడుతున్నాయన భావించారు. అర్ధరాత్రిపూట సన్యాసులయిన బ్రహ్మచారుల ఆశ్రమంలో ఆడమనిషి ఎందులకున్నది॥ అను కుతూహలముతో వారంతా గోడదూకి లోపలకు ప్రవేశించారు. వాస్తవ విషయమును గ్రహించి శారదానంద స్వామికి క్షమార్పణ చెప్పుకొన్నారు. చండీస్తోత్రముగాని, వేదసూక్తములుగాని శారదానందస్వామి కంఠమునుండి వెలువడినపుడు వానిని వినెడి శ్రోతల హృదయములు అలౌకికమయిన ఆనంద పారవశ్యమును అనుభవించుచుండెడివి.

సన్యాసాశ్రమమును స్వీకరించిన పిమ్మట శారదానంద స్వామి కొన్నాళ్ళు తీవ్రమయిన కఠోరతపశ్చర్యగావించారు. పరివ్రాజకునిగా ప్రయాణిస్తూ పూరి, కాశి, హరిద్వారము, ఋషీకేశము, కేదారనాథ్ మున్నగు పవిత్ర స్థలములలో దీక్షగా తపస్సాధనలను కొనసాగించారు. వివేకానంద స్వామి సూచనపై విదేశాలకుపోయి లండనులోను, అమెరికాదేశమున, వేదాంతపరమయిన ఉపన్యాసములు ప్రసంగించుచు పర్యటించారు. అమెరికాలోని న్యూయార్కు నగరమున స్వామి కొంతకాలము స్థిరనివాసము నేర్పరుచుకొని అచట వేదాంత ఉద్యమము సక్రమముగ కొనసాగునట్లు నడిపించారు. ఇంతలో భారతదేశమున వివేకానంద స్వామి రామకృష్ణమిషన్ స్థాపించుట జరిగింది. ఈ వ్యవస్థకంతటికిని కార్యదర్శిగా సర్వసమర్థుడయిన మన శారదానంద స్వామిని నియమించటం జరిగింది. ఈ మహత్తర కార్యభారాన్ని శారదానందస్వామి అత్యంత సమర్థవంతముగా, దక్షతతో జీవితాంతము నిర్వహించారు. సంస్థ నిర్వహణ విషయంలో ఎంతటి చిక్కు సమస్యలుత్పన్నమైనప్పుడూ కూడా శారదానంద స్వామి ఈషణ్మాత్రమును ఆందోళనచెంది యెరుగరు. "అంతయు మన గురుదేవులే సరిదిద్ది చక్కబెట్టగలరు." అను అచంచలభక్తియే శారదానందస్వామికి అఖండ ధైర్యమును సమకూర్చుచుండెడిది. స్థిరమనస్కుడైన శారదానందస్వామి సామాన్య జీవనరంగమున కూడ ఎట్టి ఒడుదుడుకులనయినా ప్రశాంతముగా సహించెడివారు.

ఒకసారి చిన్న పడవలో శారదానందస్వామి కలకత్తా నుండి బేలూరునకు నదిలో ప్రయాణం చేస్తున్నారు. స్వామి వెంట ఒక భక్తుడు కూడా ఆదేపడవలో ప్రయాణిస్తున్నాడు. మధ్యేమార్గంలో పెనుగాలి వీచి పడవ ఊగిసలాడి కదలిపోతోంది. పడవ తల్లక్రిందులై మునిగిపోతామా అని

అందులో ప్రయాణికులందరూ ఆందోళ చెందుతూఉన్నారు. కాని, శారదానందస్వామి మాత్రం ఏ విధమయిన తొట్రుపాటూ లేకుండా నిశ్చింతగా హుక్కా పీలుస్తూ కూర్చున్నారు. ఒకప్రక్క ప్రాణభయంతో అల్లాడిపోవలసిన సంకట పరిస్థితి ఏర్పడితే ఏ మాత్రం పట్టించుకోకుండా కూర్చున్న స్వామిని చూచి ప్రక్కనేఉన్న ఆ భక్తుడు కోపం పట్టలేక పోయాడు; స్వామి చేతిలోనున్న హుక్కాగొట్టమును ఊడలాగి నదిలో విసిరిపారేశాడు. స్థితప్రజ్ఞుడయిన శారదానందస్వామి ఈ చర్యకు కూడ ఆగ్రహం ఎంత మాత్రము చెందకుండా అదే చిరునగవుతో ఆ భక్తుని శాంతపరిచారు. శారదానందస్వామిలోని గంభీర ప్రశాంతత ఆయన సహజమైన నైసర్గికస్వభావమే అని ఈ సంఘటన మనకు ఋజువు చేస్తోంది.

కాశ్మీరులోనున్న వివేకానందస్వామి అక్కడ జబ్బుపడిన సంగతి తెలిసి శారదానందస్వామి బేలూరునుండి బయలుదేరి కాశ్మీరు ప్రయాణం అయ్యారు. దారిలో ఒక పర్వతాన్ని అధిరోహిస్తున్న సమయంలో స్వామి ప్రయాణిస్తున్న గుర్రపుబండి ప్రమాదానికి గురి అయింది. రావల్పిండి శ్రీనగర్‌ల మధ్య గుర్రము బెదరిపోయి (పర్వతం) క్రిందకు పరుగెత్తనారంభించింది. అట్లా క్రిందకు జారిపోతూ పరిగెత్తుతూన్న గుర్రపుబండి ఒక చెట్టుకు గ్రుద్దుకొని ఆగింది. వెంటనే శారదానంద స్వామి బండిలోనుండి క్రిందకు దుమికివేశారు. స్వామి క్రిందకు దుమికారో లేదో, అదే క్షణంలో ఒక బండరాయి పైనుండి పడి గుర్రం అక్కడికక్కడే చనిపోయింది. ఈ విధంగా అత్యంత ఆశ్చర్యకరంగా స్వామి ప్రాణాలతో బయటపడ్డారు. ఇంతటి ప్రమాదపరిస్థితిలో కూడా శారదానంద స్వామి ప్రశాంతచిత్తంతో ఏ రకమయిన ఆందోళనా చెందకుండా చెక్కుచెదరని మనఃస్థయిర్యంతో ప్రవర్తించారు.

ప్రశాంత చిత్తుడయిన మన శారదానందస్వామి తన శాంత స్వభావంతో ఎంతటి కోపంలోనున్న వారినయినా సరే శాంతపరచి దారిలోకి తేగలిగెడి వారు. వివేకానంద స్వామికి కోపం వచ్చినపుడు ఆయన దరిచేరుటకు కూడా చాలమంది భయపడెడివారు. కోపంతోనున్న వివేకానంద స్వామిని చేరటానికి కూడా ఎవరూ సాహసించని సందర్భాలలో మన శారదానంద స్వామిని చేరి తగిన విధంగా నచ్చచెప్పి మామూలు పరిస్థితిని ఏర్పరచెడివారు. ఈ విషయమై వివేకానందస్వామి: "శరత్తు వంట్లో ప్రవహించెడిది మనబోటివాళ్ళ శరీరాలలో లాగా ఉష్ణరక్తం కానేకాదు. అది చేపలలోగా అతిశీతలరక్తం. (అందువల్లనే అతనికి కోపం రావడంలేదు.)" అని అంటూ ఉండేవారు. ఈ విధమయిన ప్రశాంతచిత్తంతో శారదానందస్వామి ఎందరెందరి మనస్సులనో ఆకట్టుకొనగలిగారు. ఎంతటి తిరుగుబాటు స్వభావమున్న వాడయినా సరే స్వామి ముందు నిలచినంత మాత్రముననే ఆయన శాంతచిత్తమున కాకర్షితుడై విధేయతతో ప్రవర్తించెడివాడు. ఇతరులకెవరికీ లొంగక, ఏ పని చేయడానికీ ఎదురుతిరిగే జగమొండి స్వభావం కలవాళ్ళు కూడా శారదానందస్వామి కనుసన్నలలో వశవర్తులై ప్రవర్తించెడివారు.

ఒకసారి ఒక బాంబు కుట్రలో ఇరుక్కొన్న ఇద్దరు యువకులు తమ పాత రాజకీయ జీవితానికి స్వస్తిచెప్పి రామకృష్ణమిషనులోజేరి ఆధ్యాత్మికజీవనం సాగించవలెనని ఆశపడ్డారు. అట్లాంటివారిని స్వీకరించడం అంటే ఆనాటి బ్రిటిష్ ప్రభుత్వంతో తగాదా కొనితెచ్చుకొన్నట్లే. అయితే, హృదయపూర్వకముగా పరివర్తనము చెందిన వారిని దగ్గరకు తీయకపోవడం పిరికితనం అవుతుంది. శారదానందస్వామి ధైర్యముగా వారిరువురను రామకృష్ణమిషనులో చేర్చుకొని, తాను స్వయముగా ఉన్నత పోలీసు అధికారులను కలుసుకొని ఆ ఇరువురు యువకుల ప్రవర్తనకు తాను పూచీగా హామీ ఇచ్చారు. ఆ ఇరువురు యువకులు కూడా ఆ తరువాత ఆదర్శవంతమయిన జీవితం కొనసాగించి స్వామి తమయందుంచిన నమ్మకమును నిజం చేశారు.

శశిభూషణ చక్రవర్తి (రామకృష్ణానందస్వామి) తండ్రి అయిన ఈశ్వరచంద్ర చక్రవర్తియు, మన శరత్తు తండ్రియైన గిరీశ్‌చంద్ర చక్రవర్తియు, అన్నదమ్ములు. శారదానందస్వామి కొంతకాలముపాటు ఈశ్వరచంద్ర చక్రవర్తి వద్ద తంత్రశాస్త్రమును అభ్యసించారు. తంత్రశాస్త్రము యొక్క పరమావధి అందరిలోను ఆ జగన్మాతను సందర్శింపగల్గుట. ఈ విషయంలో శారదానందస్వామి సంపూర్ణముగ కృతకృత్యులయినారు. వంగభాషలో "భారత దేశంలో శక్తిపూజ" అనే గ్రంథమును కూడ శారదానంద స్వామి రచించియున్నారు.

వివేకానందస్వామి మరణానంతరము రామకృష్ణవ్యవస్థకు మన శారదానందస్వామిని అధ్యక్షుని గావించవలెనని అందరూ అనుకొన్నారు. కాని, బ్రహ్మానందస్వామి యెడల అపారమయిన ప్రేమగౌరవములు కల్గిన శారదానందస్వామి అధ్యక్షస్థానమున బ్రహ్మానందస్వామి ఉండుటయే బాగుండునని సూచించి తాను కార్యదర్శిగా కొనసాగారు. ఇరువురూ కలసికట్టుగ పనిచేసి, వారి హయాంలో, రామకృష్ణ వ్యవస్థను మూడు పువ్వులు ఆరుకాయలుగా అభివృద్ధి చేశారు.

రామకృష్ణమఠము తరపున వంగభాషలో "ఉద్బోధన" అనే మాసపత్రిక వెలువడుతూండేది. కొన్నాళ్ళయేసరికి పత్రిక ఆర్థికముగా గడ్డు సమస్యలను ఎదుర్కొనవలసి వచ్చింది. పత్రిక మూతపడే ప్రమాదం ఎదురయింది. ఇట్టి విషమపరిస్థితిలో పత్రికకు తిరిగి జీవంపోసినది మన శారదానందస్వామియే. తన సర్వస్వము ధారవోసి పత్రిక మూతపడకుండా కాపాడినాడు శారదానందస్వామి. అంతేకాక, ఉద్బోధన పత్రికకు ఒక స్వంత భవనం ఏర్పరచ వలెనని కూడ శారదానందస్వామి సంకల్పించుకొనెను. అంతేగాక, మాతృశ్రీ శారదాదేవి కలకత్తానగరం వచ్చినపు డల్లా ఆవిడ అక్కడా అక్కడా గడుపవలసి వచ్చెడిది. శ్రీ రామకృష్ణుల తర్వాత ఆరాధ్య దేవతయగు మాతృ దేవతకు కలకత్తానగరమున ఒక స్థిరమయిన నివాసం ఏర్పరచవలసిన అగత్యమును కూడ శారదానందస్వామి గుర్తించారు. అన్నీ కలసి వచ్చునట్లుగా ఒక చక్కని మేడను నిర్మించాలని సంకల్పించి శారదానందస్వామి కృషిచేశారు. ఫలితంగా 1909 సం॥లో చక్కని మేడ తయారయింది. ఈ నిర్మాణం కోసమని శారదానంద స్వామి తన స్వంత పూచీపై పెద్ద మొత్తం ఋణం తీసుకొని పని పూర్తిజేశారు. ఆయన కార్యతత్పరత ఆటు వంటిది: ఈ ఋణభారం తీర్చు నిమిత్తం స్వామి ఒక మహాకార్యం చేపట్టారు. అదే "శ్రీ రామకృష్ణలీలా ప్రసంగ" రచనాకార్యక్రమము. శ్రీ రామకృష్ణ పరమ హంస యొక్క దివ్య జీవితమును వంగభాషలో అత్యంత రమణీయముగ వెలయించి ఈ రచనము ద్వారా శారదా నందస్వామి రససిద్ధుడైన మహా రచయితగా పరిణమించి అమరుడయినారు. ఈ మహాకార్యనిర్మాణము జరుగు సమయమున స్వామికి విశ్రాంతి లేనంతగా ఇతర కార్యా భారము కూడ పైబడినది. ఆయన నిర్మించిన మేడలో క్రింది భాగమున "ఉద్బోధన" పత్రికాఫీసు ఉండేది, పై అంతస్తులో దైవమందిరము, శారదాదేవి నివాసము ఉండెడివి. మాతృదేవి ఉండటంవల్ల "మాతృమందిరము" అని, ఉద్బోధన పత్రికా కార్యాలయం ఉన్నందున "ఉద్బోధన్ ఆఫీస్" అని ఈ గృహము పిలువబడు చుండెడిది. ఈ భవంతి క్రింది అంతస్తులో మెట్లకుదగ్గర ఒక చిన్నగది ఉండేది, అదే శారదానందస్వామి నివాస స్థానము. ఎవరైనా తెలియనివారు మాతృమందిరానికివచ్చి శారదానందస్వామిని "మీ రెవరు?" అని ప్రశ్నిస్తే, ఆయన "నేనిక్కడ మాతృశ్రీ శారదాదేవి గేటుకాపలాదారుణ్ణి" అని శారదానందస్వామి జవాబిచ్చేవారు!! తాను రామకృష్ణ మఠము, మిషనులకు కార్యదర్శి అయినప్పటికి కూడ ఆపదవులకన్న ముందు శారదాదేవి సేవయే తనకు ముఖ్య ముగ భావించిన శారదాదేవి ప్రియపుత్రుడు శ్రీ శారదానంద స్వామి. మాతృమందిరంలో శారదానందస్వామి నివాసం ఎల్లపుడూ జనసందోహముతో క్రిక్కిరిసి యుండెడిది. ఇదిగాక, శ్రీ శారదాదేవిని దర్శింపవచ్చి పోయెడి భక్తులతో ఆ ప్రదేశమంతయు మిక్కిలి సందడిగనుండెడిది. ఒక ప్రక్క రామకృష్ణ వ్యవస్థకు సంబంధించిన వివిధ రకముల వ్యవహారములను చక్కబెట్టవలసి వచ్చెడిది; వేరొక ప్రక్క మాతృదేవికి ఏలోటును జరుగకుండ సదుపాయము లేర్పరచాలి. ఇంతటి బహుకార్య భారముమధ్య "శ్రీ రామ కృష్ణ లీలాప్రసంగము" వంటి మనోజ్ఞ కావ్యమును వ్రాయగల్గుట శారదానంద స్వామివంటి స్థితప్రజ్ఞునకే చెల్లియున్నది.

శ్రీ శారదానందస్వామి దృష్టిలో సాక్షాత్తు ఆ జగజ్జననియే భూమిపై శారదాదేవి రూపమున ఆవిర్భవించినది. శ్రీ రామకృష్ణులకు శ్రీ శారదాదేవికిని ఏ విధమయిన భేదమును లేదని స్వామి భావన. మాతృదేవి పవిత్రస్మృతికి చిహ్నంగా ఆమె జన్మస్థలమయిన జయరాంబాటిలో శ్రీ శారదానంద స్వామి ఒక దేవాలయమును నిర్మించారు. తనశరీరారోగ్యం ఎంత మాత్రం బాగా లేనప్పటికి లెక్కచేయక, ఈ ఆలయ నిర్మాణపర్యవేక్షణను, స్వామి తానే స్వయముగ, అత్యంత శ్రద్ధగా నిర్వహించారు. ఈ దేవాలయ నిర్మాణము 1923 ఏప్రిల్ 19 నాడు పూర్తిఅయినది. అప్పటికి శారదా దేవి గతించి మూడు సంవత్సరములయినది.

సేవాకార్య నిర్వహణలో స్వామి దీక్ష ఆశ్చర్యకర మయినది. ప్రకృతి ఉపద్రవములు వచ్చి ప్రజలు బాధలకు గురిఅయిన సందర్భములలో రామకృష్ణమిషన్ ద్వారా వారిని ఆదుకొని పరిరక్షించుటలో స్వామి ఆదర్శప్రాయుడు. వ్యాధిపీడితులయిన వారి విషయంలో శ్రద్ధవహించి ఆదు కొనడం శారదానందస్వామికి చిన్ననాటినుండియు అలవడిన లక్షణము. ఇంజక్షను తీసుకోడానికి భయపడి మారాంచేసే రోగులను శాంతంగా సముదాయించడంలోను, అపథ్యా హారం తిని పేచీపెట్టే వాళ్ళకు నచ్చచెప్పి దారికి తేవడంలోను శారదానందస్వామి రోగులపట్ల కన్నతల్లివలె ప్రవర్తించెడి వారు. ఒకోసారి అవసరం అయితే రాత్రి అంతా రోగి ప్రక్కనే కనిపెట్టుకొని ఉండటానికి కూడ శారదానంద స్వామి వెనుకాడేవారు కాదు. జ్ఞాన, కర్మ, భక్తి, యోగ మార్గములన్నిటిని తన నిజజీవితమున సమన్వయము గావించి మానవాళికి మహనీయ మార్గదర్శియైన ఉదాత్త చరితుడు శ్రీ శారదానందస్వామి. ఆయన 1927 ఆగస్టు 19 న దుఃదవాతమునకు గురియై

# బాలల శారదాదేవి

బి. ఎస్. ఆర్. ఆంజనేయులు

## రామేశ్వరయాత్ర

మాతృదేవి మాతృమందిరంలో ఉండటానికి ముందే రామకృష్ణానందస్వామి (యువకుడైన శశియే రామకృష్ణానందస్వామి అయినాడు) మద్రాసులో రామకృష్ణమఠము స్థాపించినాడు. ఆయన మాతృదేవిని యిలా ప్రార్థించాడు. "అమ్మా! నీవు దక్షిణదేశంవచ్చి అక్కడి వాళ్ళను పవిత్రం చెయ్యాలి".

1911వ సం॥ ఫిబ్రవరిలో మాతృదేవి యెనిమిదిమంది బృందముతో మద్రాసువచ్చి నెలరోజులున్నది. రామకృష్ణానందస్వామి వారందరికి ఎంతో శ్రద్ధతో యేర్పాట్లుచేశాడు. అక్కడనుండి మధుర మీదుగా రామేశ్వరం తీసుకపోయినాడు.

రామేశ్వర దేవాలయం రామనాధపుర రాజా అధీనంలో వుంది. ఆ రాజా వివేకానందస్వామి శిష్యుడు. మాతృదేవికి గొప్ప స్వాగతం ఏర్పాటుచేశాడు. ఎవ్వరూ పోవటానికి వీలులేని గర్భాలయంలోకి మాతృదేవి పోయి అర్చన, అభిషేకం చెయ్యటానికి సిద్ధం చేశాడు. రామకృష్ణానందస్వామి మాతృదేవి పూజించటానికి 108 బంగారు బిల్వదళాలు చేయించి తెచ్చాడు.

రామేశ్వరంలోని దేవుడు శివుడు. ఆ లింగాన్ని సీతాదేవి యిసుకతో చేసింది. రావణాసురుని సంహరించిన తర్వాత రాములవారు ఆలింగాన్ని సముద్రతీరాన ప్రతిష్ట చేశారు. అందువల్ల స్వామిని రామలింగేశ్వరుడు అంటారు. అంత పెద్ద దేవాలయము యెక్కడా లేదు. హిందువులకు రామేశ్వరం చాల గొప్ప పుణ్యక్షేత్రం.

మాతృదేవి మనసారా రామలింగేశుని తానే స్వయంగా గంగాజలంతో అభిషేకించింది. బంగారు మారేడుదళాలతో పూజించింది. ఆ ఆనందంతో ఆశ్చర్యపడుతూ నెమ్మదిగా యిలా అన్నది.

"ఇది నేను పెట్టినది పెట్టినట్లే వున్నదే!" త్రేతాయుగంలో సీతగా అవతరించిన మహాశక్తి యిప్పుడు శ్రీ శారదాదేవిగా అవతరించింది. ఆవిషయం పొరపాటున మాతృదేవి నోట్లోనుండే యిక్కడ బయట పడింది.

> రామలింగేశు రామేశ్వరమ్మునందు
> శారదామాత కని, యిట్లు సంస్మరించె
> "త్రేతయుగమున నుంచితి సీతగాను
> ఉంచినది వుంచినట్టులే యుండె నిచట"

# గోదావరీ పుష్కర మాహాత్మ్యము

కాంచి కామకోటి పీఠాధిపతులు అనంతశ్రీ శ్రీ జయేంద్రసరస్వతి స్వాములు

పుణ్యభూమిగా, కర్మభూమిగా, ఆధ్యాత్మికదేశముగా ప్రసిద్ధిచెందిన భారతదేశము ప్రపంచము మొత్తానికే జ్ఞానమును ప్రసాదించి జగద్గురుస్థానమును అలంకరించియున్నది. ప్రాచీనమైన సంస్కృతికి పరంపరాగతమైన సంప్రదాయమునకు నిలయమైన భారతదేశము వేదాలకు, పురాణేతిహాసములకు పుట్టినిల్లు. సాక్షాత్తు భగవంతుడే రామకృష్ణ శంకరాది అవతారములెత్తి ధర్మస్థాపనకై కృషి చేసిన ఇట్టిదేశము పరంపరాగతమైన అనాదిసిద్ధమైన పవిత్రసంస్కృతికి నిలయము. ప్రపంచములోని యితర దేశములలో కొందరు దేవదూతలు జన్మించి ధర్మప్రచార బాధ్యతను స్వీకరించినారు. కాని ఈ పవిత్రదేశములో మాత్రము భగవంతుడే స్వయముగా అవతరించి ధర్మస్థాపనకొరకు కంకణధారియైనాడు.

పరమపవిత్ర భారతదేశములో అవతారపురుషులైన రామకృష్ణ శంకరాదులను పూజిస్తూనే మరొకవంక భగవంతుడు సర్వాంతర్యామియను దివ్య, భవ్య, ఉదాత్త భావనతో మనము పర్వతములను, వృక్షాలను, నదులను, నగరాలను ఒకటేమిటి సమస్తవస్తువులను ఆరాధించుచున్నాము. ప్రతివస్తువులోను భగవంతుని దర్శించగల్గిన ఉదాత్తభావనకు నిలయము మనదేశము. అట్టి పవిత్ర భావనతోనే ఆసేతుశీతనగపర్యంతము మనకు పూజనీయము.

ప్రతినదిని, ప్రతిపర్వతమును, ప్రతివృక్షమును, ఇలా ప్రతివాటిని ఆయాసందర్భములలో ఆయా పర్వదినములలో పూజించి మన భక్తిప్రపత్తులను ప్రకటించుకొని సమస్త సౌభాగ్యములను పొందవలెను. అట్టి పవిత్ర ఉత్సవములలో రాబోవు గోదావరి పుష్కరములనుగురించి తెలుసుకొనగలము.

పూర్వము ద్వాదవర్షక్షామముచే భూలోకమునందలి సమస్త ప్రాణికోటి బాధపడుచుండెను. ఒక్కచినుకైనను వర్షము లేదు. ఇట్టి కష్టపరిస్థితిలో ప్రజలందరు ఆకలితో అలమటించుచుండిరి. ఇదేసమయమున గౌతమమహర్షి బ్రహ్మగిరియందు ఆశ్రమమును నిర్మించుకొని తపమాచరించుచుండెను. ఆ మహర్షి దివ్యతపఃప్రభావముచే ఆ ఆశ్రమమున మాత్రము జలము సమృద్ధిగా లభించుచుండెను. ఆశ్రమమునమాత్రము ఎట్టి ఇబ్బందిలేదు. ప్రజలీవిషయమును తెలుసుకొని ఆశ్రమమునకువచ్చి నివసించుచుండిరి.

గౌతమమహర్షి అరుణోదయమునకు ముందేలేచి స్నానసంధ్యాది కార్యక్రమములను నిర్వర్తించుకొని తపస్సునకు కూర్చొనుటకుముందు ఆ సమీపమున భూమిపై చారెడు ధాన్యము చల్లెడివారు. తపస్సు పూర్తి అగుసరికి అక్కడ పుష్కలమైన ధాన్యము పండెడిది. ఆ ధాన్యముతో అక్కడికి వచ్చినవారికి అందరికి తృప్తిగా భోజనము పెట్టెడివారు.

జగన్మాతయగు పార్వతీదేవి పడుచున్న సవతిబాధకు గణపతియు బాధపడి తన తల్లిబాధ పోగొట్టవలెనన్న గంగాదేవిని తండ్రి శిరమునుండి పారదోలవలెనని నిశ్చయించుకొన్నవాడై భూలోకమునందలి గౌతమమహర్షి ఆశ్రమమునకు పార్వతీదేవి చెలికత్తెయగు జయాంగనతో మారువేషమున అతిథిగా విచ్చేసెను.

ఒకనాడు గణపతి ఆజ్ఞప్రకారము జయాంగన గోరూపమునుదాల్చి గౌతముని వరిచేనులోబడి మేయుచుండెను. అదిచూచి గౌతమమహర్షి అతిథిపూజకు లోపము కల్గునను భయముతో ఒక దర్భపుల్ల ఆవుపైవేసి ''హుష్''మని అదిలించెను. అంతట ఆ ఆవు ప్రాణములను విడిచెను. అది చూచిన ఆశ్రమవాసులందరు గౌతముని వద్దకువచ్చి, ''ఓ మహర్షీ నీవు గోహత్య చేసితివి. కావున మీయింట భోజనము చేయము. పోవుచున్నామ''ని పలికిరి. అంతట గౌతముడు ఈ పాపమునకు ఏదైనా ప్రాయశ్చిత్తమును విధింపుడని ప్రార్థించెను. అంతలో మారువేషములో నున్న గణపతి అక్కడికివచ్చి ఇట్లు చెప్పెను. ''దీనికి ప్రాయశ్చిత్తము కలదు. నేను చెప్పినట్లుచేసిన నీపాపము పోవును. వినుము. పరమశివుని జటాజూటమున గంగామహాదేవి యున్నది, నీవు ఆదేవుని ప్రార్థించి గంగనిట ప్రవహింపచేసినచో పాపవిముక్తుడవు కాగలవు.'' ఇది

విని గౌతమమహర్షి కైలాసమునకేగి శివుని ప్రార్థించి గంగాదేవిని గొనితెచ్చి తన ఆశ్రమద్వారమునుండి ప్రవహింపచేసెను. అదియే గోదావరియనియు, గౌతమి యనియు ప్రసిద్ధిచెందిన పవిత్రనది.

గోదావరి, బ్రహ్మగిరి మొదలుకొని సాగరసంగమము వరకు అనేక తీర్థక్షేత్రములను కలిగియున్నది. త్ర్యంబక మనుచోట ప్రవహించుప్రదేశమున గౌతముడు శివలింగమును ప్రతిష్ఠించి త్ర్యంబకేశ్వరుడని పేరుపెట్టెను. ఇట్లే భద్రాచలము, పట్టిసీమ, మార్కండేయక్షేత్రమగు రాజమహేంద్రవరము మొదలగు ప్రదేశములగుండా ప్రవహించుచు సమస్తపాపములనుహరించి పవిత్రులను చేయుచున్నదీ గౌతమి. రాజమహేంద్రవరమున గోదావరి సప్త ఋషుల ప్రార్థనలతో సప్తగోదావరిగా తుల్య, ఆత్రేయ, భరద్వాజ, గౌతమి, వృద్ధగౌతమి, వాశిష్ఠ, కౌశికీ అనేపేర్లతో ఏడుపాయలుగా ప్రవహించుచు సాగరమున కలియుచున్నది. దీనికి సప్తగోదావరి యని పేరు. ఇట్టి పవిత్రగోదావరీ నదీపుష్కరములు పన్నెండుసంవత్సరములకొకసారి వచ్చును.

పుష్కరమనగా, మహర్షులు భారతదేశమునకు భారతీయులకు, పవిత్రతను కలిగించవలెనను భావముతో, సమస్తతీర్థములకు అధిపతియగు పుష్కరరాజును (వరుణదేవుని) ప్రార్థించి "మహానుభావా! నీవు సర్వతీర్థములతో భారతదేశమునగల గంగాది పన్నెండునదులలో సంవత్సరమునకు ఒకనదిచొప్పున వసించి వారిని తరింపజేయుము" అని కోరిరి. అందులకు పుష్కరరాజు అంగీకరించి తన సమస్తతీర్థములతో - గురుడొక్కొక్కరాశిలో ఒక్కొక్కసంవత్సరముండును కావున ఆ లెక్కప్రకారము-ఒక్కొక్కనదిలో ఒక్కొక్కసంవత్సరము చొప్పున నివసించుచు భారతజనులను తరింపచేయుచుండును.

ఇట్టి పవిత్ర పుష్కరదినములలో దేవలోకమునుండి ముప్పదిమూడుకోట్ల దేవతలు సార్ధత్రికోటితీర్థములను తీర్థరాజుతోకూడి నదులలో నివసించుచుండును. కావున అరువదివేలసంవత్సరములు గంగలో స్నానముచేసినఫలము పుష్కరదినములలో ఒక్కనాడు గోదావరిస్నానముచేసిన లభించును. పుష్కరప్రవేశమయిన తరువాత మొదటి 12 దినములు, మధ్య 12 దినములు, చివర 12 దినములు ఉత్తమములు. ఇందు మొదటి 12 దినములు చాలా ఉత్తమ దినములు. కావున ఈ పుష్కరదినములలో ప్రతిదినమును స్నాన, దాన, పితృతర్పణాదులు నిర్వర్తించి ముక్తిని పొందుటకై మానవులందరు కృషి చేయవలెను.

కావున యావన్మందిమానవులు రాబోవు పుష్కరదినములలో పవిత్రమైన గోదావరినదిలో స్నానముచేసి సమస్త సౌభాగ్యములనుపొంది సుఖముతో వర్ధిల్లుదురుగాక!

సంపాదకులు : స్వామి తన్మయానంద.

శ్రీ ఎమ్. బాలసుందరంగారిచే ఫ్రీడమ్ ప్రెస్, (మద్రాసు-600 021) న ముద్రింపబడి.

స్వామి తన్మయానందవారిచే శ్రీ రామకృష్ణమఠము (మద్రాసు-600 004) నుండి ప్రచురింపబడినది.

| | | | |
|---|---|---|---|
| [illegible] | [illegible] | [illegible] | 4.00 |
| [illegible] | [illegible] | అద్వైత వేదాంతము | 2.50 |
| [illegible] | [illegible] | ప్రాచ్యము - పాశ్చాత్యము | 1.25 |
| [illegible] | [illegible] | భారతము, సంస్కృతి, సామ్యవాదము | 3.00 |
| [illegible] | 2.50 | భారతదేశము | 2.00 |
| [illegible] | 2.00 | భారతీయ మహిళ | 2.00 |
| [illegible] | [illegible] | నా జీవితము, జీవిత కార్యము | 1.25 |
| [illegible] | 1.50 | శ్రీ రామకృష్ణ సేవాసంఘ: తదాదర్శములు | 0.50 |
| శ్రీ రామకృష్ణ [illegible] ంస జీవిత సంగ్రహము | 0.75 | చికాగో నగరోపన్యాసములు | 1.00 |
| ఆరాత్రికము మరియు | | శ్రీ వివేకానంద శంఖారావము | 0.80 |
| శ్రీ రామనామ సంకీర్తనము | 0.50 | నవీన భారత దేశము | 0.40 |
| శ్రీ శారదాదేవి జీవిత చరిత్ర | 4.00 | సర్వం విష్ణుమయం జగత్ | 0.35 |
| శ్రీ శారదాదేవి | 2.50 | శ్రీ వివేకానంద సింహగర్జనలు | 0.20 |
| శ్రీ శారదా సూక్తి నవనీతము | 0.80 | బ్రహ్మానంద బోధనలు | 4.75 |
| శ్రీ వివేకానంద జీవిత చరిత్ర | 4.00 | తాపత్రయ చికిత్స | 0.60 |
| బాలల వివేకానందుడు | 2.00 | ముక్తిమార్గము | 0.30 |
| శ్రీ వివేకానంద సంపూర్ణగ్రంథావళి | | పారమార్థిక సంభాషణలు | 0.50 |
| 8 సంపుటముల పూర్తిసెట్టు (సాదా) | 56.00 | నారద భక్తి సూత్రములు | 4.00 |
| .. .. (క్యాలికో) | 61.00 | శ్రీ దొడ్డ భాగవతము-మూడవ సంపుటము | 7.50 |
| విడి సంపుటములు ఒక్కొక్కటి (సాదా) | 5.00 | దేవీమాహాత్మ్యము | 4.00 |
| .. .. (క్యాలికో) | 6.50 | శ్రీ మద్భగవద్గీత | 8.00 |
| స్వామి శిష్య సంవాదములు | 10.50 | శ్రీ మద్భగవద్గీత చిన్నసైజు | 3.00 |
| సందేశ తరంగిణి (మొదటి భాగము) | 4.00 | పారాయణగీత తాత్పర్యసహితము | 3.75 |
| .. (రెండవ భాగము) | 5.50 | .. మూలము | 2.00 |
| భారత యువజనులారా! | 3.00 | కఠోపనిషత్తు | 2.00 |
| ప్రబోధ రత్నాకరము | 3.75 | గిరీశచంద్ర | 1.00 |
| రాజయోగము | 6.25 | భక్తిమార్గము | 1.00 |
| కర్మయోగము | 4.00 | శ్రీకృష్ణవాణి | 0.80 |
| భక్తియోగము | 4.00 | బుద్ధవాణి | 0.80 |
| శ్రీ వివేకానందలేఖావళి (మొదటిభాగము) | 2.25 | క్రీస్తు సూక్తిమాల | 0.80 |
| .. (రెండవభాగము) | 3.00 | మహమ్మదు సూక్తి మంజరి | 0.80 |
| హిందూ మతము | 4.00 | శ్రీ విష్ణుసహస్రనామ స్తోత్రము | 1.25 |

ఇవియేకాక ఆంగ్ల, సంస్కృత, తమిళ, హిందీ, కన్నడ గ్రంథములును,

వేదాంత కేసరి (ఆంగ్లము) శ్రీ రామకృష్ణ విజయము (తమిళము)

అను మాసపత్రికలును, శ్రీ రామకృష్ణ పరమహంస, శ్రీ శారదాదేవి, శ్రీ వివేకానందస్వామి మున్నగువారి ఛాయాచిత్రములు, త్రివర్ణ చిత్రములు, తైలచిత్రములు మున్నగున వెన్నియో మా యొద్ద లభింప గలవు.

అడ్రెసు: మేనేజరు, శ్రీ రామకృష్ణ మఠము, మైలాపూరు, మద్రాసు - 600 004

సంవత్సర చందా రూ. 10-00 జీవిత చందా రూ. 125-00 విడి సంచిక 1-00 రూ

# శ్రీ రామకృష్ణ ప్రభ

ఆత్మనో మోక్షార్థం జగద్ధితాయ చ

సంపుటము 36 సంచిక 10

అక్టోబరు 1979



## TIRUMALA TIRUPATI DEVASTHANAMS, TIRUPATI

"Sri Venkateswara Nitya Prasada Dana Endowment Scheme"

Would you like to feed the poor Among The Lord's devotees At Tirumala ?

The Hindu religious literature is replete with legends about the sanctity of poor feeding. Feeding the poor devotees of the Lord, in a holy place like Tirumala is particularly propitious. Equally auspicious and popular in the custom of distribution of the Lord's prasadams to his devotees.

The Tirumala Tirupati Devasthanams have now introduced a scheme-Sri Venkateswara Nitya prasada Dana Endowment Scheme by which you can distribute either food packets or laddus or Vadas to Pilgrims to Tirumala.

You make an endowment of Rs. 500/- to the T. T D. The annual interest on it will be utilised either to feed 20 poor pilgrims or distribute 20 laddus, or 15 Vadas to pilgrims in the que lines.

The distribution will be done as desired by you on any one day of the year, as specified by you - your birthday, wedding aniversary day, your son's or daughter's birthday, your father's or mother's sraadhaday, any day of the year of sentimental value to you.

Any number of endowments can be made by a donor and each endowment can be on a different day, as desired. Those who make a minimum of 20 endowments will be provided free darsan for a family of five persons on the notified day value Rs. 125/- per year on the basis of the present cost of five special Darsan Tickets.

The name and gotra of every donor will be read out at the Koluvu (daily ritual of notification to the Lord) on the due donation day.

The actual distribution will start from 17th March, 1980, Telugu New Year's Day, and on endowments will be accepted with immediate effect.

Your contribution to this also earnos exemption from Income Tax and you may kindly quote this while claiming Income Tax relief in your assessment.

Donations may please be sent through the branches of Andhra Bank, all over India, or by D.D's of any bank, in favour of the Executive Officer, T. T. Devasthanams, Tirupati to:

The Manager, Andhra Bank Ltd, 11-1-122, Gandhi Road, Tirupati, 517501 with the following particulars:

Name, Gothra/family name full address of the Grihastha/Donor, Item to be distributed.

Date on which the distribution is to be made.

*Executive Officer :*

**TIRUMALA - TIRUPATI DEVASTHANAMS, TIRUPATI.**

# శ్రీ రామకృష్ణ ప్రభ

సంపుటము 36 1979 - అక్టోబరు సంచిక 10

## విషయసూచిక



గమనిక:—ఈసంచికలో, రామకృష్ణ కథామృతము ప్రచురింపబడలేదు.

---

శ్రీ రామకృష్ణ ప్రభ

సంవత్సర చందా: రూ. **10-00.** జీవిత చందా: రూ. **125-00.**

శ్రీ రామకృష్ణమఠము,

మైలాపూర్, మద్రాసు—600-004.

# రామకృష్ణ ఆశ్రమము, రాజ్‌కోట్ - ఒక విన్నపము

గుజరాత్ రాష్ట్రములోని మోర్వివద్ద ఆనకట్ట బ్రద్దలయి సంభవించిన ఘోర విపత్తు వార్త తెలిసిన $2\frac{1}{2}$ గంటలలోపలే, రాజ్‌కోట్ శ్రీ రామకృష్ణ ఆశ్రమము సత్వరసహాయకార్యక్రమము చేపట్టినది. మోర్విలో ఒక శిబిరమును ఏర్పాటుచేసుకొని అక్కడనుండి ఆశ్రమ కార్యకర్తలైన స్వాములు, స్వచ్ఛందసేవకులు రెండు జట్లుగా ఏర్పడి ఒకజట్టు మోర్వికి, మరొకజట్టు చుట్టుపట్ల గ్రామములకు రోజూ వెళ్ళి నిత్యావసర వస్తువులను ప్రజలకు పంపక మొనరించుచున్నది. మొదట పన్నెండురోజులు, వండిన ఆహారదినుసుల పొట్లములను చాలమందికి అందించుట జరిగినది. ఇప్పుడు ధాన్యము, పప్పుదినుసులు, కాయగూరలు, చక్కెర, బెల్లము, పాత్రలు, గుడ్డలు, చాపలు, సోపులు మొదలగు నిత్యావసర వస్తువులను పంచిపెట్టుట జరుగుచున్నది. మోర్వి పట్టణములో 8,140 కుటుంబములకు, చుట్టుపట్ల ఇరువది గ్రామములలో 2,954 కుటుంబములకు సహాయము అందించుట జరుగుచున్నది.

ఇంతేగాక, ఎక్కువ దెబ్బతిన్న గ్రామములలోను, మోర్వి పట్టణమునందును పెద్ద ఎత్తున పునర్నిర్మాణకార్యక్రమము చేపట్టుటకు రామకృష్ణ ఆశ్రమము నిశ్చయించినది. ఈ గురుతర కార్యనిర్వహణలో మీ అందరి సహాయసహకారమునకై అభ్యర్థించుచున్నాము. ఘోరవిపత్తుకు పాలయి అలమటించుచున్న మోర్వి సోదరులకు సహాయముగా సహృదయులైన మీరు విరాళములతో ముందుకు రావలసినదిగా అభ్యర్థించుచున్నాము. శ్రీ రామకృష్ణ ఆశ్రమమునకు అందించు విరాళములపై ఇన్‌కమ్‌టాక్స్ లేదని తెలియజేయుచున్నాము.

స్వామి వ్యోమానంద, అధ్యక్షుడు.

**రామకృష్ణ ఆశ్రమము**

రాజ్‌కోట్, గుజరాత్ రాష్ట్రము

# భాగవత కృష్ణుడు

యల్లంరాజు సుబ్బారావు.

మహర్షి వేదవ్యాసులు రచించిన గ్రంథాల్లో భాగవతం సర్వోత్కృష్టమైనది. విద్వత్సమాజంలో ఆదరణీయ గ్రంథంగా ప్రసిద్ధి కెక్కి 'విద్యావతాం భాగవతే పరీక్షా' అన్న వాక్యం చరితార్థమైంది. ఇందులో శ్రీకృష్ణుడు సాక్షాత్తు పరబ్రహ్మగా, పరమాత్మగా, పూర్ణావతారంగా వర్ణించబడ్డాడు భాగవత కృష్ణుణ్ని వర్ణిస్తూ సుప్రసిద్ధ భాష్యకారుడు శ్రీధరస్వామి ఇలా పేర్కొన్నాడు—

కృషిర్భూవాచకః శబ్దః ణశ్చనివృత్తి వాచకః।
తయోరైక్యాత్ పరంబ్రహ్మ కృష్ణ ఇత్యభిధీయతే॥

కృష్ ధాతువుకు 'నక్' ప్రత్యయం, మరియు 'ణ'త్వం చేరిస్తే కృష్ణ శబ్దం ఏర్పడింది. ఇక్కడ 'కృష్' అంటే సంసారమని, 'ణ' అంటే నివృత్తి అని అర్థం. ఈ రెండింటిని జోడించినందువలన యేర్పడిన కృష్ణ శబ్దానికి అర్థం పరబ్రహ్మ అని. ఎందువలనంటే పరబ్రహ్మ లేక పరమాత్మ జీవులను సంసారంనుండి విముక్తులను కావిస్తాడు.

శ్రీ కృష్ణుడు పూర్ణావతారుడు :

ఏకో న వింశే వింశతిమే వృష్ణి ప్రాప్య జన్మనీ।
రామకృష్ణా వితి భువో భగవానహరద్ భరమ్॥

పై భగవద్వచన ప్రకారం కృష్ణుడు పరబ్రహ్మ యొక్క ఇరువదవ అవతారం.

ఎతేచాంశ కలాః పుంసః కృష్ణస్తు భగవాన్ స్వయమ్।

పై భాగవత సిద్ధాంత ప్రమాణాన్ననుసరించి కూడా కృష్ణుడు పూర్ణావతారుడే. ఎందువలనంటే పరబ్రహ్మ స్వభావం యుగపద ధర్మానికి విరుద్ధంగా ఉంటుంది. అలాగే కృష్ణభగవానుని చరిత్ర కూడా ప్రతిఘట్టంలో విరుద్ధ ప్రకృతితో నడుసుంది. బ్రహ్మ స్వభావం యొక్క విరుద్ధ ధర్మాశ్రయత్వం నిరూపించడానికి క్రింది శ్రుతులు తార్కాణాలు.

అణోరణీయాన్, మహతోమహీయాన్ (కఠ)
నమోహ్రస్వాయచ వామనాయచ నమోబృహతేచ

నమోజ్యేష్ఠాయచ కనిష్ఠాయచ (శుక్లయజు)
తదేజతి తన్నైజతి ( ,, )
అపాణి పాదో జవనోగ్రహీతా
పశ్యత్య చక్షుః సశ్రుణోత్యకర్ణః।
సవేత్తి వేద్యం నచ తస్యాస్తి
వేత్తాతమాహురగ్ర్యం పురుషం మహాన్తమ్(శ్వేతాశ్వ)
మొదలయినవి.

ఇప్పుడు కృష్ణుని విరుద్ధ ధర్మాలపై కూడా దృష్టిని సారిద్దాం.

ఆయనేమో అర్భకుడు, అంగాలు కోమలమైనవి. దూడల తోకలను పట్టుకుంటే అవి ఆయన్ను ఎక్కడికో యీడ్చుకొనిపోయేవి. 'వత్రైనరిత స్తత ఉభావపికృష్యమాణౌ' మరొకచోట, బాలకుడయినా ఎంతో సమర్థవంతుడిగా చిత్రించబడ్డాడు. గోకులాన్నంతా ఆయన తన ఆటలతో కట్టివేశాడు; ముంచివేశాడు. 'కృష్ణస్య గోప్యో రుచిరం వీక్ష్య కౌమార చాపలమ్.'

ఆయన చాలా తేలికగా ఉండేవాడు. యశోద ఆయన్ను ఒడిలో కూర్చొనబెట్టుకొని స్తన్యమిచ్చేది కాని అదే శైశవావస్థలో ఆయన పూతనను మట్టుబెట్టాడు; తృణావర్తుణ్ణి గాలిలోనే ఎగురగొట్టి హతమార్చాడు. అదే క్షణంలో ఆయన బ్రహ్మదేవునికి తనరూపంలో ఏకత్వాన్ని, అనేకత్వాన్ని, ద్విభుజత్వాన్ని, చతుర్భుజత్వాన్ని చూపించాడు. ఈ రీతిగా విరుద్ధ ధర్మాశ్రయత్వమయిన పరబ్రహ్మ చిహ్నాలన్నీ మనకు భాగవత కృష్ణునిలో గోచరిస్తాయి.

'ఏకోఽహం బహుస్యాం ప్రజాయేయ'

కృష్ణభగవానుడు రాసలీలల్లోనూ, ద్వారకలోనూ, అంతఃపురాల్లోనూ ఎన్నో రూపాలు

ధరించి విహరించాడు. ఇది కూడా పూర్ణావతారాన్ని నిరూపిస్తుంది.

పరమాత్మ తన సంకల్పం వల్లనే తననుండే ప్రపంచాన్ని సృష్టిస్తాడు. ఇదే పరబ్రహ్మ పూర్ణశక్తి. అలాగే, తన ముఖారవిందంలో త్రిభువనాలను ఆయన రెండుసార్లు యశోదకు చూపించగలిగాడు.

> ప్రీతప్రాయస్య జననీ సా తస్య రుచిరస్మితమ్।
> ముఖం లాలయతీ రాజన్ జృంభతో దదృశే ఇదమ్॥
> ఖం రోదసీ జ్యోతిరనీకమాశాః
> సూర్యేందువహ్నిశ్వసనాంబుధీంశ్చ
> ద్వీపాన్ నగాంస్తద్దుహితౄర్వనాని
> భూతాని యాని స్థిరజంగమాని (భాగవతం)
> సా తత్ర దదృశే విశ్వం జగత్ స్థాస్ను చ ఖం దిశః।
> సాద్రిద్వీపాబ్ధి భూగోలం సవాయ్వగ్నీందు తారకమ్॥
> (భాగ) మొదలయినవి.

ఇక గీతలో—11 వ అధ్యాయం.

కృష్ణుడు అర్జునునికి విశ్వరూపం చూపించాడు అంటే తన రూపంలో సమస్త ప్రపంచాన్ని ప్రదర్శించి చూపించాడు.

> ఇహైకస్థం జగత్కృత్స్నం పశ్యాద్య సచరాచరమ్
> మమదేహే గుడాకేశయచ్చాన్యద్ ద్రష్టుమిచ్ఛసి॥

ఈ ప్రకారం విరాట్ విశ్వాన్ని చూపించినందువల్లనే కృష్ణున్ని పూర్ణబ్రహ్మస్వరూపంగా నిరూపించవచ్చును. భాగవతంలో అన్ని చోట్లా ఆయన పూర్ణత్వానికి, పరబ్రహ్మ స్వరూపానికి సంబంధించిన శ్లోకాలు మనకు కనబడతాయి. ఇతరత్రా కూడా అధర్వ వేదీయ గోపాలతాపనీ ఉపనిషత్తులో, కృష్ణోపనిషత్తులో, అన్ని పురాణాల్లో కృష్ణుని పరబ్రహ్మ పూర్ణస్వరూపం స్పష్టంగా ప్రతిపాదించబడి గోచరిస్తుంది.

కొందరు విమర్శకులు కృష్ణున్ని జారుడని, విషయలోలుడని పేర్కొంటారు. దీనికోసమే ఆయన రాసలీలలు జరిపాడని వారి వాదన. అందువల్ల ఆయన్ను పూర్ణావతారునిగా పేర్కొనడం తగదని వారి ఆక్షేపణ. కాని వీరి విమర్శలు సహేతుకాలు కావు. ఎందువల్లనంటే, పూర్ణ పురుషుడయిన పురుషోత్తముడు ప్రజలను అనుగ్రహించడానికే అవతారాలు ధరిస్తున్నాడు. ఈ అవతారాల్లో ఆయన ఎన్నో లీలలు ప్రదర్శిస్తాడు. ఈ లీలల శ్రవణంవల్ల ముక్తులు, ముముక్షువులు, విషయలంపటులు—అన్నిరకాల ప్రజల మనస్సులు ఆకర్షింపబడుతాయి.

> అనుగ్రహాయ భూతానాం మానుషం దేహమాస్థితః।
> భజతే తాదృశీః క్రీడా యాః శ్రుత్వా తత్పరో భవేత్
> కామం క్రోధం భయం స్నేహమైక్యం సౌహృదమేవచ
> నిత్యం హరౌ విదధతో యాంతి తన్మయతాంహితే
> న మయ్యావేశిత ధియాం కామః కామాయ కల్పతే
> భర్జితా క్వథితా ధానా ప్రాయో బీజాయ నేష్యతే
> ఉద్దామ భావ పిశునామల వల్గుహాస
> వ్రీడావలోక నిహతో మదనోపి యాసామ్।
> సమ్ముహ్యచాప మజహాత్ ప్రమదోత్తమాస్తా
> యస్యేంద్రియం విమథియంకుహకైర్న శేకుః॥
> తమయం మన్యతే లోకోహ్యసంగమపి సంగినమ్.
> ఆత్మౌపమ్యేన మనుజం వ్యాపృణ్వానం యతో బుధః॥

పై శ్లోకాలవల్ల కృష్ణభగవానునిలో విషయాసక్తి ప్రసక్తి ఎక్కడా గోచరించదని విశదమవుతుంది. శుక యోగీంద్రులు కూడా భగవానుడు ఆత్మారాముడై విహరించాడని పదేపదే ప్రస్తావిస్తూ వచ్చారు—

> 'ఆత్మారామోఽప్యరీరమత్'
> 'రేమే తయా చాత్మరత ఆత్మారామోఽప్యఖండితః'
> 'సిషేవ ఆత్మన్యవరుద్ధ సౌరతః'
> 'రేమే స్వయం స్వరతిరత్రగజేంద్ర లీలః'
> 'యథార్భకః స్వప్రతిబింబ విభ్రమః'
> మొదలయినవి.

# స్మృతికథ

మూలం: స్వామి అఖండానంద

అనువాదం: శ్రీమతి తురగా జానకీరాణి

## ఉపోద్ఘాతం

శ్రీరామకృష్ణ పరమహంస పదహారుమంది ప్రత్యక్ష శిష్యులలోనూ స్వామీ అఖండానంద ఒకరు. గంగాధర ఘటక్ అనేది వీరి పూర్వాశ్రమ నామం. 1864లో జన్మించారు. 1883 వ సంవత్సరంలో, పూజ్య శ్రీరామకృష్ణులని దర్శించారు. మూడు సంవత్సరాలపాటు, వారి దివ్య సన్నిధిలో గడిపారు. స్వామీ అఖండానంద స్మృతులు, అనుభవాల కథనమే యీ పుస్తకం. సనాతన హైందవ సంప్రదాయానుసారంగా, అతి కఠోర నియమాలను పొల్లుపోకుండా పాటించే వారాయన. స్వామీ వివేకానంద సాంగత్యంలో కొంతవరకు ఆ పద్ధతులు విడనాడారు.

1887 వ సంవత్సరం నుంచి సంచారభిక్షువులె ఆయన దేశాటనం మొదలుపెట్టారు, హిమాలయాలుదాటి, టిబెట్ వెళ్లారు మూడుసార్లు. 1890 వ సంవత్సరం నుంచి వివేకానందస్వామితో కలిసి హిమాలయాలు మొదలైన అనేక ప్రాంతాలలో పర్యటించారు. అప్పుడు ఆయన దృక్పథంలో గొప్ప మార్పు కలిగింది. నిరుపేదలు, బాధామయజీవుల సేవలోనే భగవంతుణ్ణి దర్శించగలనన్న కరుణ దృష్టి ఏర్పడింది. కటికపేద, అమాయక ప్రజలకు విద్య నేర్పడం, కలరావ్యాధి పీడితులకు అవిరామంగా సేవ చేయటం-1897 వరకూ గల ఆయన కార్యక్రమాలలో ముఖ్యమైనవి.

విద్య, సేవారంగాలలో వివేకానందస్వామికి ముఖ్యమైన అనుయాయుల్లో ఒకరు అఖండానందస్వామి. మానవసేవే మాధవసేవ అనే సత్యాన్ని గుర్తించి, మనసారా ఆచరించారాయన. మతంయొక్క అంతిమ లక్ష్యం, పరమార్థం, సేవే అనే వివేకానందుల విశ్వాసాన్ని ప్రత్యక్షంగా ఆచరణలో చూపిన ప్రప్రథములు అఖండానందులే. వజ్రసంకల్పంతో కార్యదీక్ష పూనారు ఆయన. శాస్త్రాధ్యయనంచేసి, ధ్యానవిమగ్నులై, పవిత్ర యాత్రాస్థలాల్లో తిరుగాడటం మాత్రమే సన్యాసుల విధి అని ఒకనాటి నమ్మిక. మనుష్యుల భౌతిక, ప్రాపంచిక అవసరాలను గుర్తించి వాటిని తీర్చడం, సన్యాసుల జీవన పరిధిలోకి రావని అప్పటి భావన. ఈ విషయంలో వివేకానంద స్వామి విప్లవాత్మకమైన మార్పును తెచ్చి, సన్యాసులశిక్షణలో నిస్వార్థసేవను ఒక ప్రధానభాగంగా చేర్చారు. ఈ ఆశయాన్ని ఆకళింపు చేసుకుని, తనలో సహజంగానే వున్న కరుణరస దృష్టిని, పీడిత మానవసేవవైపు సారించారు స్వామీ అఖండానంద.

1899 లో మాహులాలో అనాథాశ్రమాన్ని స్థాపించటం, 1913 లో స్వంతభవనంలోకి ఆశ్రమాన్ని మార్చడం జరిగాయి. ఈనాటికీ నడుస్తోందీ ఆశ్రమం. శాశ్వతమైన యీ కార్యక్రమంతో పాటు, బీహార్ వరదలు, భూకంపాల సమయంలో సహాయ కార్యక్రమాలు నిర్వహించారు. 1925 వ సంవత్సరంలో, రామకృష్ణ మఠానికి ఉపాధ్యక్షులైనారు, ఆ తర్వాత 1934 లో అధ్యక్షులైనారు స్వామీజీ. చిట్టచివరిరోజుల్లో ఆయన కోరికమీద, బేలూరుమఠానికి తీసుకుని వెళ్లారాయనను. 1937 వ సంవత్సరం ఫిబ్రవరి 7 వ తేదీన తన 73 వ ఏట పరమపదించారు స్వామీ అఖండానంద.

ఆయనది ఒక మహనీయమైన వ్యక్తిత్వము. ధ్యాన విమగ్నతలో, సమాధి స్థితిలోనూ కూడా అచంచల సంకల్పుడైన యీయన, ఎన్నడూ మానవ వేదనలనుంచి దూరమైపోలేదు. భారతదేశ ప్రజల జీవనాడిపైన ఆయన హస్తము ఎప్పుడూ వున్నది. బిపిన్‌చంద్రపాల్, సురేంద్రనాథ బెనర్జీ వంటి కాంగ్రెసు నాయకులకు, ప్రజలతో సన్నిహితత్వం ఏర్పఱచుకోమని హెచ్చరికలు చేశారుకూడా. ఆయన హృదయమే కాదు, మేధస్సూ గొప్పదే. బహుప్రజ్ఞాశాలి. తన సుదీర్ఘ యాత్రానుభవాలను గురించి చెబుతూ, వాక్చతురియతో ప్రజలను ముగ్ధులను చేసేవారు. మాతృభాష బెంగాలీలో అనర్గళంగా ఉపన్యసించడమే కాక, సంస్కృతం, ఇంగ్లీషు భాషలలో మంచి పాండిత్యం వుండేది. సంస్కృత భాషాధ్యయనంలో, ముఖ్యంగా వైదిక సాహిత్య పఠనంలో ఆయనకి ఆసక్తి కలిగింది. ఖేత్రీ మహారాజావారి సంస్కృత పాఠశాలలో వేదపఠనం ఏర్పాటుచేశారు.

సంస్కృత వ్యాకరణం, శుశ్రుత, చరకుల ఆయుర్వేద గ్రంథాల పఠనం కొనసాగింపచేశారు. కళల పట్లా, గ్రంథాలయాల పట్లా, తోటల పెంపకమునందూ స్వామీజీకి చాలా ఆసక్తి. అనేక వ్యాపకాలలో నిమగ్నమై

వుంటూనే, గ్రామగ్రామానికీ వెళ్లి, అక్కడ నాగపుష్పాలు దొరుకుతాయేమోనని చూచేవారు. (నాగపుష్పాలంటే శ్రీరామకృష్ణునికి ప్రీతి.) మాధవుని సేవలో, మానవునిలో వున్న మాధవుని సేవలో నిమగ్నమైన సర్వసంగపరిత్యాగి, మానవతామూర్తి కూడా.

బెంగాలీలో 'స్మృతికథగా' స్వామీ అఖండానంద వ్రాసిన పుస్తకం ఆంగ్లంలోకి అనువదించబడింది. ఆ మూడధ్యాయాల గ్రంథానికి తెలుగు అనువాదం ధారావాహికంగా ప్రచురిస్తున్నాము.

---

మొదటి అధ్యాయము

# గురుచరణసన్నిధిలో....
# నిజమైన సనాతనత్వం అంటే ఏమిటి?

శ్రీరామకృష్ణులని నేను మొట్టమొదటిసారిగా 1883వ సంవత్సరం వేసవికాలంలో దక్షిణేశ్వర్‌లో కలుసుకున్నాను. నాకప్పుడు పదహారేళ్లు. అప్పట్లో స్వామీ అద్వైతానంద ఒక్కరే ఆయనవద్ద వుంటుండేవారు. నేను వెళ్ళినప్పుడు, వారూ ఆ గదిలోనే వున్నారు. శ్రీరామకృష్ణ నన్ను తనదగ్గరగా కూర్చోపెట్టుకుని, "నన్ను యిదివరకు ఎప్పుడైనా చూచావా నువ్వు?" అన్నారు.

"చూచాను. నేను చాలా చిన్న పిల్లవాడిగా వున్నప్పుడు దీనానాథ్ బోస్ గారింట్లో (కేశవచంద్రసేన్ అనుచరుడు) చూచాను" అన్నాను.

రామకృష్ణ చిరునవ్వుతో, స్వామీ అద్వైతానంద వేపు చూసి, "గోపాల్, విన్నావా? చిన్నతనంలో నన్ను చూశాట్ట! ఈ పసివాడికి ఒక చిన్నతనం కూడా వుందిట" అన్నారు.

ఆ రాత్రికి వుండి పొమ్మన్నారు పూజ్యపాదులు నన్ను. ఉండిపోయాను. సూర్యాస్తమయమవుతుండగా, కాళీమాత, విష్ణుదేవాలయాల్లో దర్శనం చేసుకుని, పంచవటి'కి రమ్మన్నారు. ఆ సాయంత్రం శ్రీరామకృష్ణుల గదికి తిరిగి వెడుతుండగా, రెండు నౌబత్ ఖానాలనుండి సంగీతం వినిపిస్తోంది. ఆవరణ యావత్తూ సంజెగంటల సవ్వడితో మారుమ్రోగుతోంది. రామకృష్ణుల గది చీకటిగా వుంది. ధూపవాసనలు ఆహ్లాదకరంగా వ్యాపిస్తున్నాయి. ఆయన మంచంమీద కూర్చొని వున్నారు. ఆయన ఆకారమే కనుపించటం లేదు. బాహ్యప్రపంచ ధ్యాస లేదు. మరునాడు, కలకత్తాకి ప్రయాణమై వెళ్ళబోతుంటే, మళ్ళీ శనివారం రమ్మని, చిరునవ్వుతో చెప్పారు.

రెండోసారి, కొన్నిరోజుల తర్వాత వారిని కలుసుకున్నప్పుడు కూడా, రాత్రికి వుండి పొమ్మన్నారాయన. సంధ్యార్చనలు ముగిసిన తర్వాత, రామకృష్ణులు నాకొక చాప యిచ్చి, నేలమీద పరచమన్నారు. ఒక తలగడ తెచ్చి వేసికొని, చాపమీద పడుకున్నారు. 'నేను తల్లిని, నువ్వు నా కొడుకువి' అన్నారు. సర్దుకుని సుఖంగా కూచుని, ధ్యానం చేయమన్నారు.

"ముందుకి వంగి కూర్చోవడం గానీ, మరీ నిటారుగా కూర్చోడం గానీ మంచిదికాదు" అన్నారు.

ఆ తర్వాత ఆయన నా నాలుకమీద ఏదో వ్రాసి, నాకు దీక్ష యిచ్చారు. తన పాదాలు వత్తమన్నారు. నేను ఆ రోజుల్లో కసరత్తులు చేయడంవల్ల చాలా బలంగా వుండేవాణ్ణి. ఆయన కాళ్ళు కొంచెం గట్టిగా వత్తగానే, ఆయన అరిచారు; "ఏం చేస్తున్నావు? నా

కాళ్లు నలిగిపోతాయి. కాస్త నిదానంగా వత్తు'' అని. నేను భయపడ్డాను, ఆశ్చర్య పోయాను కూడా.

''మరెల్లా వత్తమంటారు?'' అన్నాను.

''ఊరికే నీ చేతులతో అల్లా మృదువుగా రాయి. బలంవద్దు'' అన్నారు. నేను అల్లాగే చేశాను. అప్పుడు గ్రహించాను ఆయన శరీరం వెన్నరాచిన ఎముకలతో చేసినట్లు ఎంత మెత్తగా వుందో! కాస్సేపటికి ఆయన అన్నారు. ''నిరంజన్ (స్వామీనిరంజనానంద) కూడా నీ లాగే చేశాడు మొదట్లో'' అని.

అప్పటినుంచి నేను శ్రీరామకృష్ణులని తఱచుగా దర్శించుకునేవాణ్ణి. మధ్యాహ్నం చేరడం, రాత్రి వుండి, మర్నాడు తెల్లవారి బయలుదేరడం. చాలామంది శిష్యులు ఆయనను చూడడానికి వచ్చేవారు. వారిలో, లాటు (స్వామీ అద్భుతానంద) హరీష్ (హరీష్ కుందు అనే గృహస్థు)-వీరిద్దరూ ఎక్కువకాలం ఆయనతో గడిపేవారు.

నేను ఆ రోజుల్లో చాలా ఛాందసంగా వుండేవాణ్ణి. శాస్త్రోక్తంగా, బ్రాహ్మణత్వ ఆచారాలనన్నిటినీ తుచ తప్పకుండా పాటించేవాణ్ణి. ఉదాహరణకు రోజూ నాలుగుసార్లు స్నానం చేసేవాణ్ణి. ఒక్కసారీ నూనె పూసుకోనందువల్ల చర్మమంతా పొడిపొడిగా తయారయ్యేది. భోజనం తర్వాత విపరీతంగా వక్కలు నమిలేవాణ్ణి. దాంతో నా పెదవులు తెల్లగా అయిపోయినాయి. ఇది చూసి, శ్రీరామకృష్ణులు ''నువ్వు చిన్నవాడివి. ఈ ముసలి ఆలోచనలూ, పద్ధతులూ నీకు ఎక్కణ్ణుంచి వచ్చాయి? ఇది నీకు మంచిదికాదు'' అన్నారు.

బ్రాహ్మణాచార విధులను పాటిస్తున్నప్పుడు నేను అనేక శ్వాససంబంధమైన వ్యాయామక్రియలు చేస్తుండేవాణ్ణి. ఇవి నేను శ్రీపాదులను కలసికొనక ముందే మొదలు పెట్టాను. ఈ వ్యాయామం నాకు చాలా కుతూహలంగా వున్నందువల్ల క్రమంగా హెచ్చించాను. చివరికి నాకు చెమటపట్టి, వణుకు వచ్చేవరకు వూపిరి బిగబట్టేవాణ్ణి. దీన్ని గురించి ఒకసారి శ్రీరామకృష్ణులతో చెప్పినప్పుడు, ఆయన నన్ను అల్లా చేయవద్దని నిషేధించారు. 'ఏదో ఒక ప్రాణాంతకమైన జబ్బుకి దారితీస్తాయి యివి' అన్నారు.

నేను పాటించే మరొక ఆచారం ఏమిటంటే, రోజులో ఒకేసారి భోజనం చేయడం—అదీ, నేను స్వయంగా వండుకొన్న వస్తువులే. బ్రాహ్మణ గృహంలో శ్రీ మహావిష్ణువుకి నివేదన చేసిన పదార్థం కూడా నేను ముట్టుకునే వాడను కాను ఎందరు చెప్పినా. ఈ కారణంగా నేను దక్షిణేశ్వర్‌లో ఎన్నడూ భోజనానికి వుండేవాణ్ణికాదు, కాళీకాలయంలో వండిన ప్రసాదం తినవలసి వస్తుందని భయపడి. దీన్ని గురించి నేను ఎన్నడూ గురుపాదులతో అనలేదు. కానీ ఆయన పసిగట్టారు, నేను ప్రొద్దున్నే అయిష్టంగానే ఆయన్ని విడిచివెళ్ళడానికి కారణం, నా యీ ఆహారనియమం వదులుకోలేకపోవడమేనని. ఒక ఏకాదశినాడు నేను మధ్యాహ్నంపూట చేరాను ఆశ్రమానికి. ఆ రోజంతా రామనామస్మరణ జరుగుతూ వుంటుంది. నేనా రోజు ఉపవాసం వుంటాను. నేను తీసుకువెళ్ళిన ఒక పండు ఆయన చేతుల్లో వుంచి నమస్కరించాను. ఆయన చాలా సంతోషపడ్డారు. ''నువ్విప్పుడు వెళ్లిపోతావా?'' అన్నారు. లేదన్నాను నేను.

మర్నాడుదయం నన్ను తనతో కలిసి పంచవటికి రమ్మన్నారు. తూర్పుదిశాముఖంగా కూర్చొని ధ్యానం చేయమన్నారు. కాస్సేపు

నన్ను విడిచిపెట్టి వెళ్ళి, తిరిగి వస్తూనే నా శరీరాన్ని నిటారుగా వుండేట్లు సవరించారాయన. "నువ్వు ధ్యానంలో వున్నప్పుడు కొద్దిగా వంగుతావు" అన్నారు. ఇద్దరం కలిసి వారి గదికి వెళ్ళాము. నీళ్ళకుండ ఒకటి తీసుకురమ్మన్నారు. ఇద్దరం కలిసి గంగానదిలోని విశాలమైన స్నానఘట్టానికి వెళ్ళాము. నేను వారికి స్నానం చేయించి, ఒక శుభ్రమైన బట్ట యిచ్చాను. ఆయన దాన్ని ధరించారు. తిరిగి వారి గదికి వచ్చాము. గోడమీద, కాళీఘాటు దేవాలయంలోని కాళీమాత చిత్రం వుంది. రామకృష్ణులు దాని దగ్గరగా వెళ్ళి, అక్కడుంచిన ప్రసాదం తీసుకుని, తన నోట్లో కొంచెం వేసుకుని, నా నోట్లో కొంచెం వేశారు. "ఓంకాళీ" అంటూ పలుమార్లు ఉచ్చరిస్తూ, గుండెపై చేతులుంచుకుని, అరమూత కళ్ళతో చాలాసేపు నిలబడ్డారు. కాళికా, విష్ణ్వాలయాలనుంచి ఆయన రోజూ పళ్లు, మిఠాయిలు పంపిస్తారు. వాటిని తాను తిని, నాకు కొన్ని పెట్టారు. తియ్యని పండు రసం యిద్దరం తాగాము. ఆయన మంచం మీద కూర్చొని పొగ త్రాగడం మొదలెట్టారు.

ఆ సాయంత్రం దైవనివేదనలు పూర్తయిన తర్వాత, నన్ను తనగది తూర్పువేపు వరండాలోకి తీసుకువెళ్ళారు. అక్కణ్ణుంచి రెండు దేవాలయాలూ కనిపిస్తాయి. "నువ్వు వెళ్ళి కాళికామాతకు నైవేద్యం పెట్టిన అన్నం తినిరా. అది గంగాజలంతో వండారు. చాలా పవిత్రమైనది. వెళ్ళి తిను" అన్నారు.

నేను కొంతదూరం వెళ్ళాక తిరిగిచూశాను వెనక్కి. ఆయన వరండాలోనే నిలబడి, నేను విష్ణ్వాలయానికి వెడుతున్నానో, కాళికాలయానికి వెడుతున్నానో చూస్తున్నారు. ఆయన నన్ను మహావిష్ణువు ఆలయానికి కూడా వెళ్ళమని చెప్పవలసింది అనుకుంటూ నడుస్తున్నాను. మాంసం, చేపలు వండే కాళికాదేవి ఆలయంలోని వంటగృహానికి వెళ్ళమన్నారు నన్ను యిల్లా ఎందుకు చేయమన్నారో అని ఆశ్చర్యపోయాను. చివరకు నేను అక్కడికే వెళ్ళాను. ఆ రాత్రికి శాకాహారం మాత్రం తిన్నాను. నాకు యిప్పటికీ బాగా గుర్తుంది, నేను ఆనాడు తిన్న పదార్థాల్లో చిక్కని పప్పువంటకం ఒకటుంది. భోంచేసి నేను తిరిగి వచ్చేటప్పటికి శ్రీరామకృష్ణ తూర్పువేపు తలుపుదగ్గర చేతిలో తమలపాకు వుంచుకొని, నిలబడి వున్నారు. "ఇది నోట్లో వేసుకో" అని, నా చేతికిచ్చారు. "భోజనం తర్వాత ఒకటి రెండు తమలపాకులు తినడం ఆరోగ్యానికి మంచిది. లేకపోతే నోట్లో ఒక దుర్వాసన పుడుతుంది. నువ్వుచూశావా, నరేన్ (స్వామీ వివేకానంద) చాలా తమలపాకులు తింటాడు. తినేవస్తువు ఏది దొరికినా మింగేస్తాడు. అతని విశాలనేత్రాలు అంతర్ముఖంగా వుంటాయి. కలకత్తా వీధులలో తిరుగుతూ భవనాలు, గుర్రాలు, బగ్గీలు అన్నీ చూస్తాడు. అన్నిటా అతనికి శ్రీమన్నారాయణుడు కనిపిస్తాడు. వెళ్లి అతణ్ణి చూడు. సిమ్లాలో వుంది అతని యిల్లు" అన్నారు.

(తరువాయి వచ్చే సంచికలో)

# నిశ్శబ్ద స్వరం

హిందీమూలం: కీ. శే. సుమిత్రానందన్ పంత్

అనువాదం: రోహిణి

స్తబ్ధ జ్యోత్స్నలో
జగత్తంతా
అమాయక శిశువులా
పవ్వళిస్తున్న వేళ
విశ్వపు కనురెప్పలలో
స్వప్నాలు
మిణుకుమంటున్న వేళ

నక్షత్రాల్లోంచి
ఆహ్వానిస్తోంది నన్ను
ఓ నిశ్శబ్ద స్వరం

సఘన మేఘాలతో
ఆకాశం గర్జిస్తోన్న వేళ
నల్లటి చీకటిని
ఒంటికి పులుముకున్న వేళ
వాయువు దీర్ఘ శ్వాస
విడుస్తోన్న వేళ
ముసురునట్టి
వర్షం కురుస్తోన్న వేళ

మెరపు తీగల్లోంచి
ఆహ్వానిస్తోంది నన్ను
ఓ నిశ్శబ్ద స్వరం

యౌవన భారంతో ఉన్న
వసుధను
మధుమాసం కవ్వించిన వేళ
విధుర హృదయంలోని
మధుర ఉద్గారంలా
సుమదళాలు వికసించిన వేళ

సుమపరిమళాల్లోంచి
ఆహ్వానిస్తోంది నన్ను
ఓ నిశ్శబ్ద స్వరం

వేకువ ఝామున
పరచుకొన్న శ్రీ సౌరభాలు
జగత్తునంతా
ఆనంద డోలికల్లో
ముంచెత్తుతోన్న వేళ
విహంగాల కలకలరవ ధ్వనులు
భూమ్యాకాశాలను
ఏకం చేస్తోన్న వేళ

అలసిన, సొలసిన
పూరెమ్మల్లోంచి
పిలుస్తోంది నన్ను
ఓ నిశ్శబ్ద స్వరం

చిక్కటి చీకటి
జగత్తంతా పరచుకొన్న వేళ
కీచురాళ్ళ ధ్వనులు
సుప్త హృదయాలను
మీటుతోన్న వేళ

మిణుగురు పురుగుల కాంతుల్లోంచి
ఆహ్వానిస్తోంది నన్ను
ఓ నిశ్శబ్ద స్వరం

స్వర్ణ ఛాయలో
పూమొగ్గల హృదయ కవాటాలు
తెరుచుకుంటున్న వేళ

సౌరభంతో మత్తెక్కిన
మధుపాల కేశజాలాలు
వున్మాదిలా ఊగుతోన్న వేళ

తుషార బిందువుల్లోంచి
ఆహ్వానిస్తోంది నన్ను
ఓ నిశ్శబ్ద స్వరం

కార్యభారంతో అలసిన నేను
శూన్య శయ్యపై
పవ్వళించిన వేళ
నా కళ్ళెదుట
నర్తిస్తున్నాయి స్వప్నాలు

ఈ స్వప్నాల యానకంలోంచి
ఆహ్వానిస్తోంది నన్ను
ఓ నిశ్శబ్ద స్వరం

నన్నిలా
సుమార తీరాలకు
అందని అగణిత ప్రదేశాలకు
భావాలకు అతీతంగా
తీసుకెడుతోన్న
ఆ నిశ్శబ్ద స్వరం
ఏమిటన్నది
తెలియరావటం లేదు.

# ధమ్మపదం

వేదము, ఉపనిషత్తులు, భగవద్గీత—తరువాత బుద్ధగీత యగు ధమ్మపదము. ధమ్మపదమునకీ యనుత్తమమైన మహా జ్యోతిర్మండలముల పంక్తియందిది న్యాయమైన స్థానము. ఈ మహాగ్రంథములు నాలును నాలుగు భిన్నయుగములకు ప్రవర్తకములు, ఆ కాలముల భిన్నరూపమైన యధ్యాత్మ జీవితమునకు చాలకములు. ధమ్మపదము జగజ్జీవితము యొక్క కవళిక నెట్లు మార్చినది, ఎంత దేశము మేర ఎంత కాలము తరగడి వ్యాప్తమైనదియు, మనుష్యుల ప్రవృత్తులనే క్రొత్త త్రోవల త్రొక్క జేసినది, దుఃఖనివారణమునకై ప్రతి నిమిషమును పెనగులాడు జగమునకు ఏ నూతనోపాయము తెలిపినది, ఏ నూతన సాధన నొసఁగినది, ఏ ప్రత్యేకమైన 'వినయ'మును, సంప్రదాయమును, సంస్కారమును, సంఘను, ఆచారమును జగమునకొసఁగినది విచారించితిమేని మహోత్కృష్టమగు నామత్రయము తర్వాత నాలుగవ దానినిగా ధమ్మపదమును పేర్కొనుట న్యాయమని గోచరింపఁగలదు. ఇయ్యది స్వయము బుద్ధభగవానునిచేఁ జెప్పఁబడినదని బౌద్ధ సంప్రదాయమున విశ్వాసము. ఆ విశ్వాసమును మన్నించియే నేను దీనిని బుద్ధగీత యని పేర్కొంటిని.

భగవద్గీతతో ధమ్మపదమును జతపఱచితిని. కావున నీ రెంటి పద్ధతికిని భేదము మొదట నిరూపింతును. భగవద్గీత యందువలె ధమ్మపదమున సృష్టిస్థితిలయముల గూర్చిన యుత్కృష్ట విచారణలు లేవు, సాంఖ్య యోగాది సిద్ధాంతముల విమర్శలు లేవు, మనస్సునకందని మహాతత్త్వముల మీమాంసలు లేవు. ఇందంతయు శీలముగూర్చి, ప్రవృత్తి యొక్క శుద్ధినిగూర్చి, సాధనను గూర్చి. గీత ఆధ్యాత్మిక జీవితమున ప్రథమ పాఠమనఁదగు నాత్మసమర్పణము నభ్యసించువానికి లేక అభ్యసింప మొదలిడు వానికి. కాని, ప్రథమమయ్యును అంతిమమునగు నీయాత్మ సమర్పణము సాధారణ జీవితమునకెంత దవ్వు, ఎంత దుస్సాధము, ఎంత సాధనపై నలవడును! ఇపుడు ధమ్మపదమును గైకొందుముగాక. దీని యుపదేశమంత దవ్వుకాదు; మనస్సు ద్వారమున గ్రహించి క్రమక్రమముగా నాచరింపఁ బ్రయత్నింపనగును. మనోభూమికకు పైనున్న ఇచ్ఛాజ్ఞానముల నించుక జాగ్రతము చేసినఁగాని గీతయొక్క సాధనపద్ధతి ఫలింపదు. సాత్తికమైన యనుశీలనముచేత ఇంద్రియములను శుద్ధిచేసినఁగాని, ఇంద్రియములకు పైనున్న ఇచ్ఛాజ్ఞానముల యాభాసయేని కలుగదు. ఈ యనుశీలమునకు, ఈ శుద్ధికి ధమ్మపదము నవలంబింపుము.

—వేలూరి చంద్రశేఖరం.

# కబీరు వచనామృతము

(రెండవ భాగము)

## కబీరు తత్త్వము

### 1

నదియును, నదీతరంగమును, ఒకటియే. పదార్థమునదికిని, తరంగమునకు భేదమెక్కడ? తరంగములు లేచునప్పుడును నీరే, తరంగములణగిపోయినప్పుడును మరలనీరే. అయ్యా! చెప్పుడు, ఇందు భిన్నత్వమెక్కడ? తరంగమను పేరిడిన మాత్రముననే అది నీరుకంటె వేరైపోవునా? పరబ్రహ్మయందు జగములు జపమాలలలోని రుద్రాక్షలవలె త్రిప్పబడుచున్నవి. జ్ఞానచక్షువుతో నామాలను ప్రత్యక్షము చేసికొనుము.

ఎచ్చట ఋతురాజగు వసంతుడు విహరించునో, అచట ననాహత సంగీతము, తనంతట తానే మ్రోయుచున్నది.

అచ్చట జ్యోతిధారలన్ని వైపులను ప్రవహించును. ఆతీరమునకు జేరువారరుదు.

అచట కోటిమంది కృష్ణులు చేతులు జోడించుకొని నిలుచుందురు. కోటిమంది విష్ణువులు అవనతశిరస్కులై మ్రొక్కుచుందురు, కోటిబ్రహ్మలు వేదముల బఠియింపుచుందురు. కోటి శివులు ధ్యానమగ్నులైయుందురు, కోటి సరస్వతులు రాగము పాడుదురు. కోటిఇంద్రులు గగనమున నివసింతురు. సురలు, గంధర్వులు, మునులకచ్చట లెక్కలేదు; అచట నీశ్వరుడు స్వయంప్రకాశుడై చూపట్టును. అచట చందనపు పుష్పాదుల పరిమళము గభీరమైలోచును.

### 3

చేతనాచేతనములను రెండు స్తంభముల మధ్య మనసు ఉయ్యేలలూగుచున్నది. ఆడోలనమందు జీవులును జగత్తులును ఊగుచున్నవి. ఆడోలనమెప్పుడును ఆగదు.

చంద్ర సూర్యులిద్దరును ఆ హిందోలనమందూగుచున్నారు ఆ హిందోలనమునకంతమెక్కడ? లక్ష లక్షల జీవులు అందూగుచున్నారు. శశిభానులూగుచు పరుగిడుచున్నారు. కోట్లకొలది కల్పములు, యుగములు గతించినవి. ఐనను ఆడోలనమాగుటలేదు.

ధరణి, ఆకాశము రెండునూ ఊగుచున్నవి. పవనము, నీరములును ఊగుచున్నవి. దేహమును ధరించి హరియును ఊగుచున్నాడు. ఇయ్యది చూచియే కబీరు దాసుడైనాడు.

### 4

సూర్య చంద్రగ్రహముల జ్యోతి ప్రజ్వలించుచున్నది. ప్రేమముయొక్క తాళము పడుచున్నది. మహా శూన్యమందు రాత్రింబగళ్ళు నౌబత్తు మ్రోయుచున్నది

కబీరిట్లనుచున్నాడు:- నా ప్రియతముడు గగనమందు విద్యుల్లేఖవలె, ప్రకాశించుచున్నాడు.

క్షణములును, నిముషములును, ఎట్టి యారతి నిచ్చుచున్నవో తెలియునా?

విశ్వము చంద్రసూర్యులయారతిలో రాత్రిం దినములును, ఆతని బాడుచున్నవి.

ప్రచ్ఛన్నమగు పతాక, ప్రచ్ఛన్నమగు వితానమునచట ప్రకాశించుచున్నవి.

ప్రచ్ఛన్నమగు గంటలచ్చట నినదించుచున్నవి. కబీరిట్లనుచున్నాడు:- సేబవలును నచ్చట నారతి. జగత్ప్రభువాతని సింహాసనము అలంకరించియున్నాడు.

సంసారమునందెల్లరును తమ, తమ, కర్మలందు దగుల్కొని భ్రమయందుచున్నారు. కాని ప్రియతమునితో నెవరు బరిచయము చేసుకొనుటలేదు. ప్రేమ, వైరాగ్యముల రెంటి ధారలను మనమునందేకముగా ప్రవహింపజేయుము. గంగాయమునల సంగమమునందు ఘట్టము నొనర్చుకొనుము. అట్టి నీ హృదయమున నిర్మలోదకములు రేయింబవళ్లును బ్రవహించును. ఇక జన్మ మరణముల జక్రమాగిపోవును.

చూడుము:– ఆ పరమాత్మ యెందెంతటి ఆశ్చర్యమగు విశ్రాంతియో. ఎవ్వడు తగునో ఆతడే దాని ననుభవించును. ప్రేమ త్రాడులచే గట్టుబడి ఆనంద సింధువుయొక్క యుయ్యెల ముందునకు వెనుకకును యూగుచున్నది. అచట గంభీరమగు మహానాదము సంగీతమున తరంగించుచున్నది. చూడుము జలములేకయె యచ్చట నెట్టి యద్భుతమగు కమలము పూచుచున్నదో! కబీరిట్లనుచున్నాడు:– నా హృదయ భ్రమరము దాని యందలి మధువును గ్రోలుచున్నది.

విశ్వచక్రము యొక్క కేంద్రమునందు ఎట్టి యాశ్చర్యమగు కమలము వికసించినది! దాని యానందమును కొలది పునీతులే ఎరుగుదురు. సంగీతముయొక్క గంభీరధ్వని దానికి నలువైపులను ప్రసరించుచున్నది. హృదయమచ్చట ససీమ సముద్రము యొక్క యానందమనుభవించుచున్నది.

కబీరిట్లనుచున్నాడు:– ఆ తీయపు సంద్రమునందు గ్రుంకిడుము. జన్మమరణముల భ్రాంతియిక దూరమునకు బలాయన మొనర్చును.

చూడుము:– పంచేంద్రియముల తృష్ణ ఇచట నెట్లు చల్లారినదో! మూడు దుఃఖముల జ్వాలలును అచట నారిపోయినవి. కబీరిట్లనుచున్నాడు :– ఇది ఆ యగమ్యుని ఖేల. చూడు మంతరమునందా ప్రచ్ఛన్నుని చంద్రకిరణము.

అచ్చట జన్మ మృత్యువుల తాళము పడుచున్నది. ఆనందమచ్చటనుద్గమించుచున్నది. గగనమంతయు జ్యోతిచే దీపించుచున్నది. అనాహత వాద్యమచ్చట మ్రోయుచున్నది. అయ్యది ముల్లోకముల ప్రేమ యొక్క ఝుంకారము. చంద్రతపనుల కోటి దీపములచ్చట ప్రజ్వలించుచున్నవి. తూరి యచట ధ్వనించుచున్నది. ప్రియుడచ్చట నుయ్యేలనూగుచున్నాడు. ప్రేమగానమచ్చట ఝుంకృతమగుచున్నది. జ్యోతియొక్క వృష్టి యచ్చట వర్షించుచున్నది. భక్తుడచటనమృత పానముచే ఆత్మనిలీనుడైనాడు.

చావు పుట్టువులందతర మేమియు లేదు. చూడుము. కుడి చేయియు, ఎడమ చేయియు నొకటే.

కబీరిట్లనుచున్నాడు– జ్ఞానియచ్చట మూగుడగుచున్నాడు. ఈ సత్యము వేదములందుగాని, శాస్త్రములందుగాని లభింపదు.

ఆ స్వయంప్రభువుని యంతరమునందు ఆసనము పరచుకొంటిని. ఆ వాచామగోచరుని గలతియనుండి త్రావితిని. ఆ యతిముయొక్క రహస్యమెరిగితిని. ఏ బాటను మెట్టకయే దుఃఖహీనమైన దేశమునకు వచ్చిచేరితిని. కడు సులభముగానే ఆ మహాదేవుని కరుణ నాకు లభించినది. అతని నగమ్యుడనియు నతీతుడనియు బాడిరి; నా ధ్యానమునందాతని జూడ్కి లేకయే జూచితిని. అయ్యదియె నిజముగా దుఃఖము లేని దేశము. అచ్చటికి బాట నెవ్వరును తెలియరు. ఎవ్వడా బాటను ద్రొక్కునో, దుఃఖమును నిజముగా ద్రొక్కివైచును.

అహా! ఆ విశ్రామ భూమి ఎంత యాశ్చర్యము! ఏ పుణ్యము చేతను అది లభ్యము కాదు. జ్ఞానియే దానిని చూచినాడు. జ్ఞానియే దానిని పాడినాడు. ఇదియే అంతిమవాణి. దాని తేనె తీయము నెట్లు తెలియచెప్పుదును. దాని నొక్కమారాస్వాదించినవాడే దాని యానందమెట్టిదో యెరుగగలడు. కబీరిట్లనుచున్నాడు:- దానిని తెలిసి మూర్ఖుడు జ్ఞానియగును, జ్ఞాని మూకుడగును.

అవధూత సంపూర్ణముగా ఉన్మత్తుడైనాడు. అతని జ్ఞాన వైరాగ్యములు పరిశుద్ధములైనవి. శ్వాసోచ్ఛ్వాసములను ప్రేమ పాత్రమునుండి యాతడు ద్రావుచున్నాడు.

గగనమచట గర్జించుచున్నది. తూరి తసంతట తనే మ్రోగుచున్నది. వ్రేళ్లు మీటకయే, తంత్రులు లేకయే అచట రాగము ఉద్గతమగుచున్నది.

సుఖ దుఃఖముల ఖేల అహర్నిశములును జరుగుచున్నది. కబీరిట్లనుచున్నాడు:- నీ ప్రాణమును ప్రాణసింధువునందు కలుపుదువేని, నీ ప్రాణమూ పరము సుఖధామమునందు శేరగలదు.

ఎనిమిది ప్రహరములందును అచట నెట్టి యానందమాదనము! సాధకుడా ప్రహరముల మధుస్రావమును ద్రావుచున్నాడు. ఎనిమిది ప్రహరములందును భక్తుడు బ్రహ్మయొక్క దేహమునందే ప్రాణించుచున్నాడు. ఎనిమిది ప్రహరములను, ఆతడా సుఖమునందున్మాదితుడై యున్నాడు.

సత్యము నేపల్కుచున్నాను, నేను సత్యమునే గ్రహించినాను, నేనీ గాజుపెంకులను బోద్రోచినాను. అసలు వస్తువును జేకొనినాను.

కబీరిట్లనుచున్నాడు:- ఇట్లే భక్తుడు నిర్భయుడగుచున్నాడు. ఈ విధముననే జన్మ మరణముల భ్రాంతి దూరమగుచున్నది.

గగనమచ్చట సంగీతమున గర్జిల్లుచున్నది, అమృతమును వర్షించుచున్నది. ఎల్లప్పుడును, వీణాతంత్రులు ఝంకరించుచున్నవి. ఎల్లప్పుడును తూరి మ్రోగుచున్నది.

ఆహా! గగన భవనమునందెట్టి ప్రచ్ఛన్న జ్యోతి! అచట నుదయాస్తమయముల పేరైనను వినరాదు. ప్రేమ ప్రకాశమను సింధువునందు రేబవలుల వేరుపాటేమియును తోచదు. ఎల్లప్పుడును ఆనందము. దుఃఖము లేదు, ద్వంద్వము లేదు. అచ్చట ఆనందము, కూలంకషము పరిపూర్ణము. భ్రమకు, భ్రాంతికి అచట తావు లేదు.

కబీరిట్లనుచున్నాడు:- ఏకరసము యొక్క ఖేల నచట కనుగొంటిని.

బ్రహ్మాండము యొక్క ఖేల నీ దేహ పిండమున జూచితిని. ఈ జగమునందలి భ్రమను దూరగించితిని. లోపల, వెలుపలలు ఆకాశము వలె నొక్కటియైనవి. అంతవంతమునందంతమును పరిపూర్ణము రూపమున వీక్షించితిని. ఈ యుత్సవమునందంతయు జూచి యున్మత్తుడనైతిని. ఈ నీ జ్యోతి సకల జగమును బరిపూర్ణమొనర్చినది. ఓ జ్యోతిర్మయా, జ్ఞానమను ప్రమిదయందు, ప్రేమయను దీపము వెలుగుచున్నది.

అనంతుని యందు నా యాసనము బరచితిని. అగమ్యునియందు నా డేరా వైచితిని. కబీరిట్లనుచున్నాడు:- అచ్చట భ్రమ ప్రకాశింపలేదు. జన్మ మృత్యువుల విరోధమాగిపోవును.

చెప్పుట కెవ్వడు? వినుట కెవ్వడు! ఓయీ! రెండవవాడెచ్చట? అద్దమున ప్రతిబింబమెట్లు భాసించునో, అట్లే నలువైపులను ఆతడే. ద్వైతము రూపడి ఏకమెప్పుడగునో, అప్పుడే ఆతడు పట్టుబడును. జలమునుండి తుషార మెట్లగునో, తుషారమును, భాష్పమును నిజ ముగా నెట్లు జలమేగాని యన్యము కాదో, అట్లే ఇయ్యదియును. ఆ తత్త్వమే అయ్యది యును. ఇదియు ఆతడే. ఇది తెలిసెనేని రుచిం చును. తెలియదేని మథ్యముకాదు.

కబీరిట్లనుచున్నాడు:- ఏ యొకానొక పక్ష మును విడిచిపెట్టినను, ఆతని మతి స్థూలము.

## 6

ఓంకారమన్నిటిని సృజించును. ప్రేమ యొక్క స్వరూపమే ఆతని శరీరము.

ఆతడు నిరాకారుడు, నిర్గుణుడు, అవినాశి. ఆతని సంగమముకై యత్నింపుము. ఆతడు నిరంజనుడు; ఐనను ప్రతికంటికి నానా రూప ములు ధరించి చూపట్టును.

ఆతడు నిర్లిప్తుడు, నిర్గుణుడు, అవినాశి, ఆతని దేహమపారమతలము.

ఆతడు మహానందమున మగ్నుడై నృత్య మొనరించును. ఆ నృత్యమునుండి రూపతరంగ ములుప్పతిలును. ఆతని మహాసుఖసంస్పర్శచే తనువును, మనమును నిలువలేవు.

సర్వ చైతన్యము నందు, సర్వ సుఖమందు, సర్వ దుఃఖమందాతడు నిమగ్నుడై యున్నాడు.

ఆతనికాది ఎక్కడ, అంతమెక్కడ? సమస్తమును తన యానందమున ధరించి యున్నాడు.

ఆపాదమస్తకమును ఏ ప్రభువుచే పరి పూర్ణుడవై యున్నావో, ఆతడు దూరమందని ఏల పల్కెదవు? ఆ ప్రభువుయొక్క ప్రేమా మృతముచే సిక్తుడవై, ఆతనికి నీ సమస్త తను వును, మనమును, ధనమును, సమర్పింపుము. సకల సాధువులకును సుఖదాయకమగు ఈ మాటను కబీరనుచున్నాడు. ''సుఖసాగరమున స్థిర గృహము లభించినది.

## 8

నా సద్గురు విషయమునెట్లు పలుకులతో బలుకగలను! ఆతడు నా భ్రమలన్నింటిని దూరగించినాడు. జగమంతయు ప్రేమచంద్రుని యుదయమును గనుగొనెను. నా భ్రమ దూర మగుట నే గనుగొంటిని.

వెలుగు ప్రకాశించెను, ఆస, ద్వైతము, పారిపోయెను. జ్యోతి నిష్కలంకమయ్యెను. మాయ మోహము, తిమిరము, అన్నియు నశించెను. ప్రభువు కబురును వినగంటిని. పెరి మపు గలతియనుండి గ్రోలితిని. నా బుద్ధి సుద్దు లెల్లను మరచిపోతిని. ఒకేమారు చూర్ణవి చూర్ణముగా నైపోతిని. అమరుడనైతిని. నా కిక మృత్యువులేదు, జీవనముయొక్క కూకటి వేరే లభించెను. బంధనములు తెగిపోయినవి. ఇక యమునితో జోక్యము లేదు. నాకు దర్శనము మంజూరైనది. మమత పలాయన మొనరించినది. సుమతి యుదయించినది. సుఖ దుఃఖములు గతించినవి.

పరమానందమునందు బరిపూర్ణుడనైతిని. నాలోని యనుభవమును తెలియచెప్పుటకు సాధ్యముకాదు. కబీరిట్లనుచున్నాడు. విను మన్నా తూరి నిర్మల స్వనమున మ్రోయు చున్నది.

సద్గురు దయచేత అజ్ఞేయమును తెలిసికొంటిని. కాళ్లు లేక నడచుటకు, చెవులు లేక వినుటకు, రెక్కలు లేక యెగురుటకు, నోరు లేక త్రావుటకు, కనులు లేక చూచుటకు అతని కడనే నేర్చుకొంటిని. చంద్రసూర్యులు లేని చోటికి, రేబవలు లేని చోటికి, నా ప్రేమమును, ధ్యానమును, గైకొనివచ్చితిని.

తినకయే అమృతరసమును భుజించితిని, నీరు లేకయే నా దప్పి నార్చితిని

ఎచ్చట హర్షము, హర్షమునందుకొనునో అచ్చట బూర్ణమైన యానందము. అయ్యది ఎవ్వరికడ దెలుపనగును?

కబీరిట్లనుచున్నాడు:- సద్గురుని పలుకుల కావల ధన్యము. ధన్యము శిష్యుని భాగ్యము.

## 10

అన్నిటియందును గలడు. ఐనను, అన్నిటి కంటె భిన్నుడు. జనులయందు, జంతువుల యందు, జలమునందు, స్థలమునందు, అన్నిటి యందును, అతడే. గాయకుడు తన గానమందు వ్యాపించియున్నాడు. అందరకును అతడు నికటతముడు. అందరకును అతడు దూరతముడు. ఎవ్వడెట్లు తలపోయునో, ఆతడట్లు లభించును.

సారవత్తమగు నా రాగము నెవ్వడు ప్రాప్తించునో, ఆతడు నియమములును, ఆచారములును పాలింపడు.

కబీరిట్లనుచున్నాడు :- వినుమో సాధూ! ఆ సంగీతము నెవ్వడు వినునో, అతడు నాకు ప్రియుడు.

## 11

నా శరీరమాశ్చర్యమగు నొక వృక్షము; ప్రపంచకమంతయును, దాని కొమ్మలును, ఆకులును. కబీరిట్లనుచున్నాడు:- వినుమో అన్నా! అరుదుగా నెవ్వడో ఈ రహస్యము యొక్క హృదయమును జేరును.

## 12

నిర్గుణము చెంగట సగుణము సరించుచున్నది. "సోఽహం" అని తూరి మ్రోగుచున్నది. శిష్యుని చరణములకడ గురువు ప్రణతుడగుచున్నాడు. ఇదియే ఆశ్చర్యములకెల్ల నాశ్చర్యము!

## 13

ఓ సాధూ! ఇయ్యది మృత్యుదేశము. పేరు మరణించును, ఈశ్వరదూత మరణించును, యోగి మరణించును, రాజు మరణించును, ప్రజలు మరణింతురు, వైద్యుడును, రోగియును మరణింతురు, చంద్రుడు మరణించును, సూర్యుడు మరణించును, భూమ్యాకాశములు మరణించును, నాలుగు భువనముల నేలు చక్రవర్తి మరణించును, వీరందరి యాస దేని కొరకు !

ఇంద్రుడు మరణించును. యముడును మరణించును. పిపాసియగు యగ్ని మరణించును. ముప్పదిమూడు కోట్ల దేవతలును మరణింతురు. అందరును కాలపుటలయందు జిక్కుకొందురు.

ఎయ్యది ఎల్లప్పుడును, నామము కలదాని యందును, లేనిదానియందును వసించునో, దానికి రెండవది వేరు లేదో, అయ్యది ఎప్పుడును భ్రమయందు, తిరిగి, తిరిగి, మరణింపదు

## 14

గోరకునాథుడిట్లు ప్రశ్నించుచున్నాడు:— నీ వెప్పటినుండి విరాగివైతివి? నీ ప్రేమ యెటనుండి యుదయించినది?

ఉత్తరము:- విచిత్రరూపముల ఈ మేల యెప్పుడారంభింపలేదో, ఎప్పుడు గురుశిష్యులు లేరో, ఎప్పుడే విశ్వమంతయు ప్రసారితము కాలేదో, ఎప్పుడాపురుషుడే కాకియై యుండెనో, అప్పుడు నేను విరాగినైతిని, అప్పుడు నా ప్రేమ బ్రహ్మయందు తగుల్కొనినది.

ఎప్పుడు బ్రహ్మ కిరీటమును ధరింపలేదో, ఎప్పుడు విష్ణువు రాజకిరీటమును బెట్టుకొనలేదో, యెప్పుడు శివశక్తి యింకను పుట్టనేలేదో అప్పుడే నేను యోగమభ్యసించితిని. కాశి యందు నేను హఠాత్తుగా నావిష్కృతుడనైతిని, రామానందుడు నాకు వెలుగు నొసగెను. అసీమము కొరకైన తృష్ణను నాలో గైకొని వచ్చితిని; మిళనముకొసమనియే నేనరుదెంచితిని. సులభముగా నా సులభునితో గలసికొందును. నా భక్త్యుచ్ఛ్వాసమిక మేల్కొనును. కబీరిట్లనుచున్నాడు:-"వినుమో గోరఖా అతని సంగీతముతోడ సంగివై ముందుకు నడువుము.

## 15

ప్రాణము ప్రతి బీజమునందెట్లు కలదో, అట్లే ప్రభువు నా యందును కలడు, నీ యందును కలడు. ఓ సేవకుడా! మనమున గర్వించకుము, నీ యందే యాతని కొరకన్వేషింపుము.

కోటిసూర్యులచ్చట ప్రకాశించుచున్నారు. గగనమందు నీల సింధువు యొక్క శోభ వ్యాపించినది. ఆ జగముమధ్య నేను కూర్చొనుచున్నాను. దేహి యొక్క తాపమంతయు చల్లారినది, కలుషితములన్నియు క్షాళితములైనవి.

అనాహతములగు గంటల యొక్కయు, మృదంగముల యొక్కయు శబ్దము నాలకింపుము. ప్రేమమునందు తనువునానందితమొనర్పుము. నీరు లేకయే వర్షము వర్షించుచున్నది. నదులందు జ్యోతిర్ధారలు ప్రవహించుచున్నవి.

ఒకే ప్రేమ బ్రహ్మాండమందంతయు వ్యాపించి యున్నది. దానిని పూర్ణముగా నెరుగువారరుదు.

మనస్సు యొక్క ధీతిచే దాని నెరుగ నెంచువారంధులు—అదియే భేదమునకు గారణము. దానికి ఏకమైనది యెట్లు తెలియబడును?

జ్ఞానముయొక్క గృహము, బహుదూరము! ఈ మహాప్రేమరంగమునందు కబీరు తన ఘటమున సంగీతమును పాడుట యెంత సౌభాగ్యము! ఇది ఆత్మకును, ఆత్మకును అగు కలియిక నుండి యుద్గమించెడి సంగీతము. ఇది దుఃఖముల నివారించి, మరపుగొనచేయు సంగీతము. ఇది రాకపోకలకన్నింటిని అతిక్రమించిన సంగీతము.

## 16

నా ప్రభువు నివసించెడు పురమగమ్యము. అచ్చటికినే బోనేరకున్నాను. కబీరిట్లనుచున్నాడు:- ఓయీ వినుము. నా దేశ మిట్టిది. ఎవ్వడచ్చటికి పోవునో మరల నాతడు తిరిగి రాడు. ఆ దేశము కబురు నెవ్వరు చెప్పగలరు!

## 17

నిదురనుండి లేచియే ఆ యోగీశ్వరుని గూడితిని, నా జీవన దేవతయగు యోగీశ్వరుని మేల్కొనినంతనే చూడగంటిని. ఆ యలక్ష్య పురుషుని నగరమచలము. దాని ఛాయ చల్లనిది.

కబీరిట్లనుచున్నాడు:- ఓ గోరఖా! వినుము. ఎవ్వడన్వేషించునో, అతడే కనుగొనును.

## 18

అచటనసమానమగు సంగీతము గీతమగు చున్నది. అచట అమృతరసక్షరణముచే సరో వరము పూరితమగు చున్నది. అచట కూల ముల నతిక్రమించి పొంగి పొర్లినది, సింధువును ఇవురునట్లు ఘోలివైచుచున్నది. అచ్చటి విషయము సుంతైనను చెప్పనలవికాదు.

అచట చంద్రసూర్య తారాగణములు లేవు. అచట రాత్రి ప్రభాతములు లేవు. అచట తమంతట తామే, సితారును, వేణువును మృదు ఝుంకారమున, కోమల స్వరమున మ్రోయు చున్నవి.

కోటి ప్రభలచ్చట ప్రజ్వలించుచున్నవి. జలము లేకయే యచట వర్షధారలు పడు చున్నవి.

కబీరీ రహస్యమును విన్పించుచున్నాడు:- ఎవ్వడో, ఒకానొకడు దీనిని దెలియగలడు. ఎవ్వడు తెలియునో అతడే జన్మ మృత్యుల యుత్సవమునకే చేరును. మరల నాతడు తిరిగి రాడు.

## 19

ఈ చెట్టుపై నొకపక్షి జీవితరసముయొక్క భోగమునందలి యుయ్యాల యూగుచున్నది. అది యెక్కడనున్నదియు నెరికిని దెలియదు. ఏ భావము యొక్క రసమునందది పాడు చున్నదో ఎవరు చెప్పగలరు? కొమ్మల నీడ యెచ్చట దట్టముగా బడుచున్నదో అచ్చట దాని గూడు. సంధ్యా సమయమున వచ్చి ప్రత్యూషసమయమందే యది లేచిపోవును. దీని మర్మమెవ్వరికిని తెలియచెప్పరు. నా యందు పాడుచున్న ఈ పక్షి సంగతి ఎవ్వరు నా కెరిగింపరు.

దానికి వర్ణమును లేదు. అవర్ణము లేదు, రూపము లేదు. రేఖయును లేదు. అది ప్రేమ యొక్క ఛాయయందు వసించును.

అగమ్యమునందు, అపారమునందు, నిత్యము నందు దాని నివాసము. దాని రాకపోకల నెవ్వరును ఎరుగరు. కబీరిట్లనుచున్నాడు:- ఓ యన్నా, ఈ విషయము కడు నగమ్యము. పండితులును, జ్ఞానులును ఆ పక్షి యొక్క యునికిని తెలుసుకొందురుగాక.

ఆగస్టు 29 నుండి సెప్టెంబరు 10 వరకు-మొత్తము పన్నిండురోజులు జరిగిన గోదావరి పుష్కరమహోత్సవ సందర్భములో రాజమండ్రిలోని రామ కృష్ణ మిషన్ 12,000 మంది పిల్లలకు పాలు, 74,000 మందికి మజ్జిగ పంచి పెట్టినది.

-స్వామి నందానంద, కార్యదర్శి.
రామకృష్ణమిషన్, రాజమండ్రి-1

# మాతృదేవి చరణసన్నిధి

ఆంగ్ల గ్రంథము:
ఎట్ ది హోలీమదర్స్ ఫీట్

అనువాదము:
పి. గణపతిశాస్త్రి

20, సెప్టెంబరు, 1918.

నేను తిరిగి మాతృదేవిని చూడడానికి వెళ్ళాను. అమ్మ నన్ను చూడగానే, "కూర్చో తల్లీ!" అన్నది. ఆ సమయంలో అక్కడివారందరు వారణాసిలో స్వామి భాస్కరానందను గురించి ప్రసంగించుకుంటున్నారు. అంతలోనే అమ్మ మొదలుపెట్టింది.

"నేనుకూడా భాస్కరానందస్వామిని చూడడానికి వెళ్ళాను. అప్పుడు నాతో చాలామంది స్త్రీలున్నారు. అంతకుముందే ఠాకూరు పరమపదించారు. అందుచేత నేనా సమయంలో చాలా విచారంగా ఉన్నాను. బృందావనానికి కూడా అప్పుడే మొట్టమొదటిసారిగా వెళ్లాను. మేమందరము భాస్కరానందస్వామిని సందర్శించినప్పుడు ఆయన కేవలము దిగంబరులుగా ఉన్నారు. అయితే మమ్మల్ని అందరిని చూసి ఆయన ఎక్కడ చెక్కుచెదరలేదు! మండు వేసవిలోను, శీతాకాలంలో ఆయన అలాగే ఉంటారట!"

ఆపైన అమ్మ తిరిగి ఇంకా ఇలాగన్నది.

"రా అమ్మా, రా! ఠాకూరు పుస్తకంలో నించి మళ్ళీ కొంచెం చదువు. సామాన్యంగా సరళ చదువుతూ ఉండేదిగాని ఆమె తిరిగి భోజనశాల పనిలో మునిగిపోయింది."

ఠాకూరు గ్రంథం చదివే సందర్భంలో మేమందరము, ధ్యానము, ఆధ్యాత్మికానుభవాలు మొదలయిన వానిని గురించి ముచ్చటించుకుంటున్నాము.

అంతలోనే మాతృదేవత అందుకుని "జోగేన్, గోలాప్‌మాలిద్దరు ప్రార్థన, ధ్యానాలలో చాలాకాలం గడిపారు. ఈ విషయాలను గురించి ప్రసంగించుకోవడం చాలా మంచిది. ఒకరొకరి ఆధ్యాత్మికానుభవాలను గురించి ముచ్చటించుకుంటున్న సమయంలో ఇక్కడ బాలికలవి వింటే వారికి తప్పక దృఢమయిన నమ్మకం కలుగుతుంది" అన్నది.

మేమంతట మా ఆధ్యాత్మికానుభవాలను గురించి మాట్లాడుకోవడం ప్రారంభించాము. మాతృదేవి అరమరికలేవి లేకుండా స్వేచ్ఛగా అందరి ఎదట ఆ విషయాలను గురించి ప్రసంగించడానికి ఇష్టపడలేదు. ఆపైన నళిని అడిగింది.

"అత్తా! ఆ భగవానునితో ప్రత్యక్షంగా సంభాషించిన వారిని గురించి నేను విన్నాను. ఆ భగవానుని సందర్శించి స్పృశించిన వారిని గురించి కూడా విన్నాను. అయితే నా కెందుచేత అటువంటి అనుగ్రహం లభించడంలేదు? చాలాకాలం నీతో కలిసిమెలిసి ఉన్నా నా కటువంటి అదృష్టం కలుగలేదు! ఎందుచేత ఇలాగ జరిగింది? దీని కేమిటి కారణము?"

దానిమీద అమ్మ అన్నది

"వారికెందుచేత అనుగ్రహం లభించదు? వారికి అంతటి భక్తి విశ్వాసము ఉన్నాయిగా మరి! ఇటువంటి అనుభూతులు కలగడానికి గొప్ప భక్తి, విశ్వాసము ఉండాలి. నీకవి ఉన్నాయా?"

నళిని మళ్ళీ అడిగింది.

"అయితే అత్తా! నాకీ సంగతి చెప్పు! నీవు ఇతరుల హృదయాలు ఇట్టే అవగాహన చేసుకోగలవని విన్నాను. అది నిజమేనా? నా హృదయంలో ఏమున్నదో నీవిప్పుడు చెప్పగలవా!" అమ్మ చిరునవ్వు నవ్వింది. అయినా

ట ట

దానిమీద అమ్మ అటువంటివారందరు తమ అచంచలమయిన విశ్వాసం వల్లనే అలాగ ప్రసంగించగలుగుతారు! అన్నది. ఆపైన అమ్మ "నేనెవరిని? సమస్తము ఆ ఠాకూరే!" అని చేతులు రెండు జోడించి "స్వార్థాన్ని గురించిన ఆలోచనలన్ని పూర్తిగా రూపుమాసిపోవాలని ఆ భగవానుని గురించి ప్రార్థించుకో!" అని హితవు ఉపదేశించింది.

28, సెప్టెంబరు, 1918.

నేనీవేళ పొద్దున్నే మాతృదేవి సందర్శనానికి వెళ్ళాను. అమ్మ పళ్లు కొన్ని ముక్కలుగా కోస్తున్నది నన్ను చూడగానే "రా, అమ్మా! రా! ఈవేళ దుర్గాదేవి ఆవాహన దినం! నేనీ సంగతే మరిచిపోయాను. ఠాకూరు పూజకోసం ఈ పువ్వుల్లోంచి మంచివి కొన్ని వేరుచేసి అట్టే బెట్టు! ఈ పళ్ళన్ని ఇంకొక చోట పెట్టు!" అంటూ పిలిచింది.

నేను ఆమె చెప్పినట్టు చేశాను. ఆ తరవాత స్నానం చెయ్యడంకోసం సిద్ధపడడానికి శారదాదేవి ఆ పక్కనే ఉన్న ఇంకొక గదిలోకి వెళ్ళింది. ఆపైన అమ్మ తలనూనె సీసాతో బాటు ఒక దువ్వెనకూడా తెచ్చి నా ముందు కూర్చున్నది. నేను ఆమెను స్పృశించడానికి సంకోచించాను. అయితే ఆమె అంతలోనే పసిపిల్లలాగ "కానీ. నా తల దువ్వు!" అంటూ కేక పెట్టింది, నేను ఆమె ఆజ్ఞ ప్రకారం తల దువ్వడం ప్రారంభించాను. అంతలోనే రాధూ తన స్నానం ముగించుకొని వచ్చి "నాకు పెరుగులో వేసిన అటుకులు కావాలి" అని అడిగింది.

శారదామాత అలాగే అక్కడే కూర్చుని పెరుగులో అటుకులు కలిపి, దానిలో కొంత తన పెదవులతో స్పృశించి, ఆ పళ్ళెం రాధూ చేతికందించింది. నేనామె తల దువ్వడం ముగించి, నూనె రాయడం ప్రారంభించాను. అంతలోనే అమ్మ అన్నది.

"కొంతమంది అబ్బాయిలు మంత్రోపదేశం కావాలంటూ ఒకప్పుడు జయరాంబాటి వచ్చారు. నేను దానికి అంగీకరించలేదు. దానిమీద వారు నా పాదధూళి అయినా ఇవ్వవలసిందని బ్రతిమాలుకున్నారు. దానితో ఒక తాయెత్తు తయారుచేసి ధరిస్తామని అన్నారు. అంతటి భక్తి గౌరవాలున్నాయి వారికి!"

అంతలోనే కవిరాజ్ శ్యామాదాస్ అక్కడికి వచ్చారు, రాధూను పిలవవలిసిందని అమ్మ నాతో అన్నది. మరి కొంతసేపయిన తరవాత రాస్ బిహారీమహారాజ్ ఆ వైద్యుణ్ణి లోపలికి తీసుకువచ్చారు. వైద్యపరీక్ష ముగిసిన పిమ్మట రాధూను అమ్మ ఆ వైద్యవేత్తపాదాలంటి నమస్కరించవలసిందని ఆదేశించింది. రాధూ అలాగే చేసింది. ఆ వైద్యుడు వెళ్ళిపోయిన తరవాత అక్కడ ఉన్న వారిలో కొందరు "అతడు బ్రాహ్మణుడేనా?" అని శారదామాతనడిగారు. "కాదు! అతడు వైద్యుడు" అని చెప్పింది అమ్మ.

"అలాంటప్పుడు రాధూను ఆయన పాదాలంటి నమస్కరించవలసిందని ఎందుకన్నావమ్మా?"

"తప్పకుండా రాధూ ఆయన పాదాలంటి నమస్కరించవలసిందే! అంతటి వైద్యవిద్వాంసుడు బ్రాహ్మణునితో సమానుడు. ఆయనకు కాకపోతే ఇంకెవ్వరికి నమస్కరిస్తుంది రాధూ?..."

30 సెప్టెంబరు, 1918

ఈవేళ మహాష్టమి. అమ్మ నన్ను ఆహ్వానిం

చింది. నేను మా చెల్లెలుతో వచ్చాను. కొంతమంది అక్కడికి పువ్వులు తీసుకువచ్చారని వారు అమ్మ శిష్యురాండ్రని నేను గమనించాను. ఆ శిష్యురాండ్రు కొందరు అమ్మ పాదాలు పుష్పాలతో అర్చించి, గంగా నదిలో స్నానంకోసం వెళ్ళారు.

"ఈవేళ మహాష్టమి. నీవు ఇక్కడే ఉండి పోతావు కదూ!" అన్నది అమ్మ.

"అలాగేనమ్మా!" అన్నాను నేను.

మరికొంతసేపటికి శారదాదేవికి నమస్కరించడానికి శరత్ మహారాజు వచ్చారు. నేను పక్కగదిలోనికి వెళ్ళాను. అమ్మ మంచం మీద కూర్చున్నది. ఆమె పాదాలు నేలమీద ఆనుకున్నాయి. ఇంకా అనేకమంది శిష్యులు వచ్చి ఆమె పాదాలకు మొక్కరిల్లారు.

ఆ తరవాత నేను 'మాకు' మొదలయిన వారితో కలిసి గంగలో స్నానం చెయ్యడానికి వెళ్ళాను. అమ్మ ఇంటి దగ్గిరే స్నానం చేసింది. ఇటీవల కీళ్ళవాతంవల్ల ఆమె రోజువిడిచి రోజు చొప్పున గంగా స్నానానికి వెడుతున్నది. తిరిగి వచ్చిన తరవాత గుంపులు గుంపులుగా మహిళలు అమ్మకు పూజలు చెయ్యనారంభించారు. వారిలో చాలామంది తమతో చీరలు తీసుకు వచ్చారు. పూజలుచేసి తరవాత కాళీఘాట్‌లో అమ్మవారి విగ్రహానికి చీర చుట్టబెడతారు. అదేవిధంగా అర్చించిన తరవాత మహిళలు అమ్మకు చీరలు చుట్టబెట్టారు. ఆమె ప్రతిచీర కేసి చూసి, దానినొకపక్కన ఉంచింది. అప్పుడప్పుడు ఆమె "ఆ చీర చాలా మంచిది" అని అంటూండేది. ఆ పైన శిష్యులు వచ్చి పూజ చెయ్యగోరుతున్నారని ఒక బ్రహ్మచారి వచ్చి చెప్పాడు. అది చాలా మనోహరమయిన దృశ్యము! ఆ శిష్యులు పూలు, వికసిస్తున్న పద్మాలు, బిల్వదళాలు, తీసుకువచ్చి శారదా దేవికి పూజ చేశారు. ఒక్కొక్కరే పూజ ముగించిన తరవాత ఒక పక్కగా నిలుచున్నారు. అలాగ చాలాసేపు జరిగింది.

డాక్టర్ కంజీలాలు తమ భార్యతో వచ్చారు. బలరామబోసు కుటుంబ సభ్యులందరు అమ్మ అర్చనకోసం వచ్చారు. నేను చిట్టచివర వెళ్లాను. చీర అమ్మకు చుట్టబెట్టగానే; ఆమె దానికేసి చూసి "నేనిది కట్టుకుంటాను. ఈవేళ ఎలాగయినా కొత్త చీర ధరించాలి కదా!" అన్నది. ఆపైన ఆమె దానిని ఒక పక్కన ఉంచింది. నా కళ్ళమ్మట నీళ్ళు తిరిగాయి. ఆ తరవాత అమ్మ ఆ చీర ధరించింది.

అది చాలా సామాన్యమైన చీర. ఇతరులు అంతకన్న చాలా విలువయిన చీరలు అమ్మకందించారు. నేను ఆమె బీదకుమార్తెను. నా ఎడల అమ్మ అపారమయిన కరుణ నాలో ఎంతయినా నమ్రతరేకెత్తించింది. అదే సమయంలో అమ్మ నాతో "చూడు తల్లీ ఇది ఎంత అందమయిన అంచో చూశావా?" అన్నది.

కాషాయాంబరం ధరించిన ఒక యువతి, అమ్మపాదాలర్చించి అక్కడ రెండు రూపాయలుంచింది. ఆపైన అమ్మ అన్నది,

"నీవు రుద్రాక్షమాలిక, కాషాయాంబరము ధరించావు. ఇటువంటి దానవు నీవు కూడా సొమ్ము ఇవ్వడం ఎందుకు?"

ఆపైన "నీవీ దీక్ష ఎక్కడ స్వీకరించావు?" అని ఆ సన్యాసినిని అడిగింది.

"నేను దీక్ష ఎక్కడ స్వీకరించలేదు." అని ఆ సన్యాసికి సమాధానం చెప్పింది.

"అయితే దీక్షగాని, మంత్రోపదేశంగాని

స్వీకరించకుండానే నీవే సన్యాసినీ వేషం స్వీకరించావన్నమాట? అంతేనా?''

అమ్మ నెమ్మదిగా ప్రశ్నించింది. ఆపైన అన్నది.

''ఇది సరి అయిన పనికాదు. ఈ సన్యాసినీ వేషం సహజంగా చాలా మహనీయమయినది. దీనికేసి చూసినప్పుడు నాకుకూడా చేతులు జోడించి నేలమీద సాగిలపడాలని పిస్తుంది. ఏదోవిధమయిన ఆత్మ సాక్షాత్కారం లేనిదే ఇటువంటి దుస్తులు ధరించరాదు. అటువంటి సాక్షాత్కారం కలిగినప్పుడు ప్రతివారు నీదగ్గిరికి వచ్చి పాదాల మీద వాలి నమస్కరిస్తారు. అటువంటి గౌరవం పొందడానికి మున్ముందు నీవు అర్హత సంపాదించుకోవాలి''.

''మీ దగ్గిరనుంచి నేను మంత్రదీక్ష స్వీకరించగోరుతున్నాను'' అన్నది ఆ సన్యాసిని.

''అది ఎలాగ కుదురుతుంది'' అమ్మ అడిగింది.

అయినా ఆ సన్యాసిని తిరిగి ప్రాధేయపడుతూ వేడుకున్నది. గోలాప్‌మా కూడా కొంతవరకు ఆ సన్యాసినిని సమర్థించింది. ఆపైన అమ్మ కొంత మెత్తబడినట్టు గ్రహించాను. ఆపైన శారదా దేవి ''సరే! చూదాం లే!'' అన్నది.

గోలాప్‌మా తన ఆశ్రమంనించి ఆడ సన్యాసినిని వెంటబెట్టుకుని వచ్చింది. ఆపైన అందరు శారదామాత నర్చించి ప్రసాదాలు స్వీకరించి వెళ్ళిపోయారు.

**బిలాస్‌మహారాజ్** తమ ఠాకూరు పూజ ముగించిన పిమ్మట లోపలికి వచ్చి అమ్మతో నెమ్మదిగా ''ఠాకూరు ఈవేళ నైవేద్యం స్వీకరించినట్టు నాకు నమ్మకం కలగడం లేదమ్మా! ఒక సాలపత్రం గాలిలో ఎగిరివచ్చి నైవేద్య పదార్థాలమీద వాలింది. అలా గెందుకు జరగాలి? చాలామంది చాలా నైవేద్యాలు తీసుకువచ్చారీవేళ. అయితే అన్ని సవ్యంగా జరిగిపోయినట్టు నాకు నమ్మకం కలగడం లేదు!'' అన్నాడు.

''నీవు ఆయా పదార్థాలమీద గంగాజలం చల్లావా?'' ప్రశ్నించింది మాతృదేవి.

ఆయన చల్లినట్టు చెప్పి సెలవు తీసుకుని వెళ్ళిపోయాడు. నేనది విని మిక్కిలి మథన పడ్డాను.

ఈవేళ మహాష్టమి. అందుచేత మాతృదేవి పూజ అలాగే నిరంతరంగా కొనసాగింది. ఆమె చరణాల దగ్గిర పోగుపడిన పూలు, పత్రాలు తొలగించగానే తిరిగి అటువంటి రాసులే ఏర్పడ్డాయి

క్రమంగా మధ్యాహ్న నైవేద్యానికి సమయం సమీపించింది. సరీగా అదే సమయంలో చాలా దూరదేశం నించి అమ్మ సందర్శనం కోసం ముగ్గురు పురుషులు, ముగ్గురు స్త్రీలు వచ్చారు. వారందరు కట్టుబట్టలు తప్ప ఇంకేమి లేని దరిద్రులు. మార్గంలో దారి బత్యం సంపాదించుకుంటూ వారు చాలా దూరంనించి వచ్చారు. ఆ పురుషులలో ఒక తను శారదాదేవితో తన వ్యక్తిగత మయిన విషయాలెన్నో చర్చించాడు. ఆ ప్రసంగాని కెక్కడ ఒక అంతు దరీ కనిపించలేదు. మధ్యాహ్న నైవేద్యానికి సమయం సమీపిస్తున్నదని శిష్యులందరు లోలోపల చాలా తొందర పడుతున్నారు. అందులో ఒక అతను ఆ ఆగంతుకునితో ''ఇంకా ఏమయినా చర్చించాలనుకుంటే కింద ఉన్న సన్యాసులతో ముచ్చటించరాదూ?'' అని కూడా ప్రశ్నించాడు.

దానిమీద అమ్మ దృఢస్వరంతో "రవంత ఆలస్యమయితే మించిపోయిందేమిటి? వారు చెప్ప దలుచుకున్నదేదో నేను వినితీరాలి" అన్నది. ఆ తరవాత వారు చెప్పదలుచుకున్న దంతా శ్రద్ధగా విని, ఆపైన నెమ్మదిగా వారికి కొన్ని సలహాలిచ్చింది. అపైన ఆ వ్యక్తి పత్నిని కూడా దగ్గిరికి పిలిచింది. వారి మాట లను బట్టి కలలో వారేదో స్వీకరించారని మేము ఊహించుకున్నాము. అది ఏదో మంత్ర మని ఆ తరవాత స్పష్టపడింది. వారంతట ప్రసాదం స్వీకరించి అమ్మ దగ్గిర సెలవు తీసు కున్నారు. ఆ వీడ్కోలు అంతా పూర్తి కావ డానికి ఒకగంట పట్టింది. ఆపైన మాతృదేవి వచ్చి "వారంతా మిక్కిలి లేమి అనుభవిస్తు న్నారు. ఎంతో కష్టపడి చాలాదూరం నించి వచ్చారు" అని చెప్పింది.

మధ్యాహ్న భోజనం అయిన తరవాత మే మంతా విశ్రాంతి తీసుకున్నాము. మాతృదేవి నాలుగు గంటలయిన తరవాత లేచి వచ్చింది. ఆ సమయానికి సముచితమయిన నైవేద్యం జరి గింది. అంతలోనే రాస్‌బిహారీమహారాజ్ వచ్చి "అమ్మా, ఒక యూరోపియన్ వనిత మీ దర్శనానికి వచ్చింది. చాలాసేపటినించి వేచి ఉన్నది" అని చెప్పారు.

మాతృదేవి చెయ్యి ...కెత్తి 'రా అమ్మా!' అని ఆ యువతినాహ్వానించింది. అమ్మ ఒకప్పుడు "ఎవరయినా రోమ్ వెడితే, రోమనుల ఆచారాలు అనుచరించాలి" అని చెప్పింది. దానికి తార్కాణం నాకిప్పుడు స్పష్టంగా కనిపించింది.

ఆపైన అమ్మ ఆ యువతి ముఖం ముని వేళ్ళతో ముద్దుపెట్టుకున్నది. ఆ యువతికి వంగ భాష తెలుసును. ఆమె ఇలాగన్నది. "ఈ సమయంలో ఇక్కడికి వచ్చి నేను మీకేమి ఇబ్బంది కలిగించ లేదనుకుంటాను. నేను చాలా సేపటినుంచి నిరీక్షిస్తున్నాను. ఇప్పుడు గొప్ప ఆపదలో ఉన్నాను. మా అమ్మాయి పరిస్థితి చాలా ప్రమాదకరంగా ఉంది. ఆమె చాలా మంచి పిల్ల. మీ దయకోసం నేనిక్కడికి వచ్చాను. ఆమె త్వరగా కోలుకునేటట్టు కరు ణించండి! నేను మా అమ్మాయి అంత మంచి పిల్ల అని ఎందుకంటున్నానంటే మాలో అటు వంటి పిల్లలుండరు. మా యువతులు చాలా మంది దుష్టవర్తనులు చెడ్డవాళ్లు. కాని మా అమ్మాయి మాత్రం అటువంటి పిల్లకాదు. నేనన్నమాట ముమ్మాటికి యథార్థము. నన్ను కరుణించండి!"

"మీ అమ్మాయికోసం నేను ప్రార్థిస్తాను. ఆమె ఆరోగ్యం బాగుపడుతుంది" అని అమ్మ ఆ యువతినోదార్చింది.

ఆ మాటలమీద ఆ తల్లికెంతో నమ్మిక కలిగింది. ఆపైన ఆమె అన్నది.

"అయితే ఇక నాకు భయమేమి లేదన్న మాట! ఆమెకు నింపాదిగా ఉంటుందని మీ రంటే, అమ్మాయి ఆరోగ్యం తప్పకుండా బాగుపడుతుంది. ఇక ఆ విషయంలో సందేహ మేమాత్రము లేనేలేదు!"

ఆమె సమాధానంలో నమ్మికతోబాటు దృఢత్వంకూడా ప్రతిధ్వనించింది ఆపైన కారుణ్యం తొణికిసలాడుతున్న పలుకులతో గోలాప్‌మాతో "ఆమెకొక తాకూరు పూజా పుష్పం ఇయ్యి. ఒక తామరపువ్వు తీసుకుని రా!" అన్నది. గోలాప్ చిల్వతళంతోబాటు ఒక తామరపుష్పం తీసుకువచ్చి అమ్మ చేతిలో ఉంచింది.

శారదాదేవి అవి రెండు చేతిలో ఉంచుకుని కళ్లు కొంతసేపు మూసుకున్నది. ఆపైన కళ్లు తెరిచి దృష్టి ఠాకూరుమీద కేంద్రీకరించి, అవి రెండు ఆ యువతి చేతిలో ఉంచి. "ఈ రెండింటితోను, మీ అమ్మాయి శిరస్సుమీద రాయవలసినది" అని ఆజ్ఞాపించింది. ఆమె అవి రెండు దోసిలితో స్వీకరించి, అమ్మ పాదాలకు ప్రణమిల్లి "ఆ తరవాత నేనేమి చెయ్యాలి?" అని ప్రశ్నించింది.

దానిమీద గోలాప్‌మా అందుకుని "అవును! ఆపైన ఆ పువ్వు అవసరమేమి ఉన్నది? ఆ బిల్వదళంతో పాటది గంగలో కలిపివేయవలసినది" అన్నది. దానిమీద ఆ యువతి "కాదు! కాదు! భగవానుని స్వకీయ వస్తువు నేనెలాగ గంగలో కలిపివేయగలను. అది కొత్త బట్టతో రూపొందించిన ఒక సంచిలో బిల్వదళంతో పాటు ఆ పువ్వు ఉంచి, ప్రతి దినము మా అమ్మాయి శిరస్సు. శరీరము దానితో రుద్దుతాను" అన్నది.

"అవును! అలాగే చెయ్యి!" అన్నది అమ్మ.

ఆ యువతి తిరిగి ఇంకొకమారు శారదాదేవిని చూడడానికి వచ్చింది. తిరిగి ఆమెకెంతో ఆప్యాయంగా దర్శనం ఇచ్చింది అమ్మ. ఆ తరవాత ఆ యువతికి మంత్రోపదేశం కూడా చేసింది. ఆమె అమ్మ భక్తురాలయినా అభిమానం కలిగింది. ఆ యువతి కుమార్తె ఆరోగ్యం బాగుపడింది. —(సక్షేమం)

# దాదూ దయాళువు

## బద్వేలి రమేష్

ఈ దేశంలో వేదాంత వీధుల్లో విహరించు హంసలకు కొదవలేదు. అనాదినుంచి అధ్యాత్మిక భావాల్ని నలుమూలలా ప్రసారింప చేస్తూన్నదీ దివ్యభూమి. ఎందరెందరో ఋషులు జన్మించి ఈ మట్టిగడ్డను ఎప్పటికప్పుడు పునీతం కావిస్తూనే ఉన్నారు. అట్టి వారితో దాదూదయాళువు ఒకడు.

అతని పుటక గురించి రకరకాలు కథలు వ్యాప్తిలో ఉన్నాయి. దాదూ సబర్మతీ నదీ తీరాన ఒక బ్రాహ్మణునికి దొరికాడని అతడే దాదూదయాళువుగా పేరొందాడనీ ఒక కథ గొప్ప వ్యాప్తిలో ఉంది. మరికొందరు 1544లో అహమ్మదాబాదులో దాదూ జన్మించాడని 1603 లో నరాణే గ్రామంలో పరమపదించాడనీ చెబుతారు.

ఏది ఏమైనా అతని జీవితం ఎలా మెలి తిరిగినా, ఏ రాగానపడినా అతని జీవితం నలుగురికీ ఏం బోధించినదీ, ఎంత వెలుగు కుమ్మరించినదీ యని మనం ఆలోచించాలి. ఈ యోచనా సరళే అతని జీవితానికి సార్థకతను ప్రసాదిస్తుంది.

హరిని కీర్తించు వాడొక శిరోమణి. అతని చరితం ధన్యమని నొక్కి చెబుతాడు దాదూ. అతనికి భక్తునిపట్ల కొన్ని అభిప్రాయాలున్నాయి.

రామ నామ స్మరణవల్ల పాప ప్రక్షాళన కావించుకొనే భక్తుడు తనను తాను గొప్పగా భావించుకోడు. నిత్యం సద్విషయ సేకరణలో మగ్నుడై పాలను మాత్రం స్వీకరించే హంస వలె భాసిస్తాడు. అతనికి నీ-నా అన్న భేదం ఉండదు. అందరిపట్ల సమాదరణగా ఉండే ఈ భక్తుడే హరి ప్రియుడు, అందరికీ పూజ్యుడని చెబుతాడు.

దాదా దయాళువుకు చిన్నప్పట్నుంచీ అధ్యాత్మికంపై అతి మక్కువ. మహావీరుడు, బుద్ధునికి మల్లే సహజంగా సాధన ద్వారా దేవుని కరుణను పొందాడు.

మనస్సు శుద్ధంగా ఉంటేనే జీవితం స్ఫటికంలా స్వచ్ఛంగా వుంటుంది. మనస్సు నిర్మలమైనపుడు దేహానికీ ఏ వికారాలూ వుండవు. నిర్మలమైన మనసే దేవుని రీతిని చక్కగా గ్రహించగలదని అంటాడు. వేమన కూడా ఇదేగా అన్నది. 'చిత్తశుద్ధిలేని శివపూజ లేలరా!' నిజమే మరి.

దాదాలో అపారమైన కరుణభావం తొణికిసలాడుతూండేది. అప్పట్లో హిందూ-ముసల్మానుల మధ్య బలిసిన ద్వేషాన్ని కాంచి చాలా క్రుంగిపోయేవాడు. అంతటా వ్యాపించిన భగవంతుడొక్కడే అయినపుడు ఎందుకిలా క్రుమ్ముకొంటారని వారి ఐక్యతకై ఎంతో పాటుపడేవాడు. ఇతని ప్రభావం అప్పుడు ప్రజల్లో బాగానే పడింది. అందుకే అందరూ దాదా దయాళువని కీర్తించారు.

జీవితం ఒక వరం. ఆ వరాన్ని మనమెంతో మక్కువగా చూసుకోవాలి. నిద్రపోతున్న మానవుణ్ణి చూసి హెచ్చరింపుగా- నీ ఇంట్లో కామ, క్రోధ, లోభ, మద, మత్సర్యాలనే దొంగలుపడి నీ సంపదను దోచుకపోతున్నారు. త్వరగా మేల్కొని కాపాడుకో- అంటాడు. నిన్ను నీవు తెల్సుకో. నీ తలుపు తెరిచి అందులో హరికి స్థానమివ్వు. నా అన్వేషణలో నేను కనుగొన్నదదే. ఇప్పుడు నేను పొందనిదేది, ఆ ఈశ్వరునిలో లీనమైనాను. ఆతని రంగుల్లో నేనొక రంగునై కలిసిపోయానంటాడు.

సృష్టిలో సత్యం ఏమిటని తరచి చూస్తే 'భగవంతుడు' అన్న సమాధానం దొరుకుతుంది. భగవంతుడు సత్యప్రియుడన్నారు. Truth is God అని అన్నారు.

అందుకే మానవుడు సత్యాన్వేషకుడు కావాలని అంటాడు. నిప్పులో కాలే బంగారానికి మాలిన్యం పోయి మేలిమి ఎలా లభిస్తుందో సత్యాన్వేషకుని జీవితమూ అలాగే భాసిస్తుందని దాదా ముచ్చటిస్తాడు.

ఇలా సత్యాన్వేషణ సాగించు జీవితాలే ఈశ్వరునికి ప్రియాతిప్రియమైనవి. అందుకే ప్రతి ఒక్కరూ సత్యపథాన సాగవల్సిన అవసరం ఎంతైనా వుంది. నిజానికి జీవితానికి నిండుదనం అప్పుడేగా అబ్బేది...

# శ్రీ మద్రామాయణ దివ్యోపదేశములు

బి. ఎస్. ఎన్. శర్మ

రామ ఏవ పరంబ్రహ్మ రామ ఏవ పరన్తపః।
రామ ఏవ పరం తత్త్వం శ్రీరామో బ్రహ్మ తారకం॥

## 1. గురువు :—

గుర్వాజ్ఞను పరిపూర్ణమైన భక్తిశ్రద్ధలతో పరిపాలించుచుటే ఉత్తమ శిష్యుని లక్షణము. ఆ గుర్వాజ్ఞ యొక్క న్యాయాన్యాయములు, ఆచరణకు వీలగునా కాదా యను విషయములు, ఆజ్ఞలోని గూఢమైన భావములు ప్రశ్నించుటకు గాని, తర్కించుటకు గాని శిష్యునికధికారము లేదు. శ్రీరామచంద్రమూర్తికి స్త్రీని జంపుట పాపమని తెలిసియు, విశ్వామిత్రాజ్ఞానుసారము తాటకిని యేలాటి సందేహము గాని పెట్టుకొనక వెంటనే చంపెను. శివధనుస్సును చూచుట సహా గుర్వాజ్ఞా ప్రకారమే. ఆ ధనుస్సును భంగముచేసి సీతాదేవిని పరిణయము చేసికొనుటకు శ్రీరాముడు అర్హత గలవాడాయెను.

గురుశాపమమోఘము విశ్వామిత్రుడు మరియొక స్వర్గమును సృష్టిచేయగలిగెను గాని గురుశాప బద్ధమైన త్రిశంకుని చండాలత్వమును పోగొట్ట జాలడయ్యెను. స్వర్గమునకు పోయినను గురుశాప గ్రస్తుడగు త్రిశంకుని దేవేంద్రుడు క్రిందికి పడద్రోసెను.

## 2. మహాత్ములు :—

మతంగమహర్షి శిష్యుని ఆశ్రయమువల్ల శబరికి శ్రీరామ దర్శనము లభించినది. మహాత్ముల ఆశ్రయము చాలా శక్తివంతమైనది.

సముద్ర లంఘనమునకు, సీతాన్వేషణమునకు ఎవరు శక్తులని వానర ముఖ్యులందరు వారి వారి శక్తిని చెప్పుకొనుచుండగా, ఆంజనేయుడు వారి మాటలు వినుచు దూరముగా మాట్లాడక కూర్చొని యుండెను. గొప్పవారు మిత భాషణులు.

ఇంద్రజిత్తు నాగపాశ బంధవరమును బ్రహ్మవద్ద పొందినాడు. బ్రహ్మను గౌరవించుటకుగాను రామ లక్ష్మణులు ఆపాశములకు బద్ధులయినారు. ప్రభుత్వముపైన కోర్టు తీర్పు చెప్పిన యెడల ప్రభుత్వమైనను ఆ తీర్పుకు కట్టుబడవలసినట్లు, శ్రీరాముడు భగవంతుడైనను బ్రహ్మ వరమును గౌరవించుటకుగాను నాగపాశములకు కట్టుబడినాడు.

ఆంజనేయుడు సీతను బంధించిన రాక్షసులను జంపుటకు సీతాదేవి అనుమతిని కోరెను. కాని సీతాదేవి "వారి తప్పేమియు లేదు. వారు ప్రభువు కార్యము నిర్వర్తించిరి. నా దురదృష్టమువల్ల నే నిట్లనుభవించితిని. రావణుని ఆజ్ఞను పరిపాలించిన వారినేలననవలెను? రావణుడిప్పుడు మరణించినందువల్ల యిక వారు నన్ను బాధింపరు. ప్రపంచములో తప్పు చేయని వారెవరు? పాపులను గాని, మంచివారిని గాని దయతో జూచుట గొప్పవారి కర్తవ్యము'' అనెను.

## 3. బోధలు :—

జాబాలిమహర్షి శ్రీరామునికి బోధించిన నాస్తిక బోధను శ్రీరాముడు అంగీకరించలేదు. గొప్పవారు అను దృష్టితో వారు చేయు తప్పు బోధలను మనము అవలంబించరాదు.

## 4 యుక్తి యుక్తం వచో గ్రాహ్యం :—

సీతాదేవి అగుపడనందున ఆమె జాడను గురించి శ్రీరాముడు ఒక కొండను విచారించెను. జవాబు రాలేదు. అప్పుడు రాముడు క్రుద్ధుడై "ఆకాశమును క్రిందికిదెత్తును. సముద్రములో నీరులేక జేసెదను. ప్రకృతిని తల క్రిందులు చేసి నాశనము చేసెదను'' అనెను. అప్పుడు లక్ష్మణుడు "ఎవడో ఒకడు చేసిన తప్పుకు ప్రకృతినంతయు శిక్షించుట తగదు. శాంతము వహించుము. సీతాదేవిని వెదకుదము. తప్పు చేసిన వానిని శిక్షించుట న్యాయము'' అని చెప్పెను. చిన్నవాడైనను యుక్తమైనందున రాముడు లక్ష్మణుని మాటనంగీకరించెను. రావణుడు విభీషణుని మాట పెడచెవిని బెట్టి నశించెను.

## 5. విధ్యుక్త ధర్మములు :—

రామలక్ష్మణులు వానర సైన్యముతో సముద్ర సమీపమున చేరినారు. సముద్రము దాటు సమస్య ఒక ప్రక్కన, యుద్ధ విషయము ఒకప్రక్కన, సీతావియోగము మరొక ప్రక్కన, యిన్ని విషయములు శ్రీరాముని బాధించుచుండినను, రాముడు సంధ్యావందనమును మానక చేసినాడు. సంధ్యావందనము చేయుచుండినపుడు రాముని మనస్సును సీతాసమస్య బాధించుచుండెను. అయినను ఆయన సంధ్యావందనము పూర్తి చేసికొనెను. అదే విధముగా మన కెన్ని యిక్కట్లున్నను, మన మనస్సెచ్చటికి పరుగెత్తినను, మన విధ్యుక్త ధర్మములను మనము మానరాదు.

## 6. నిష్కామ కర్మ :—

భరతుడు అయాచితముగ లభించిన ప్రజాపాలనమును

స్వీకరించినను, శ్రీరామ ధ్యాన పరాయణతను వదలలేదు. అదే విధముగా మనమేకర్మ చేయుచున్నను, భగవంతుని స్మరించుచునే చేయవలెను.

7. సామాన్యధర్మము, విశేషధర్మము :—

రావణుడు స్వంత అన్నగారైనను ధర్మప్రబోధములను వినినందున, విభీషణుడు అతనిని పరిత్యజించి రాముని చేరుకొన్నాడు. అన్నగారి మాట వినుట సామాన్య ధర్మము. ధర్మముననుసరించుట విశేష ధర్మము. గనుక విభీషణుడు సామాన్యధర్మమును విడిచి, శ్రీరాముని చేరు కొనెను. ధర్మపథములో నడచువారే నిజమైన బంధువులు. ఇతరులు శత్రువులు.

8. ధర్మో రక్షతి రక్షితః :—

రామలక్ష్మణులు ధర్మయుద్ధము చేయుచుండిరి. కనుక వారు మూర్ఛిల్లినను, గరుడుడు పిలువకనే వచ్చి వారిని రక్షించెను. అధర్మములో నున్నవారు యెంతో ఉచ్చస్థితిలో నున్నటులగుపడినను, నాశము తప్పదు. ధర్మములో చరించు వారెంత క్లిష్టపరిస్థితిలో నున్నను, రక్షణ తప్పదు.

9. యుద్ధములో ధర్మా ధర్మములు :—

రావణుడు ఆంజనేయుని మీదికి దూకినపుడు, రాముడు రావణునిపై బడి అతని రథమును పడగొట్టి, గుఱ్ఱములను, సారథిని చంపి, రావణుని రొమ్మున బాణముతో కొట్టగా, రావణుడు చాల బాధ పడెను. అతని కిరీటము కూడ విరిగి పోయెను అప్పుడు రామడు రావణుని స్థితికి పరితపించి "యీ రోజు గొప్ప యుద్ధముచేసి అలసినావు. లంకకు పోయి విశ్రాంతి తీసికొని మరల రేపు వేరురథము, ఆయుధములు తీసికొనివచ్చి నా బలమును రుచి చూడుము" అని చెప్పెను. రావణుడట్లే అవమానముతో లంకకు పోయెను.

రావణుడు లక్ష్మణుని పైకి శక్తి అస్త్రము ప్రయోగించినపుడు, లక్ష్మణుడు క్రింద పడిపోయెను. అప్పుడు లక్ష్మణుని రొమ్ములో నుండి ఆశక్తి అస్త్రమును తీయుటకు రాముడు ప్రయత్నించుచుండగా, అనగా రాముడు యుద్ధము చేయనపుడు, యిదే మంచి యదను అనుకొని రావణుడు రాముని, వానరులను అనేక బాణములతో కొట్టెను. రామ రావణుల తత్త్వమిందులో గ్రహింప నగును.

రామ రావణ యుద్ధము కడు భయంకరముగ జరుగు చుండగా, లంకలోని సామాన్య ప్రజలకు ఎట్టి హింసయు కలిగింపరాదని శ్రీరాముడు శాసించెను. యుద్ధములో మూక ఉమ్మడిగ శత్రువులను సర్వనాశనము చేయు బ్రహ్మాస్త్రము వంటి మహదస్త్రములను ప్రయోగింపరాదని శ్రీరాముడు తన సైన్యాధిపతుల నాదేశించెను.

10. ధర్మము :—

రావణుడు యుద్ధమునకు రథములో వచ్చెను. రాముడు క్రింద నిలబడి యుద్ధము చేయవలసి వచ్చెను. అట్టి సమయములో ఇంద్రుడు తన రథమును, సారథిని, ధనుస్సును, కవచములను రాముని ఉపయోగార్థము పంపెను. ధర్మములో నున్నవారికి భగవంతుడు అన్ని విధముల తప్పక సహాయము చేయును.

11. ధర్మమేవ జయతే :—

శ్రీరామ కోదండము నుండి వచ్చిన మహాశరధారచేత రావణుని పది శిరస్సులు నేలబడినవి. ఏ రావణుని పాద ములవద్ద దేవేంద్రాది దిక్పతులొకప్పుడు సేవలు జేయు చుండిరో, ఆ రావణుని శిరస్సు లిపుడు గ్రద్దలచేత తన్నులు తినినవి. ప్రాపంచిక సంపద, బలము క్షణ భంగురములు. ధర్మమేవ జయతే.

12. క్రమశిక్షణ :—

విభీషణుడు రాజయిన తరువాత రాముడు ఆంజనేయునితో విభీషణుని అనుమతిని పొంది, లంకకు పోయి, సీతకు రావణుని మరణవార్త వినిపించి, ఆమె యేమిచెప్పునది దెలిసికొని రమ్మని పంపెను. విభీషణుని అనుమతి పొందక పోయినను, రాముడు పంపినందున విభీషణుడు ఆక్షేపణ చేయడు గాని రాజు అనుమతిని పొందవలెనని రాముడట్లు ఆంజనేయుని యాదేశించెను.

13. సతీ ధర్మము :—

కౌసల్య రామునితో కూడ అడవికి వచ్చెదననగా రాముడు కౌసల్యతో "భర్తను విడచి వచ్చుట అధర్మము. భర్తను సేవించుటే పరమధర్మము. ఇతర దైవములను భార్య సేవించనక్కరలేదు" అని చెప్పెను.

రావణుడు సీతకు రెండు నెలలు గడువొసంగి బెదరించి నపుడు సీతాదేవి రావణునితో "నే నిప్పుడే నిన్ను భస్మము చేయగలను గాని అట్లు చేయుటకు నా భర్త అనుమతి పొందవలసి యున్నది" అని చెప్పెను.

14. ధర్మా ధర్మములు :—

శ్రీరాములవారి సీతాన్వేషణ కార్యములో కోతులు,

పక్షులు, భల్లూకములు, ఉడుతలు సహాయపడినవి. ధర్మ మార్గములో నడిచే మహాత్ములకు సకల భూతములు తోడ్పడును.

రాముని తండ్రి దశరథుడు నీతిపరుడు. రాముని వైరి దశకంఠుడు పరదారాగమనుడు. రాముడు నీతిపరునికి కొడుకై దశకంఠుని (విజృంభించిన దశేంద్రియములను) బరిమార్చెను.

రాముడు రావణుని సంహరించి విభీషణుని లంకా రాజ్యమునకు పట్టాభిషిక్తునిగా జేసెను. భగవంతుడు అధర్మపరుని నశింపజేసి ధర్మమును ఉద్ధరించును.

15. పితృభక్తి :—

దశరథుడు రామునితో తనను పట్టాభిషేకము చేసెదనని రాత్రి చెప్పినపుడు రాముడు సరే యనెను. మరుసటి ఉదయము అడవికి పొమ్మన్నప్పుడు అట్లే చేసెదనని సంతోషము తో చెప్పెను.

16. మాతా పితృభక్తి :—

శివధనుర్భంగము అయిన వెంటనే జనకమహారాజు తన కుమార్తె సీతను రామునకిచ్చి వివాహము చేసెద ననెను. కాని రాముడు "నా పరాక్రమము చూపుటకు విల్లు వంచినాను గాని సీతను పెండ్లాడు అభిప్రాయముతో గాదు. సీతను పెండ్లాడుట తన మాతాపితరుల యిష్టముపై ఆధార పడియున్న" దనెను.

17. భ్రాతృ భక్తి :—

భరద్వాజ మహర్షి భరతునకి రాజవిందు యేర్పాటు చేసెను. భరతునికి నవరత్న ఖచితసింహాసనమమర్చెను. అయితే భరతుడు ఆ సింహాసనముపైన కూర్చొనక, సింహాసనమునకు నమస్కరించి, చామరములతో వీచుచు, ప్రక్కన మంత్రులు కూర్చొను స్థలములో కూర్చొనెను.

భరతుడు, రాముని పాదుకలపైన నిలుచుకొనుమని ప్రార్థించి, ఆ పాదుకలను పరమ భక్తితో శిరముపై మోసికొనివచ్చి, సింహాసనమున వుంచి, వాటికి ఛత్రము పెట్టి, పట్టాభిషేకము చేసి, తాను రామప్రతినిధిగా రాజ్య మేలెను.

భరతుడు శ్రీరామ పాదుకలను తన శిరస్సున పెట్టుకొని అయోధ్యకు పోయెను. ప్రతిదినము ఆ శ్రీ పాదుకలకు పూజచేయుచు, తాను యిచ్చు ప్రతి ఆజ్ఞను రామునినుండి వచ్చుచున్నటుల భావించెను.

పదునాలుగు సంవత్సరములు శ్రీరామ పాదుకలను పూజించి, శ్రీరామ ప్రతినిధిగా రాజ్యము చేసి, పదునాలు గేండ్ల తరువాత రాముడు మరల అయోధ్యకు వచ్చినపుడు ఆ శ్రీ పాదుకలను భరతుడు శిరస్సుపైన పెట్టుకొనివచ్చి, శ్రీరాముని పాదపద్మములకు తొడిగి, రాజ్యమును శ్రీరా మునికప్పగించినాడు. పదునాలుగేండ్ల తరువాత సహా భరతునికి రాజ్యకాంక్షలేదు.

18. భక్తి, శ్రీరామానుగ్రహము :—

గుహుడు బోయవాడైనను, శ్రీరాముని ఆలింగన భాగ్య మును పొందగలిగినాడు. శ్రీరాముడు కోరునది నిర్మల భక్తిగాని కులము, ధనము, మతము, విద్యవీటి ఆధిక్య తలుగావు.

జటాయువు శ్రీరామ సేవలో దేహ పరిత్యాగము చేసెను. అతనికి శ్రీరాముడే స్వయముగా దహనసంస్కా రాది క్రియలనొనర్చెను. మీదు తన సాయుజ్యమును సహా అనుగ్రహించెను. ఈ మహాభాగ్యము శ్రీరాముని కుమారునిగా పొందిన దశరథునికి కూడ లభించలేదు.

జటాయువు ముసలి గ్రద్ద అయినను శ్రీరామభక్తి చేత సాయుజ్యము పొందినది. శుద్ధ భక్తి పక్షులను కూడ పునీత పరచును.

సుగ్రీవుడు శ్రీరామాశ్రయము చేతనే తన భీతిని పోగొట్టుకొని, యిష్టార్థమును పొందినాడు. భగవదాశ్ర యము వల్లనే భయాందోళనలు నశించి కామ్యార్థ సిద్ధులు కలుగును.

వాలి సుగ్రీవులు రెండవమారు యుద్ధము చేసినపుడు, సుగ్రీవుడు వాలిచేత బాగా దెబ్బలు తిని, యింకా రాముడు వాలిని బాణముతో కొట్టలేదే అని ఆర్తితో చూచి, యుద్ధము చేయుట మానెను. వెంటనే రాముడు వాలిని ఒకే ఒక బాణముతో చంపెను. జగడమాడునప్పుడు రాముడు సహాయము చేయడు. పోరుమాని ఆర్తతతో చూచినపుడే శ్రీరామ సహాయము లభించును. ఇదేవిధ ముగా గజేంద్రుడు మొసలితో పోరుచుండువరకు విష్ణువు సహాయము చేయలేదు. "లావొక్కింతయు లేదు" అని భగవంతునిపై భారమువేసి గజేంద్రుడు ప్రార్థించిన వెంటనే, భగవంతుడు స్వయముగా వచ్చి, మకరిని జంపి గజేంద్రుని రక్షించెను. ద్రౌపది తన శక్తిని వినియోగించి నంత వరకు శ్రీకృష్ణుడామెకు సహాయము చేయలేదు. రెండుచేతుల నెత్తి, భగవంతుని ప్రార్థించి, తన దిక్కు లేని తనమును, దీనత్వమును చూపిన వెంటనే శ్రీకృష్ణ

డామెకు అక్షయవలువలొసగి, ఆమె మానసంరక్షణమును చేసెను.

నిర్ణీతకాలములో సీతాదేవి వార్త లేక తిరిగివచ్చినవారికి మరణ శిక్ష యని సుగ్రీవాజ్ఞ. సీతాన్వేషణలో వానరులకు అనేక భయపరిస్థితులేర్పడినవి. కడపటవారు మరణమునకు సహా సిద్ధమైనారు, కానీ శ్రీరామ సేవలో మంచి దీక్ష గల వానరులకు ఆరంభములో కలిగిన భయాందోళనలు పోయి, పరిస్థితులన్నియు చక్కబడినవి. హృదయ పూర్వకమైన భగవద్విశ్వాసము గలవారికి వ్యతిరేక వాతావరణము అనుకూలముగా మారి దైవకృప సన్నిహితమగును.

ఆంజనేయుడు చాలా భక్తి శ్రద్ధలతో శ్రీరామ కార్యమునకు పూనుకొని, సీతాదేవిని కనుగొన్నాడు. శింశుపా వృక్షము కొమ్మల మధ్యనుండు హనుమంతుని సీతాదేవి తలయెత్తి చూచినది. అప్పుడు ఆంజనేయునికి గలిగిన యానందమునకు మేరలేదు. అదేవిధముగా మన భక్తి శ్రద్ధలకొద్దీ భగవంతుడు మన హృదయమధ్యముననే దర్శనమిచ్చును.

హనుమంతుడు ఒక్కడే ఎనుబదివేల రాక్షససైన్యమును అవలీలగా దునుమాడినాడు. సముద్రమును అతి సులభముగా దాటినాడు. రామానుగ్రహము అతి శక్తివంతము.

యుద్ధానంతరము సీతాదేవిని శ్రీరాముని సమక్షమునకు తీసికొని వచ్చుచుండగా, సీతామాతను చూచు కుతూహలముతో వానర, రాక్షస సైన్యములు త్రొక్కిసలాడుచుండిరి. అప్పుడు విభీషణుడు జనసమూహములను కొరడాలతో గొట్టి గెంటి వైచి, సీతాదేవి వెడలుటకు మార్గమేర్పాటు చేయమని శాసించెను. దెబ్బలు తగిలిన వానర, రాక్షసుల హాహాకారములు శ్రీరాముడు విని, విభీషణుని కోపగించుకొని, వానర, రాక్షసులు సీతాదేవిని చూచిన దోషము లేదనియు, వారు యెట్టి ఆటంకమును లేక సీతాదేవిని చూడవచ్చుననియు, వారందరు తనవారనియు, ఆమెను అందరికి అగుపడునట్లు కాలినడకతో పిలుచుకొని రావలయుననియు ఆజ్ఞాపించెను.

సీతారామలక్ష్మణులు లంకనుండి అయోధ్యకు బయలుదేరునప్పుడు ఇంద్రుడు ప్రత్యక్షమై ధర్మ రక్షణ చేసిన శ్రీరామచంద్రుని వరములేమైన కోరుకొమ్మనెను. శ్రీరాముడు వెంటనే ధర్మరక్షణకై రణరంగమున మరణించిన వారినందరిని పునర్జీవితులుగ జేయవలయునని కోరెను. ఇంద్రుడట్లే అనుగ్రహించెను. మరణించిన వానరసైన్యమంతయు నిద్రమేల్కొనినటుల మేల్కొనెను. అప్పుడు రాముడు "అయ్యో! జటాయువుకు సంస్కారము చేసితినే. అట్లు చేయక యుండినయెడల యిప్పుడు ఇంద్రుని అడిగిన వరములో జటాయువును సహా చేర్చియుందును కదా అని చాల విచారించెను. గ్రద్ద యింటిపైన వ్రాలిన ఆ యిల్లు ఆరుమాసములు ఖాళీ చేయవలెనని చెప్పుదురు. అట్టి గ్రద్దపైన కూడా రాముని కున్న ప్రేమ అనిర్వచనీయము.

## 19. సత్కార్యములు :—

సత్కార్యములకనేక ఆటంకములు వచ్చుచుండును. వాటికి నిరుత్సాహపడక ధైర్యముతో, దీక్షతో ముందుకు పోయినచో విజయము తప్పక లభించును. ఆంజనేయుడు సముద్ర లంఘనము చేసినప్పుడు కలిగిన ఆటంకములు, అంతిమ విజయము యిందులకు నిదర్శనము.

## 20. కార్య సాధనమునకు యుక్తి యుక్తముగ మెలగవలెను :—

సముద్రములో మునుగువారు అలవచ్చినప్పుడెట్లు అణగియుండవలెనో, అట్లే దేశకాల పాత్రములననుసరించి, ప్రియాప్రియముల సహించి, తమకంటె తక్కువ వారితో సహా యుక్తి యుక్తముగ మెలగి, కాలానుసారముగ సుఖదుఃఖములనుభవించుట కార్యసాధనము. సకల ప్రాణులకు పరమగతియగు శ్రీరాముడు పరిస్థితులను బట్టి కేవలమొక వానర రాజగు సుగ్రీవుని శరణు జొచ్చెను.

## 21. మహత్కార్యములు :—

సముద్రమునకు వారధి కట్టుటకు ఉడుతలు సహా సహాయబడినవి. రామకార్యమును పెద్దవారే చేయవలెనని లేదు. ఎవరికివారు యథాశక్తి యే గొప్ప కార్యమునకైనను తోడ్పడవచ్చును.

## 22. కార్యదీక్ష :—

రామభక్తి ధనుడైన ఆంజనేయుడు సముద్రమును అవలీలగా దాటినాడు. భక్తి తన్మయుడైనవాడు సంసార సముద్రమునకు భయపడడు.

వానరులందరిలోను దక్షిణ దిక్కు పోవు సైన్యములో ఆంజనేయుని పైన సుగ్రీవుడెక్కువ విశ్వాసముంచి అతనికి ప్రత్యేక సలహాలనొసగెను. ప్రభువు సేవకుని పైన అంత నమ్మకము పెట్టుకొనుట శ్రీరాముడు చూచెను. ఆయనకు ఆంజనేయుని విషయము ముందుగ తెలిసినందునను, సుగ్రీవుడాతని యందుంచిన నమ్మకమునల్లను,

శ్రీరాముడాంజనేయునికి సీతాదేవికి యిచ్చుటకు గాను తన ముద్రిక ఆనవాలుగా నొసగెను. ఇది భగవంతునికి ఆంజనేయునిపై గల విశిష్ట ప్రేమను చాటుచున్నది. ఆంజనేయుడు భగవంతునికి తనపై గల ప్రేమకు తానానందపడి, విఘ్నములనన్నిటి నెదుర్కొని, తదేక దీక్షతో భగవత్కార్యమును విజయవంతముగా సాధించెను.

23. మాయ :—

లంకంతయు మంటలై మండినను రావణుని హృదయములోని చీకటి పోలేదు.

రావణుడు విద్యుజ్జిహ్వుని మూలముగ రాముని మాయా శిరస్సును తెప్పించి సీతాదేవికి చూపించినాడు. సీత ఎక్కువగా విలపించినది. అప్పుడే రావణునికి అత్యవసరమగు కార్యముమీద కబురు వచ్చినది. రావణుడు వెళ్ళిపోయినాడు. రావణుడు వెళ్ళినదే ఆ మాయాశిరస్సు మాయమైనది. సరమ (విభీషణుని భార్య) యీ మాయావివరము సీతాదేవికి జెప్పి ధైర్యము కలుగజేసినది. వెంటనే యుద్ధభేరీ నినాదము వినబడినది. సీత ధైర్యము తెచ్చుకొని సంతోషించినది. ధర్మము వద్ద మాయా సంఘటనలు నిలువజాలవు.

24. శ్రీరాముడు భగవంతుడు :—

ఆంజనేయుడు సన్యాసి వేషముతో పోయి రామలక్ష్మణులను చూచి నమస్కరించెను. సన్యాసి యితరులకు నమస్కరించరాదు. అయితే పరతత్త్వము గ్రహించినప్పుడు యేమి చేయుచుండినదియు తెలియక చేయుదురు. శ్రీరామలక్ష్మణులు ఆంజనేయునికి విష్ణువు, ఆదిశేషుడుగా దర్శనమిచ్చిరి.

పరశురాముని శక్తి విష్ణుధనుస్సుతో సహా రాముడు గ్రహించినందున శ్రీరాముని పరశురాముడు విష్ణుమూర్తిగా గ్రహించెనని శ్రీ వాల్మీకిమహర్షి శ్రీమద్రామాయణములో బాలకాండ అంత్యమున వర్ణించినాడు.

చిత్రకూటమునకు భరతుడు వెళ్ళినప్పుడు వాల్మీకి శ్రీరాముని బ్రహ్మగా వర్ణించినాడు.

సీతాదేవిని శ్రీరాముడు అడవికి తనతో కూడ రావలదనినందువలన ఆమె రాములవారిని "స్త్రియం పురుష విగ్రహం" అని చెప్పెను. ఖరాసురవధ సమయమున రాముడు రుద్రుని వలె ఒక్కడే పదునాలుగువేల రాక్షసులను ఒక్క ముహూర్తకాలములో చంపి తన శక్తిని నిరూపించెను. ఇచ్చట శ్రీరాముని శక్తి స్వరూపముగాను, ఈశ్వరస్వరూపముగాను సూచించబడినది.

25. రాముడు పరతత్త్వము

రామలక్ష్మణులు నాగపాశములకు కట్టుబడినప్పుడు శ్రీమహావిష్ణు వాహనమైన గరుత్మంతుడు రామలక్ష్మణుల వద్దకు వచ్చెను. గరుత్మంతుడు దిగుచుండగనే పాము లన్నియు పరుగెత్తిపోయినవి. గరుత్మంతుడు వచ్చి రామలక్ష్మణులను చేతితో నిమురగా అన్ని బాధలుపోయి, వారు మునుపటికన్న ద్విగుణీకృత శక్త్యుత్సాహములు గల వారైరి. రాముడు గరుత్మంతుని ఎవరని ప్రశ్నించగా "నేను నీ మిత్రుడను. నాగపాశములనుండి విడిపించుటకు వచ్చినాను. రావణవధానంతరము నే నెవరో నీకు తెలియగలదు" అని చెప్పెను. రావణవధ రాముడు మానవుడుగానే జరుపవలెను. రామునికి పరతత్త్వము అంతకు మునుపు తెలియగూడదు. గనుక గరుడుడు తాను ఫలానావాడని చెప్పలేదు.

26. భగవంతుడు :—

భగవంతుడు ప్రేమస్వరూపుడు. మహర్షులు తన్నే శరణు బొంది అనన్యభక్తితో తపస్సు చేసినారు. కనుక భగవంతుడు వైకుంఠమును విడిచినాడు. అయోధ్యను వదలినాడు. పాదచారియై ఋషులను వెదకుచు అరణ్యముల వెంట పోయినాడు. తాపసుల రూపమును సహా ధరించినాడు. మహర్షుల నందరను ఒక్కొక్కరిని స్వయముగా సందర్శించి, పూజించి, ఆనందించినాడు.

ఆంజనేయుడు రామునితో సీత ఒకనెల మాత్రము జీవింతునని చెప్పినది అని చెప్పెను. ఆ లోపల ఆమెను రక్షించని యెడల ప్రాణత్యాగము చేయుదునని ఆమె చెప్పినట్లు చెప్పెను. రాముడు "సీత ఒకనెల జీవించినను జీవించవచ్చు గాని నేను మాత్రము సీతను విడచి ఒక రోజు కూడ ప్రాణముతో వుండలే"నని చెప్పెను. భక్తులను రక్షించుటలో భగవంతుని ఆతురత యిట్టిది.

రావణుడు లక్ష్మణుని పైన శక్తి అస్త్రము ప్రయోగించినపుడు మూర్ఛిల్లెను. లక్ష్మణుని రావణుడు లంకకు యెత్తుకొని పోవలెనని ప్రయత్నించెను గాని, మందర మేరు హిమాలయ పర్వతముల నెత్తిన రావణునికి లక్ష్మణుడు బరువాయెను. తరువాత ఆంజనేయుడు వచ్చి లక్ష్మణుని సులభముగా యెత్తి, యుద్ధభూమికి దూరముగా తీసికొనిపోయినాడు. భగవంతుడు భక్తివశుడు గనుక ఆంజనేయునికి లక్ష్మణుడు పక్షిరెక్కవలె తేలిక అయినాడు.

రాముడు ఒక తృణమును (గడ్డిపోచను) బ్రహ్మాస్త్రముగా చేసినాడు. పాదుకలచేత పదునాలుగేండ్లు రాజ్య

మేలించినాడు. కోతులచే సముద్రముపైన వంతెన కట్టించినాడు. కోతులను, కొండముచ్చులను మహాసేనగా నడిపించినాడు. అల్పులను, బలహీనులను అనంత బలోత్తేజితులుగా, మహాఘనులుగా రాముడే చేయగలడు.

27. అవతారము :—

బిడ్డ బాధలు తీర్చుటకు తల్లి తానెట్లు ఔషధము తీసికొని కష్టమనుభవించునో అట్లే భగవంతుడు తన దివ్య వైకుంఠ ధామమును వదలి భూలోకమునకు వచ్చి, ప్రజల యోగ క్షేమములకొరకు శ్రీరాముడుగా అవతరించెను.

తల్లి తనబిడ్డల నెట్లు జాగ్రత్తగా కాపాడునో, అట్లే భగవంతుడు తన భక్తుల కష్టములు తీర్చుటకొరకు ఆతురతతో భూలోకములో నవతరించును.

భూలోకములో ధర్మము తగ్గి, అధర్మమెక్కువయినపుడు ధర్మమును పునరుద్ధరించుట భగవంతుడు అవతరించుటలో గల ముఖ్య ప్రయోజనము. ధర్మపరులను రక్షించుట కొరకు భగవంతుడు కంకణము కట్టుకొని ప్రపంచములో గల సకల దుఃఖములను పోగొట్టుటకు అతిసులభముగా ఆచరింపదగు శరణాగతి పథమును యాదేశించినాడు.

28. బ్రహ్మ సత్యం :—

రావణుని పుత్రులు, మిత్రులు, బంధువులు అందరు ఒకరివెంట ఒకరు ఘోరముగా జరుగుచున్న రామ రావణ యుద్ధములో కూలిపోవుచున్నను, రావణాసురునికి జ్ఞానము కలుగలేదు. కండ్లముందు అడుగడుగున, అణువణువున ప్రపంచముయొక్క అశాశ్వతస్థితి గోచరించుచున్నను, అజ్ఞులు బ్రహ్మసత్యత్వమును గుర్తించలేరు.

29. శ్రీమద్రామాయణ మహిమ :—

భగవంతుని అనేక క్షేత్రములలో పూజించుటచేత, కథాశ్రవణముచేత, నామ సంకీర్తనచేత యే సుఖము మన శ్శాంతి పొందగలమో అందుకైనను మానవజన్మ వాంఛ నీయము. శ్రీమద్రామాయణమును భక్తి శ్రద్ధలతో విను వారికి ముక్తి కరతలామలకము. శ్రీరామచంద్రుడు తన కుమారులే శ్రీమద్రామాయణమును గానముచేయగా విని, రామాయణము యొక్క ఘనతను పొగడినాడు.

30. భగవత్కథా శ్రవణము :—

కుశలవులు సభలో రామాయణగానము చేయుచుండగా శ్రీరామచంద్రమూర్తి యెవరికి దెలియకుండునట్లు సింహాసనమునుండి తిన్నగా దిగి సభలో ఒకరుగా కూర్చొనెను. భగద్విషయము వినునప్పుడు పెద్దవారైనను చెప్పువారి కన్న ఉన్నతాసనములో కూర్చొనరాదు.

31. ధ్యానము :—

అంగదుడు మొదలగు వానరసమూహము సముద్రమును లంఘించు శక్తి వారిలో ఎవరికున్నదని ప్రశ్నించు కొనుచుండినను, ఆంజనేయుడేమియు పట్టించుకొనక తన మనో వాక్కాయములు శ్రీరామునికి అంకితముచేసి మౌనముగా కూర్చొని శ్రీరామ ధ్యానానందమనుభవించు చుండెను. భగవద్ధ్యానానందమును రుచి చూచినవారికి ప్రపంచములో యిక దేనిపైనను యిష్టముండదు. నిజమైన మహాత్ములు వారి యోగ, మంత్ర, సిద్ధ శక్తులు ఉపయోగము లేనివాటికిగాని, తనకొరకుగాని యుపయోగించక, అధ్యాత్మికాభివృద్ధిని, భగవత్సేవకు మాత్రమే ఉపయోగించి, వారు పొందిన విజయములన్నియు భగవంతుని కరుణకే ఆపాదింతురు.

32. యుగళోపాసన :—

రాములవారిని మాత్రం కోరిన శూర్పణఖకు ముక్కు, చెవులు పోయినవి. సీతను మాత్రం కోరిన రావణునికి అన్ని తలలు పోయినవి. సీతారాముల నిద్దరిని ఉపాసించి, వారిద్దరి కలయికను దర్శించిన ఆంజనేయునికి, విభీషణునికిని సర్వమంగళములు కలిగినవి. గనుక గృహస్థులు ఉమాపరమేశ్వరులు, లక్ష్మీనారాయణులు, సీతారాములు, రాధాకృష్ణులు ఈ ప్రకారము యుగళోపాసన చేయుట మంగళకరము.

33. భక్తుడు, ఆచార్యుడు :—

భరతుడు తన మేనమామ యింటికి పోయినపుడు శత్రుఘ్నుడు అతనితోకూడా పోయెను. శత్రుఘ్నుడు భాగవత భక్తుడు. అతనికి రామకైంకర్యము తరువాతిదే. ఆచార్యుని మూలముగా భగవంతుని అనుగ్రహము కోరుట భగవంతుని శరణాగతి చేసినట్లే తప్పక ఫలితమునిచ్చును.

34. అంతస్తు లేక హోదా :—

ఆంజనేయుడు మొదట రామలక్ష్మణులతో కలిసినప్పుడు రాముడు లక్ష్మణుని ఆంజనేయునితో మాట్లాడమనెను. సుగ్రీవునివద్దకు రామలక్ష్మణులు పోయినప్పుడు సుగ్రీవుడు రామునికి ఆసనము నొసగెను. లక్ష్మణునికి ఆంజనేయుడు ఆసనమిచ్చెను. ఇది అంతస్తు క్రమము.

35. దూషణ :—

నిరపరాధియగు లక్ష్మణుని, తన తల్లికంటె సీతాదేవిని ఎక్కువ భక్తితో సేవించు లక్ష్మణుని, శ్రీరామసేవకే తన యావజ్జీవితమును అంకితము చేసికొనిన లక్ష్మణుని, సీతాదేవి కపటియని, రాములవారు లేనిసమయమున ఆమెను ఆశించినవానిగను నిందించెను. ఈ పాపకార్యమునకు ఆమె లంకలో పదిమాసములు నిర్బంధములో నుండి శ్రీరామ వియోగమనుభవించవలసి వచ్చెను.

వనవాసములో భరద్వాజ మహర్షిని శ్రీ సీతారామలక్ష్మణులు దర్శించిరి. ఆ సమయమున భరద్వాజ మహర్షి కైకేయి దశరథులను నిందింపగా, శ్రీరాముడు నొచ్చుకొని, వారు ధర్మమూర్తులనియు, వారియందేలాంటి దోషము లేదనియు భరద్వాజమహర్షికి చెప్పెను.

పంచవటిలో నున్నప్పుడు ఒకానొక శీతాకాలపు వేకువన స్నానమునకై సీతారామలక్ష్మణులు గోదావరినదికి వెడలిరి. అప్పుడు లక్ష్మణుడు "కైకేయి భరతులవలన గదా యిట్టి శీతల జలస్నానము మనకు సంప్రాప్తమైనది" అని శ్రీరామునితో నవగా శ్రీరాముడు లక్ష్మణుని మందలించి, కైకేయి భరతుల సద్గుణములనే తనకు వినిపింపవలయుననియు, వారిని దూషించరాదనియు శాసించెను.

36. కాలము :

వర్షఋతువులో శ్రీరామలక్ష్మణులు మలయ పర్వతము పైననే యుండి, తరువాతనే సీతాన్వేషణ ప్రారంభించదలచినారు. ఎట్టివారైనను కాలమునకు కట్టుబడియుండవలెను.

37. కాలమహిమ :—

మృదుతర శయ్యాతలమున హాయిగా శయనించుచుండు రామచంద్రుడు కటిక నేలపై దర్భల శయ్యగా బవళింపవలసి వచ్చెను. మహాభోగములనుభవించుచుండవలసిన రామచంద్రుడు సామాన్యుని చందమున సోదరుని తోడను, భార్యతోడను తాపసవేషములు ధరించి, నగరము విడిచి, అడవుల వసింపవలసివచ్చెను. ఎండ కన్నెరుగనిదియు, మృదుల ప్రదేశమున విలాసార్థముగా యించుక నడచినను యలసట నొందు సీత కఠిన శిలాకంటకమయమైన యరణ్యమార్గమున నడువవలసివచ్చెను.

38. కష్టములు :—

చిత్రకూట పర్వతమున శ్రీరాముడు ప్రకృతి శోభకానందించుచు, సీతాదేవిని యానందింపజేయుచు, "ఈ పర్వతమే మన అయోధ్య; యీ పక్షులు, మృగములే మన ప్రజలు; యీ మందాకిని మన సరయు; మనకిక్కడ చాల సంతోషముగాను, తృప్తిగాను వున్నది" యనెను. కష్టములను ధైర్యముతో యెదుర్కొనవలెను. కష్టములు వచ్చెనని భీరువుగా నుండరాదు. అందులోనే యున్నది యానందము.

మనసు పరిశుద్ధముగా నున్న, యెట్టి పరిస్థితినైనను యెదుర్కొనవచ్చును. సీతాదేవి రావణునితో ధైర్యముగా ఒక గడ్డిపోచను యెదురుగా పెట్టుకొని మాట్లాడెను.

39. తాపత్రయములు :—

సీతారామానుగ్రహము వలన హనుమంతుని లంకలో అగ్ని దహించక చల్లగా సుఖప్రదమైనది. భగవదనుగ్రహము పొందినవారిని తాపత్రయములు బాధించవు.

40. మంచితనముయొక్క విలువ :—

శరణాగతి చేసిన రాముని సముద్రుడు గుర్తించలేదు. విల్లెక్కు పెట్టినదే సముద్రుడు గడగడలాడి రామకార్యమునకు సహాయపడినాడు. మంచిగా వున్నవారిని సామాన్యలోకులు అసమర్థత క్రింద జమకట్టెదరు.

41. యోచనలేని కార్యము :—

అయోధ్యలో మంత్రులు, ప్రజలు భరతుని రాజుకమ్మని యెంత బలవంతపెట్టినను భరతుడు ఖండితముగా ఒప్పుకొనలేదు. భరతుని మనోబలము ధైర్యము గొప్పది, గనుక అతనిపేరు చిరస్థాయిగా నిలచినది. సుగ్రీవుని ప్రజలు రాజుగా కావలెనని కోరినప్పుడు అతడు ఒప్పుకొనెను. రాజ్యము అతనిది కానప్పుడు ప్రజల కోరికలవల్ల అంగీకరించినందున అతనికి కష్టములు వచ్చెను. సుగ్రీవునికి మానసిక బలము లేదు గనుక కష్టపడెను. యోచనలేక కార్యము దుఃఖమును సమకూర్చును.

42. కర్మఫలము :—

రాత్రి నిశ్చయించిన పట్టాభిషేకము మరు ఉదయమున వనవాసముగా మారినది.

భగవంతుని అదృశ్య హస్తము ప్రతిజీవి జీవితమును నడపుచుండును. భగవదేచ్ఛముందు మానవశక్తి ఫలించదు. దశరథుడు రామునికి పట్టాభిషేకము చేయవలెనని ప్రయత్నించెను. అతని ప్రయత్నమునకు ప్రజల పూర్తి సహకారముండెను. కైకేయి రెండు వరములు దశరథుని వద్ద పొంది, భరతునికి పట్టాభిషేకము రామునికి వనవాసము కల్పింప యత్నించెను. అప్పుడు దశరథుడు తమ్ము దిక్కు

రించి అయినను సింహాసన మధిష్ఠింపమని రామునికోరెను. గాని యీ ప్రయత్నములేవియు ఫలించకపోగా అయోధ్యను పరిపాలించు యోగము శ్రీరామపాదుకలకు లభించినది.

మృత్యువు సమీపించినపుడు దానినెవరును జయింప లేరు. కుంభకర్ణుడు, విభీషణుడు రావణునికి సీతాదేవిని రామునికప్పగించుటకన్న గత్యంతరములేదని సలహా లిచ్చినను, వారి సలహాలు మంచిదని తనకు తోచినను, మూర్ఖుడగు రావణుడు వారి సలహాలను పెడచెవినిబెట్టెను. విధివిలాసమట్లు జరిపించును. ముఖస్తుతి చేయువారి మాటలు, దంబముగానుండు తన చిన్నకుమారుడు ఇంద్ర జిత్తు వాక్కులు విని రావణుడు విభీషణుని తన యెదుట నుండి తొలగిపొమ్మనెను.

రాముడు రాజ్యమును వదలవలసివచ్చెను. వనవాస మనుభవించెను. అతని భార్య దొంగిలింపబడెను. అతని మిత్రుడు జటాయువు సంహరింపబడెను. ఈ విధముగా రాముడు వరుసగా కష్టములనుభవించెను.

దశరథుడు తెలియక పొరపాటున ఋషికుమారుని చంపినను, తాను తన కుమారుడగు శ్రీరాముని యెడ బాటును అనుభవింపవలసి వచ్చెను. కర్మఫలము అనుభ వించక తప్పదు.

సీతావియోగము వల్ల శ్రీరాముడు దుఃఖించుచున్నాడని ఆంజనేయుడు సీతాదేవికి చెప్పగా, ఆమె విధివి తప్పించు కొనుటకు తనకుగాని, రామలక్ష్మణులకుగాని వీలుకాదనెను,

ప్రారబ్ధమును అనుభవించక తప్పదు. అయితే భగ వచ్ఛరణాగతి చేసినవారు ప్రారబ్ధమును సులభముగా అను భవించునట్లు భగవంతుడు అనుగ్రహించును. భరతుడు శ్రీరామునికి శరణాగతి చేసినను పదునాలుగేండ్లు రాజ్యము చేయుటము తప్పలేదు. అయితే శరణాగతి చేసినందువల్ల రాముడు తన పాదుకలద్వారా ప్రారబ్ధమనుభవించుటకు భరతునికి శక్తినొసగెను. ప్రారబ్ధ అనుభవకాలము మాత్రము తగ్గలేదు.

రావణుని తాత మాల్యవంతుడు సీతాదేవిని రాముని కిచ్చి తన్ను, తన ప్రజలను రక్షించుకొనుమని రావణునికి హితబోధ చేసెను. అతని పాపమునకు శరణాగతి తప్ప వేరు ప్రాయశ్చిత్తము లేదని మాల్యవంతుడు చెప్పెను. అయితే రావణుడు అహంకార మమకారములవల్ల కలిగిన క్రోధముచేత సద్బోధను పెడచెవిని బెట్టెను. రావణుడు తన హితబోధ విననందువల్ల ఎవరి కర్మ వారనుభవింపక తప్పదని మాల్యవంతుడు వెడలిపోయెను. రావణుడును కొల్లాంతరమున నశించెను.

మంచి, చెడు, పుణ్యము, పాపము వాటి వాటి ఫలిత ముల నిచ్చును. ఎవరు చేసినది వారు అనుభవించవని తప్పదు. మంచివారి కన్నీరు వృథాగాపోదు. సీతాదేవిని చెరబెట్టిన పాపము రావణుడు అనుభవించక తప్పలేదు.

"సీతారాములు కొంతకాలము వియోగమనుభవించినను, మరల ఒకటయి సంతోషముగా నున్నారు. నన్ను, మన వంశమునంతటిని నీవు దుఃఖసముద్రములో ముంచివోయి నావు" అని మండోదరి రావణుని కళేబరముపైనబడి విల పించినది. చెడుకార్యముల ఫలితమనుభవించక తప్పదు.

43. ప్రాపంచిక ఆశలు :—

సీతాదేవి మాయలేడిని చూచి భ్రమించినది. ఆమె మన సులో కోరిక గలిగినది. ఫలితము రామవియోగము. ప్రపంచ వస్తువ్యామోహితులకు భగవంతుడు దూరముగా నుండును. గనుక విషయవస్తువులకై భగవంతుని ప్రార్థించరాదు. అవి మనలను బంగారు జింకవ భ్రమింప జేయును. రాములవారిని అడవిలో దూరముగా తీసికొని వెళ్ళినట్లు, మనలను సాధనకు దూరము చేయును.

44. తనకోపమె తన శత్రువు :-

సుగ్రీవుడు విజము చెప్పినను, వాలి వినక సుగ్రీవు నిపై యెక్కువగా కోపగించుకొనెను. తనకోపమే తన శత్రువన్నట్లు, వాలి కోపమే వాలి నాశనమునకు కారణ భూతమాయెను.

45. అభిమానము :—

శుకసారణులు రావణునికి రామసైన్య పరాక్రమమును అభివర్ణించినను, రావణుడు అభిమానదోషమున దానిని పట్టించుకొనలేదు గనుక ఫలితమనుభవించక తప్పలేదు. మూర్ఖులు సత్యమును పట్టించుకొనరు.

46. ఇతరులకు కీడు తలచుట :—

రావణుడు ఆంజనేయుని తోక కాల్పించెను. కానీ లంకే బూడిద అయినది. మూర్ఖులు పరులకు కీడు తలపెట్టుదురు గాని స్వనాశనమే ప్రాప్తించును.

47. ప్రజాపాలన :—

సీత మహాపతివ్రత అని తెలిసియు రాముడు సీతను అగ్నిప్రవేశము చేయించెను. లోకాపవాదము లేకుండు టకు రాముడట్లు చేయించెను.

ఎవడో ఒక సామాన్య రజకుడు సీతామాత శీలమును శంకించినందున రాముడు సీతాదేవిని తపోభూములకు పంపెను. సీతాదేవి నిష్కళంక యని శ్రీ రామచంద్రునికి తెలిసినను, ఆమెను విడనాడకుండుట స్వార్థమగును. శ్రీ రాముడు నిస్వార్థుడు గనుక ప్రజావాక్యమును పాటించి తనకు అపనింద రాకుండునటుల నడచుకొనెను. నిస్వార్థత దైవగుణము,

48. గర్వము :—

పరిపూర్ణశరణాగతి చేతనే భగవంతుని మనము స్వాధీనము చేసికొనగలము. అంజలి ముద్రయే అతనిని వశము చేసికొను ఆయుధము. ఆయన అధికారమును ప్రశ్నించిన వారి గర్వమును ఆయన హరించును. పరశురాముడు వైష్ణవ ధనుస్సును రామునికి సమర్పింపక, పోరుకు పిలచి నందున అతడు ఓడిపోయెను.

49. అనుమానము :—

నిష్కళంకుడైన భరతుడు సహా అనవసర అనుమానములకు గురియాయెను. దశరథుడు భరతుడు మరలివచ్చుటకు మునుపే శ్రీరామునికి పట్టాభిషేకము చేయుటకు ఆతురపడ జొచ్చెను. దుఃఖించుచున్న భరతుని కౌసల్య సూక్ష్మముగా నిందించెను. గుహుడు, భరతుడు దుర్బుద్ధితో రామునిపైకి యుద్ధమునకు వచ్చుచున్నాడని తలచెను. భరతుని రాకను లక్ష్మణుడు వారికింకను కష్టములు కలుగజేయుటకే యని యనుకొనెను. చివరకు సందేహము లన్నియు మాయమై భరతుడు మెప్పు పొంది గౌరవింపబడినాడు. సత్యము, నిష్కళంకత్వము మొదట కష్టములు, నిందలు కలుగజేసినను, చివరకు తప్పక జయించును.

50. సవతిపోరు :—

సవతిపోరు స్త్రీలు యిష్టపడరు. గనుక కైక సదభిప్రాయము మార్చుటకు గాను మంథర "నీ భర్త నీ కింత కాలము అనుకూలముగానుండుట కౌసల్యకిష్టములేదు. రాముడు రాజైనపుడు కౌసల్య రాజమాతయగును. కనుక నీవు కౌసల్యవలన సవతి బాధలు అనుభవింపవలసివచ్చును. నీవు కౌసల్యకు దాసి. భరతుడు రామునికి దాసుడు" అని చెప్పెను. అప్పుడు కైకకు కోపము కలిగెను. దాని ఫలిత మనుభవించెను.

51. స్నేహితము :—

శ్రీరాముడు సుగ్రీవునితో సఖ్యము చేసికొన్నపుడొకరి కష్టసుఖములు మరియొకరివని అగ్నిసాక్షిగా ప్రమాణములు చేసికొనినారు. వాలి చనిపోయిన తరువాత సుగ్రీవుడు దుఃఖింపపండగా, సుగ్రీవుడు దుఃఖించుచున్నాడని రాముడు సహా దుఃఖించినాడు, ఇది స్నేహిత లక్షణము.

52. శత్రుత్వము

రావణ వధానంతరము విభీషణుడు తన సోదరుడైన రావణుడు దుర్మార్గుడైనందున, అతనికి దహనక్రియ లొనర్ప నని చెప్పగా, శ్రీరాముడు విభీషణుని శాంతపరచి "మరణాంతాని వైరాణి" అను ఆర్యోక్తినెరుకపరచి, రావణుడు ఉత్తమలోకములను పొందుటకై విభీషణునిచే దహన సంస్కారము చేయించెను.

53. దుస్సహవాసము :—

నెమ్మదియైన మనసుకు సహా దుర్మార్గుల సహవాసము కళంకమును కలుగజేయును. గూని దాసి యగు మంథర దుర్బోధ వలన మెత్తటి మనస్సుగల కైకేయి సహా క్రమముగా పతన మూర్ఖురాలుగా మారెను. ఏ, కైక శ్రీరాముని ధర్మమూర్తియని వర్ణించుచుండెనో ఆ కైకయే శ్రీరాముని వనవాసమును కోరునంత కఠినురాలాయెను.

కైకేయి కోపగృహములో ప్రవేశించి, చినిగిన పాత చీర కట్టుకొని, నేలపై బరుండి యేడ్చుచుండెను. ముందు రానున్నది ఆమె అప్పుడే అనుభవింపసాగెను. దుష్టుల సహవాసము యెడల యెప్పుడో రాబోవు కష్టములు ముందుగానే యనుభవింపవలసి వచ్చును.

కైక మంథర దుర్బోధ విని, తనకును, యితరులకును దుఃఖమును కలిగించినది, దుర్జన సాంగత్యము కీడు కలిగించును.

54 స్త్రీహింస :—

జటాయువు వధ సమయమున రావణుడు సీతాదేవి కేశములను ఎడమచేతితో పట్టుకొని యీడ్చి ఆమెను వంకలో పెట్టుకొనెను. స్త్రీని కేశములతో పట్టి యీడ్చిన పురుషునికి వినాశము. భారతములో ద్రౌపదిని కేశములతో లాగినందుకు కురువంశమే నాశనమైనది.

55. కామినీ, కాంచనములు :—

భరతుడు కాంచన విజయమును సాధించినాడు. అప్రయత్నముగా లభించిన సామ్రాజ్యమును తృణప్రాయముగా చూచినాడు, శ్రీరాముని పాదసేవనే మహాభాగ్యముగా తలచినాడు, నిజమైన భక్తుడు కాంచనమును దరిజేరనీయడు.

భార్యావియోగము పొంది వాలివలన భీతి కలిగియున్నపుడు, సుగ్రీవుడు శ్రీరామునికి శరణాగతుడై భయరహితు

డైనాడు. రాజ్యము, కామినీసుఖము లభించిన వెంటనే రాజ్య మదోన్మత్తత వలన శ్రీరామ కార్యమును విస్మరించినాడు. కామినీ కాంచనములు దైవభక్తిని, సత్యదృష్టిని మరచునట్లు చేయును. కష్టములలో భగవంతుని స్మరించి, సుఖములలో మరువరాదు.

కామోద్రేకము ఎంత సత్యసంధుణ్ణైనను ధర్మమునుండి దూరము చేయును. దశరథుడు పెక్కువేల సంవత్సరములు ధర్మముగా రాజ్యమేలెను. ధర్మమూర్తి, సత్యమూర్తి అయిన శ్రీరామచంద్రమూర్తిని పుత్రునిగా బడసెను. అయినను కామోద్రేకము చేత తన చిన్న భార్య కైకేయి ప్రీతికొరకు ఆమె యేమి చేయమన్నను (శిక్షితుణ్ణి విడువమన్నను, మంచివానిని శిక్షించమన్నను) చేయుదునని దశరథుడు చెప్పెను.

56 రామనామము :——

ఏ అస్త్రమునకును్న ఇంద్రజిత్తు నావనందున లక్ష్మణుడు ఐంద్రాస్త్రమును రామనామముచే అభిమంత్రించి ప్రయోగించెను. వెంటనే ఇంద్రజిత్తు మరణించెను. రామనామము మహాశక్తివంతమైనది. అది బ్రహ్మాస్త్రమున కన్నను గొప్పగా పనిచేసినది.

57. అన్యథా చింతితం కార్యం :——

ఆంజనేయుడు బ్రహ్మాస్త్రమునకు కట్టుబడినాడు. ఇట్లైనను రావణ దర్శనము లభించునని సంతోషించినాడు. రావణుడు ఆంజనేయుని తోకకు నిప్పు పెట్టించినాడు. ఆంజనేయుడు లంకాదహనము చేసినాడు. రావణ సంకల్పమొకటి. జరిగినది మరి యొకటి.

నాగపాశబంధనమునకు రామలక్ష్మణులు క్రిందపడి మూర్ఛిల్లిరి. ఇంద్రజిత్తు రావణుని వద్దకు పోయి రామలక్ష్మణులు చనిపోయిరని చెప్పినాడు. సంతోషించి త్రిజటను "సీతను పుష్పక విమానములో పిలుచుకొనిపోయి ఆమెకు రామలక్ష్మణులను చూపుము"ని చెప్పెను. అలాగే ఆమె సీతాదేవిని పిలుచుకొని పోయి రామలక్ష్మణులను చూపగా, ఆమె తనకు వైధవ్యమెందులకు ప్రాప్తించినదని యేడ్చుచుండగా, త్రిజట "రామలక్ష్మణులు మూర్ఛిల్లినారేగాని బ్రతికియే యున్నారు. అట్లు గానిచో విధవ పుష్పక విమానములో నుండుట అసంభవము. వారి ముఖ లక్షణములు బాగున్నవి. విలపించకుము" అని యోదార్చెను. రావణుడు పుష్పక విమానములో సీతను పంపిన అభిప్రాయ మొకటి. జరిగినది మరి యొకటి. "అన్యథా చింతితం కార్యం దైవమన్యత్ర చింతయేత్".

58. మరణసమయమున సంకల్పము :——

సీత జటాయువుతో తన అపహరణమును గురించి రాముల వారికి చెప్పుమనెను - గనుక రాముడు వచ్చువరకు జటాయువు ప్రాణములు పట్టుకొనియుండి, సీతాపహరణ విషయము రాములవారికి నివేదించి, ప్రాణములు వదలెను. మరణ సమయమున తీవ్రమైన సంకల్పమేదైన యుండిన యెడల, ఆ సంకల్పమీడేరువరకు, ప్రాణములు సులభముగా పోవు.

59. రామభక్తి :——

ఆంజనేయుడు లంకాదహనము చేసినపుడు అన్ని గృహములు దగ్ధమైనవి కాని విభీషణుని యిల్లు మాత్రము మామూలుగా యుండినది. సదా రామనామజపము చేయుచు, రామధ్యానము చేయుచుండువారికి యే కష్టములు వచ్చినను అవి కష్టములుగా తోచవు.

60 ఆజ్ఞలు :——

కౌసల్య రాముని అడవికి పోవలదనియును, రాజుగాగాకున్నను తనకు సేవ జేసికొనుచు అచ్చటనే యుండుమనియు చెప్పెను, పితృాజ్ఞ యెంతయో తన ఆజ్ఞయు అంతే అని ఆమె చెప్పెను. గాని రాముడు తాను తండ్రియాజ్ఞకు ముందే బద్ధుడైనాడనియును, కౌసల్య కూడ దశరథుడు భర్త మరియు చక్రవర్తి అయినందువల్ల భర్త ఆజ్ఞ, చక్రవర్తి ఆజ్ఞ పాలించక తప్పదని చెప్పెను

లక్ష్మణుడు, సీతాదేవి తన్ను కఠిన మాటలతో నిందించినపుడు, ఆమెను విడచి శ్రీరాముని వద్దకు పోగా, శ్రీరాముడు లక్ష్మణుని "నా ఆజ్ఞనుల్లంఘించినావు గదా" అని యడిగెను. దీని యభిప్రాయము "ఆమె యేమన్నను నా యాజ్ఞ ప్రకారము నీ వచ్చటనే యుండియుండవలెను. నేను తండ్రిమాట పాలించినది తెలియదా? కౌసల్య మాట కన్న తండ్రిమాటకు ఎక్కువ ప్రాముఖ్యమిచ్చినాను" అని,

61. వినయము :——

సీతాదేవి వానరసైన్యమెట్లు సముద్రమును దాటి రాగలదని ఆంజనేయుని ప్రశ్నించగా, అతడు తాను అందరికంటె తక్కువవాడనియును, వానరులలో యింకను గొప్ప వీరులున్నారనియును, తానే సముద్రమును దాటగలిగినపుడు వారా సముద్రమును యింకా అవలీలగా దాటగలరనియును అతి వినయముగా చెప్పెను. మహనీయులకు గర్వముండదు. వారు ప్రగల్భములు పలుకరు. ఆంజనేయుడెంత సాహసవంతుడో అంత వినయవంతుడు

కూడ. కనుకనే సీతారాముల అనుగ్రహమును అతడు సంపాదించగలిగినాడు.

హనుమంతుడు కిష్కింధలో రామలక్ష్మణుల పరిచయము చేసికొన్నపుడు అతడు నవవ్యాకరణ పండితుడైనను, చాల వినయముతో మాటలాడెను. విద్యకు ఫలితము వినయము.

62. సత్యపరిపాలన :—

రాముడు సుఖదుఃఖములకు లోబడడు. అయితే యితరుల కష్టసుఖములు తనవిగా భావించును. సుగ్రీవుడు వాలివల్ల తన రాజ్యమును, భార్యను పోగొట్టుకొనినాడని రాముడు విని చాల చింతించెను. రాముడు ధర్మమూర్తి, సత్యమూర్తి. తన మాట నిలుపుకొనుటకు గాను లక్ష్మణునైనను, కడకు సీతనైనను వదలెదనని దండకారణ్యములో సీతతోనే రాముడొకసారి చెప్పెను.

దండకారణ్యములోని ఋషులు రాక్షసుల బాధనుండి కాపాడమని రాముని ప్రార్థించగా శ్రీరాముడు వారికభయమిచ్చెను. "మనకు రాక్షసులతో పోరువద్దు. దాని వలన మనకు నష్టము, కష్టము కలుగవచ్చును. దానివలన నీకును బాధ కలుగవచ్చును. కనుక మనము ఎవరి జోలికి పోక సుఖముగా కాలము గడపుద"మని సీత చెప్పగా రాముడు "నేను ఋషులకభయ మిచ్చినాను. మనమిచ్చటికి వచ్చినది హాయిగా కాలక్షేపము చేయుటకు గాదు. నా ప్రాణము పోయినను సరే, లక్ష్మణునిగాని, నిన్నుగాని వదలవలసి వచ్చినను సరే, మాట మాత్రము తప్పను" అని సీతతో చెప్పెను.

కోసలదేశములో ఆబాలగోపాలము తననే ప్రభువుగనుండగోరినను, దశరథ చక్రవర్తియే తన్ను ధిక్కరించి సింహాసన మధిష్ఠింపమని రాముని కోరినను, లక్ష్మణుడు, మంత్రులు, సైన్యాధిపతులు అందరును శ్రీరాముడే రాజుగా కావలెనని కోరినను, శ్రీరాముడు సామ్రాజ్యమును తృణీకరించి ధర్మమార్గానువర్తియై, తన తండ్రిని సత్యవంతునిగ చేసెను.

63. పరుల వస్తువులు :—

పట్టాభిషేకానంతరము శ్రీరామచంద్రుడు అతి అమూల్య వస్తువైన పుష్పక విమానమును మరల కుబేరున కొసగెను గాని సంగ్రహింపలేదు.

64. శ్రీరామ వాగ్దానము :—

మిత్రభావేన సంప్రాప్తం, న త్యజేయం కథంచన
అభయం సర్వభూతేభ్యో దదామ్యేతద్వ్రతం మమ॥

తా॥ స్నేహబుద్ధితో వచ్చిన యెట్టివానిని గాని యెన్నడును విడువను. సర్వప్రాణులకభయ మిచ్చుచున్నాను. ఇదియే నా వ్రతము.

సకృదేవ ప్రపన్నాయ తవాస్మీతి చ యాచతే।
అభయం సర్వభూతేభ్యో దదామ్యేతద్వ్రతం మమ॥

తా॥ ఎట్టివాడైనను ఒక్కమారు నన్ను శరణుజొచ్చిన యెడల వారికి అభయ మిచ్చుటే నా వ్రతము.

65. ముద్రికాచూడామణుల మార్పు :—

అంగుళీయకము చేతిలో ధరింపనది గనుక అది శ్రీరామ హస్తమునుండి ప్రవహించు రక్షకత్వమును సూచించును. భగవంతుని అనుగ్రహమునకు కృతజ్ఞత చూపుటకు మానవుడా పాదారవిందముల పైన తన శిరసునుంచి నమస్కరించుటకన్న చేయగలిగినది లేదు. కనుక సీతాదేవి తాను శిరసున ధరించు చూడామణిని శ్రీరాముల వారికి పంపుటలో ఆమె శ్రీరాముని పాదపద్మములకు శరణాగతి చేసెనని భావము.

66. దైవానుగ్రహము :—

దైవానుగ్రహము పాండిత్యమువల్ల గాని, కులముచేత గాని, ధనముచేతగాని, కీర్తివలనగాని సంపాదించలేము. ఒక్క అనన్య భక్తిచేతనే దానిని పొందగలము. దీనికి నిదర్శనము నావికుల రాజు గుహుడు, వానర యువరాజు సుగ్రీవుడు, బోయవనిత శబరి, రాక్షస కులజుడైన విభీషణుడు మొదలగువారు. శరణాగతి తత్వములో భగవంతుడే సర్వశక్తిమంతుడనియును, తాను అనన్యగతికుడనియును, భగవంతునికాత్మార్పణ చేసిననే తనకు ముక్తి కలుగుననియును ప్రపన్నుడు దృఢముగా విశ్వసించవలెను.

67. శాంతి :—

సీతాదేవిని అశోకవనములో క్రూరరాక్షస స్త్రీలు సామ దాన భేద దండోపాయములతో బోధించినారు. శ్రీరాముని వదలమనియు, రావణుని ప్రేమించుమనియు బోధించినారు. సీతాదేవి ఆ దుర్బోధనలను తృణీకరించినది. రామునే మనసార ప్రేమించినది. గనుక ఆమెకు కడపట రాముడు దొరికి శాంతి లభించినది. అలాగే విషయ వాసనలు, ప్రాపంచిక ఆశలు మనలను సీతాదేవిని రాక్షసుల వలె బాధించుచున్నవి. మనము వాటికి దాసోహమనక వాటిని ధైర్యముతో ఎదుర్కొనినచో మనకు శాంతి లభించును.

శ్రీరాముడు అయోధ్యలో సింహాసనమధిష్ఠించగనే అన్ని లోకములలోని జీవకోట్లుఅఖండ శాంతిని పొందినవి. హృదయ పీఠముపైన పరమాత్మ అధిష్ఠించినపుడు జీవితము మహాశాంతిమయమగును.

# తుఫాను, ఉప్పెన ప్రాంతాలలో రామకృష్ణ మిషన్ విశిష్ట సేవలు

## మండలి వెంకటకృష్ణారావు

"మానవసేవయే మాధవసేవ" బాధలలో ఉన్న తోటి మానవునికి సేవ చేయడం కన్న ఉత్తమమైన సేవ మరొకటి లేదని మానవతకు వన్నె పెట్టారు స్వామి వివేకానంద. ఈ ఆశయంతోనే ఎక్కడ ఆపద వస్తుందో, ఎక్కడ బాధ ఉంటుందో అక్కడ రామకృష్ణ మిషన్ ప్రత్యక్షమవుతుంది. కరువులు, కాటకాలు, తుఫానులు, వరదలు, ప్రాంతాలలో సేవలో కనపడేది రామకృష్ణమిషన్.

ఐహిక సుఖాలను వదలి త్యాగనిరతితో సేవకు జీవితాలను అంకితం చేసిన సేవామూర్తులు కాషాయబట్టలతో ప్రత్యక్షమౌతారు. వీరిని చూడగానే ఆపదలో ఉన్న వారికి కొంత శాంతి చేకూరుతుంది. కలకత్తాలో హుగ్లీనదీ తీరాన బేలూరు, రామకృష్ణమిషన్ కేంద్రంగా వర్ధిల్లుతోంది. క్రమశిక్షణతో అహోరాత్రులు మానవసేవలో నిమగ్నమయి వందలాది సేవామూర్తులు ఉన్నారు.

1977 నవంబరు 19వ తేదీ ఆంధ్రప్రదేశ్‌కు దురదృష్టమైన రోజు. ఆ కాళరాత్రి వచ్చిన ఉప్పెన వలన కృష్ణానదీ ముఖద్వారంలోఉన్న దివి, బందరు తీర ప్రాంతాలలోని గ్రామాలు మునిగి కొట్టుకొనిపోయాయి. గంటకు రెండు వందల కిలోమీటర్ల వేగంతో వీచిన పెను తుఫాను వలన చీరాలనుండి నర్సాపురంవరకు తీవ్రనష్టానికి గురి అయింది. 24 అడుగుల ఎత్తున ఉవ్వెత్తుగా వచ్చిన ఉప్పెనవలన వందలాది ఇండ్లు నేలమట్టమయినాయి. వేలాది మంది మరణించారు. లక్షలాది పశువులు బలి అయినాయి. కోట్ల రూపాయల ఆస్తి నష్టమయింది. 20వ తేదీ కొన్ని గ్రామాలలో తిరిగి, 21వ తేదీ ఏదో రకంగా దారిచేసుకొని గన్నవరం విమానాశ్రయంలో ముఖ్యమంత్రికి వార్త తెలిపేవరకు, ఈ ఘోరనష్టాన్ని గురించి బయటి ప్రపంచానికి వార్త అందలేదు. కమ్యూనికేషన్లు పూర్తిగా బ్బతిన్నాయి. వైర్‌లెస్ కూడా పనిచేయలేదు.

తుఫాను ఆగగానే రాజమండ్రి రామకృష్ణ మిషన్ కేంద్రంలో ఉన్న స్వామి బోధస్వరూపానంద, కార్యదర్శి స్వామి నందానందతో సంప్రదించి, ఇద్దరు ముగ్గురు బ్రహ్మచారులను తీసుకొని విజయవాడ చేరారు. అజిత్‌నగర్‌లో సహాయ కార్యక్రమాలు ప్రారంభించారు. గుంటూరు వెళ్లి నల్లచెరువు, చుట్టు గుంటలలో సేవా కార్యక్రమాలు కొనసాగించారు. బాపట్ల వెళ్ళి భీమవారిపాలెం, ఉప్పరపాలెం, రైలుపేట, చిల్లరగొల్లపాలెం, గోవిందనగర్ కాలనీలలో సహాయంచేశారు. మచిలీపట్టణం వెళ్లి రిలీఫ్ క్యాంపులలో వున్న వారికి చాపలు కొని యిచ్చారు. 26వ తేదీ ఉదయం శ్రీ కె.యల్. రావు గారితో కలిసి స్వామి బోధస్వరూపానంద అవనిగడ్డ వచ్చారు. శవాలను తొలగించుటకు శవసేన కార్యకర్తలను దళాలుగా ఏర్పాటు చేస్తున్న సమయంలో నన్ను కలుసుకొన్నారు. కోడూరు ప్రాంతానికి వెళ్ళవలసిందిగా చెప్పాను. కృష్ణాపురం నుండి కోడూరు వరకు రోడ్డు, కాలవగట్లు, ఇండ్ల కప్పులు శవాలతో, కళేబరాలతో కప్పబడి ఉన్నాయి. వాటిని ఆ రోజే తొలగిస్తున్నారు. ఆ బీభత్స దృశ్యాలను చూచి ఆయన చలించిపోయారు. నిరాధారులైన, ఆత్మీయులను కోల్పోయిన వేలాది జనం సి ఉన్న కోడూరు బజారులో వారిని చూసి ఓదారుస్తూ కోడూరు ప్రాథమిక ఆరోగ్య కేంద్రం చేరారు. అక్కడ ఇసుక

దిబ్బలమీద స్థావరం ఏర్పాటు చేసుకొన్నారు. కోడూరు చుట్టుప్రక్కల పూర్తిగా ఊడ్చుకొని పోయిన పది గ్రామాల ప్రజలకు బియ్యం, పప్పు, పచారి దినుసులు, కాయగూరలు పంచి పెట్టారు. దుప్పట్లు, బట్టలు, పాత్రలు ఇచ్చారు. అయిదులక్షల రూపాయల విలువగల తాత్కాలిక సహాయాన్ని మూడు నెలలపాటు యిచ్చి ప్రజలను పోషించారు.

తీరప్రాంతాలలో తరచు తుఫానుల వలన ప్రజలు కష్టనష్టాలకు గురి అవుతున్నారు. ఇండ్లు పడిపోతున్నాయి. ఆర్.సి.సి. స్లాబ్‌తో ఇల్లు కట్టి 2500 రూపాయలు యింటికి ఇవ్వటానికి ప్రభుత్వం నిర్ణయించింది. ఈ నిర్ణయాలు బోధస్వరూపానందస్వామికి ఉత్సాహాన్ని యిచ్చాయి. వెయ్యి ఇండ్లు కట్టుతానని చెప్పారు. అడ్వాన్సుగా ముఖ్యమంత్రి నిధి నుంచి 10 లక్షలు యిచ్చారు. మద్రాసు వెళ్లి స్వామి ఉద్ధవానంద సహకారంతో ఇంజినీర్లను సంప్రదించి తుఫాన్లకు తట్టుకొనేవిధంగా ఇంటి నమూనా తయారుచేయించి తీసుకొనివచ్చారు. అయిదువేలతో ఒక యిల్లు అవుతుందని ఎస్టిమేటు వేశారు. మొట్టమొదట పక్కా యిండ్ల నిర్మాణ కార్యక్రమానికి 1978 జనవరి 1 వ తేదీన పాలకాయతిప్పలో పునాదిరాయి వేసే అపూర్వ అవకాశం నాకు కలిగింది. 2వ తేదీన గొల్లపాలెంలో స్వామి రంగనాథానంద శంకుస్థాపన చేశారు. పులిగడ్డవద్ద సిమెంటు రాళ్లు తయారుచేసే కర్మాగారాన్ని నెలకొల్పారు.

గ్రామాన్నంతా బుల్‌డోజర్లతో చదును చేసి, ప్రతి యింటికి రోడ్డు సదుపాయం ఉండేటట్లు తీర్చిదిద్దిన గ్రామాల నిర్మాణం ప్రారంభించబడింది. సహాయ కార్యక్రమాలలోనూ, శాశ్వత నిర్మాణ పథకాలను రూపొందించటంలోను నిర్విరామకృషి సల్పిన స్వామి బోధస్వరూపానందకు అనారోగ్యం కలిగినందున రాజమండ్రి రామకృష్ణమిషన్ కార్యదర్శి స్వామి నందానంద తాత్కాలికంగా నిర్మాణ బాధ్యతలను స్వీకరించారు. తరువాత భవన నిర్మాణంలో అనుభవజ్ఞులైన అరుణాచల ప్రదేశ్‌లోని రామకృష్ణమిషన్‌లో పని చేస్తున్న స్వామి ప్రథమానంద శాశ్వత గృహ నిర్మాణ పథకపు బాధ్యతను స్వీకరించారు.

గ్రామాలకు సరియైనరోడ్లులేవు. మట్టి రోడ్లన్నీ గండ్లు. పూడ్చినా లారీలు వెళ్ళలేక పోయేవి. మంచినీరు లేదు. ఇండ్లు కట్టే సముద్ర తీర గ్రామాలలో ఉండటానికి అవకాశాలు లేవు. అటువంటి క్లిష్ట పరిస్థితులలో స్వామి ప్రథమానంద దీక్షవహించి అహోరాత్రులు రామకృష్ణమిషన్ కార్యకర్తలను ఉత్సాహపరచి 18 నెలలలో 1105 యిండ్లు కట్టించారు. 229 ఇండ్లతో కట్టిన గొల్లపాలెం గ్రామానికి గత నవంబరులో ప్రధాని శ్రీ మురార్జీ దేశాయి ప్రారంభోత్సవం చేసి 'రామకృష్ణపురం'అని పేరు పెట్టారు.

143 ఇండ్లతో కట్టబడిన వివేకానంద పురమునకు రామకృష్ణమిషన్ కార్యదర్శి శ్రీ స్వామి గంభీరానంద ఫిబ్రవరిలో ప్రారంభోత్సవం చేశారు. 137 ఇండ్లుగల శారదాపురమునకు (ఊటగుండం) మార్చిలో రామకృష్ణ మిషన్ అధ్యక్షులు స్వామి వీరేశ్వరానందజీ మహరాజ్ ప్రారంభోత్సవం చేశారు. 112 ఇండ్లతో పాలకాయతిప్ప పరమహంసపురంగా, 144 ఇండ్లతో ఉల్లిపాలెం నరేంద్రపురంగా రూపొందించబడ్డాయి. స్వతంత్రపురంలో 112 యిండ్లు, శ్రీరామపురంలో 41 యిండ్లు, బస్వానిపాలెంలో 28 ఇండ్లు, కృష్ణాపురంలో 22 ఇండ్లు బాపట్ల యానాదికాలనీలో వందయిండ్లు—మొత్తము 1105 యిండ్లు కట్టారు.

ఈ నిర్మాణ పథకమును రూపొందించిన స్వామి బోధస్వరూపానంద జ్ఞాపకంగా బస్వాని పాలెం పేరును బోధస్వరూపపురంగాను, ఈ పథకాన్ని జయప్రదంగా పూర్తిచేసిన స్వామి ప్రథమానంద (ప్రీతమ్ మహారాజ్) జ్ఞాపకార్థం పిండివారి దిబ్బను ప్రీతమ్‌పురంగాను పిలువవలెనని స్థానిక ప్రజలు నిర్ణయించుకొన్నారు. గొల్లపాలెం, ఇరాలి, పాలకాయ తిప్పలలో తుఫాను రక్షణ కేంద్రాలను నిర్మించారు. ఇరాలి, శ్రీరామపురం, పాలకాయతిప్ప, కోడూరు, బాపట్ల యానాదికాలనీలలో దేవాలయాలను, ఒక చర్చి నిర్మించారు. కోడూరు హైస్కూలులలో ఓపెన్ ఎయిర్ థియేటర్లు నిర్మించారు. అవనిగడ్డ సేవాశ్రమంలో మంచినీటి సరఫరా పథకమును ఏర్పాటు చేశారు. అన్ని గ్రామాలలోను పంచాయతీరాజ్ డిపార్టుమెంటు రోడ్లు వేయించారు. ఎలక్ట్రిసిటీ డిపార్టుమెంటు వీధి దీపాలు వేశారు. నిర్మాణమయిన ప్రతి యింటికి ఎలక్ట్రిసిటీ ఇవ్వడానికి రామకృష్ణమిషన్ వారు ఎలక్ట్రిసిటీ డిపార్టుమెంటువారికి డబ్బు కట్టారు. ఫారెస్టు డిపార్టుమెంటు మొక్కలు యిస్తున్నారు. ఈ నిర్మాణ కార్యక్రమాలనన్నింటినీ పూర్తిచేసిన తరువాత జూలై 25వ తేదీన కృష్ణాజిల్లా కలక్టరు శ్రీ మోహన్ కందా అధ్యక్షత క్రింద స్వామి ప్రథమానందకు, స్వామి బోధస్వరూపానందగార్లకు కృతజ్ఞతలను తెలియజేసి స్థానిక ప్రజలు వీడ్కోలు యిచ్చారు.

ఈ బృహత్తర నిర్మాణ పథకానికి 70 లక్షలు ఖర్చు అయింది. ప్రభుత్వం 20 లక్షలు యిచ్చారు. ఆంధ్రప్రభ ఆరున్నర లక్షలు, ఈనాడు మూడులక్షలు. ఎన్. టి. ఆర్., ఎ. ఎన్. ఆర్. దాదాపు తొమ్మిది లక్షలు, దక్కన్ క్రానికల్, బెంగుళూరు జిందాల్ పరిశ్రమ, సింధి అసోసియేషన్ చెరొక రెండేసి లక్షలు, అమెరికా తెలుగు అసోసియేషన్, ఏలూరు జగత్ మిల్లు లక్ష వంతున ఇంకా చిన్నచిన్న మొత్తాలుగా విరాళాలు యిచ్చారు. వీరందరికీ మా కృతజ్ఞతలు తెలియజేసుకొంటున్నాము.

రామకృష్ణ మిషన్ అధ్యక్షులు స్వామి వీరేశ్వరానందజీ, ఉపాధ్యక్షులు స్వామి గంభీరానందాజీ, కార్యదర్శి స్వామి వందనానందాజీ, సహాయ కార్యదర్శి స్వామి గహనానందాజీ, స్వామి ఆత్మస్థానందాజీ, హైదరాబాదులో ఉన్న రామకృష్ణ మిషన్ అధిపతులు స్వామి రంగనాథానందజీ, వివిధ ప్రాంతాలలోని రామకృష్ణ మిషన్ స్వామీజీలు వచ్చి ఈ కార్యక్రమాలను చూసి ఆనందించారు. రామకృష్ణ మిషన్ గురించి ప్రధాని, ముఖ్యమంత్రి ప్రశంసించారు.

సర్వాంగ సుందరంగ నిర్మాణం చేసిన ఈ గ్రామాలలో నివసించే ప్రజల ఆర్థిక స్తోమతలను పెంచేటందుకు కోడూరు పంచాయితీ వారు యిచ్చిన ఐదు ఎకరాలలో శారదాశ్రమమును ఏర్పాటు చేసి బొంబాయి వాణిజ్యవేత్త శ్రీ ప్రతాప్ అధ్వర్యంలో గ్రామశ్రీ సొసైటీని స్థాపించారు. శ్రీ కప్పా వెంకట్రామశాస్త్రి గారు సహాయ కార్యదర్శిగా ఉండి నిర్వహిస్తున్నారు. వ్యవసాయ, మత్స్య పరిశ్రమల అభివృద్ధికి పథకాలు తయారు చేస్తున్నారు.

వీరు నిర్మించిన గ్రామాలలో విద్యాభివృద్ధికి రామకృష్ణమిషన్ కేంద్రాన్ని కూడా ఏర్పాటు చేయమని అధ్యక్షులను కోరాము. వారు ఈ విషయం ఆలోచించగలమని అన్నారు. రామకృష్ణమిషన్ చరిత్రలోనే ఇది పెద్ద శాశ్వత నిర్మాణ కార్యక్రమము. సమాజ

సేవ చరిత్రలో రామకృష్ణ మిషన్ ఈ బృహత్తర మానవసేవ సువర్ణాక్షరాలలో లిఖించబడగలదు. వారు చేస్తున్న సేవను ఆదర్శంగ తీసుకొని స్థానిక ప్రజలు కష్టించి పనిచేసి ఆర్థిక స్తోమతలను పెంచుకొని నవ సమాజ నిర్మాణానికి తోడ్పడగలరని ఆశిస్తున్నాను. మహత్తరసేవ చేసిన రామకృష్ణ మిషన్ వారికి ధన్యవాదములు.

సర్వేజనాస్సుఖినో భవంతు.

—(ఆలిండియా రేడియో, హైద్రాబాదు సౌజన్యంతో)

# సత్యం శివం సుందరం

చీమలకొండ ఉమా రామలింగమూర్తి

ఈ విశ్వమునకు భగవంతుడు సృష్టికర్త యని ఆస్తికులందరు నమ్మెదరు. భగవంతుని లక్షణములు ఇట్టివని వివిధ మతస్థులు వారి వారి మత గ్రంథముల సహాయమున తెలిసికొందురు. హిందువులు ఉపనిషత్తులను ప్రామాణిక గ్రంథములుగ పరిగణింతురు. అవి భగవంతుని ఎట్లు వర్ణించినవో గమనించి వీనిని ఆంగ్లవాఙ్మయములోని అభిప్రాయములతో సమాధానపరచగలమేమో చూతము.

అన్ని ప్రదేశములందును, అన్ని కాలములందును ఉండునట్టియు, అనంతమైనట్టియు, శక్తివంతమైనట్టియు ఒక పదార్థము కలదనియు, అదియే బ్రహ్మము లేక పరమాత్మ యనియు అది నిరాకారమైనదనియు, మనస్సు చేతగాని, వాక్కు చేతగాని, గ్రహింపబడుటకు సాధ్యముకాదనియు ఉపనిషత్తులు భగవంతుని వర్ణించినవి. అది సత్ (Truth) చిత్ (Knowledge) ఆనంద (Biss) స్వరూపమనియు 'సత్యం జ్ఞానం అనంతం' అనియు 'సత్యం శివం సుందరం' అనియు వివిధరీతుల వర్ణించినవి. అయితే దేవుడు నిరాకారుడైనప్పటికీ, ఉపాసనా సౌలభ్యము కొరకు విష్ణువు, శివుడు, రాముడు, దేవి- ఇత్యాది పేర్లతో హిందూ పురాణములు దేవుడు సాకారుడని వర్ణించినవి. నిర్గుణ బ్రహ్మమును ఉపాసించుట జనసామాన్యమునకు సాధ్యము కాదుగాన సగుణ బ్రహ్మమును ఉపాసించుట వారి కొరకు చెప్పబడినది. వాస్తవమునకు నిర్గుణ బ్రహ్మమన్నను సగుణ బ్రహ్మమన్నను ఒకటే. ఈ సంగతిని గ్రహించుటకు ఈ దిగువ ఉదాహరణములను పరిశీలింపుము.

బాలుని దృష్టిలో మేఘము, నీరు, మంచుగడ్డ—ఈ మూడును విభిన్న పదార్థములు. చదువరి దృష్టిలో ఇవన్నియు వేరు వేరు స్థితులలో (States) నున్న ఒకే పదార్థము. మనలను ఆవరించి యుండు ప్రదేశమంతయు ఖాళీ ప్రదేశము కాదనియు గాలితో నిండియున్నదనియు, గాలిలో నీటియావిరి కలదనియు చదువరి గ్రహించును. గాలిలోని నీటియావిరి కంటికి కనుపించకపోయినను, అది వివిధ పరిస్థితులలో మేఘముగగాని, వర్షము (నీరు)గ గాని, వడగళ్ళు (మంచుగడ్డ)గ గాని మారునని అతనికి తెలియును. ఇదే విధముగ బ్రహ్మ, మహేశ్వరుడు వేరు వేరు దేవతలని అజ్ఞాని భావించినను, వీరందరు ఒకటే అనియు వారికి భేదము లేదనియు జ్ఞాని భావించును. వివిధ

మతస్థులు వేరువేరు పేర్లతో పిలుచుచున్న రాముడు, రహీం, క్రీస్తు ఇత్యాది దేవతా మూర్తులన్నియు పరమాత్మ అంశయే అని జ్ఞాని గ్రహించును. ఈ విషయమే 'ఈశ్వర, అల్లా, తేరేనామ్' అనెడు వాక్యమున చెప్ప బడినది. అందుచే భగవంతుని వర్ణించుటకుప యోగింపబడిన సత్యం, జ్ఞానం, అనంతం, శివం, సుందరం మొదలగు పదములు దేవుని గుణములను తెలియచేయునని భావించుట కంటె అవియే దైవస్వరూపములు అని భావిం చుట సమంజసము. బ్రహ్మము - ఆత్మ - పర మాత్మ- ఇవి అన్నియు భగవంతునికి ఉపయో గించబడు పర్యాయపదములే.

బ్రహ్మము సత్, చిత్, ఆనందము (God is an embodiment of Truth Knowledge and Bliss) బ్రహ్మము సద్రూపము అనగా బ్రహ్మము శాశ్వతమైనది (Real) అన్ని కాలములందు (భూత భవిష్యద్వర్తమాన కాలములందు) ఉండునది, నాశములేనిది, కన్ను మొదలగు అవయవములకు గోచరము కానిది అని భావము. బ్రహ్మము చిద్రూప మనగా జ్ఞానస్వరూపమని భావము. సర్వపదార్థ ములను గూర్చిన జ్ఞానము (Knowledge)- జ్ఞానేం ద్రియ, కర్మేంద్రియ, అంతఃకరణ చతుష్ట యము (మనస్సు, చిత్తము, బుద్ధి, అహం కారము)- వీనిచే లభించు జ్ఞానమును లభింప చేయునదే చిద్రూపము. శరీరము (body) జడ పదార్థము (inert) అయినను, చిద్రూపమగు ఆత్మవలననే ప్రాపంచిక జ్ఞానము లభించు చున్నది. శరీరమును రైలుపెట్టెతో పోల్చినచో, ఆత్మను ఇంజనుతో పోల్చవచ్చును. బ్రహ్మము ఆనంద స్వరూపమనగా నిరతిశయ సుఖ మును కలుగచేయునది. జ్ఞానేంద్రియముల వలనను కర్మేంద్రియముల వలనను జాగ్రత్, స్వప్న అవస్థలలో కల్గు సుఖదుఃఖములు తాత్కాలికమైనవే. ఇవి సుషుప్తి యందు కానరావు. సుషుప్తి యందలి సుఖము నిత్యమై నది. ఈ సుఖమును కలుగచేయుటకు ఉపాధి ఏమియు అవసరములేదు. ఇట్టి సుఖమే అంత ర్ముఖునకు సర్వదా లభించును. అందువలన నిత్యమైన, నిరుపాధికమైన సుఖమునే ఆనంద మందురు. అట్టి ఆనందము బ్రహ్మస్వరూపము.

బ్రహ్మమును వర్ణించుటకు 'శివం' అను పదము కూడ ఉపయోగింపబడినది. 'శివం' అనగా మంగళకరమై, హేయగుణరహితమై, అమాంగళ్యరహితమై శోభించునది. ప్రపం చములోని ఏ పదార్థమైనను మంచి-చెడుల సమ్మేళనము. చెడు ఏమాత్రము లేకుండ సంపూర్ణముగ మంచిగ నుండునది ఆ పర బ్రహ్మమే.

పర బ్రహ్మమును వర్ణించుటకు 'సుందరమ్' అను పదము కూడ ఉపయోగింపబడినది. ఒక్క కంటికి మాత్రమేగాక సర్వేంద్రియములకు ఆనందమును కల్గించు పదార్థము ఏదియో అదియే బ్రహ్మము. అందమైన పుష్పము కంటికి ఇంపుగా నుండును. మృదుమధురముగ పాడు పక్షుల కంఠధ్వని చెవులకు ఇంపుగ నుండును. సువాసనగల వస్తువులు ఘ్రాణేంద్రి యమునకు ఇంపుగ తోచును. ఖాద్య యోగ్యమైన పదార్థములు జిహ్వేంద్రియము నకు ఇంపుగ తోచును. మృదువైన వస్తువులు స్పర్శేంద్రియమునకు ఆనందమును కల్గించును. ఇట్టి వస్తువులన్నియు సౌందర్యరూపములుగ పరిగణింపబడును. వీని అన్నిటికి ఆలవాలమైన సృష్టికర్త సౌందర్యరాశి. ఆయన అంశయే వీనిలో కానవచ్చుచున్నది.

ఆంగ్ల వాఙ్మయమున పరమాత్మను గూర్చి ఎట్టి అభిప్రాయములు వ్యక్తము చేయబడినవో

చూడుడు. ఆధ్యాత్మిక చింతనగల గాంధి మహాత్ముడు నుడివిన ఈ దిగువ వాక్యమును గమనింపుడు. 'I used to declare that God is Truth. But now Ifind it more significant to say that Truth is God. భగవంతుడు సత్ స్వరూపుడని నేను ఉద్ఘాటించెడువాడను. కాని సత్యమే దైవ సమమని చెప్పుట సమంజసముగ తోచుచున్నది.'' ఇందలి భావమును అవగత మొనర్చుకొనుటకు సత్-సత్యము-ఈ మాటలకు గల విస్తృతార్థమును పరిశీలించవలసి యున్నది. ఆధ్యాత్మికముగ 'సత్' అనగా సత్పదార్థము. ఇది శాశ్వతమైనది. (What is real and what exists). అట్టి పదార్థము నాశము లేనిది. అది మనస్సుచేత కూడ ఊహింప సాధ్యము కానిది. God is Truth అను వాక్యము వలన భగవంతుడు సత్ స్వరూపుడు అని తెలియును. Truth is God (సత్యమే దైవసమము) అను వాక్యములో సత్యమనగా వ్యావహారిక సత్యము సత్యభాషణము (Truthfulness), 'My Experiments with Truth' అను గ్రంథమున సత్యభాషణము యొక్క ఉత్కృష్టతను గ్రహించుటకు ఆయన చేసిన పరిశోధనలు వర్ణింపబడినవి. ఇట్టి సత్యము ఎట్టిదై ఉండవలెనో ఇట్లు చెప్పబడినది. This Truth is eternal invincible, immutable and there fore the only thing we should put our faith in. మనోవాక్కాయ కర్మలలో పాటించబడుచు, ఎట్టి పరిస్థితులలోను ఉల్లంఘింపబడనట్టియు ఎంత విలువైన వస్తువు కొరకైనను విడనాడబడనట్టియు అగు సత్యము భగవంతునివలె శాశ్వతమైనది. అట్టి సత్యము దైవసమము.

ఇటులనే కీట్సు (Keats) అను ఆంగ్లకవి "Beauty is Truth and Truth Beauty సౌందర్యము సత్పదార్థము. సత్యమువలె సౌందర్యము శాశ్వతమైనది'' అని వర్ణించెను. శబ్ద, స్పర్శ, రూప, రస, గంధములచే (Sound, Touch, Sight, Taste, smell) మనస్సునకు ఆహ్లాదమును కల్గించు ప్రకృతిలోని వస్తువులన్నియు సౌందర్య రూపములే అయినప్పటికి, ఆ వస్తువులు తాత్కాలికమైనవే ఏలనన ఆ వస్తువులు కొద్దికాలములోనే నశించును. కాని వాని వలన కల్గినఆనందమును శాశ్వతముగ నుంచుటకు కళలు (arts) సహాయపడుచున్నవి. ఒక శిల్పముగాని కావ్యముగాని చిత్రముగాని జ్ఞానేంద్రియములచే ఇది వరకు గ్రహింపబడిన సౌందర్యమును జ్ఞప్తికి తెచ్చుకొనుటకు ఉపయోగపడును గాన మన ఊహ (Power of Imagination) వలన అది శాశ్వతమగు సౌందర్యమగుచున్నది. కవి కానిండు. శిల్పి కానిండు, చిత్రలేఖకుడు కానిండు – ఆయనచే నిర్మింపబడిన కళాఖండమందు భద్రపరచబడిన సౌందర్యము శాశ్వతముగ నుండును. అందుచే జ్ఞానేంద్రియమువలన ప్రత్యక్షముగ గ్రహింపబడు సౌందర్యము తాత్కాలికమే (అశాశ్వతమే) అయినను, కళలందు భద్రపరచబడిన సౌందర్యము అంతఃకరణ చతుష్టయముచే గ్రహింపబడి శాశ్వతమగుచున్నది. అట్టి శాశ్వత సౌందర్యమే యథార్థమైనది అని కీట్సు భావము.

అందువలన హిందూవాఙ్మయములో సత్+చిత్+ఆనంద స్వరూపుడు శివ, సౌందర్యముల రాశియని చెప్పబడిన భావమునే ఆంగ్ల వాఙ్మయమునందు కూడ కానగలము.

# బాలల శారదాదేవి

బి. ఎస్. ఆర్. ఆంజనేయులు

## మన రాజమండ్రి

రామేశ్వరం నుండి మాతృదేవి బెంగళూరు వచ్చింది. అప్పటికే బెంగళూరులో శ్రీరామకృష్ణ మఠం ఉన్నది. బెంగళూరు చల్లనివూరు. మంచి రంగు రంగులుగా వుండి సువాసనలు వెదజల్లే పూలు యెక్కువగా పూస్తాయి. శ్రీ మాతృదేవి మీద అక్కడివారు ఘుమ ఘుమలాడే పూలవాన కురిపించారు. అప్పుడు రామకృష్ణానందస్వామి పొందిన ఆనం దానికి అంతులేదు.

బెంగళూరు మఠంలో మాతృదేవి వున్నప్పుడు యెంతోమంది ఆమెను దర్శించారు. ఆమె దగ్గర దీక్ష తీసుకున్నారు. ఆ మఠం చుట్టూ చాలా విశాలమైన చోటువుంది. దానిలో ఒక చిన్న (కొండ) గుట్టవుంది. ఒకరోజు మాతృదేవి ఆ గుట్టమీద శాంతంగా కూర్చున్నది. ఆమెను చూడగానే రామకృష్ణానందస్వామికి పర్వతరాజపుత్రి పార్వతి, గిరిరాజ సుతగౌరి, జ్ఞాపకమునకు వచ్చారు. ఆయనది స్థూలశరీరం. అయినా రొప్పుతూ గబగబా పైకి ఎక్కాడు. మాతృదేవికి ప్రదక్షిణంచేస్తూ యిలా ప్రార్థించాడు. ''సర్వమంగళ మాంగళ్యే శివే సర్వార్థ సాధికే। శరణ్యే త్రయంబకే గౌరి నారాయణి నమోస్తుతే''. తర్వాత ఆమెకు సాష్టాంగంగా నమస్కారం చేశాడు. శ్రీ మాతృదేవి ఆయన తలపై చెయివుంచి ఆశీర్వదించింది. శ్రీ శారదా మాయి సాక్షాత్తు మహామాయియే!

బెంగళూరు నుండి మద్రాసు మీదుగా కలకత్తా పోతూ మాతృదేవి 1911 ఏప్రిల్‌లో మన రాజమండ్రి వచ్చింది. పవిత్రమైన ఆ అఖండ గోదావరిలో, పుష్కరిణీ రేవులో స్నానం చేసింది. ఆమె అన్నపూర్ణ. ఆమె రాకవల్ల ఆంధ్రదేశమంతా కృష్ణా గోదావరీ జలాలు పారి పాడిపంటలు కురుస్తూ భారతదేశానికే అన్నపూర్ణగా విలసిల్లింది.

రామకృష్ణుడు అర్చించు శ్యామగాను
సీతగా మరి గిరిరాజసుతయుగాను
పోషణము చేయు శ్రీ అన్నపూర్ణగాను
తెలియగావచ్చె శారదాదేవి నేడు

సంపాదకులు: స్వామి తన్మయానంద.

శ్రీ ఎమ్. బాలసుందరంగారిచే ఫ్రీడమ్ ప్రెస్, (మద్రాసు-600 021) న ముద్రింపబడి.

స్వామి తన్మయానందవారిచే శ్రీ రామకృష్ణమఠము (మద్రాసు-600 004) నుండి ప్రచురింపబడినది.

## [illegible] మఠ ప్రచురణములు

| గ్రంథము | వెల |
|---|---|
| శ్రీ [illegible] | 3.00 |
| శ్రీ [illegible] | 10.00 |
| శ్రీ [illegible] | 8.00 |
| శ్రీ [illegible] | 3.75 |
| శ్రీ [illegible] | 2.00 |
| [illegible] | 2.00 |
| [illegible] | 1.25 |
| శ్రీ [illegible] | [illegible] |
| శ్రీ [illegible] సంగ్రహము | 0.15 |
| [illegible] | |
| శ్రీ [illegible] | 8.60 |
| శ్రీ [illegible] | [illegible] |
| శ్రీ [illegible] | 2.50 |
| శ్రీ [illegible] | [illegible] |
| శ్రీ [illegible] | 4.00 |
| [illegible] | 2.00 |
| శ్రీ వివేకానంద సంపూర్ణ గ్రంథావళి | |
| [illegible] సంపుటములు పూర్తి సెట్టు ([illegible]) | 66.00 |
| .. .. (క్యాలికో) | 81.00 |
| విడి సంపుటములు ఒక్కొక్కటి ([illegible]) | 5.00 |
| .. .. (క్యాలికో) | 6.50 |
| స్వామి శిష్య సంవాదములు | 10.50 |
| సందేశ తరంగిణి (మొదటి భాగము) | 4.00 |
| .. (రెండవ భాగము) | 6.50 |
| భారత యువజనులారా! | 3.00 |
| [illegible] | 3.75 |
| రాజయోగము | 4.25 |
| కర్మయోగము | 4.00 |
| భక్తియోగము | 4.00 |
| శ్రీ వివేకానందలేఖావళి (మొదటిభాగము) | 2.25 |
| .. (రెండవభాగము) | 3.00 |
| హిందూ మతము | 4.00 |
| [illegible] సూర్యోదయము | 4.00 |
| అనుష్ఠాన వేదాంతము | 2.50 |
| ప్రాచ్యము - పాశ్చాత్యము | 1.25 |
| కులము, సంస్కృతి, సామ్యవాదము | 3.00 |
| [illegible]దేశము | 2.00 |
| భారతీయ మహిళ | 2.00 |
| నా జీవితము, జీవిత కార్యము | 1.25 |
| శ్రీ [illegible]: [illegible] | 0.50 |
| చికాగో [illegible] | 1.00 |
| శ్రీ వివేకానంద [illegible] | 0.80 |
| నవీన భారత దేశము | 0.40 |
| సర్వం విష్ణుమయం జగత్ | 0.35 |
| శ్రీ వివేకానంద సింహగర్జన | 0.20 |
| బ్రహ్మానంద బోధనలు | 4.75 |
| భవత్రయ చికిత్స | 0.60 |
| ముక్తిమార్గము | 0.30 |
| పారమార్థిక సంభాషణలు | 6.60 |
| నారద భక్తి సూత్రములు | 4.00 |
| శ్రీ పెద్ద భాగవతము-మూడవ సంపుటము | 7.50 |
| దేవీమాహాత్మ్యము | 4.00 |
| శ్రీ మద్భగవద్గీత | 9.00 |
| శ్రీ మద్భగవద్గీత చిన్నసైజు | 3.00 |
| పారాయణగీత తాత్పర్యసహితము | 8.75 |
| .. మూలము | 2.00 |
| కఠోపనిషత్తు | 2.00 |
| గిరీశచంద్ర | 1.00 |
| భక్తిమార్గము | 1.00 |
| శ్రీకృష్ణవాణి | 0.60 |
| బుద్ధవాణి | 0.80 |
| క్రీస్తు సూక్తిమాల | 0.80 |
| మహమ్మదు సూక్తి మంజరి | 0.80 |
| శ్రీ విష్ణుసహస్రనామ స్తోత్రము | 1.25 |

ఇవియేకాక ఆంగ్ల, సంస్కృత, తమిళ, హిందీ, కన్నడ గ్రంథములును.

వేదాంత కేసరి (ఆంగ్లము) శ్రీ రామకృష్ణ విజయము (తమిళము)

అను మాసపత్రికలును, శ్రీ రామకృష్ణ పరమహంస, శ్రీ శారదాదేవి, శ్రీ వివేకానందస్వామి మున్నగువారి ఛాయాచిత్రములు, త్రివర్ణ చిత్రములు, తైలచిత్రములు మున్నగునవెన్నియో మా యొద్ద లభింపగలవు.

వ్రాయుడు : మేనేజరు, శ్రీ రామకృష్ణ మఠము, మైలాపూరు, మద్రాసు - 600 004

సంవత్సర చందా రూ. 10-00 జీవిత చందా రూ. 125-00 విడి సంచిక 1-00 రూ

# చందాదారులకు - గమనిక

శ్రీ రామకృష్ణప్రభ (ఆధ్యాత్మిక మాసపత్రిక) ప్రతి ఇంగ్లీషునెల మొదటివారములో వెలువడును.

సంవత్సరచందా 12 రూపాయలు.

జీవితచందా 150 రూపాయలు.

జీవితచందాదారులు కాగోరి, ఒక్కసారిగా 150 రూపాయలు చెల్లించలేనివారు, వాయిదాలపై (ప్రతిసారి పదిరూపాయలకు తక్కువగాకుండ) ఒక సంవత్సరకాలములో మొత్తము పైకమును చెల్లించవచ్చును.

జీవితచందాదారులయిన ఐదేండ్ల తరువాత, ఏకారణముచేతనైననూ, చందా రద్దు చేసుకొనగోరువారికి, మొత్తము పైకము వాపసు చేయబడును.

చందాదారులు కాగోరువారు ఏనెలనుండియైనను చందాదారులు కావచ్చును.

చందాపైకమును మనియార్డర్‌ద్వారాగాని, పోస్టల్ ఆర్డర్‌ద్వారాగాని, బ్యాంక్ డ్రాఫ్ట్‌ద్వారాగాని ముందుగానే పంపవలెను.

క్రొత్తగా చందాదారులుగా చేరువారు "క్రొత్త చందాదారుడను" అని తెలియజేయవలసినదిగా మనవి.

చందాదారులయినవారు, తమ చందానంబరును (R. p.....................) గుర్తుంచుకొని ఉత్తర ప్రత్యుత్తరములలో దానిని తెలుపవలెను.

(ప్రతినెల పోస్టుద్వారా మీ కందజేయబడు రామకృష్ణప్రభ కవరుపైనుండు మీ విలాసము మీద, మీ చందానంబరు గుర్తింపబడియుండును. గమనించగలరు.)

మీరు వ్రాయు ఉత్తరములందు, M. O. కూపనులందు మీ విలాసమును, చందానంబరును స్పష్టముగా వ్రాయవలసినదిగా మనవి.

మీ అడ్రసు మారినపుడు ఆ కొత్త విలాసమును మాకు తెలియజేయగలరు.

ప్రత్యుత్తరమపేక్షించుచు ఉత్తరములు వ్రాయువారు, రిప్లయికార్డుగాని, తగినన్ని స్టాంపులుగాని పంపగలరు.

రామకృష్ణ మఠము, మద్రాసు-4 నుండి వెలువడు అన్ని పుస్తకములపై రామకృష్ణ ప్రభ చందాదారులకు 5 % తగ్గింపు కలదు.

మేనేజరు: శ్రీ రామకృష్ణ ప్రభ,

P. B. No. 635, మద్రాసు-600 004.

# శ్రీ రామకృష్ణ ప్రభ


| సంపుటము 36 | 1979 - నవంబరు | సంచిక 11 |
|---|---|---|


## విషయసూచిక



గమనిక:—రామకృష్ణకథామృతము రెండవభాగము పుస్తకరూపములో ముద్రణ అగుచున్నందున, సీరియల్‌గా ఇప్పుడు ఈ పత్రికలో ప్రచురించడములేదు.

## శ్రీ రామకృష్ణప్రభ - చందా వివరములు

రామకృష్ణ ప్రభ చందాపైకమును అనివార్యకారణములచే ఇప్పుడు కొంత పెంచవలసివచ్చినదని చందాదారులకు మనవి చేయుచున్నాము.

| | |
|---|---|
| 1980 జనవరి నుండి సంవత్సరచందా | 12-00 |
| జీవిత చందా | 150-00 |
| విడి ప్రతి | 1-20 |


శ్రీ రామకృష్ణమఠము,

మైలాపూర్, మద్రాసు-600-004.

# తిరుమల తిరుపతి దేవస్థానములు, తిరుపతి

## తిరుచానూరు (అలమేలు మంగాపురం) లో

## శ్రీ పద్మావతీ అమ్మవారి బ్రహ్మోత్సవములు

## ఈ నవంబరు 16 నుండి నవంబరు 24 వ తేదీవరకు

శ్రీ పద్మావతీ అమ్మవారి (అలమేలు మంగతాయారు) ఆలయము, తిరుపతికి 5 కిలో మీటర్ల దూరములోనున్న తిరుచానూరులో ఉన్నది.

శ్రీ పద్మావతీ అమ్మవారు, కార్తీకమాసంలో (వృశ్చికమాసం) శుద్ధ పంచమినాడు, ఉత్తరాషాఢ నక్షత్రమున గుడిదగ్గరనున్న పుష్కరిణిలో బంగారుకమలములో అవతరించారు అని పురాణాలు చెపుతున్నాయి.

శ్రీ అమ్మవారికి బ్రహ్మోత్సవము ప్రతిసంవత్సరము కార్తీక బహుళ ఏకాదశినుండి, 9 దినములు జరుపబడును. శుద్ధ పంచమినాడు 'అవభృథ స్నానము'తో శ్రీ అమ్మవారి జన్మదినము కొండాడబడును.

ఈ సంవత్సరము, బ్రహ్మోత్సవము నవంబరు 16 వ తేదీని ప్రారంభమై 24 వ తేదీని ముగియును.

శుద్ధ పంచమీ తీర్థపుదినమున (నవంబరు 24 వ తేదీ) తిరుమల శ్రీ వెంకటేశ్వరులు సిబ్బందీ సమేతముగా, అన్ని హంగులతో, బ్రహ్మాండమైన ఊరేగింపుతో బయలుదేరి, శ్రీ అమ్మవారికి అనేకబహుమతులతో (పూదండలు, చీరెలు, రైకలు, పసుపు కుంకుమ, ఫలాహారములు, పన్నీరు మొ॥ మంగళద్రవ్యములతో) తిరుచానూరుకు విచ్చేస్తారు. వేలాదిభక్తులు ఈ శుభదినాన తిరుచానూరుకు వస్తారు.

### ఉత్సవపు ముఖ్యదినములు

నవంబరు 21 బుధవారము—గరుడసేవ

,, 23 శుక్రవారము—రథోత్సవము

,, 24 శనివారము—పంచమి తీర్థము (తిరుపతి యాత్ర)

శ్రీ తిరుమలేశుని దర్శనము, తిరుచానూరు శ్రీ పద్మావతీదేవి అమ్మవారి దర్శనముతోనే పూర్తి అవుతుందని, తిరుమల తీర్థయాత్రా పూర్తిఫలితము అప్పుడే లభిస్తుందనీ పెద్దలు చెపుతారు.

ఈ శుభదినాల్లో, శ్రీ తిరుమలేశుని దర్శనానికి శ్రీ అమ్మవారి దర్శనానికి, యాత్రికులకు మా స్వాగతము.

ఎగ్జిక్యూటివ్ ఆఫీసరు

తిరుమల తిరుపతి దేవస్థానములు, తిరుపతి.

# శ్రీ శివకామ సున్దర్యష్టకమ్

పుణ్డరీకపురమధ్యవాసినీం నృత్తరాజసహధర్మచారిణీమ్
అద్రిరాజతనయాం దినేదినే చిన్తయామి శివకామసున్దరీమ్॥

పుండరీకపురమున నివసించునది, నటరాజు సహచారిణియు, పర్వతరాజ కుమార్తెయు నగు శివకామసుందరిని ప్రతిదినము స్మరించెదను.

బ్రహ్మవిష్ణుముఖరామరేడితాం బాహుపద్మశుకవత్సశోభితామ్
బాహులేయకలభాననాత్మజాం చిన్తయామి శివకామసున్దరీమ్॥

బ్రహ్మ, విష్ణువు మొదలగు దేవతలచే స్తుతింపబడినది; పద్మమువంటి బాహువున చిలకపిల్లచే అలంకరింపబడినది; కుమారస్వామి, గజాననుడు కుమారులుగా గలదియునగు శివకామసుందరిని తలచెదను.

దివ్యరత్నమణిభూషణామ్బరాం దేవరాజమహిలాదిసంవృతామ్
దానవారిసహజాం దయానిధిం చిన్తయామి శివకామసున్దరీమ్॥

దివ్యమైన రత్నమణి భూషణాంబరములు ధరించినది; శచీదేవి మొదలగు వారిచే సేవింపబడునది, విష్ణువు తోబుట్టువు, దయాసముద్రురాలగు శివకామసుందరిని తలచుచున్నాను.

షోడశార్ణపరదేవతాముమాం పఞ్చబాణనిచయోద్భవేక్షణామ్
పారిజాతతరుమూలమణ్డపాం చిన్తయామి శివకామసున్దరీమ్॥

పదునారు ఆవరణములలోనుండు పరదేవతయు; మన్మథసమూహమునకు కారణమైన కన్నులు గలదియు; పారిజాతవృక్షమూలమున మండపముగలదియునగు శివకామసుందరిని స్మరించుచున్నాను.

విశ్వయోనిమమలామనుత్తమాం వాగ్విలాసఫలదాం విచక్షణామ్
వారివాహసదృశాలకామ్బరాం చిన్తయామి శివకామసున్దరీమ్॥

ప్రపంచమునకు కారణభూతురాలు, నిర్మలమైనది, సర్వోత్తమమైనది, ఉత్తమవాక్కుల ఫలమునిచ్చునది, చతురముగా మాట్లాడునది, కారుమేఘమువంటి నల్లని ముంగురులుగలదియు నగు శివకామసుందరిని స్మరించుచున్నాను.

నన్దికేశవినుతాత్మవైభవాం నామమన్త్రజపకృత్సుఖప్రదామ్
నాశహీనపదదాం నటేశ్వరీం చిన్తయామి శివకామసున్దరీమ్॥

నందికేశ్వరునిచే పొగడబడిన వైభవముగలది; నామ, మంత్ర - జపము చేయువారలకు సుఖమునిచ్చునది; నాశములేని స్థానమైన మోక్షమునిచ్చునది; నకేశ్వరియగు శివకామసుందరిని స్మరించుచున్నాను.

నామసూర్యహుతభుగ్విలోచనాం సర్వమోహనకరీం సుధీడితామ్
సత్రివర్గపరమాత్మసౌఖ్యదాం చిన్తయామి శివకామసున్దరీమ్॥

చంద్రసూర్యాగ్నులు మూడునేత్రములుగా గలది, అందరను మోహింపజేయునది, పండితులచే పొగడబడినది, ధర్మార్థకామములతో కూడ మోక్షసుఖమునిచ్చునదియునగు శివకామసుందరిని స్మరించుచున్నాను.

## స్మృతి కథ

మూలం: స్వామి అఖండానంద అనువాదం: శ్రీమతి తురగా జానకీరాణి

(క్రిందటిసంచిక తరువాయి)

ఆమర్నాడు మొట్టమొదటిసారిగా నరేన్‌ను చూడడానికి వెళ్ళాను నేను. అతను తనతండ్రి గారింట్లో వున్నాడు. మళ్ళీసారి నేను శ్రీరామకృష్ణులను చూడగానే "నరేన్ దగ్గరికి వెళ్ళావా?" అని అడిగారు.

"చూశాను" అని, నేను వెళ్ళివచ్చిన సంగతి అంతా చెప్పాను. "అయస్కాంతశక్తి నిండిన అతని విశాలనేత్రాలు చూశాను. గౌతమబుద్ధుని జీవితచరిత్ర, డిక్షనరీ అంత లావుపాటిపుస్తకం అది, దాన్ని చదువుతున్నాడతను. గదిఅంతా మురికిగావుంది. కానీ అదేమీ అతనికి పట్టినట్లులేదు. అతనిమనస్సు యీ ప్రపంచంలోనే వున్నట్లులేదు. అతణ్ణి గురించి మీారు చెప్పింది నిజం" అని చెప్పాను.

ఈమాటలువిని శ్రీరామకృష్ణులు సంతోషపడ్డారు. "అతణ్ణి చూసిన ఆ స్వల్పవ్యవధిలో నువ్వు యివన్నీ ఎల్లా అర్థం చేసుకున్నావు?" అన్నారు. మళ్ళీ, "తఱచుగా నువ్వు వెడుతూవుండు. అతనిసాంగత్యంలో హాయిగా కొంతకాలంగడిపి వస్తూవుండు' అన్నారు.

తండ్రి చనిపోయినతర్వాత చాలా కాలానికిగానీ నరేన్ శ్రీరామకృష్ణుని దర్శించడానికి రాలేదు. నిజానికి గురువర్యులు ఆదుర్దాపడి, అతడికోసం చాలాసార్లు చెప్పిపంపారుకూడా. బహుశః తన డబ్బు యిబ్బందులనుగురించి గురువుగారుకూడా బాధపడటం యిష్టంలేక నరేన్ రాకపోయివుండవచ్చు. కానీ, ఆతర్వాత నేను ఎప్పుడు ఆశ్రమానికివెళ్ళినా, నరేన్ అక్కడ కనబడేవాడు. అభేదానంద, శారదానందులుగా దీక్ష పుచ్చుకున్న కుర్రవాళ్లుకూడా అక్కడ వుండేవారు.

ఒకరోజు శ్రీపాదులను చూడడానికి అనేక మంది భక్తులు, స్త్రీ పురుషులు వచ్చారు. వాళ్లల్లో యోగిమా, గౌరీమాకూడా వున్నారు. ఆసాయంత్రం కలకత్తా తిరిగి వెళ్లడానికి సిద్ధపడుతుంటే ఎవరో అన్నారు, ఆవచ్చినభక్తులలోని ఒకపెద్దమనిషితో కలిసి నేనూ నడిచి పోకూడదా అని. వెంటనే శ్రీరామకృష్ణులు, "వద్దు. వద్దు. ఇతనేమో చిన్నకుర్రవాడు అంత పొడుగాటి పెద్దమనిషితో సమానంగా

ఎల్లా అడుగులు వేయగలడు? ఈ స్త్రీలతో కలిసి వెడితే నయం'' అన్నారు. ఆప్రకారమే నేనూ, శరత్ (శారదానంద) ఆడువారితో కలిసి బగ్గీలో వెళ్ళాము.

నేను అనుసరిస్తున్న సనాతనాచారాలకు వున్న విలువగురించి నాకు అనేకసందేహాలు కలుగుతూవుండేవి. 'పోకలు నమలడం, నేను వండుకొన్న శాకాహారంమాత్రమే తినడం వంటివన్నీ మునలిపద్ధతులని అంటుండేవారు గురువర్యులు. అల్లాగైతే యివన్నీ నాకు అనవసరంకదా! వదిలేయడం మంచిది' అని నాలో నేను తర్కించుకుంటుండేవాణ్ణి. ఇటువంటి మనస్థితిలో నేనొకనాడు శ్రీరామకృష్ణులదగ్గరికి వెళ్ళి, అక్కడే భోజనం చేశాను. ఆయన మధ్యాహ్నం విశ్రాంతి తీసుకున్నతరువాత కొందరు బయటివాళ్లు వచ్చారు.

వాళ్లల్లో ఒకరు అడిగారుకదా, ''స్వామీ! ఇల్లాంటి నవయువకులంతా మీదగ్గరకువచ్చి, ఆశ్రమజీవితం గడుపుతూ, గృహస్థధర్మాన్ని జీవితాన్ని విడనాడడం మంచిదేనంటారా?'' అని.

శ్రీరామకృష్ణుని జవాబు యిది. ''మీరు యీ యువకుల యీజీవితాల్నే చూస్తున్నారు. కానీ అంతకుమునుపు వారు గతజన్మల్లో దాటి వచ్చినఘట్టాలు మీరు చూడలేరు. ఉదాహరణకు, యిప్పుడు నలుగురుకొడుకులువున్న ఒక వ్యక్తిని తీసుకోండి. ఒకకొడుకు పెరిగి కాస్త పెద్దవాడౌతాడు. 'నేను నావంటిని నూనెతో మర్దన చేసుకోను. చేపలు తినను. శాకాహారాన్నే స్వయంగా వండుకొనితింటాను' అంటాడు. తల్లిదండ్రులు యిల్లాంటి అలవాటు మాన్పించాలని ప్రయత్నిస్తారు. కొడతామని బెదరిస్తారు. కానీ అతడు తన పరిత్యాగధోరణి మానడు. ఇంక మిగిలిన ముగ్గురుకొడుకులూ విలాసజీవితంగడుపుతూ, దొరికినవన్నీ తినేస్తుంటారు. వాళ్లకి తిన్నకొద్దీ యింకా కావాలనిపిస్తూవుంటుంది. చూడండి, యవ్వనం రాకుండానే యీ అబ్బాయి సర్వసుఖాలను పరిత్యజించాలనుకుంటున్నాడు. ఎందుకంటే, యితనిది సాత్త్వికగుణం కనుక-''అన్నారాయన. వారు అన్న యీమాటలతో, నా ఆచారపద్ధతులు అల్లాగే కొనసాగించాలన్న పట్టుదల రెట్టింపైంది నాలో. వారి ఆజ్ఞప్రకారం మధ్యమధ్య కాళికాలయంలో, ఆతర్వాత మహావిష్ణువు ఆలయంలో వండినప్రసాదాలు తింటున్నా కూడా, భోజనంప్రసక్తిలేనిసమయాల్లోనే వెళ్లి వారిని చూస్తుండేవాణ్ణి.

తనికిష్టమైనవారందర్నీ, మంగళవారాల్లో, శనివారాల్లోవచ్చి తనని చూడమనేవారు శ్రీరామకృష్ణులు. ''ఈకాలంలో-అంటే యీ కలియుగంలో నారదులవారుచెప్పిన భక్తి మార్గాన్నే అనుసరించాలి'' అనేవారాయన! మంగళవారాల్లోనూ, శనివారాల్లోనూ ఎక్కువగా భగవన్నామజపం, ధ్యానం చేయమనేవారు. శనివారం చాలా పవిత్రమైనదీ, మధురమైనదీ అని ఆయనభావం.

ఇది మరోనాటి సంగతి. నేను ఆయనవద్దకు పెందరాళే వెళ్ళాను. గంగాస్నానంచేసి, ప్రసాదం తీసికొని, ఆయన విశ్రమిస్తున్నారు. తూర్పువేపు వసారా కొంత ఎదురుతడకలతో కప్పివుంటుంది—నలుగురూ కాస్సేపుకూచుని మాట్లాడుకోవడానికి. మధ్యాహ్నం కొందరు భక్తులు వచ్చినప్పుడు, శ్రీరామకృష్ణ లేచి కూర్చున్నారు. నేను గదిలోకి వెళ్ళేటప్పటికి ఆయన తీయగా పాడుతున్నారు, మంచంమీద కూర్చుని. 'బృందావనంలో తిరుగాడు రాధ మనదే, మనమూ ఆమెవారమే' అనే ఆభావం ఆపాటలో. పాడుతోంటే ఆయన కళ్లనుండి

ఆనందబాష్పాలు జాలువారుతున్నాయి. పాట పూర్తయ్యేలోపే ఆయన సమాధిలోకి జారుకున్నారు. నేను ఆ అద్భుతదృశ్యానికి నిశ్చేష్టుడనై, మాటలేకుండా కూర్చుండిపోయాను. ఇటువంటిస్థితి నేనెన్నడూ చూడలేదు నాజీవితంలో. ఇంక ఆపూటంతా భక్తిగీతాలాపనతోనే గడిచింది.

## ఆయన సర్వస్వం భగవంతుడే!

గురువర్యునిలో నేనుచూచిన ప్రత్యేకత ఏమిటంటే – తనని చూడడానికి వచ్చిన ప్రతివారితోను, భగవంతుణ్ణిగురించీ, మతాన్ని గురించీ తప్పితే, మరోవిషయమే మాట్లాడేవారు కారాయన. ఐనప్పటికీ ఆయనమాటలు ఎప్పుడూ విసుగెత్తించేవి కావు. ఉన్నతమైన విషయాలు మాట్లాడుతున్నప్పుడుకూడా ఆయన ఏవో ఛలోక్తులు విసరి అందర్నీ నవ్వించేవారు. ఒకనాడు అన్నారుకదా, "రకరకాల సిద్ధులున్నారు లోకంలో. 'సిద్ధ' అనేమాటకు అర్థం తెలుసా? ఉడుకబెట్టిన అని అర్థం. బంగాళాదుంపలు ఉడుకబెడితే మెత్తబడినట్లు, మనుష్యులుకూడా సిద్ధిచెందితే, మృదువై, పరిపూర్ణులవుతారు" అని.

చాలామంది శిష్యులతోకలిసి నేనొకరాత్రి దక్షిణేశ్వర్‌లో గడిపాను.

శ్రీరామకృష్ణులు అందర్నీ ధ్యానంలో కూర్చోబెట్టారు. ఆ ఏకాగ్రస్థితిలో, మా మా ఆదర్శభావాలలో విహరించినప్పుడు పట్టరాని ఆనందంతో నవ్వేవాళ్లము, ఆవేశంతో రోదించేవాళ్లము. యువకులుగా ఆనాటి నిర్మలానందాన్ని నేను మాటల్లో వర్ణించలేను. నేనెప్పుడు శ్రీరామకృష్ణులవద్దకు వెళ్ళినా ఆయన అడిగేవారు. "ధ్యానసమయంలోగానీ, ప్రార్థనసమయంలోగానీ నువ్వు కన్నీరు కార్చవా?" అని. నేనొకరోజు దీనికి, ఔనని సమాధానంచెప్పగానే ఆయన ఎంతో ఆనందపడిపోయారు!

"పశ్చాత్తప్తులైనప్పుడు కనుకొలకుల్లోంచి నీరు కారుతుంది. ఆనందబాష్పాలు కళ్లచివర్ల నుంచి కారుతాయి" అన్నారు. ఉన్నట్లుండి హఠాత్తుగా అడిగారు నన్నొకనాడు: "నీకు ప్రార్థన ఎల్లాచేయాలో తెలుసా?" అని. ఈ ప్రశ్న అడుగుతూనే ఆయన, తల్లికోసం మారాంచేసే పసిపిల్లాడిలా తన కాళ్ళూ, చేతులూ విదిలిస్తూ, "అమ్మా, ప్రియమైన నాతల్లీ! నాకు భక్తినీ, జ్ఞానాన్నీ యివ్వు. నాకు యింకేమీ వద్దు. నీవులేనిదీ నేను జీవించలేను" అని ఎలుగెత్తి విలపించారు. ప్రార్థన ఎల్లా చేయాలో మాకు చెప్పేటప్పుడు ఆయన, పసిపిల్లాడిలా వుండేవారు. ఆయన కళ్లవెంబడి ధారాపాతంగా అశ్రువులు స్రవిస్తున్నాయి. వళ్లంతా తడిసిపోతోంది. దీర్ఘసమాధిలోకి వెళ్లిపోయారాయన. నాకోసం ప్రార్థిస్తున్నట్లు కనబడ్డారు.

కలలనిగురించి ఒకనాడు మాట్లాడుతూ, "ఎవరో ఒకజ్యోతిని వెలిగించడానికి వచ్చారని ఒకరు కలగనవచ్చు. ఏదోఒకటి నిప్పంటుకొని దగ్ధమైపోతోందని కలగనవచ్చు. తనని తానే పేరుపెట్టి పిల్చుకొంటున్నట్లూ కలగనవచ్చు. ఈ కలలన్నీ శుభసూచకాలే, యీ చిట్టచివరిది మరీనూ" అన్నారు శ్రీ రామకృష్ణులు.

ఆరోజుల్లో వారిని సందర్శించిన వారందరికీ ధ్యానసమయంలో, దివ్యానుభూతులు కలిగేవి. అరమూసినకనులతో కూర్చున్నప్పుడు, వారికి తమ యిష్టదేవత దృగ్గోచరమయ్యేది. ఆమూర్తితో వారు సంభాషించకలిగేవారుకూడా. ఇదంతా చూస్తోంటే నావెంట్రుకలు నిక్కబొడుచుకునేవి. శ్రీరామకృష్ణుల సన్నిహిత

అనుచరులందరూ, అష్టవిధసాత్త్వికావస్థలనూ ఏదో ఒకరూపంలో అనుభవించేవారు. స్వామిజీ ఒక్కరూమాత్రం ఏ కాస్తకూడా తొణక కుండా వుండేవారు.

దక్షిణేశ్వర్‌లో మరోనాడు, మరపురాని సంఘటనలు కొన్ని జరిగాయి. తనతో కలిసి పెద్ద స్నానఘట్టానికి రమ్మని గురుపాదులు నన్ను పిలిచారు. ఆయన, స్నానఘట్టం చివరిమెట్లు దగ్గరికి, అక్కడ దేవాలయం మేనేజరు, ఒక పాదం గంగానదిలో వుంచి, మరో కాలిని మెట్టు పైన రాచి కడుక్కుంటున్నాడు. శ్రీరామ కృష్ణులు ఉత్తరదిశలోని మెట్ల చివర మెల్లిగా నీళ్లలోకి దిగారు. ఆయన మేనేజరువేపు చూడనేలేదు. అతినిదానంగా అడుగులువేస్తూ నడు లోతు నీళ్లల్లోకిదిగి, తన తలమీద కాసిని నీళ్లుపోసుకుని స్నానం ఆరంభించారు. గంగానదీ జలం పరమపవిత్రమైనదని ఆయన అంతకు కొన్నిరోజులుముందే చెప్పారు. ఆ జలపవిత్రతకు తగిన గౌరవపద్ధతిలో స్నానం చేస్తున్నారాయన. ఇంతలో పల్లెటూరితరహా ముసలి బ్రాహ్మణుడొకడు మెట్లమీద కనబడ్డాడు. అతడు దేవాలయం మేనేజరువద్దకువెళ్లి, పెద్ద గొంతుకతో, కొలనులో ఎన్ని చేపలు దొరుకుతాయనీ, తోటలోనిపళ్లూ, కూరలూ అమ్మితే ఎంతసొమ్ము వస్తుందనీ ప్రశ్నలు అడగటం మొదలుపెట్టాడు. శ్రీపాదులు యివన్నీవిన్నారు. ఆ బ్రాహ్మడివంక ఓరచూపు, చిరాకుగా చూశారు. స్నానానంతరం, శ్రీరామకృష్ణులతో కలిసి నేను తిరిగి వారిగదికి వచ్చాను. వారి బట్టలపైన గంగాజలం చల్లాను. ఆయన దేవాలయంలో దైవదర్శనంచేసుకుని, గదికి వెళ్ళి ప్రసాదం తీసుకొన్నారు.

మంచంమీదకూర్చుని హుక్కా పీలుస్తుండగా, ఆ ముసలిబ్రాహ్మడు తలుపుదగ్గరకు వచ్చి, "హరీష్ యిక్కడున్నాడా?" అని అడిగాడు. అతని ప్రశ్నకు జవాబివ్వకుండా శ్రీరామకృష్ణ, "నువ్వు బ్రాహ్మణుడివి. నీ జీవితంలో ముప్పావుభాగం అయిపోయింది. చివరిదశకు వచ్చావు. గంగాతీరంమీదకూడా నీకు నీదైవం ఎవరో జ్ఞప్తికి రావడంలేదు. అల్లాంటి పవిత్రప్రదేశంలో, కొలనులో ఎన్ని చేపలున్నయో, తోటలో ఎన్ని కాయలూ, పళ్లు వున్నాయో కనుక్కోవడానికి నీకు సిగ్గుండాలి" అన్నారు. ఆ బ్రాహ్మడు యీమాటలు విన్నాడేకానీ సిగ్గుపడేస్థితిలో లేడు. కాస్త చికాకుగా అవతలకి వెళ్లిపోయాడు. అతడు నిలబడి వెళ్లినచోట కాస్త గంగాజలం చిలకరించమని చెప్పారు నాతో శ్రీరామకృష్ణులు.

కాస్సేపటికి. ఒక ముష్టివాడువచ్చి కొంచెం డబ్బులిమ్మని అడిగాడు. నన్నుపిలిచి, నాల్గు పైసలు చూపించి, అతనికిమ్మన్నారు. నేనా ప్రకారం చేశాక, "నీచేతులు గంగాజలంతో కడుక్కో" అన్నారాయన. గదిమూల పెద్ద కుండలోవున్న నీటితో చేతులుకడుక్కున్నాను. కాళీఘాటులోని కాళికామాతచిత్రం గదిగోడ మీదవుంది. దానిముందు నిలబడమన్నారు నన్ను. ఆయన చప్పట్లుచరుస్తూ 'హరి హరీ' అని, నన్ను అలాగే అనమన్నారు. ఈ సంఘటనతో, డబ్బు ఒక మురికి, చెత్త వస్తువని నాకు మనస్సులో గాటంగా నాటుకునిపోయింది. నేను ఆతర్వాత జీవితంలో, పధ్నాలుగుసంవత్సరాలపాటు చేతులతో డబ్బుని తాకకుండా, ఒక్కపైసా లేని సన్యాసిగా, దేశంయావత్తూ తిరిగాను. డబ్బంటే నాకు యీనాటికీ వున్న ఉపేక్షాభావాన్ని అమూల్యంగా చూచుకుంటాను. పవిత్రమైన ఆ సంఘటన నాలో కలిగించిన సత్ప్రభావమిది.

**(తరువాయి వచ్చేసంచికలో)**

# ఉత్తర రామాయణము - ఒక పరిశీలన

తూములూరు కార్తికేయశర్మ

ఉత్తరరామాయణాన్ని ఆమూలాగ్రంగా పరిశీలించిననాడు రామ రాజ్యాభిషేకము తరువాత సీతావనవాసము సత్యదూరమేమో అనిపిస్తుంది. వాల్మీకిరామాయణపు ఉత్తరకాండతో సీతామతల్లిమీద ఆరోపింపబడిన కళంకం శతాబ్దాలనుంచి నేటిదాకా హృదయంలో ముల్లులాగా గుచ్చుకొంటుంది. మర్యాదా పురుషోత్తముడు రామచంద్రుడు లోకరంజనార్థమై న్యాయాన్ని తప్పకుండా స్వార్థత్యాగమొనర్చాడన్న సంతృప్తిమాత్రము మిగులుతుంది. వాల్మీకిరామాయణంలో ఉత్తరకాండలో భద్రుడు రామచంద్రునితో అన్నమాటలు జ్ఞప్తికి తెచ్చుకోవాల్సిన అవసరం ఉంది—

> అస్మాకమపి దారేషు సహనీయం భవిష్యతి
> యథాహి కురుతే రాజా ప్రజాస్తమనువర్తతే॥
> (వాల్మీకిరామాయణము, ఉత్తరకాండము 43-వ సర్గ, 19 వ శ్లోకం)

(ప్రస్తుతం మనం స్త్రీలదోషాలనుకూడసహించి ఊరుకోక తప్పదు. ఎందుకంటే రాజెలా ప్రవర్తిస్తాడో ప్రజలుకూడ అలాగే ప్రవర్తించాలి)

న్యాయం చేకూర్చడం రాజధర్మం. సాధ్వి సీత కేవలం సామ్రాజ్ఞే కాదు, రామరాజ్యంలో ప్రజకూడ. అలాటి 'ప్రజ' పట్ల రాజుగా రామచంద్రుడు చూపించిన న్యాయం ఏమిటి? అన్న ప్రశ్న ఉదయింపక మానదు. సాధారణ ప్రజగా న్యాయాన్ని ఆశించేహక్కు ఆమెకు ఉంది. ప్రజానుపరంగా రామచంద్రుడు న్యాయాన్ని అనుసరించాడనుకొంటే, సాధ్వీసీతపరంగా ఆలోచిస్తే-నిండుగర్భిణిఅయిన స్త్రీని ఇలా వనవాసంపాలుచేయడం న్యాయసంగతం కాదనిపిస్తుంది. దీనికి సమాధానాన్ని ఆలోచించి తీరాలి.

వైదికసాహిత్యం నాటినుంచి వాల్మీకిరామాయణకాలంవరకూ శ్రీరామచంద్రుని మహోన్నతగుణాల ప్రతిపాదన కానవస్తుంది. అనుశ్రుతులరూపంలో రామచరిత్ర బహుశ్రుతమైనదన్నసత్యాన్ని ఎవ్వరూ కాదనలేరు.

వాల్మీకిరామాయణ కాలనిర్ణయంలో విద్వాంసుల్లో పలుబేధాలు కనిపిస్తాయి. A. W. సెల్‌గల్ వాల్మీకిరామాయణ రచనాకాలాన్ని క్రీ. పూ. 11 వ శతాబ్దికి చెందినదిగా భావిస్తే, డా॥ యకోబీ రామాయణ రచనాకాలం క్రీ. పూ. 8 వ శతాబ్ది 6 వ శతాబ్ది మధ్యకాలానికి చెందినదిగా పరిగణిస్తారు. ఎం. మానియర్ విలియమ్స్ సీ. వీ. వైద్య తదితరులు బుద్ధుని తరువాత క్రీ. పూ. 6 వ శతాబ్దికాలంలో రామాయణరచన జరిగినట్టుగా అభిప్రాయపడ్డారు.

రచనాకాలనిర్ణయంలో ఎన్ని వాదవివాదాలున్నా రామాయణరచన బౌద్ధులకుపూర్వమే జరిగినదని నిర్ధారించవచ్చు. ఎంచేతంటే రామాయణంలో బౌద్ధధర్మానికి సంబంధించిన పదజాలాలు, లేదా ప్రభావం కనపడవు. బౌద్ధసాహిత్యంలో రామకథకు సంబంధించిన పలుకథలు కానవస్తాయి. 'అనామకజాతకమ్' (క్రీ. పూ. 3 వ శతాబ్ది) మరియు 'బౌద్ధజాతకమ్' అన్నగ్రంథాలలో రామకథ పలురూపాలను, ప్రతీకలను సంతరించుకొని గౌతమబుద్ధుని పూర్వజన్మవృత్తాంతరూపంలో వర్ణింపబడ్డది. జైనమతగ్రంథము 'పఉమచరియం' (క్రీ. పూ. 3 వ శతాబ్ది)లో రామకథను, వారిమతానికి, సాంప్రదాయాలకు అనుగుణంగా మార్చుకొన్నట్టు కనిపిస్తుంది. 'దశరథజాతకం'లో సీత

రాముడికి సోదరిగా వర్ణించబడినది. రాముడు పన్నెండేళ్లు వనవాసంచేసి, అటుపిమ్మట పదమూడో సంవత్సరంలో తన సోదరి సీతను వివాహమాడుతాడు. 'పఉమచరియ'లో రాముడు, లక్ష్మణుడు, సీత త్రిషష్ఠి మహాపురుషులకోవకు చెందినవారై జైనమతాన్ని అవలంబించినట్లు చూపబడింది. రాముడికి ఎనిమిది వేలమంది భార్యలు, లక్ష్మణునికి పదహారు వేల మంది భార్యలు ఉన్నట్టుగా చిత్రీకరించారు. లక్ష్మణుడు సీతాపరిత్యాగాన్ని విరోధించగా, రామచంద్రుడు తనసేనాని కృతాంతవదనుని పిలిచి సీతను గంగానదీతీరంలో 'నిమానుష' వనంలో వదలిరావలసిందిగా ఆజ్ఞాపిస్తాడు. ఈవిధంగా బౌద్ధ, జైన మతగ్రంథాలు రామకథను చిత్రవిచిత్రరూపాలలో కళంకితంచేశారు. బుద్ధునిజననమో లేక జైనమత స్వీకారమో ఈకథల పర్యవసానంగా యుండినది.

వాల్మీకిరామాయణం బౌద్ధమతనిర్మాణానికి మునుపే వ్రాయబడడంచేత ఈకళంకాలకు దూరంగాఉంది అని చెప్పుకోవచ్చు. యుద్ధకాండతో అంతమయ్యే వాల్మీకిరామాయణంలో కేవలం ఆరుకాండలుమాత్రం ఉన్నాయి. యిది మూలకథ. కాని కాలగతిలో 'ఉత్తరకాండ'రూపంలో 'సప్తమకాండ' చేర్చబడినది. మూల వాల్మీకిరామాయణంలో అనేక ప్రక్షిప్తాంశాలు జోడించబడినవి. శ్లోకపాఠాలలో భేదం కనిపిస్తుంది. వాటిసంఖ్యకూడ తారుమారైంది. యీ ప్రక్షిప్తాంశాలు మార్పులు చేర్పులతో 'మూలకథ' ప్రచారంలోకి వచ్చింది. ఎమ్. వింటర్‌నిట్స్ మరియు సీ. వీ. వైద్యలప్రకారం దీనిరచనాకాలము క్రీ. పూ. 2–3 శతాబ్దాల మధ్యకాలము. ఈవిధంగా విశ్లేషణచేస్తే 'మూలకథ'కు ప్రచారంలోకొచ్చిన 'వాల్మీకి రామాయణ' రచనాకాలానికిమధ్య 8–9 వందలసంవత్సరాల భేదం ఉన్నది. కాబట్టి సమకాలీన యుగప్రభావాలవల్ల, బౌద్ధ జైన మతాలు తమ ధర్మప్రతిష్ఠాపనకోసం మూల కథలకు రకరకాలమార్పులు చేర్పులుచేసి అసంగతం చేశారన్ననిర్ధారణకు రాకతప్పదు.

ఈసందర్భంలో వాల్మీకిరామాయణంలో కేవలం మూడు 'శ్లోకపాఠాలు' మాత్రం ఉన్నాయి అని గమనించాలి అవి—1. దక్షిణాత్యపాఠము, 2. గౌడీయపాఠము మరియు 3. పశ్చిమోత్తరీయపాఠము. కనుక రామాయణం తొలుదొల్తికాలంలో మౌఖికరూపంలో ప్రచారంలో ఉండేదని, దానికి దేశకాలానుగుణంగా ప్రక్షిప్తాంశాలు జోడించారని శంకించకతప్పదు. ముఖ్యంగా ఈ ప్రక్షిప్తాంశాలు గౌడీయ, పశ్చిమోత్తరీయపాఠాలలో అధికంగా కన్పిస్తాయి. ఈపరంగా ఆలోచిస్తే దక్షిణాత్యపాఠం చాలమట్టుకు ప్రామాణికమైనదని చెప్పాలి. ఈ మూడుపాఠాలను కూలంకషంగా పరీక్షిస్తే ఉత్తరకాండరచన చాలా కాలం తరువాత జరిగినట్టు తెలుసుకోవచ్చు. అందుచేత వాల్మీకిరామాయణంలో సీతా పరిత్యాగప్రసంగములేదని గ్రహించాలి. యుద్ధకాండాంతంలో రామపట్టాభిషేకము మరియు రామరాజ్యవర్ణనల తరువాత ఫలశ్రుతి ఇవ్వబడినది:—

> ధన్యం యశస్యమాయుష్యమ్ రాజ్ఞాం చ విజయావహం
> ఆది కావ్యమిదం త్వార్షంపురా వాల్మీకినా కృతమ్॥
>
> (వాల్మీకిరామాయణము 6–131–104)

(ఈ కావ్యం యశస్సును, ఆయుస్సును, కృతకృత్యాన్ని కలిగించునటువంటిది. రాజులకు విజయము చేకూర్చునటువంటిది. యిది ఆది కావ్యము. ఋషిప్రణీతమైనది, మరియు తొలుదొల్త వాల్మీకిచే రచింపబడినది.)

ఫలశ్రుతికి సంబంధించి 17 శ్లోకాలు ఉన్నవి. కథ సమాప్తమయ్యాక, ఫలశ్రుతి యివ్వబడిన తరువాత తిరిగి ఉత్తరకాండరూపంలో కథా విస్తారము చేయవలసిన అవసరం ఎక్కడదని ప్రశ్నించుకోవాలి.

రామకథ ఉత్పత్తి-వికాసాలమీద పరిశోధించిన డా॥ కామిల్ బుల్కే - 'సమస్త ఉత్తర కాండ ప్రక్షిప్తము అనిచెబుతూ యిలా అంటారు. 'ఉత్తరకాండను ఆమూలాగ్రంగా విశ్లేషిస్తే, దాన్ని పలువురు రచించారన్నది తేటతెల్లమవుతుంది. ఈ కాండలో అశుద్ధశ్లోకాల బాహుళ్యం కానవస్తుంది. రావణచరిత్ర యిందుకు ఉదాహరణ. యుద్ధకాండాంతంలో రామ రాజ్యాభిషేకానికి వచ్చిన అతిథులవీడ్కోలు వర్ణనజరిగినా,తిరిగి రావణచరిత్రలో అదేవర్ణన పునరావృత్తం కావడం ప్రక్షిప్తఅంశాలు ఎక్కువగా ఉన్నాయన్నది నిర్ధారిస్తుంది. రావణచరిత్ర తరువాత ఆ ప్రక్షిప్తఅంశానికి మూలకథతో సంబంధం స్థాపించడంకోసం పునర్వర్ణన జరిగినట్టు భావించవచ్చు.''

ఉత్తరకాండలో 1. రావణచరిత్ర (1వ సర్గనుంచి 37 దాకా) 2. సీతాపరిత్యాగము, శంబూకవధ (37వ సర్గనుంచి 82 దాకా) 3. అశ్వమేధము మరియు సీతమ్మవారి భూప్రవేశము (83-111 సర్గలు)

ఈ కథాభాగాలలో రావణుని చరిత్రను ఉన్నతంగా తీర్చిదిద్దారు. రాముడిని కళ కిత్తున్ని చేశారు. వీటన్నిటినీబట్టిచూస్తే ఉదాత్తుడైన రాముని ఈ ప్రక్షిప్తాంశాలు ఎంత వికృతంగా తీర్చిదిద్దాయో తెలుస్తుంది. కాబట్టి ఉత్తర కాండ రచనను మూల రామాయణానికి సంబంధించినదిగా గ్రహించడం అవివేకమే.

ఐతిహాసికసందర్భాలలో మూలపాఠాలకు చేర్చబడినప్రసంగాలు సాంప్రదాయికంగాను, సత్యసమ్మతాలుగాను కనిపిస్తాయి. కాని బౌద్ధ, జైన మతావలంబులయిన రచయితలు, కవులు తమతమ సంప్రదాయాల ప్రతిష్ఠాపనకోసం వైదికధర్మానికి చెందిన మహాపురుషుడు శ్రీరాముని, సీతాసాధ్విని చాలా వికృతంగా చిత్రీకరించారు. కాబట్టి మనం మరోసారి సీతా పరిత్యాగప్రసంగం మూలరామాయణంలో లేదని గమనించాలి. ఇంతేకాకుండా మహాభారతము, హరివంశపురాణము, వాయుపురాణము, విష్ణుపురాణము మరియు నృసింహపురాణములలో కూడ ఈప్రసంగం కానరాదన్న సత్యాన్ని మరచిపోకూడదు.

జోడించబడిన ప్రక్షిప్తాంశము—'సీతాపరిత్యాగము' ప్రముఖంగా మూడుకారణాలవలన జరిగినట్లుగా చెప్పబడింది. 1. లోకాపవాదము, 2. రజకుని కథ మరియు 3. సీతద్వారా రావణుని చిత్రాంకనము.

నిజానికి ఈ మూడుకారణాలకు మూలకథతో పొత్తు కుదరదు. రావణునిచే గొనిపోవబడి లంకలో ఉండడంవలన లోకోపవాదానికి భయపడి రామచంద్రుడు ఆమెను అగ్నిప్రవేశం చేయమన్నట్టు వర్ణింపబడినది. యిది అంతవరకు తెలిసినదే. అగ్నిప్రవేశంచేసి పునీతమవి వెల్లడి అయినసీతను తిరిగి అడవులకు పంపడంలో అర్థం ఏమిటి? అగ్నిప్రవేశంద్వారా లోకాపవాదం తీరలేదా?

అగ్నిప్రవేశం చేశాక సీతమ్మవారిని అప్పగిస్తూ అగ్నిదేవుడు యిలాఅంటాడు—

> విశుద్ధభావాం నిష్పాపాం ప్రతిగృహ్ణీష్వ రాఘవ
> న కించిదభిభాషవ్యమహమాజ్ఞాపయామి తే॥

(ఓ రాఘువా! భావసంపన్నురాలు, నిష్పాప

అయిన సీతాసాధ్విని గ్రైకొనుము. యీవిషయంలో నీవేమీ మారుమాటాడరాదని నేను ఆజ్ఞాపిస్తున్నాను.)

దీనికి జవాబుగా రామచంద్రుడు స్వయంగా-

విశుద్ధా త్రిషులోకేషు మైథిలీ జనకాత్మజా
నహి హాతుమియం శక్యా కీర్తిరాత్మవతా యథా॥

(ఈ అగ్నిపరీక్షద్వారా జనకాత్మజ అయిన జానకి ముల్లోకాలలోను సాధ్విగా ప్రకటింపబడింది. ఏవిధంగా శ్రీవంతుడు తన కీర్తిని వదలలేడో, అలాగే నేను ఈమెను పరిత్యజించలేను.)

శ్రీరాముడు చెప్పిన పై మాటలవలన లోకాపవాదభీతి నశించిపోవడం సహజం. కాని ఈ ప్రసంగం పఉమ చరియ, ప్రక్షిప్త ఉత్తర కాండలలో కనిపించడం ఆశ్చర్యమనిపిస్తుంది. వీటిప్రభావమువలననే ఈ ప్రసంగం రఘువంశము, ఉత్తరరామచరిత మరియు కుంద మాలల్లో కనిపిస్తుంది. మహాకవి కాళిదాసు సాధ్వి సీతద్వారా మొదట దీన్ని విరోధించినా పరంపరానుబద్ధము కావడంవల్ల తల వొగ్గక తప్పలేదు.

వాల్మీకి రామాయణంలో 'రజకుని కథ' లేదు. ఈకథ గుణాఢ్యుని 'బృహత్కథ'లోనూ సోమదేవుని 'కథాసరిత్సాగరము'లోను కల్పింపబడినది. బౌద్ధకవి గుణాఢ్యుడు క్రీ.పూ. రెండవశతాబ్ది పూర్వార్ధానికి చెందినవాడుగా చెప్పబడతాడు. ఆయన పైశాచికభాషలో తాను రచించిన 'బృహత్కథ'లో నవమలంబకము' 'అలంకారవతీ లంబకము'లో మొదటి తరంగంలో రజకుని కథను రామకథాంతర్గతంగా వర్ణించాడు. దీన్నిగురించి బి. కీత్ 'సంస్కృత సాహిత్యచరిత్ర'లో యిలా అంటారు...

"ఆనందప్రదమయిన వివాహానంతరం,



నృశంసాపూర్వకముగా దొంగిలింపబడిన భార్య కోసరము ఒక భర్త అన్వేషణ, అన్న అభిప్రాయాన్ని (Motif) ఆయన (గుణాఢ్యుడు) రామాయణంలో తీసుకొన్నాడు."

గుణాఢ్యుడు ఈ అభిప్రాయంతో రామకథను ఎన్నోమార్పులకు గురిచేశాడు. దొంగలింపబడిన భార్యమీద కళంకాన్ని ఆపాదించడం ఆయనకు చాలా స్వాభావికమయినది గను, కౌతూహలపూర్ణమయినదిగను కనిపించినది.

బృహత్కథను ఆధారంగా చేసుకొని సోముడు 11వ శతాబ్దిలో 'కథాసరిత్సాగర' రచన చేశాడు, ఈకథలో కళంకాన్ని ఆపాదించేప్రసంగాన్ని విస్తృతం చేశాడు:-

"రాజ్యంలో ప్రజలవిషయాలను గమనించాలని మారువేషంలో చరిస్తూన్న రామచంద్రుడు 'పరునియింటికి వెళ్ళివచ్చినదని' దోషారోపణ చేస్తూ, తనభార్య చేయిబట్టి యింటినుంచి వెళ్లగొడుతోన్న ఒక పురుషుని చూచెను. అప్పుడా భార్య 'రాక్షసునియింటినుండి వచ్చిన సీతను రామదేవుడు పరిత్యజించలేదు. కాని యీ మహానుభావుడు ప్రక్కింటికి వెళ్ళివచ్చిన నన్ను వెళ్ళగొట్టుచున్నాడు. ఇతను ఆరాముని కన్న గొప్పవాడు' అనెను. రామచంద్రుడీ మాటలకు ఖిన్నుడయ్యెను. లోకాపవాదభీతిచే రామచంద్రుడు సీతాపరిత్యాగమొనర్చి అడవులకు పంపెను."

కనుక, ముఖ్యంగా బౌద్ధరచయితలు, కవులు (ప్రధానంగా గుణాఢ్యుడు) తమధర్మాన్ని ఉన్నతంగా చిత్రీకరించడంకోసం వైదికధర్మాన్ని, ఆదర్శాలను, వైదికమహాపురుషులను హీనులగా చిత్రీకరించడంకోసం, రామకథలో అనేక కల్పితకథలను జోడించారు అన్నది స్పష్టమవుతుంది.

మూల వాల్మీకి రామాయణంలో రామ రాజ్యవర్ణన జ్ఞప్తి తెచ్చుకోవాల్సిన అవసరం యిప్పుడెంతైనా ఉంది:-

రామో రామో రామఇతి ప్రజానామభవన్ కథాః
రామభూతం జగద్భూద్రామే రాజ్యం ప్రశాసతి॥
(యుద్ధకాండ, సర్గ 131 శ్లోకం 99)

(రామరాజ్యంలో జనుల నోటివెంట రామ కథ జాలువారేది. అందరూ రామనామాన్నే జపించేవారు. ప్రపంచమంతా రామమయంగా ఉండినది.)

ఆసన్ ప్రజా ధర్మరతా రామే శాసతి నానృతాః
సర్వే లక్షణ సంపన్నాః సర్వేధర్మ పరాయణాః॥
(యుద్ధకాండ, శ్లోకం 102)

ఈవిధంగాలోకాపవాదము, సీతాపరిత్యాగము పూర్తిగా సత్యదూరాలు, కపోలకల్పితాలు అని నిర్ణయించక తప్పదు. ముందు చెప్పి నట్టుగా 'మూలకథ'లో ఈ ప్రసంగము లేదు. సమకాలీన ధార్మికసాంప్రదాయాలు ఈ వైది కేతిహాసాన్ని లాంఛితం చెయ్యడానికి కుట్ర పన్నాయనక తప్పదు.

సీతద్వారా రావణుని చిత్రరచన చాలా కాలం తరువాత జోడింపబడిన ప్రక్షిప్తాంశము. హేమచంద్రుని జైన రామాయణంలో, కృత్తి వాసుని బెంగాలీ రామాయణంలో, కాశ్మీరీ రామాయణంలో, గుజరాతీ రామాయణంలో ఈ కథావర్ణన కవిపిస్తుంది. ఈ కరుణరసాత్మక ప్రసంగాన్ని ఆధారంగాచేసుకొని ఎన్నో జాన పదగీతాలు ఆలాపింపబడినవి. సింహళము, కంబోడియా, సయామ్‌లలో ప్రసిద్ధిచెందిన రామాయణంలోకూడ ఈకథ కానవస్తుంది. దీన్నిబట్టిచూస్తే బౌద్ధమతప్రచారము జరిగిన ప్రతిప్రాంతములోను, దేశంలోను సీతా పరి త్యాగము, లోకాపవాదము, రావణుని చిత్ర రచన రామకథతో పొత్తు కుదుర్చుకున్నట్టు నిర్ణయించవచ్చు.

ఇప్పటిదాకా జరిగిన చర్చానంతరం రామ కథ సర్వోత్కృష్ట వైదికసాహిత్యమని, ఉత్తర రామాయణం దీన్ని కళంకితం చెయ్యడానికి ఇతరమతాలకు చెందిన రచయితల, కవుల కల్పన అని గ్రహించవలయును. జైనమతం కాని, బౌద్ధమతంకాని చెడ్డవి అనడం అవి వేకము. కాకుంటే కొందరిద్వారా వైదిక సాహిత్యానికి, ముఖ్యంగా రామకథకు అనౌ చిత్యం జరిగిందని బాధపడుతున్నాము.

## వివేకానంద సాహిత్య వేదిక—వినుకొండ

స్వామి వివేకానంద పాల్గొన్న చికాగో సర్వమత మహాసభ 87 వ వార్షికోత్సవం సందర్భంగా వివేకా నంద సాహిత్యనివేదిక ఆధ్వర్యంలో 22-9-79 సా॥ 5-30 గం॥లకు స్థానిక అప్పర్ ప్రైమరీస్కూలు ఆవరణ లో నాగార్జున ప్రాజెక్టు అకౌంట్సు ఆఫీసరు శ్రీ A. నారాయణమూర్తి అధ్యక్షతన సభ జరిగింది. స్టేట్ బ్యాంకు వ్యవసాయాభివృద్ధిశాఖ మేనేజరు శ్రీ సూర్యనారాయణమూర్తి ముఖ్యఅతిథిగా పాల్గొన్నారు. అధ్యక్షులు తమ ప్రసంగంలో, సర్వమత మహాసభలోని ప్రతినిధులందరూ తమతమ మతాలనుగూర్చి ప్రశం సించారనీ, అయితే వివేకానందస్వామిమాత్రం హిందూమతాన్నిగూర్చి చెప్పడమేగాక అన్నిమతాలలోని విశ్వజనీనభావాలను వివరించి ప్రపంచసౌభ్రాతృత్వము వసుధైకకుటుంబము అనేభావాలకు ఆనాడే అంకురా రోపణచేశారని అన్నారు. ముఖ్యఅతిథి నేటి దేశపరిస్థితులను స్వామీజీ కలలుగన్న భారతదేశంతో పోల్చి తమ ఆవేదనను వ్యక్తపరుస్తూ, వివేకానందుని ఆదర్శాన్ని యువతరానికి అందించటం పెద్దల బాధ్యత అని నొక్కి చెప్పారు. తొలుత శ్రీ కె. నారాయణ రావు అతిథులకు స్వాగతం పలికారు. శ్రీ రామకృష్ణ వందనసమర్పణతో సభ ముగిసింది.

—టి. లక్ష్మణరావు, కన్వీనర్, వివేకానంద సాహిత్యనివేదిక, వినుకొండ.

# 'లలిత'-మానసిక రుగ్మతకు చికిత్స

ఎ. కృష్ణారావు

మానసికంగా బాధపడుతున్న వ్యక్తుల అవస్థలు రకరకాలుగా ఉంటాయి. వారిలో కొందరి పరిస్థితి మానసిక వైద్యులవద్ద చికిత్స పొందవలసినంత తీవ్రంగా ఉండకపోవచ్చును. వాళ్లకు బాగా పెంపొందినవ్యక్తిత్వం ఉండవచ్చును. సంఘజీవితానికి అనువుగా సర్దుకుపోగలతత్త్వమూ ఉండవచ్చు. కాని ఆర్థికంగా సాంఘికంగా ఇబ్బందులు ఎదురైనప్పుడు ఈ వ్యక్తులవ్యక్తిత్వమూ, సర్దుకుపోగలతత్త్వమూ అక్కరకు రాకుండాపోయే ప్రమాదం ఉంది. ఇటువంటివారి సమస్యలను మన ప్రాచీనులు ఎప్పుడో గ్రహించారు; ఈసమస్యలకు పరిష్కారాలు సూచించారు. ఆ పరిష్కారాలు కూడా సాధారణమైనవి, సార్థకమైనవి. ఈ మార్గాలవల్ల చాలాకాలం మానసిక చికిత్స చేస్తే ఏర్పడేసమస్యలు కలిగేప్రమాదం అసలే లేదు.

ఆధునికమానసిక చికిత్సావిధానంలో రోగి దృష్టిని అతని గత జీవితంలోకి మళ్ళించడం జరుగుతుంది. అలా అతణ్ణి అతని బాల్యంలోకి తీసుకువెళ్లడం జరుగుతుంది. అలా అతని మానసికభావాల చికిత్స జరుగుతుంది. అయితే ఆరోగి అంతరాంతరాలలో మానసికవ్యాధి ఉంటే ఈ గతజీవితపరామర్శ ప్రమాదకరం కావడానికి ఆస్కారం ఉంది.

ఎర్నెస్ట్ ఆర్. గ్రూవ్స్ తన 'ఇంట్రొడక్షన్ టు మెంటల్ హైజిన్' అనే పుస్తకంలో ఇలా పేర్కొన్నాడు (పుట 34): 'మానసిక రుగ్మత అధికం కావడానికి ఆధునిక నాగరకతతత్త్వమే కారణం కావచ్చును. యంత్రాలకు ప్రాధాన్యం గలకాలంలో జీవిస్తున్న మనం మామూలు కన్నా ఎక్కువైనవేగంతో పనిచేస్తున్నాం, ఆటపాటలు కొనసాగిస్తున్నాం. అలా జీవశాస్త్రరీత్యా మనకు సాధ్యంకాగల పరిమితులను అధిగమించాం. జీవనవిధానంలోని ఈ వేగం విపరీతమైన మానసికక్షోభనూ, అలసటనూ కలిగిస్తుంది. అంతేకాదు. ఆధునికజీవితం సంక్షోభానికి దారితీస్తున్నది. పెద్దఎత్తున సాగుతున్న వస్తువుఉత్పత్తీ అందుకుతగ్గట్టుగా సాగుతున్న ప్రచారమూ కలిసి ప్రాపంచికవస్తువులను సంపాదించాలన్నకోరిక కలిగిస్తున్నాయి. దాంతో ఎవరో ధనికులకు తప్ప తక్కినవారికి వారి ఆశలు తీరే అవకాశంకానీ, సంతృప్తిపొందే అవకాశంకానీ లభించడంలేదు. ఇలా నెరవేరని కోరికలు వ్యక్తిని క్షోభకు గురిచేసి మానసికంగా ఉద్రిక్తపరిస్థితులలో పడవేస్తాయి.

'అందరికీ సమానావకాశాలను ప్రబోధించే ప్రజాస్వామ్యవ్యవస్థలో తగినంత శక్తిసామర్థ్యాలు లేనివ్యక్తులు తమ స్థితిగతులగురించి అసంతృప్తిపడక తప్పదు. వారు ఎదుర్కొనే ఓటమి వారివ్యక్తిత్వంమీద తన ప్రభావాన్ని చూపి వారిలో అస్థిరత్వాన్ని కలిగిస్తుంది. తాము తక్కినవారికన్న తక్కువ అనే ఆత్మన్యూనతాభావాన్ని రేకెత్తిస్తుంది. మానసిక రుగ్మత కలగడానికి ఇటువంటిభావాలు ఆస్కారం కలిగిస్తాయి. ఈభావాలు ఎంతకాలంనుంచి ఉంటే మానసిక రుగ్మత అంత తీవ్రంగా రూపొందుతుంది. ఆవిధంగా మానసికసంక్షోభానికి ఓటమి ప్రధాన కారణమవుతుంది.

'ఆధునికజీవితంలోని మరొక ప్రధానాంశం-నానాటికి పెరిగిపోతున్న నగరాలప్రభావం. గడచిన ఇరవై ఏళ్లనుంచి ప్రజలు పట్టణప్రాంతా

లకు తరలిపోవడం ఎక్కువయింది. దాదాపు యాభై శాతంమంది ప్రజలుమాత్రమే గ్రామ ప్రాంతాలలో ఉన్నారు. ఇదివరలో లేనంతగా నగరజీవితం గ్రామీణప్రజలమీద తనప్రభావం చూపుతున్నది. ఇందుకు ప్రయాణసాధనాలు, ప్రచారసాధనాలు తోడ్పడుతున్నాయి. నగరాలఆధిక్యంవల్ల వ్యక్తి క్లిష్టమైన సర్దుబాట్లు చేసుకోవలసి వస్తున్నది. ఈ ఆధిక్యం బరువు మోయలేక వ్యక్తిత్వాలు ఛిన్నాభిన్నమై పోవలసివస్తున్నది. మామూలుగా – అంటే వ్యక్తి ఈప్రభావాలకు దూరంగా ఉండగలిగి ఉంటే ఈ అవస్థలు లేకుండాపోయేవేమో కదా !'

ఈ క్లిష్టపరిస్థితులు, మానసికమైన చిక్కులతో అల్లుకున్న సాలీడుగూళ్లు కలిసి చాలా మందిలో మానసికమైన గందరగోళం, మండి పడే మనస్తత్వం తెచ్చిపెడుతాయి.

వంటి మానసికసమస్యలు అంత ప్రమాదకరమైనవికావు. కనుక వీటిపరిష్కారానికి కష్టనిష్ఠురాలతోకూడుకున్న మానసిక చికిత్సావిధానం అనవసరం. ఈరకానికిచెందిన మానసికవ్యధలకు మనప్రాచీనులు సామాన్యమైన చికిత్సావిధానాన్ని సూచించినట్లు కనిపిస్తుంది నిత్యమూ కొన్నిస్తోత్రాలు పారాయణం చెయ్యడంవల్ల ఈవ్యధలు తొలగించుకోవచ్చును. ఈ పారాయణాలు ఆ వ్యక్తిలో ఎంతోశక్తిగల కంపనాలు కలిగించి, అలా మానసికవ్యధలను పూర్తిగా తొలగిస్తాయి. ఈ స్తోత్రాలఫలశ్రుతిని పరిశీలిస్తే వాటిద్వారా సమకూరగల అద్భుతఫలితాలు స్పష్టంగా కనిపిస్తాయి. ఈ చికిత్సావిధానం సామాన్యమైనది. ఈవిధానంలో మానసికవైద్యుని సహాయం అనవసరం. ఈవిధానంలో పారాయణనికిపట్టే సమయం – మానసిక చికిత్సావిధానంలో అనుదినమూ పరిశీలించడానికి అవసరమయే సమయానికన్నా తక్కువే.

హిందూమత పవిత్రగ్రంథాలను అనుసరించి మానవుడి అవ్యక్తచేతన, మస్తిష్కంలో కాక వెన్నెముక మొదట–అంటే మూలాధారంలో ఉంటుంది. అన్నిసంస్కారాలు, గుణగణాలు అక్కడ బీజరూపంలో నిక్షిప్తంగా ఉంటాయి. అవ్యక్తచేతన, మెదడుకు ఆజ్ఞాతరంగాలు పంపినప్పుడు వ్యక్తిత్వం బాధకు గురి అవుతుంది. అలా అది దెబ్బతినడం మొదలవుతుంది. ఆధునిక శస్త్రచికిత్స కాని, ఔషధాలద్వారాసాగే చికిత్సకానీ మానవుల అవ్యక్తచేతననుంచి మెదడుకు ఆజ్ఞాతరంగాలు పోకుండా అదుపుచెయ్యడానికే ఉద్దేశించినట్లు కనిపిస్తుంది.

కాని ఈచికిత్స అవ్యక్తచేతనలో

పారాయణంవల్ల కలిగేఫలితాలు ఎంతో శక్తి కలవి. పారాయణంవల్ల ప్రదక్షిణంగా సాగే కంపనాలు మొదలవుతాయి. ఎంతోబలంకల ఈ కంపనాలు అవ్యక్తచేతననుంచి అప్రదక్షిణంగా వెలువడే కంపనాలను పూర్తిగా బలహీనంచేస్తాయి. అనునిత్యమూ పారాయణం చేసే మనిషికి తాను నానాటికీ బలం పుంజుకోవడం తెలియవస్తుంది. అంతేకాదు. జపంవల్ల తనసామర్థ్యం పెరగడం, అలా తన విధినిర్వహణ మరింత ఆత్మవిశ్వాసంతో అతిసులభంగా చెయ్యగలగడంకూడా అనుభవపూర్వకంగా తెలుస్తుంది. ప్రతిదినమూ ధ్యానం చేసే వారికి ఈ ఫలితాలన్నీ మరింత స్పష్టంగా కనిపిస్తాయి. ఈస్తోత్రాలను పఠిస్తే ధ్యానం ఇంకా కుదురుగా చేసుకోగలమని వారే గ్రహించగలరు.

ఇటువంటి స్తోత్రాలలో సార్థకమైన ప్రశస్తి గడించిన 'లలితా సహస్రనామం' ఒకటి. విశ్వాన్ని ఆవరించిన విశేషశక్తిస్వరూపిణి అయిన లలితామాత ప్రశస్తిని ఉగ్గడిస్తుంది ఈ సహస్రనామస్తోత్రం. స్తోత్ర ఫలశ్రుతిలో 'అనేన సదృశం స్తోత్రం న భూతం న భవిష్యతి' అని ఈ స్తోత్రం సాటిలేనిది అని చెప్పడంలో అతిశయోక్తి లేదు. 'యత్ పాపం జాయతే పుంసాం తత్ సర్వమ్ నశ్యతి ధ్రువమ్' అని ఈ స్తోత్రం పఠించడంవల్ల తొలగని మానసిక వ్యథకాని, చిక్కులుకాని లేవని పేర్కొంటున్నది.

మానసికంగా దెబ్బతిన్న కొందరికి 'లలితా సహస్రనామం' పరిష్కారమార్గంగా సూచించడం జరిగింది; అటువంటివారు ఎంత మంచి ఫలితాలు లభించాయో శ్రద్ధగా చూడడమూ జరిగింది. వారిలో కనిపించిన మానసికమైన నిస్పృహ, చీటికి మాటికి మండిపడే లక్షణం, అస్తవ్యస్తమైన ఆలోచనాధోరణీ క్రమంగా అదృశ్యమైనవి. వారు తాము మామూలుగా పనిపాటలు చేసుకోవడానికి తగినబుద్ధి శక్తిని పొందారు. తమ పనిపాటలు ఎంతో ఆత్మ విశ్వాసంతో వడివడిగా సమర్థవంతంగా చేసుకో గలిగారు.

ఇక్కడ మరొకవిషయం. ఈ స్తోత్రాలు చదివేవారు జపాలు చేసేవారిలా ఏకాగ్ర దృష్టితో శ్రద్ధగా చదవవలసిన అవసరంలేదు. వారిమనసులు సంచలిస్తున్నా (మానసిక క్షోభకు గురిఅయిన వారిమనసులు ఎప్పుడూ సంచలనానికి గురి అవుతుంటాయి కదా!) ఈ స్తోత్రపఠనంవల్ల కలిగేఫలితాలు తగ్గవు. స్తోత్ర పఠనం అవ్యక్తచేతనమీద ప్రత్యక్షంగా ప్రభావం చూపుతుంది. లలితా సహస్రనామ స్తోత్రం ఫలశ్రుతిలోచెప్పిన ఫలితాలన్నిటినీ భక్తిశ్రద్ధలతో ఆ స్తోత్రం పఠించడంద్వారా పొందవచ్చును. లలితా సహస్రనామం పరిష్కారమార్గంగా పాటించిన ఎవరివిషయం లోనూ ఎటువంటి ఒడిదుడుకులూ కనిపించ లేదు.

లలితా సహస్రనామం మానసికరుగ్మతగల వ్యక్తుల వ్యథలుతీర్చి మామూలుమనుషులను చెయ్యగలదంటే ఆరోగ్యంగాఉన్నవారికి అది ఎంతటి సార్థకమైనఫలితాలు చేకూర్చగలదో కదా! అనుదినమూ ధ్యానం చేసేవారికి లలితా సహస్రనామ పారాయణం ఉపయోగకరం కాగలదు. 'లలిత' స్తోత్ర పారాయణంద్వారా చేకూరగల చక్కని ఫలితాలగురించి విద్వాంసులు వైజ్ఞానికపద్ధతిననుసరించి పరిశీలనలు సాగించాలి. అప్పుడు వాటిని ఇంకా ఎందరో తెలుసుకొని లాభం పొందడానికి ఆస్కారం ఉంటుంది.

# మాతృదేవి చరణసన్నిధి

ఆంగ్ల గ్రంథము:
**ఎట్ ది హోలీమదర్స్ ఫీట్**

అనువాదము:
**పి. గణపతిశాస్త్రి**

24, మార్చి, 1920

మాతృదేవి ఇన్నాళ్ళనించి తన పల్లెటూరిలోనే నివసిస్తూండేది. ఆతరవాత ఫాల్గుణ మాసంలో బాగ్ బజారు ఇంటికి తిరిగివచ్చింది. ఆమె పల్లెటూరికి వెళ్లి అప్పుడే ఏడాదిఅయింది. చాలాకాలంనించి అమ్మ అప్పుడప్పుడు మలేరియాజ్వరంతో బాధపడుతున్నదని విన్నాను.

నేను వెళ్లినసమయంలో మాతృదేవి, వస్తువులుకడిగి శుభ్రపరిచేగదిలోఉన్నది. నన్ను చూడగానే ఆమె "కొంచెంసేపాగు. నేనిప్పుడే వస్తున్నాను" అన్నది. ఆపైన ఆమె బాగా దక్షిణంగాఉన్న గదిలోకి వచ్చింది. అక్కడ మాతృదేవికిశయ్య ఏర్పాటుచేశారు. నేను ఆమె పాదాలమీదవాలి నమస్కరించగానే అమ్మ నాశిరస్సు స్పృశించి, ఆశీర్వదించి, "కూర్చో అమ్మా! కుశలమేనా?" అని అడిగింది. నేనామె చేతికి కొంతసొమ్ము ఇచ్చాను. అది ఆమె స్వహస్తాలతో స్వీకరించింది. ఆతరవాత ఆమె ఆరోగ్యపరిస్థితి గమనించినపిమ్మట నానోట మాట వెలువడలేదు! అలాగే కళ్లప్పగించి ఆమెకేసిచూస్తూ "మాతృదేవి ఎంతగా చిక్కి శల్యమయింది!" అని విస్తుపోయాను.

పెదవి కదిపి మాట్లాడడానికికూడా ప్రత్యేకించి ప్రయత్నించవలసినంతగా బాగా చిక్కిపోయింది శారదాదేవి. నేను నేలమీదకూర్చున్నాను. అంతలోనే రాసబిహారీ మహారాజ్ లోపలికివచ్చి ఎక్కువగా మాట్లాడవద్దని శారదాదేవిని హెచ్చరించారు. అయినా ఆమె నన్నుద్దేశించి మరికొన్ని ప్రశ్నలడిగింది. నేను ఎంతసంగ్రహంగా వీలయితే అంతసంగ్రహంగా సమాధానాలు చెబుతూ అక్కడే కూర్చుండిపోయాను.

ఆపైన జబ్బుతోఉన్న తనపిల్లవాణ్ణి ఎత్తుకుని రాధూ అక్కడికివచ్చింది. నేనొక చిన్న బహుమతి ఆ పసివాడిచేతిలో ఉంచాను. కాని దానిని స్వీకరించడానికి రాధూ బొత్తిగా అంగీకరించలేదు. దానిమీద శారదామాత అందుకుని "ఇదేమిటి రాధూ! నీమీద అపేక్షకొద్ది నీసహోదరి నీకేదో ఇవ్వబోతూంటే అది నీవు అంగీకరించనంటావేమిటి?" అంటూ మందలించింది.

అలాగంటూనే ఆమె ఆబహుమతి స్వయంగానే స్వీకరించి వేరొకచోట దాచింది. ఆ పసివాడితల్లి, అమ్మమ్మ తగినంతశ్రద్ధపట్టి తగిన వేళ కింత అన్నంపెట్టి ఆదరంగా చూడకపోయినందువల్లనే వాడికిలాగ జబ్బుచేసిందని అమ్మ వాపోయింది. దానిమీద రాధూ చాలా మోటుగా సమాధానం చెప్పింది. "ఆమె కేమి చెప్పినా ప్రయోజనమేమీలేదు!" అంటూ అమ్మ మౌనం వహించింది.

30. మార్చి, 1920

ఆపైన అయిదారురోజులతరవాత సాయంకాల ప్రార్థనల సమయంలో నేను మాతృదేవి సందర్శనానికి వెళ్ళాను. అమ్మ ఆసమయంలో పరుపుమీద పడుకున్నది. నేను పక్కన నిలబడగానే శారదామాత లేచికూర్చున్నది. నేను నమస్కరించి ఆమె ఆదేశంప్రకారం కూర్చున్నాను. సరళ, నళిని, మందాకిని అన్న పరిచారిక అదేగదిలో ఉన్నారు. నళినితోబాటు మిగిలినస్త్రీలు తమ పరుపులదగ్గిర ఉన్నారు.

నేను నాతోబాటు కొన్ని తియ్యని తినుబండారాలు తీసుకువెళ్ళాను.

సాయంకాలప్రార్థన ముగియగానే అమ్మ ఆ తినుబండారాలు ఠాకూరుకు నివేదించవలసిందని ఆదేశించింది. "తరవాత నైవేద్యం సమర్పించకూడదా?" అంటూ అడిగారు బిలాస మహారాజ్.

"కాదు, ఇప్పుడే నైవేద్యం పెట్టాలి" అంటూ ఆజ్ఞాపించింది అమ్మ. బిలాస్ మహారాజ్ ఆమెఆజ్ఞ పరిపాలించారు. ఆతరవాత శారదాదేవి మా కుటుంబం క్షేమసమాచారాలడిగి ఇలాగన్నది.

"గడచిన రెండురోజులనించి నాకు జ్వరం రావడంలేదు. నాపరిస్థితి ఇప్పుడు కొంత నయంగానే ఉన్నది కాని, తల్లీ, రాధూ నాప్రాణాలు తోడేస్తూంది! ఆరోగ్యము, ఆధ్యాత్మిక సాధన, విధులు, సొమ్ము అన్నీ ఆ రాధూవల్ల పూర్తిగా పోగొట్టుకున్నాను! బహుశా ఆమె తన పసివాణ్ణి చంపివేసినా చంపివెయ్యవచ్చును. తరవాత ఆ పిల్లవాని సంరక్షణభారంఅంతా సరళకప్పగించాము. అందుచేతనే వాడు ఇంతవరకు బ్రతికిఉన్నాడు. డాక్టరు కంజిలాల్ వాడి ఆరోగ్యం జాగ్రత్తగా కనిపెట్టిచూస్తున్నారు. "రాధూ సంరక్షణలోఉంటే నేనాపిల్లవాడికి వైద్యం చెయ్యను" అని ఆడాక్టరు ఇంతకు మునుపే గట్టిగా హెచ్చరించారు!

"ఆ భగవానుని లీల దురవగాహము! తన కన్నబిడ్డ పోషణకూడా తిన్నగా చెయ్యలేని ఆ రాధూకి పసిపిల్లవాణ్ణి ఎందుకు ప్రసాదించాలి? ఇటీవల ఆమె ఒక కొత్తఫిర్యాదుకూడా పొదగడం మొదలుపెట్టింది! ఇదంతా ఇలాగ ఎందుకు జరగాలి! ఇకమీదట వారికేమిజరిగినా ఆపూచీ నేనేమి పట్టించుకోను! ఇంటిదగ్గిరఉన్నప్పుడు అందరు నామీద చాలా అధికారాలు చలాయించారు! నామాటలేమన్నా లక్ష్యం పెట్టారా?"

సరిగా అదేసమయంలో డాక్టరు కంజీలాల్ అక్కడికి వచ్చారని తెలిసింది. మేమంతా ఆపక్కనఉన్న గదిలోకి వెళ్ళిపోయాము. డాక్టరు, అమ్మ ఆరోగ్యపరిస్థితి పరిశీలిస్తున్నారు. అంతలోనే రాధూ లోపలికివచ్చి, "ఇదిగో నా చెయ్యిచూడండి! కింది అంతస్తులో ఇనప స్తంభానికి రాచుకోవడంవల్ల చర్మం చాలా చోట్ల గీసుకుపోయి రక్తం కారుతూంది" అన్నది. మందాకిని మురికి ఓడుతున్న ఒక పాతగుడ్డపేలిక ఆముదంలోముంచి ఆ చేతికి కట్టు కట్టింది. అది గమనించి డాక్టరు "తక్షణమే ఆగుడ్డ తీసివేసి ఆప్రదేశంఅంతా సబ్బుతోకడిగి శుభ్రం చెయ్యండి. అటువంటి మురికిపేలిక ఎప్పుడు వాడకూడదు. లేకపోతే రక్తంఅంతా విషమయం కావడం ప్రారంభమవుతుంది! అసలు కలకత్తా గాలిలోనే విషం ఉంది!"

అలాగంటూనే ఆయన లేచి అక్కణ్ణించి వెళ్ళిపోయారు. అమ్మ, రాధూ పరిస్థితిగమనించి చాలా జాలిపడింది. "పాపం, రాధూకి ఎంతటి పెద్దగా గాయమయింది! ఆమెపరిస్థితి గమనిస్తూంటే నాగుండె చెక్కలవుతున్నది! పుట్టినప్పటినించి ఆమెకన్నిబాధలే! ఒంట్లో పిసరంతకూడా శక్తిలేదు! ఆమెకేమయినా మందు చెప్పమని డాక్టర్ని అడగండి! భగవానుడు ఆమెకు ఆరోగ్యం కలిగించాలి."

ఒకరొకరే ఆప్రార్థనగదిలోనించి వెళ్ళిపోయారు.

ఆతరవాత నేను "నేనొకమాట అడగాలని అనుకుంటున్నాను. అమ్మా! నేనేమి ఇబ్బంది కలిగించడం లేదనుకుంటాను" అన్నాను.

"లేదు! లేదమ్మా! నీవు అడగదలుచుకున్న దేదో చెప్పు!" అన్నది శారదామాత. నా మనస్సులోఉన్నదంతా చెప్పాను. దానిమీద ఆమె అన్నది.

"అటువంటి ఆనందానుభూతి ప్రతిదినము రాదు. నీవు చెప్పినదంతా నిజమేనమ్మా! దేనిలోను అసత్యమేమీ లేదు! అంతా ఆభగవానుడే!"

ఆపైన నేనన్నాను.

అమ్మా! కొన్నిమారులు ఎంతో భక్తితో ఆభగవానుని నామధేయం జపించినపిమ్మట చాలాకాలం గడిచిపోయినట్లు అనిపిస్తుంది. మిగిలినవి కొన్ని నీవు చెప్పావుగాని అవేవి చెయ్యలేదు! నాగృహకృత్యాలేవి విడిచిపెట్ట డానికి వీలులేదుకనక నేను ఇవి అన్ని చాలా తొందరగా ముగించాలి! అది తప్పాఅమ్మా?"

"లేదు! లేదు! దానిలో తప్పిదమేమిలేదు!" అన్నది శారదాదేవి. ఆపైన దోమతెర బిగించడానికి అనుమతికి మందాకిని అక్కడికి వచ్చినంతపర్యంతము అమ్మ కొన్ని ఆధ్యాత్మిక రహస్యాలనుగురించి ముచ్చటించింది. నేను తిరిగి ఇంటికి వెళ్లిపోవాలని ఆలోచించి ఆమాట శారదామాతతో అన్నాను. అంతలోనే అమ్మ తలగడమీదఉన్న శిరస్సు పైకెత్తి "ఇక వెళ్ళవచ్చును. నేనిప్పుడు నాశిరస్సు పైకెత్తాను" అన్నది. పండుకున్న వారికాళ్లకు మొక్కకూడదు. కనక నేఆమె అలాగ అన్నది. నేను అక్కడినించి బయలుదేరగానే ఆమె "మళ్లీరా అమ్మా! బాగా పెంద్రాళ్ళె రా! నీ ఇంటిపనులు కొంచెం ముందుగా ముగించడం కష్టమనుకుంటాను? అంతేనా? ఆభగవానుడు నిన్ను ఊరడించుగాక! మళ్లీరా! అమ్మా!" అన్నది. అంతకుమునుపే దోమతెర బిగించడం ముగిసింది. అయినా ఆ తెరలోనించి ముఖం ఇవతలికిపెట్టి అమ్మ నన్ను వీడ్కొన్నది.

నేను వరండామీదకి వచ్చినతరవాతకూడా కరుణామూర్తిఅయిన మాతృదేవి ఆశీస్సు విన వస్తూనేఉన్నది. అమ్మ సాన్నిధ్యంలో ఉన్నంత సేపు దుఃఖాలు, బాధలు పూర్తిగా తొలగి పోయేవి. ఆమె ప్రేముడిమహిమ అంతటిది!

శారదామాత రుగ్మత ఏమాత్రము తగ్గ కుండా అలాగే ఉండిపోయింది. క్రమక్రమంగా దుర్బలమయింది. నేను ఒకనాటిమధ్యాహ్నం చల్లబడినతరవాత అమ్మ సందర్శనానికివెళ్లాను. ఆమె లేద్దామనుకుని నాతో ఇలాగన్నది.

"కాస్త లేవడానికి నీచెయ్యి ఆసరాగా ఇయ్యమ్మా! నాకు అప్పుడప్పుడు జ్వరం తగులు తూంది. చాలా నీరసపడిపోయాను."

ఆతరవాత శారదాదేవి అతికష్టంమీద లేచి ఇలాగన్నది.

"చూడమ్మా! ఆ తలుపు పక్కన ఎవరో ఒకకర్ర పెట్టారు. నాకొకకర్ర దొరికితే దాని ఆసరాతో నడవగలనని కొంతకాలంనించి అను కుంటున్నాను. తాకూరే ఆకర్ర అక్కడ ఉంచారు.

ఆతరవాత ఆకర్ర చేతపట్టి ఆమె నాకది చూపించింది. ఆపైన నవ్వుతూ "తలుపువెన కాల ఆకర్ర ఎలాగ వచ్చిందని ఆరా తీశాను. కాని అందరు తమకు తెలియదంటే తమకు తెలియదన్నారు" అన్నది.

నేను తిరిగి ఇంకొకనాడు అమ్మ సందర్శ నానికి వెళ్ళాను. ఆసమయంలో ఆమెశిష్యులు, "శారదాదేవికి ఆరోగ్యంకలిగినతరవాత ఆమె

దగ్గరనించి మంత్రదీక్ష స్వీకరించడానికి ఎవ్వరికి అనుమతి ఇవ్వడం జరుగదు! ఆమంత్రదీక్ష తీసుకున్నవారి పాపాలఫలితాలన్ని ఆమె స్వీకరించవలసివస్తుంది కనకనే ఈనియమం ఏర్పరచాలి'' అని అనుకున్నారు.

ఆతరవాత శారదామాత ఆసంగతి విని అల్లన నవ్వి ''ఈసారి ఠాకూరు అవతరించింది రసగుల్లాలు తినడానికేనా?'' అని ప్రశ్నించింది దానికెవ్వరూ సమాధానం చెప్పలేకపోయారు.

ఈసందర్భంలో నాకు ఇంకొకకథ జ్ఞప్తికి వస్తూంది. మంచివంశంలోపుట్టిన ఒక మహిళ చెడుదారిలో అడుగుపెట్టింది. అయితే పూర్వ జన్మలో చేసుకున్నపుణ్యంవల్ల ఆమెకొక సాధువు సందర్శనభాగ్యం లభించింది. ఆయన హితబోధలాలకించినపిమ్మట ఆమె తన తప్పిదాలన్ని గ్రహించుకుని తాను పాపాలెన్నో చేసినట్టు గుర్తించింది. ఆతరవాత ఆమె ఆ సాధువుహితోపదేశంప్రకారం బాగ్‌బజారులో మాతృదేవి సందర్శనానికి వచ్చింది.

ఆపైన ప్రార్థనమందిరం గుమ్మంలో నిలిచి లోపల అడుగుపెట్టడానికి ఎంతో సంకోచిస్తూ అక్కడే నిలబడిపోయింది.

ఆపైన ఎంతో దుఃఖిస్తూ ఆమె మాతృదేవి దగ్గర తాను చేసినపాపాలకన్నిటికి పశ్చాత్తాపపడుతూ ఇలాగన్నది.

''అమ్మా, ఇక నాగతి ఏమవుతుంది? నీదగ్గిరకి రావడానికి పవిత్రమందిరంలోనికి అడుగు పెట్టడానికికూడా నా కర్హత లేదు.

అంతలోనే మాతృదేవి తానే గుమ్మం దగ్గిరకివచ్చి తన రెండుచేతులు ఆమె భుజాల మీదవేసి, ఎంతో ఆత్మీయంగా ఇలాగన్నది.

''లోపలికిరామ్మా! లోపలికిరా, నా తల్లీ పాపమంటే నీకవగతమయింది! ఆపైన నీవు పశ్చాత్తాపపడ్డావు! లోపలికిరా! నేను నీకు మంత్రదీక్ష ఇస్తాను. ప్రతీది ఠాకూరు పాదాల సన్నిధిలో సమర్పించు! నీ కింక భయమేమి ఉన్నది?''

—కృష్ణప్రియ

## తపస్వీ

లేలెమ్ము తపస్వీ నీతపస్సుచే
తమస్సుపోయి ఉజ్వలమైంది జగత్తు
నీస్వనంలోని ఓంకారనాదం
ప్రతిధ్వనిస్తూంది ఈ విశ్వం
గౌరవ కిరీటం ధరించు
పాత ప్రపంచ మందిరాన
వెలిగించు పౌరుషదివ్వె
అందించు మాకు నవలోకం
పలకాలి దేశప్రతిభ నీ పలుకుల్లో
ఛేదించాలి సంకటాన్ని నీనీతి గీతిలో
చిందువెయ్యాలి సాఫల్యం నీచేతుల్లో
నడవాలి మేం నీ దారులలో

నీయొక్క గంభీరమే హిమవన్నగము
నీయొక్క గర్జనే గోదారి పరవళ్లు
నీయొక్కగతే పోతన అష్టదిగ్గజాల ప్రతీకలు
నీవే యుగానికి వాణివి
అమర జీవనానికి నాడివి
నీ ఊపిరిలోని అమరత్వం
లోకానికి కళ్యాణగానం
లేలెమ్ము తపస్వీ!
ఈజగత్తు ఆమంత్రిస్తూంది
నీ ఆగమనానికి ఎదురుచూస్తూంది
ఆశతో అమృతం తెస్తావని

# కబీరు వచనామృతము

(రెండవ భాగము)

## కబీరు ప్రేమ

వసంతఋతువు సమీపించుచున్నది. ప్రియునితో గలియక నాకెవ్వరొడగూర్తురు ?

నా ప్రియునిరూపము వర్ణించుటకేపలుకులు సేకరింతును ? అతడు సకలసౌందర్యమునను నిమజ్జితుడై యున్నాడు

ఆతనిరంగు విశ్వములోని సర్వప్రతిమలందును కలదు. అయ్యది తనువును, మనమును శోభచే వేదురు గొల్పుచున్నది. దీని నెరుంగువారు వసంతముయొక్క అనిర్వచనీయమగు ఖేల యెద్దియో ఎరుగుదురు.

కబీరిట్లనుచున్నాడు:—ఓయన్నా! ఆలకింపుము. దీని నెరుగువారు కొలదిమందియే కలరు.

### 2

నా ప్రియతమునకు మేల్కొనినాడు, ఇక నేనెట్లు నిదురింతును? రాత్రిందినములు నన్నాతడు పిలుచుచున్నాడు, నేనయ్యది వినక అసతివలెనన్యునితో సంగ మొనర్చుచున్నాను.

కబీరిట్లనుచున్నాడు:-ఓ చతురవగు చెలీ, ప్రేమములేక ఆ ప్రియతముని మిళనమందు నిన్ను మేళవించుకొనలేవు.

### 3

రేబవలును హృదయము వ్యధితమగుచున్నది; కంటిపై నిద్ర వచ్చుటలేదు. ప్రియునితో మిళనమునకై మనము వ్యాకులమగుచున్నది. నా పుట్టిల్లిక సుఖముగాదు.

గగనద్వారములు తెరువబడినవి, మందిరము నాకనుల కట్టెదుట దీపించుచున్నది. నా భర్తను గలిసికొంటిని. నాతనువును, మనమును అతనిపాదములకడ నర్పించితిని.

ప్రియతమునిదగు, నీఘటముచే, ప్రియతముని తృప్తునిచేయుము. కనులయందు వర్షాకాలపుటాకసమునందలి జలధారవలె నశ్రువుల రానిమ్ము. శ్యామలమేఘములచే వలె ప్రేమతో జిత్తమును, గప్పివైచుము ప్రియునికి నీవేదనను మాటిమాటికిని రహస్యముగా వినిపింపుము.

కబీరిట్లనుచున్నాడు:-వినుమో సాధూ! ప్రియుని నేడు, నీచిత్తమున ధ్యానింపుము.

### 5

నేను ప్రేమచే మత్తుడనైతిని. ఇక నాకు జాగ్రత్త ఏమి? అజాగ్రత్త ఏమి? ప్రియుని ఎడబాటుచే బరితపించువారు ఇంటింటికినిబోయి వెదకుచు నలమట పడుచున్నారు. నా ప్రియతముడు నాయందే కలడు. నాకిక బరుల సహాయమేల ?

ప్రియుడొక్క రెప్పపాటు కాలమైనను నన్ను విడనాడడు. నా ప్రేముడికతడే లక్ష్యమైయుండ నాకికనశాంతి ఏల? బాట నడచుట కష్టమగుగాక; నా దేహము పేలవము అగుగాక; తలపై బలువు నిలిచియుండుగాక. ఐనను, ఓ కబీరా! నీవు ప్రేమచే ఎప్పుడు మత్తుడవైతివో, అప్పుడు నీచిత్తమునుండి భయములన్నింటిని దూరగింపుము.

నర్తింపుము, ఓ హృదయమా నేడు నృత్తత్తతో నర్తింపుము. ప్రేమయొక్క రాగాలాపములు, రేయింబవళుల నింపుచున్నవి. విశ్వమా సంగీతమునే వినుచున్నది.

రాహువు, కేతువు, నవగ్రహములు నర్తింపుచున్నవి. ఆనందమున వేదురుగొని జన్మ

మృత్యువులా సంగీతమునకనువర్తించుచున్నవి. గిరులు, సముద్రములు, ధరిత్రి సర్వమును నర్తించుచున్నవి. నవ్వుతోడను, ఏడ్పుతోడను లోకమంతయు నర్తించుచున్నది. కాషాయపు శాటినిధరించి అహంకృతిలో ప్రపంచముతో దూరముగానేటికి నివసించెదవు?

చూడుము:-నాహృదయము సహస్రకలల యొక్క యానందమునందు నర్తించుచున్నది. సృష్టికర్త దీనిచే ప్రీతుడైనాడు.

## 7

హృదయము వేదురుగొనియున్నప్పుడు మాటలతో ప్రయోజనమేమి?

హీరకము దొరికినది, దానినంచలమునందు గట్టిగా గట్టితిని. మాటిమాటికిని దానిని విప్పి ప్రయోజనమేమి?

తేలికగానున్నప్పుడు తరాజుదండె పైకి పోయెడిది; ఇపుడు నిండినది. ఇక మాటిమాటికిని తూచి ప్రయోజనమువేమి? పెరిమకలాలినై మదిరను ద్రావి మైమరపుగొంటిని. నేను ద్రావిన మదిరకింతని కొలతయేల?

హంస మానససరోవరమునకు జేరినది, ఇక చిన్నిచిన్ని పడియలకై అది వెదుకనేల?

నీప్రభువు ఘటమునందే కలడు; నీ కనుల బైటికి దెరువనేల?

కబీరిట్లనుచున్నాడు:- వినుమో సన్యా! నేత్రనిర్వాణమొనరించు నాప్రభువుతో గలసి కొంటిని.

## 8

ఓ విరహిణీ ఎట్లు బ్రతుకుదువు? ప్రియుడు వినా, ఏమియుపాయము?

పగలాకలిలేదు. రేయి నిదురలేదు. ఒక్కొక్కజాము ఒక్క కలియుగమగుచున్నది. వసంతముయొక్క యీ పరిపూర్ణ వేళయందు ఆ సుందరుడు నిన్ను విడనాడి ఎచటికోయరిగినాడు. ఓ విరహిణీ! ఇక నీ ధనమును, నీ గృహమును బరిత్యజించి వనమునకు బొమ్ము, ఆతనిపేరు కీర్తింపుము. ప్రియు డొడగూడినప్పుడే సుఖము. నీటివెలుపల చేప యెటుల గొట్టుకొనునో, అటుల నాతనిదర్శనమునకై వ్యాకులపడి పరుగిడుము. ఆకారము లేదు, రూపము లేదు, రేఖ లేదు; నీతో నెవరువచ్చి కలియుదురు. ఓ సుందరీ, నీపురుషుని నేడెరిగికొనుము. తనువు సక్తమొనరించి, నేడాతని దర్శింపుము. ఇక భ్రమ నాశ్రయింపకుము. రాగస్వరూపుడైన నీ ప్రియుని దెలిసికొనుము.

కబీరిట్లనుచున్నాడు:- రెండవవాడింకెవ్వడును లేడు. యుగ యుగమునందు, నీవును నేనును ఒకటియే.

## 9

మిళనము గడు కష్టము, ప్రియునితో గల యుట కేమియుపాయము? ఎంతెంతో చింతించి, యెంతయో యత్నముచేసి బాటపై బదమూంచుచున్నాను. కాని యది కంపించి జారిపోవుచున్నది. బురదచే జారు నాబాట యెచటికో యెత్తునకు బోవుచున్నది; పదములను స్థిరముగా నిలుపలేకున్నాను. లోకమువలని లజ్జ, కులము యొక్క మర్యాద, వీనిని తలచితలచి మనము సంకుచితమగుచున్నది. అక్కటా! నాథర్తృ గృహ మెచ్చట? ఇంకను పుట్టింటనే యున్నాను. లజ్జనైనను వీడుకొల్పలేనైతిని.

## 10

నీకును, నాకునుగల ప్రేమ యెటు తెగిపోగలదు?

కమలపత్రమెట్లెప్పుడును నీటిమీదనే యుండునో, అటులనే నీవు స్వామివి, నేను సేవకుడను.

ఎటుల చకోరము నిశియంతయు చంద్రునికై తేరిచూచునో, అటులనే నీవు స్వామివి, నేను సేవకుడను.

కాలముయొక్క మొదలునుండి తుదివరకును నీకును, నాకును ప్రేమకలదు. ఇట్లు లగించుకొనియున్న ప్రేమ మెట్లు రూపఱును?

కబీరిట్లనుచున్నాడు:–నది సముద్రము నెట్లు ప్రవేశించునో, అట్లే నాహృదయము నీయందు లీనమగుచున్నది.

## 11

ఓ నారదా! నాప్రియుడు దూరమున లేడు. ప్రియుడెప్పుడు మేల్కొనునో, నేనప్పుడు మేల్కొందును; ప్రియుడెప్పుడు నిదురించునో నేనప్పుడు నిద్రింతును.

నాప్రియతము నెవ్వడు దుఃఖింపచేయునో ఆతడు మూలమండే నశించును.

ఎచ్చట ప్రియుని పాడెదవో నేనచ్చట నివసింతును. అతడు కదలునపుడు, నేనాతని ముందు బరుగిడుదును. నాప్రియునికై డెందమాకాంక్షచే వ్యాకులపడుచున్నది. అనంతమగు తీర్థము, నా ప్రియుని చరణములకడ గలదు. కోటిభక్తులచ్చట గూడియున్నారు.

కబీరిట్లనుచున్నాడు:–ప్రేమయొక్క మహిమను ప్రియుడే తెలియచేయును.

## 12

నీవు లేమిచే నాదేహమును మనమును బరితపించుచున్నవి. ఓ వల్లభా! నాయింటికి రమ్ము.

లోకులు నీనారినని నన్ను బలుకునప్పుడు కడు సిగ్గగుచున్నది.

నాయెడదను నీయెడదతో గలుపలేదు. ఐనను నాప్రేమయాకులమేమందును? అన్నము రుచింపదు, నిదుర బట్టదు, గృహమందున్నను వనమందున్నను, మనమున ధైర్యము నిలువకున్నది.

దప్పిగొన్నవానికి నీరెట్లో, కామినికి ప్రియుడట్లు. నాకబురును ప్రియునికి వినిపించు పరోపకారి యెవ్వడైనను కలడా! ఇక కబీరు అధీరుడైనాడు. అతని దర్శనములేనిదిక ప్రాణము నిలువదు.

## 13

ఓ విలాసినీ! మంగళగీతము పాడుము. నా పరమభర్త ఇంటి కరుదెంచినాడు.

ఆతనిప్రేమయందు నాతనుమనముల రత మొనర్తును. పంచతత్వములును ప్రేమచే నుజ్వలములైనవి.

వల్లభుడు నేడు నాయింటికతిథియై వచ్చినాడు. నేడు నాయందు యౌవనమున్మత్తమగుచున్నది.

శరీరసరోవరమును దీర్ఘమొనరింతును. బ్రహ్మ వేదోచ్చారణ మొనరించును.

వల్లభునితో నేడు కలియుదును. ధన్యము, ధన్యము, నాభాగ్యము.

ముప్పదికోట్లసురలును, కౌతుకమున విచ్చేసినారు; జగమునందుండు ప్రేమాళువులందరు విచ్చేసినారు.

కబీరిట్లనుచున్నాడు:–నేడు నా వివాహము జరుగనున్నది. ఒక్కడగు ఆయవినాశియే నా వల్లభుడు.

## 14

నాశరీరమను మహాలునందు వాద్యము మ్రోయుచున్నది. ముప్పదియారు రాగములు ఝంకృతమగుచున్నవి. ప్రేమయను సఖి ఈ యుత్సవమును జూచుచున్నది. నేడు వల్లభుడు వసంతక్రీడ యొనర్చుచున్నాడు. లజ్జాభయముల నివారించి నేడు ప్రియునితో హోలీఖేలనొనర్చుచున్నాను. జగమునందంతయు నేడు కుతూ

హాలము. రాగానురాగముల ఝరి ప్రవహించుచున్నది.

## 15

కాయమను నగరమున స్వామి హోలీ ఆడుచున్నాడు. రసపూరితమైన రాగము మ్రోగుచున్నది. సరసస్వరము శోభించుచున్నది. నేడు ఆనందము అతిశయించుచున్నది. నా శరీర భవనమున వాద్యము నినదించుచున్నది. జ్యోతిర్డోల యూగుచున్నది. ఒడలందంతయు సహజమగురాగము విరచితమైనది. ఈ యానందమునకంతము లేదు. తంబుర లేకయే ఈ అనాహతవాద్యము మధురధ్వనియందు ధ్వనించుచున్నది; రసన లేకయే ముప్పదియారు రాగములను పాడుచున్నవి. మహానందము పరిపూర్ణమగుచున్నది.

## 16

ప్రియుడీవిధమున నాతో హోలీఖేల నాడుచున్నాడు. బాటపై పునకు జూచుచు,చూచుచు జన్మము జరిగిపోవుచున్నది. ఐనను దాగుడుమూతదొంగ యింకను బట్టుబడలేదు. ఆతడు కన్నులకైనను కన్పడుటలేదు. చెవులకైనను వినబడుటలేదు.

నా ప్రాణమునంతయు నాతని ప్రాణమున మేళవింప వ్యాకులపడుచున్నాను.

## 17

నేడు నా ప్రభువు వసంతక్రీడకై వచ్చినాడు. నేడు నాపలుకు పవిత్రతను బలుకుచున్నది. సౌందర్యమును బలుకుచున్నది. అతి సుఖమైన మంగళరాగమును బాడుచున్నది. సఖునితోడి యీ వసంతమిళనమునందు రసము చిప్పిలుచున్నది. అనాహతవాణి పాడుచున్నది. ఆ రాగమును విని అనురాగము ప్రతిస్వరించుచున్నది; ఇంకను నిదురింపనేల ! లెమ్ము. మేల్కొనుము. జలములు నీయెడ సాదరము దెలుపుచున్నవి. పవనము నీపడక యగుచున్నది. సర్వభూతములును నిన్ను సన్మానించుచున్నవి.

## 18

ఓ నెచ్చెలీ, ఉత్తముడగు ప్రాణకాంతుడు నేడింటికరుదెంచినాడు. నేడు హోలీరంగుతో నాడుకొందును.

జన్మమరణముల కల్పన యాగిపోయినది. నాకు ప్రాణము లభించినది. జీవనము లభించినది.

మృదంగము ఝణఝణయని మ్రోగుచున్నది. అనాహతసంగీతము కుసుమించినది. ప్రియతమునితో నాడుకొనుటకు నేడు బాటపై జనుచున్నాను. నాతనువు తాపమంతయు జల్లారినది.

ప్రియతముడు దొరికినాడు; నన్ను నేమఱపు గొంటిని. అపారఖేల మొదలిడినది. సుఖసాగరమున నేడు స్నానమొనర్చితిని. కబీరు వసంతమునందు ప్రవేశించినాడు.

## 19

ఓయీ పెరిమపుటుయ్యెలను నేడు వ్రేలచేయుము. ప్రియుని భుజములమధ్య నీతనుమనములను, ప్రేమానందముయొక్క రసోత్కటతయందుయ్యెలలూపుము.

వర్షాకాలమునందలి జలధారలవలె నీకంటియందశ్రువుల రాలింపుము, హృదయమందు మేఘముల శ్యామలచ్ఛాయను నిబిడమొనరింపుము. ప్రియుని చెవికడ మోముచేర్చి గభీరమగు నీహృదయవేదన నివేదింపుము.

కబీరిట్లనుచున్నాడు:-ఓ అన్నా! ఆలకింపుము. ప్రియునిధ్యానమును నీచిత్తమున నిలువరింపుము.

## 20

ఓ సాధూ! కర్త కర్మనుండి భిన్నుడు. ఆతడు రాడు, పోడు. ఆతడు చావడు, పుట్టడు; ఆతని విచారించి తెలిసికొనుము. ధరణీగగనము లెవ్వనియానందమో, ఎవ్వని ఆనందము సర్వమును ప్రసారితమొనర్చినదో, అనాహత నాదము ఎవ్వనిసంగీతమో, ఆతడే నా ప్రభువు.

## 21

నా పెరిమ కాడు చూపట్టినాడు. ఇపుడు నేను పెరిమ వేదుకుగొంటిని.

ఆతడన్నిటియందును వ్యాపించియున్నాడు, అన్నిటికిని అతీతుడు, మరియు నాతడంత ర్యామి. సహజ శృంగారప్రేమచే నతడు రసికుడు. ప్రేమవైరాగ్యముల రెంటిని ఆతడు పరిపూర్ణమొనర్చును. ఇట్టి ప్రియుని నేనెన్నడును చూడలేదు. ఆతని ప్రేమ, రూపమును ప్రాణమును ముగ్ధమొనర్చును.

కబీరిట్లనుచున్నాడు:— తనువుతాపము చల్లార్చు పరిపూర్ణుడగు గురువు నాకు లభించినాడు.

## 22

ఎవరేమన్నను సరే, నేనెచ్చట పట్టుబడితినో, అచ్చటనే పట్టుబడియుందును. ప్రేమ కమలమందు, నామనము మునిగియున్నది. ప్రియతముని ప్రేమకటాక్షము నాకంట బడినది. సంసారవిచారమును నేను బోద్రోచితిని; ఆతని పలుకు వినియే నేను పరుగిడితిని. కబీరు తన ప్రియతముని ఉయ్యేలయందు జన్మమరణముల విస్మరించి ఊగుచున్నాడు.

## 23

ఓ నెచ్చెలీ, ఇక నిదురింపకుము. మేల్కొనుము. రేయి గతించినది. పవలుగూడనేల పోగొట్టుకొందువు? మేల్కొనినవారు మాణిక్యములనందినారు. ఓ వెర్రిదానా, నీవు నిదురించి. అన్నియు బోగొట్టుకొంటివి. నీప్రియుడు చతురుడు. నీవు మూర్ఖురాలవు; ప్రియునికొరకెన్నడును శయ్యను రచించితివి కావు. ఓ వెర్రిదానా! నీవెర్రితోడనే కాలక్షేపము చేసితివి. నీ నిండుజవ్వనము వమ్మైనది. నీప్రియునెరుగవైతివి.

లెమ్ము, లెమ్ము, చూడుము. నీ శయ్య శూన్యము. ప్రియుడు రాతిరి నిన్నువీడి వెడలినాడు.

కబీరిట్లనుచున్నాడు:—ఏ సుందరి హృదయమం దాతని సంగీతబాణము తగుల్కొనునో, ఆపెయే మేల్కొనును.

## 24

సృష్టి నిన్ను వంచించిపోవుచున్నది. దృష్టిని బరపిచూడుము. ఆ ప్రేమరూపుడెచటగలడో విచారించి తెలిసికొనుము. ఆ పురుషుని దేశమెచ్చటనో, ఎచటినుండి యాతడుచ్చైస్వరమున బాడుచున్నాడో యది యెరిగికొనుము.

కన్నులాతని నెంతవరకు జూడలేవో, అంత వరకు హృదయతాపము చల్లారదు. నీటి వెలుపలి చేపవలె కాంతుడులేని విరహిణి ప్రాణము గిలగిల కొట్టుకొనును. విరహవియోగ మధికమగుచున్నది. ఈరోగము నెవరును తెలియకున్నారు.

ఇంటింటను పెక్కువైద్యులు. వీరందరును నారోగమును హెచ్చుజేయుచున్నారు.

ఈవియోగబాధ నెట్లు దూరగింతును? దీనిజ్వాల నెట్లార్పుదును? ఔషధమెప్పుడీ జీవనభ్రమను దొలగించునో, అపుడే సరియైన వైద్యుడు దొరకెనని యెరుగగలను.

# బ్రహ్మమయం జగత్

శ్రీమతి పి. రాజేశ్వరి

నేటి ఆధునికజన జీవితంలో వైజ్ఞానికముగా ఎన్నోమార్పులు, విధానములు, సాధనములు, ప్రతిక్షణము మనఅనుభవంలోకి వస్తూంటాయి. పూర్వము ప్రాచీనవేదకాలంలో కేవలం ప్రకృతిని తిలకిస్తూనే ఆర్యులు ఎన్నోవిధాలుగా ఆధ్యాత్మికజీవితాన్ని గడిపేవారు. వారికి ప్రకృతిలోని రామణీయకత, సౌందర్యము మొదలైనవి చూడగానే దైవత్వము, ఆధ్యాత్మికచింతన, పరమపురుషునిలో తాదాత్మ్యము చెందాలనే తపన యేర్పడేది. తత్ఫలితమే వేదవేదాంగములసృష్టి. కాని, నేటిమానవులకు ఆనాటి ప్రకృతిరామణీయకతకన్నను, కృత్రిమ భౌతిక సాధనాలే కళ్లు మిరిమిట్లుగొలిపేలా చేస్తున్నాయి. ఈ భౌతికవాదయుగంలో పరుగులుతీసే మానవులకు ఒక్కక్షణం నిలిచి, తన చుట్టూ ఉన్న సహజప్రాకృతికసౌందర్యాన్ని తిలకించి, పరమపురుషుని తలచుకునే తీరిక, ఓపికకూడా లేవు. అట్టిమానవుని హృదయకవాటములు తెరిచి ఆనందానుభూతిని కలిగించుటకై, ఈ భౌతికసాధనములనే కొన్నిటినాధారముగా తీసికొని, ఆత్మ-పరమాత్మల వివేకాన్ని కల్గించడానికై కొంత ప్రయత్నమిచట చేయబడినది. భౌతికసంపద మానవుని మాహాత్మ్యముకాదు.

---

మనుష్యుడెప్పుడూ తనచుట్టూఉన్న పదార్థములనుచూచి, వాటిని సంపాదించి అనుభవించుటే తనకు గౌరవమని భావిస్తాడు. కాని యథార్థమైన విషయమేమనగా, మనుష్యునివల్లనే ఆ వస్తువులకు గౌరవము ఆపాదింపబడుచున్నది. పసిపిల్లలు ఆటవస్తువులతో ఆడుతూ అవే తమ జీవితసాధనములుగా తలచుకుంటారు. అలా ఆడుతూ పాడుతూ ఉండేపాపకు తిండి, నిద్ర, చదువు, తల్లి-తండ్రి యేదికూడా జ్ఞాపకముండదు. అలాగే, మనుష్యుడు ఈ ప్రపంచములోని అనేకానేకపదార్థాలను ఉపయోగించుకుంటూ, వాటిని సంపాదించి అనుభవించడమే తనజీవితానికి ప్రధానలక్ష్యమని భావిస్తాడు. ధనము, భవనాలు, మోటారుకార్లు మొదలైనవన్నీ సంపాదిస్తూ, తాను గొప్పవాడనే భ్రమలోపడి, అందరిచేతా తనకంటే గొప్పవాడు లేడనేమాట అనిపించుకోవాలని తపిస్తాడు. కాని ఒక్కనిముషం నిలిచి ఆలోచిస్తే, ఈపదార్థాలవల్ల మనుష్యునికి గొప్పదనంవచ్చిందా, లేక మనుష్యునివల్ల వస్తువులకు గొప్పతనం వచ్చిందా అనేసత్యం స్ఫురిస్తుంది. అనేకవస్తుసముదాయాలను సమకూర్చి, వాటిమధ్యలో మనుష్యులు లేకుంటే, అవి ఏమి పనికివస్తాయి? తెలివిగలపిల్లలు తమ ఆటవస్తువులను జాగ్రత్తగా కాపాడుకుంటారు; చేతకానిబాలురు అవే వస్తువులను పాడుచేసుకుంటారు. అలాగే, యోగ్యుడైన మనుష్యుడు భౌతికమైనపదార్థాలతో సాధనచేసి మానసికచిరంతనానందాన్ని పొందగలుగుతాడు. కాని, అయోగ్యుడైనవాడు ఆ పదార్థాలను సంపాదించేవరకే జీవితాన్నిధారపోసి, అనుభవించలేక దుఃఖభాజనుడౌతున్నాడు.

## బంతి-లక్ష్యచ్యుతి

ఆటలాడుకునేబంతి పైకి ఎంతఎత్తుకువిసిరినా క్రమంగా నేలమీదికి పడుతుందేగాని మధ్యలో ఎక్కడా ఆగదు-లేకా పైకి పోజాలదు. అదే విధంగా లక్ష్యము, సిద్ధాంతములను పాటించని మనుష్యులు పూర్తిగా పతనావస్థచెందుతారు. కాన, తన లక్ష్యాన్ని, ఉన్నతాదర్శాలను సాధించదలచుకున్నవారు దృఢసంకల్పులై అగ్రగాములవుతారు. లక్ష్యము, సాధనామార్గ

ము, దృఢసంకల్పముతో ఆలక్ష్యాన్ని సాధించుట, ఇదియే మానవజీవితానికి సాఫల్యాన్ని సార్థకతను యేర్పరచేవి. సాధనలేనిజీవితము టికెట్టులేని రైలుప్రయాణంలాంటిది. టిక్కెట్టు తీసుకుని రైలెక్కే ప్రయాణీకుడు సుఖంగా గమ్యస్థానాన్ని చేరుకుంటాడు. కాని, టిక్కెట్టు లేనివాడు భయంభయంగా ప్రయాణంసాగిస్తూ, దారిలోనే దింపివేయబడి, అవమానమునొందుతాడు. నేలబడినబంతి మళ్ళీ పైకి లేవ ప్రయత్నించినట్లే, చిత్తశుద్ధిగలవాడు క్రిందపడినా, మళ్ళీ పైకి లేవడానికి ప్రయత్నిస్తాడు. బంతిని ఎంతబలంగా నేలకు కొట్టితే, అంతవేగంగా పైకి లేవగలదు. అలాగే, చిన్నచిన్న ఆటంకములు సంభవించినా, సజ్జనుడు పైపైకి వెళ్ళడానికి, జీవితలక్ష్యాన్ని సాధించడానికే ప్రయత్నిస్తాడు.

## కబాడీ-మధ్యరేఖ

కబాడీ ఆడడానికి ఒక మధ్యరేఖ చాలా ప్రధానమైన స్థానము. ఆటగాడు ఈ రేఖనుదాటి తన ఎదుటివారిని సమీపిస్తాడు. ఎదుటివారు వీనిని పట్టుకుని, వెనుకకు వెళ్ళనీక ఆపడానికి ప్రయత్నిస్తారు. ఈపట్టును విడిపించుకుని మధ్యరేఖదాటి తనస్థానాన్ని చేరేవరకు గాలి బిగబట్టడమే ఈ ఆటలో ముఖ్యమైనది. ధ్యరేఖ దాటకముందే, ఎవడైతే గాలి వదిలేస్తాడో వాడు ఓడిపోయినట్లు నిర్ణయిస్తారు. మానవజీవితానికి ఆత్మ మధ్యరేఖలాంటిది. ఆత్మనివదలి ప్రపంచంలో బ్రతుకుతూ, కామక్రోధాదులచే పట్టుబడినవాడు చిద్భావమనే ఊపిరి వదలివేయడంవల్ల ఓడిపోతాడు. దైహికమైన సుఖాదులకులోబడి, మానసికమైన సచ్చిదానందమును వదలివేయుటచే, ఆత్మ అనే మధ్యరేఖను సమీపించజాలక, మానవుడు మృతుడగుచున్నాడు. ఆత్మను దేహరూపమున నిలిపి, కొన్ని ఉచ్ఛ్వాసనిశ్వాసముల కాలమునే జీవితాన్నిపొంది ఈభూమిపై మనుష్యుడు జన్మిస్తున్నాడు. కావున, అట్టి మధ్యస్థిత ఆత్మను మరల చేరడానికి ప్రయత్నించడమే గెలుపు. కామక్రోధాదిశత్రువర్గాన్ని జయించి, భౌతిక సాధనాలను పొందలేదనే అసంతృప్తిపాలుగాక ఎవరైతే, ఆత్మోన్నతికి పాటుబడుతారో, వారే నిజమైన, శాశ్వతమైన జీవితసాఫల్యాన్ని పొందినవారవుతారు.

## Steering wheel - వివేకము

మోటారుకారును నడపడానికి దానిచక్రము కారణభూతంగా ఉంటుంది. ఈ స్టీరింగ్‌వీలు పనిచేయకున్ననూ, డ్రైవరు చక్రాన్ని ఉపయోగించే సరియైనపద్ధతి నేర్వకపోయిననూ, ఆ మోటారు ఆపదకు గురియౌతుంది. డ్రైవరు చక్రాన్ని సరియైనవిధంగా త్రిప్పకపోతే, ప్రయాణించే కారు గోతులలో పడడమో, చెటకు గుద్దుకోవడమో జరిగి ప్రయాణీకు లెవ్వరూ బ్రతికి బయటపడే అదృష్టముండదు అలాగే, వివేకమనే చక్రము, మనుష్యుని జీవితమనేబండిని లక్ష్యమనే గమ్యానికి చేర్చే సాధనము. వివేకశూన్యుడైన మనుష్యుడు తన జీవితములో సత్తు, అసత్తులను, సుఖదుఃఖాలను విభజించలేక ఆపదలపాలవుతున్నాడు. ఇంద్రియముల విశృంఖలతను ఆపగలిగేది వివేకమే. ఇంద్రియలోలత్వమును ఐహికసుఖములును అశాశ్వతమైనవని తెలిపి, ఆత్మానుభూతికి దారితీయగల సుఖములవైపు నడిపించే స్టీరింగ్ వీల్ వివేకము.

## నంబరు ప్లేటు-గురుదీక్ష

ఏ మోటరువాహనానైనా మొదట పోలీసుస్టేషనుకు తీసుకువెళ్ళి, రిజిష్టరుచేయించి,

దానికొక నంబరుప్లేటు తగిలించాలి. ఇలా చేస్తేనే, ఆబండికి గుర్తింపు ఏర్పడి, సర్వత్రా దానిని కనుగొనడానికి వీలుకలుగుతుంది. అలాగే శిష్యుడు గురుసాన్నిధ్యానికి వెళ్ళి దీక్షతు డగుట చాలాముఖ్యము. గురుముఖతః దీక్షను స్వీకరించిన శిష్యుడు పరమానందానుభూతి నొంది ప్రపంచములో జ్ఞానిగా గుర్తింపు నొందును.

## Gear-అభ్యాసము

మోటారుబండిని సురక్షితంగా నడపడానికి నాలుగురకాలైన గీర్లు ఉంటాయి. ఇందులో మూడు బండిని ముందుకు నడిపించడానికి, నాల్గోది బండిని వెనుకకు మళ్ళించడానికి ఉపయోగిస్తారు. మొదటిగీరు వేయగానే బండి బయలుదేరడము, ఎత్తైనప్రదేశాలు ఎక్కడము ప్రారంభిస్తుంది. అలాగే గురువువద్ద దీక్షనుపొందిన శిష్యుడు తన జీవితమనేబండికి గురుప్రేరణ అనే గీరువేసి లక్ష్యసాధనయనే మార్గాన బయలుదేరుతాడు. ఆధ్యాత్మికలక్ష్యమనే ఉన్నతమైనబాటను ఎక్కడానికి ప్రారంభిస్తాడు. కొంతసేపుకాగానే రెండవగీరు వేస్తే బండి వేగాన్ని పుంజుకుంటుంది. మూడవగీరు వేయగానే, సుగమమైనమార్గములో, సహజమైనవేగములో పరుగెత్తి తన గమ్యస్థానాన్ని చేరుకుంటుంది. ఈ రెండు, మూడుగీర్లు వేసిన తరువాత, మొదటిగీరులో ఇంజనుకు కలిగిన ఒత్తిడితగ్గి సాధారణశక్తియే ఉపయోగించబడుతుంది. అలాగే, అభ్యాసము, వైరాగ్యము ద్వారా పరిపక్వసమాధిని పొందిన శిష్యుడు సహజముగానే, స్వాభావికప్రయత్నములోనే లక్ష్యమును, భగవత్తాదాత్మ్యమును పొందగలుగును. గురువుకడ దీక్షను ప్రారంభించినట్టి శ్రమ ఈ అభ్యాస, వైరాగ్యస్థితులలో కలుగదు. కాని, నాల్గవగీరు వేస్తే బండి తనదారిని వదలి వెనుకకు పయనించి, దారి తప్పినట్లే, కలుషితమైన, హీనమైన ఐహికసుఖాలకై ప్రయత్నించే భావముగల మనుష్యుల జీవితము విపరీతపరిణామాన్ని పొందుతుంది. ఐహిక సుఖభోగలాలసులైనవారికి గురుదీక్ష, అభ్యాసము అనునవి లాభించకపోగా, అట్టివారు సర్వే సర్వత్ర తమ దుశ్చింతలచే శత్రుత్వాన్ని సంపాదించుకుంటారు. వారు ఎల్లప్పుడు సంశయాత్ములై జీవితాన్ని నష్టపరచుకుంటారు.

## రైలుపట్టాలు-శాస్త్రములు

శాస్త్రములు, గురుముఖతః శాస్త్రముల ఉపదేశము అనునవి జీవితానికి రైలుపట్టాల లాంటివి. ఈపట్టాలపై ప్రయాణించినపుడే జీవితము సుఖాంతము, శుభమయము అగును. రైలుబండి నడవడానికి రైలుపట్టాలు ప్రధాన సాధనములు. పట్టాలపై క్రమబద్ధముగా పయనించినపుడే రైలు వాయువేగములో పరుగిడి సరియైన సమయానికి గమ్యము చేరుకుంటుంది. పట్టాలు సరిలేకపోతే బండి ఒక్కఅడుగైన ముందుకు పోజాలదు. అదేవిధంగా, సాధకునికి శాస్త్రములలో సూచించిన కట్టుబాట్లు అనుసరించడం చాలా అవసరము. శాస్త్రములను, గురుబోధలను అవహేళనచేసి, నిర్లక్ష్యముగా, విశృంఖలముగా తిరిగేవానిజీవితము పట్టాలు తప్పిన బండివలె పతనమైపోతుంది. ఎటువంటి హైస్పీడ్ ఆయిల్‌నుపయోగించినను, ఎంత వేగములో పయనించేబండియైనను, పట్టాలు తప్పినపుడు వేగాన్ని కోల్పోడమేగాక, క్రిందబడి అపారనష్టమును ప్రాణహానిని కలిగిస్తుంది. అలాగే, ఎంతటి ధనవంతుడైనా, పదవీభూషణుడైనాగాని, గురుతిరస్కారము, శాస్త్రజ్ఞానమును నిందించుటవలన, నియమములను కట్టుబాట్లను ఉల్లంఘించుటవలన మోక్షగామి

కాలేడు. పైగా పతనావస్థనొంది, అధోగతిపా లౌతాడు.

## దీపకరండిక-ఆత్మజ్యోతి

దీపమును (Torch light)ను చేత ధరించిన వాడు ఎంతటి అంధకారంలోనైనా ముందుకు సాగిపోగలడు. ముందుకు నడిచేకొద్దీ వానిచేత నున్న దీపము ఇంకా ముందుకు వెలుగును ప్రసరింపజేస్తుంది. దారిపొడుగునా ఇలా వెలుగును ప్రసరింపజేసుకుంటూ, అంధకారాన్ని చీల్చుకుని, బాటసారి పయనించి గమ్యస్థానము చేరుకుంటాడు. జ్ఞానమనేది మనుష్యుని కరదీపిక లాంటిది. ఈ జ్ఞానప్రకాశాన్ని ఆశ్రయించి, దానిసహాయముతోనే, మనుష్యుడు జీవితమనే అంధకారమయమగు మార్గాన్ని అధిగమించగలుగుతాడు. భయంకరమైన ప్రతికూలవాతావరణాన్నికూడా తన ఆత్మజ్యోతితో సానుకూలపరచి, ముందుకు సాగుతాడు. జ్ఞానచక్షువులు, చర్మచక్షువులవలెకాక, నిరంతరమూ ఆనందానుభూతినే కలిగిస్తాయి. అజ్ఞాని ఎప్పుడూ ఈసృష్టిని అంధకారమయముగానే భావించి దుఃఖభాజనుడై జీవితములో ఓటమినే పొందును. కాని, ఆత్మజ్ఞానమనేజ్యోతిని పొందిన మహాత్ముడు తన జీవితలక్ష్యాన్ని సులభముగా పొందగలుగుతాడు.

## బకము-కపటము

ఈ ప్రపంచములో ఎవరు సజ్జనులో, ఎవరు దుర్జనులో తెలుసుకోడం చాలాకష్టము. కాని, వారిప్రవర్తన, చేతలనుబట్టి నెమ్మదినెమ్మదిగా వారిస్వభావమును గుర్తింపవచ్చును.

ఇక్కడ కొంగను దృష్టాంతముగా తీసుకోవచ్చును. నీటిలో ఒంటికాలిపై నిలబడి కొంగ తపస్సు చేస్తున్నట్లు నటిస్తుంది. కపటమెరుగని అమాయకమైన చేపలు దాని సమీపంలో గంతులువేస్తూ తిరుగుతాయి. కాని, చేప సమీపించగానే కొంగ దానిని హఠాత్తుగా ముక్కుతోపట్టి, అమాంతం దిగమింగి, మళ్ళీ తపస్సు చేసే భంగిమలో నిలబడుతుంది. ఇదే విధంగా చాలామంది మనుష్యులు సజ్జనులవలె నటిస్తూ, సమీపించిన వారిని మోసగించుతూ ఉంటారు. కొంగలవలెనే ఇట్టివారు శుభ్రమైన దుస్తులు ధరించి పవిత్రత ఉట్టిపడేలా నటిస్తారు. కాని వారి అంతరంగము మలినమై, దురాశలచే నిండియుంటుంది. అట్టివారికి స్వార్థమేగాని, పరలోకభయము, పాపభీతి కలుగదు. కాని, సమయము వచ్చినపుడు సాత్వికమనే ముసుగు తొలగిపోయి వారి స్వార్థమనే భయంకరరూపము గోచరిస్తుంది.

సజ్జనులు-మహాపురుషులు ఎప్పుడూ తమ గొప్పదనాన్ని చాటించుకొనరు. వీరునికి యుద్ధసమయమున డాలు ముందరిభాగమునను, శాంతిసమయమున వీపునను ఉండి రక్షించునట్లే, సత్పురుషులు దుఃఖసమయమునందు ముందు నిలిచి ఆపన్నులనాదుకొందురు. కాని, సుఖసంతోషములలో తాము తెరమరుగున నిలిచి పోవుదురు. తరతమభేదము, శత్రు మిత్రుల విభేదము నెరుగక, ఆపదలో చిక్కుకన్నవారి నెవరినైనను రక్షించుట తమ కర్తవ్యముగా భావింతురు కేవలము భగవత్ప్రీతికై, సత్ప్రేరణతో సర్వజనసుఖాన్ని కాంక్షిస్తారే తప్ప, కీర్తికాముకులై, కొంగజపముచేసి, మోసమనే క్రూరత్వానికి సౌజన్యమనే ముసుగును తగిలించరు.

## శునకము-జాగరూకత

కుక్క జీవకోటియంతటను అతి విశ్వాసము గల జంతువు. తనయజమాని నిదురించు వేళలో కుక్క మేల్కొని యజమాని యింటిని, సంపదలను కాపాడుతుంది. తనయజమాని తిండి పెట్టి

నపుడే ఆకలి తీర్చుకుంటుందిగాని, బలప్రయోగముచేసి భోజనము సంపాదింప ప్రయత్నించదు. కాని, మానవుడు తన యజమానియగు భగవంతుడు ఆత్మరూపమున జాగ్రదవస్థలో నుండగానే, తాను అపచారములు అను నిద్రావస్థనొందుతాడు. ఆత్మకు భగవంతుడు ప్రసాదించిన గృహమే ఈ మానవశరీరము. ఈ శరీరములోనికి కామక్రోధాదిదుర్గుణములనే దొంగలు జొరబడకుండా కాపాడుట దేహియొక్క విధి. బాహ్యసౌఖ్యములందు, ఆడంబరములందు దేహమును రమింపజేసి, హృదయమును అరిషడ్వర్గములకు వశపరచువాడు విశ్వాసఘాతకుడు.

### గుఱ్ఱము-మనస్సుకు కళ్లెము

గుఱ్ఱము మంచిశిక్షణ పొందినదైతే, తన యజమానిని నిరంతరము సేవిస్తుంది. పగలంతయు యజమానిని మోసితిరుగుటయేకాక, రాత్రులందు మరుసటిదినము ఆజ్ఞాపాలనకై నిలిచియుంటుంది. గుఱ్ఱముపై స్వారిచేయువాని చేతిలో కళ్లెమున్నంతవరకూ అది వాని ఆజ్ఞాపాలనచేస్తుంది. అంటే, గుఱ్ఱాన్ని మనుష్యుడు నడిపిస్తున్నాడన్నమాట. ఎప్పుడైతే వాని చేతినుండి కళ్లెము జారిపోతుందో, అప్పుడే వాడు గుఱ్ఱముచే నడిపించబడేవాడౌతాడు. మనుష్యుని మనస్సు గుఱ్ఱములాంటిది. దీనిని వశపరచుకోడానికి వైరాగ్యము, అభ్యాసము లేక సాధనయనే కళ్లెము అవసరము. ఈ సాధన వలన సుశిక్షితమగు గుఱ్ఱమువలె మనస్సు మానవుని అధీనంలోనుండి సత్కార్యములాచరిస్తూ, సత్సాంగత్యమునపేక్షిస్తుంది. మనసు స్వాధీనములేనివారు ఇంద్రియలోలుపులై పతనావస్థనొందుతారు. మనస్సును వశపరచుకొన్నవాడు ఇంద్రియములపైనను నిగ్రహమును సాధించగలుగును.

(హరికిషన్ అగర్‌వాల్ రచించిన సంసార్ కాసార్ అను హిందీపు సకము ఆధారముతో)

## ప్రకృతి వైద్యశాల

28, II మెయిన్‌రోడ్డు, కస్తూర్బా నగర్, అడయారు, మద్రాసు-600020.

ప్రకృతి వైద్యముదృష్ట్యా మానవునిలోగల రోగము ఒక్కటే. అజీర్ణము, అసమీకరణము, అబహిష్కృతము—కారణముచే దేహములో పేరుకొన్న మలినవ్యర్థపదార్థమే ఆరోగము. ఈరోగమునకు చికిత్సకూడ ఒక్కటే. అదేమిటంటే-ప్రకృతిజీవనము, ప్రకృతివైద్యము సహాయముతో దేహమునందలి మలినము నిరుపయోగము అగు పదార్థములను బహిష్కరింపజేయుటయే.

అడయారులోని ఆఱుపడకలుగల ప్రకృతివైద్యశాలలో, బ్లడ్‌ప్రెషర్-డయాబిటిస్-అల్సర్-జాండిస్-ఆస్త్మా-పక్షవాతము-టైఫాయిడ్-డింగో మొదలగు జ్వరములు-మలబద్ధకము మొదలగు వ్యాధులకు చికిత్సచేయబడును.

ఆవిరిస్నానము, మృత్తికస్నానము, సూర్యస్నానము తైల-విద్యుత్ మర్దనములు, ఎనీమా మొదలగువాటికి సదుపాయములు గలవు.

డా॥ జె. రాజ్యలక్ష్మి, కార్యనిర్వాహకురాలు,
ప్రకృతి వైద్యశాల, అడయారు, మద్రాసు-20.

# స్వామి శివానంద

డి. వి. బ్రహ్మాజి

శ్రీ రామకృష్ణపరమహంస వరిసానపెట్టిన పదహారు జాతిరత్నములలోను "మహాపురుష మహారాజ్"గా ఖ్యాతిచెందిన స్వామిశివానంద ఒకరు. మృగేంద్రునివంటి శరీరనిర్మాణము, వెరపునెరుగని స్థిరచిత్తము, దూషణ భూషణ తిరస్కారములకు అతీతమైన ప్రశాంత మనస్తత్వము, శమదమాది షడ్గుణసంపత్తి, నిర్హేతుకజాయమానకరుణ, నిర్వ్యాజపరోపకార స్వభావములు మూర్తీభవించి రూపుగొన్నకారణంగా మన స్వామికి శివానంద నామధేయం అతికినట్లు సరిపోయింది. శివవిశేష లక్షణములయిన పైగుణములను మన స్వామి తన నిజజీవితములో ప్రకటించిన విధానము మనల నాశ్చర్యపరచును. శ్రీరామకృష్ణుల అంతరంగకోటికి చెందినవారిలో శివానంద స్వామి యొకరు.

ఐహికమయినవిషయాలలో శివానందస్వామి అత్యంత నిర్లిప్తమయిన ఉదాసీనవైఖరిని ప్రదర్శించేవారు. తన జన్మతేదీవిషయంలోకూడా స్వామి అదేరకమైన ఉదాసీనవైఖరిని ప్రదర్శించారు. తండ్రిగారు చాలా వివరంగా వ్రాయించి పదిలపరచిన తన జాతకమును, ఆశ్రమస్వీకారంచేసేసమయంలో శివానంద స్వామి గంగానదిలో విసిరివైచి భవబంధ విముక్తులయ్యారు. అందువల్ల స్వామియొక్క జన్మతేదీ ఖచ్చితంగా మనకు తెలియటంలేదు. పరోక్షప్రమాణాలద్వారా, శివానందస్వామి 19వ శతాబ్దం చివరి అర్ధభాగంలో 1850–1860 మధ్య జన్మించియుండవచ్చునని ఊహించడానికి అవకాశం ఉంది. ఆయన జన్మతిథి మాత్రం మార్గశిర బహుళ ఏకాదశి అని నిశ్చయంగా తెలుస్తోంది.

సన్యాసాశ్రమస్వీకారానికిముందు స్వామి పేరు తారకనాథఘోషాల్. ఘోషాల్ కుటుంబము మన దేశంలోని ఇరవైనాల్గు పరగణాల జిల్లాలో బారసత్ గ్రామంలో గౌరవనీయమైన ప్రఖ్యాతిచెందిన కుటుంబము. తారకనాథుని తండ్రిపేరు రామకనాయ్ ఘోషాల్. రామకనాయ్ వృత్తిరీత్యా గొప్పన్యాయవాది, ఆయన జీవిత కీర్తిప్రియుడు, గొప్ప తాంత్రికుడు కూడాను. డిప్యూటీ కలక్టరుగా కూడా రామకనాయ్ కొన్నాళ్లు పనిచేశారు. గురుదేవుల నివాసక్షేత్రమై మహాపుణ్యస్థలముగ రూపొందిన దక్షిణేశ్వరమున కాళీఆలయం నిర్మించిన ధన్యజీవి రాణి రాసమణికి రామకనాయ్ ఘోషాల్ న్యాయసలహాదారుగా ఉంటుండేవారు. ఆ కారణంచేత ఆయన తరచు దక్షిణేశ్వర దేవాలయమునకు వచ్చుచు పోవుచుండెడివారు. అదేరోజులలో శ్రీ గురుదేవులు అత్యంత తీవ్రమయిన కఠోరసాధనలో నిమగ్నమయి ఉన్నారు. రామకనాయ్ గార్కి పరమహంసతో సన్నిహితపరిచయం ఏర్పడింది. శ్రీరామకృష్ణుల దివ్యవ్యక్తిత్వంచేత ఆకర్షితులయిన రామకనాయ్ ఘోషాల్ దక్షిణేశ్వరం వచ్చినపుడల్లా గురుదేవులను కలసి మాట్లాడనిదే పోయెడివారు కాదు. అత్యంతకఠోరమైన ఆధ్యాత్మికసాధనలఫలితంగా శ్రీరామకృష్ణులకు శరీరమంతటా మంటలు బయలుదేరాయి. ఎన్ని చికిత్సలుగావించినా ఆమంటలు తగ్గలేదు. ఏమందులూ పనిచేయలేదు. ఈవిషయం శ్రీగురుదేవులొకపర్యాయము తనను కలసిన రామకనాయ్‌తో ముచ్చటించి, ఆయనకేమైన ఔషధము తెలియునేమో అని వాకబుచేశారు. తంత్రవేత్తయగుటచే రామకనాయ్ శ్రీ రామకృష్ణుల శరీరస్థితి సామాన్యశారీరక రుగ్మత కాదనియు, కఠోరసాధనాచర్యల ఫలితమనియు గుర్తించెను. తన ఇష్టకవచమును చేతియందు ధరింపవలసినదిగా ఆయన శ్రీరామకృష్ణులకు

సంతోషాసంగి, ఈశ్వరుని పేరుగల గన్నేరును పరమహంసకిచ్చెను. రామకనాయ్ చెప్పిన ''చికిత్స''వలన శ్రీగురుదేవులకు త్వరగా ఉపశాంతి చేకూరినది. ఈప్రకారముగా భవరోగ మహాచికిత్సకుడయి భావికాలమున అలరారు శ్రీరామకృష్ణులకు 'చికిత్స' గావించిన రామకనాయ్ ఘోషాల్ పుత్రులు మన తారకనాథ ఘోషాల్.

చిన్ననాటినుండియు తారకనాథునికి ధ్యాన సమాధిస్థితి సహజముగ అభ్యాసమయినది. దృశ్యమానప్రపంచమునకు, అదృశ్యమానమగు ప్రపంచమునకు మధ్యగల పరదాను తొలగింపవలెనని పసితనమునుండి ఆయన ఆశించెడివాడు. తన ఈడుబాలురతో ఆటపాటలుసాగిస్తూ, అంతలోనే హఠాత్తుగా గంభీరముద్రవహించేతారకనాథునివైఖరిని మిత్రులు అర్థం చేసుకోలేక ఆశ్చర్యంతో చూస్తుండేవారు. వీరిచదువు హైస్కూలువిద్యతో ఆగిపోయింది. ఆధ్యాత్మికచింతనగల ఆకాలపు వంగదేశమునందలి ఇతరయువకులమోస్తరుగ తారకనాథుడుకూడ మొదట్లో బ్రహ్మసమాజమతమున కొంతకాలము సభ్యుడుగనున్నాడు. ఆకాలముననే, ప్రఖ్యాత బ్రహ్మసామాజికుడగు కేశవచంద్రసేనుని రచనలమూలంగా శ్రీరామకృష్ణుల దివ్యజీవితంగురించి మన తారకనాథుడు తెలుసుకొనుట జరిగింది.

తారకనాథుడు పెరిగి పెద్దవాడయేసరికి తండ్రిగారిసంపాదన క్రమంగా తగ్గిపోజొచ్చింది. కుటుంబం గడవడమే కష్టంగా తయారయింది. ఏదో ఒక ఉద్యోగంలోజేరి తానుకూడా సంపాదిస్తేనేగాని రోజులుగడవవని తారకనాథుడు గుర్తించాడు. ఉద్యోగప్రయత్నంలో ఆయన ఢిల్లీనగరం వెళ్ళటం జరిగింది. అయితే అక్కడకూడా ఆయన తన మతసాధనలను, ఆధ్యాత్మికచింతనలను వదలక కొనసాగిస్తూ ఉండేవాడు. అక్కడ ప్రసన్నబాబు అను మిత్రునిఇంట్లో గంటలతరబడికొనసాగే ఆధ్యాత్మికసంభాషణలతో తారకనాథుడు సమధికోత్సాహంతో పాల్గొనుచుండెడివాడు. ఈ సంభాషణలలోనే ఒకసారి తారకుడు తనమిత్రుని ''నిజమయిన సమాధిస్థితి ఏమిటి?' అని ప్రశ్నించాడు. దానికి జవాబుగా ''నిజమైన సమాధిస్థితి చాలా అరుదయినసంగతి. అట్టి దివ్యస్థితిని అనుభవపూర్వకముగ వాస్తవముగ తెలిసియున్న ఒకేఒకవ్యక్తి శ్రీరామకృష్ణ పరమహంస'' అని ప్రసన్నబాబు చెపుతూ ఉదాహరణగా శ్రీ గురుదేవుల జీవితసంఘటనలను కొన్నింటిని వర్ణించారు. అప్పటినుండి తారకనాథునిహృదయంలో పరమహంసను చూడవలెనను కోరిక బలంగా నాటుకొంది.

కొంతకాలమయినపిమ్మట తారకనాథుడు కలకత్తాకు తిరిగివచ్చారు. అక్కడ ఒక కంపెనీలో చిన్నఉద్యోగం దొరికింది. బ్రహ్మసమాజ ప్రార్థనలకు పోయివస్తుండే తారకనాథుడు, ఒకసారి రామచంద్రదత్తా చుట్టాలలో ఒకరినుండి పరమహంసగూర్చి సవివరంగా తెల్సుకొన్నారు. ఆరోజులలో తారకనాథుడు రామచంద్రదత్తా ఇంటికి సమీపంగా నివసిస్తుండేవారు. 1880 చివరిలో రామచంద్రదత్తా ఇంటికివచ్చిన శ్రీరామకృష్ణపరమహంసను మొదటిసారిగా తారకనాథుడు దర్శించుట జరిగినది. ఆరోజుసాయంత్రంసమయంలో రామచంద్రదత్తా ఇంటిలో శ్రీ గురుదేవులు అసంపూర్ణ శరీరస్మృతిలోనుండి ప్రసంగిస్తున్నారు. ఇసుకవేస్తేరాలకుండా శ్రోతలు క్రిక్కిరిసి ఉన్నారు. అంతకుపూర్వం చాలకాలమునుండి సమాధిస్థితి అంటే ఏమిటో తెలుసుకోవాలి అనేకతూహలంతో తపించిపోతున్న తారక

నాధుడు ఆరోజున శ్రీ గురుదేవులు అదే విషయంపై ముచ్చటించుచుండుట గ్రహించి ఆశ్చర్యచకితుడయినాడు. ప్రథమవీక్షణము ననే రామకృష్ణులవైపు తారకనాధుడు బలీయముగ ఆకర్షితుడాయెను. తరువాత శనివారము తప్పకుండా దక్షిణేశ్వరముపోయి శ్రీ గురుదేవులను దర్శించిరావలెనని ఆయన ఆనాడు నిశ్చయించుకొనెను.

దక్షిణేశ్వరమునకు దారి తనకు సరిగా తెలియకపోవుటచే, ఒకమిత్రుని వెంటబెట్టుకొని తారకనాధుడు మరుసటిశనివారము దక్షిణేశ్వరము చేరుకొనెను. వారచటకుచేరుసరికి ఆలయమున సాయంసేవలు మొదలుకాబోతున్నాయి. శ్రీరామకృష్ణులను వెదకుకొనుచు తారకనాధుడు శ్రీ గురుదేవులు తనగదిలోకూర్చొనియుండుట గాంచెను. పరమహంసను అచట సందర్శించినంతమాత్రముననే తారకనాధునకు ఆనందపారవశ్యమున ఒడలు తెలియరాకుండెను. తనముందు కూర్చొనియున్నది తన్నుగన్నతల్లియేయని ఆయనకు తోచినది. కుశల ప్రసంగములయినపిమ్మట శ్రీ రామకృష్ణులు తారకునితో "నీవు నన్ను క్రిందటిశనివారం రామచంద్రదత్తాఇంట్లో చూచియుంటివా?" అని ప్రశ్నింపగా "ఔను" అని తారకుడు జవాబిచ్చెను. తర్వాత శ్రీ గురుదేవులు తారకుని "నీవు భగవంతుని సాకారుడని విశ్వసించెదవా? నిరాకారుడని విశ్వసించెదవా?" అని ప్రశ్నింపగా అతడు తాను దైవమును నిరాకారరూపముగనే భావించెదనని బదులు చెప్పెను. దానిపై పరమహంస, "నీవు దివ్యశక్తిని ఉన్నదని ఒప్పుకొనక తప్పదు" అని నొక్కిచెప్పారు. పిమ్మట శ్రీ రామకృష్ణులు కాళీ ఆలయమునకుపోవుచు తనతో రమ్మని తారకునికూడ వెంటపిలిచెను. ఆసమయమున కమనీయమయిన సంగీతధ్వనులమధ్య కాళికాలయమున సాయంకాలపుసేవలు నిర్వహింపబడుచున్నవి. శ్రీ గురుదేవులు దేవాలయము లోపలికిపోయి అమ్మవిగ్రహము ముందట సాష్టాంగనమస్కారముగావించిరి. ఇది చూస్తున్న తారకుడు తానుకూడ అట్లే సాష్టాంగపడవలెననుకొనియు ముందు సందేహించెను. అతని బ్రహ్మసమాజసిద్ధాంతముప్రకారము విగ్రహముఅంటే కేవలం ఒక రాతిబొమ్మ మాత్రమేగదా! అందువల దేవీవిగ్రహం ముందు సాష్టాంగపడుటకు వెనుకాడెను. కాని అంతలోనే అకస్మాత్తుగా అతనికి జ్ఞానోదయం అయింది. "నేను ఇట్లాంటి సంకుచితమయిన అభిప్రాయం ఎందుకు కల్గిఉండాలి? దైవము సర్వాత్మనా విశ్వవ్యాపియై యుండుననిగదా నేను విన్నది. ఇందుగలడందు లేడను సందేహములేక భగవంతుడు అన్నిటా—ఈ విగ్రహమునందుసహితము—ఉండితీరవలెను" అను సత్యం ఆయనకు స్ఫురించింది. వెంటనే దేవీ విగ్రహంఎదుట సాగిలబడి మ్రొక్కాడు తారకనాధుడు. కీలెరిగి వాతబెట్టుట నేర్చిన భవరోగ ఘనవైద్యుడగు శ్రీ గురుదేవులు తానేమియు పలుకకనే శిష్యుని మనస్తత్వమును మార్చిన ఈవిధానము ఆదర్శప్రాయమయినది.

నాటినుండియు తారకుడు తనకు వీలుచిక్కినప్పుడల్లా తరచుగ దక్షిణేశ్వరంవచ్చి శ్రీ రామకృష్ణులను దర్శించిపోయెడివాడు. సాధారణముగా దక్షిణేశ్వరంవచ్చేవారిని ఎవరినికూడా పరమహంస వారివారి వ్యక్తిగతవిషయాలు అంతవివరంగా అడిగి తెలుసుకొనేవారు కాదు. కాని మన తారకనాధునిచూడగనే వారికి అతడు "తనకు చెందినవాడు" అను భావం ఏర్పడి, అతని కుటుంబవిషయాలు వివరంగా అడిగి తెలుసుకున్నారు. రామకనాయ్ ఘోషాల్

కుమారుడే ఈబాలుడని తెలిసికొనిన పరమహంస ఎంతో సంతోషంతో తనకు రామకనాయ్ గావించిన ఉపకారమునుగురించి తారకనాథునితో ముచ్చటించుటయేగాక తానాయనను మరల నొకసారి దక్షిణేశ్వరంలో కలుసుకొన గోరుచున్నానని తారకునికి చెప్పిరి. ఆతర్వాత ఈసంగతి విని రామకనాయ్ అమందానంద కందళితుడై దక్షిణేశ్వరమువచ్చి శ్రీ గురుదేవులకు ప్రణతులర్పించుకొనెను. పరమహంస తనపాదమును ఆయనతలపైనుంచి సమాధినిమగ్నుడయ్యెను. ఆదివ్యస్పర్శవలన పులకితగాత్రుడయిన రామకనాయ్ రామకృష్ణుల పాదములను ఆత్రముతో పట్టుకొని భావావేశపరవశుడై వెక్కివెక్కి ఏడ్చెను.

మూడవసారియో నాలుగవసారియో తారకుడు దక్షిణేశ్వరం వచ్చినపుడతనికి ఒక వినూత్నమయిన అనుభవం కల్గింది. శ్రీ గురుదేవులాతనిని ఒక ఏకాంతప్రదేశానికి గొనిపోయి నాలుక చాపమని తనవ్రేలితో దానిపై ఏదియో వ్రాసినారు. వెన్వెంటనే తారకుడు ఒక అపూర్వ దివ్యానుభూతికి లోనుకావడం జరిగింది. విషయవాసనాదోష దూషితమయిన బాహ్యప్రపంచమంతా మంచులాగా కరగిపోయి మనస్సు అంతర్ముఖం అయిపోయింది. గాఢముగా ధ్యాననిమగ్నుడయిపోయి నిశ్చలముగ కూర్చుండిపోయెను. ఇదేప్రకారము మరియొక పర్యాయముగూడ శ్రీ గురుదేవులు తారకనాథుని అనుగ్రహించియున్నారు. రోజులు గడచినకొద్దియు గురుశిష్యులమధ్య సంబంధము మరింతసన్నిహితముగా దృఢతరంకాజొచ్చింది. తన శిష్యునియందు అంతర్లీనముగ నిద్రాణమై దాగియున్న ఆధ్యాత్మికశక్తులను తన స్పర్శమాత్రమునగాని, వీక్షణాకటాక్షముచేగాని పబోధింపజేయు సర్వసమర్థుడయిన గురువర్యుడుగదా పరమహంస. కాలము గడచుచున్నకొలదియు, తనకు సరియైనమార్గమును చూపగల మార్గదర్శి శ్రీ గురుదేవులుమాత్రమేననియు ఆయనను సమగ్రముగ అర్థము చేసికొనుటయే భగవంతుని తెలిసికొనుట అనియు తారకనాథునకు తెల్లమయినది.

తారకనాథుడీ విధముగా ఆధ్యాత్మికముగ ముందుకు సాగిపోవుచున్నాడు. కాని ఆయన ఇంటిపరిస్థితులుమాత్రం రానురాను దిగజారజొచ్చినవి. అతను చేయుచున్న ఉద్యోగమా చాలా తక్కువది. దానిపైవచ్చు ఆదాయము అంతంతమాత్రమే. తండ్రిగారి సంపాదన పూర్తిగ క్షీణించిపోయినది. పెండ్లి కావలసిన చెల్లెలు ఎదిగియున్నది. చెల్లెలిపెండ్లి జరుగవలెనన్నచో ఆమెను పెండ్లియాడబోవు వరుని కుటుంబములోని కన్యను తారకనాథుడు పెండ్లి చేసుకొనవలెనని నిర్బంధము వచ్చినది. వివాహామునెడ ఎంతటి విముఖతయున్నప్పటికి తన చెల్లెలిపెండ్లి జరుగుటకై తారకనాథుడు మెడలువంచక తప్పలేదు. కాని అతని మనసు మాత్రం విషయవాంఛలయెడ పూర్తిగ పెడమొగమైయుండెను. తన గోడునంతయు నాతడు శ్రీరామకృష్ణులకు విన్నవించుకొనగా, శ్రీ గురుదేవులాతనితో "ఎందుకు భయపడతావు? నీకు సహాయంగ నేనున్నాను. అయితే, నీభార్య జీవించియున్నంతకాలముమాత్రం ఆవిడయొక్క యోగక్షేమములను విచారించుచు ఆమె పోషణభారమును వహించుటమాత్రం నీకు తప్పదు. కొంతకాలముగనుక నీవు ఓరిమి వహిస్తే అంతా ఆ జగన్మాతయే సరిదిద్దుతుంది" అని ఆయనను ఊరార్చారు. గురువర్యుని ఆదేశమును తారకుడు పొదలదాల్చి పాటించెను. పెండ్లి అయినప్పటికినికూడ భార్యతో ఏరకమయిన శారీరకసంబంధమూ

పెట్టుకొనక అస్ఖలితబ్రహ్మచర్యానిష్ఠాగరిష్ఠుడై విరాజిల్లిన అద్భుతమనీషి. తారకనాథుడు. కనుకనే వివేకానందస్వామి ఈయనను 'మహాపురుష మహారాజ్' అని ప్రశంసాపూర్వకంగా పిలుస్తూండేవారు. జగన్మాయలీలలు చిత్రవిచిత్రమయినవిగదా! శ్రీ రామకృష్ణుల ఉపదేశము అనంతరము తారకుని భార్య అట్టే కాలము జీవించనేలేదు. భార్యమరణంతో లౌకికసంబంధం పూర్తిగ తొలగిపోయిన తారకుడు వెంటనే సన్యాసాశ్రమం స్వీకరించి శివా

శ్రీరామకృష్ణపరమహం వివేకానంద స్వామికూడా మన శివానందస్వామిలో గౌతమబుద్ధుని అంశను చూశారు. కర్మకాండకంటెను జ్ఞానమార్గమునందే శివానందస్వామికి మక్కువ యెక్కువ. దైవమును నిరాకారముగనే ఆయన భావించెడివారు. పరమహంస నిర్యాణానంతరము బారానగరు మఠమున ప్రవేశించినభక్తులలో శివానందస్వామి మొదటివారు. కొంత కాలముతర్వాత ఆయన పరివ్రాజకునిగా ఉత్తర భారతదేశంఅంతా పర్యటించారు. వివేకానందుని ఆదేశము మేరకు శివానందస్వామి సింహళదేశమునకు (శ్రీలంక) ఏగి అచట వేదాంతబోధన గావించారు. ఆసమయమున భగవద్గీత, రాజయోగమువిషయాలు రెండింటి మీద స్వామి గావించిన ఉపన్యాసములు, బోధనాతరగతులు మిక్కిలి ప్రసిద్ధికెక్కియున్నాయి.

1899 లో కలకత్తాలో మహాభయంకరమైన ప్లేగుజాడ్యం అంటువ్యాధిగా ప్రబలినపుడు వివేకానందస్వామి పిలుపుమేరకు శివానంద స్వామి కార్యరంగమున నురికి, తన ప్రాణములను సహితము లెక్కచేయక సహాయకకార్యక్రమములకు నాయకత్వంవహించిరోగార్తులను ఆదుకొన్నారు. ఆతరువాత ఆయన కొన్నాళ్ళపాటు హిమాలయపర్వతములలో ధ్యాననిమగ్నులయి కాలంగడిపారు. "ఆల్మోరా"లో వివేకానందస్వామి సూచననునుసరించి (వివేకానందుని మరణంతర్వాత) ఒక మఠమును 1916 లో నెలకొల్పి, తర్వాత తురీయానంద స్వామిసహాయంతో దానిని పూర్తిజేశారు. స్వామి వివేకానంద నిర్యాణమునకుముందు ఆయన తనకు భింగారాజునుండి అందిన రూ. 500 లను శివానందస్వామికొసగి కాశీలో ఒక ఆశ్రమం నెలకొల్పవలసిందిగా కోరారు. అట్లాగే, 1902 లో శివానందస్వామి వారణాశినగరంలో ఒక ఆశ్రమమును నెలకొల్పి ఏడుసంవత్సరాలకాలం తాను అక్కడే గడిపారు. ఎంతసేపూ ధ్యాననిమగ్నులయి ఉండేవారు. ఆశ్రమనిధులన్నీ ఖర్చయిపోయి, మరునాడు ఎట్లా గడుస్తుంది అని ఇతరులంతా ఆందోళనచెందుతూన్నా స్వామి ఏమాత్రం దిగులుపడకుండా దైవధ్యానంలో కాలము గడిపేవారు. అంతా అదే చక్క బడుచుండెడిది. అతిశీతకాలములోకూడా శివానందస్వామి అతి తక్కువ శరీరాచ్ఛాదనతో కాలము గడపుచు, ఒక కర్రబల్లపై నిద్రపోవుచు గడపుచుండెడివారన్నచో శివానందస్వామి శరీరమునందు ఆయనకుగల నిర్లిప్తత విశదంకాగలదు. ఈ ఆశ్రమమునన్న కాలముననే ఆయన "వివేకానందస్వామి చికాగోనగర ఉపన్యాసములను" హిందూస్థానీభాషలోకి అనువదించి సామాన్యజనానికి అందుబాటులోకి తెచ్చారు. అక్కడనుండి 1909 లో బేలూరు మఠమునకు వచ్చిన శివానందస్వామి, 1910 లో తురీయానంద, ప్రేమానందస్వాములతో కలసి అమరనాథక్షేత్రయాత్రకు వెళ్లివచ్చారు. ఈ యాత్ర అనంతరము గ్రహిణీవ్యాధికి గురయిన

శివానందస్వామి ఆనాటినుండి ఆహారవిషయంలో అత్యంతకఠిన పథ్యమును అవలంబించేవారు. ఆహారవిషయంలో స్వామి పాటించిన ఈ కఠిన నియమమే స్వామి దీర్ఘజీవితము వెనుక దాగి యున్న రహస్యము.

1910 లో రామకృష్ణమిషను ఉపాధ్యక్షుడుగ ఎన్నికయిన శివానందస్వామి, ఆతరువాత స్వామి బ్రహ్మానంద నిర్యాణానంతరము, 1922 లో రామకృష్ణమఠమునకు అధ్యక్షులయ్యారు. ఆ హోదాలోనే స్వామి 1924 లోను, 1927 లోను దక్షిణదేశపర్యటనగావించారు, ఆసమయముననే బొంబాయి, నాగపూరు, ఊటీ నగరములలో రామకృష్ణ వ్యవస్థ కేంద్రములకు స్వామి చేతులమీదుగా ప్రారంభోత్సవం జరిగింది. చాలమంది భక్తులు ఈ అవకాశమును వినియోగించుకొని స్వామినుండి ఉపదేశం పొంది ధన్యులయ్యారు. రామకృష్ణమఠమునకు శివానందస్వామి అధ్యక్షునిగనున్న కాలంలో రామకృష్ణవ్యవస్థ కార్యకలాపాలు బ్రహ్మాండముగా విస్తరిల్లి, దేశవిదేశాలలో అనేక కేంద్రములు శాఖోపశాఖలుగా వెలిసి విలసిల్లాయి.

ఏరంగంలో అయినాసరే ఒక మంచిపని జరిగినపుడు దానిని స్వామి హృదయపూర్వకముగ అభినందించేవారు. ఐతే, ప్రతికార్యము వెనుక ఉండవలసిన సదుద్దేశముయొక్క ఆవశ్యకతను ఆయన నొక్కిచెప్పేడివారు. అట్లాగే ప్రతి సత్కార్యము వెనుక తగినంత ఆధ్యాత్మికభావనకూడా ఉన్ననాడే ఆత్మవికాసం పెంపొందుతుందని ఆయన బోధించేవారు. మనం ఎంతటి కష్టపరిస్థితులలో నున్నప్పటికి శ్రీ గురుమహారాజ్ యందుగనుక విశ్వాసం కల్గియుంటే ఆయనే మనలనొకదరికి చేర్చగలరని శివానందస్వామి బోధించేవారు. తమబిడ్డల విషయంలో తల్లి తండ్రులెట్లా ప్రవర్తించాలి అనేవిషయంలో స్వామి ఒసంగిన ఈ సలహా మనఅందరికి ఆచరణయోగ్యమయినది—ఈ విషయంలో శివానందస్వామి తన భక్తునితో "నీపిల్లలను సాక్షాత్తు ఆ భగవంతుని పిల్లలుగ భావించు. ఆ పరమేశ్వరుని సేవకునిగా నిన్ను భావించుకొని, నీయజమాని పిల్లలయెడల ఎట్లా మసలుతావో అట్లాగే నీపిల్లలతో ప్రవర్తించు" అని సలహా ఇచ్చారు.

1930 నుంచి శివానందస్వామి ఆరోగ్యం క్షీణింపసాగింది. శారీరకంగా ఎంతటి అస్వస్థతకు లోనవుతున్నా ఆధ్యాత్మికంగామాత్రం ఆయన అత్యున్నతశిఖరాలను ఆరోజుకారోజు అధిగమిస్తూనే ఉన్నారు. తన అనారోగ్యస్థితిని ఆయన ఏనాడూ ప్రముఖంగా ప్రకటించుకొనేవారుకాదు. "మీ ఆరోగ్యం ఎట్లా ఉంది స్వామీ!" అని ఎవరయినా ప్రశ్నిస్తే "రామనామంమీద ధ్యాస నిలచిఉన్నంతసేపూ జానకికి అంతా బాగానేఉంది" అని జవాబిచ్చేవారు. ఒక్కొక్కసారి ఆయన తన పెంపుడుకుక్కను చూపిస్తూ "వాడిప్రభువు ఇక్కడ (తనను ఉద్దేశించి) ఉన్నాడు" అని బల్కి, వెంటనే తనను చూపిస్తూ, ఒక వేలితో రెండవవ్రేలితో శ్రీ గురుదేవుల మందిరందెస నిర్దేశిస్తూ "వీడు ఆయన పెంపుడుకుక్క" అని ప్రకటించేవారు!!

1933 మేనెలలో రుద్రవాతమునకు గురిఅయిన శివానందస్వామి 1934, ఫిబ్రవరినెల 20 వ తారీఖున మహాసమాధిస్థితిని చేరుకొన్నారు. మానవజాతిసమస్తము జ్ఞానసమ్మేతమై దివ్యగమ్యమువైపు ప్రయాణించు సత్పథములో స్వామి శివానంద జీవితము ఒక ధృవతారగా వెలుగొందుచు మార్గదర్శకమై అలరారుచున్నది.

— —

# కామినీ కాంచనములు

చీమలకొండ ఉమారామలింగమూర్తి

సృష్టిలో అనేకజంతువులు, ఖనిజములు- ఇత్యాదిసంపద ఎంతయోకలదు ప్రతి వస్తువునకు ఏదియో ప్రయోజనము కలదు. మనము ఉపయోగించు తీరునుబట్టి ఆయావస్తువులు లాభనష్టములను చేకూర్చును. కామినీ కాంచనములుకూడ అట్టివే. ఆధ్యాత్మికపురోభివృద్ధికి ఇవి ఆటంకపడునని ప్రతి మతము బోధించును. ఈ ప్రబోధములకుగల ప్రాముఖ్యమును గమనింతము.

మానవుడు సాధించవలసిన పురుషార్థములు ధర్మ, అర్థ, కామ, మోక్షములు. మానవ జీవితములో బ్రహ్మచర్యము (విద్యాభ్యాస కాలము) గార్హస్థ్యము. వానప్రస్థము, సన్న్యాసము అనెడు ఆశ్రమములు కలవు. బ్రహ్మచర్యాశ్రమమందు విద్యాభ్యాసమొనర్చి, ధర్మబద్ధ జీవితమునకు అవసరమగు సంపత్తులను సంపాదించుటయును, తరువాత వివాహమాడి, గృహస్థునిగ జీవితమును గడపుచు అర్థ కామములను సాధించి సత్సంతానమును బడయుటయు, వార్ధక్యమున కుటుంబభారమును తనయులపైనుంచి, వానప్రస్థాశ్రమము స్వీకరించి శమదమాది సంపత్తి, నిత్యానిత్యవస్తువివేకము, ముముక్షుత్వము-వీనిని బడసి, తురీయాశ్రమమగు సన్న్యాసాశ్రమమును స్వీకరించవలయునని మనశాస్త్రములు చెప్పుచున్నవి. ఈ నాలుగు ఆశ్రమములలోను కామినీ కాంచనముల ఆవశ్యకత గృహస్థాశ్రమమునందు మాత్రమే కలదు. అందుచే కామినీ కాంచనములను విడునాడవలెననునది బ్రహ్మచర్య, వానప్రస్థ సన్న్యాసాశ్రమములకు తప్పనిసరి. గృహస్థాశ్రమమునకు ఈరెండును అవసరమే. అయినను, వానియందు వ్యామోహము చూపక, అవి ఎంతవరకు అవసరమో అంతవరకే వానిని అనుభవించవలెననియు, అవసరమునుమించి వానిని అనుభవించుటవలన పురుషార్థములలో చివరిదియగు మోక్షసంపాదనకు అభ్యంతరమనియు, ఈ హెచ్చరికయొక్క ఉద్దేశమని భావించవచ్చును. ధనేషణ, దారేషణ, పుత్రేషణ అనెడు ఈషణత్రయము ఆధ్యాత్మికాభివృద్ధికి ప్రతిబంధకములు. ఏలనన మనలను ప్రపంచమునకు బంధించునవి ఇవియే. ఈబంధమును ఎంతెంతవరకు విడనాడుదుమో, అంతెంత మేర ఆధ్యాత్మికాభివృద్ధి కలుగును. ఏసుక్రీస్తు చెప్పినట్లు 'You cannot serve God and Mammon భగవంతుని సేవకును ధనపిశాచము సేవకును పొసగదు. శ్రీ రామకృష్ణ పరమహంస ఇచ్చిన ఉపమానము ఈవిషయమునే స్పష్టీకరించును. ఒకగదిలో బంగారమును, ప్రక్కగదిలో తస్కరుడును ఉన్నపుడు, ఆ తస్కరుని ఆలోచనయంతయు ఆ బంగారమునెట్లు దొంగిలించగలనా యనియే ఉండును. అందువలన మనదృష్టియంతయు భగవంతునిపై లగ్నము కావలెనన్నచో, మనస్సు మరి దేని చేతను ఆకర్షింపబడరాదు. కావున కామినీ కాంచనములపై ఆకర్షణ తగ్గినగాని, మన దృష్టిని భగవంతునిపై కేంద్రీకరించజాలము. "It is easier for a camel to go through the eye of a needle:than for a richman to enter the kingdom of God. ధనవంతుడు స్వర్గము ప్రవేసించుటకంటె, సూదిబెజ్జముద్వారా ఒంటె పోవుట సులభము'' అనెడు నానుడి ధనవ్యామోహముగలవారికే వర్తించును. అందువలన గృహస్థాశ్రమములోనున్నపుడు కామినీ కాంచనములపై వ్యామోహము చూపరాదని హెచ్చరికలు చేయబడినవి. ఉపనిషత్తులలో పేర్కొనబడిన ఉద్దాలకుడు, యాజ్ఞవల్క్యుడు,

వరుణుడు, జనకుడు - ఇత్యాదులు గృహస్థులైనప్పటికిని కామినీ కాంచనములపై వ్యామోహమును వదలి, గమ్యమగు మోక్షమునకు అవి సాధనములుమాత్రమే యనియు, అవియే మన గమ్యములు కారాదనియు వ్యక్తము చేయ గల్గిరి.

కామినీ కాంచనములందు వ్యామోహము చూపినందువలన ఆధ్యాత్మికగమ్యమును చేర లేకపోవుటయేగాక అధఃపతనము చెందుదు మని తెలియచేయుటకు హిందూవాఙ్మయమున నున్నట్లే పాశ్చాత్యవాఙ్మయమున సుప్రసిద్ధ కవులరచనలు అనేకము గలవు. మానవుని నైతికాభివృద్ధినే ప్రబోధించిన మిల్టన్ అను సుప్రసిద్ధకవి రచించిన Paradise Lost, Samson Agonistes అనెడు పద్యకావ్యములలో మానవుని పతనమునకు స్త్రీవ్యామోహమే కారణ మని వర్ణించినాడు. క్రైస్తవమతానుసారము ఆదిదంపతులగు Adam, Eve దైవాంశసంభూతులై నిర్విచారముగ జీవితమును గడుపు చున్నను, భగవదాజ్ఞను మీరి తినవలదని చెప్పబడినఫలమును Eve (అవ్వ) కోయుటయు, ఆమెయు ఆదాంను ఆఫలమును భక్షించుటయు, అందువలన దైవత్వమునుకోల్పోయి భగవంతు నికి దూరులగుట 'పారడయిసు లాస్టు' నందు వర్ణింపబడినది. అమితమగు బలమును సంపా దించి శత్రుసంహారముచేయుచున్న శాంసన్ శత్రువులపన్నాగమువలన పంపబడిన డేలియా యనెడు స్త్రీయొక్క వలలో చిక్కుబడినట్లును, అతని లోగుట్లను ఆమె గ్రహించి అతనిని శత్రు వులచే జిక్కించుటయు శామ్సన్ ఎగొనిస్టిస్ నందు వర్ణింపబడినది. ఆంగ్లనాటకరచయితలలో అగ్రగణ్యులలో నొకడగు Webster కవి రచించిన The white devil నాటకమునందు విట్టోరియా (Vittoria) అనెడు స్త్రీకి వశుడైన బ్రాషియానో ప్రభువు, ఆమెసలహాపై ఆమె భర్తను తనభార్యను చంపించుటయు, తుట్ట తుదకు వారిద్దరు దుర్మరణము ఎట్లు చెందిరో వర్ణింపబడినది.

మైదాస్ (Midas) అనెడు దురాశాపరుడు అమితమగు బంగారమున్నను తృప్తిచెందక, తాను దేనిని స్పృశించిన అది బంగారము కావలెనను వరమును బడయుటయు, ఆ వర ప్రభావమున స్పృశించినది తడవుగా అతనికి అపారమగు బంగారము లభించుటతోపాటు, గ్రహించబోవు అన్నపానాదులుసైతము బంగారము అగుటతో క్షుత్పిపాసలకు లోనగుటయే కాక, తనను ఓదార్చవచ్చిన ఏకైకకుమార్తెను తాకుటయు, ఆమెకూడ బంగారపు ప్రతిమ అగుటతో అతడు పశ్చాత్తాపపడిన గాథ ఆంగ్ల వాఙ్మయమున కలదు. తరచుగ వార్తాపత్రికలలో ప్రచురింపబడు సంఘటనలను గమనించినపుడు వాఙ్మయములోగల గాథలు అతిశయోక్తికావని గ్రహింతుము. ఏదైనను హత్యకు కారణములను పరిశీలించినచో, అది స్త్రీవ్యామోహమువలనగాని ధనవ్యామోహమువలనగాని, ఈ రెండింటివలననుగాని జరిగినదే యని స్పష్టమగును.

కావున కామినీ కాంచనములందు వ్యామోహమును తగ్గించి, ధర్మమార్గమున, ధర్మబద్ధమగు అర్థమును, ధర్మబద్ధమగు కామమును సాధించుట గృహస్థునికి నింద్యము కాదు. ఈ తీరున ధర్మ, అర్థ, కామములను సాధించి, గృహస్థాశ్రమమును గడపి, క్రమముగా విరాగమునలవరచుకొని, తురీయ పురుషార్థమగు మోక్షమును సాధించుటకు ప్రయత్నించుటయే మనకర్తవ్యము.

# బాలల శారదాదేవి

## బి. ఎస్. ఆర్. ఆంజనేయులు

### జీవారాధనే శివారాధన

రామేశ్వరం ఎంతగొప్పదో కాశీకూడా అంత గొప్పపుణ్యక్షేత్రం. ఇక్కడి దేవుడు కూడా శివుడే. ఆయనను విశ్వేశ్వరుడని, విశ్వనాథుడని అంటారు. వేల సంవత్సరాలనుండి గొప్పగొప్ప సాధువులు, మహాపండితులు కాశీలో వున్నారు. "కాశీలో చనిపోయిన ప్రతివారికి విశ్వనాథుడు ముక్తినిస్తాడు" అని ప్రతీతి. శ్రీ రామకృష్ణదేవుడు కాశీ వచ్చినప్పుడు ఈ సత్యాన్ని ఆయన భావసమాధిలో చూచారు.

మాతృదేవి 1912 వ సం॥ నవంబరులో కాశీవచ్చి రెండున్నరనెలలున్నది. ఆమె వెంట చాలామంది వచ్చారు. ఇదివరకు ఆమె యిక్కడికి రెండుసార్లు వచ్చింది. కాని ఆమె చేసిన ఆఖరుయాత్ర యిదే. మాతృదేవి ఈసారి కాశీలోవున్న గుళ్లు, అక్కడి ముఖ్యస్థలాలు, బౌద్ధులకు ముఖ్యమైన సార్‌నాథ్ మొదలైనవన్నీ దర్శించింది. గంగలో స్నానము చేసింది. చమేలీపురి అనే ఒక గొప్పసాధువునుకూడా దర్శించింది. ఆయనను చూచినతర్వాత యిలా చెప్పింది. "ఈ మహానుభావుణ్ణి చూచినతర్వాత నాకు యింకోసాధువును చూడాలని అనిపించ లేదు". మాతృదేవి ఆయనకు గౌరవసూచనగా ఒక దుప్పటి, కొన్నిపండ్లు. కొంత మిఠాయి పంపింది.

"గుడిలోవున్న దేవుడే మనిషిలోకూడా వున్నాడు. రోగులలో, అనాధలలో యింకా ఎక్కువగా ప్రకాశిస్తాడు. గుళ్లో దేవుణ్ణి పూజించినట్లు మనిషిలో జీవుణ్ణి ఆరాధించాలి. ఎవడు జీవారాధకుడో వాడే శివారాధకుడు" అని వివేకానందస్వామి చెప్పాడు. ఈమాటలు స్వామి జీకి రామకృష్ణదేవుడు బోధించినవే. ఆవిధంగా రోగులకు, అనాధలకు సేవ చేసే రామకృష్ణ మిషన్ సేవాశ్రమం కాశీలో వున్నది. అక్కడి సన్యాసులు ప్రార్థిస్తే మాతృదేవి సేవా శ్రమంతా తిరిగి చూచింది. తర్వాత యిలా చెప్పింది. "గురుదేవుడు యిక్కడ స్వయంగా వున్నారు. అందువల్లనే యీపని జరుగుతున్నది ఇవన్నీ ఆయన పనులే! ఈమాట విన్న తర్వాత ఆ సన్యాసులందరు తాము చేసే సేవాకార్యములు సరిఅయిన పని అని తెలుసుకున్నారు.

బసకు వెళ్ళిన తర్వాత ఆమె ఒక పదిరూపాయలనోటు ఆశ్రమానికి పంపింది. దాన్ని ఎంతో జాగ్రత్తగా యిప్పటికీ దాచిపెట్టారు.

శ్రీ రామకృష్ణదేవుడే సన్యాసుల రూపంలో ఈ పనులన్నీ చేస్తున్నాడు. మాతృదేవి అన్నపూర్ణలాగా ఆ పనులన్నీ సరిగా జరిగేటట్లు చూస్తున్నది.

శివుడు మెలగుచుండు జీవుల రూపుగా
శివుని పూజయగును జీవసేవ
అనెడు గురుని బోధ నాచరణను జూపు
మతము, మిషను నిలపె మాతృదేవి

# శ్రీ రామకృష్ణ మఠ ప్రచురణములు

| గ్రంథము | వెల |
|---|---|
| శ్రీ రామకృష్ణ కథామృతము | 8.00 |
| శ్రీ రామకృష్ణ జీవితచరిత్ర | 10.00 |
| శ్రీ రామకృష్ణ బోధామృతము | 8.00 |
| శ్రీ రామకృష్ణోపనిషత్తు | 3.75 |
| శ్రీ రామకృష్ణపరమహంస నీతికథారత్నములు | 2.50 |
| గురూపదేశములు | 2.00 |
| నా గురుదేవుడు | 1.25 |
| శ్రీ రామకృష్ణ దివ్యవాణి | 1.50 |
| శ్రీ రామకృష్ణ పరమహంస జీవిత సంగ్రహము | 0.75 |
| ఆరాత్రికము మరియు | |
| శ్రీ రామనామ సంకీర్తనము | 0.50 |
| శ్రీ శారదాదేవి జీవిత చరిత్ర | 4.00 |
| శ్రీ శారదాదేవి | 2.50 |
| శ్రీ శారదా సూక్తి నవనీతము | 0.80 |
| శ్రీ వివేకానంద జీవిత చరిత్ర | 4.00 |
| బాలల వివేకానందుడు | 2.00 |
| శ్రీ వివేకానంద సంపూర్ణగ్రంథావళి | |
| 9 సంపుటముల పూర్తిసెట్టు (సాదా) | 55.00 |
| .. .. (క్యాలికో) | 61.00 |
| విడి సంపుటములు ఒక్కొక్కటి (సాదా) | 5.00 |
| .. .. (క్యాలికో) | 6.50 |
| స్వామి శిష్య సంవాదములు | 10.50 |
| సందేశ తరంగిణి (మొదటి భాగము) | 4.00 |
| .. (రెండవ భాగము) | 5.50 |
| భారత .. వజనులారా! | 3.00 |
| ప్రబోధ రత్నాకరము | 3.75 |
| రాజయోగము | 6.25 |
| కర్మయోగము | 4.00 |
| భక్తియోగము | 4.00 |
| శ్రీ వివేకానందలేఖావళి (మొదటిభాగము) | 2.25 |
| .. (రెండవభాగము) | 3.00 |
| హిందూ మతము | 4.00 |

| గ్రంథము | వెల |
|---|---|
| వివేక సూర్యోదయము | 4.00 |
| అనుష్ఠాన వేదాంతము | 2.50 |
| ప్రాచ్యము - పాశ్చాత్యము | 1.25 |
| కులము, సంస్కృతి, సామ్యవాదము | 3.00 |
| భారతదేశము | 2.00 |
| భారతీయ మహిళ | 2.00 |
| నా జీవితము, జీవిత కార్యము | 1.25 |
| శ్రీ రామకృష్ణ సేవాసంస్థ : తదాదర్శములు | 0.50 |
| షికాగో నగరోపన్యాసములు | 1.00 |
| శ్రీ వివేకానంద శంభాషణము | 0.80 |
| నవీన భారత దేశము | 0.40 |
| సర్వం విష్ణుమయం జగత్ | 0.35 |
| శ్రీ వివేకానంద సింహగర్జనలు | 0.20 |
| బ్రహ్మానంద బోధనలు | 4.75 |
| తాపత్రయ చికిత్స | 0.60 |
| ముక్తిమార్గము | 0.30 |
| పారమార్థిక సంభాషణలు | 6.50 |
| నారద భక్తి సూత్రములు | 4.00 |
| శ్రీ దొడ్డ భాగవతము-మూడవ సంపుటము | 7.50 |
| దేవీమాహాత్మ్యము | 4.00 |
| శ్రీ మద్భగవద్గీత | 9.00 |
| శ్రీ మద్భగవద్గీత చిన్నసైజు | 3.00 |
| పారాయణగీత తాత్పర్యసహితము | 8.75 |
| .. మూలము | 2.00 |
| కఠోపనిషత్తు | 2.00 |
| గిరీశచంద్ర | 1.00 |
| భక్తిమార్గము | 1.00 |
| శ్రీకృష్ణవాణి | 0.30 |
| బుద్ధవాణి | 0.80 |
| క్రీస్తు సూక్తిమాల | 0.30 |
| మహమ్మదు సూక్తి మంజరి | 0.30 |
| శ్రీ విష్ణుసహస్రనామ స్తోత్రము | 1.25 |

ఇవియేకాక ఆంగ్ల, సంస్కృత, తమిళ, హిందీ, కన్నడ గ్రంథములును.

వేదాంత కేసరి (ఆంగ్లము) శ్రీ రామకృష్ణ విజయము (తమిళము)

అను మాసపత్రికలును, శ్రీ రామకృష్ణ పరమహంస, శ్రీ శారదాదేవి, శ్రీ వివేకానందస్వామి మున్నగువారి ఛాయాచిత్రములు, త్రివర్ణ చిత్రములు, తైలచిత్రములు మున్నగున వెన్నియో మా యొద్ద లభింప గలవు.

అడ్రెసు : మేనేజరు, శ్రీ రామకృష్ణ మఠము, మైలాపూరు, మద్రాసు - 600 004

సంవత్సర చందా రూ. 12.00 జీవిత చందా రూ. 150 విడి ప్రతి 1.20

# చందాదారులకు - గమనిక

శ్రీ రామకృష్ణప్రభ (ఆధ్యాత్మిక మాసపత్రిక) ప్రతి ఇంగ్లీషునెల మొదటివారములో వెలువడును.

సంవత్సరచందా 12 రూపాయలు.

జీవితచందా 150 రూపాయలు.

జీవితచందాదారులు కాగోరి, ఒక్కసారిగా 150 రూపాయలు చెల్లించలేనివారు, వాయిదాలపై (ప్రతిసారి పదిరూపాయలకు తక్కువగాకుండ) ఒక సంవత్సరకాలములో మొత్తము పైకమును చెల్లించవచ్చును.

జీవితచందాదారులయిన ఐదేండ్ల తరువాత, ఏకారణముచేతనైననూ, చందా రద్దు చేసుకొనగోరువారికి, మొత్తము పైకము వాపసు చేయబడును.

చందాదారులు కాగోరువారు ఏనెలనుండియైనను చందాదారులు కావచ్చును.

చందాపైకమును మనియార్డర్‌ద్వారాగాని, పోస్టల్ ఆర్డర్‌ద్వారాగాని, బ్యాంక్ డ్రాఫ్ట్‌ద్వారాగాని ముందుగానే పంపవలెను.

క్రొత్తగా చందాదారులుగా చేరువారు "క్రొత్త చందాదారుడను" అని తెలియజేయవలసినదిగా మనవి.

చందాదారులయినవారు, తమ చందానంబరును (R. p.................) గుర్తుంచుకొని ఉత్తర ప్రత్యుత్తరములలో దానిని తెలుపవలెను.

(ప్రతినెల పోస్టుద్వారా మీ కందజేయబడు రామకృష్ణప్రభ కవరుపైనుండు మీ విలాసము మీద, మీ చందానంబరు గుర్తింపబడియుండును. గమనించగలరు.)

మీరు వ్రాయు ఉత్తరములందు, M. O. కూపనులందు మీ విలాసమును, చందానంబరును స్పష్టముగా వ్రాయవలసినదిగా మనవి.

మీ అడ్రసు మారినపుడు ఆ క్రొత్త విలాసమును మాకు తెలియజేయగలరు.

ప్రత్యుత్తరమపేక్షించుచు ఉత్తరములు వ్రాయువారు, రిప్లయికార్డుగాని, తగినన్ని స్టాంపులుగాని పంపగలరు.

రామకృష్ణ మఠము, మద్రాసు-4 నుండి వెలువడు అన్ని పుస్తకములధరపై రామకృష్ణ ప్రభ చందాదారులకు 5 % తగ్గింపు కలదు.

మేనేజరు : శ్రీ రామకృష్ణ ప్రభ,

P. B. No. 635, మద్రాసు-600 004.

మద్రాసు బేసిన్‌బ్రిడ్జి రోడ్డులో నిర్మాణమవుతున్న

శ్రీ రామకృష్ణమఠము ప్రాథమికపాఠశాల కొఱకు

# విరాళముల కై విన్నపము

| | | |
|---|---|---|
| స్థాపితము | : | 1906 |
| విద్యార్థుల సంఖ్య | : | 1080 |
| ప్రయోజనము | : | జార్జిటౌను, ఉత్తర మద్రాసులోని బీద విద్యార్థుల ఉపయోగార్థము. |
| బోధనాభాషలు | : | తమిళము, తెలుగు |
| పాఠశాల భవన నిర్మాణ మొత్తపు ఖర్చు | : | రు. 5 లక్షలు |
| ఇంతవరకు అయిన ఖర్చు | : | రు. 2 లక్షలు |
| స్థల విస్తీర్ణము | : | 7 గ్రౌండులు |
| భవన నిర్మాణము పూర్తికాగల కాలము | : | 1980 ఏప్రియల్ |
| భవనములోని ఏర్పాట్లు | : | 12 క్లాసు గదులు, పెద్ద ప్రార్థన మందిరము, ఆట స్థలము, మరుగుదొడ్లు తదితర సౌకర్యములు. |

క్లాసు గదికి, దాతలు రు. 20,000 లు యీయవచ్చును. ప్రార్థన మందిరమునకు, రు. 50,000 లు యీయ వచ్చును. ఆయా గదులలో, దాతల పేర్లు లిఖింపబడును. రు. 5000 లు గాని, పైగాకాని విరాళమునిచ్చు దాతల పేర్లు శాశ్వతమైన పలకపై లిఖింపబడును.

ఈ శుభసమయ జ్ఞాపకార్థము ఒక సోవినీర్‌ను కూడ ప్రచురించుచున్నాము

| | | |
|---|---|---|
| సోవినీర్ వివరణములు | : | సైజు క్రౌన్ 1/4—10″ × 7¼″ (సుమారు) |
| ముద్రణ | : | పేజీ సైజు—8″ × 6″<br>అర పేజీ సైజు—4″ × 6″ |
| ప్రకటన ధరలు | : | అట్ట రెండవవైపు, మూడవవైపు రు. 3000<br>నాల్గవ వైపు (వెనుక వైపు) రు. 5,000<br>పూర్తి పేజీ ప్రకటన రు. 800/- సగముపేజీ రు. 500/- పూర్తిపేజీ రంగులు రు. 1000/- |
| ప్రత్యేక విషయము | : | లలితకళా చిత్తరువుల కొఱకు పేజీలలో స్థలము దానముగా యీయవచ్చును.<br>సగముపేజీ రు. 1000/- పూర్తిపేజీ రు. 2000/- |
| ప్రకటనలు మాకు చేరుటకు కాల పరిమితి | : | 1980 జనవరి 31 వ తేదీ |

విరాళములు బ్యాంకు చెక్కుల ద్వారాకూడా పంపవచ్చును. "శ్రీరామకృష్ణ మఠము, మద్రాసు." అని చెక్కుపై వ్రాయవలెను. ఈ శుభకార్యమునకు మీరిచ్చే విరాళములకు, ఆదాయపుపన్ను విధింపబడదు. ఆదాయపు పన్ను చట్టము—భాగము 80 జిలో మినహాయింపు. (I.T. Act. Sec 80 G)

అధ్యక్షులు

స్వామి తపస్యానంద

# శ్రీ రామకృష్ణ ప్రభ

సంపుటము 36 | 1979 - డిసెంబరు | సంచిక 12

## విషయసూచిక



సూచన: డాక్టర్ ధూళిపాళ శ్రీరామమూర్తి రచించిన 'భాగవతతత్త్వానుసంధానము' అను పెద్దరచనను చేర్చి ఈ సంచికను ప్రత్యేకసంచికగా పాఠకులకు అందించుచున్నాము.

---

## శ్రీ రామకృష్ణప్రభ - చందా వివరములు

రామకృష్ణ ప్రభ చందాపైకమును అనివార్యకారణములచే ఇప్పుడు కొంత పెంచవలసివచ్చినదని చందాదారులకు మనవి చేయుచున్నాము.

| | |
|---|---|
| 1980 జనవరి నుండి సంవత్సరచందా | 12-00 |
| జీవిత చందా | 150-00 |
| విడిప్రతి | 1-20 |

శ్రీ రామకృష్ణమఠము,

మైలాపూర్, మద్రాసు-600-004.

# తిరుమల తిరుపతి దేవస్థానములు, తిరుపతి

## రండి, తిరుమలకు రండి

మానవజాతిని ఉద్ధరించడానికి, భవ బంధాలనుండి విముక్తులను చేయడానికి, శ్రీ మహా విష్ణువే భూమిపైన శ్రీ వేంకటేశ్వరస్వామిగా అవతరించిన పుణ్యస్థలమే పావనమైన తిరుమల కొండలు. ఋషులచేత, మహాయోగులచేత స్తుతింపబడిన స్వామివారి యీ పవిత్ర ప్రాంతము సముద్ర మట్టానికి మూడు వేల అడుగుల ఎత్తున, ఆంధ్ర ప్రదేశానికి చెందిన చిత్తూరు జిల్లాలో వున్నది. సంవత్సరము పొడుగునా చక్కటి వాతావరణతో ఈ ప్రాంతము ఆహ్లాదము గొల్పు చుండును.

తిరుమలను చేరుటకు దగ్గరనున్న రైలు స్టేషను తిరుపతి. భారతదేశము నాల్గువైపుల నుండి తిరుపతికి భక్తులు రైలుమీద రావచ్చును. మద్రాసు, బెంగుళూరు, హైదరాబాద్‌ల నుండి, తిరుపతికి బస్సులు కూడ కలవు.

తెల్లవారుఝామునుంచి, అర్ధ రాత్రివరకు నడపబడే బస్సులు, రెండు కొండ దారుల మీదుగా, మిమ్ములను, తిరుపతి నుండి తిరుమల దేవాలయానికి తీసుకువెడతాయి. భక్తులు ఉదయము 6 గంటలనించి అర్ధరాత్రి 12 గంటలవరకు శ్రీ స్వామివారి దర్శనము చేసుకొన వచ్చును.

తిరుపతిలోనూ, తిరుమల కొండపైన, అన్ని సౌకర్యములతోకూడి వున్న దేవాలయపు ధర్మ సత్రాలు, అద్దె వసతిగృహములు యాత్రికుల వసతికోసం ఏర్పాటు చేయబడి వున్నాయి.

తిరుపతిలో వున్న శ్రీ గోవిందరాజస్వామి, శ్రీ కోదండరామస్వామి, శ్రీ కపిలేశ్వర స్వామి వార్ల దేవాలయాలను, తిరుచానూరు (అలమేలు మంగాపురం)లో నున్న శ్రీ పద్మావతీ అమ్మవారి దేవాలయమును, యాత్రికులు దర్శించవచ్చును.

మంగాపురంలోని శ్రీ వెంకటేశ్వరస్వామి వారి ఆలయము, నారాయణవనములోని శ్రీ కల్యాణ వెంకటేశ్వర స్వామివారి ఆలయము, నాగలాపురంలోని శ్రీ వేదనారాయణ స్వామి వారి ఆలయములు చూడదగిన ముఖ్య పవిత్ర స్థలములు.

స్వామివారికి మీరు చెల్లించే కానుకలు దైవ కార్యాలకు, విద్యాభివృద్ధికి, సాంఘిక సంక్షేమ కార్యాలకు ఉపయోగింపబడతాయి.

మీకు కావలసిన మిగతా వివరాలకు మాకు వ్రాయండి.

ఎగ్జిక్యూటివ్ ఆఫీసరు

తిరుమల తిరుపతి దేవస్థానములు, తిరుపతి.

# ఈశ్వర వన్దన స్తవము

వన్దే శమ్భుముమాపతిం సురగురుం వన్దే జగత్కారణమ్
వన్దే పన్నగభూషణం మృగధరం వన్దే పశూనాం పతిమ్
వన్దే సూర్యశశాఙ్కవహ్నినయనం వన్దే ముకున్దప్రియమ్
వన్దే భక్తజనాశ్రయం చ వరదం వన్దే శివం శఙ్కరమ్

వన్దే సర్వజగద్విహారమతులం వన్దే కరిత్వగ్ధరమ్
వన్దే దేవశిఖామణిం శశినిభం వన్దే హరేర్వల్లభమ్
వన్దే పర్వతకన్యకార్ధవపుషం వన్దే పరం చిన్మయమ్
వన్దే భక్తజనాశ్రయం చ వరదం వన్దే శివం శఙ్కరమ్

వన్దే వ్యోమసభాపతిం నటపతిం వన్దే అర్కదన్తాపహమ్
వన్దే నిర్మలమాదిభూతమనిశం వన్దే మఖధ్వంసినమ్
వన్దే నిత్యమగేన్ద్రజాప్రియకరం వన్దే అతిశాన్తాకృతిమ్
వన్దే భక్తజనాశ్రయం చ వరదం వన్ధే శివం శఙ్కరమ్

వన్దే భూరథమమ్బుజాక్షవిశిఖం వన్దే త్రయీవాజినమ్
వన్దే శైలశరాసనం ఫణిగుణం వన్దే అబ్ధితూణీరకమ్
వన్దే పద్మజసారథిం పురహరం వన్దే మహాభైరవమ్
వన్దే భక్తజనాశ్రయం చ వరదం వన్దే శివం శఙ్కరమ్

వన్దే పఞ్చముఖామ్బుజం త్రిణయనం వన్దే లలాటేక్షణమ్
వన్దే వ్యోమకవచం జటాసుముకుటం వన్దే అబ్జగఙ్గాధరమ్
వన్దే మారహరం త్రిపుణ్డ్రనిటలం వన్దే అష్టమూర్త్యాత్మకమ్
వన్దే భక్తజనాశ్రయం చ వరదం వన్దే శివం శఙ్కరమ్

వన్దే రాజతపర్వతాగ్రనిలయం వన్దే సురాధీశ్వరమ్
వన్దే నిర్గుణమప్రమేయమమలం వన్దే యమద్వేషిణమ్

వన్దే కుణ్డలిరాజకుణ్డలధరం వన్దే సహస్రాననమ్
వన్దే భక్తజనాశ్రయం చ వరదం వన్దే శివం శఙ్కరమ్

వన్దే అనన్తరవిప్రకాశమగుణం వన్దే అన్ధకస్యాన్తకమ్
వన్దే పద్మజ విష్ణుగర్వకులిశం వన్దే దయామ్బోనిధిమ్
వన్దే చిత్సభమీశ్వరం సురనుతం వన్దే త్రిమూర్త్యాత్మకమ్
వన్దే భక్తజనాశ్రయం చ వరదం వన్దే శివం శఙ్కరమ్

వన్దే అపస్మృతిశిక్షకం విషహరం వన్దే మృడం ధూర్జటిమ్
వన్దే విప్రవరైస్సుపూజితపదమ్ వన్దే భవోత్తారకమ్
వన్దే ధర్మముఖార్థదం శ్రుతినుతం వన్దే గురూణాం గురుం
వన్దే భక్తజనాశ్రయం చ వరదం వన్దే శివం శఙ్కరమ్

మతమునుగూర్చి యెన్నడును వాదులాడకుము, మతసంబంధమగు వాదోపవాదములన్నియు పారమార్థికశీలము లేదనియే తెలుపును. మతవివాదములెప్పుడును గుంజునువిడిచి తొక్కకే సంబంధించునట్టివి. పవిత్రతయు పారమార్థికతయు పలాయనమై పోవ హృదయము శుష్కమైయుండునపుడే వివాదములారంభమగును. అంతకుముందు గాదు.

వాదములను లక్ష్యింపకుము, సిద్ధాంతములనుగాని, సంప్రదాయములనుగాని లక్ష్యింపకుము. ప్రతిమానవునందునుగల బ్రహ్మతత్త్వమునందలి సారమగు పారమార్థికతతో పోల్చిచూచినచో ఇవి యెందులకును కొఱగావు. పారమార్థికశీలమెంత వికాసము చెందునో మానవుడంతటి మహిమాన్వితుడై యొప్పును. మొదట దానిని సంపాదింపుము. ఎవ్వనినిగూర్చియు విమర్శింపకుము, ఖండింపకుము; ఏలన, సర్వసిద్ధాంతములందును సర్వమతసంప్రదాయములందును ఏదియో కొంత మేలుండును. మతమనునది-ధర్మమనునది-శబ్దముతోగాని నామములతోగాని సంప్రదాయములతోగాని కూడుకొనియుండునది కాదనియు సాక్షాత్కారమే మతమనియు – ధర్మమనియు – నీజీవితముచే లోకమునకు ప్రకటింపుము.

# స్వామి వివేకానంద I

డి. వి. బ్రహ్మాజి

అది ఒక జనసమ్మర్దమయిన నడిరోడ్డు. సమయం సాయంకాలము. ఉత్సవం నుంచి తిరిగి ఇళ్ళకు మళ్లుతూన్న జనసమూహంతో ఆ రోడ్డంతా క్రిక్కిరిసి మహాకోలాహలంగా ఉంది. అంతలో ఆ రోడ్డు మలుపునుండి శరవేగంతో ఒక గుర్రపుబండి ఆ ప్రజాసందోహం మధ్యకు చొచ్చుకు వచ్చింది. భయభ్రాంతులయిన జనం ప్రాణభీతితో ఎవరకు వారు పరుగులు తీశారు. పాపం, ఒక పసిబాలుడు మాత్రం ఏమి చెయ్యడానికి తోచక భయంతో బొమ్మలాగా రోడ్డు మధ్యనే నిలబడిపోయి ఉన్నాడు. క్షణం ఆలస్యం అయితే ఆ బండిచక్రాల క్రిందపడి ఆ పసిపాపడు పచ్చడి కావలసిందే. ఇంతలో మెరపు మెరసినట్లుగా ఎవరో పరుగెత్తుకొని వచ్చి ఆ పిల్లవాణ్ణి కనురెప్పపాటులో రోడ్డు అవతలి ప్రక్కకు నెట్టుకుపోయాడు. తన ప్రాణాలను సహితం లెక్కచేయకుండా ధైర్యం చేసిన ఈ సాహస విక్రమార్కుడు ఎవరా అని జనం అంతా ఆశ్చర్యపోయి చూచారు. ఆ ప్రాణదాత కూడ ఒక ఆరేడేండ్ల పసిపాపడే అని గ్రహించిన ప్రజలు ఆశ్చర్యంతో నోటమాటరాక నిశ్చేష్టులయి నిలబడిపోయారు. తన భావిజీవితంలో పాశ్చాత్య అనుకరణా వ్యామోహం అనే అశ్వశకట చక్రాల క్రిందపడి భారతీయయువత తన వ్యక్తిత్వమును నాశనం చేసుకోకుండా కాపాడనున్న వివేకానందస్వామియే ఆ బాల విక్రమార్కుడు.

అద్భుతములలోకెల్ల మిక్కిలి అద్భుతావహమయినది వివేకానంద నామధేయము. వివేకానందుడనబడే ఆ మహా వ్యక్తి ఒక మహాసంస్థ. ఆ పేరు వినినంత మాత్రముననే అది మన హృదయతంత్రులను మీటి; "జీవారాధనమే శివారాధనము" అను మనోజ్ఞగీతమును; త్యాగము, సేవ అను మధుర మంజుల రాగాల కలయికతో మేళవించి ఆలాపించే ఒక దివ్యనాదముగా మనకి అనుభూతం అవుతుంది. ఒక మహాశక్తిగా, విస్తృతము విశ్వవ్యాప్తమూ అయిన ఒక మహోద్యమముగా సాగిన ఆయన జీవితం మనందరకు మార్గదర్శకమై అలరారుతూ మనం చేసే కార్యక్రమాలన్నిటిలోను మనకు ఒక ప్రేరణశక్తిగా, ఉత్సాహకేంద్రముగా పనిజేస్తూ మన జీవితాలలో నవోదయం కల్గించే ఒక ఆశాకిరణంగా గోచరిస్తుంది. ఎడారిలో సహితం పూవులు పూయించగలశక్తి, భీరువును సయితం మహావీరునిగా మార్చగల ఉత్తేజము, మందమతిని కూడా కార్యశూరునిగ తీర్చిదిద్దగల దక్షత — అన్నిటిని మించి మనిషి మనిషిగా జీవింపజేయగల మహామంత్రమే వివేకానందనామము. సోదరి నివేదిత మాటలలో "స్వామి దృష్టిలో మునుల గుహలు, దేవాలయాలు ఎట్లాంటివో కర్మాగారాలు. పాఠశాలలు, వ్యవసాయక్షేత్రాలు అన్నీ కూడా అట్లాంటివే. అన్నీ మానవుని దైవంతో కలిపెడివే." కనుక అన్నీ ఆశ్రమాలూ పవిత్రస్థానాలే. ఆయన దివ్యవాణి అంతా "మానవసేవయే మాధవసేవ" అను ఈ విశ్వాసమే కేంద్రబిందువుగా గల వ్యాఖ్యానమే అయివుంది.

కేవలం జపతపాదులతో ఆత్మ మోక్షంకొరకు పాటుపడుట మాత్రమే మతముకాదని, నిజమయిన సన్న్యాసి సాధనలలో నిస్వార్థసేవ కూడ ఒక భాగమేనని ప్రవచించి "మానవసేవయే మాధవసేవ" అని చాటిచెప్పి "ఆత్మనో మోక్షార్థం, జగద్ధితాయ చ" అను నూతన సందేశము నొసంగిన నవ్యహైందవమతప్రవక్తస్వామి వివేకానందుడు. నిర్వీర్యము, నిస్తేజము, నిర్ప్రాణమునయిన జాతిని ఆత్మవిశ్వాసస్ఫోరకములైన తన సింహగర్జనలతో చైతన్యవంతముగావించి, "మరణించిన వ్యక్తులను సహితం మేలుకొల్పి ప్రాణవంతులగావించు" తన మేలుకొలుపుతో జాతిని జాగృతమొనర్చిన నవయుగ వైతాళికుడు స్వామి వివేకానంద. ప్రాచ్య పాశ్చాత్య సంస్కృతులను సమ్మేళనమొనర్చి చక్కని సమన్వయ మార్గమును ప్రసాదించిన క్రాంతిదర్శి మహర్షి వివేకానందుడు.

"ప్రతి తరమూ తనకు అవసరమయిన నాయకత్వాన్ని తానుగా సృష్టించుకొంటుంది." అనే సూత్రానికి ఉదాహరణముగా, అవ్యవస్థిత స్థితిలో దిక్కు తెలియక కొట్టుమిట్టాడుచున్న నవీన భారత జనతకు సరియైనదారి చూపించుటకు అవతరించిన మార్గదర్శకుడు వివేకానందస్వామి. మన దేశీయులే కొందరు విదేశీయసంస్కృతిని కౌగలించుకొని, 'మాకంటే మీరే అన్నిటా అధికులు' అంటూ విదేశ మానసపుత్రులుగా ప్రవర్తిస్తూ భావదాస్యంతో క్రుంగుతూన్నారు. హిందూమతము, భారతీయ సంస్కృతి మొదలంటా నాశనం అయితేనే కాని ఈ దేశం బాగుపడదని; మన ప్రాచీన సంపదనంతా తుడిచి పారవేస్తేనే గాని దేశం ముందుకు సాగదని ప్రవచించే ప్రబుద్ధులు మనలోనే బయలుదేరుతున్నారు. ఇట్టి పరిస్థితులలో — దేశకాలాద్యతీతమగు సనాతన ధర్మమే మన మతమనియు, అది విశ్వజనీనము సార్వకాలీనమునునియు, ప్రవచించి భారదేశ ప్రాచీన ఔన్నత్యమును కన్నులకు కట్టినట్లు అభివర్ణించిన స్వామిపల్కులు మనకవశ్యము పఠనీయములు. భారతదేశమున ప్రతివిషయమునందు, అన్ని రంగములలోను మతమే, మతం ఒక్కటే జీవాధారమని నిర్ద్వంద్వముగా ప్రకటించి, ఈ సనాతన ధర్మమార్గము

గనుక లుప్తమైపోయిన రాజకీయ ఔన్నత్యముగాని, సంఘ సంస్కరణలుగాని ఆర్థికౌన్నత్యముగాని జాతిని మరణము నుండి తప్పింపలేవని ఖండితముగా స్వామి గావించిన హెచ్చరిక ఈనాడు అవశ్యము సమాదరణీయమైయున్నది.

వివేకానందస్వామిని కేవలం ఒక మతప్రవక్తగా మాత్రమే గుర్తించడం మన చేతగానితనానికి మాత్రమే నిదర్శనం అని అనిపించుకుంటుంది. ఒక చిన్న కంతలోనుంచి చూస్తూ దానిగుండా మనకు కన్పించేది మాత్రమే లోకమంతా అనుకొన్నట్లే ఆదీను. మనం మన శక్తిననుసరించి తరచి చూచిన కొలది అంతులేని అనర్ఘ రత్నాలను అందించే అపారసాగరమే స్వామి వివేకానంద చరిత్ర. సరిగా ఆయన జీవితాన్ని అర్థంజేసుకొనేవారికి ఆయన ఒక మతబోధకుడుగా మాత్రమేకాక, ఒక తత్త్వవేత్తగా, నిర్మాణదక్షునిగా, సంఘటిత కార్యశీలునిగా, విద్యావేత్తగా, కవిగా, సంఘసేవకునిగా, సంస్కర్తగా, జాతీయనాయకునిగా, దేశికోత్తమునిగా....అనేక రకాలుగా ఆయన దర్శనం ఇస్తాడు. ఆయన నైజం మధ్యందిన మార్తాండుని వంటిది. తాను జాజ్జ్వల్యమానంగా ప్రకాశించటమేకాక, తన పరిధిలోకి వచ్చినవారినందరిని ప్రభావితులను చేసే విజ్ఞానభాస్కరుడు వివేకానందస్వామి. జ్ఞాన, కర్మ, భక్తియోగములకు సంపూర్ణ సమన్వయ స్వరూపమై, ద్వైతాద్వైత విశిష్టాద్వైతాది సర్వ సిద్ధాంతములకు అపూర్వ సమరసమూర్తియై వెలుగొందు స్వామిజీవితసందేశము ముముక్షువులకేగాక భారతదేశ పునర్నిర్మాణ కర్తలకును మార్గదర్శకమగుచున్నది. శ్రీ రామకృష్ణపరమహంస స్వయముగా ఏరి సానదీర్చిన పదునారు జాతిరత్నములలోను నాయకమణి నరేంద్రనాథుడు.

ఒక విధముగ చూచినచో శ్రీరామకృష్ణ పరమహంస జీవితమును, వివేకానందస్వామి జీవితమును రెండును పరస్పర విభిన్న ధృవములవలె అగుపించును. ఒక నిరుపేద ఛాందస బ్రాహ్మణకుటుంబమున జన్మించినాడు పరమహంస. పుస్తక సంబంధమయిన జ్ఞానం విషయంలో ఆయన పూర్తిగా నిరక్షరాస్యుడే. జననమాదిగా భగవంతుని నమ్ముకొని జీవించిన పరమ భాగవతోత్తముడు శ్రీ గురుదేవులు. ఇక వివేకానందస్వామి విషయం చూస్తే, ఆయన సుసంపన్నకాయస్థ క్షత్రియకుటుంబంలో పుట్టి బాల్యమున అపార భోగభాగ్యములతో తులతూగినాడు. నవీన విద్యావిధానమున అత్యంత ఉత్తమ శిక్షణనంది; పాశ్చాత్య సాహిత్యమును, కళలను, విజ్ఞాన వేదాంతశాస్త్రములను క్షుణ్ణముగ జీర్ణించుకొన్న విద్యావంతుడు స్వామి. బాల్యమాదిగా అసాధారణ ధీశక్తిని, కుశాగ్రబుద్ధి వైభవమును, నాయకత్వ లక్షణములను ప్రకటించిన మేధావి నరేంద్రుడు. కొన్నినాళ్లు భగవంతుడు అసలున్నాడా లేడా అను సంశయస్థితిలో కొట్టుమిట్టాడిన సంశయాళువు వివేకానందు. శ్రీ రామకృష్ణులకు సంపూర్ణముగ ఆత్మసమర్పణ గావించు కొన్న పిమ్మట కూడ గురు శిష్యులమధ్య కొట్టవచ్చినట్లు కన్పించే ఒక భేదమునుగూర్చి స్వామియే ఇట్లొకసారి తెల్పియున్నాడు—"బాహ్యమునకు నా గురువు భక్తాగ్రేసరుడుగ కన్పించినను, ఆంతర్యమున ఆయనవంటి జ్ఞానమూర్తిలేడు. మరి నా విషయం చూస్తే బయటకు నేను ఎంతజ్ఞానిలా కన్పిస్తానో అంతరంగంలో నా హృదయం అంత భక్తిమయం." ఇది వాస్తవముగ జరిగినదేమనగా, స్వభావముచే పరమ వేదాంతియగు వివేకానందుని లోక కల్యాణం కోసమై శ్రీ గురుదేవులు భక్తునిగా తీర్చిదిద్దారు. ఇట్లు పరస్పర భిన్నములుగ కన్పించు గురుశిష్యుల జీవితములు రెండును, నిజానికి, ఒకే నాణెమునకు బొమ్మ, బొరుసువంటివి. ఈ మహనీయుల ఇరువురి కలయిక వలనను భారత ప్రాచీన జాతీయ జీవనరాగమును ఆధునిక భారతీయ జీవనరాగమును మహాద్భుతరీతిని సమ్మేళనము చెంది ఒక అపూర్వరాగమునకు స్వరకల్పన జరిగినది.

పరమహంసను ఆశ్రయించిన పిమ్మట కూడా నరేంద్రుని బుద్ధివైభవం అంత సులువుగా శ్రీరామకృష్ణునికి వశం కాలేదు. శ్రీ గురుదేవులు చెప్పే విషయాలను చాలావాటిని తన బ్రహ్మాండమయిన వాదనా పటిమతోను, తార్కికశక్తితోను కొట్టిపార వేయడానికి నరేంద్రుడు ప్రయత్నిస్తూనే ఉండేవాడు. కాని, చిట్టచివరకు పరమహంస పల్కిన అలతి అలతి పలుకులతో, స్వానుభవపూర్వక నిదర్శితము లయిన ఆయన మాటలతో నరేంద్రునివాదం అంతా పరాస్తం అయిపోయేది. ఇట్లా ఆరు సంవత్సరములపాటు మథనం సాగిన అనంతరం సంపూర్ణసమన్వయం సిద్ధించి, శ్రీ గురుదేవుల పాదారవిందములచెంత వివేకానందుడు సంపూర్ణ ఆత్మార్పణ గావించుకొనుట జరిగింది. పరమహంస ఇక రెండు దినములకు మహాసమాధి చెందుటకు ముందు కూడా నరేంద్రుడిట్లు తనలో సందేహించెను—"ఈయన అనేకమార్లు తాను అవతారమూర్తిని అని ప్రకటించుకొన్నాడుగదా. తీవ్ర వేదనాస్థితిలో దుర్భర శరీరయాతనకు గురి అగుచున్న ఈ అంత్యదశలో కూడా తాను అవతారమూర్తినే అని ఈయన చెప్పగల్గినచో నేను నమ్మగల్గుదును." వెంటనే స్వామి భావములను గ్రహించిన పరమహంస "ఎవడు రాముడో, ఎవడు కృష్ణుడో ఆతడే

ఈ శరీరమున రామకృష్ణుడు.'' అని ప్రకటించి సంశయ విచ్ఛేదనముగావించెను. శ్రీ గురుదేవులు తరచుగ ''వర్తకులు వెండిరూపాయలను మ్రోగించి నాణెము చేసినట్లు నన్ను పూర్తిగ పరీక్షించిననే కాని నా మాటలను నమ్మవద్దు.'' అని శిష్యులను హెచ్చరించుచుండెడివారు. గురువాక్యమును అక్షరాలా పాటించిన ఆదర్శశిష్యుడు స్వామి వివేకానందుడు. ఏ విషయములోనయినను సరే స్వామికి స్వానుభవమే నిశ్చయము. చిట్టచివరకు శ్రీ గురుదేవుల నిజస్వరూపమును అర్థంచేసుకొన్న స్వామి ఆయనను ''అవతార వరిష్ఠాయ రామకృష్ణాయ తే నమః'' అని కీర్తించినాడు. శ్రీ గురుదేవుల విషయంలో తాను అనుభవపూర్వకముగ గ్రహించిన సత్యమును స్వామి ఇట్లు ప్రకటించెను. ''ఆయన పవిత్రుడు మాత్రమేకాదు. పవిత్రతయే శ్రీరామకృష్ణునిగా మూర్తీభవించిరూపుగొన్నది. ఈ విషయం గ్రహించటానికి నాకు ఆరు సంవత్సరాల కాలం పట్టింది.''

నరేంద్రనాథుడు తనను సందర్శించుటకు ముందే అతని విషయంలో శ్రీ గురుదేవులకొక దివ్యదర్శనం గోచరించింది. నిరామయమగు దివ్యలోకంలో తేజోమండలం లోని ఒక భాగం దివ్యమయిన పసిబాలుడుగ మారి సప్తఋషి మండలమునకేగి అందొక ఋషిని తన చిన్నారి చేతులతో పుణుకుచు ''నేను క్రిందికి పోవుచున్నాను. నీవు కూడా నాతో రావాలి'' అని కోరాడు. ఆ మహర్షి తన కటాక్ష వీక్షణమాత్రముచే తన సమ్మతిని సూచించాడు. ఈ దివ్యదర్శనములోని దివ్యశిశువే శ్రీరామకృష్ణుడు, అతని కోరికపై భువికి అవతరించిన మహర్షియే స్వామి వివేకానందుడు.

వివేకానందస్వామిగా విశ్వ విఖ్యాతుడయిన నరేంద్రనాథుని తండ్రి విశ్వనాథదత్తా. విశ్వనాథదత్తా కలకత్తా హైకోర్టునందు పేరుమోసిన ప్రఖ్యాత న్యాయవాది. మరునాడు గురించి చింతింపక ఈనాడు తనకున్న దానిని అడిగిన వారికి లేదనక దానమిచ్చు వదాన్యశేఖరుడు విశ్వనాథుడు. నరేంద్రుని తల్లి పేరు భువనేశ్వరీదేవి. ఆమె విశ్వనాథునకు తగిన యిల్లాలు. నిత్యము రామాయణ, మహాభారతాది పురాణములను భక్తిశ్రద్ధలతో పారాయణముగావించు భక్తితత్పరురాలు భువనేశ్వరీదేవి. వానిలో చాల భాగములు ఆమెకు కంఠపాఠముగ వచ్చియుండెను. ''నీలో ఏ దోషమూ లేనంతవరకు నీవెంతమాత్రం ఎవరికిని భయపడ వలసిన పనిలేదు. నీకు ఏది న్యాయమని, ధర్మమని తోచునో దానిని ఆచరించుటకు వెనుకంజవేయవద్దు'' అని బోధించి నరేంద్రుని మానసికాభ్యుదయమునకు ప్రేరణ కేంద్రముగ నిలచినది తల్లియగు భువనేశ్వరీదేవియే. ''ప్రాణభయము సంభవించిన పరిస్థితులలో కూడ అబద్ధమాడవలదు'' అనియు, ''ఇతరుల అభిప్రాయాలను సాదరముగ గౌరవింపుము, పరుల స్వాతంత్ర్యమును అరికట్టకుము.'' అనియు తన మాతృదేవత ఉగ్గుపాలతో రంగరించి తనకు జీర్ణింపచేసిన ఉపదేశాన్ని నరేంద్రుడు పెరిగి పెద్దవాడయినప్పటికి అక్షరాలా ఆచరణములో అమలు జరిపాడు. అదేవిధముగా తన బాల్యమున ''కంఠస్థము చేయుటయే జ్ఞానసాధన కాదని. విజ్ఞాన సముపార్జనకు ముఖ్యసాధన విమర్శనశక్తికి పదును పెట్టుకొనుటయే''నని తండ్రియగు విశ్వనాథుడు గావించిన బోధనను కూడ నరేంద్రుడెన్నడును మరువలేదు.

తనకు తొలుతకలిగిన సంతానము నలుగురును ఆడపిల్లలే కావడంతో భువనేశ్వరీదేవి మగసంతానంకోసం ఎంతో పరితపించి ప్రతిదినము పరమేశ్వరుని ప్రార్థించెడిది. ఇందుకై కాశీ విశ్వేశ్వరునకు ప్రార్థనా నైవేద్యముల నర్పించుటకూడ గావించెను. ఆమె ప్రార్థనాఫలితముగ మకరసంక్రాంతి పుణ్యతిథినాడు, 1863 వ సంవత్సరం జనవరినెల 12 వ తేది సోమవారమున ఆమెకుదయించిన పుత్రుడే వివేకానందస్వామిగా జగత్ప్రసిద్ధి గాంచెను. వీరేశ్వరవరప్రసాద లబ్ధుడుకావున పిల్లవానికి ''వీరేశ్వరుడు'' అని తల్లితండ్రులు పేరుపెట్టుకొన్నారు. అదే క్రమంగా ''నరేంద్రనాథుడు''గ రూపాంతరం చెందింది. ఈ రెండు పేర్లని పొట్టిచేసి ముద్దుగా 'బిలే' అని 'నరేన్' అని పిల్లవానిని పిలవడం పరిపాటి అయింది.

వంగభాషలోని వర్ణసమామ్నాయమును, ఆంగ్లములో చిన్న చిన్న మాటలను బాలనరేంద్రునకు మొదట నేర్పినది తల్లియగు భువనేశ్వరీదేవియే. అట్లే బాల నరేంద్రునకు రామాయణ భారతాది పురాణ గాథలను విన్పించి చిరుతప్రాయముననే అతని హృదయమున భక్తిబీజములను నాటినదికూడ అతని మాతృమూర్తియే. బాల్యముననే విశేషముగ భగవద్భక్తి అలవడిన నరేంద్రుడు ఎక్కడెక్కడ రామాయణపఠనము జరిగిన అచటకుపోయి భక్తిశ్రద్ధలతో వినుచుండెడివాడు. ఒకసారి రామాయణము చెప్పు పౌరాణికుడొకడు చమత్కారముగా ''హనుమంతుడు అరటి తోటలలో నివసించును.'' అని చెప్పగా దానిని గాఢముగా నమ్మిన నరేంద్రుడు ఒకరాత్రి ఇంటికి దగ్గరలో నున్న అరటి తోటలోనికి పోయి ఆంజనేయునికై అన్వేషించెను. ఎంతసేపు వెదకినను హనుమంతుడు కానరాక ఖిన్నుడై విచారవదనంతో ఇంటికిచేరిన నరేంద్రుని నుండి అసలువిషయం తెలుసుకొన్న తల్లితండ్రులు ''శ్రీరాముడు

ఏదో పనిమీద పంపగా ఆంజనేయుడెచ్చటికో పుంటాడు. ఇంకొకసారి కనిపించునులే.'' అని ఊరడించారు. ఈ విధముగా ఒకరు చెప్పినదానిని గ్రుడ్డిగా నమ్మి ఊరకొనక అందలి నిజానిజములను స్వయముగ పరిశీలించి తెలిసికొను స్వభావము అతనికి నైసర్గిక సహజ గుణమై యున్నది. ఏ విషయమయినా సరే, ఎవరో ఒక మహాపురుషుడు చెప్పినాడన్నంత మాత్రమునగాని, ఏదియో ఒక గ్రంథమున నిర్దేశింపబడినంత మాత్రమున గాని దానిని అనుభవపూర్వకముగా ఋజువుకానిదే నమ్ముట అతని స్వభావమునకే సరిపడదు. తన శిష్యులను కూడ స్వామి ఇదేవిషయమై హెచ్చరించి ''స్వానుభవ పూర్వకముగ పరీక్షించి నిజమారయవలయునేగాని ఒకరు చెప్పారని— నేను చెప్పినదయినాసరే— గ్రుడ్డిగా విశ్వసించవలదు' అని ఉద్బోధించెడివాడు.

విస్తారమయిన శక్తియుక్తులను కల్గియుండి భావి జీవితమున ఒక మహాకార్యమును నిర్వర్తింపవలసియున్న మహానుభావులందరూ తమ బాల్యజీవితంలో అనేక దుడుకు పనులు, కొంటెచర్యలు గావించిన సంఘటనలు మనకు కోకొల్లలుగా కానవస్తాయి. శ్రీకృష్ణపరమాత్మ బాల్య క్రీడలే మనకు ఒక చక్కని ఉదాహరణ. నరేంద్రుడు కూడా బాల్యంలో అనేక అల్లరిపనులుచేసి 'గడుగ్గాయి''గా పేరు తెచ్చుకొన్నవాడే. తల్లిని, అక్కచెల్లెండ్రను ఆరడిపెట్టి వేధించుకొని తినుచు వారి తిట్లనే దీవెనలుగా అందుకొని, పట్టుకొందామని వచ్చిన వారికందక వేసారించెడివాడు బిలే. ''పిల్లడుకాడు వీడు పిశాచయే'' అనునంతగా తల్లిని వేధించిన తుంటరిపిల్లడు బాలనరేంద్రుడు. చిన్నతనం నుంచి కూడా స్వామి జీవితంలో కొట్టవచ్చినట్లు కాన్పించే అంశాలు మూడు. అవి అంతుతరగని శక్తి సామర్థ్యం. బాల్యంలో తుంటరిపనులు చేయడంలో వెలువడిన ఈ అనంత శక్తి సామర్థ్యములే పెద్దవాడయిన నరేంద్రునిలో కార్యదీక్షాదక్షునిగా అభివ్యక్తం అయ్యాయి. ఇంటి ఆవు, కోతి, మేక, నెమలి మొదలయిన జంతువులతో మచ్చికగ ఆటలాడి కాలక్షేపము చేయుట బాలనరేంద్రునికి ఇష్టమయిన క్రీడ. తోడివారితో ఆడు ఆటలన్నిటియందును అతడే నాయకుడు. ఆయన వస్తుతః నాయకుడు కనుకనే శ్రీరామకృష్ణులాయనను తన ఆధ్యాత్మిక సంపదకు వారసునిగ నొనర్చి సోదర బృందమునకు నాయకునిగా నిర్దేశించి వారిని అతనికి వప్పగించుట జరిగినది. చిన్నతనంలో నరేంద్రుడు నిద్రపోయే విధానం చాలా విచిత్రంగా ఉండేది. కనులు మూతలుపడే సమయంలో అతని కనుబొమ్మల మధ్య వివిధ కాంతులతో ఒక దివ్యజ్యోతి కాన్పించి, క్రమక్రమంగా పెరిగి పెద్దదయ్యేది. ఆ కాంతిలో మునిగి అతడు బాహ్యస్మృతిని కోల్పోయేవాడు. ఇదే అతని నిద్రా విధానం. ఈ విధముగ ధ్యానసిద్ధుడయిన నరేంద్రునకు ధ్యానం అనేది బాల్యక్రీడగా అలవడింది.

ఏక సంధాగ్రాహి అయిన నరేంద్రుడు ఏడు సంవత్సరములు నిండకుండనె రామాయణ, భారతాది గ్రంథముల లోని శ్లోకములనేకాక, సంస్కృతములోని ముగ్ధబోధ వ్యాకరణమును సైతము కంఠస్థముగావించి యుండెను. శైశవంనుండి నరేంద్రుడు అసామాన్య ప్రతిభా విశేషములు గల వ్యక్తి అనేది నిర్వివాదాంశం. దానికి తోడు అతనిలో అమితమయిన శ్రద్ధాసక్తులు నిక్షేపమయి వున్నాయి. కనుకనే అతనికి రాని విద్యగాని, నేర్వలేని విద్యగాని లేదు.

1870 సం॥ లో తన ఏడవయేట నరేంద్రుడు ఈశ్వర చంద్ర విద్యాసాగర్ స్థాపించిన పాఠశాలలో మొదటి తరగతిలో చేరాడు. విస్తారముగ పరవళ్లు తొక్కుతున్న ఆయనలోని ఉత్సాహం ఇక్కడ కూడా కుదురుగా ఒకచోట కూర్చోనిచ్చేది కాదు. ఒక ప్రక్క ఉపాధ్యాయుడు పాఠం చెపుతూ ఉండగా నరేంద్రుడది ఒక చెవితో వింటూనే తాను చమత్కారకథలు చెప్పి తోడి బాలురను వినోదింపజేసేవాడు. ఒకే సమయంలో అనేక వ్యాపకాలు నిర్వహించగల దక్షత ఏ కొద్దిమందికో ఉంటుంది. అట్టివారిలో ప్రథమగణ్యుడు నరేంద్రనాథుడు. తాను చెప్పే పాఠం సరిగా పిల్లలు వినటంలేదని గ్రహించిన ఉపాధ్యాయుడు నరేంద్రుని, అతని చుట్టుప్రక్కలనున్న బాలురను నిలబెట్టి ''నేనిపుడు చెబుతున్న పాఠం ఏమిటి'' అని ప్రశ్నించాడు. నరేంద్రుని కథలు వింటున్న తోడి బాలురంతా నోటమాట రాక నిలబడిపోయారు. కథానాయకుడైన నరేంద్రుడు మాత్రం ఉపాధ్యాయుని ప్రశ్నలకు అన్నింటికి సరియైన సమాధానాలిచ్చాడు!! అది చూచి ఉపాధ్యాయుడు మిగిలిన పిల్లలను శిక్షింపబోగా నరేంద్రుడు లేచి నిలబడి ''అసలు మాట్లాడుతున్నది నేనే. మిగిలినవారు నేను చెప్పేది వింటున్నారు.'' అని నిజం చెప్పాడు!!!

ఆటపాటలతోను, వింత వినోదముల ను నరేంద్రుని పాఠశాల చదువు సునాయాసముగ గడచిపోయినది. పాఠములను చదివి ఒప్పగించుటకు అతనికి ఒక్క గంట కాలము కూడ అవసరంలేదు. మిగిలిన కాలమంతను అతడు క్రొత్త క్రొత్త ఆటలు కనిపెట్టి ఆడుటలోను, నాటకములు వేయుటలోను, సాముగరిడి, మల్లయుద్ధము మున్నగు దేహపరిశ్రమలు నేర్చుటలోను వెళ్ళబుచ్చుచుండెడివాడు. నరేంద్రుని జీవితంలో గానవిద్యకు ఒక ప్రత్యేకమయిన

స్థానంవుంది. బాల్యమునుండి సంగీతమనిన నాతనికి ఎంతో మక్కువ. కొంచెం వయస్సువచ్చిన పిమ్మట అతడు అహమ్మద్ ఖాన్, వేణీగుప్త అను ఆనాటి వంగదేశసుప్రసిద్ధ గాయకులవద్ద కొంతకాలము శాస్త్రీయపద్ధతిలో గానవిద్యను నేర్చి గీత, వాద్య సంగీతములందు ప్రావీణ్యత నార్జించెను. వీనుల విందొనర్చు నరేంద్రుని కోమల మంజుల గాత్ర స్వరము వినినంతనే జనులు సమ్మోహన పరవశులగు చుండెడివారు. తొలుదొల్తగా శ్రీ గురుదేవులకు నరేంద్రుని సన్నిహితుని చేసినది. ఈ గానకళా కౌశలమే.

సహజముగ ధీశాలియైన నరేంద్రునియందు వాక్చ మత్కృతి కూడ బాల్యమాదిగ విశేషముగ భాసించినది. తడుముకొనకుండ ఎదుటివాడి నషాళానికి అంటునట్లు సమాధానమీయడంలో అతనికి అతడేసాటి. ఈ నైపుణ్య మునే ఆంగ్లమున Retort అంటారు. ఇట్లా Retort ఈయడంలో స్వామిది అందెవేసిన చెయ్యి. కనుకనే, వాదనాసమయంలో ఎదుటివాడు ఎంతటి వితండవాదానికి దిగినా కొద్ది క్షణాలలోనే స్వామి ముందు నిరుత్తరుడయి విలబడవలసిందే. నరేంద్రుడు విద్యార్థిగా ఉన్నరోజులలో జరిగిన ఈ సంఘటన ఆయన వాక్చమత్కారానికి చక్కని ఉదాహరణ. క్రైస్తవ మత ప్రచారకుడొకడు రోడ్డు ప్రక్కనే జనాన్ని పోగుచేసి మతబోధ గావిస్తున్నాడు. ఉపన్యాసం మధ్యలో ఆ బోధకుడు శ్రోతలనుద్దేశించి "మీరంతా పూజించే రాతిబొమ్మకి నేను నా చేతికర్రతో బడితెపూజ గావిస్తే అది నన్నేంచేస్తుంది?" అని వేళా కోళంగా విగ్రహారాధనను నిరసిస్తూ ప్రశ్నించాడు. అది విన్న నరేంద్రుడు వెంటనే అతనితో "మీ దేవుణ్ణి నేను తిట్టిపోస్తే అతడు నన్నేమి చేయగలడు?" అని ఎదురు ప్రశ్న వేశాడు. అందుకా ప్రచారకుడు "నీవు మరణించిన పిమ్మట నీ పాపమునకు తగిన శిక్ష విధింపబడును." అని జవాబిచ్చాడు. వెంటనే నరేంద్రుడు అతనితో "నీవు చచ్చిన వెనుక మావిగ్రహంకూడా నిన్ను అట్లాగే శిక్షిస్తుంది."అని త్రిప్పికొట్టాడు. ఈ ఎదురుదెబ్బకు తట్టుకొనలేక పాపమా మతబోధకుడు మొగము వ్రేలాడ వేసుకొనవలసివచ్చింది.

విశ్వనాథదత్తా వృత్తిరీత్యా 1877 నుండి 1879 వరకు మధ్యపరగణాలలోని రాయ్‌పూర్‌లో ఉండవలసి వచ్చింది. నరేంద్రుడు కూడ ఈ సమయంలో తండ్రితో వచ్చి రాయ్ పూర్‌లోనే ఉండటంవల్ల ఆతని బడి చదువు రెండేండ్లు ఆగిపోయింది. కాని, ఈ రెండు సంవత్సరాలకాలం నరేంద్రుడు వృథాగా వెళ్ళబుచ్చలేదు. తన తండ్రివద్దకు వచ్చే విద్వన్మిత్రుల గోష్ఠులలో పాల్గొనుచు, గ్రంథపఠనము గావించుచు, నిశితమయిన తన మేధాశక్తికి మరింత పదను పెట్టాడు నరేంద్రుడు. తిరిగి 1879 లో కలకత్తా వచ్చిన నరేంద్రుడు మరల పాఠశాలలో ప్రవేశించెను. మూడు సంవత్సరములపాటు చదివి నేర్వవలసిన విద్యనంతను అతడు సునాయాసముగ ఒక్క సంవత్సరములో అభ్య సించి, తన పదునారవయేట ప్రవేశపరీక్షయందు గణనీయ మగు శ్రేణిలో ఉత్తీర్ణుడై కళాశాలలో జేరెను. ముందుగా "రాష్ట్రీ కళాశాల"లో జేరి, పిమ్మట 'స్కాటిష్ జనరల్ మిషనరిబోర్డు' వారి కళాశాలకు మారెను. అద్భుతమయిన ధారణాశక్తి గల నరేంద్రుడు పరీక్షల సమయానికి ముందు ఏ రెండు మూడు నెలల్లో మాత్రమే తన పాఠ్య పుస్తకా లను తెరచెడివాడు. మిగిలిన సమయం అంతా అన్య గ్రంథములను పఠించి తన బుద్ధిని నిశితమొనర్చుకొనెడి వాడు. పాశ్చాత్య దేశ చరిత్రలను, పశ్చిమదేశ తర్క శాస్త్రములను, ఆంగ్లసాహిత్యమునకు సంబంధించిన పుస్తకములను అతడారోజులలో "చదువక విడచినది గాని, చదివి మరచినదిగాని లేదు" అనుట ఎంత మాత్రము అతిశయోక్తికాదు. గ్రంథపఠనమునందేకాక, అతడు ఈ కాలమున ఉపన్యాసవక్తృత్వమునందు, వ్యాస రచనమునందు కూడ ప్రజ్ఞాపాటవాలను పెంపొందించు కొన్నాడు. తాను వినిన ఏ ఉపన్యాసమునయినా సంక్షేపించి, సవిమర్శకముగ క్రోడీకరించి తిరిగి చెప్పగలశక్తి నాతడు సంపాదించుకొన్నాడు. ఏ విషయముపై రచింపబడిన ఎంతటి గ్రంథమునయినను సరే ఒక్క పర్యాయం ఆద్యంతాలు పరికించినంత మాత్రమున ఆ గ్రంథసారమును తెలుపగల అసాధారణ ప్రజ్ఞా విశేషము ఈ రోజులలోనే ఆయనలో పెంపొందినది.

ఇంతటి అపూర్వ ప్రజ్ఞాపారంగతుడైన నరేంద్రు డన్నచో కళాశాలలోని సర్వులకు-విద్యార్థులకు, ఆచార్యు లకు ఆదరగౌరవాలు కల్గడంలో ఆశ్చర్యం ఏమున్నది? "అద్భుత ప్రతిభాశాలియగు నరేంద్రునివంటి ధీసంపన్నుని మరొకరిని నేనింతవరకు ప్రపంచమున చూచియెరుగను." అని కళాశాల ప్రధానాధ్యాపకుడయిన విలియం హేస్టి మహాశయుడు నరేంద్రుని గురించి వర్ణించియున్నాడు. "ప్రపంచమీతని ప్రతిభను గుర్తించుకాలము వచ్చితీరును." అని ఆనాడే హేస్టి మహాశయుడు చెప్పిన జోస్యము ఆ తర్వాత అక్షరాలా నిజమయింది. నరేంద్రుడిచ్చట కళాశా లలో చదువుకొనే సమయంలో మొదటిసారిగా శ్రీరామ కృష్ణునిగూర్చి వినుట జరిగింది. ఒకనాడు ఐరోపాదేశీయు డయిన ఉపాధ్యాయుడు వారికి ఆంగ్లసాహిత్యపాఠాన్ని బోధిస్తున్నాడు. ప్రఖ్యాత ఆంగ్లకవియైన "వర్డ్సువర్తు" గేయము ఆనాటి పాఠ్యాంశము. అత్యంత ఉదాత్తమయిన

భావనలతో, అలౌకికానుభూతిని నిర్వచిస్తూ సాగిన ఆ కవిత్వం విద్యార్థులకెవరికి సరిగా అర్థంకాలేదు. దానిపై ఆగ్రహావేశం చెందిన ఉపాధ్యాయుడు మధ్యలో తరగతి వదలి వెళ్ళిపోయాడు. సంగతి తెల్సికొన్న కళాశాల ప్రిన్సిపాలు రెవరెండు విలియం హేస్టి వెంటనే విద్యార్థుల కడకువచ్చి వారిని ఈ విధంగా శాంతపరిచాడు—"ఇపుడే మీ ఉపాధ్యాయుడు వచ్చి మీరు 'వర్డ్సువర్తు' మహాకవిని కవిత్వాన్ని అర్థంచేసుకొనలేక పోతున్నారని నాతో చెప్పాడు. ఇందులో మీ లోపం ఏదీలేదు. నాకే ఆ కవిత్వం సరిగా తలకెక్కదు. ఆ మహాకవి ఈ గేయాన్ని తానొక అలౌకిక మయిన అనందపారవశ్య స్థితిలో ఉండగా రచించాడు. ఆ రకమయిన పారవశ్యస్థితి చేకూరవలెనంటే ఏకాగ్ర మనస్తత్వము, హృదయనైర్మల్యము ఉండాలి. ఈ విధమయిన పారవశ్యస్థితి అందుకొనే పూత చరిత్రుడు శ్రీరామకృష్ణపరమహంస అనే అయన దక్షిణేశ్వరంలో నివసిస్తున్నాడు. అలౌకికపరవశత్వం అంటే ఏమిటో చూడాలి అనుకొంటే మీరువోయి ఆయనను చూచిరండి." ఆ తరగతిలోని మిగిలిన విద్యార్థులసంగతి మనకు తెలియదు గాని, వారిలో నరేంద్రనాథుడు మాత్రం అతర్వాత శ్రీరామ కృష్ణ పరమహంసకు ఆత్మార్పణ గావించుకోడం జరిగింది.

తన జీవితమున బాల్యము గడచిపోయి యౌవ్వనం ఆరంభమయింది మొదలుగా నరేంద్రునకు నిద్రించే సమ యంలో రెండు పరస్పర విరుద్ధజీవన దృశ్యాలు స్వప్న గోచరం అయేవి. అందొకటి ఐహిక భోగసుసంపన్న మయిన గృహస్థజీవితము. రెండవది సర్వసంగ పరిత్యాగ పూర్వకమయిన పరివ్రాజక సన్న్యాసజీవితము. జీవితంలో ఐహికమయిన స్వసుఖము, భోగభాగ్యాలు ఆశించినట్లయితే ఆయనకవి కరతలామలకం అయివుండేవే. కాని ఆయనలో అంతర్వాహినిగా ప్రవహిస్తున్న ఒక మహాశక్తి ఆయనను ఆ దారినుంచి తప్పించింది. ఆత్మమోక్షమునకు జగత్కల్యాణమునకును అవతరించిన ఆ మహనీయుని మానసమున ఈ సమయంలో తెలియజెప్పరాని ఒక అసంతృప్తి, మానసిక పరివర్తన కల్గుతూ వచ్చాయి. అంతర్ముఖుడై అంతరంగమథనం సాగించినకొలది అతనికి సాంసారిక జీవనదృశ్యంకన్న పరివ్రాజక దృశ్యమే సుందరతరమై ఆకర్షణీయంగా కన్పించసాగింది. నరేంద్రుని స్వభావమునందు నిద్రాణముగ అంతర్లీనమయి ఉన్న సన్న్యసనాభిరతికి అనుగుణంగా ఇంట్లో అతని పెండ్లి తలంపు వచ్చినప్పుడల్లా ఏదో అవాంతర పరిస్థితి ఏర్పడి ఆ ప్రయత్నం ఆగిపోయేది.

ఆ కాలమున విద్యావంతులయాన యువకులు, ముఖ్యంగా వంగదేశంలోనివారు చాలమంది బ్రహ్మసమాజ మత ప్రభావానికి లోనవుతూ ఉండేవారు. సహజముగ, నరేంద్రనాథుడు కూడ సాధారణ బ్రహ్మసమాజంలో సభ్యుడుగాజేరి సంకీర్తనలలోను, సమాజ ప్రార్థనలలోను పాల్గొనుచుండెడివాడు. సహజముగ మంజులగాత్రముకల్గి, ఆపయిన సంగీతవిద్యను శాస్త్రీయముగ నేర్చినవాడు కావడంవల్ల నరేంద్రనాథునకు తరచుగ సంకీర్తనలకు ఆహ్వానములందెడివి. సురేంద్రనాథమిత్రా అను భక్తుని యింట సంకీర్తనగావింపనేగిన సందర్భముననే మొదటి సారిగ నరేంద్రుడు శ్రీ గురుదేవులను కలసికొనుట జరిగింది. అది 1880 సం॥ నవంబరునెల. నాడు సురేంద్రు నింటికి వచ్చిన శ్రీరామకృష్ణులు నరేంద్రుని మధురగానము నకు వివశులై అతని సమాచారమంతయు వివరంగా అడిగి తెల్సుకొన్నారు. ఒకసారి దక్షిణేశ్వరం రావలసినదిగా పరమహంస నరేంద్రుని కోరినారు. అయితే ఈ విషయాన్ని ఆనాడు నరేంద్రుడంత తీవ్రముగ తీసుకో లేదు. ఏదో యదాలాపముగ జరిగిన సంఘటనగా భావించి ఊరకున్నాడు.

ఇది ఇట్లాఉండగా, నిరీశ్వరవాదభూయిష్ఠమయిన పాశ్చాత్య తత్వశాస్త్ర పఠనమువల్ల, విజ్ఞానశాస్త్ర పరిజ్ఞానం కారణంగా నరేంద్రునిలో భగవంతుని ఉనికిని గూర్చి సంశయభావములకు మధ్య నాతడు విపరీతమయిన సంఘర్ష ణలకు గురియయ్యేను. భగవంతుడున్నాడా లేడా? ఉన్నచో అతనిని చూచుట సాధ్యమా? అను ప్రశ్నలాతని అంత రంగమును నిరంతరము కలవరపెట్ట సాగినవి. ఈ విష యంలో బ్రహ్మసమాజమతం అతనికి ఏ విధమయిన పరిష్కారమార్గమూ సూచింపలేకపోయింది. "దైవ మున్నాడు" అని ఎవరయినా చెప్పినంతమాత్రమున నరేంద్రునకు సరిపోదు. తానుకూడ ఆ దైవాన్ని చూచి తీరాలి- ఇదీ అతని నిశ్చయం. తన సంశయ నివృత్తి కోసం అతడు దేవేంద్రనాథ టాగూరు మొదలయిన వివిధ మత ప్రముఖులను కలసికొని వారిని సూటిగా "మీరు దేవుని చూచితిరా?" అని నిలబెట్టి ప్రశ్నించసాగాడు. ఎందర్ని ప్రశ్నించినా అతనికి సమాధానం లభింపనేలేదు. చివరకి "అసలు భగవంతుడనేవాణ్ని చూచినవ్యక్తి ఎవర యినా నిజంగా ఉండటం సాధ్యమేనా?" అనే సందేహం ఆయనను బాధింపసాగింది. ఈ ప్రకారంగ దైవదర్శనా కాంక్షచే పరితపించుచున్న నరేంద్రునకు హఠాత్తుగ తాను ఇదివరలో సురేంద్రనాథమిత్రా ఇంట్లో చూచిన శ్రీరామ కృష్ణ పరమహంస సంగతి గుర్తుకువచ్చింది. తన ప్రశ్నను ఆయనను కూడ అడిగి చూడవలెనని నరేంద్రుడు

సంకల్పించుకొనెను. దీనికితోడు నరేంద్రుని బంధువగు రామచంద్రదత్తా అతనితో "పరమార్థమే నీకు కావలసి యున్నచో నీవు అచటకు నిచటకు తిరుగుటకన్న దక్షిణేశ్వరమువోయి శ్రీరామకృష్ణులను చూచుటమేలు." అని ప్రోత్సహించెను. వెంటనే కొందరు మిత్రులతో కలిసి నరేంద్రుడు దక్షిణేశ్వరమునకు ప్రయాణమై పోయెను.

ఆ సమయంలో నరేంద్రునకు తన శరీరవిషయమైగాని, దుస్తులవిషయమైగాని ఎంతమాత్రము లక్ష్యము లేకుండెను. అంతర్నిమగ్నమయిన దృక్కులతో "యోగినేత్రములతో" ఆతడు పరమహంసను చేరెను. శ్రీ గురుదేవులాతనిని ఆదరపూర్వకముగా ఆహ్వానించి కూర్చుండమని చెప్పి సంకీర్తనమొనరింపవలసినదిగ కోరినారు వెంటనే నరేంద్రుడు తన మంజులగళమెత్తి,

"మన్ చలో నిజనికేతనే, సంసారవిదేశే।
విదేశీర్ వేషే భ్రమ కేనో అకారణే...॥"

[మనసా! స్వస్థానమునకు వెడలుదము రమ్ము. నీదికాని, విదేశమయిన ఈ సంసారంలో పరుడవై ఏల తిరుగాడు చుండెదవు.] అను గీతమును గానమొనర్చెను. నరేంద్రుని కీర్తనవిని విన్నంతనె పరమహంస సమాధి నిమగ్నుడయి పోయెను. ఆ తర్వాత ఆయన నరేంద్రుని ఒక ఏకాంత ప్రదేశానికి పిల్చుకొనిపోయి "ఎన్నాళ్ళకు వచ్చావునాయనా. ఇంతకాలం నీ కోసం నిరీక్షించి నిరీక్షించి నేనెంత వెత చెందానో, నన్నింత బాధించుట తగునా!" అనుచు శ్రీకృష్ణ దర్శనార్థము గోపికలు విలపించినట్లు వివశుడై విలపించెను. పైగా అతనియెదుట బద్ధాంజలియై శ్రీ గురుదేవులాతనితో "నీవు నరనారాయణమూర్తివి" అని వచించెను. శ్రీ రామకృష్ణుల మాటలు, చేష్టలు నరేంద్రునకు ఆశ్చర్యం కల్గించాయి. "నిజంగా ఇతడొక దివ్యపురుషుడా! లేక ఒక పిచ్చివాడా!" అనే సందేహం కూడా అతనికి కల్గింది. "ఇతడేనా పరమహంస!" అని సంశయిస్తూనే, నరేంద్రుడు మెల్లగా ఆయనను సమీపించి తానిదివరలో అందర్ని అడిగినట్లే "మీరు దేవుని చూచితిరా!" అని సూటిగ ప్రశ్నించెను. వెన్వెంటనే ప్రశ్నకు సమాధానం లభించింది. "ఔను నిన్నెట్లా చూస్తున్నానో అట్లాగే భగవంతుణ్ణి కూడా నేను చూస్తున్నాను. ఇంతకంటె వేయిరెట్లు స్పష్టతరంగ నేను భగవానుని చూడగల్గుతున్నాను." అని పరమహంస జవాబిచ్చారు. భగవంతుని సాక్షాత్కారమునకై నిజముగా దైవదర్శనకోసం విలపించినవారికి భగవంతుడు ప్రత్యక్షమయితీరునని ఆయన నొక్కి చెప్పారు. సాక్షాత్కారమే, స్వానుభవమే మతమని ఇంత నిశ్చయముగా, నిర్ద్వంద్వముగా, సంశయ లేశమునకు తావులేక పల్కిన అనుభవసిద్ధుని గాంచినందులకు నరేంద్రుని హృదయం ఆనందపరవశమయిపోయింది. శ్రీ గురుదేవులు పల్కిన పల్కులన్నీ స్వానుభవపూర్వక నిదర్శనములేనని అతనికి స్పష్టమయింది. అయినప్పటికీ, తనకు నమస్కరించి తనను సాక్షాత్తు నరనారాయణ స్వరూపునిగ వర్ణించడం మొదలయిన ఆయన చర్యలు మాత్రం అతనికి అర్థంకాలేదు. అందువల్ల మొదట్లో ఆయన "పిచ్చివాడా" అని కూడా నరేంద్రుడు సందేహించడం జరిగింది. కాని, ఏదియో అపూర్వ మధురాకర్షణ మాత్రం తనను ప్రబలంగా ఆయన దెసకు లాగుతున్నట్లు నరేంద్రుడు భావించాడు. ఆ "పిచ్చి బ్రాహ్మణుడు" తన హృదయాంతరాళపు లోతుల స్పృశించినట్లుగా నరేంద్రుడు అనుభూతి చెందజొచ్చాడు. ఆయనలోని నిష్కాపట్యము, సరళవిశుద్ధజీవనము, ఋజుభాషణములను పరికించినకొద్దీ ఆయనపై నరేంద్రునకు మహోన్నతమయిన ఆదర గౌరవాలు కల్గేటట్లుచేశాయి. "ఈయన పిచ్చివాడేఅగుగాక, అట్లనకున్నా కూడా ఈయన త్యాగశీలం అనితర సాధ్యమయింది. కేవలం త్యాగశీలం కారణంగా ఈ మహానుభావుడు నిజమయిన సాధువు అనిపించుకొని సమస్త మానవకోటికి అర్చనీయుడగుచున్నాడు"- అని అను కొంటూ నరేంద్రుడాయనకు వందనమాచరించి సెలవు దీసుకొనెను. తిరిగిపాటోయే ముందు శ్రీగురుదేవులాతనికి స్వయముగా కొన్ని మధురపదార్థాలను తిన్పించి "మరల త్వరలోనే నీవు ఇక్కడికి రావాలి సుమా. ఈసారి వచ్చే టపుడు నీవు ఒక్కడివే ఒంటరిగా రావాలి." అని నరేంద్రునితో మరల మరల చెప్పుచూ తాను "అట్లాగే వచ్చెదను" అను వాగ్దానం అతనినుండి తీసుకొన్నారు. నరేంద్రుడు తిరిగి వచ్చేశాడు. ఒక నెలకాలం గడిచి పోయింది. శ్రీ గురుదేవులను తాను ప్రథమంగా దర్శనం గావించుకోవడంవల్ల తానేవిధంగా ప్రభావితమయింది. నరేంద్రుడే ఇట్లా తెలియజేశాడు :—

"మొదటిసారిగా 'దైవమును చూచాను.' అన్నవ్యక్తిని కల్సుకొన్నాను. మతం అనేది- స్వయంగా అనుభవించి తెల్సుకోవలసిన సత్యమని, లౌకికప్రపంచంకన్న గాఢముగా అనుభవించదగినదని మొదటిసారిగా స్వానుభవపూర్వకంగా ప్రవచించిన వ్యక్తిని కలసుకొన్నాను."

(పై సంచికలో, స్వామి వివేకానంద II)

# సప్త మహాపాతకములు

(The seven deadly sins)

చీమలకొండ ఉమా రామలింగమూర్తి

జాగ్రదవస్థ యందున్నప్పుడు మనము ఏదియో పనిని చేయుచునే ఉందుము. అందు కొన్ని చేయతగినవి; కొన్ని చేయరానివి. చేయరాని పనిని చేయుటయే పాపమనబడును. చేయవలసిన పనిని చేయకపోవుటయు పాపమే. ఈ దిగువవానిని అపరాధములని చెప్పెదరు :- 1. అకృత్యకరణము (చేయకూడని పనులు చేయుట), 2. కృత్యాకరణము (చేయవలసిన పనులను మానివేయుట), 3. అభక్ష్య భక్షణము (తినకూడని పదార్థములను తినుట), 4. అపేయపానము (త్రాగకూడని పానీయములను త్రాగుట), 5. అగమ్యాగమనము (పొందదగని స్త్రీలను పొందుట). ఈ తీరుననే దురహంకారము, అర్థలోభము, కామము, వైమనస్యము, కోపము, సోమరితనము, అనిష్టకరమైన స్వేచ్ఛ - అను ఏడింటిని పాప సప్తకమందురు. అసత్యోక్తి, దోషారోపణశక్తి, కఠినోక్తి, నిష్ఫలోక్తి, చౌర్యకరణము, దుష్కార్యకరణము, దుష్కార్యాపేక్ష, పరభార్యాపేక్ష, జీవహింస - అను పదింటిని పాపదశకమని చెప్పుదురు.

ఘోరమైన పాపములను పాతకములనియు, ఘోరమైన పాతకములను మహాపాతకములనియు అందురు. స్వర్ణస్తేయము సురాపానము, భ్రూణహత్య, గురుపత్నీ గమనము, ఈ నాలుగు మహాపాతకములనొనర్చినవారితో స్నేహము చేయుట - అను ఈ ఐదింటిని పంచమహాపాతకములని హిందూవాఙ్మయమున చెప్పబడినది. భగవదంశయగు మన ఆత్మ వీనివలన మలినసహితమగుననియు, అదియే సంసార బంధమునకు కారణమనియు, ఆత్మను మలినరహితముగ చేయుటవలననే బంధవిముక్తి కలుగుననియు, అదియే మోక్షమనియు మన శాస్త్రములు చెప్పుచున్నవి.

ఆంగ్ల వాఙ్మయమున వర్ణింపబడిన మహాపాతకములను గమనింపుడు. ఆంగ్ల భాషలో స్పెన్సరు కవి, తాను రచించిన 'ఫెయిరీక్వీన్' అను పద్యకావ్యమునందు సప్త మహాపాతకములను విశదీకరించినాడు. ఆంగ్ల నాటక రచయితలలో ప్రథముడగు మార్లో, తాను రచించిన 'డాక్టరు ఫాస్టస్' నాటకమునకూడ ఈ సప్తమహాపాతకములనే పేర్కొనెను. గర్వము (Pride), సోమరితనము (Sloth), తిండిపోతుతనము (Gluttony), వ్యభిచారము (Lechery), దురాశ (Greed), కోపము (Wrath), ఈర్ష్య (Envy), అను ఏడింటిని సప్త మహాపాతకములని వారిరువురు చెప్పిరి. భగవంతుడు పరిపూర్ణ లక్షణములుగల వ్యక్తి అనియు, అదే తీరున ఆయన బిడ్డలమగు మనముకూడ సల్లక్షణములనే కల్గియుండవలెననియు (Be ye perfect as God in Heaven is perfect) క్రైస్తవుల పరిశుద్ధగ్రంథము బైబిల్ బోధించుచున్నది. అట్టి ఉన్నత స్థితిని చేరుటకు కొన్ని ప్రమాణములు (Standards) నిర్ణయింపబడినవనియు, వానిని అతిక్రమించుటయే పాపమనియు క్రైస్తవులు చెప్పెదరు. ఇట్టి ప్రమాణములు బైబిల్‌నందు అచ్చటచ్చట గలవు. వీనినే భగవదాజ్ఞలు (Commandments) అని వారు చెప్పెదరు. హిందూ వాఙ్మయము ప్రకారము మోక్షము గమ్యమైయుండగా, భగవంతునివలె పరిపూర్ణ లక్షణములు కలిగియుండవలెననుట క్రైస్తవ మతముయొక్క గమ్యమైయున్నది. వీనిని

సమన్వయించినచో పశుతుల్యులుగ జన్మించిన మనము క్రమక్రమముగ పురోభివృద్ధి సాధించి అత్యున్నతస్థితిని చేరుటయే యని చెప్పవచ్చును. ఈ ప్రయత్నమునకు ఆటంకములైనవానినే పాపములనిగాని, పాతకములనిగాని, మహాపాతకములనిగాని వివిధ భాషా వాఙ్మయములందు చెప్పబడినవి. ఈ సప్త మహాపాతకములును ఒకదానిపై నొకటి ఆధారపడియుండును. తిండిపోతుతనము, సోమరితనము, వ్యభిచారము – ఈ మూడింటికి సన్నిహిత సంబంధము కలదు అటులనే గర్వము దురాశ, ఈర్ష్య, కోపము – ఈ నాల్గింటికి దగ్గర సంబంధము కలదు. ఈ దృష్ట్యా వీని వలన కల్గు అనర్థములను, ఆధ్యాత్మికోన్నతికి అవి ఎట్లు ప్రతిబంధకములగునదియు పరిశీలింపుదు.

తిండిపోతుతనమనగా మితిమీరి తినుట; ఎంత తిన్నను సంతృప్తి చెందకుండుట జిహ్వాచాపల్యముగల మనుజుని దృష్టియంతయు ఆహారమును గూర్చియే ఉండును. అతడు ఆహారముల రుచినే పరిగణించునుగాని, అవి శరీరమునకు కలుగచేయు ఫలితములనుగూర్చి ఆలోచించడు. బ్రతుకుట తినుటకే (live to eat) అనెడు ధ్యేయమేగాని, తినుట బ్రతుకుటకు మాత్రమే (eat to live) అనెడు వివేకము ఉండదు. ఆధ్యాత్మికోన్నతికిని ఆహారమునకును గల సంబంధము హిందూ వాఙ్మయముననే హెచ్చుగ కలదు. ఆహారపదార్థములు సాత్త్విక, రాజస, తామసములను మూడు రకములని భగవద్గీత విపులీకరించినది. ఆధ్యాత్మికోన్నతికి సాత్త్వికాహారమే సహాయకారియనియు రాజస, తామస ఆహారములు విరోధములనియు చెప్పబడినది. అంతేగాక మితాహారముయొక్క ఆవశ్యకతనుగూర్చి కూడ భగవద్గీత వర్ణించినది. శాస్త్రములు ఈ తీరున చెప్పుచున్నను జిహ్వాచాపల్యమువలన రాజస, తామస ఆహారములనే మితిమీరి గైకొనినచో, ఆధ్యాత్మిక పతనము తప్పదు. జంతుసంబంధమైన ఆహారములును, సుగంధద్రవ్యముల నుపయోగించి పచనము చేయబడిన ఆహారములును ఉత్తేజకరములుగాన వానివలన రాజస తామస గుణములు వృద్ధియగును. వివేకానందుడు నుడివినట్లు Why is the Lion in the cage so fierce? Why is the goat or lamb so very mild? Much depends on the food we take. సింహము క్రూరస్వభావము కల్గియుండుటకును ఆహార స్వభావమే చాలవరకు కారణము.

ఆధ్యాత్మికోన్నతి మాట అటుండనిమ్ము. రాజస, తామస ఆహారములవలన దుష్టస్వభావము ప్రబలుటతోపాటు, మనస్సు స్వాధీనము తప్పి, దుర్గుణములు అలవడును. వీనివలన జననేంద్రియములకు ఉత్తేజము కల్గుటచే, సంతానోత్పత్తి కొరకు మాత్రమే ప్రకృతి ఏర్పాటుచేయబడిన అవయవములను విలాసము కొరకు దుర్వినియోగపరచుటచే జంతువులలో అగ్రస్థానమునకు చెందిన మనుజుడు – నియమిత కాలములందే ఈ కృత్యముల నొనర్చు పశుపక్ష్యాదులవలెగాక యథేచ్ఛగా ప్రవర్తించు మనుజుడు – జంతువులలో అధమ స్థానము చేరుట స్వయంకృతాపరాధమే కదా! బైబిల్ నందు చెప్పబడిన ఈ దిగువ భగవదాజ్ఞలను గుర్తుంచుకొనవలసియున్నది. "Neither shalt thou commit adultery" నీవు వ్యభిచారము చేయకుము. Neither shalt thou desire thy neighbour's wife నీ పొరుగువానిభార్య నపేక్షింపకుము."

తిండిపోతుతనమువలన కల్గు ఇతర దుష్ఫలితములను పరిశీలింపుము. భోజనము ఉదాత్త

మైనపుడు భుక్తాయాసమువలన మానసికపని కుంటుపడుట అనుభవైకవిషయమే. ఎల్లప్పుడు ఉదాత్తముగ భుజించు తిండిపోతు ఎల్లప్పుడు సోమరిగనే ఉండవలసినదే. ఎప్పుడు చేయవలసిన పనిని అప్పుడు చేయలేక వాయిదా వేయుచుండుటవలన జీవితమును సార్థకపరచుకొనుట సాధ్యముకాదు. సోమరియొక్క మెదడు దురాలోచనలకు ఆలవాలమగును (Idle man's brain is the devil's work shop). కర్మాగారములో పనిచేయు వ్యక్తులు దయ్యములే అయినచో, అందు ఉత్పత్తియగు వస్తువులు అన్నియు ప్రమాదకరమైనవేగాన సోమరిపోతుయొక్క మెదడు దయ్యముల కర్మాగారమగును. ఈ తీరున తిండిపోతుతనము, వ్యభిచారము సోమరితనము దగ్గర సంబంధము కల్గియున్నవి.

ధనము, విద్య, వంశము, రూపము, బలము-ఇత్యాది లౌకిక సంపదలు మనలో కలిగించు పరిణామములు ఈ దిగువ పద్యమునందు చెప్పబడినవి.

ధనమును, విద్యయు, వంశం
బును దుర్మదులకు మదంబు పొనరించు స
జ్జను లయిన వారి కడకవ
యును గీర్తియు నవియే తెచ్చు నుర్వీనాథా

అయితే అట్టి సజ్జనులసంఖ్య బహుస్వల్పము. ఈ సంపదలలో ఏది ఒకటియున్నను విర్రవీగువారే తరచుగ కాన్పింతురు. తనకంటె తక్కువ సంపద గలవారిని చులకనగ చూచుటయు, తానే అధికుడనని భావించుటయు గర్వము (మదము) అనబడును. కులమదము, ధనమదము, బలమదము, విద్యామదము, రూపమదము, యౌవనమదము, రాజ్యమదము, తపోమదము – ఈ యెనిమిదింటిని అష్టమదములందురు. వీనివలన ఆత్మస్తుతి (తనను తాను పొగడుకొనుట), పరనింద (ఇతరులను నిందించుట) అలవడును. ఈ తీరున అహంకారము వృద్ధియగును. అహంకారము నశించినగాని పురోభివృద్ధి ఉండదు.

దేవుని ఉనికియందు నమ్మకముగలవారందరు ఏ మతమునకు చెందినవారైనను భగవత్కృపను (Divine grace) అపేక్షింతురు అయితే దానిని బడయుటకు కొన్ని అర్హతలు చెప్పబడినవి. ఈ క్రింది భాగవత శ్లోకమును పరిశీలింపుడు.

జన్మ కర్మ వయో రూప విద్యైశ్వర్య ధనాదిభిః
యద్యస్య న భవేత్ స్తంభః తత్రయం మదనుగ్రహః

తా॥ పుట్టుక, వృత్తి, యౌవనము, విద్య, ఐశ్వర్యము, ధనాదులు ఎవరియందు గర్వమును కలుగచేయవో అతడే నా (భగవంతుని) అనుగ్రహమునకు పాత్రుడు.

కావున గర్వము లేకుండిననే భగవత్కృపకు అర్హులమగుదుము. గర్వమువలన అధఃపతనము తప్పదు. (Pride goes before a fall).

పైన పేర్కొనబడిన లౌకిక సంపదలలో తనకంటె ఎక్కువ స్థాయిలోనున్న వారినిచూచి ఓర్వలేకపోవుట తటస్థించును. దీనినే ఈర్ష్య యందురు. 'పరులకొంప కూలవలె – తన ఇల్లు నిండవలె' 'ఒకరికి లేకపోవలెను – తనకు ఉండవలెను'. 'తా బ్రతకవలెను – ఒరుడు చావవలెను', 'ఒరులు చెడవలెను – తాను సుఖముగ నుండవలెను'. ఇట్టి కోరికలనే వాంఛించుట ఈర్ష్యాలక్షణములు. బైబిలులో చెప్పబడిన 'Love thy neighbour as thy self నీ పొరుగువారిని నీవలెనే ప్రేమింపుము.' అనెడు సూక్తిరత్నమునకు ఈర్ష్య వ్యతిరేకమే కదా! ఇట్టి చెడ్డ కోరికలు ఒకవేళ ఫలించినచో ఇంకను దురాశ బయలుదేరును. బైబిల్‌లో

నుదహరింపబడిన పదియాజ్ఞలు (Ten Commandments) లో దురాశకు సంబంధించిన వానిని చూతుడు. Neither shalt thou steal (నీవు దొంగతనము చేయరాదు). (Neither shslt thou covet thy neighbour's house, his field, or his man-servant or maid servant, his ox, or his ass or anything that is thy neighbour's (నీ పొరుగువాని ఇంటినిగాని, పొలమునుగాని, నౌకరునుగాని, జంతువునుగాని–మరి దేనిని వాంఛింపకుము.)

నీ కోరికలు ఫలించనిచో, అందులకు కారణమైన వారిపై కోపము ఉదయించును. క్రోధము యొక్క ఫలితము ఈ దిగువ శ్లోకములో వర్ణింపబడినది.

క్రోధో హిః శత్రుః ప్రథమో నరాణాం
దేహ స్థితో దేహ వినాశనాయ
యథాస్థితః కాష్ఠ గతో హి వహ్నిః
స ఏవ వహ్నిర్దహతే శరీరమ్.

తా॥ కట్టెయందు ఇమిడియున్న నిప్పు కట్టెనే కాల్చు చందమున దేహమునందుండు కోపము దేహమునే నాశనము చేయును. కావున క్రోధము మనుష్యులకు మొదటి శత్రువు అందువలననే అరిషడ్వర్గములో (కామ, క్రోధ, లోభ, మోహ, మద, మాత్సర్యము) ఇది చేర్చబడినది.

సప్త మహాపాతకముల బారినుండి తప్పించుకొనుటకు యీ దిగువ సూచనలు చేయబడినవి. సాత్వికాహారమును మితముగ భుజించుట వలన తిండిపోతుతనమును, దానికి సన్నిహితములగు సోమరితనమును వ్యభిచారమును దరికి రావు. కులగోత్రములనునవి పరమాత్మకే లేనపుడు, ఆత్మస్వరూపులగు మనకు అవి ఆధిక్యతను కల్గింపవని గ్రహించుటవలన కుల మదము పోవును. తనను మించిన ధనవంతులున్నారని గ్రహించుటవలన ధనమదము పోవును. తన మనస్సు శాంతి దమాదులు పొందినయెడల బలమదమణగును. విద్య అబ్బుట సరస్వతీ కటాక్షమని తలచినయెడల విద్యామదము అణగును. వృద్ధులను చూచి తనకు ఎప్పటికైనను రానున్న రూపము ఇట్లుండునని తలచినయెడల రూపమదము పోవును. దేహమునకు శిశు, బాల, యౌవన కౌమార, జర అవస్థలను తలచినచో యౌవన మదము అణగును. రాజ్యముగాని అధికారముగాని దైవకృపవలననే లభించును అనియు, అవి ప్రజాసేవకేననియు తలచినచో రాజ్యమద మణగును. సద్గురు కటాక్షమునను దైవకృప వలనను తపస్సు తనకు ప్రాప్తించినదని తలచిన యెడల తపోమదము అణగును. ఈ తీరున గర్వమును దరికి చేరనీయనిచో దానికి సన్నిహితమగు దురాశ, ఈర్ష్య, కోపము నశించును.

అందువలన పశుతుల్యులుగ జన్మించిన మనము వివేక విజ్ఞానములు సంపాదించి మానవులుగ పరిణతిచెంది లౌకిక సంపదలతో బద్ధులముగాక మానవాతీతమగు దైవీగుణములు గలవారిగను, చిట్టచివరకు భగవదంశను సాక్షాత్కరింపచేయునట్టి స్థితికి ప్రయత్నము కొనసాగించువారిగను ఉండుటయే మన ధ్యేయమై ఉండవలెను. ఈ సందర్భమున ఈ దిగువ పద్యము గమనార్హము.

Manlike it is to fall into sin
Fiend like it is to dwell therein
Christ like it is for sin to grieve
God like it is all sin to leave

తా॥ తప్పుచేయుట మానవ స్వభావము. తప్పని తెలిసిన తరువాతకూడ తప్పునే చేయు చుండుట దయ్యము స్వభావము. చేసిన తప్పునకు పశ్చాత్తాపపడుట భక్తుని లక్షణము.

తప్పును చేయకుండుట దైవగుణమే యగును.

తెలిసియో తెలియకయో తప్పుచేసి యుందుము. ఇది గమనించిన తరువాత, తప్పునకు పశ్చాత్తాపపడి, తప్పును చేయకుండుట ఉత్తమ లక్షణము. పశ్చాత్తాపమునుగూర్చి ఏసుక్రీస్తు చెప్పిన సూక్తి మరువరానిది.

Joy shall be in heaven over one sinner that repenteth more than over ninetynine just persons which need no repentance.

దీని భావమును ఇట్లు చెప్పవచ్చును. సన్మార్గమున ప్రవర్తించుచు భగవంతుని కృపను బడయుట సహజమే. ఒకచో చెడు మార్గమున ప్రవర్తించినను పశ్చాత్తాపము చెంది, తన తప్పును సరిదిద్దుకొని భగవత్కృపకు పాత్రుడగుటయే విశేషము. మందలోని గొఱ్ఱెలనుచూచి గొఱ్ఱెలకాపరి ఆనందించుట సహజమే. అందుండి తప్పిపోయి మరల దొరికిన గొఱ్ఱెను కనుగొని అతడు పొందు ఆనందము అంతకంటె అధికము. హిందూ వాఙ్మయమునగల అజామీళుని వృత్తాంతము కూడ ఈ సూక్తినే బోధించును. కావున చెడు మార్గమున ప్రవర్తించియుండినను, పశ్చాత్తాపము చెంది, ఆ తప్పును మరల చేయకుండుట వలనకూడ భగవత్కృపను పొందగల్గుదుమను టలో సందియము లేదు.

---

## ఆకాశం నా గురువు

—బద్వేలి రమేష్

నా జీవిత పుస్తకం
నే చదువుతూంటే
అంతా కొత్తగా వుంది
ఏంత కథలా వుంది
ఒక్కొక్క పేజీలో
ఒక్కొక్క భావం
తరంగ రీతిలా తాకి
ఊపేస్తున్నాయ్ నన్ను
పెక్కు భావాలు
నాగుండెమీద
కోలాట మాడుతూంటే
నూలుపోగు చందమైన హృది
ఎక్కడ పుటుక్కుమనునోనని
ఈ రంగుల వల పుస్తకాన్ని
మూసేద్దామా; వద్దాని
సంశయాల గజిబిజిలో
కూరుకు పోతున్న తరుణంలో
విన్నాను ఒకపాట

* * *

కాడగవంటి జీవితం
దానిపై రంగుల మరకలు
ఈరవంతకే నీకెందుకు జిగీష?
నాటక్కో ఒక్కు విరుచుకొనే
అద్భుత అందాలు చూడు
మినుకు మినుకు తారలు
అందమైన మేఘాలు
చందమామల సోయగాలు
కిరణమాలి రాగాలు
ఎంతెంతో సౌందర్యం
పులుము కొన్న నేను గర్విస్తున్నానా?
తారల తళుకులో
వీఆశల సరిగంచు కొంచమంటున్నా
కరిగి పోతున్న మేఘంలో
త్యాగవీణ గానం వినమంటున్నా
నా సౌందర్యంలో కొంచు సందేశాలు
నాకులేని జిగీష నీకెందుకు?
నేను పాడు పాటను
నువ్వు పాడవెందుకు?

* * *

నిర్మలమైన ఆకాశం
విన్పించిన పాటలో
ఆ భావాల ఝరిలో
నాజీవితం ఆనందనృత్యం
ఆ భావాల కొలనులో
నాజీవితం ఆనందకమలం

# స్మృతి కథ

మూలం: స్వామి అఖండానంద        అనువాదం: శ్రీమతి తురగా జానకీరాణి

(క్రిందటి సంచిక తరువాయి)

## దక్షిణేశ్వర్‌లో అనుభవాలు

కలకత్తా వెళ్ళాలంటే, శ్రీరామకృష్ణులు 'బేణీపాల్' అనే ఆయనగారి రెండో తరగతి కిరాయిబండీలో వెళ్ళేవారు. గుర్రబ్బగ్గీ మనిషి, గుర్రాలను చెర్నాకులతో అదిలిస్తే, "నన్ను కొడుతున్నాడు" అని అలజడితో అరచేవారాయన. ఇది విన్న బేణీపాల్, మంచి బలం, జవంగల గుర్రాలనే బగ్గీకి కట్టి, వాటిని అదలించే అవసరం లేకుండా చేశాడు. ఒకసారి శ్రీరామకృష్ణులవెంట నేనూ, లాటూ, కలకత్తాకి వెళ్ళాము. బాగ్ బజారువీధికి వెళ్ళగానే, బగ్గీమనిషిని ఆగమని, నావేపు చూచి "నువ్వెళ్ళి నారాయణని పిల్చుకొస్తావా?" అన్నారు. అప్పుడప్పుడు వారిని చూడ్డానికి వచ్చే అబ్బాయి నారాయణ. అతణ్ణి బండీ దగ్గరకు పిల్చుకుని వచ్చాను. దక్షిణేశ్వర్ యిన్ని రోజులుగా ఎందుకు రాలేదని అడిగి, త్వరగా రా అని చెప్పారు గురూజీ. ఆ తర్వాత నేపాల్ రాయబారి విశ్వనాథఉపాధ్యాయ యింటికి వెళ్లాము. ఆయన్ని 'కేప్టెన్' అని పిలిచేవారు శ్రీరామకృష్ణులు. అందరం పైకి వెళ్ళాము. వారి కుటుంబ సభ్యులు అభివాదము చేశారు గురువుగారికి. తనకి చాలా ఇష్టమైన ఐస్‌నీరు త్రాగారువారు. అక్కణ్ణుంచి బలరాం బోస్ యింటికి వెళ్ళి, దక్షిణేశ్వర్‌కు తిరిగి వచ్చాము. ఎప్పుడూ రాత్రుళ్లు దక్షిణేశ్వర్‌లో తప్ప ఎక్కడా వుండేవారు కాదు. ఒకటి రెండు సందర్భాల్లో మాత్రం బలరాంబోస్ యింట్లో వున్నారు. ఒకసారి స్వామీ వివేకానంద అన్నారు నాతో—"వండిన పదార్థాల్ని బలరామ్ యింట్లో తప్పితే మరెక్కడా తినరు గురూజీ. అక్కడ శుచిగా వుంటుందని వారికి తెలుసు" అని.

ఆ రోజుల్లో, కాళికాలయంలో ప్రతి మధ్యాహ్నం రెండువందల యాభై, మూడు వందలమంది సాధువులకి, యాత్రికులకి, పేదవారికీ సుష్టుపూర్తిగా భోజనం పెట్టేవారు. దక్షిణేశ్వర్‌కు అనేక మతాలకు చెందిన మహా వ్యక్తులు వచ్చి, ఆ పవిత్ర స్థలంలో ప్రశాంత జీవితం గడుపుతుండేవారు. శ్రీరామకృష్ణులు అక్కడ వున్నప్పుడు, ఆ ప్రదేశం యావత్తూ స్వర్గతుల్యమైన పవిత్ర వాతావరణంతో స్పందిస్తూవుండేది. అక్కడికి వచ్చే అనేక మంది యతులు. గురువర్యుల దివ్యసన్నిధిన కూర్చొని, ఆయన భక్త్యావేశ పూరితమైన ఉపదేశాలను వింటుండేవారు. యతులెవరైనా దక్షిణేశ్వర్‌కు రాగానే, వారి ఆశీస్సులు పొందమని మమ్మల్ని, శ్రీరామకృష్ణులు వారివద్దకు పంపుతుండేవారు.

ఒకసారి కొందరు అద్వైతులవెంట నేను శ్రీరామకృష్ణులదగ్గరికి వెళ్ళాను. "ఆర్యా, మేము కాశీనుంచి భక్తులను వెంటపెట్టుకొని వచ్చాము" అన్నాడు వారిలోని ప్రముఖుడు.

"అల్లాగా? ఐతే, నేనే భగవంతుడను (అహం బ్రహ్మాస్మి) అనేవారిని తీసుకుని వచ్చారన్నమాట." అన్నారు. వారిని ప్రేమగా ఆహ్వానించి కూర్చోపెట్టుకున్నారు.

ఒకడు అడిగాడు, "ఆర్యా, యావద్విశ్వవ్యాప్తియై, తానే పరబ్రహ్మ అయిన దైవము మనిషిగా ఎలా అవతారము ఎత్తుతాడు?" అని.

"వినండి. బ్రహ్మ సర్వసాక్షి. సర్వము

తానే నిండివున్నాడు. ఆతని శక్తి స్వరూపమే ఒక దివ్యావతారము. ఒకచోట ఆ శక్తి సగభాగమే అవతరించి వుండవచ్చు. మరొకచోట ఆ శక్తి పావుభాగమే అవతరించివుండవచ్చు. ఏదో ఒక తావునగానీ సంపూర్ణ శక్తి ఆవిర్భవించదు. ఈ విధమైన సంపూర్ణ శక్తి సమన్వితుడైనవాడు శ్రీకృష్ణునివలె పూర్ణ బ్రహ్మ. దైవశక్తి మూడు వంతులే స్వరూపము దాల్చింది శ్రీరామునిలో." అన్నారు శ్రీ రామకృష్ణులు.

ఇది విని ఒకాయన, "స్వామీ, యీ శరీరము సకల దుష్టత్వాలకూ మూలం. దీనినే నాశనము చేసివేస్తే, అన్ని బాధలూ తొలగిపోతాయి" అన్నాడు.

"పచ్చికుండలు విరిగిపోతే, తిరిగి వాటిని కుండలుగా చెయ్యవచ్చు. కానీ కాలినకుండలు, ఒకసారి పగిలిపోతే, తిరిగి చేయలేము. ఆత్మజ్ఞానము పొందని మునుపే యీ శరీరాన్ని నాశనముచేస్తే, నువ్వు పునర్జన్మ ఎత్తి అదే ఫలితాలన్నిటినీ అనుభవించవలసివస్తుంది." అని చెప్పారు గురువర్యులు.

"కానీ స్వామీ, ఎందుకు మనుష్యుడు తన శరీరాన్ని గురించి యింత శ్రద్ధ తీసుకుంటాడు?" అని ఒక అభ్యంతరం చెప్పారొకరు.

"ఒక ఆకారం చేసేవాడు, దానికి కావలసిన మూసను ఆకారం తయారయ్యేవరకు జాగ్రత్తగా వుంచుతాడు. స్వరూపం తయారైన తర్వాత, మూసని వుంచినా, పారేసినా ఫరవాలేదు. అల్లాగే యీ శరీరంకూడా. మనుష్యుడు పరమాత్మను తెలుసుకోవాలి, ఆత్మజ్ఞానాన్ని పొందాలి. ఆ తర్వాత యీ శరీరం వుండవచ్చు, లేదా పోవచ్చు. అంతవరకూ యీ శరీరం గురించి శ్రద్ధతీసుకోవలసిందే". అని గురువర్యులు చెప్పాక, ఆ వ్యక్తి మారు మాటాడలేదు.

ఆ తర్వాత శ్రీరామకృష్ణులు కొన్ని భక్తిగీతాలు పాడారు. జగన్మాతను ఉద్దేశించిన ఆ గీతాలు ఆయనకెంతో యిష్టం. అక్కడున్న వారిలో ఒకాయనకు కళ్ళనిండా నీరునిండింది. ఇది చూసి శ్రీరామకృష్ణులు పరమానందభరితులైనారు. "అగ్నిలోపడిన ఆజ్యమువలె కాస్సేపు వీరిల్లాగే మాట్లాడుతారు. ఆ తర్వాత వారు శాంతించి వూరుకుంటారు." అన్నారు.

సుదీర్ఘ చర్చానంతరం, వారు లేచారు. మేమంతా దేవాలయాలను దర్శించి, ఉద్యానవనంలో తిరిగాము. ఆ వచ్చినవారిలో గదాశంకర్ అనే అతడు, కేశవచంద్రసేన్ అనుచరుడు. ఇతనితో, తూర్పు వసారాలో కూర్చున్నప్పుడు శ్రీ రామకృష్ణులు మాట్లాడారు. అప్పుడు నేనూ అక్కడే వున్నాను.

"నువ్వు బ్రాహ్మణ విధులను పాటిస్తావా?" అనడిగారు గురూజీ.

"నాకీ ఆచారవిధులన్నీ నచ్చవు." అన్నాడతను.

"చూడు బలవంతంగా ఏ ఆచారాన్నీ విడనాడకు. సొరపాదు పువ్వులూ, గుమ్మడిపూలూ గిల్లావనుకో, వాటి కాయలు చెడిపోతాయి. కాయలు ముదరగానే, వాటి చివరనున్న పూలు సహజంగానే రాలిపోతాయి. నువ్వు సాకారుడైన దైవాన్ని నమ్ముతావా లేక నిరాకారుడైన వానినా?" అని అడిగారు స్వామీజీ.

"నిరాకారుడైన వానినే" అని అతని జవాబు.

"ఒక్కసారిగా నీకు స్వరూపరహితుడైన వాని భావన ఎల్లా సాధ్యమవుతుంది? విలుకాండ్రు బాణాలు వేయడం నేర్చుకునేటప్పుడు

ముందుగా ఒక అరటిబోదెను గురిగా పెట్టు కుంటారు. ఆ తర్వాత సన్నపాటి చెట్టునూ, ఆ తర్వాత పండునీ, ఆ పిమ్మట ఆకులనీ, చిట్ట చివరిగా ఎగిరే పక్షిని గురిగా పెట్టుకొంటారు. ముందుగా సస్వరూప దైవాన్ని ధ్యానించు. క్రమేణా స్వరూపరహితుణ్ని చూడగలుగు తావు అని బోధించారు.

ఒక పుదయం శ్రీ రామకృష్ణులు నన్ను కాళికాలయానికి తీసుకుని వెళ్ళారు. అక్కడికి నేను వంటరిగా ఎప్పుడు వెళ్లినా, ద్వారం బయటే ఆగిపోయేవాణ్ణి. కానీ యిప్పుడు నన్ను గురువర్యులు గర్భగుడిలోపలికి తీసికొని వెళ్లి, పవ్వళించివున్న పరమశివుని వదనము చూపించారు. కాళీమాత అతనిపైన నృత్యము చేస్తోంది. బయటనుంచి పరమశివుని ముఖము కనిపించదు, శిరస్సు అగ్రభాగం ఒక్కటే కన బడుతుంది.

"చూడు, స్మృతిమూర్తి అయిన శివుడు, స్మృతిరహితుడుగా ఎల్లా పడివున్నాడో!" అన్నారు. ఈ భావన నేను గ్రహించి, విస్మయం చెందాను. గురువర్యుల వాక్కులు నిగూఢశక్తి పూరితములు! అంతవరకు నేను, యీ విగ్ర హాము కూడా నేను చూచిన యితర విగ్రహా ముల వంటిదే అనుకుంటుండేవాడను.

కాళీమాత వస్త్రములను, చేతులకూ, కాళ్ళకూ వున్న ఆభరణాలను దులిపారు శ్రీరామకృష్ణులు. మేము ఆ దేవాలయం విడిచి పెట్టేసరికి తాగినవానివలె వూగిపోతున్నా రాయన. అతికష్టంమీద ఆయన్ని గదికి చేర్చాము. ఆయన కొంతసేపు సమాధిలో వున్నారు. ఆనాడు నా మనస్సులో వారు చిందించిన ఆనందం ఎటువంటిదో నేను వివర ముగా వ్యక్తపఱచలేను. సమాధినుండి మేల్కొన్న తర్వాత వారు ఆవేశంగా ఎన్నో గీతాలు ఆలపించారు.

దక్షిణేశ్వర్‌లోవుంటున్న ఒక మహాయోగి, హిందీ కవితను గానంచేస్తుండగా విన్నాను. దాని భావం ఏమిటంటే, "భువిపైనుండే మర్త్యులారా, వినండి! మనుష్యులలో హెచ్చు తగ్గులు లేవు. ఏనుగులోవున్న పరమాత్ముడే చీమలోనూ వున్నాడు" అని. నేనిది అనువ దించి శ్రీరామకృష్ణులకి చెబితే ఆయన అన్నారు కదా – "అదేలా? పెద్ద ఏనుగుకి వుండే శక్తి చిన్న చీమకు వుండే శక్తి ఒక్కటే కావు. ఆత్మ ఒకటే కావచ్చు కానీ శక్తిలో అవి వేర్వేరు" అని.

మరో రోజు, నేను పొద్దున్నే దక్షిణేశ్వర్‌కు వెళ్ళాను. శ్రీరామకృష్ణులు గడ్డం చేసుకుంటు న్నారు తూర్పువసారాలో కూర్చుని. "నువ్వీ వేళ యిక్కడ వుండిపో" అన్నారు. నేను అల్లాగే వున్నాను. ఆ వేళ కాళి (స్వామీ అభేదానంద) అనే అతనితో మాట్లాడాను. స్కూలు ఎగ్గొట్టేసి అతి చలాకీగా తిరుగుతుండే చక్కని, ఆకర్షవంతమైన అబ్బాయి కాళి అంటే. శ్రీరామకృష్ణులకి అతడంటే అమిత ప్రేమ.

గురువర్యులు ఒకసారి సమాధి స్థితిలో కింద పడిపోగా, ఆయన చేయి విరిగింది. కొయ్య బద్దలువేసి కట్టుకట్టి, మెడనుంచి పట్టీ వేలాడ దీశారు.

ఇవన్నీకూడ నాకు లీలగా గుర్తున్న ఎప్ప టివో విషయాలు. నేను అప్పుడు చిన్న కుర్ర వాణ్ణి, అన్నీ ఎల్లా గుర్తుంటాయి?

(తరువాయిపై సంచికలో)

# మాతృదేవి చరణసన్నిధి

ఆంగ్ల గ్రంథము:
**ఎట్ ది హోలీమదర్స్ ఫీట్**

అనువాదము:
**పి. గణపతిశాస్త్రి**

19, ఏప్రిల్ 1920

సాయంకాల ప్రార్థనలు ముగిశాయి. నేనప్పటికి రాగలిగాను. శారదాదేవికి చాలా జ్వరంగా ఉన్నది రాస్‌బిహారీ మహారాజ్ ఆమె బుజాలమీద నెమ్మదిగా రాస్తున్నారు బ్రహ్మచారి వరద ఆమె పాదాలు నెమ్మదిగా ఒత్తుతున్నారు. థర్మామీటరుతో జ్వరం చూస్తున్నారు. అమ్మ కళ్లు మూసుకుని పడుకున్నది. నేను ఆమె ముఖానికి ఒకపక్కగా నిలుచున్నాను. అమ్మ కళ్లు తెరిచి ''ఎవరు వారు?'' అని అడిగింది.

రాసబిహారీ మహారాజ్ నెమ్మదిగా ఏదో అన్నారు. మందాకిని ఆ దగ్గిరలోనే ఉన్నది అమ్మ జ్వరం నూటఒక్క డిగ్రీలదాకా ఉన్నట్టు అక్కడివారి మాటలను బట్టి నేను గ్రహించుకున్నాను.

వంగసంవత్సరాది సందర్భంలో సుధీరా సోదరి బాలికలందరికి విందుచేస్తున్నది. ఆ సందర్భంలో సరళ భోజనశాలకు వెళ్ళింది. ఆమె అక్కడికి నాలుగు గంటలకే వెళ్ళింది. అమ్మ సరళకోసం వరద బ్రహ్మచారిని అక్కడికి పంపించింది. రాధూ పసివాడికి సరళచేత ఆహారం తినిపించాలన్నదే ఆమె సంకల్పం.

ఆ పసివాడికి ఆహారం ఇవ్వడానికి అది తగిన సమయంకాదు. అయినా పిల వాడు ఏడుస్తున్నందువల్ల రాధూ వాడికి ఆహారం ఇవ్వాలని ఆలోచిస్తూంది. శారదాదేవి ఇవ్వవద్దని వేధించింది. దానిమీద రాధూ భగ్గుమని మండిపడి ఆమెను ''చావు!'' అని తిట్టింది. అమ్మ పరిస్థితి చాలా తీవ్రంగా ఉన్నందువల్ల మేమందరము ఆ తిట్టు విని చాలా బాధ పడ్డాము. అటువంటి తీవ్రమైన అనారోగ్య పరిస్థితిలో అలా తిట్టడమా? అయినా రాధూ శారదాదేవిమీద మండిపడుతూ మాటలంటూనే ఉన్నది. ఆమె ఇలాగ తిడుతూండడం సామాన్యంగా జరుగుతూనే వుంటుంది. అయినా శారదామాత తన ఓరిమి విడనాడ లేదు. మారుమాటాడకుండా, అంతా ఎంతో ఓరిమితో సహించింది. కాని చాలా కాలం జబ్బుతో బాధపడుతూండడంవల్ల ఆమె మరి భరించలేకపోయింది. గట్టిగా సమాధానం చెప్పింది.

''అవునమ్మా, నేనీ లోకంలోంచి వెళ్ళిపోయిన తరవాత నీవు నీ పాఠం నేర్చుకుంటావులే! నీవు ఎన్నెన్ని విధాల దుఃఖాలనుభవించాలో నాకు తెలియదు. కాని ఈ సంవత్సరాది శుభ సమయంలోనే నాకనిపిస్తూంది. నీవే ముందుగా వెళ్ళిపోవాలని, అ తరవాతే నేను వెళ్ళిపోవాలని నా కోరిక!''

దానిమీద రాధూ అన్న మాటలు నాకిక్కడ రాయాలని అనిపించడంలేదు! ఆ సంగతివిని సరళ వెంటనే అక్కడికి వచ్చింది. ఆపైన ఆ పసివాడి ఆహారం ఇచ్చేపని ప్రారంభించింది.

ఆ సంఘటనవల్ల మేమంతా చాలా బాధ పడ్డాము. లోలోపల ఎంతో బాధపడుతూ శారదాదేవి నాకేసి చూసి ''కొంచెం విసనకర్రతో విసురు తల్లీ! రాధూ నాకేమాత్రము మనశ్శాంతి కలగనియ్యదు!'' అన్నది.

ఆవిధంగా మరి కొంతసేపు విసిరిన తరవాత అమ్మ కాళ్లు పట్టవలసిందని అడిగింది. సరీగా

అదే సమయంలో రాసబిహారీ మహారాజ్ అక్కడికి వచ్చి దోమతెర వెయ్యాలని అన్నారు. చిట్టచివరికి నేను, "నేను వెడతా నమ్మా!" అన్నాను.

"అలాగే తల్లీ!" అని అమ్మ దానికి అనుమతించింది.

అమ్మ చిట్టచివరి ఆదేశము, నాతో అన్న మాటలుకూడా అవే!

ఆ తరవాత మా ఇంట్లో అందరు జబ్బు పడ్డారు. అందుచేత నాకు కాళీ ఘాట్‌కు వెళ్ళి పోవలసిన ఆవశ్యకత కలిగింది. అందుచేత శారదామాత నొకసారి తిరిగి నేను దర్శించలేక పోయాను. ఆపైన అమ్మ ఆరోగ్యం నానాటికి తీసికట్టుగా ఉన్నదని విన్నాను చిట్టచివరిసారి వెళ్లినప్పుడు, అమ్మ విషయంలో నాకే మాత్రము ఆశ కలగలేదు. అయినా మే మందరము ఆమె జబ్బు నయమవుతుందని ఆశ పెట్టుకోవడం మానలేదు.

## III

### ప్రవ్రాజిక భారతీ ప్రాణ

ఉద్బోధన కార్యాలయము:

నేనప్పుడు సోదరి నివేదిత పాఠశాలలో చదువుకుంటున్నాను. అది కలకత్తాలో బాగ్‌బజారులో 17, బోస్పారా సందులో ఉంది. ఒకసారి పాఠశాల ముగిసిన తరవాత సాయంకాలం కాగానే సోదరి సుధీర నలుగురయిదుగురు బాలికలను శారదామాత సందర్శనానికి తీసుకు వెళ్లింది. అమ్మ ఠాకూరు గదిలో కూర్చున్నది. కుసుమదీదీ ఏదో ఒక పుస్తకం చదువుతున్నది. అదే సమయంలో మేమందరము వెళ్ళి శారదా దేవికి నమస్కరించాము. ఆమె "కూర్చోండమ్మా!" అన్నది. ఆపైన సోదరి సుధీర కేసి తిరిగి "అమ్మా! అయితే మీ స్కూలు ఇప్పటికి ముగిసిందన్నమాట? ఈ పిల్లలంతా నీ శిష్యురాండ్రేనా?" అని అడిగింది.

"అవునమ్మా." అన్నది సోదరి సుధీర.

"ఎంతటి మంచి పిల్లలు!" అన్నది శారదా దేవి. ఆపైన నాకేసి చూసి "ఈమె చాలా మంచిపిలలా ఉంది. ఏ కుటుంబంలో నుంచి వచ్చింది అమ్మాయి?" అని అడిగింది

"వారిది బ్రాహ్మణ కుటుంబమమ్మా! వారిక్కడికి చాలా దగ్గరలోనే ఉన్నారు."

ఆ తరవాత ఆ పుస్తకంలోనించి, చదవవలసిందని అమ్మ కుసుమదీదీని అడిగింది. అది శ్రీకృష్ణ చరిత్రం కాపీ అనుకుంటాను కృష్ణుడు, వెన్న, పాలు, పెరుగు దొంగలించాడన్న కథ విని అమ్మ నవ్వింది.

"ఎంతటి అల్లరిపిల్లవాడు!" అందరు అన్నారు. ఆపైన మమ్మల్ని తిరిగి తీసుకువెళ్ళడానికి బండి వచ్చింది. మేమందరము అమ్మ దగ్గిర సెలవు తీసుకున్నాము. మళ్ళీ రావలసిందని అమ్మ మమ్మల్ని అందరిని ఆహ్వానించింది.

మేము తిరిగి మాతృదేవి సందర్శనానికి వెళ్ళాము. అమ్మ ఒక మంచంమీద పరిచిన చాపమీద విశ్రాంతి తీసుకుంటున్నది. అందరు ఒకానొక యువతినిగురించి ప్రసంగించుకోవడం ప్రారంభించారు. ఆసందర్భంలో అమ్మ అన్నది, "ఇప్పుడు ఆమె మామగారియింట్లో ఉండనంటున్నది. ఇక్కడికి తిరిగి వచ్చేసింది. నల్లగాఉంటాడన్న కారణంచేత భర్త అంటే కూడా ఇష్టపడడంలేదు. ఏమిటి? నల్లగాఉన్నంతమాత్రాన పెనిమిటి అంటే ఇష్టపడకపోవడమా? ఏది

ఏమయినా అతడు కట్టుకున్న భర్తే గదా! నాకిలాంటి పిల్లలు అర్థం కారు. అదీగాక అతగాడి

ఆమె అతని దగ్గిరికి వెళ్ళకపోవడానికి కూడా ఒక కారణమే. అంత మాత్రాన మునిగిపోయిందేమిటి? తననెప్పుడు చిన్న చూపు చూడలేదు గదా! ఏమయినా ఆమె అతన్ని వివాహం చేసుకున్నది గదా! ఏమిటో ఇదంతా నాకేమి బోధపడదు! విన్నవారంతా ఏమంటారు! ఆమె కెలాగ తోస్తే అలాగే చెయ్యనీ!'

మేము సెలవు తీసుకునే సమయంలో నేను 'మేమిప్పుడు వెళ్ళిపోతున్నామమ్మా!' అన్నాను. దానిమీద అమ్మ మేము వెళ్ళిపోతున్నామని చెప్పకూడదు. మేము మళ్ళీ తిరిగి వస్తాము. అని చెప్పాలి'' అని హితవుపదేశించింది. ఆపైన ''ఎప్పుడు తీరిక చిక్కితే అప్పుడు రాలమ్మా!'' అన్నది.

ఒక శనివారంనాడు సుధీరా సోదరి మాలో కొందరిని దక్షిణేశ్వరంనించి తిరిగివచ్చే సమయంలో మాతృదేవి దర్శనానికి తీసుకువెళ్లింది. ఆ సమయంలో అమ్మ పై అంతస్తులో విశ్రాంతి తీసుకుంటున్నది.

సుధీరా సోదరి దక్షిణేశ్వరాన్ని గురించి ప్రసంగించడం ప్రారంభించింది. దానిమీద మాతృదేవి ''మీరు సంగీత గోపురం చూశారా?'' అని అడిగింది. ఆ తరవాత తిరిగి ఇలాగ అన్నది.

''నేను దాని కింద గదిలో ఉండేదాన్ని' దానికి సహోదరి సుధీర ఇలాగ సమాధానం చెప్పింది.

''అవునమ్మా! మేమూ సంగీత గోపురం చూశాము. ఈనాడు కూడా దాని ముందు భాగంలో తడకలతో అడ్డంగా కట్టారు. అక్కడే నెగడి వేసే చోటుకూడా ఉన్నది. వరండామీద బెస్త పడుచుల చేపలబుట్టలలాగే ఉన్నాయి. నీవు అక్కడ ఎలాగ నివసించేదానివో బాలికలకందరికి వివరిస్తున్నాము. అమ్మా, అక్కడ నీవు ఎలాగ ఉండేదానివమ్మా? అక్కడ బాగా ఇరకాటకంగా, ఇబ్బందిగా లేదూ?''

దానిమీద అమ్మ అన్నది.

''స్నానాదులకు తప్ప అక్కడ ఏవిధమయిన ఇబ్బంది ఉండేదికాదు. బెస్త పడుచులు నాకక్కడ తోడుగా ఉండేవారు. గంగలో స్నానానికి వెళ్ళేముందు వారందరు తమ చేపల గంపలు అక్కడ పెట్టేవాళ్లు. తిరిగి ఇళ్ళకు వెళ్లేముందు ఆ గంపలు తీసుకు వెళ్ళేవారు. వారందరు నాతో చాలాసేపు పిచ్చాపాటీ మాట్లాడుతూండేవారు. రాత్రివేళ చేపలు పట్టే సమయంలో వారు పాడే పాటలన్నీ నేను వింటూండేదాన్ని. అనేకమంది శిష్యులు ఠాకూరు సందర్శనానికి వస్తూండేవారు. ఆ సమయంలో ఎన్నెన్నో కీర్తనల గానం విని పిస్తూండేది! నేనా కీర్తనలన్నీ ఎంతో శ్రద్ధగా వింటూండేదాన్ని! ఆ సమయంలో నేనుకూడా ఒక ణ్ణి అయి, ఠాకూరు సాన్నిధ్యంలో ఉంటూ ఆయన మాటలన్నీ వింటూంటే ఎంతో బాగుండునని అనిపిస్తూండేది! జోగేన్ మా, గోలాప్‌మాలకిద్దరకి ఈ వృత్తాంతాలన్నీ చాలాభాగం తెలుసును! వారు అప్పుడప్పుడు నన్ను చూడడానికి వచ్చి నాదగ్గిరే ఉండిపోతూండేవారు.'' అమ్మ ఆపైన జోగీన్ మా కేసి చూసి అన్నది. ''ఆరోజులెంత

హాయిగా గడిచిపోయేవి! ఏమంటావు జోగిన్ మా?'' ఆ తరవాత శారదాదేవి పర ధ్యానంగా ఉండిపోయింది.

''అంతటి ఆనందం మాటలతో వర్ణించ డానికి అలవికానిది! అది తలచుకొంటేనే ఈ నాడు నాకెంతో ఆనందం కలిగి శరీరం పుల కిస్తున్నది!'' అన్నది జోగిన్ మా.

సెలవుల్లో తిరిగి నేను సహోదరి సుధీరతో అక్కడికి వెళ్ళాను. వివాహితురాలయిన ఒకామె బాలకృష్ణుని చిత్రం చక్కని అల్లికతో అలంకరించి మాతృదేవికి నమస్క రించే ముందు అది ఆమెకందించింది.

''ఇదంతా నీవే స్వయంగా తయారు చేశావా? అమ్మాయీ!'' అమ్మ ప్రశ్నించింది. ''అవునమ్మా'' ఆమె చెప్పింది.

''చాలా బాగుందమ్మా! ముఖంలో ఎంత చక్కని భావవ్యక్తీకరణ వచ్చింది'' అన్నది మాతృదేవి.

ఆపైన మాతృదేవి అంది; అందరికి చూపిస్తూ, ''చాలా బాగుంది కదూ!''

''అవునమ్మా!'' అంటూ మేమందరము అమ్మతో ఏకీభవించాము.

అమ్మ ఆ చిత్రం తన ముఖంలో స్పృశించి ఒక పక్కన ఉంచింది.

ఆ తరవాత మాతృదేవి ఆ చిత్రం గోలాప్ మాకు చూపించింది. ఆమె దానికేసి చూసి ''అవును! ఆ చిత్రం చాలా బాగా వచ్చింది. కాని కుడిచెయ్యి కన్న ఎడమచెయ్యి కొంచెం మోటుగా ఉన్నది'' అన్నది. దానిమీద మేమంతా నవ్వాము. శారదాదేవికూడా నవ్వి అన్నది.

''అవును! గోలాప్ మా ఎప్పుడు ఏదో ఒక తప్పు పట్టుకుంటూనే ఉండాలి! ఆమె అభి రుచులు వేరు! గోలాప్ ఎన్నెన్నో తయారు చేసింది. ఎంతో నేర్చుకున్నది. అందుచేత ప్రతి విషయము చాలా జాగ్రత్తగా పరిశీలిస్తుంది. ఆమె చేతిపనులన్ని చాలా అద్భుతంగా ఉంటాయి. రకరకాల అల్లిక పనులు మొద లయినవన్ని ఆమెకెంతో బాగా తెలుసును. ఠాకూరు ఉపయోగించిన వస్తువులన్ని గోలాప్ మా స్వయంగా తయారుచేసినవే! ఠాకూరు శిష్యుల కోసమని ఆమె తలగడలు, తలగడల గలేబులు, దోమతెరలు, మొద లయినవన్ని తయారుచేస్తుంది. ఆమె ఒక్క క్షణంకూడా వ్యర్థం చెయ్యదు.

అక్షయ తృతీయనాడు అమ్మ నా స్నేహితు రాళ్లకిద్దరికి మంత్రోపదేశం ప్రసాదించింది. నేను ఊళ్ళో లేకపోయినందువల్ల నా కంతటి అదృష్టం లభించలేదు. మరికొన్నాళ్లు గడిచిన పిమ్మట మధ్యాహ్నం దాటిన తరవాత సుధీరా సహోదరితో కలిసి నేను అమ్మఇంటికి వెళ్లాను. శారదాదేవి తన పల్లెటూరికి వెళ్లవలసి ఉండెను. రాధూకి వివాహం జరపవలసి ఉన్నది. ఈ కారణాలవల్ల అమ్మ తొందరగా బయలుదేరవలసి ఉన్నది.

మేము తిరిగి వెళ్ళబోతూంటే అమ్మ మళ్లీ రావలసిందని ఆదేశించింది. జోగిన్ మా ఆ తరుణంలో నా మంత్రోపదేశం సంగతి ప్రస్తా వించింది. దానిమీద అమ్మ ''రేపు పొద్దున్నే రా అమ్మా!'' అన్నది.

—(సశేషము)

# కబీరు వచనామృతము

(మూడవ భాగము)

## కబీరు పరీక్ష

**1**

జోగియును, జంగమును, దుఃఖమనుభవించు చున్నారు; తపసికూడ, రెట్టింపు దుఃఖమున మునిగియున్నాడు. ఆశాతృష్ణలన్ని ఘటములను వ్యాపించియున్నవి. ఏ మహాలును శూన్యమైనది లేదు.

సత్యము చెప్పినచో జగమంతయును గోపగించును. అబద్ధమున్ననో — చెప్పవలను పడదు.

కబీరిట్లనుచున్నాడు — ఎవ్వరిట్టి బాటలన్నియు ప్రచారము చేసిరో వారికి దుఃఖమేమి గలుగును?

**2**

ఖోదా (దేవుడు), మసీదునందుండెనేని, ఇక నీ జగమంతయు నెవ్వరిది? రాముడు తీర్థమునందలి విగ్రహములలో గలడేని, వెలుపల జగమును జూచునదెవ్వరు?

పూర్వ దిక్కు హరికి నివాసము. పడమర అల్లాకు మకాము. చూడుము, చూడుము— నీ హృదయమునందే చూడుము, అచ్చటనే కరీమును, రాముడును కలరు.

జగమునందలి నారీనరులందరును ఆతని రూపములే. కబీరు, అల్లా రాముల కుమారుడు. ఆతడు నా గురువు. ఆతడు నా పీరు.

**3**

మిక్కుటమగు నహంకారముతో, డెందము నిండి జలము లేకయే వీరు మునిగి జచ్చుచున్నారు.

కబీరిట్లనుచున్నాడు :—సమస్త జగమును, అంధముగా నున్నదను నీ విషయము నెవ్వరికడ జెప్పుదును? సత్యమునుండి వీరు విముఖులై పారిపోవుచున్నారు. అసత్యమునందు బద్ధులై యున్నారు.

**4**

కొట్టుకొని పోవుచున్నావు, ఊరక కొట్టుకొని పోవుచున్నావు. అవలంబమేమియును లేక నాలుగు దిక్కులను బట్టుకొనబోవుచున్నావు. నా మాటను విననేని రెండు కూలములమధ్యను ధక్కా మక్కాలు తప్పవు.

**5**

బాటసారి బాటను దెలిసికొనుట లేదు; కడు మూఢుడు. గ్రామ్యుడు. ఓయీ! ఘట్టమును వీడి ఘట్టము లేనిచోట నెందుకు తిరుగుచున్నావు? నీవు తీరము నెట్లు చేరగలవు?

**6**

ప్రతివాడును తన, తనమానమునకై వెనుగులాడుచున్నాడు. కల్లయగు ప్రపంచమును నిజమని నమ్ముచున్నాడు. కల్లతో నెప్పుడును కర్జము జరుగదు. ఓరీ! నిర్లజ్జుడా! వినుము నిన్ను వారించుచున్నాను.

కబీరిట్లనుచున్నాడు —నరుడన్వేషించుట లేదు. దారితప్పినవాని లె, తిరిగి తిరిగి చచ్చుచున్నాడు.

**7**

హంసయును, బకమును చూచుట కొక్క టే రంగు. ఒకే హరిత సరోవరమునందయ్యావి చరించును. క్షీరపరీక్షచే హంసను దెలిసికొనుము. బకమును బట్టుకొనుము.

**8**

గార్హస్థ్యమును వదలి యుదాసీనుడై తపస్సుకొరకు వనమునకు బోవుచున్నాడు. ఒడలును

క్లేశపెట్టి, నీరసమొనర్చుచున్నాడు. ఏరుకొని అడవిరేగులను దినుచున్నాడు.

9

మునివరులెవ్వరికొరకై తపస్సు నొనరింతురో, వేదమెవ్వని గుణగానమొనర్చునో ఆ దేవతయే శిక్షనొసగినను ఎవ్వరును నమ్మట లేదు.

10

తెలిసికొనలేదు, ఎరిగికొనలేదు, తెలిసికొన్నను, పయనమొనర్చుటలేదు. అంధునితో అంధుడు చేరినాడు. ఇక దారిచూపించునది యెవ్వరు?

11

ఎల్లరును, ప్రభువనుచున్నారు కాని నాకింకొక తలపు కలుగుచున్నది.

ప్రభువుతో పరిచయము లేదు. నేనే తావున కూర్చుందును?

## కబీరు ఉపదేశములు

1

ఎవ్వనికి శీల సంతోషములు కలవో, ఎవ్వని కెల్లప్పుడును సమదృష్టికలదో, ఎవ్వని మనము శాంతితోడను, జీవితఫలముల గ్రహించుట యందొప్పుదలతోడను పరిపూర్ణమో, ఎవ్వడాతని దర్శించెనో, ఎవ్వడాతని స్పర్శించెనో, ఆతనినుండి భయక్లేశములన్నియు దూరములగును.

నిశిదినములును, ఈశ్వరుని చర్చయే ఆతని చిత్తమునకు చందనచర్చ; వేరొక కథయందాతనికి సుఖము లేదు. ఆతని కర్మయును, విశ్రామమును సంగీతముచే పరిపూర్ణములు; ఆతడెల్లప్పుడు ప్రేమ వెలుగును ప్రసరింపచేయును.

కబీరిట్లనుచున్నాడు — ఎవ్వడు రాగస్వరూపుడో, ఎవ్వడు అఖండితుడో, అవిచలుడో, ఎవ్వడు నిర్భయుడో, నిరుద్వేగుడో ఆతని చరణములనంటుము; ఆతడే సర్వఘటములను, తన ఆనందముతో నింపుచున్నాడు.

2

ఏనాడు ప్రియుడు నా వాకిట నిల్చునో, ఆ నాడు నేను వసంతోత్సవమొనర్తును. ఆతడే రంగు, ఆతడే రంజనకారి, ఆతని రంగుతోడనే నా చీరెను రంజింతును.

యోగినై వెతకుచు ప్రతివనమందును దిరిగితిని. ఇక నేనానగరమునందే స్థిరముగా నివసింతును. నా తారుణ్యమును మాలవలె ధరింతును. దేహమున భస్మములదుదును.

కబీరిట్లనుచున్నాడు:—ఏనాడు ప్రియుడు నా వాకిట నిల్చునో, ఆనాడే కేసరముచే శిరమును రంజింతును.

3

నేను సంస్కృత భాషను నేర్చితిని; కావున లోకమునన్నిక జ్ఞానియని పిల్చుగాక.

కాని ఏమి ప్రయోజనము? ఆశాప్రవాహమున గొట్టుకొని పోవుచున్నాను; తృష్ణ నన్ను శోషింపజేయుచున్నది; కామన యొక్క తాపము నన్ను దరిగొల్పుచున్నది.

మానాభిమానముల భారము తలపై మోచి వృథాగా ఖేదపడుచున్నావు.

కబీరిట్లనుచున్నాడు:—దానిని నేలపై బడద్రోయుము. ప్రియుని కలయికకై ముందరుగుము. ఆతనిని స్వామీ యని నేడు పిలువుము.

4

సాధుసంగమునందే ప్రియుడు కలడు. అచటికి బొమ్మ, భావము, భక్తి, ఉపదేశము, అన్నిటిని అటనుండి గ్రహింపుము.

ఎచ్చట నాతని పేరు పలుకబడదో, ఆ సభ దగ్ధమగుగాక. వరుడు లేకుండ వివాహోత్సవ మెట్లో నాకు తెలియజెప్పుము? సంకోచమును మానుము. ప్రియతముని ధ్యానింపుము. అన్య దేవతా సేవయందు జిత్తమును లగింపకుము. అయ్యది జీవనమునకు కల్యాణము నొడ గూర్పదు.

కబీరు విచారణచేసి ఇట్లనుచున్నాడు:— ప్రియుడీవిధమున లభింపడు.

## 5

సంశయమును దూరగింపుము, ప్రియుని సేవింపుము. భవసాగరమునందతడే నీ నావ. ప్రేమచే పారము చేరుము. స్మరియింపుము. ప్రియునినామము స్మరియింపుము, శాశ్వత జీవనము లభింపుము. ప్రేమయే అమూల్య మధువు; దానిని ద్రావుము. చిత్తమున ప్రేమ లేదు, ప్రభువు కొరకాశంసలేదు. ప్రేమలేనిది నీవు ఊసరక్షేత్రమువలె వ్యర్థము.

కచ్చేరియందున్నతాసనమున కూర్చుండి న్యాయము తీర్చువారలును నేడు మంటలో కలసినారు. నేడు వారు చూడ్కికి బాహిరులు.

నీవు మాయయగు ధనధామములజూచి మైమరవకుము; మూడుదినాల మురిపెముగు ఆ ముచ్చట కడకు ధూళియందు కలసిపోవును.

అనేక పర్యాయములు నరదేహము ప్రాప్తించినది, కాని స్వామి ఇంకను దొరకలేదు.

కబీరిట్లనుచున్నాడు :- ఓయీ! మేల్కొన గలవేని ఇపుడు మేల్కొనుము.

## 6

జ్ఞానమను నారతియందమృతవాణి పలుకుచున్నది. పూర్ణబ్రహ్మను గ్రహించుము. పవన నీరము లెవ్వనియాజ్ఞచే బ్రసరించునో, ఆతని గతి ఇట్టిదని చెప్పుటెట్లు? ఆతని జూచు చూడ్కి లేక జగము వెర్రిదైనది. భ్రమయను గహ్వరమందు తిరిగి తిరిగి మనుష్యుడు చచ్చుచున్నాడు.

గగనమున వాయువు గర్జించుచున్నది. స్వామియొక్క నిశ్చయ ధ్వజమాకసమునం దెగురుచున్నది. కబీరిట్లనుచున్నాడు :- తన ప్రియుని స్వరమెవ్వడు గురుతించునో, ఆతడే చతురుడగు సాధకుడు.

ఎవ్వని నాలుక సంయతముకాదో, ఎవ్వని హృదయమున సత్యములేదో, ఆతని సంగ మొనర్పకుము; ఏలన, వాటనడుమ నాతడు సర్వనాశమొనర్చును.

## 8

జీవుడే నీవని యెరిగికొంటివేని, జీవుని సారముగా గ్రహింపుము. జీవునివంటి యతిథి రెండవమారు దొరకడు.

## 9

జగమును జీవనమని యెరుగుదువేని, ఆ తెలియక కనురూపముగ జీవనము గడుపుము.

జలమందే నిన్ను నీవు పరిణతమొనర్చుకొందువేని ఇక జలపానమునకై యాసపడవు.

## 10

నీరు త్రావించుచు నూరక తిరిగెదవేల? ఇంటింటను సాగరవారి! కృష్ణార్తుడయ్యేనేని, ఈ జలమే త్రావును.

# శ్రీ చరణాన్వేషి

ఎల్యా నారాయణ్‌రావ్

అరుణరాగాలు అంబరమున అలుముకొను వేళ
ప్రత్యూష పవనాంకురముల ఆహ్లాద హేల
సృష్టినంతయు పరిపుష్టిగా పాలించు నీ లీల
దుర్లభమౌ మానవ జన్మలో కరమోడ్చితి నీ పదముల
ప్రోల!

సురభీ పుష్ప సౌగంధ సమీర వీచికలో
సర్వప్రకృతీ సరస సంగీత సరిగమల భరితమై
సౌందర్యపు సరిహద్దుల్లో నను నేను సరిదిద్దుకుంటూ
సర్వమూ నొసగిన నీకు అంజలి ఘటిస్తున్నాను సర్వేశ్వరా!
సహస్రగుణాధిక సౌందర్య సమన్వితముగా ప్రకృతిని
సర్వాంగ సుందరంగా మలచిన మహోన్నత శిల్పివి
ఎందుంటివయ్యా నీవు; పసిపాప బోసినవ్వులందా!
పరిమళించు ప్రసూనములందా! ప్రవహించు నదీ
తరంగములందా!

నీ ఉనికికై ఊపిరి బిగబట్టిన
ముని పుంగవులకెల్ల ముచ్చటగా గోచరించితివట
కోరి వచ్చువారికెల్ల కొంగుబంగారమైతివట
ముక్తిపదగాములకు మోక్షప్రదాతవట
చేతులారంగ శివపూజ చేసి చేసి
నోరు నొవ్వంగ హరికీర్తి నుడివి నుడివిన
బ్రమ్మెరపోతన ప్రగాఢ భక్తికి
పరవశించి ప్రత్యక్షమైతివట
చెఱసాలయందునూ, చిత్తము నీపై నిలిపి
అచలించిత హృదితో; అకుంఠిత దీక్షతో
అహర్నిశలు నీకై తపించి; అలుకబూని శపించిన
రామదాసు భక్తికి దాసానుదాసుడవైతివట.

భవబంధాల సాలెగూళ్ళలో బందీనై
సత్త్వరజస్తమో గుణాల సాముగరిడీలలో
ఇంద్రియాల కందిరీగల కరకు కాటులకు కలతబారుతూ
పరబ్రహ్మమైన నిన్ను కనలేక పరితపిస్తూ
పరిభ్రమిస్తున్నాను.

దుర్బలమౌ మానసిక చాంచల్యానికి
దుర్మార్గంగా బలవుతూ, దుష్కరమౌ మార్గమందే
చరిస్తున్నాను, నీవు కంటిముందర కప్పిన
మాయపొరల మసక తెరలవలన.

వలదు స్వామీ! వలదు!
ఈ వియోగము యిక సహించలేను!!

అహోరాత్రములు అకుంఠిత దీక్షతో
నా జీవనాడులన్నీ మనోవల్లకీ తంత్రులై
ప్రఫుల్ల రాగ సరిగమలతో నీదు మధురమంజుల నామాన్ని
అనుక్షణం ఆలాపిస్తున్న వైఖరి శ్రవణప్రేయం కాలేదా!
నవనవోజ్జ్వల నక్షత్ర కాంతిపుంజములను
నా కనులకు కాటుకనిడి; రెప్ప వేసిన తప్పౌదునన్న
శంకతో
నిష్కళంక చూపులను నింగిపై నిలిపి
నీ దివ్యమంగళ రూపాన్ని తనలో యిముడ్చుకొనవలెనని
తహతహలాడుతున్న నా పేదకనులను తిలకించలేవా।

నాదమో! మోదమో; భక్తి ఉన్మాదమో
శ్రుతియో, అపశ్రుతియో మరి
గాత్రమో, అగాత్రమో, చిత్ర విచిత్ర హృదయ
ప్రకంపనమో
సాధ్యమగు రీతి నీ కీర్తనలను దశదిశలు మారుమ్రోగునటుల
నోరార నుడువుచుంటి, చెవులారా వినలేవా తండ్రీ!

అపుడే గోరిడిన అపురూప ప్రసూనములను
అభయ ప్రదాయిని అమృతులసీ దళములను
అతిప్రియమగు ఫలములందందు వెతకి దెచ్చి
స్వచ్ఛ గంగాతరంగ ధారలతో నీరాడించి
నా ఆత్మవాకిట కంటి వెలుగుల రంగవల్లులిడి,
రాత్రింబవళ్లూ రుధిర జ్యోతులు వెలిగించి
మనో మందిరాన మహోన్నత సోపానముపై
నీ చిన్మయ రూపమును చిరకాలం ప్రతిష్ఠించి
చేతులారంగ నీ పూజ చేయవలెనని
కదలివచ్చు కరముల కన్నీటిగాథ కనలేవా!

దివినుంటివో, భువినుంటివో
నింగీనేలా సంగమములందుంటివో
సప్తసముద్రముల సుషుప్తినందుంటివో
ప్రదీప్త ప్రాపంచిక ప్రాకార మధ్యములందుంటివో
అది దుర్గమో, దుర్లభమౌ మార్గమో
హిమవన్నగమో, నగోచరంబౌ జగమో
ఏ అవరోధములకు సంశయించక, సంతసములో
కంటి కాగడాల వెలుగుల ఆసరాతో
నిన్ను చేరవలయునని; చేవయున్ననూ, లేకున్ననూ
పరివిధముల పరితపిస్తున్నాయి నా చరణములు.

సర్వేశ్వరా!

నిన్ను అందూ ఇందూ యని
యెందెందు వెతుకగలను
నా పిచ్చిగాని, నీవు లేనిదెక్కడ
ఇందుగల డందులేడని
సందేహము వలదు
ఎందెందు వెతకిన అందందే గలడని
ప్రహ్లాదుడు ప్రవచించలేదా!
"ఈశ్వర సర్వభూతానాం
హృద్దేశే అర్జున తిష్ఠతి"
అని గీతాకారుడు ఉద్ఘాటించలేదా!
శివుడవో, మాధవుడవో
కమలభవుడవో, పరబ్రహ్మమో
అన్న త్యాగరాజు సంశయానికి
సరిపడు భాష్యాన్ని చెప్పలేదా!
అహోరాత్రాలు నీకై తపించి
ఆఖరికి అన్నింటినీ త్యజించి
అమ్మా! అమ్మా! అంటూ ఆవేదనలో పడి
అన్నింటియందూ వెలుగొందు పరబ్రహ్మమును గాంచి
సర్వమున వెలయునది 'నీవే' 'నీవే' అని
రామకృష్ణ పరమహంస ఉద్ఘోషించలేదా!
జీవాత్మ పరమాత్మ సంగమంలో బహిర్గతమౌ వెలుగు
జీమూతాన్ని చీల్చుకుని జాజ్వల్యమానంగా
నిన్ను గాంచుటకు

సర్వతోముఖంగా దోహదం చేస్తుంది
అదే ఆలయం; హేమ ఘంటియల గణగణలు
సదా శ్రవణ ప్రేయమై; సర్వమంగళ రూపముతో
సర్వేశ్వరుడు సాక్షాత్కరిస్తాడని
సకల వేదాలు చాటడం లేదా!

భగవాన్!

నీ దర్శనభాగ్యం అంత సులభమా
నీ కఠోర పరీక్షలు తాళ శక్యమా
జన్మనిచ్చిన నీ గురించి తెలిసికొనుట అనివార్యం
అందులకై ప్రయత్నించుట నా ధర్మం
నిన్ను గాంచుటయే నా లక్ష్యం
నీ సేవ కొరకే ఈ కాయం
ఈ అనంతయాత్రలో నీవే నా గమ్యం
నిన్ను చేరుటకై బయలుదేరిన బాటసారిని
నీ పదములందు విశ్రాంతికోరే శ్రీ చరణాన్వేషిని.

సుఖస్యానంతరం దుఃఖం దుఃఖస్యానంతరం సుఖమ్
న నిత్యం లభతే దుఃఖం న నిత్యం లభతే సుఖమ్
సుఖమేవ హి దుఃఖాంతం కదాచిత్ దుఃఖతః సుఖమ్
తస్మాదేతద్ ద్వయం జహ్యాద్ య ఇచ్ఛేచ్ఛాశ్వతం సుఖమ్
సుఖాంతప్రభవం దుఃఖం దుఃఖాంతప్రభవం సుఖమ్

—మహాభారతము.

# కాంతిరేఖలు - 1

## డాక్టర్ బొడ్డుపల్లి పురుషోత్తం

సోదరా!

నీ జాబు చేరింది. సముచితమైన సందేహాన్ని వెలిబుచ్చావు. "భగవంతునితో ప్రమేయం లేకుండా మనం జీవించలేమా? ఆయన్నొకడ్ని కల్పించుకొని పూజలు, ఉపవాసాలు అంటూ ధనవ్యయం కాలహరణం కావించటం వ్యర్థంకాదా?" అనికదూ నీ సందేహం. బాగుంది.

అవును. ఇటువంటి సమస్యనుగూర్చి మన పూర్వులుకూడా ఆలోచించినట్లు కనిపిస్తుంది. అంతా దైవాధీనమంటూ పురుషకారం నిర్వహించకుండా సోమరిపోతులుగా తయారైన వారిని హెచ్చరిస్తూ ఎవరో కవి ఈ క్రింది రీతిగా శ్లోకంకూడా ఒకటి చెప్పాడు.

> ఉద్యోగినం పురుషసింహముపైతి లక్ష్మీః
> దైవేన దేయమితి కాపురుషా వదన్తి
> దైవం నిహత్య, కురు పౌరుషమాత్మశక్త్యా
> యత్నే కృతే యది న సిద్ధ్యతి కోఽత్ర దోషః.

ఇది కేవలం పురుషకారానికి ప్రాముఖ్యమిస్తూ, చెప్పిన మాట. ఏ సందర్భంలో ఏం చెప్పారో తెలుసుకోకపోతే కొన్ని మాటలు అపార్థాలకు దారితీసాయి.

ఈ మధ్య ఒకరు నన్ను అడిగారు. స్వామి వివేకానందులు "You will be nearer to Heaven through foot-ball, than through the study of Gita అన్నారుకదా! అయితే ఫుట్‌బాల్ ఆటగాండ్లకే స్వర్గం - మనకెవ్వరికి లేదా! అని. ఆశ్చర్యం వేసింది. నీరసకంఠంతో గీతను కూనీచేస్తున్న వ్యసన చిత్తులకు కావించిన హెచ్చరిక అది.

కేవల పురుషకారపరాయణుడవై జీవిస్తే, నీకు ఆనందలబ్ధి, ఆత్మశాంతి లభిస్తాయా? అప్పుడేమౌతుంది? నీ విజయాలకుప్పొంగిపోతావు. నీ అపజయాలకు కుంగిపోతావు. ఈ రెండింటివల్ల నీ జీవితం సమతను కోల్పోతుంది. అయితే గర్వగరిష్ఠుడవన్నా అవుతావు, లేకపోతే వ్యర్థుడవన్నా అవుతావు. కేవల హేతుబుద్ధి నీకానందాన్నీయలేదు. అన్నింటికిగల అంతర్గత హేతువులు నీకు అవగతం కావు సమగ్రంగా. నీ బుద్ధి పాక్షికమైంది. పరిచ్ఛిన్నమైంది. పూర్ణసత్యం దానితో సాక్షాత్కరించదు.

చివరకు ప్రపంచంలో నీవు ఒంటరివాడివైపోతావు. శారీరక శక్తులు, ధనార్జన అన్నీ ఉడిగేటప్పటికి నీ భార్య, బిడ్డలుకూడా నీ దరికి రారు. నీతో పనిలేక నిన్ను ఎవరు పలకరించరు. అప్పుడు నీ జీవితం ఎంత దుర్భరమౌతుందో సోదరా! ఊహించలేవూ?

ఆ రీతిగా నీ జీవితం దుర్భరంకాకుండా వుండాలంటే, నీ జీవితం రసభరితం కావాలంటే నీ జయాపజయాలకు గల ఆంతరంగిక హేతువులు నీకు బాగా అవగతం కావాలంటే నీవు సర్వశక్తిమంతుడు, సర్వాతీతుడు, సర్వవ్యాపకుడు అయిన భగవంతుడ్ని ఆశ్రయింపక తప్పదు. అప్పుడే నీకు శాంతిదాంతులు. అప్పుడెప్పుడో చూద్దాంలేం అనుకోవాకు. ఇప్పటినుండే భగవంతునాశ్రయించటం అలవాటు చేసుకొంటే, అప్పటికి ఎంతో సిద్ధుడవౌతావు.

ఇదంతా దేనికి? కేవల పురుషాకారాన్నే ఆశ్రయించి, 'దుర్యోధనునింట్లో తగు కార్యానికి, ఖడ్గానికి' తానే అని విర్రవీగిన కర్ణుడు గతి ఏమైంది? ఎంత దుర్భరమైంది? అతడ్ని నమ్ముకొని మదించిన సుయోధనుడి గతి ఏమైంది?

భగవంతుడ్ని, ధర్మాన్ని ఆశ్రయించిన పాండవులేరీతిగా విజయాన్ని సాధించారు?

అందులోను 'విజయుడి' సంగతి ఆలోచించు. భగవంతుడు తన అండదండగా వున్నాడని, విద్యలు నేర్వడం మానాడా? ఈశ్వరుడ్ని గూర్చి తపస్సుచేసి పాశుపతాన్ని పొందలేదూ?

గీత చిట్టచివరికి సంజయుడిద్వారా అందించిన సందేశంలోని సత్తా గుర్తించావా?

యత్ర యోగేశ్వరః కృష్ణో యత్ర పార్థో ధనుర్ధరః
తత్ర శ్రీర్విజయో భూతిః ధ్రువా నీతిర్మతిర్మమ.

అంటే ఏమిటి? ముందు యోగేశ్వరేశ్వరుడైన కృష్ణపరమాత్మను నీ హృదయపీఠం మీద సుస్థిరంగా స్థాపించుకోవాలి. అప్పుడు నీవూ యోగివైపోతావు. అయితే అంతటితో చాలదు. ధనుర్ధారుడైన పార్థుడ్ని ఆ ప్రక్కనే నెలకొల్పాలి. అంటే ఒకరు దైవానికి, ఇంకోరు పౌరుషానికి ప్రతీకలు. ఈ రెండింటి సరస సమ్మేళనమే జీవితం. అప్పుడు లక్ష్మి చిరుగజ్జెలతో నీ యింట్లో నర్తిస్తుంది. విజయం కరతలామలకం అవుతుంది. విభూతిమంతుడవవుతావు. ఇది సంజయుని ధ్రువమైన నీతి. ఇదే విజయుని జీవితం. నీవుకూడా విజయుడవు కావాలంటే దైవాన్ని ఆశ్రయించి, ఆత్మ సమర్పణం చేసుకొని, ఆయన కటాక్షవీక్షణ మార్గాల్లో, ఆయన అండదండలతో జీవించటం ఇప్పటినుండి అలవరుచుకో! ఎటువంటి అనందాన్ని అనుభవిస్తావో! అనుభవంలో గుర్తించు.

అలా కాదని పురుషకారాన్ని నమ్ముకుంటే చెప్పానుగదా! అంతేకాదు. సోదరా! మౌసల పర్వం చదివావుగా? ఏంజరిగింది? అంతటి విజయుని పౌరుషశక్తులు కృష్ణ నిర్యాణానంతరం ఏమైనాయి? దారిదోపిడిగాండ్ల చేతిలో పరాభవం పొందలేదూ? జ్ఞాపకం తెచ్చుకో!

కాబట్టి భగవంతుడనేవాడ్ని కల్పించుకొన్నామనుకుంటే మానవుని తెలివితేటల్ని, దూరదృష్టిని లోకజ్ఞతను అభినందించి ఆరాధించు. లేదా, ఆయనంతటాయనే వున్నాడనుకొంటే అత్యంత భక్తితో నిత్య సమర్చన కావించు. లేదా, ఆయన నీ ఆత్మకన్న భిన్నుడుకాడనే అద్వైత సిద్ధి కల్గితే ఇంకా చెప్పవలసిందేముంది? అది కల్గేదాకా 'దాసోఽహం' అంటం నేర్చుకో. అందులో నీకు 'సోఽహం' వినపడేదాకా. ఎవరికి? ఆ పరమాత్మకు.

ఇట్లు
నీ శ్రేయోభిలాషి.

---

క్రియ నొనర్పుము, కాని ప్రతిక్రియ కలుగనీయకుము; క్రియ సుఖకరము. కాని ప్రతిక్రియయే దుఃఖము. బిడ్డ తనచేతిని దీపమున బెట్టును, అది సుఖము; కాని శరీరము ప్రతిక్రియ చేయునపుడు చేయి మండుచున్నది. ప్రతిక్రియ మాన్పగలిగినచో మనమిక భయపడవలసినదేమియు నుండదు. మనస్సును నిగ్రహింపుము, ప్రతిఫలమును లక్షింపనీయకుము, సాక్షీభూతుడవు కమ్ము, ప్రతీకారము చేయకుము. సుఖివై యుండుటకు నీకిదియే మార్గము. మనలను మనము పూర్తిగా మఱచియుండునట్టి క్షణములే మహోత్తమానందమయములు. విధియను భావమునగాక మనఃపూర్వకముగా కర్మములనొనర్పుము. మనకేవిధియు లేదు, ఏకర్తవ్యమును లేదు. ప్రపంచము కేవలము మన గరిడీశీల, క్రీడారంగము; మనజీవితము శాశ్వతమైన సెలవుదినము.

# అస్సీసీ యోగి — ఫ్రాన్సిస్

కె. యస్. ప్రకాశరావు

అస్సీసీ యోగి ఫ్రాన్సిస్ క్రీ॥ శ॥ 1182 వ సం॥లో అస్సీసీ నగరంలో జన్మించాడు. ఫ్రాన్సిస్ తండ్రి పీటర్ బెర్నార్డో ఇటలీదేశంలో గొప్ప బట్టల వ్యాపారి; తల్లి డోన్నాపికా పరమ సాధ్వి, అమాయకురాలు. ఫ్రాన్సిస్ యొక్క క్రైస్తవ నామధేయము గియోవాన్ని కాని అతని సహచరులు ఫ్రాన్సెస్కో అని పిలిచే వారు. బడిలో చదువు పూర్తికాగానే, ఫ్రాన్సెస్కోను అతని తండ్రి తన వ్యాపారంలో పెట్టాడు. కొద్దికాలంలోనే ఫ్రాన్సెస్కో వ్యాపారంలోని మెలకువలన్నీ తెలుసుకున్నాడు. చిరునవ్వు మోముతో హాస్యపూరిత మైన మాటలతో తన ఖాతాదారులని మెప్పించి వ్యాపారం చేసేవాడు. ఫ్రాన్సెస్కో రాక తండ్రికి వ్యాపారంలో చాలా లాభించింది. కాని పొదుపు, మితవ్యయములకు ఫ్రాన్సెస్కో అలవాటు పడలేదు.

ఒకనాడు ఫ్రాన్సిస్ (ఫ్రాన్సెస్కో) ఒకడే తన దుకాణంలో ఉన్నాడు. ధనికుడైన ఒక ఖాతాదారుతో వ్యాపారం చేస్తున్నాడు. ఆ సమయంలో ఒక నిరుపేద వచ్చి "అయ్యా ధర్మం" అని అడిగాడు. కాని వ్యాపారంలో నిమగ్నుడై ఉండడంతో ఆ మాటల నాతడు గుర్తించలేదు. వ్యాపారం ముగిసిన తర్వాత ఆ బిచ్చగానికోసం అటూ ఇటూ చూచాడు. కాని అతడు కనపడలేదు. ఫ్రాన్సిస్ చాలా బాధపడ్డాడు. వెంటనే దుకాణాన్ని, తెరచి ఉన్న ఖజానాపెట్టెని అలాగే వదలి ఆ బిచ్చగానిని వెదకుతూ బయలుదేరాడు. వీధి వీధి వెతికాడు; ఎంతోమందిని ఆ బిచ్చగానిని గూర్చి అడిగాడు; ఊరంతా గాలించాడు, ఆయాసముతో ఊరి చివరదాకా వచ్చాడు. ఆఖరికి అక్కడ ఆ బిచ్చగాణ్ణి చూచాడు. తన దగ్గరనున్న సొమ్మునంతా యిచ్చేశాడు. తాను తొడుక్కున్న కోటుకూడా యిచ్చేశాడు. ఆ నిరుపేద తన కృతజ్ఞతని తెలుపుకునేలోపుగానే ఫ్రాన్సిస్ తన దుకాణాన్ని చేరుకున్నాడు. ఇది మొదటిసారి. అతనిలో ధర్మగుణము మేలుకొంది; తండ్రితో విరోధము ప్రారంభమయింది.

మరో సమయంలో ఒక సంతోషకరమైన విందు పూర్తయిన తర్వాత, ఫ్రాన్సిస్ అకస్మాత్తుగా లేచి బయలుదేరాడు. అతని స్నేహితులు వెంటాడారు. ఒకచోట ఆగి, అలాగే తదేక దృష్టితో ఆకాశంలోకి చూస్తూ నిల్చున్నాడు. అతని మిత్రులు ఎగతాళిగా "ఏం మిత్రమా, ఏమిటి ఆలోచిస్తున్నావు? నీ పెళ్ళివిషయమా?" అన్నారు. వెంటనే అతడు "అవును, మీరు చెప్పినది నిజము, నేను పెళ్ళి చేసుకోబోతున్నాను; ఇంతవరకూ మీరెన్నడూ ఎక్కడా కనివిని ఎఱుగని అందకత్తె; ఆమె పేరు లేమిదేవి (పేదరికము)" అన్నాడు.

ఆ మరుక్షణంనించే అతనిలో గొప్పమార్పు ఏర్పడింది. ఇదివరలోనే తాను చూచిన నిర్మానుష్యము నిశ్శబ్దముగా నున్న ఒక గుహలో రోజులు గడపడం మొదలుపెట్టాడు.

ఒకనాడు ఆ గుహకు పోతున్నప్పుడు కొంత దూరంలో ఒక కుష్టురోగిని చూచాడు. (ఆ రోజుల్లో కుష్టురోగాన్ని అతి భయంకరము, అసహ్యాకరమైన రోగంగా చూచేవారు. ఫ్రాన్సిస్ కూడా ఆ అభిప్రాయము గలవాడే.) ఆనాడో వింత సంఘటన జరిగింది.

తనవైపు వచ్చే ఆ కుష్టురోగిని చూచాడు.

అతన్ని తప్పించుకుందుకు గుఱ్ఱాన్ని అదలించాడు. కాని మరేదో చేయి తన చేతినించి కళ్ళెమును లాక్కుంది. తిన్నగా ఆ కుష్ఠురోగిని సమీపించిందా గుఱ్ఱము. కర్రల సహాయంతో తనను సమీపించే ఆ కుష్ఠురోగి భయంకర ఆకారాన్ని విపులంగా చూడగలిగాడు. ఆ రోగము రోగి పెదవులను తినేసింది, ముక్కుకు బదులు పెద్ద కన్నమున్నది. ఫ్రాన్సిస్ గుఱ్ఱముమీద కూర్చొనలేకపోయాడు. ఆ రోగి దేహమే ఒక దుర్వాసన. ఆ దృశ్యాన్ని చూడలేకపోతున్నాడు. కాని రోగివైపే వెళ్ళింది గుఱ్ఱము. రోగిని సమీపించాడు. గుఱ్ఱముమీద నుంచి దిగాడు. తనవద్దనున్న సొమ్మంతా ఆ రోగికిచ్చాడు. అతని చేతిని అందుకున్నాడు. అది చేయి కాదు, పెద్ద పుండు, వ్రేళ్లు లేవు, రోగమువల్ల వ్రేళ్లు తినివేయబడ్డాయి. ఫ్రాన్సిస్ యిచ్చిన ధనాన్ని చేతులతో తీసుకునే శక్తి కూడ ఆ రోగికి లేదు. అతని దీనావస్థ చూచి, ఫ్రాన్సిస్ భయంతో విచారపడసాగాడు. అక్కడనించి వెళ్ళిపోదామనుకున్నాడు, కాని తలవని తలంపుగా తలవంచి పుండులో ఉన్న ఆ కుష్ఠురోగి చేతిని ముద్దుపెట్టాడు. నిర్మల నీలాకాశంవైపు చూచాడు. భయము, అసహ్యము అంతరించాయి. ఎన్నడూ అనుభవించని ఆనందము అతనిలో పొంగుతూ ఉంది. తన గుహకు పోడానికి గుఱ్ఱాన్ని ఎక్కి అదలించాడు; ఆ కుష్ఠురోగివద్ద శెలవు తీసుకుని పోవడానికి వెనకకు తిరిగి చూచాడు. వింతలకు వింత. నిమిషానికి కూడా ఒక అడుగు వేయలేని ఆ కుష్ఠురోగి లేడు. రోడ్డు అంతా నిర్జనము. రోగి ఏమయాడు? భక్తునికి, మాత్ముని పరీక్ష అదే. ఆ ముద్దుతో ఆ రోగిని తన సోదరుడుగా గుర్తించాడు. కలకాలము రోగులకు సోదరుడులాగే జీవితం గడిపాడు.

ధర్మాలకు ధనాన్ని విరివిగా ఖర్చు చేస్తూ ఉండడంవల్ల తండ్రిచేత అవమానింపబడి, వారసత్వపు హక్కులు లేకుండా చేయబడి, ఫ్రాన్సిస్ నిరాధారియై అడవులకు బయలుదేరాడు. తనను దేవునికర్పించుకున్నాడు. 'ఆ ప్రభువు పక్షులకాహారాన్ని స్తున్నాడు. పూలకు దుస్తులుగా రేకులనిచ్చాడు. అట్టి దయామయుడు తనను మాత్రం కరుణించడా'' అనుకున్నాడు. ఆ విధంగా పేదరికాన్ని ఫ్రాన్సిస్ వివాహమాడాడు. సృష్టి అంతా వివాహకానుక అయింది.

ఫ్రాన్సిసే యిపుడు బిచ్చగాడు. మొదటిసారి దాతల యింటి తలుపు తట్టడానికి శంకించాడు. అలాగే ఒకింటికి పోయి భగవన్నామమున్నుచ్చరిస్తూ ''బాబూ, మిగిలిపోయిన మీ ఆహారములోనిదేదైనా ఇస్తారా'' అని అడిగాడు- అందరి బిచ్చగాళ్ళలాగ. ఆ దినము అతనికి భిక్షాపాత్రలో దొరికినవి, కొంచెముగా పులుసు, ఎండిపోయిన రొట్టెముక్కలు, కేబేజీ ఆకులు, సగం కుళ్ళిన ద్రాక్షపళ్ళూను. ఆకలితో రోడ్డు ప్రక్కగా కూర్చున్నాడు తినడానికి. ఆ వస్తువులను చూచేసరికి గిర్రుమని తల తిరిగింది. వెంటనే తనను తాను సంబాళించుకొని ఇటువంటి పరిస్థితుల్లో ఇంతైనా లభించిందని ప్రభువుకు ధన్యవాదాలు చెప్పుకున్నాడు. ఆ గిన్నెను ఖాళీ చేశాడు. ఈ విధంగా భిక్షుక జీవితము గడపసాగాడు.

అటువంటి సమయంలో ఒక రోజున ఒక నిరుపేద స్త్రీ, ఆకలితో అలమటిస్తున్న తన బిడ్డలకేమైనా ఆహారము కొనుక్కుందుకు ఫ్రాన్సిస్‌ను బిచ్చమడిగింది. అతనివద్ద పైసా అయినా లేదు. ఏమీ సహాయము చేయలేక పోతున్నానే అని అతని బాధకి అంతులేదు.

"ప్రభూ, ఇదొక పరీక్షా!" అని వాపోయాడు. అతనివద్ద బైబిల్ పవిత్రగ్రంథ మొక్కటే ఉన్నది. "తల్లీ! ఈ పుస్తకాన్ని అమ్మి నీ బిడ్డల ఆకలి తీర్చుకో అమ్మా" అని ఆ బైబిల్ గ్రంథాన్ని ఆమె చేతులకందించాడు. ఆమె అటుగా వెళ్ళిన తర్వాత విలపించాడు. "ప్రభూ! ఆమె ఆర్తనాదాన్ని భరించలేకపోయాను. నీ మాటలు కాపాడుటకోసం, నావద్ద మిగిలిన నీ పవిత్రగ్రంథాన్నే యిచ్చేశాను. ఈ దీనుణ్ణి క్షమించు ప్రభూ" అని కంట తడిపెట్టాడు. అప్పుడే ఆ నిర్మలాకాశంలోంచి ప్రభువు యొక్క మాటలు వినవచ్చాయి.

"నీ హృదయంలో, నా సజీవ పవిత్ర గ్రంథాన్నే ఉంచాను. నన్నెవరు ప్రేమిస్తారో, నా మార్గాన్ని ఎవరు అనుసరిస్తారో, వారు నా వారు" అని.

మరో సమయంలో, భరించలేని పశ్చాత్తాపముతో క్రుంగిపోతూ, ఎవ్వరితోనూ చెప్పక, తన అనుచరులను వదలి, ఫ్రాన్సిస్ ఒక చిన్న చీకటి గుహకు పోయి దైవప్రార్థనలో మునిగిపోయాడు. తాను పూర్వము చేసిన కుకర్మలను మన్నించమని ప్రభువును వేడుకున్నాడు. ఏమి జరిగింది?

ప్రభువును ప్రార్థించుట కొఱకు పైకెత్తిన అతని చేతులు దేదీప్యమైన జ్యోతుల్లాగ మెరుస్తున్నాయి. చీకటితో నిండిన గుహంతా కాంతిమయమయింది. గోడలనున్న గబ్బిలాలు నక్షత్రాల్లా ప్రకాశిస్తున్నాయి. మధురశాంతి మయస్వరమొకటి తనను పిలిచి చెప్పింది.

"ఫ్రాన్సిస్! సంతోషముగా ఉండు. నీ పాపాలు మన్నించాను. శాంతి ఆనందమయమైన నా రాజ్యాన్ని నెలకొల్పడానికి నిన్ను నా ప్రతినిధిగా ఎన్నుకున్నాను" అని.

ఫ్రాన్సిస్ కళ్లు నులుముకుని తిరిగిచూచాడు, కలయేమోనని. కాదు. అతని చేతులు ఇంకా మెరుస్తూనే ఉన్నాయి. ఆ దృశ్యాన్ని యింకా బాగా చూడగలిగాడు. వేలాదివేల అనుచరులు నాల్గు ప్రక్కల నించి తనవైపుకు రావడం, తనను చుట్టి నిలవడం చూచాడు. ఆ దృశ్యం అంతర్ధానమయింది. ఇదే దైవానుభవము.

"ఏ మానవుడూ తన దేహాన్ని కాపాడుట కోసం ఎక్కువ శ్రమపడనవసరము లేదు; దైవచింతన విశ్వాసము ప్రధానము" అని ప్రచారము చేయనారంభించాడు.

క్రీ॥శ॥ 1219 లో మత విషయముగా ఫ్రాన్సిస్ ఒక పెద్ద సమావేశము ఏర్పాటు చేశాడు. 5000 మంది సన్యాసులు హాజరైనారు. విశాల నీలాకాశం క్రింద నేలపై పఱచిన గడ్డిచాపలు తప్ప వారికి వేరు బస ఏర్పాట్లు లేవు. ప్రభువుపై పూర్తి విశ్వాసముతో తనను తాను మఱచి ఫ్రాన్సిస్ సమావేశమును నడుపుచున్నాడు. భోజనసమయమయింది. ఫ్రాన్సిస్ ధ్యాననిమగ్నుడై యున్నాడు. తలవని తలంపుగా, ఎవరూ అడగకుండా, నాల్గువైపులనుండి, పల్లెలనుండి, పట్టణాలనుండి అనేకమంది ప్రజలు కంచరగాడిదెలపై పళ్లెములు, జాడీలు, కూజాలు, రొట్టెలు యితర తినుబండారాలను వేసుకుని సమావేశస్థలాన్ని చేరారు. గొప్ప ధనవంతులు గుఱ్ఱాలపై వచ్చి, ప్రతినిధులకు సేవ చేయనారంభించారు!

పవిత్ర ప్రేమ మానవులనే కాదు, సర్వ చరాచరములనుకూడ వశపఱచుకో గలదు. ప్రతికూలుడైన తన దేశపు రాజును ఫ్రాన్సిస్ ప్రేమతో అనుకూలము చేసుకొన్నాడు. బంది

పోటు దొంగలను తన అనునయ వాక్యాలతో, మంచిమాటలతో మత ప్రతినిధులుగా మార్చాడు.

అది చలికాలము. మత ప్రచారముకోసం ఫ్రాన్సిస్ గుబ్బియో ప్రాంతమునకు వచ్చాడు. ఆ ఊరి వెలుపల కర్రలతోను, కత్తులతోను వెడుతున్న కొంతమంది వ్యవసాయదారులను చూచాడు. "మీరంతా ఎక్కడకు ప్రయాణము?" అని అడిగాడు. మా గొర్రెలను తిని, మా కుక్కలతోనూ, గుఱ్ఱాలతోను పోరాడి, మా పంటలను నాశముచేసే ఒక తోడేలును పట్టడానికి వెడుతున్నాము" అన్నారు.

"సరి నేనూ మీతో వస్తాను" అని ఫ్రాన్సిస్ వారితో బయలుదేరాడు. అడవిలో ఉండే గుహా ప్రాంతాన్ని సమీపించారు. కొంత దూరములో మంచుతో నిండిన ఒక చదును ప్రదేశము మీదుగా నడుస్తున్న ఒక పెద్ద జంతువును చూచారు. "నేను మాట్లాడి వస్తాను, మీరంతా యిక్కడే ఉండండి" అని తోడేలు దగ్గరకు ఫ్రాన్సిస్ బయలుదేరాడు.

తోడేలును సమీపించి ఫ్రాన్సిస్ తన చేతిని చాపాడు. తోడేలు మెల్లగా అతణ్ణి సమీపించింది. వంగి ఏదో మాట్లాడాడు. అది నేలపై సాష్టాంగపడి, ఫ్రాన్సిస్ పాదాలను నాకడం ప్రారంభించింది. వీపుపై తట్టి, తనతో రమ్మని ఆదేశించాడు. ఆజ్ఞలను శిరసా వహిస్తూ, తోడేలు ఫ్రాన్సిస్ వెంట నడవనారంభించింది. గ్రామస్థులు ఆశ్చర్యపడ్డారు. అంతా కలిసి గుబ్బియో బజారుకు వచ్చారు. ఫ్రాన్సిస్ తన ప్రచారము ప్రారంభించాడు. చివరవరకు, తోడేలు భక్తి శ్రద్ధలతో అతని పాదాలవద్ద కూర్చున్నది. ఊరి ప్రజలంతా చెందారు. అదిమొదలు తోడేలు, ఊరివారందరి పెంపుడు జంతువుగా మారింది. ప్రజలు పోషించడం మొదలెట్టారు. తోడేలు కొన్నేళ్ళ తర్వాత చనిపోయినపుడు, ఊరంతా విచారంలో మునిగింది. ప్రేమ ప్రభావమేమని చెప్పగలము!

"జీవనము సామాన్యముగా నడపవలెను, ఆడంబరము హానికరము" అని ఫ్రాన్సిస్ ఉపదేశము. బొలోనా పట్టణములో అతని మత సంఘానికి ఆ వూరి ప్రజలంతా కలసి ఒక గొప్ప భవనాన్ని స్థాపించారు. ఆరంభ సమావేశానికి ఫ్రాన్సిస్‌ను పిలిచారు. భవనాన్ని చూచి "ఈ భవన నిర్మాణానికి ఎంతో సొమ్ము వృథాగా ఖర్చు చేశారు" అని వారిని నిందించి ఆ భవనాన్నించి వెళ్ళిపోయాడు. అతని జీవితంలో ఇతరులను పరుషంగా మాట్లాడడం అదే మొదటిసారి.

తర్వాత ఫ్రాన్సిస్ అడవులకు పోయి ఏకాంతంగా ధ్యానము చేయనారంభించాడు. క్రీ॥శ॥ 1224 వ సం॥లో సెప్టెంబరు 14 వ తేదీని, హృదయావేదనతో ప్రభువును మొర పెట్టుకున్నాడు.

"ప్రభూ, శిలువపై నీవు పడిన శరీరబాధ నా దేహంలోనూ, నీవు ఆ సమయంలో పడిన మానసిక వేదన నా మనస్సులోనూ కలిగేలా అనుగ్రహించుము. ప్రజలందరిపైన నీవు చూపే పవిత్ర ప్రేమానుభవము నాలోనూ కలుగునట్లు చేయుము" అని వేడుకున్నాడు. మఱుక్షణమే ఫ్రాన్సిస్‌కు తిరిగి దైవానుభవము గల్గింది. తన నేత్రాలతో దైవదర్శనము చేయగలిగాడు.

ఏసు ప్రభువును పోలి, పెద్ద రెక్కలతో ఎగురుతున్న ఒక దేవదూతను చూచాడు. చేతులు రెండు చాచి ఉన్నాయి. శిలువపై

మేకులతో బిగింపబడిఉన్నాయి. దేవదూత రెక్కలు రెండు తలపైన పఱచినట్లుగా నున్నవి. రెండు రెక్కలు చాపబడి ఉన్నవి. మరి రెండు రెక్కలు ఆ దేహాన్నంతనూ కప్పి ఉన్నవి. తదేక దృష్టితో చూస్తూ, బాధతో పెద్ద కేకపెట్టి, ఫ్రాన్సిస్ తెలివిగోల్పోయాడు. తెలివి వచ్చిన తర్వాత తన దేహాన్ని చూచుకోగా, శిలువ మేకుల ఆనవాళ్లు తన దేహం మీద ఉన్నాయి. ఆతని హృదయం కనికరంతో నిండిపోయింది. ఫ్రాన్సిస్ కోరిక నెఱవేరింది.

ఫ్రాన్సిస్ దేహారోగ్యము సన్నగిల్లనారంభించింది. వాతావరణ మార్పుకూడా అతనికి మేలు చేయలేదు. అవసాన దశ సమీపించినదని అతడు గ్రహించాడు. ఫ్రాన్సిస్ బాధను చూస్తూ, బాధపడుతున్న తన సోదరులలో ఒకడైన 'లియో'తో ఇక "నేను మీతో ఉండక పోవచ్చు, నాకడసారి కోరికలను నెరవేర్చండి" అని మరణ శాసనాన్ని ఈ విధంగా చెప్పాడు.

"మన సంఘంలో ఉన్న సోదరులందరినీ, సృష్టి అంతమయ్యేవరకు మన సంఘములో చేరబోయే సోదరులనీ, నేను దీవించుచున్నాను. ఈ నీరస స్థితిలో ఎక్కువ మాట్లాడలేను. నేను మిమ్మల్ని ప్రేమించినట్లే, మీరు ఒకరినొకరు ప్రేమించుకోవలెను. బీదలపై అమిత ప్రేమాతిశయమును చూపవలెను. మన ప్రభువుకు విశ్వాసపాత్రులైన సేవకులుగా మీరు ఉండాలి. మరొక్క మాట. బీదగానే నేను మరణించాలి, నన్ను నేలపై నగ్నంగా పరుండబెట్టండి" అని ముగించాడు.

ప్రక్కనున్న పొదలోంచి రెండు పక్షుల కిలకిలలు వినిపించాయి. దైవాన్ని ప్రతి జీవిలోనూ చూడగల్గినప్పుడు, ప్రతి జీవినీ దైవంగా గ్రహించినప్పుడు ఆ వ్యక్తి దైవంతో సమానమౌతాడు, ఐక్యమైపోతాడు.

## డిసంబరు నెలలోని కొన్ని ముఖ్యదినములు

10 వ తేదీ సోమవారము....మాతృశ్రీ శారదాదేవి జయంతి

15 వ తేదీ శనివారము....స్వామి శివానంద జయంతి

16 వ తేదీ ఆదివారము....మాతృశ్రీ శారదాదేవి జయంతి బహిరంగ సమావేశము

24 వ తేదీ సోమవారము....స్వామి శారదానంద జయంతి

25 వ తేదీ మంగళవారము....క్రిస్మస్ మహోత్సవము

29 వ తేదీ శనివారము....వైకుంఠ ఏకాదశి

# భాగవతతత్త్వానుసంధానము (పరీక్షిత్తు కథ)

డాక్టర్ ధూళిపాళ శ్రీరామమూర్తి

శ్రీమద్భాగవతం అష్టాదశ మహా పురాణాలలోను శిరోమణివంటిది. ఇది పురాణమే అయినప్పటికి దీనికి వ్యాఖ్యానాలు వ్రాసిన మహాపండితులందరు శాస్త్రగౌరవం ఇచ్చారు. పండితలోకంలో ఈ గ్రంథానికి ఉన్న విశేష గౌరవం చెప్పాలంటే 'విద్యావతాం భాగవతే పరీక్ష' అనే మాట చాలు. ఏ విద్యలోనైనా అనుమానం వస్తే దానికి పరిష్కారం భాగవతంలో దొరుకుతుంది. ఈ మహా గ్రంథాన్ని ప్రవర్తింపచేసింది మహాముని. అంటే శ్రీమన్నారాయణమూర్తి. దీని మహిమ ఇంత అని చెప్పటానికి దీని ప్రవర్తకులలో ఒకడైన ఆదిశేషునికైనా సాధ్యం కాదు. అల్లాంటప్పుడు నాబోటి అజ్ఞుడు అల్పజ్ఞుడు దీన్ని గురించి వ్రాయబూనుకోవటం సాహసాల్లోకెల్లా సాహసమే అవుతుంది. మరి ఎందుకు వ్రాస్తున్నావయ్యా? అంటే నేను పెద్దలవల్ల విన్నదాన్ని పునఃపునరనుసంధానం చేసికొని మనసుకు పట్టించుకొందామనీ, జన్మ చరితార్థం చేసికొందామనీ తప్ప మరొక దృష్టి కానేకాదు. ముఖ్యంగా నేను వ్రాయబోయేది ఆయాకథలయందున్న విశేషాలు, ఆ కథలు చెప్పటంలోగల సౌందర్యం, ఆ కథల ద్వారా చేసిన తత్త్వవివరణం ఇది. ఈ భాగవత గ్రంథంలో మహా విశేషాలనేకం ఉన్నాయి. తగాదాలు అనేకం ఉన్నాయి. అనేక వ్యాఖ్యానాలు ఉన్నాయి. అనేక క్లిష్ట ఘట్టాలున్నాయి. పూజ్యులు శ్రీ కరపాత్రీస్వామి వారి వంటి కొందరు మహానుభావులను మినహాయిస్తే ఎటువంటి పండితులకైనా కొరుకుడు పడని ఘట్టాలున్నాయి. కొన్ని శ్లోకాలకు పది పదిహేను అర్థాలుచెప్పే ఇంకా అనేక స్వారస్యాలు చెప్పే పండితులున్నారు. వారందరకి శతసహస్ర వందనాలుపెట్టి ఇది వారికోసం వ్రాసేది కాదని వారికి మనవి చేస్తున్నాను. కేవలం సామాన్యులైన జిజ్ఞాసువులకు ఇది, భాగవతంలో ఉండే పరమార్థం కొంత తెలిసికోటానికుపకరిస్తే ఉపకరింపవచ్చు. వారికుపకరించినా ఉపకరించకపోయినా నాకు మాత్రం మననానికి నిధిధ్యాసనానికి ఉపయోగిస్తుందనే విశ్వాసంతో దీనికి "భాగవతతత్త్వానుసంధాన"మని నామకరణం చేశాను. విజ్ఞులు క్షమింతురు గాక!

ప్రధానంగా ఈ భాగవతం పరీక్షిన్మహారాజును బట్టి ఈ లోకంలో ప్రచారమైంది. కాబట్టి తొలిగా ఆయన కథను విచారణచేస్తే భాగవత తత్త్వం మనకు చాలవరకు తెలుస్తుంది. ఇంతేకాకుండగా గ్రంథతాత్పర్యాన్ని నిర్ణయించటానికి ఉపకరించే లక్షణాల్లో ఉపక్రమోపసంహారాలు మొదటిది. ఈ పరీక్షిచ్చరితం ఉపక్రమోపసంహారములు రెండింటిల్లోను వ్యాపించి ఉంది. అందుచేత కూడ దీన్ని మొదటగా విచారించటం బాగా ఉంటుంది. పరీక్షిన్మహారాజు మహా పుణ్యాత్ముడు. పరమధార్మికుడు. తల్లి గర్భంలో ఉండగానే పరమేశ్వర దర్శనం చేసినవాడు. ఈ సందర్భంలో భాగవతంలో వ్రాసిన శ్లోకాలు చూడండి.

1. మాతుర్గర్భగతో వీరస్సతదా భృగునందన।
   దదర్శ పురుషం కంచిద్దహ్యమానోఽస్త్రతేజసా ॥
2. అంగుష్ఠమాత్రమమలం స్ఫురత్పురటమౌళినం।
   అపీచ్యదర్శనం శ్యామం తటిద్వాససమచ్యుతమ్ ॥
3. శ్రీమద్దీర్ఘచతుర్బాహుం తప్తకాంచనకుండలం।
   క్షతజాక్షం గదాపాణిమాత్మనస్సర్వతో దిశమ్ ॥
4. పరిభ్రమంతముల్కాభాం భ్రామయంతం గదాం ముహుః।
   అస్త్రతేజస్స్వగదయా నీహారమివ గోపతిః।
5. విధమంతం సన్నికర్షే పర్యైక్షత క ఇత్యసౌ ॥

ఈ విధంగా గర్భగతుడై పరమేశ్వర దర్శనం చేసిన వాడాయన. ఆయనకు విష్ణురాతుడనీ, పరీక్షిత్తనీ పేరు వచ్చింది. విష్ణువుచేత రక్షింపబడ్డాడు కాబట్టి విష్ణురాతుడు. 'రాతోవోఽనుగ్రహార్థాయ విష్ణునా ప్రభవిష్ణునా। తస్మాన్నామ్నా విష్ణురాత ఇతి లోకే బృహచ్ఛ్రవాః ॥ భవిష్యతి న సందేహో మహాభాగవతోత్తమః।'

పుట్టగానే, గర్భంలో వుండగా తాను చూచిన ఆ రూపం ఎక్కడైనా కన్పిస్తుందేమోనని కనిపించిన వాళ్ళనందర్నీ పరీక్షగా చూచాడట అందుచేత ఆయనకు పరీక్షిత్తు అనే పేరు వచ్చిందట.

స ఏష లోకే విఖ్యాతః పరీక్షిదితి యత్ప్రభుః।
గర్భదృష్టమభిధ్యాయన్ పరీక్షేత నరేష్విహ ॥

ఈ శ్లోకానికి పై అర్థమే కాకుండా తాను చూచిన మనుష్యులందర్లో పరమేశ్వర దర్శనం చేసినవాడని కూడ అర్థం చెప్పవచ్చు. గర్భంలో చూచిన ఆ రూపాన్ని నిరంతరం ధ్యానం చేయడం ఆయనకలవాటయిపోయింది. అందుచేత సర్వత్ర పరమేశ్వరదర్శనమే చేస్తుండేవాడన్న మాట. ఈయన పుట్టగానే ధౌమ్యుడు, కృపుడు మొదలైన మహానుభావులను పిలిపించి ధర్మరాజు జాతకర్మ చేయించాడు. వారు అప్పటి గ్రహ సంపత్తినిబట్టీ వారికుండే దివ్య దృష్టినిబట్టీ పరీక్షిత్తు భవిష్యజ్జీవితమునంతా ధర్మరాజుకు చెప్పినారు. "ఈయన ఇక్ష్వాకువువలె ప్రజలను రక్షిస్తాడు.

శ్రీరామునివలె బ్రహ్మణ్యుడు సత్యసంధుడు. శిబిచక్రవర్తి వలె శరణాగతులను రక్షించేవాడూ, మహాదాత అవుతాడు. దుష్యంతపుత్రుడు భరతునివలె తన వంశప్రతిష్ఠను ఇనుమడింపజేస్తాడు, అనేక యజ్ఞములు చేస్తాడు. అర్జునునివలె కార్తవీర్యార్జుననివలె గొప్ప విలుకాడౌతాడు. అగ్నిహోత్రునివలె చెనకరానివాడౌతాడు. సముద్రునివలె మీరరానివాడౌతాడు. సింహమువలె పరాక్రమవంతుడు. హిమవంతునివలె సత్పురుషులకు సేవ్యుడౌతాడు. భూమివలె ఓర్పుగలవాడౌతాడు. తల్లిదండ్రులవలె తప్పులు కాచేవాడౌతాడు. ఇల్లా అన్నింటిల్లో ఆయాగుణముల్లో ప్రసిద్ధులైన వారితో సాటి అవుతాడు. సర్వభూత సామ్యమునందు బ్రహ్మ, ప్రసాదమునందు శివుడు, సర్వభూతములకు ఆశ్రయమగుటలో సర్వసద్గుణమాహాత్మ్యములో విష్ణువు, ఔదార్యమునందు రంతిదేవుడు వంటి వాడౌతాడు. యయాతివలె ధార్మికుడౌతాడు. బలిచక్రవర్తివలె ధైర్యవంతుడౌతాడు. ఈయన ప్రహ్లాదునివలె విష్ణుభక్తుడౌతాడు. అనేకాశ్వమేధ యాగములు చేస్తాడు. వృద్ధోపసేవ చేస్తాడు. రాజర్షులైన, పుత్రులను పొందుతాడు. దుష్టులను శిక్షిస్తాడు. కలిని నిగ్రహించి ఈ భూమినీ ధర్మమునూ కాపాడుతాడు. కాని రాజా! ఒక బ్రాహ్మణబాలుని శాపమువల్ల, తనకు తక్షకుని చేత మరణం కలుగుతుందని తెలుసుకొని సర్వసంగ పరిత్యాగం చేసి పరమేశ్వర పాదాశ్రయణం చేస్తాడు. వ్యాససుతుడైన శుకమహర్షి వల్ల ఆత్మస్వరూపమును తెలుసుకొని, ఈ మానవ శరీరమును గంగయందు వదలిపెట్టి అభయమైన స్థితిని పొందుతాడు.'' ఈ విధంగా ధౌమ్యాదులు పరీక్షిత్తును గురించి చెప్పారు.

పరీక్షిత్తు అంత మహానుభావుడు. ఆయన యిట్టి సద్గుణాలు కలవాడు, ఇంత మహానుభావుడూ ఇట్లా మరణం పొందుతాడు. ఇదంతాకూడ ఆయన జీవితం ఎట్లా జరుగుతుందో ఆయన పుట్టకపూర్వమే నిర్ణయమై వున్నది అని మనకు చెపుతుంది. మన జీవితాలైనా అంతే. మనమనుకొంటాంకదా ఇదంతా మనచేతిలోవుందీ, మనమిట్లా చేశాంకాబట్టి యిట్లాంటి ఫలితం సంపాదించాం మనకు వచ్చే లాభాలన్నింటికీ, నష్టాలన్నింటికీ మన ప్రయోజకత్వమో, అప్రయోజకత్వమో కారణమనుకొంటాం. మనం చూడగలిగినంతవరకు అది సత్యమే. కాని ఇంకా కొంచెం వెనక్కుచూస్తే అట్లాంటి ఫలితం రావటానికి మనం అట్లా చేయటం కారణమనుకొన్నాం కదా! అట్లాగే మనం చేయటానికి కారణమేమిటో బోధపడుతుంది. సరే! తీగలాగితే డొంకంతా కదులుతుంది. మొత్తం డొంకనంతా ఇక్కడేలాగకుండా ఇంకా బోలెడు కథవుంది కాబట్టి ఆయా సందర్భాల్లో కొంత ఎట్లాగూ లాగకతప్పదు కాబట్టి పైకథకుపోదాం. పరీక్షిత్తు మహానుభావుడూ, పరమ ధార్మికుడూ మహాభాగవతుడూ అనేది ప్రస్తుతాంశం.

ఇటువంటి పరీక్షిన్మహారాజు ధర్మరాజుచేత అభిషిక్తుడై భూమండలాన్ని పరిపాలించటం మొదలుపెట్టాడు. ఉత్తరుని కుమార్తెయయిన యిరావతిని వివాహం చేసికొన్నాడు. ఆమెయందు జనమేజయాదులు నలుగురు పుత్రులను కన్నాడు. బాగా దక్షిణలిచ్చి కృపాచార్యుడు గురువుగా గంగానది ఒడ్డున మూడశ్వమేధయాగములు చేశాడు. దేవతలు ఆయన యాగములందు ప్రత్యక్షంగా వచ్చి హవిస్సులు గ్రహించారు. ఆయన దిగ్విజయానికి బయలుదేరిపోతూ కురుజాంగలదేశంలో వున్నప్పుడు తన రాజ్యంలో కలి ప్రవేశించాడని విని ధనుర్బాణాలు ధరించి సింహధ్వజమెత్తించి నల్లగుర్రాలు కట్టించిన రథమెక్కి చతురంగబలంతో బయలుదేరి భద్రాశ్వము, కేతుమాలము, భారతము, ఉత్తరకురువులు, కింపురుషం మొదలైన వర్షాలను జయించి ఆయారాజులవల్ల కప్పములు గ్రహిస్తూ తన తాతలైన పాండవుల యశోగీతములు వింటూ వాని యందు సూచింపబడ్డ శ్రీకృష్ణ ప్రభావాన్నీ ఆయన అశ్వత్థామ ప్రయోగించిన అస్త్రమునుండి తన్ను కాపాడటాన్నీ, యాదవ పాండవులకు ఆయనయందుగల భక్తిని తెలిసికొని సంతుష్టుడై ఆ పాడినవారికి ధనము వస్త్రములూ హారములూ మొదలైనవి బహుమతులుగా ఇస్తూ, ఒక చోట ఒక ఆశ్చర్యాన్ని చూచాడు.

ఏమిటంటే, ధర్ముడు వృషభరూపంలో ఒంటికాలిమీద నడుస్తూ దూడలేని తల్లిమాదిరిగా బక్కచిక్కివున్న గోరూపధారిణియైన భూమిని ఇట్లా ప్రశ్నించాడు. ''అమ్మా! నీవేమిటి ఇట్లావున్నావు? చిక్కిపోయి ముఖం వాడిపోయి కన్పడుతున్నావు? నీ మనస్సులో ఏదో దుఃఖం వున్నట్లుగా నాకు గోచరిస్తోంది. ఎక్కడోవున్న నీ బిడ్డలను గూర్చి దుఃఖిస్తున్నావా? లేక మూడు పాదాలు లోపించి మిగిలిన ఒక పాదంతో ఎల్లాగో నిలబడివున్న నన్ను గురించి దుఃఖిస్తున్నావా? లేక దేవతలనుండి రాక్షసులు హవిస్సులు లాక్కుంటున్నారని విచారిస్తున్నావా? వర్షాలు కురవక ప్రజలు క్షుత్పీడితులైనారని బాధపడుతున్నావా? స్త్రీలను భర్తలు రక్షించటంలేదనీ, పిల్లలను తండ్రులు రక్షించటం లేదనీ విచారిస్తున్నావా? నికృష్టకర్ములైన బ్రాహ్మణుల పాలైన సరస్వతీదేవిని గూర్చి విచారిస్తున్నావా? బ్రహ్మద్వేషం కలిగిన రాజుల్ని బ్రాహ్మణులు సేవిస్తున్నారని

బాధపడుతున్నావా? లేక కలిచేత ఆవిష్టులైన దుష్ట క్షత్రియులపాలనలో రాజ్యాలు భూతవిప్లవంచేత నశించిపోతున్నాయని విచారిస్తున్నావా? జనులందరూ కేవలం ఆహార నిద్రాభయమైథున పరులైనారని విచారిస్తున్నావా? ఈ భూభారాన్ని హరించటానికి పుట్టిన ఆ పరమేశ్వరుడు తన కార్యం నిర్వర్తించి శరీరం చాలించి వెళ్ళిపోతే ఆయన చేసిన పనులు స్మరించుకొంటూ దుఃఖిస్తున్నావా? నీ మనస్సులో వున్న దుఃఖానికి కారణం ఏమిటో చెప్పుమమ్మా! నీ పూర్వ సౌభాగ్యం ఎట్లాంటిది! దుష్టకాలంవచ్చి ఇప్పుడిల్లా అయినావు.''

ఈ మాటలు విని భూదేవి ఆయనకు సమాధానం చెపుతున్నది. ''నాయనా ధర్మమూర్తీ. నా దుఃఖానికి కారణం నీకు తెలిసే అడుగుతున్నావు. పరమేశ్వరుడైన శ్రీనివాసుడు ఈ లోకాన్ని వదలిపెట్టి వెళ్లాడు. ఆయనయందు సత్యము శౌచము, దయ, క్షాంతి, త్యాగము, సంతోషము, ఆర్జవము, శమము, దమము, తపస్సు, సామ్యము, తితిక్ష, ఉపరతి, శ్రుతము, జ్ఞానము, విరక్తి, ఐశ్వర్యము, శౌర్యము, తేజము, బలము, స్మృతి, స్వాతంత్ర్యము, కౌశలము, కాంతి, ధైర్యము, మార్దవము, ప్రాగల్భ్యము, ప్రశ్రయము, శీలము, సహస్సు, ఓజస్సు, భగము, గాంభీర్యము, స్థైర్యము, ఆస్తిక్యము, కీర్తి, మానము, అనహంకారము- ఈ ముప్పదితొమ్మిది గుణములూ, ఇంకా బ్రహ్మణ్య శరణ్యత్వాది అనేక మహాగుణములు ఆయనకు సహజ సిద్ధములుగా వుండేవి. అటువంటి శ్రీకృష్ణస్వామి నన్ను వదలిపెట్టి వెళ్ళాడు. పైగా మహాపాపియైన కలి ఇప్పుడు ఈ లోకంపైన విజృంభించినాడు. నేను, నీవు, దేవతలు, ఋషులు, పితృదేవతలు, సాధువులు, సర్వ వర్ణాశ్రమములు కలి విజృంభణమువల్ల ఎల్లా దెబ్బతిన్నామో చూస్తూంది ఎల్లా దుఃఖించకుండా వుండగలము? బ్రహ్మాదులైన మహానుభావులు ఆ శ్రీకృష్ణస్వామి ఒక్కమాటు కడగంట చూస్తే చాలని తపస్సు చేస్తూంటారు. సాక్షాత్తు లక్ష్మీదేవి తన వాసమైన పద్మవనాన్ని వదలిపెట్టి ఆయన పాదలావణ్యాన్ని కోరివచ్చి సేవిస్తుంది. అట్టి పరమేశ్వరుడైన శ్రీకృష్ణప్రభువు పద్మ కులిశాంకుశ ధ్వజాది శుభ చిహ్నాంకితమైన పాదాలు మోపి నేను మూడులోకాల్ని అతిక్రమించి ప్రకాశిస్తూ వుండేదాన్ని. ఆయన అసురవంశ జాతులైన రాజుల అక్షౌహిణీశత భారాన్నిదించి నన్ను ఆశ్వాసించాడు. లూనములైన నీ పాదాల్ని సంపాదించిపెట్టాడు. ఆయన నాపైన నడుస్తూంటే నా శరీరం పులకించేది. ఆయన ప్రేమావలోకములు, ఆయన చిరునవ్వు, ఆ చమత్కారపు మాటలతో సత్యభామాది భార్యలను ఎలా మోహపెట్టేవాడో, వాళ్ళగర్వం, వాళ్ళ ధీరత్వం ఎల్లా అపహరించేవాడో! ఆయన విరహం ఎవరు సహించగలరు నాయనా?''

ఈ విధంగా మాట్లాడుకొంటూన్న పృథ్వీ ధర్మమూర్తులను కురుక్షేత్రంలో పూర్వవాహినియైన సరస్వతీ తీరంలో పరీక్షిన్మహారాజు చూస్తూండగా రాజవేషం ధరించి దండహస్తుడైన వృషలుడొకడు ఆ గోమిథునాన్ని కొట్టటం మొదలుపెట్టాడు. వాణ్ణిచూచి ఆ వృషభం భయపడి పంచ తిల్లినది. ఒకే కాలుమీద నిలబడి వణికిపోతున్నది. దాన్ని వాడు కర్రతో కొట్టాడు. ఆ ఇక్కచిక్కిపోయిన దుడలేని గోవును కాలితో తన్నాడు. అది చూచి పరీక్షిన్మహారాజుకు కోపం వచ్చింది. ఆయన ధనుస్సు ఎక్కుపెట్టి మేఘ గంభీరమైన వాక్కుతో ''ఒరే! ఎవడవురా నీవు? ఈ లోకమంతా నా రక్షణలోనిది. బలవంతుడవై బలహీనులను బాధపెడుతున్నావు. నటుడు మాదిరిగావున్నావు. వేషం చూస్తే రాజుమాదిరిగా వున్నావు. చేసేపని చూస్తే కిరాతకుడుగా ఉన్నావు. కృష్ణార్జునులిద్దరూ ఈ లోకాన్ని వదలిపెట్టి పోయినారని నిరపరాధుల్ని రహస్యంగా బాధిస్తూ అపరాధంచేశావు. నీకు సరియైన దండనం మరణమే. ఓ వృషభరాజా! ఒంటికాలిమీద చరిస్తూ మమ్మ దుఃఖింపచేస్తున్న నీ వెవరు? ఎవరో దేవతవే అయి వుంటావు. కౌరవరాజుల బాహుదండములతో రక్షింపబడే ఈ భూమండలంలో ఒక్క నీ కంటినుండి తప్ప యింకా ఏ ప్రాణి కంటినుండి నీళ్లు కారలేదు. నాయనా! కామధేనుపుత్రా ఏడువబోకు. నీకు ఈ వృషలుని వల్ల భయంలేదు. అమ్మా! గోమాతా! నీవుకూడ ఏడువబోకు. సర్వ జీవులకు నేను శాసకుడనైయుండగా నీకు దుఃఖం కలగటానికి వీలులేదు. నీకు కుశలమే కలుగుతుంది. ఏ రాజు రాష్ట్రంలో ప్రజలందరూ దుర్మార్గులచేత పీడింపబడుతారో అటువంటి మదమత్తుడైన రాజుకు కీర్తి, ఆయువు, భాగ్యము, పరలోకము నశిస్తవి. దుఃఖితులయొక్క దుఃఖాన్ని పోగొట్టడమే రాజులకు పరమధర్మం. అందుచేత భూతాలకు ద్రోహంచేసే యీ దుర్మార్గుణ్ణి చంపివేస్తాను. ఓ వృషభరాజా! నీ నాల్గు పాదాలలో మూడు పాదాలు తెగగొట్టినవాడెవడు? నిరపరాధియైన నీ బోటివారికి ఇటువంటి విరూపం కలిగించిన దుర్మార్గుడెవడో చెప్పు. కృష్ణానువర్తులైన రాజుల రాజ్యంలో నీవలె దుఃఖించేవారుండరాదు. నిరపరాధియైన జనానికి అపరాధం చేసేవాళ్ళకందరకు నానుండి భయం తప్పదు. నిరంకుశుడై నిరపరాధులను బాధపెట్టేవాడు వాడు మనుష్య

డైనా, దేవతల్లోవాడైనా, భుజకీర్తులు పెట్టుకొన్నవాడి భుజాన్ని ఖండించివేస్తాను. స్వధర్మంలో వున్న జనాన్ని కాపాడటం కంటె ఆపత్తులేని కాలంలో అధర్మాన్ని అనుసరించేవాళ్ళను దండించటంకంటె పరమమైన ధర్మం రాజుకు లేదు.''

ఆ మాటలకు ఆ వృషభమూర్తి బదులు చెపుతున్నాడు. ''బాబూ! నీవు పాండవకులంలో పుట్టావు. నీవు కష్టంలో వున్నవాళ్ళకి అభయం ఇచ్చేమాటలు చెప్పటం యుక్తమే. ఆ పాండవుల గుణగణాలను చూచే వారికి శ్రీకృష్ణస్వామి దౌత్యాది కార్యములు నిర్వహించినాడు గదా! ఎవరివల్ల మేము ప్రాణులకు క్లేశాన్ని కలిగించేవాళ్ళమైనామో మాకు తెలియదు. పలువురు పలువిధాలుగా చెపుతారు. యోగులు ఏమంటారంటే తన దుఃఖానికి తానే కారణమంటారు. దైవజ్ఞులు గ్రహాలు కారణమంటారు. మీమాంసకులు కర్మ అనీ, లోకాయతకులు స్వభావమనీ చెప్పుతారు. ఈశ్వరవాదులు వూహించటానికీ, చెప్పటానికీ వీలులేని పరమేశ్వరునివల్ల సర్వమూ నడుస్తున్నదని చెపుతారు. కాబట్టి నీ బుద్ధిబలంతో ఈ విషయాన్ని తగినట్లు విచారణ చేయవలసింది.'' ఈ మాటలు విని మనసును సమాధాన పరచుకొని పరీక్షిత్తు అంటున్నాడు. ''అయ్యా! నీవు ధర్మజ్ఞుడవు. ధర్మము చెపుతున్నావు. వృషభరూపం ధరించిన ధర్ముడవు నీవని నా భావన. ఎందుకంటె? అధర్ములు చేసిన దోషస్థానాన్ని సూచించేవారికి కూడ ఆ దోషం సంభవిస్తుంది. అట్లాకాక ఈశ్వరమాయవల్ల కూడ ఆ దోషం ఎవరిదో నిర్ణయించటం కష్టమూ కానూవచ్చు. అది వూహకుగాని మాటకుగాని అందేది కాకపోవచ్చు. కృతయుగంలో తపస్సత్యదయా శౌచములు నాలుగూ నీకు పాదములు. వాటిలో అధర్మాంగములైన గర్వ సంగ మదముల చేత మూడు పాదములు భగ్నములైనవి. ఇప్పుడు సత్యమనే పాదం ఒక్కటి మాత్రమే నీవు నిలవటానికి ఆధారంగా వుంది. అనృతంచేత వృద్ధిపొందిన యీ కలి దాన్ని కూడ భగ్నం చేయ్యాలని చూస్తోంది. పరమేశ్వరుడవతరించి యీ భూభారాన్నంతా దింపాడు. ఆయన పాదములు మోపటంవల్ల యీమె శరీరం పులకించింది. ఆయన వీడిపోవడంవల్ల బ్రాహ్మణద్వేషులైనవాళ్లు పరిపాలకులై తన్ను నుభవిస్తారని ఇప్పుడు దుఃఖిస్తున్నది.'' అని పరీక్షిన్మహారాజు అధర్మహేతువైన కలిని నిగ్రహించడానికి తన వాడియైన కత్తిని దూసినాడు.

అప్పుడు కలిపురుషుడు భయంతో వణికిపోతూ ఆయన పాదాల మీద పడ్డాడు. కీర్తిమంతుడూ దీనవత్సలుడూ శరణ్యుడూ బుద్ధిమంతుడూ అయిన ఆ పరీక్షిన్మహారాజు కలిని చంపక నవ్వుతూ ఇలా అన్నాడు. ''ఓయీ! నేను అర్జునుని వంశంలో పుట్టాను. నమస్కారం చేసినవాళ్ళకు మా వల్ల భయంలేదు. కాని నీవు అధర్మానికి చుట్టానివి. అందుచేత నా రాజ్యంలో వుండకూడదు. నీవు రాజుల్ని ఆవేశించడంవల్ల లోభమూ, అనృతమూ, దౌర్జన్యమూ చౌర్యమూ, పాపమూ, అలక్ష్మి, కపటమూ, కలహమూ, దంభమూ మొదలైన అధర్మసమూహము నీతోబాటు వారిని ఆవేశిస్తవి. కాబట్టి ధర్మస్థానమైన యీ బ్రహ్మావర్త దేశంలో యాజ్ఞికులు యజ్ఞాలు చేస్తూ యజ్ఞేశ్వరుడైన పరమేశ్వరుణ్ణి అర్చిస్తూ వుంటారు. యజ్ఞమూర్తియైన హరి అర్చింపబడుతూ అర్చించేవాళ్ళకు సుఖం కలిగిస్తాడు. ఆయన ఆత్మస్వరూపుడు. స్థావరజంగమాత్మకమైన సర్వజీవులకూ బహిరంతరములలోవ్యాపించి వారికి కోరికలనూ క్షేమములనూ ఇస్తుంటాడు. ఇట్టిచోట నీవుండరాదు.'' ఆయన మాటలకు కలి వణికిపోతూ ''రాజా! నేనెక్కడ వున్నప్పటికీ నీ భయం నాకు తప్పటంలేదు. ఎక్కడ చూచినా నీవే ధనస్సునెక్కుపెట్టి కన్పడుతున్నావు. కాబట్టి నాకు నిలవటానికి చోటేదో చెప్పు''మని కోరాడు. అప్పుడు పరీక్షిన్మహారాజు కలికి ద్యూతము, పానము, స్త్రీలు, హింస, అను నాలుగు స్థానములిచ్చినాడు. ఈ నాలుగు అధర్మనిలయములు. కలికి ఈ స్థానములు చాలక మరికొన్ని యీయమని అడిగినాడు. అప్పుడు బంగారు అనే ఐదవ స్థానాన్ని యిచ్చినాడు. దీనివల్ల అనృత, మద, కామ, రజో, వైరములను పంచస్థానములిచ్చినట్లయింది. కాబట్టి ఈపైన చెప్పిన పంచ విషయములను అనగా ద్యూత, పాన, స్త్రీ, హింసా, సువర్ణములను బ్రతుకదలచుకొన్నవాడు సేవింపరాదు. ధర్మశీలుడైన రాజు అసలు సేవించరాదు. స్త్రీ సువర్ణాలు లేకుండ లోకప్రవృత్తి సాగదు. కాబట్టి ఈ రెండిటినీ సేవించకూడదంటే అర్థం వాటియందు ఆసక్తి లేకుండా వుండటమని గ్రహించాలి. ఇట్లు పరీక్షిన్మహారాజు వృషభమూర్తియైన ధర్మునకు నష్టమైపోయిన తపోదయా శౌచములను మూడుపాదములను సమకూర్చి, భూదేవిని వోదార్చి, వర్ధిల్ల జేసినాడు. ఆయన మహానుభావత యట్టిది.

ఈ పై కథనంవల్ల పరీక్షిత్తు ఎటువంటి మహానుభావుడు ఎంత ధర్మమూర్తియో మనకు తెలుస్తున్నది. ఆయన పరిపాలనలో వెతికి పట్టుకోటానికి ఎక్కడా లోపంలేదు. సార్వభౌమునకుండదగ్గ మహా గుణాలన్నీ మనకు

కప్పిస్తవి. ఉండకూడని దుర్గుణం ఒక్కటీ కప్పించదు. అసలు కథ యిక్కడనుండి ప్రారంభమౌతుంది.

ఇల్లాంటి పరీక్షిన్మహారాజు ఒకనాడు బయలుదేరి వేటకు వెళ్ళాడు. ధనువెక్కుపెట్టి ఒక లేడివెంట పడిపోయి, అలసిపోయినాడు. ఆయనకు బాగా దాహమైంది. ఆకలైంది. ఎక్కడా జలాశయం కప్పించలేదు. పోగా పోగా ఒక ఆశ్రమం కన్పించింది. లోపలకు వెళ్లాడు. అక్కడొక ముని కూర్చుని వున్నాడు. శాంతంగా వున్నాడు. కళ్ళు మూసికొని వున్నాడు. అయన యింద్రియములూ, ప్రాణములూ, మనస్సూ, బుద్ధీ, లోపలకు లాగబడటంచేత వుపరతములై వున్నవి. అంటే బయటకు ప్రసరించకుండా నిలుకడచెంది వున్నవి. ఆయన జాగ్రత్స్వప్న సుషుప్తులనే మూడుస్థానములనూ దాటి తురీయ (నాల్గవ) స్థానమును పొంది నిర్వికారుడై బ్రహ్మభూతుడైవున్నాడు. ఆయన జడలు చెదరి శరీరమంతా కప్పుకొని వున్నవి. ఆ పైన యిఱ్ఱితోలు కప్పుకొన్నాడు. అలావున్న ఆ మునిని చూచి పరీక్షిన్మహారాజు ఎండిన గుత్తుకతో సవ్వడి లేని మాటలతో నీళ్లు అడిగాడు. సమాధానంలేదు. ఆయన కూర్చోమనలేదు. అర్ఘ్యపాద్యాదులివ్వలేదు. ప్రియవచనాలు పలుకలేదు. రాజుకు కోపం వచ్చింది. ఆ ముని తన్నవమానం చేశాడనుకొన్నాడు. అసలే దాహంతో ఆకలితో బాధపడుతున్నాడు. అందులో ఈ అవమానం. దానితో ఆయనకు మత్సరం కోపం పుట్టుకవచ్చినవి. "ఈయన నిజంగానే సమాధిగతుడై కళ్ళు మూతలుపడి వున్నాడా? లేక ఈ క్షత్రబంధువు వచ్చియేమి? పోయి యేమవి విరాదరంతో సమాధి నటిస్తున్నాడా? ఇది నటనే అయివుంటుంది. లేకపోతే ఈయనతపస్సు ఇంత ఆత్మానుసంధానం పొందిందా?" అని అక్కడే చచ్చిపడివున్న ఒక పామును ధనురగ్రంతో యెత్తి ఆయన మెడలో వేసి తన పట్టణానికి వెళ్ళిపోయినాడు.

దీని దుంపతెగ ఈ మానవ స్వభావం ఎంత విచిత్రమో చూడండి. పరీక్షిత్తు ఎటువంటివాడో పూర్వం తెలిసికొన్నాం కదా? ఆయన యేమిటి? ఈ పని చేయటం ఏమిటి? అంత మహానుభావుడై, అంతధర్మాత్ముడై కలిపురుషుణ్ణి నిగ్రహించిన వాడాయె. ఇదేమిపని? ఈ వేటకెందుకు వచ్చినట్లు? ఆ లేడివెంట ఎందుకు పడ్డట్టు? ఎక్కడా నీళ్ళు కప్పించకపోవడమేమిటి? ఈ ప్రశ్నలకు ఏదో విధంగా సమాధానం చెప్పుకోవచ్చు. అడవిలో మృగాలు వృద్ధిపొంది ప్రజలపంటల్ని పాడుచేస్తూండి వుండవచ్చు. ప్రజలు గోలపెడితే రాజు వేటకు వెళ్ళియుండవచ్చు. లేక, ఆయనకు చిక్కకుండా యెలయించుకపోయి యుండవచ్చు. అది అడవికాబట్టి యెక్కడా నీళ్ళు కనిపించకపోయి యుండవచ్చు. కాని ఆశ్రమంలోనికి వెళ్లిన తర్వాత ఆ ఆశ్రమంలో గాని సమీపంలోగాని జలాశయం వుండకుండా వుండదు. ఆ సమాధిలోవున్న మునిని నీళ్ళడగటమెందుకు? అడగటానికి కూడ గొంతు పెగలకపోతే ఆయనకు ఎట్లా వినబడిందనుకొన్నాడు రాజు? ఆయన దొంగసమాధిలో ఉన్నాడని యెట్లా అనుకొన్నాడు? కాని అనుకొన్నాడు అనుకోకపోతే కథ లేదు కాబట్టి అనుకొన్నాడనుకొందామా? ఈ మహర్షులు వ్రాసిన కథలన్నింటిల్లోను ఇల్లాంటి సమస్యలుంటాయి. వాళ్ళ మహాగుణాల్నిబట్టీ, వాళ్ళ ధర్మశీలాన్నిబట్టి, వాళ్ళపాండిత్యాన్నిబట్టీ, వాళ్ళ వివేకాన్నిబట్టీ, వాళ్ళట్లా పొరబాటు పడటానికి వీలులేదు. కాని పడతారు. ఈ మహాగుణాలన్నింటినీ దాటి ఆ సందర్భంలో మానవస్వభావం పైకివచ్చి ఆ గుణాలన్నింటినీ కప్పివేసి వాళ్ళచేత ఆ పొరపాటు చేయిస్తుంది. ఇది మాయ అంటే. అస్మదాదుల విషయంలో అయితే మన బలహీనతో, తెలివితక్కువో జన్మాంతర ప్రారబ్ధమో యేదో ఒకటి అంటాము. కాని ఇటువంటి పొరబాటు ఇటువంటి మహానుభావులు చేస్తే అది యేదొ ఒక గొప్ప లోకకల్యాణం జరగటానికి హేతువౌతుందనక తప్పదు. ఆ లోకకల్యాణం పరమేశ్వరుడు సంకల్పించి అటువంటి వారిద్వారా జరిగేట్టు చేస్తాడు కాబట్టి వారి బుద్ధి అట్లా ప్రవర్తిస్తుందని వొప్పుకోక తప్పదు. అప్పుడు వారిబుద్ధి అట్లా ప్రవర్తించడం వాళ్ళ చేతుల్లో లేదని వొప్పుకోక తప్పదు. దాన్ని ప్రవర్తింపచేసింది ఆెవరు? ఎవరేమిటి పరమేశ్వరుడే! ఆదే గాయత్రీ మంత్రార్థం. భాగవతం ప్రతిపాదించేదదే. "యత్రాధికృత్య గాయత్రీం వర్ణ్యతే ధర్మవిస్తరః। వృత్రాసురవధోపేతం తద్భాగవతమిష్యతే॥" "గాయత్ర్యాఖ్యా పరబ్రహ్మరూపమేతత్పురాణం। గాయత్ర్యాచ సమారంభస్తద్వైభాగవతం విదుః॥" ఈ ప్రమాణవచనములు కూడ గాయత్రీ మంత్రార్థ విస్తరమే భాగవతమని చెప్పుచున్నది. ఈ కథ యిట్లా జరగటానికి గాయత్రీ మంత్రార్థం హేతువని చెప్పుట కాదు ఋషులధ్యేయం. మరి యేమిటంటే సర్వసృష్టికి కూడ గాయత్రీ మంత్రార్థమే హేతువని మనకు అవగతం కావటం. అందుకోసం యిన్ని గ్రంథాలు వాళ్ళు వ్రాశారు. సరే ఇక్కడికిది అపుదాం.

ఆయన అక్కడ జలాశయం కోసం వెదుకవలసింది. వెదుకలేదు. ఋషిని అడిగాడు. సమాధానం లేకపోవటంవల్ల కోపం వచ్చింది. వస్తే ఆ కోపం తీర్చుకోటా

నికి ఏంచేద్దామా అనుకొని అట్లా ప్రక్కకు చూడగానే అక్కడ చచ్చినపాము కన్పడడమేమిటి? అది ఎక్కడ నుండి వచ్చింది ఆ ఆశ్రమంలో! ఈ చచ్చిన పాము కన్పడకుండా వున్నా ఆ తర్వాతి కథ అలా జరిగేదికాదే. ఇది చూడండి! ఎంత చమత్కారమో! నేను పూర్వం చెప్పిన విషయానికంతటికీ యిది కన్పడటం సాక్ష్యం ఇస్తోంది. వివరించినకొద్దీ గ్రంథం పెరుగుతుంది. దీన్ని చూడగానే దీన్ని ఆయన మెడలో వేయాలనిపించింది. ఎందుకనిపించింది? ఆయన దొంగసమాధిలో వున్నాడను కొన్నాడు కదండీ! వేషమంతా చూస్తే శివుడు మాదిరి వున్నాడు. అయితే ఆ మంచు కొండమీద వున్న శివుడు నిజమైన శివుడు. ఈయన దొంగశివుడు. ఆయనకు జీవ త్సర్పం ఆభరణంగా వుంటే యీయనకు మృతసర్పం ఆభరణంగా వుండాలనుకొని ఆయన మెడలో వేశాడు. అసలు చేసిన అవమానం అది. ఇట్లా అనుకోవడం. లేక పోతే అవమానమేమి? మెడలో వేయడమేమిటి? ఋషుల రచనా చమత్కారం ఎట్లాంటిదో చిత్తగించారా!

ఆ ఋషిపేరు శమీకుడు. ఆయనకు శృంగియని వొక కొడుకున్నాడు. అతడు చాలా తేజస్వి. ఆ సమయంలో అతను యెక్కడో ఆడుకొంటున్నాడు. కొంతమందిపిల్లలు వచ్చి రాజుగారు చేసిన పని అతనికి చెప్పారు. అతనికి చాల కోపం వచ్చింది. "ఈ రాజులు బలిసిన కాకులవలె అధర్మానికి వెనుదీయరు. వాకిలి కావలి కాచే కుక్కలు గృహస్వామిని కరచినట్లు వీళ్ళు మనకు దాసులై మనకే అపకారం చేస్తారు. ఈ క్షత్రబంధువులు కుక్కలనే విషయం పండితులు నిరూపించిందే. వీళ్లు వాకిట్లో వుండ వలసిన వాళ్ళు యింట్లోకి వచ్చి కుండలోవున్న అన్నం ఎట్లా ముట్టుకుంటారు? దుర్మార్గులను శిక్షించే నిమిత్తం అవతారమెత్తిన శ్రీకృష్ణుడు నిర్యాణం పొందిన తర్వాత వీళ్ళు మళ్లా ధర్మద్రోహం చేస్తున్నారు. వీళ్ళను నేను శాపిస్తాను. నా బలం చూడండి" అని కళ్ళు కెంపులవలె యెఱ్ఱబడి మండుతూండగా కౌశికీనదికిపోయి నీళ్లు పట్టుకొని తన తండ్రిని అవమానం చేసిన వాడిప్పటినుండి యేడవ రోజున తక్షకుని విషంచే దగ్ధం అవుతాడని శాపం పెట్టి నాడు. అక్కడనుండి ఆశ్రమానికి తిరిగి వచ్చి మెడలో సర్పశవం వ్రేలాడుతున్న తండ్రినిచూచి బాగా గొంతుక యెత్తి యేడ్వటం మొదలుపెట్టాడు. ఆ యేడుపు విని శమీకుడు నెమ్మదిగా కళ్ళువిప్పి మెడలో వ్రేలుతున్న పామును తీసి పారవేసి "నాయనా! ఎందుకురా ఏడుస్తావు? నీకెవ్వరేమి అపకారం చేశార"ని అడిగినాడు. కుర్రవాడు సంగతంతా చెప్పినాడు. ఆ సంగతంతా విని ఆ బ్రాహ్మ ణుడు చాల బాధపడ్డాడు. కొడుకు చేసిన పనికి అతన్ని చీవాట్లుపెట్టాడు. "నాయనా! ఎంత అవివేకప్పని చేసినా వురా! చిన్న తప్పునకు పెద్దశిక్ష విధించి మహాపాపం చేసినావు. ఆయన రాజు. విష్ణుతుల్యుడు. ఆయన్ని సామాన్యు డనుకొన్నట్లున్నావు. దుస్సహమైన ఆయన తేజస్సుచేత యీ ప్రజలందరూ రక్షింపబడి నిర్భయులై సుఖంగా జీవి స్తున్నారు. రాజనే పేరుతో సాక్షాత్తు ఆ చక్రపాణి ప్రజల్ని రక్షిస్తున్నాడు కాబట్టి సరిపోయింది. ఆ రూపంలో ఆ పరమేశ్వరుడు దర్శనం ఇవ్వకపోతే దొంగలు పెచ్చుపెరిగి యీ లోకంతోపాటు మన్ని కొల్లగొట్టేవాళ్లు. కాపులేని గొర్రెలమాదిరిగా అందరూ నశించిపోయేవాళ్లు. ఇప్పుడు నీవు చేసిన పనివల్ల ఆ పాపమంతా మననెత్తిన పడింది. ప్రజలలో దొంగలు పెచ్చుపెరిగి పరస్పరం కొట్టుకుంటూ తిట్టుకొంటూ స్త్రీ ధన పశువులను అపహరిస్తారు. ఆర్య ధర్మం నశిస్తుంది. వర్ణాశ్రమాచారములు నశిస్తవి. ధర్మం లేదు. మోక్షంలేదు. అర్థకామాలే ప్రజలనావేశిస్తవి. అప్పుడు కుక్కలకంటె కోతులకంటె హీనంగా వర్ణ సాంకర్యం కలుగుతుంది. ఆ పరీక్షిన్మహారాజు మహాను భావుడు. ధర్మంగా పరిపాలిస్తున్నాడు. రాజసూయం చేసి సమ్రాట్టనిపించుకొన్నాడు. అశ్వమేధయాగం చేసినాడు. రాజర్షి. సాక్షాత్తు మహాభాగవతుడు. ఆయన ఆకలితో దాహంతో అలసిపోయి దీనుడై మన ఆశ్రమానికి వస్తే ఆయనకు చల్లనీళ్ళు, పళ్ళు ఇచ్చి పూజించి పంపాలి తప్ప యెక్కడైనా శాపం పెడతారా? పరమేశ్వరా! నిరపరాధు లైన నీ భక్తులయందు అవివేకంతో యీ కుర్రవాడు పాపంచేసినాడు. అందరకూ ఆత్మస్వరూపుడవు నీవేకాబట్టి వీడు చేసిన అపరాధాన్ని క్షమించవలసింది. కాదా ఆయన ప్రతిశాపం పెట్టి యీ పాపానికి నిష్కృతి కలిగిస్తాడా అంటే ఆయన అట్లాంటివాడు కాడు. ఆయన విష్ణుభక్తుడు. తిరస్కరించినా వంచించినా అవమానం చేసినా శపించినా కొట్టినాకూడ వాళ్ళు సమర్థులై వుండికూడ అపకారికి ప్రత్యపకారం చెయ్యరు." ఈ విధంగా కొడుకు చేసిన అపరాధానికి ఆ మహాముని చాలా విచారపడ్డాడు. తనకు చేసిన అపకారాన్ని గురించి ఆయన యేమాత్రం బాధ పడలేదు. సాధువుల లక్షణమే యిది. పరులవల్ల వారికి సుఖదుఃఖాది ద్వంద్వములు కలిగినా సంతోషంగానీ బాధ కానీ వారు పొందరు. ఎందుచేతనంటే వారెప్పుడూ ఆనంద స్వరూపమైన ఆత్మతో యేకత్వం భజించి వుంటారు. ఆ

ఆత్మ, సుఖదుఃఖాది గుణాలను అంటేది కాదు. అది నిర్గుణం కాదా!

ఈ ఘట్టంలో మనకు శమీకుడూ ఆయన కుమారుడూ వారిద్దరి మనో వైలక్షణ్యాలు గోచరిస్తవి. ఆ పిల్లవాడు గొప్ప తపస్వియేకాని తన తపశ్శక్తివల్ల అతనికి పరిపక్వత పెరగటానికి బదులు అహంకారం పెరిగింది. ఈ మాటను "అతి తేజస్వి" అని చెప్పటంలో గ్రంథకర్త తెలియ జేశాడు. తేజస్వి కావలసిందే వర్చస్వి కావలసిందే. కాని ఆ సంపాదించే తేజస్సును నిగ్రహించుకోటానికి చాలినంత వివేకం అతనికి లేదు. అతను ఎంత తపస్వీఅయినా క్షుద్ర తనం పోలేదని చెప్పటానికి అతడాడుకోడానికి పోయినా డన్నాడు. శ్రీకృష్ణుడంతటివాడు చేసే పనిని తాను చేస్తా నన్నాడు. అతని ప్రవర్తనంతా అహంకారభూయిష్ఠంగా వుంది. దానికి తోడు బాల్యచాపలం. శాపంపెట్టి ఆశ్రమానికి వచ్చి తండ్రిని చూచి యేడవటమెందుకు? ఇంత శాపం పెట్టినవాడు ఆ పామును ఏ శస్త్రపుల్లతోనైనా తీసివేయ లేడు? ఇక్కడ మళ్ళా అతని బాల స్వభావం చక్కగా వ్యక్తమౌతుంది. బాలుడు కాబట్టి పామునుచూస్తే భయం. చచ్చినపామును చూచినా భయమే. పైగా దాన్ని తీసేనేర్పు లేదు. ఒకవేళ దానికేమాత్రమన్నా ప్రాణంవుండి తండ్రిని కరుస్తుందేమో? అన్న ఒక పిచ్చి ఆలోచన. మరియింత పిరికివాడికి అహంకారమెందుకు? అంటే అతడు చాల తపస్వి. ఏ మాట అంటే ఆ మాట అవుతుంది. అన్న మాటకెదురంటూ లేదు. అందుకు అహంకారం. మరి శమీకుడో! ఆయన తపస్సు పరమ వివేకంతో కూడినది. ఈశ్వరానుగ్రహసంపాదకమైంది. మనశ్శుద్ధి హేతువైనది. ఆయనకు స్వపరభేదంలేదు. సర్వత్ర ఆత్మదర్శనం చేయ గలిగిన మహాయోగి ఆయన. పరమశాంతుడు. లోక కల్యాణాన్నే ఎప్పుడూ ఆకాంక్షించేవాడు. అందుచేత ఆయన్ని 'సాధువు' అన్నాడు. ఈ క్షుద్రవాడు అపక్వ బుద్ధి. ఆయన పరిపక్వబుద్ధి. ఈ యిద్దరి స్వభావాలు ఇట్లా ఈ కథను తీర్చినవి.

వేటనుంచి రాజు యింటికి వచ్చాడు. వస్తూండగానే ఆ పని చేసిన మరుక్షణంనుంచీ ఆయన మనస్సుకు చింత పట్టుకొంది. "ఇదేమిట్రా యింత తప్పుడు పని చేశాను. నిరపరాధియైన ఆ బ్రాహ్మణునకింత పాపమైన అపరాధం చేశాను! ఆయన తపస్వి. ఆయనలో తేజస్సు గూఢంగా వుంటుంది. ఆయన్ని అవమానం చేయటం ఈశ్వరుణ్ణి అవమానంచేయడమే అవుతుంది. దీనివల్ల అచిరకాలంలోనే నాకు తీరని దుఃఖం సంభవిస్తుంది. అంతేకావాలి. మళ్ళా యిట్లాంటిపని చేయకుండా యీ పాపానికి తగ్గ శిక్ష నాకు జరగాలి. నా రాజ్యం నా బలం నాధనాదికమంతా కూడ ఈ ప్రకోపితమైన బ్రాహ్మణాగ్నివల్ల భస్మమైతే బాగుండును. మళ్ళా నాకు బ్రాహ్మణులన్నా, దేవతలన్నా, గోవులన్నా పాపబుద్ధి పుట్టకుండా వుండాలి." ఇల్లా అనుకొంటూ రాజింటికి వచ్చాడో లేదో శమీక శిష్యులువచ్చి సంగతి యావత్తూ చెప్పారు. రాజు ఆ శాపం చాలా బాగా వున్న దనుకొన్నాడు. "ఇంతవరకు చాలా విషయాసక్తుడనై వున్నాను. దానికి యీ తక్షకవిషాగ్ని విరక్తికారణమైంది" అనుకొన్నాడు. ఆయన పూర్వమే చక్కగా విషయవిమర్శ చేసివున్నాడు కాబట్టి వుభయ లోకములూ అంటే యీ లోకమూ, పరలోకమూ రెండూకూడ హేయములే అని చక్కగా భావించి వున్నవాడు కాబట్టి శ్రీకృష్ణుని పాదసేవ ఒక్కటే తరణోపాయమని భావించి గంగానది ఒడ్డుకు వెళ్ళాడు. ఆ గంగానది పరమేశ్వరుని పాదపద్మముల నుండి పుట్టినది కాబట్టి ఆ పాదపద్మములందున్న తులసీ మిశ్రితమైన పాదరేణువులతో కలసి ప్రవహిస్తూ వుభయ లోకాలని వాటిపాలకులని పవిత్రం చేస్తూవుంటుంది. అటువంటి గంగానదిని ఆసన్నమరణుడైన వాడెవడు సేవించడు? అక్కడకు వెళ్ళి ఆయన సమస్తసంగాల్ని వదలిపెట్టి ప్రాయోపవేశం తాల్చి మునివ్రతుడై అనన్య భావంతో శ్రీకృష్ణపాదపద్మములను ధ్యానిస్తూ కూర్చు న్నాడు. ఈ సంగతి విని సమస్త భువనాల్ని పావనంచేసే మహానుభావులైన మునులు శిష్యులతో కూడ అక్కడకు వచ్చారు. వాళ్ళకు తీర్థాటనమనేది ఒక వ్యాజం. ఆ వ్యాజంతో వాళ్ల తీర్థాల్నే పావనం చేస్తారు. అత్రి, వసిష్ఠుడు, చ్యవనుడు, శరద్వంతుడు, అరిష్టనేమి, భృగువు, అంగిరసుడు, పరాశరుడు, విశ్వామిత్రుడు, ఉచ థ్యుడు, ఇంద్రప్రమదుడు, ఇధ్మవాహుడు, మేధాతిథి, దేవలుడు, ఆర్ష్టిషేణుడు, భరద్వాజుడు, గౌతముడు, పిప్ప లాదుడు, మైత్రేయుడు, ఔర్వుడు, కవషుడు, అగస్త్యుడు, ద్వైపాయనుడు, నారదుడు, దేవర్షి బ్రహ్మర్షి రాజర్షి వర్యులు, అరుణాదులైన కాండఋషులు, గోత్ర ప్రవర్త కులైన మహర్షులు పలువురు వచ్చి పెద్దసభ తీర్చారు. రాజు వారందరికి శిరస్సుతో భూమిని తాకి వందనం చేశాడు. వారందరిని వుచితాసనములమీద కూర్చుండచేసి మరల వారికి వందనంచేసి అంజలి ఘటించి పరిశుద్ధమైన మనస్సుతో వారికిట్లా విజ్ఞాపనం చేసినాడు.

"మహానుభావులారా! రాజులందరిలో మేము చాలా ధన్యులం. మహాత్ములైన మీరంతా మమ్ముల్ని అను

గ్రహించారు. క్షత్రియకులం అంటేనే క్రూరకర్మలు చేసేది. నాకు నిజంగా యీ శాపం యీశ్వరాను గ్రహంవల్లనే తటస్థించింది. గృహారామవిత్తక్షేత్రాది సంసారంలో బాగా తగులంచెంది వున్న నాకు ఈ శాపం నిర్వేదానికి కారణమైంది. సంసారభయం కలిగించింది. కాబట్టి నేను మీకు ఈ గంగాదేవికి శరణాగతుడనైనాను. ఆ తక్షకుడు నన్ను కరచేదాకా మీరందరూ విష్ణు కథలు గానంచెయ్యండి. మళ్లా నాకు కలిగే జన్మల్లో భగవంతుడైన విష్ణువునందు భక్తీ, ఆయన భక్తులతో సాంగత్యమూ కలుగవలె. సర్వభూతములందు మైత్రి కలుగవలె'' అని పరీక్షిత్తు కుమారునియందు రాజ్యభారముంచి సముద్రుని పట్టపుదేవి యైన గంగానది దక్షిణతీరాన వుత్తరాభిముఖంగా ప్రాగగ్రములైన కుశలమీద కూర్చుండి ధీరుడై ప్రాయోపవేశం చేస్తున్నాడు. దేవతలంతా ఆయన నిశ్చయాన్ని ప్రశంసించి దేవదుందుభులు మ్రోగించి పుష్పవర్షం కురిపించారు. ఆయన్ని పరివేష్టించివున్న మహర్షులంతా ఆయన నిశ్చయాన్ని ఆమోదించారు. వారంతా ప్రజలననుగ్రహించే స్వభావం కలవారు కాబట్టి యీశ్వర గుణకీర్తనానికను రూపంగా వుండేట్టు ఇలా చెప్పారు. "రాజా! తాత ముత్తాతలనుండి మీరంతా శ్రీకృష్ణభక్తులు. ఆ పరమేశ్వరుని సేవ కోరి రాజకిరీటాన్ని సింహాసనాన్ని కూడ మీ పూర్వులు క్షణంలో వదలివేశారు. అందుచేత భాగవత ప్రధానుడవైన నీవు ఈ కళేబరాన్ని వదలి మాయారహితమూ, శోకరహితమూ అయిన పరమపదాన్ని పొందేంతవరకు మేమిక్కడ నిన్ను పరివేష్టించి వుంటాము.''

ఆ ఋషుల మాటలు పక్షపాతశూన్యములు, మృదు మధురములు, గంభీరార్థయుక్తములు, సత్యములు. ఆ మాటలు విని వారినభినందించి విష్ణుచరితం వినాలనే కోరికతో పరీక్షిత్తు ఇట్లా అన్నాడు. "అయ్యా! సత్య లోకంలో మూర్తిమంతములైన వేదములవలె మీరంతా యిక్కడ సమావేశమయినారు. మీకు పరులననుగ్రహించటమే స్వభావం. ఈ లోకంలోగాని పరలోకంలోగాని మీకు కావలసింది వేరే యేమున్నది? అందుచేత విశ్వాసంతో మిమ్మల్ని అడుగుతున్నాను. చావబోయేవాడు చేయదగిన కృత్యం ఏదో విచారించి నాకు చెప్పండి.'' ఈ మాటలు రాజన్నాడో లేదో అక్కడకు భగవంతుడైన శుకమహర్షి వచ్చినాడు. ఆయన వూరికే తిరుగుతూంటాడు. ఆయనకేమీ కోరికలేదు. ఆయన ఆశ్రయం యేమిటో తెలిసికోడానికి గుర్తులేమీలేవు. ఆయన తన్నుతాను తెలిసికొన్నవాడు కాబట్టి నిత్య సంతుష్టుడు. అంతకంటె గొప్పలాభం ఏమున్నది? ఆయన వేషంచూస్తే యెవరూ గౌరవించేదికాదు. అందరూ అవమానంగా చూచే వేషం అది. అదే అవధూత వేషం. ఆయన చుట్టూ పిల్లలుచేరి అల్లరిచేస్తున్నారు. గ్రంథకర్తయైన మహర్షి ఆయన్ని యెల్లా వర్ణించాడో చూడండి.

తం ద్వ్యష్టవర్షం సుకుమారపాదకరోరుబాహ్వంసకపోలగాత్రం ।
చార్వాయతాక్షోన్నసతుల్యకర్ణసుభ్ర్వాననం కంబు సుజాతకంఠం ॥
నిగూఢ జత్రుం పృథుతుంగవక్షసమావర్తనాభిం వళి వల్గూదరం చ ।
దిగంబరం వక్త్రవికీర్ణకేశం ప్రలంబబాహుం స్వమరోత్తమాభం ॥
శ్యామం సదాపీచ్య వయోంగ లక్ష్మ్యా స్త్రీణాం మనోజ్ఞం రుచిరం స్మితేన।
ప్రత్యుత్థితాస్తేమునయస్స్వాసనేభ్య స్తల్లక్షణజ్ఞా అపి గూఢవర్చసం ॥

ఆయనకు పదునారేండ్ల వయస్సు. కాళ్లు, చేతులు, బాహువులు, భుజములు, చెక్కిళ్ళు, శరీరం చాల సుకుమారంగా వున్నవి. విశాలంగా అందమైన కళ్ళు, ఎత్తైన ముక్కు, సమంగావున్న చెవులు, చక్కని కనుబొమలు, వీటితో ఆయన ముఖం చాల సుందరంగా వుంది. ఆయన కంఠం శంఖమువలె త్రిరేఖలతో కూడివున్నది. ఆయన మెడక్రింది బొమికలు రెండున్నూ మాంసలములై ఉన్నవి. ఆయన వక్షము యెత్తుగా విశాలంగావుంది. ఆయన బొడ్డు సుడివలె వున్నది. పొట్ట ముడుతలుపడి రమణీయంగా ఉంది. ఆయన కేశములు చెదరివున్నా ఉంగరాలు తిరిగి వంకెలు వంకెలుగా ఉన్నవి. ఆయన బాహువులు పొడవుగానున్నవి. ఆయన కేవలం దేవోత్తముడైన విష్ణుమూర్తివలె ఉన్నాడు. కాని దిగంబరుడు. శ్యామవర్ణుడు. నిరంతరం ఉత్తమమైన యౌవనదశలో ఉంటాడు. ఆయన శారీరిక కాంతి చాలా అందమైంది. స్త్రీలకు ఆకర్షకమైంది. ఆయన వర్చస్సు వేషంచేత గూఢంగావున్నా ఆయన లక్షణాలు తెలిసినవాళ్ళు కాబట్టి ఆయన రాకకు ఆశ్చర్యపడి ఋషులందరూ యెదురులేచి ఆయనయందు గౌరవం చూపారు. పరీక్షిన్మహారాజు అతిథియై అక్కడకువచ్చిన ఆ మహాత్మునికి శిరస్సుతో సపర్యచేసి పెద్ద ఆసనంమీద కూర్చుండబెట్టి పూజించినాడు. ఆయన వెనకాల వచ్చిన మూఢులు, మూర్ఖులు, బాలకులు ఇదంతా చూచి వెళ్ళిపోయినారు. ఆయన ఆ బ్రహ్మర్షి దేవర్షి రాజర్షుల సభలో, గ్రహతారాగణంలో చంద్రుడువలె ప్రకాశిస్తూ ప్రశాంతంగా

కూర్చున్నాడు. ఆ మహామునికి మరల శిరస్సువంచి నమస్కరించి రాజు యిల్లా అడిగాడు.

"అయ్యా! మేము క్షత్రబంధువులం. మీరు అతిథిగా రావటం వల్ల మేము పరమయోగ్యులమైనాము. మిమ్మల్ని తలచుకొంటేనే మా గృహాలు పావనమౌతాయి. మరి మీ దర్శనంచేస్తే, తాకితే కాళ్ళు కడిగితే ఆసనాదులిచ్చి పూజ చేస్తే చెప్పేదేమిటి? ఆ విష్ణుమూర్తిని చూస్తే రాక్షసులు యెల్లా పారిపోతారో మీదర్శనం చేస్తే పాతకాలలా పటాపంచలౌతాయి. భగవంతుడైన శ్రీకృష్ణుడు మా తాతలంటే చాలా ప్రేమగలవాడు. మా తాతలాయనకు మేనత్త కొడుకులు. వాళ్ళ ప్రీతికోసం నాయందాయన అనుగ్రహం చూపించినాడు. లేకపోతే మీ జాడయే యెవరికీ తెలియదాయె. అటువంటి మీరు నాకు-అందులో యిట్లాంటి కాలంలో మీరువస్తే బాగుంటుందని నేను కోరుకొంటున్న సమయంలో, చావటానికి సిద్ధంగా వున్నసమయంలో దర్శనం ఇవ్వటమేమిటి? కాబట్టి యోగీశ్వరులకు పరమ గురువులైన మిమ్మల్ని అడుగుతున్నాను. చావుకు సిద్ధంగా వున్న పురుషుడు ముక్తి పొందటానికి చేయవలసిన పని యేమిటి? అతడు వినవలసినది జపించవలసినది చేయవలసినది స్మరించవలసినది భజించవలసినది యేమిటో నాకు చెప్పండి. ఏం చెయ్యకూడదో స్మరించకూడదో భజించకూడదో చెప్పండి. మీరు మహానుభావులు. బ్రహ్మమూర్తులు. గృహస్థుల ఇళ్ళల్లో ఆవును పాలు పిండేంతకాలం గూడ వుండరు."

ఈ ఘట్టాన్ని కొంచెం విచారణ చేద్దాం. ఆ మహర్షి మెడలో పాము వేశాడో లేదో రాజుకు పశ్చాత్తాపం ప్రారంభం అయింది తీవ్రంగా ప్రారంభమైంది. దాంతో ఆయన వివేకమంతా తిరిగివచ్చింది. ఆ ఒక్కక్షణమే ఆయన వివేకం పనిచేయలేదు తప్ప అంతకు పూర్వం ఆ తర్వాత కూడ అది సూర్యుడివలె ధగధగలాడుతూనేవుంది. ఇదీ దైవమంటే. దైవం అట్లాంటి వాడిచేత అట్లాంటి పని చేయిస్తుంది. నీ వివేకం యేమీ పనిచేయదు. అది అట్లా జరగాలసివుంది. కాబట్టి జరిగితీరుతుంది. సరే రాజుకు పశ్చాత్తాపంపుట్టింది. ఉభయలోకములందు విరక్తిగలిగింది. ప్రాయోపవేశం చేశాడు. అక్కడకు మహర్షులంతా వచ్చారు. ఇదంతా బాగానేవుంది. శుకమహర్షి రావటం యేమిటిఅని. అన్నింటికంటె విచిత్రమైంది ఆయన రావటమే. చచ్చేవాళ్ళందర దగ్గరకి వాళ్ళెంత విరక్తులైతే మాత్రం శుకమహర్షి వెళ్ళుతాడా? ఆయన పూరకే తిరుగుతూ వుంటాడు. అంటే మహర్షి 'యదృచ్ఛా' శబ్దం వాడాడు. అంటే 'పూరకే' అని అర్థం. ఒక నిశ్చితమైన సంకల్పం లేకుండా అని అర్థం. కాకతాళీయంగాఅన్నమాట. అంటే ఈ రావటానికి పైకి కన్పడే కారణమేమీలేదు. ఇక్కడ ఈ శ్లోకాన్నిచూస్తే చాలా చమత్కారంగా వుంది.

తత్రాగమద్భగవాన్ వ్యాసపుత్రో యదృచ్ఛయాగా
మటమానో౽నపేక్షః॥

ఈ యదృచ్ఛాశబ్దం అటు 'ఆగమత్' అనే క్రియతో వెనక్కి అన్వయించవచ్చు. 'అటమానః' అనే విశేషణంతోనూ అన్వయించవచ్చు. రెండు రకాల అన్వయానికీ భేదమిది. అనపేక్షుడై భూమిఅంతా తిరుగుతూ వుండే శుకమహర్షి అక్కడకు కాకతాళీయంగా వచ్చాడు. ఇదివొక అన్వయం. రెండోది అనపేక్షుడై సంకల్పం లేకుండా భూమి అంతా తిరుగుతూండే శుకమహర్షి అక్కడకు వచ్చాడనీ చెప్పవచ్చు. రెండోఅన్వయంలో వున్న విశేషమేమంటే! భూమిఅంతటా నిష్ప్రయోజనంగా నిస్సంకల్పంగా తిరిగినా అక్కడకుమాత్రం వొక విశిష్టమైనప్రయోజనాన్ని ఉద్దేశించి, దాన్ని నెరవేర్చటానికి వచ్చాడని అర్థం వస్తుంది. మొదటి అన్వయంలో అక్కడకు గూడ నిస్సంకల్పంగా వచ్చాడని అర్థం వస్తుంది. చమత్కారమేమంటే! పర్యవసానంలో రెండర్థాలూ వొక్కటే. ఏ సంకల్పంలేకుండా తిరుగుతున్నాడు అంటే అక్కడకు వచ్చాడు అంటే ఈశ్వరసంకల్పంచేతవచ్చాడు అని అర్థం వస్తుంది. లేదూ సంకల్పించే వచ్చాడనే రెండవ అన్వయంలో ఈ అర్థం ప్రత్యక్షంగానే లభిస్తుంది. అనపేక్షుడు అనేటువంటి విశేషణంవల్ల ఆయన యేదైనా ప్రయోజనాన్ని ఉద్దేశించాడంటే అది తన కోసం కాదనీ జగత్కల్యాణం కోసమేననీ స్పష్టమేకదా! అందుచేత ఆ మహర్షి దైవంచేతిలో ఉపకరణం. మనమంతా కూడా దైవం చేతిలో ఉపకరణాలమే. అయితే ముఖ్యమైన తేడా యేమిటంటే మనకు ఇష్టానిష్టాలున్నాయి. అహంకారముంది. స్వపరభేదముంది. సంకల్పవికల్పాలున్నాయి. వీటివిబట్టి ఇంకా దుర్గుణాలు చాలావున్నాయనుకోండి. వీటివల్ల మనమే చేస్తున్నాం, చేయటానికైనా చేయకపోవటానికైనా మనమే కర్తలమనుకొంటాం. ఈ పైనచెప్పినవేవీ ఆయనకు లేవు కాబట్టి ఆయన అలా అనుకోడు. ఇంకా విచారిస్తే శుకమహర్షి బ్రహ్మవిదుడని యీసందర్భంలో తెలుస్తుంది. అది యెల్లాగూ కంఠోక్తిగానే గ్రంథకర్త చెప్పాడు కాబట్టి దాన్ని గురించి మనం విచారించనక్కరలేదు. కాని ఇక్కడ ప్రసక్తమైన విషయం దైవం ఆయన్ను అక్కడకు తీసికొవచ్చింది అని. ఏ దైవం ఆయన్ను ఆశ్రమానికి తీసికొని

వెళ్ళిందో, ఏ దైవం అక్కడ అంతమంది బాలురువున్నా అక్కడ సమాధిగతుడైన ఋషిని నీళ్ల అడిగించిందో, ఏ దైవం ఆ ఋషిని అవమానం చేయాలనే బుద్ధి పుట్టించిందో, సరిగ్గా ఆ సమయానికి అక్కడ చచ్చిన పామును ఆయనకు ప్రత్యక్షంచేసి దాన్ని ఋషిమెడలో వేయించిందో, ఏ దైవం ఆ ఋషికుమారునిచేత ఆ శాపం అట్లా యిప్పించిందో ఆ దైవమే ఈ శుకమహర్షిని యిక్కడకు తీసికొని వచ్చింది. ఇక్కడ దైవముయొక్క హస్తం ప్రత్యక్షంగావుంటే తత్పూర్వం పరోక్షంగా ఉంది. ఇదీ భేదం. అక్కడ దైవం మానవస్వభావాన్ని ఆశ్రయించి కార్యకారి అయింది. ఇక్కడో మానవ స్వభావమేకాదు. అసలు స్వభావమే లేదు. ఉన్న స్వభావమల్లా బ్రహ్మనిష్ఠయే. అంటే? ఈ భాగవతమనేది గాయత్రీమంత్రార్థం కాబట్టి దాన్ని తెలుతగానే ఈ పరీక్షిత్తు కథ మనకు స్పష్టం చేస్తోంది అని తాత్పర్యం. ఈ భాగవతం ఇట్లా లోకంలోకి రావటానికి వారికట్లాంటి ప్రచోదన పరమేశ్వరుడు కలిగించాడని నిష్కర్ష.

రాజట్లా మధురమైన మాటలతో ప్రశ్నించగా భగవంతుడైన శుకమహర్షి యిట్లా బదులుచెప్పాడు. "రాజా! చాలా గొప్ప ప్రశ్న అడిగావు. ఇది లోకహితమైంది. ఆత్మవేత్తలకు సమ్మతమైంది. వినదగిన వాటిల్లోకెల్లా పరమోత్తమమైంది. ఆత్మతత్వం తెలియకుండా గృహవిత్తాదులందాసక్తులై సంసారంలోపడి హింసాది కర్మలనాచరిస్తూ ఉండే వాళ్ళకు వినదగిన విషయాలు వేలకు వేలున్నవి. మానవునకున్న ఆయుర్దాయంలో రాత్రిభాగమంతా నిద్రవల్ల వ్యర్థమైపోతుంది. యౌవనమంతా స్త్రీ సేవనంతో గడచిపోతుంది. ఇక పగటిభాగముంది. ఇదంతాగూడ ధనం సంపాదించాలనే కోరికతో కుటుంబభారంతోనూ గడచిపోతుంది. ఈశరీరమూ దీనికి కట్టుకొన్న భార్య, కలిగిన సంతానం వీటిని పోషించటానికి సంపాదించిన ఇళ్లూ వాకిళ్లూ పొలాలూ మొదలైనవన్నీ ఆత్మసైన్యం అంటారు. ఇవన్నీ మిథ్యాభూతములు. అంటే తత్పూర్వం వున్నవికావు. తర్వాత వుండేవికావు. మధ్యలో ఉన్నట్టు కన్పించేవి. వీటియందు ప్రసక్తుడై ప్రత్యక్షంగా యివి నశించిపోతూ ఉంటే చూస్తూ కూడా ఆ సంగతి గుర్తించడు. కాబట్టి రాజా! చెయ్యవలసిన పని ఒక్కటేవుంది. కోరవలసింది జన్మరాహిత్యం. అందుకోసం ఈ సర్వానికీ ఆత్మస్వరూపుడైన పరమేశ్వరుడైన హరిని గురించే వినాలి. ఆయన్నే కీర్తించాలి. స్మరించాలి. జ్ఞానంచేతగానీ, యోగంచేతగానీ, స్వధర్మనిష్ఠచేతగానీ, సాధించవలసినదీ జన్మ యెత్తినందుకు పరమ ప్రయోజనమైనదీ ఇది వొక్కటే. అంత్యకాలంలో నారాయణస్మరణ. రాజా! చూడు! విధి నిషేధరూపమైన ప్రవృత్తిమార్గం నుండి మళ్ళి నివృత్తిమార్గమైన జ్ఞానమార్గంలోపడి నిర్గుణ బ్రహ్మనిష్ఠులైన, మహా మునులుగూడ పరమేశ్వరుడైన శ్రీహరి గుణానుకథనమునందు రమిస్తారు. సర్వవేదతుల్యమూ, బ్రహ్మస్వరూపాన్ని చక్కగా బోధించే భాగవతపురాణం మా నాయన కృష్ణద్వైపాయనులు నాకుపదేశించారు. నేను బ్రహ్మనిష్ఠుడనైనప్పటికీ ఆ శ్రీహరిలీలచేత ఆకర్షింపబడి ఈ పురాణాన్ని అధ్యయనం చేశాను. నీవు మహాపురుషుడవు. దీన్ని నీకు చెపుతాను విను. శ్రద్ధగావింటే నీకు పరమేశ్వరునియందు మనస్సు లగ్నమౌతుంది. ఈ లోకంలోనూ పరలోకంలోనూ వుండే సుఖాలు అనిత్యములని విరక్తికలిగి నిర్భయమైన స్థానాన్ని కోరే యోగులకు ఆ పరమేశ్వరుని నామానుకీర్తనము తప్ప మరో మార్గంలేదు అని నిర్ణయం.

"ఆయువంతా గడిచిపోయింది. యిప్పుడింకా సాధించేదేముందని బెంగపడకు. ఒళ్ళుపై తెలియకుండా ప్రమత్తుడై కాలం గడిపేవాడికి యెంత ఆయుర్దాయం ఉంటే మాత్రం యేం లాభం? అయ్యో! ఇంతకాలం వృథాగా గడిపామే అని పశ్చాత్తాపం గలిగిన వాడికి ఒక ముహూర్తం మిగిలివున్నా చాలు. ఆ కొంచెం కాలంలోనే శ్రేయస్సుకోసం ప్రయత్నంచేస్తాడు. దీనికి ఖట్వాంగుడనే రాజర్షి వృత్తాంతం నిదర్శనం. ఖట్వాంగుడనే వొకరాజర్షి ఉన్నాడు. దేవతలకూ రాక్షసులకూ యుద్ధం వచ్చింది. ఖట్వాంగుడు దేవపక్షంలోవుండి రాక్షసులతో పోరాడి జయించాడు. దేవతలు ప్రసన్నులై ఆయన్ని వరం కోరుకోమన్నారు. ఆయన "వరం కోరుకొంటాను సరే ముందు నా ఆయుర్దాయం ఇంకా యెంతవుందో చెప్పండి" అన్నాడు. దేవతలు "ఒక ముహూర్తం మాత్రమే మిగిలివుంది" అన్నారు. ఆయన మళ్ళా మాట్లాడకుండా వెంటనే విమానం మీద భూమికి వచ్చి సర్వసంగ పరిత్యాగంచేసి అభయ స్థానమైన శ్రీహరిని శరణం పొందాడు. ఆయనకు మిగిలిన ఆయుర్దాయం వొకముహూర్తమే. ఆ కొంచెంలోనే ఆయన శ్రేయస్సు సంపాదించాడు. నీకో యేడురోజులు మిగిలి వుంది. ఈ యేడు రోజుల్లోనూ నీవు శ్రేయస్సు సంపాదించలేవా? మోక్షానికి కావలసిన సాధనాలన్నీ ఈ మాత్రం కాలంలో చక్కగా సంపాదించుకోవచ్చు.

"అంత్యకాలం సమీపించిందని భయపడకూడదు. ఈ శరీరంమీదా, దీన్ననుసరించి వచ్చిన కళత్ర పుత్ర బంధు మిత్ర గురువిత్త క్షేత్రాదికం మీదా ఉన్న ప్రేమను

అసంగమనే కత్తితో కోసివేసి యింటినుండి బయలుదేరి పోవాలి. మళ్లా పెళ్లాం బిడ్డలు యేమయ్యారో అని చింత పెట్టుకోకుండా వో పుణ్యతీర్థానికి పోయి స్నానంచేసి శుభ్రమైన ప్రదేశంలో యేకాంతంగా ఉన్నచోటున యథా శాస్త్రీయంగా అంటే ముందు దర్భలు పరచి దానిమీద నల్ల యిఱ్ఱిచర్మం పరచి దానిమీద వస్త్రం వేసిన ఆసనంమీద కూర్చుని, ప్రణవమంత్రాన్ని (ఓంకారాన్ని) మనస్సులో అభ్యాసం చేయాలి. ఈ ఓంకారం పరిశుద్ధమైనది. పరబ్రహ్మవాచకం. ప్రాణాయామం కూడ దీనిలో యిమిడి వుంది. బ్రహ్మబీజమైన ఈ ఓంకారాన్ని స్మరిస్తూ శ్వాసను జయించి మనస్సును నియమించాలి. దీనివల్ల ప్రత్యాహారం సమకూరుతుంది. ఇంద్రియములను విషయములనుండి మళ్ళించడమే ప్రత్యాహారం. తరువాత ధారణ. ధారణ అంటే కర్మవాసనలచేత లాగబడుతూ ఉండే మనస్సును వెనక్కి మళ్ళించి ధ్యేయవిషయమైన భగవద్రూపమందుంచడం. తరువాత ధ్యానం. పరమేశ్వరరూపమును పాదాది శిరః పర్యంతం మళ్లా శిర ఆది పాద పర్యంతం ఒక్కొక్క అవయవాన్నే సమగ్రరూపంలో కలిపి ఉన్నట్లుగానే ధ్యానించాలి. ధ్యానానికీ ధారణకి తేడా యేమిటీ అంటే? భగవద్రూపమందు సామాన్యంగా చిత్తాన్ని స్థిరంగా వుంచటం ధారణ. ఒక్కొక్క అవయవాన్నీ భావించటంచేత ఆ ధారణను దృఢంచేయటం ధ్యానమంటారు. ఆ ధ్యానంలో మనస్సు లయమైపోవడమే సమాధి. ఈ సమాధిలో సవికల్పమనీ నిర్వికల్పమనీ భేదాలు ఉన్నవి. సవికల్పం నిర్వికల్పానికి దోవతీస్తుంది. ఇక్కడ నేను చెప్పేది నిర్వికల్పం. అంటే మనస్సులో యే విషయమూ వుండదు. ఏ వృత్తీ వుండదు. కేవలం పరమానంద మాత్రమైన రూపం పొంది వుంటుంది. అంటే పరమానందం మాత్రమే స్ఫురిస్తూవుంటుంది. అది తప్ప వేరే రూపం మనస్సుకు వుండదు. అలా చెయ్యాలి. అదే విష్ణుపదమంటే. ఆ స్థితిని పొంది మనస్సు వుపశాంతి పొందుతుంది. మళ్ళా రజస్తమస్సులచేత లాగబడి మనస్సు విక్షేపంపొందితే మళ్లా ధారణ చెయ్యాలి. ఇల్లా చేయగా చేయగా ఆ రజస్తమస్సులనే మాలిన్యాలంతరించిపోతవి. ఈ ధారణవల్ల సుఖాత్మకమైన పరమాత్మ స్వరూపమునందు ప్రీతి కలుగుతుంది. దానివల్ల త్వరగా భక్తియోగము కుదురుతుంది.''

శుకమహర్షిని రాజు మళ్ళా అడిగినాడు. ''మహర్షీ! ఈ ధారణ ఎక్కడ ఏ విధంగా, ఏ పరిమాణంలో చేస్తే మనో మలము హరిస్తుందోకూడ శలవియ్యండి అన్నాడు. దానికి శుకమహర్షి ఇలా సమాధానము చెప్పాడు. ''సాధకుడు మొదట ఆసనసిద్ధి సంపాదించాలి. స్వస్తిక పద్మాసన సిద్ధాసనాదులలో ఎంతసేపైనా కూర్చోగలిగి యుండాలి. ఇది ఆసనసిద్ధి. తరువాత ప్రాణాయామము చేసి శ్వాసను జయించాలి. ఎవరితోనూ, దేనిమీద సంగము పనికిరాదు. అనగా ఇంకొక విషయముపై మనసుపోకుండా యుండాలి. అప్పుడు దానిని సంగజయమంటారు. ఇంద్రియములను కూడ విషయముల మీదకు పోకుండ నిరోధించాలి. దీనిని ఇంద్రియజయమంటారు. ఆసనజయము, శ్వాసజయము, సంగజయము, ఇంద్రియజయము సంపాదించిన తరువాత మనస్సును భగవంతుని స్థూలశరీరముపైన వివేకంతో నిలపాలి. దీనిని ధారణ అంటారు. ఈ ధారణకు భగవంతుని స్థూలదేహమే ఆశ్రయము. ఈ స్థూలదేహమునందే భూత భవిష్యత్ వర్తమాన కాలాత్మకమైన, ఈ సర్వ ప్రపంచము కనిపిస్తుంది. ఈ కనిపించే ప్రపంచమే విరాట్ పురుషుని స్థూలదేహము. ఈ బ్రహ్మాండము అంతా విరాట్ పురుషుని దేహమే. దీనిలో ఏడు ఆవరణములున్నవి. ఈ బ్రహ్మాండమునందే పాతాళమునుండి మొదలుపెట్టి విరాట్పురుష భావన చేయాలి. విరాట్పురుషుని పాదములు పాతాళములు. రసాతలము ఈయన మడిమెలు. మహాతలము చీలమండెలు. తలాతలము ఈయన పిక్కలు. సుతలము ఈయన మోకాలు. అతలము, వితలము ఈయన ఊరువులు. మహీతలము ఈయన మొల. ఆకాశము ఈయన బొడ్డు. స్వర్గము ఈయన వక్షస్థలము. మహర్లోకము ఈయన ముఖము. తపోలోకము ఈయన లలాటము. సత్యలోకమే ఈయన శీర్షము. ఇంద్రుడు మొదలైన దేవతలు ఈయన బాహువులు. దిక్కులు ఈయన కర్ణములు. ఈయన శ్రోత్రము శబ్దము. ఈయన నాసికలు అశ్వినీదేవతలు. గంధమే ఈయన ఘ్రాణేంద్రియము. జ్వలించుచున్న అగ్ని ఈయన ముఖము. సూర్యచంద్రులకు ఆశ్రయమైన అంతరిక్షము ఈయన నేత్రగోళములు. సూర్యుడు ఈయన చక్షురింద్రియము. రాత్రింబవళ్లు రెండును ఈయన కనురెప్పలు. బ్రహ్మలోకము ఈయన భ్రూవిక్షేపము. ఈయన దౌడలు ఆపస్సు (ఉదకము). జిహ్వ రసము. వేదములు ఈయన బ్రహ్మరంధ్రము. యముడే ఈయన కోరలు. స్నేహకళలు, అనగా పుత్రాదులందుండు ప్రేమలేశములు ఈయన దంతపంక్తులు. జనులకు మోహము కలించే మాయ ఈయన హాసము. ఈయన కడగంటి చూపు సృష్టి. ఈయన పై పెదవి లజ్జ. క్రీ పెదవి లోభము. ధర్మము ఈయన స్తనము. అధర్మము ఈయన పృష్ఠభాగము. ప్రజాపతి ఈయన మర్మావయవము. మిత్రావరుణులు ఈయన వృషణములు. సముద్రములు ఈయన కుక్షి. పర్వతములు ఈయన అస్తులు.

నదులు ఈయన నరములు. చెట్లు ఈయన రోమములు. వాయువు ఈయన పూర్పుగాలి. నడక ఈయన కాలస్వరూపము. ఈయన పని జీవుల సంసారము. మేఘములు ఈయన తలవెంట్రుకలు. సంధ్య ఈయన కట్టుబట్ట. ఈయన హృదయం అవ్యక్తం. (అవ్యక్తం అంటే ప్రధానమని అర్థము. అంటే మాయ అన్నమాట.) వికారములన్నింటికి ఆశ్రయమైన చంద్రుడు ఈయన మనస్సు. మహత్తత్త్వము ఈయన బుద్ధి. రుద్రుడు ఈయన అహంకారము. గుఱ్ఱములు, గాడిదలు, ఒంటెలు, ఏనుగులు ఈయన గోళ్ళు. మృగములన్ని పశువులన్ని ఈయన పిరుదులు. పక్షులు ఈయన శిల్ప నైపుణ్యము.

యేన శుక్లీకృతా హంసాః శుకాశ్చహరితీ కృతాః
మయూరాశ్చచిత్రితా యేనశనో వృత్తిం విధాస్యతి.

హంసలను తెలుపుచేసినటువంటివాడు, చిలుకలను పచ్చగా చేసినవాడు, నెమిళ్లను చిత్రవర్ణములుగా తీర్చినవాడు ఎవడో వాడే, ఆ పరమేశ్వరుడే మాకు తిండిపెట్టేవాడు అని అర్థము. కాబట్టి పక్షుల శరీరములమీద కనిపించే రంగులన్నీ తీర్చిదిద్దినవాడు పరమేశ్వరుడే. మంత్రములు ఆయన మతి. ఆయన నివాసము, మనుష్యుడు. గంధర్వులు విద్యాధరులు, చారణులు, అప్సరసలు ఆయన స్వరములు స్మృతులు. ఆయన పరాక్రమము రాక్షసులు. బ్రహ్మ ఆయన ముఖము. క్షత్రియులు ఆయన భుజములు. వైశ్యులు ఆయన ఊరువులు. శూద్రులు ఆయన పాదములు. యజ్ఞము ఆయన కర్మ. ఇట్లు ఆయన స్వరూపాన్ని, అవయవ సన్నివేశాన్ని చక్కగా భావనచేయాలి. ఈ అవయవ సన్నివేశములో ఒదుగని పదార్థము అంటూలేదు. ఈ విరాట్ దేహభావన, విరాట్ దేహమునకు, తదంతర్గతమైన విరాట్ జీవునికి అంతర్యామి రూపకముగానున్న ఈశ్వరునికి అభేదమును భావించుచూ ఉపాసన చేయాలి. దీనివలన చిత్తస్థైర్యము కలుగుతుంది. ఇక్కడ విరాట్ దేహమని, విరాట్ జీవుడని, అంతర్యామి రూపకంగా ఉన్న ఈశ్వరుడని చెప్పడంలో తాత్పర్యము ఇది. ఈ దేహభావన యందు చిత్తస్థైర్యము కుదిరితే, దేహగతమైన జీవభావన కుదురుతుంది. ఈ దేహ జీవులిద్దరిని అంతర్యామియైన ఈశ్వరునియందు లయింప చేయాలి. ఆ ఈశ్వరుడే, నిజానికి ధ్యానింపవలసినవాడు. ఆత్మస్వరూపుడు. సర్వజీవుల బుద్ధివృత్తులగుండా సర్వము అనుభవించువాడు. సత్యమైనవాడు. ఆనందనిధి. అటువంటి ఆత్మస్వరూపాన్నే ధ్యానించమని తాత్పర్యము. ఆ పరమేశ్వరుడు ఎవరోకాదు. మనయందున్న ఆత్మస్వరూపమే. అందుచేత అక్కడే లంగరువేసి కూర్చోవాలి. మనస్సును స్థిరముచేసి అక్కడే పాతిపెట్టాలి. ఇంకో విషయము మీదకు పోనివ్వకూడదు. పోతే పతనం తప్పదు.

"ఆదికాదయ్యా! ఆయన అందరి బుద్ధివృత్తులగుండా అన్ని అనుభవాలూ పొందుతున్నాడన్నావుగదా! అది యెట్లా? ఆయన వొక్కడేనాయె. ఇంతమంది బుద్ధివృత్తుల గుండా యిన్ని అనుభవాల్ని యెలా పొందుతాడు? అంటావా? దానికి దృష్టాంతం చెపుతావిను. నీకు స్వప్నం వచ్చింది. ఆ స్వప్నంలో అనేకమంది జీవులు కన్పించారు. వాళ్ళందరికీ భిన్నములైన ఆలోచనలూ, ఇంద్రియాలూ ఉన్నాయికదా! కాని వాళ్ల ఆలోచనలూ నీకు తెలుస్తునే ఉన్నాయిగదా! వాళ్ళ ఇంద్రియానుభవాలు నీకు అనుభవం అవుతూనేఉన్నాయికదా. అంటే ఆఆలోచనలగుండా ఇంద్రియాలగుండా ఆ అనుభవమంతా నీవు పొందినట్టే అయిందిగదా! అట్లా అన్నమాట. ఈ విధంగా పూర్వం బ్రహ్మదేవుడు విశ్వమూర్తి ఆయన పరమాత్మను ధ్యానంచేసి ఆయన ప్రసాదంవల్ల ప్రళయకాలంలో తాను మరచిపోయిన సృష్టిక్రమాన్నంతా స్మరణకు తెచ్చుకొన్నాడు. తెచ్చుకొని మళ్ళా పూర్వం మాదిరిగానే యీ సృష్టినంతా చేశాడు. అందుచేత యిల్లాంటి ధారణకు ఫలితంగా విశ్వసృష్టి సామర్థ్యం యేర్పడుతుంది. ఇటువంటి ఫలితంమీద విరక్తి కలిగితే తప్ప పరిశుద్ధమైన ఆత్మధ్యానమందు అధికారం కలుగదు. కాబట్టి వైరాగ్యం సంపాదించుకోవాలి. దానికోసం సర్వకర్మఫలమూ త్యాగంచెయ్యాలి. అసలా కర్మఫలమునందు దృష్టే వుండకూడదు. వేదానికి శబ్దబ్రహ్మమనిపేరు. ఇట్లాంటి కర్మకు ఇట్లాంటిఫలం అని చెప్పటం దానిమార్గం. స్వర్గం వస్తుందీ, అదివస్తుందీ, ఇదివస్తుందీ కాబట్టి యీ కర్మ చెయ్యండీ ఆ కర్మచెయ్యండీ అని చెపుతుంది. ఈ స్వర్గం మొదలైనవన్నీ వట్టి పేరులు. అక్కడ అర్థం ఏమీ లేదు, వట్టి పేరులు. ఆ పేరులుచెప్పి చందమామ గుటకలు వేయిస్తుంది. ఆయా కోరికలు పుట్టిస్తుంది. ఈ వినేవారున్నాదే ఈ మాయామయమైన త్రోవలో నడుస్తూ కలలుకంటూ వుంటాడు తప్ప న్యాయానికి అట్లాంటి వస్తువంటూ ఒకటి పొందడు. ఆయాలోకాలు వున్నట్లు అట్లా కన్పడతాయి. అక్కడకుపోతాడు. కాని నిర్దుష్టమైన సుఖాన్ని పొందలేడన్నమాట. అందుచేత బుద్ధిమంతుడైనవాడు నామమాత్ర సారములైన ఈ భోగ్యపదార్థములందు వ్యామోహము పొందకూడదు. అయితే శరీరము నిలుపుకోటానికి కావలసినంత మాత్రమే చాలా జాగరూకంగా విషయములను సేవించవచ్చు. కాని అది సుఖమనుకోకూడదు. సుఖము కేవలం ఆత్మస్వరూపమునందు బుద్ధిని నిలపడమే కాబట్టి శరీర పోషణము వరకు మాత్రమే చాలినంత పదా,

ములను సంపాదించుకోవటానికి ప్రయత్నము చేయవచ్చును. ఆ పైన చెయ్యరాదు. ఆ మాత్రము కూడ అప్రయత్నము గానే మనకు దొరికితే యిక ప్రయత్నము చేయడం పరిశ్రమేగదా. ఆ మాత్రము వరకు న్యాయానికి పరిశ్రమ చేయనక్కరలేదు. స్వభావసిద్ధంగానే దొరకుతుంది. చక్కగా నేలమీద పడకుంటే సరిపోయేదానికి మంచాలు సంపాదించడం దేనికి? తలక్రిందికి చేయిపెట్టుకుంటే సరి పోయేదానికి దిండు ఎందుకు? దోసిట్లో పెట్టుకొని తినేదానికి వెండికంచాలు, బంగారు కంచాలు దేనికి? గోచీపెట్టుకుంటె సరిపోయేదానికి పట్టుబట్టలెందుకు? అసలు ఆ గోచీమాత్రము ఎందుకు? కావాలంటె త్రోవలో ఏదో గుడ్డపీలిక దొరకక పోతుందా? చెట్లు చూడండి. ఎంతమంది ప్రాణాలను పోషిస్తున్నవో, అడిగితే ఒక పండో, ఆకో ఇవ్వక పోతాయా? మంచినీళ్ళు కావాలంటే నదులన్నీ ఎండి పోయినాయా? బాగా ఎండవేస్తుంది. వర్షం వస్తుంది అంటావు. యే గుహలోనో తలదాచుకుంటే సరిపోదూ? సరే ఇవేవి దొరకవే అనుకుందాం! పరమేశ్వరుడు లేడు టయ్యా? ఆయనే చూచుకుంటాడు. మన పని ఆయనను శరణుపొందడమే. అది చేయకుండా విద్వాంసులు కూడ ధన దర్పాంధులను సేవిస్తారు. ఏం చెప్పాలి. ఆ పరమేశ్వ రుడు ఎక్కడున్నాడు? మన మనస్సులోనే స్వభావసిద్ధంగా ఉన్నాడు, మన ఆత్మ స్వరూపుడే. ఆత్మస్వరూపుడే కాబట్టి చాలా ప్రియమైనవాడు. సత్యమైనవాడు. ఈ కనిపించే దంతా అనాత్మపదార్థము. కనిపిస్తుంది కాబట్టి లేదంటానికి వీల్లేదు. ఉన్నదా అంటే, ఆ కనిపించేటప్పుడు మాత్రము ఉంది. అంతకు పూర్వము లేదు. తర్వాతలేదు. పూర్వము, తర్వాత లేనిది మధ్యకాలములో ఎట్లా ఉంది? మధ్యకాలము లోను లేదు. ఉన్నట్లు కనిపిస్తుంది. కాబట్టి దీన్ని మిథ్య అన్నారు. లేకుండా ఉన్నట్లు కనిపించడము. పరమేశ్వరుడు ఇట్లాంటివాడుకాదు. సత్యస్వరూపుడు. మూడు కాలములలో ఉన్నవాడు. ఉనికి స్వరూపమైనవాడును. కాబట్టి ఆయనను ఆనందంతో మనస్సు నిలకడచేసుకొని భావనచేయాలి. అలా చేస్తే సంసారహేతువైనటువంటి అజ్ఞానము తొలగి పోతుంది. ఇట్టి పరమేశ్వర చింతననువదిలిపెట్టి సంసార చింతను ఎవడుచేస్తాడయ్యా! పశువైనవాడు తప్ప. ఒక ప్రక్కనుండి విషయచింతవల్ల ఈ సంసారమనే వైతరణీ నదిలోపడి, చేతులారా చేసుకున్న కర్మవల్ల ఆధ్యాత్మిక ఆధిభౌతిక, ఆధి దైవిక పరితాపములు అనుభవించే జనా లను చూస్తున్నాముగదా. చూస్తూ చూస్తూ అదేపనివి మళ్లా మనం చేయడం దేనికి?

"పూర్వం చెప్పింది పరమేశ్వరునియొక్క విరాట్పురుష భావన. ఇది బహిరంగము. దీనికి పై మెట్టు అంతరంగము నందు పరమేశ్వరభావన. మన దేహంలో హృదయమనే ఒక భావనయుండి. శరీరానంతటికి రక్తప్రసారం చేసే హృదయంవేరు. ఇదివేరు. అది ఎడమప్రక్కనుండేది. ఇది కుడి ప్రక్కనయుండేది. అది ప్రాకృతమైన హృద యము. భౌతికమైనది. ఇది ఆధ్యాత్మికమైనది. ఈ హృద యంలో మధ్యకొంత అవకాశము ఉన్నది. అది లొడితెడు మేరయుంటుంది. సంస్కృతములో ప్రాదేశమాత్ర మంటారు. అక్కడ పరమేశ్వరుడున్నాడు. ఆయన చతుర్భుజుడు. నాలుగు చేతులతో తామరపూవు, శంఖము, చక్రము, గద ధరించియున్నాడు. ఆయనయందు ధారణ చేయవలె. మనస్సు నిలపాలి, ఆయన ముఖము ప్రసన్నంగా యుంటుంది. తామరపూలవంటి కండ్లు. కదిమిపూల కేసర ములవంటి పచ్చని బట్టను కట్టుకొని ఉంటాడు. అనర్ఘ రత్నములు పొదిగిన బంగారునగలు, తళతళ మెరిసే రత్న కిరీటము, కుండలములు. వక్షస్థలముమీద లక్ష్మియుంటుంది. కౌస్తుభముంటుంది. మెడలో వనమాల. రత్నాల మొల నూలు, వ్రేళ్లకు రత్నపుటుంగరములు. కాళ్ళకు అందెలు, చేతులకు కంకణములు, నిగనిగలాడే ఉంగరాల జుట్టు. మెత్తని చిరునవ్వు దయ చిందించే చూపులు. యోగీశ్వ రులు చిగురుటాకులవంటి ఆయన పాదములను విప్పారిన వాళ్ళ హృదయపద్మాలతో వదలకుండా పెట్టుకొని భావన చేస్తూ యుంటారు. ఇటువంటి రమణీయమైన పరమేశ్వర విగ్రహాన్ని హృదయములో భావించాలి. ఒక్కొక్క అంగాన్నే తీసుకుని పాదములనుండి మొదలుపెట్టి చిరు నవ్వు వరకు చింతనచెయ్యాలి. ఎంతవరకు చెయ్యాలంటే ఏమీ ప్రయత్నము లేకుండానే ఆయా స్థానములు అవయవ ములు మనస్సులో భాసించేదాకా చేయాలి. ఇలా ఒక్కొక్క అవయవమే జయించుకుంటూ పైకిపోవాలి. ఇటు క్రింద నుంచి పైకి, పైనుంచి క్రిందకు ధ్యానంచేయాలి. దీనివల్ల మనస్సు శుద్ధి పొందుతుంది. శుద్ధిపొందడమంటే ధ్యేయా కారమందు నిశ్చలంగా వుండటం. రజస్తమోగుణములు చిత్తమలాలు, కాబట్టి వాని నాశ్రయించుకొని రాగద్వేషాది దుర్గుణాలన్నీ వుంటవి కాబట్టి అవి అణిగేదాక ఈ మూర్తి ధ్యానం చేయాలి. అప్పుడు సత్త్వగుణం వృద్ధిపొంది మనస్సు నిలకడ చెందుతుంది. పూర్వం చెప్పిన విరా ట్పురుషధారణ ఇప్పుడు చెప్పిన ఈ ధారణకు అంగం. అంటే దానికంటె ఇది పైమెట్టు. పరాత్పరుడైనట్టిన్నీ ద్రష్టృ స్వరూపుడైనట్టిన్నీ యీ విశ్వేశ్వరుని యందు భక్తి యోగం పుట్టేదాక నిత్య కర్మానుష్ఠానంచేసిన తర్వాత

మనస్సు కుదురుచేసికొని స్మరించాలి. ఆయన ద్రష్టృ స్వరూపుడంటున్నావుకదా యిప్పుడు నీవు చెప్పిన బహిరంతరు పాసనలు రెండుకూడ దృశ్యాలేకదా అంటావేమో! నిజానికి మనం వుపాసించవలసింది 'దృశ్యాన్ని' అంటే చూడబడే దాన్ని కానేకాదు. చూడబడేది యెప్పుడూ జడమే. చూచేది యెప్పుడూ చైతన్యమే. 'ద్రష్ట' అంటే చూచేవాడు. జడమైనదృశ్యాన్ని వుపాసిస్తే మనస్సుకు జడత్వమే వస్తుంది. వచ్చేదేమిటి? అది కూడ జడపదార్థమేనాయె. కాబట్టి జడోపాసనవల్ల దానికి కలిగే లాభమేమీ వుండదు. పైగా ఇంకా కాస్త జడత్వం పెరుగుతుంది. కాబట్టి వుపాసించవలసింది చైతన్యాన్నే. అంటే ద్రష్టనే. పరమేశ్వరుడు అన్నింటినీ చూచేవాడు కాబట్టి చైతన్యస్వరూపుడు ఆత్మస్వరూపుడు ద్రష్టృస్వరూపుడున్నూ. మరి చూచేవాణ్ని వుపాసించేదెట్లా? భావించేదెట్లా? అందుచేత ఆయనకు మానసికమైన వొక రూపం కల్పించాం. ఎందుకు? రూపాన్ని చూడటమనేది మనస్సుకు బాగా అలవాటే అయింది. మనస్సు నిలకడకోసం ఈ రూపాన్ని కల్పించుకొన్నాం. పరమేశ్వరుడు చైతన్యస్వరూపుడు కాబట్టి ఈ రూపంగూడ చైతన్యం కరుడు గట్టినట్టిదే అని భావించాలి. చైతన్యం కంటికి కన్పించేదికాదు. సముద్రంలో వుప్పు కనిపిస్తుందా? దాన్ని యెండించి గడ్డకట్టిస్తే కన్పిస్తుంది. కరుడుగట్టిన వుప్పును సైంధవఘనం అంటారు. అట్లాగే ఈ రూపం చైతన్యఘనం అన్నమాట. ద్రష్టృ స్వరూపమైన చైతన్యమే ఈ రూపంగా కరుడుగట్టింది అని అర్థం. అందుచేత భక్తియోగం దీనియందు కుదురుతుంది. ఈ భక్తియోగం పుట్టేంతవరకే నీవు యే కర్మచేసినా చేయవలసివచ్చినా. ఇది పుట్టిన తర్వాత చేయవలసిన కృత్యమేమీలేదు. ఇంత వరకు మృత్యువాసన్నమైనప్పుడు చేయవలసిన పనియేమిటో చెప్పాను. ఇప్పుడు ఈ లోకాన్నీ దేహాన్నీ వదలిపెట్టి పోయేటప్పుడు అంటే మరణకాలంలో చేయవలసిందేమిటో చెపుతాను విను.

"మరణకాలంలో వుత్తరాయణాది కాలములూ పుణ్యక్షేత్రాది దేశములు వీటికోసం విచారించకూడదు. యోగులకు దేశకాలాలు సిద్ధిహేతువులుకాదు. యోగమే సిద్ధిహేతువని దృఢనిశ్చయం కలిగివుండాలి. ఈ శరీరాన్ని వదలిపెట్టాలనే భావం కలిగినప్పుడు సుఖంగా యేదో వొక ఆసనం వేసికొని స్థిరంగా కూర్చోవాలి. ప్రాణాయామం చెయ్యాలి. ఇంద్రియాల్ని నియమించాలి. అంటే బయట నున్న విషయముల మీదికి చెదరిపోనివ్వగూడదు. మనస్సుతో యింద్రియాల్ని బిగబట్టి ఈ మనస్సును బుద్ధిచేత నియమించాలి. సంకల్ప వికల్ప రూపమైనది మనస్సు. నిశ్చయరూపమైనది బుద్ధిన్నీ. అంటే మనస్సును బుద్ధిగా మార్చాలి అని అర్థం. ఇప్పుడు బుద్ధిని క్షేత్రజ్ఞునియందు లయింపజేయాలి. క్షేత్రజ్ఞుడంటే ఈ బుద్ధిని చూచే ద్రష్ట అన్నమాట. బుద్ధినిచూచేద్రష్ట అంటే యేమిటి? మనకు దీని స్వరూపమిది దీని స్వరూపమిది. దీనికీ దీనికీ భేదమిది అనే ఆలోచనలు కొన్ని కలుగుతున్నవికదా! ఎక్కడ కలుగుతున్నవి? బుద్ధిలో కలుగుతున్నవి. బుద్ధి అంటూ ఒక పదార్థం వుండి దానిలో కలుగుతున్నవా? అంటే బుద్ధికి ఈ ఆలోచనతప్ప వేరే రూపంలేదు. కాబట్టి ఈ ఆలోచనే బుద్ధి అని చెప్పాలి. నాకు అప్పుడట్లాంటి బుద్ధి పుట్టింది. ఇప్పుడిట్లాంటి బుద్ధి పుట్టింది అని మనం అంటూంటాం కదా! కాబట్టి ఈ ఆలోచనలే బుద్ధిస్వరూపం. ఈ ఆలోచనలు తెలుస్తునే వున్నవిగదా! వీటిని తెలుసుకొనేదెవడూ? వాడే ద్రష్ట. క్షేత్రజ్ఞుడు. ఈ బుద్ధిని వానిలో లయింపచేయాలి. ఆ క్షేత్రజ్ఞుణ్ణి ఆత్మయందు-అంటే పరిశుద్ధ తత్వమునందు లయింపచేయాలి. ఆ పరిశుద్ధమైన ఆత్మను బ్రహ్మమునందు లయింపచేయాలి. ఇన్ని ఆత్మలు ఎక్కడ నుండి వచ్చాయి? అంటావేమో! బ్రహ్మమన్నా ఆత్మ అన్నా, క్షేత్రజ్ఞుడన్నా అంతా వొక్కటే. నదికీ, పెద్ద కాలువకీ, పంటకాలువకీ వున్న తేడావంటిదే తప్ప మొత్తానికంతా వొక్కటే ఆత్మ. మహాకాశం, మఠాకాశం, ఘటాకాశంలాగా భేదాలు. ఘటం పగులకొడితే ఘటాకాశంవచ్చి మఠాకాశంలో కలిసింది. ఆ మఠాన్నికూడ పగులకొడితే ఆ మఠాకాశం మహాకాశంలో కలుస్తుంది. నిజానికి కలిసిందా? ఎప్పుడూ అంతా ఆకాశంగానేవుంది. మనం మఠఘటాల్ని సృష్టించి ఆకాశానికి ఆ పేర్లు తగిలించాం. వాటిని తీసేసి ఇవి అందులో కలిశాయన్నాం అంతే. అట్లా ఆత్మమును బ్రహ్మమునందు కలిపి వుపశాంతుడై అంటే యే వృత్తీలేకుండా అట్లా వుండిపోవాలి. ఇంక యే పనీ చేయకూడదు. దీనిని 'నిర్వృతి' అంటారు. ఏ వృత్తీలేని చోట వుండేది ఆత్మస్వరూపం. అది వునికి యొక్క స్వరూపం. అచ్చమైన వునికి. చిత్స్వరూపం, అచ్చమైన తెలివి. జ్ఞానం. ఆనందస్వరూపం. అదే పరమప్రాప్యం. ఆ తర్వాత పైస్థితి అంటూలేదు. దీనిని ఆత్మస్వరూపమని వర్ణించారు. అక్కడకాలానికి ప్రభుత్వంలేదు. మరి తక్కిన దేవతలమాట చెప్పేదేమిటి? వాళ్ళకు లోబడ్డ ప్రాణిలోకం మాట చెప్పేదేమిటి? అక్కడ సత్త్వరజస్తమో గుణాలకూ అహంకారానికీ మహత్తత్వానికీ అవ్యక్తానికీ యేమీ ప్రభావంలేదు. ఇవన్నీ జగత్కారణాలు. ఇవియేమీ అక్కడ ప్రసరించవు. అది నిరుపాధికమైన ఆత్మతత్త్వం. సర్వశ్రేష్ఠమైన విష్ణుపదం. అదికాని దానిని

వదలిపెట్టడంవల్ల లభించేది. ఇది ఆత్మపదార్థం కాదు ఇది కాదిది కాదని యేది యేది దృశ్యమాన మౌతుందో దానివల్లా వదలివేయటం. చివరకు దృశ్యాన్నంతా త్రోసివేసి తానుగా మిగిలిపోవడం. అందుకనే దౌరాత్మ్యమును వదలిపెట్టాలి అన్నారు. దురాత్ముని భావం దౌరాత్మ్యం. దురాత్ముడు అంటే దుష్టమైన ఆత్మకలవాడు అని అర్థం. దుష్టమైన ఆత్మఅంటే దోషంతో కూడివున్న ఆత్మ. దోషమంటే నశించిపోవడమన్నమాట. ఎప్పుడూ వుండకపోవడం. అంటే దేహాదులు వొకప్పుడుండి వొకప్పుడుండనివి కాబట్టి వీటిని ఆత్మపదార్థంగా భావించేవాడు దురాత్ముడన్నమాట. ఈ నశించిపోవడమనేది దృశ్య సమూహానికంతకీ పట్టే లక్షణం. కాబట్టి దృశ్యమునందు ఆత్మత్వం భావించడం దౌరాత్మ్యం అవి తేలింది. దృశ్యం నశించే స్వభావం కలిగింది. ఆత్మ శాశ్వతమైంది. దృశ్యం జడస్వరూపం. ఆత్మ జ్ఞానస్వరూపం. దృశ్యం దుఃఖస్వరూపం ఆత్మ ఆనందస్వరూపం. దృశ్యం చూడబడేది. ఆత్మ చూచేది. అట్లాంటి దుర్గుణాలు కలిగిన దృశ్యాన్ని అటువంటి ఆత్మ అని భావించడం దౌరాత్మ్యంకాక మరేమౌతుంది? కాబట్టి ఈ దేహం, ఈ ఇంద్రియాలు, ఈ మనస్సు, ఈ బుద్ధి, ఈ అహంకారం-ఇవన్నీ కూడ దృశ్యకోటిలోనివే. ఇవ్వే మనము అనుకొని వీటిలో యేదోవొకదానికి లంగరువేసి కూర్చుంటే బుడుంగుమని దుఃఖములో మునిగిపోతాడు తప్ప బయటపడడు. కాబట్టి వీటియందాత్మ భావాన్ని వదలి వేయాలి. కనిపించేదాన్ని దేన్నీ పట్టుకోకూడదన్నమాట. మరియేమి పట్టుకోవాలి అంటే పరమపూజ్యుడైన, పరమాత్మ స్వరూపుడైన శ్రీవిష్ణు పదమును హృదయంతో కౌగలించుకొని యింకోదానిమీద ప్రేమలేకుండా ఉండాలి. ఇక్కడ విష్ణుపదమంటే ఆత్మపదమనే అర్థం. అంటే తాను తానుగా వుండిపోవడమనే అర్థమనీ చెప్పవచ్చు. లేక యిక్కడ యీ చెప్పేది భాగవతం కాబట్టి ఇది విష్ణు పారమ్యాన్ని బోధించే గ్రంథంకాబట్టి విష్ణువన్నా ఆత్మ అన్నా వొక్కటే అని ఇక్కడ చెప్పారు కాబట్టి విష్ణు పదమంటే విష్ణుపాదమనినీ చెప్పుకోవచ్చు. ఇక్కడ దృశ్య కోటినంతటిని గూడ ఇది ఆత్మపదార్థంకాదు ఆత్మపదార్థం కాదు అని వదలవేయ్యాలని చెప్పాడు కాబట్టి ఇహ మిగిలేది చివరకు దృక్ స్వరూపమైన తానే కాబట్టి మొదటి అర్థం అంటే తానుగా మిగిలిపోవటమనే చెపితే చాలా బాగా వుంటుంది. మరి యిక్కడ వొక శంకవుంది. అన్నింటినీ వదలిపెట్టి తానుగా మిగిలిపోవడమన్నాంగదా! యీ వదలి పెట్టడమనేది బుద్ధితోనేకదా చేయవలసింది. అయితే ఈ బుద్ధికి వొక రోగంవుంది. వొకదాన్ని పట్టుకొంటేగాని ఇంకోదాన్ని వదలిపెట్టదు. కాబట్టి తాను మిగిలిపోవడమంటే తన్ను తాను పట్టుకోడమని అర్థంచెప్పాలి. పట్టుకోవడమనేసరికి యీ అచ్ఛమైన తాను దృశ్యకోటిలోది కాదాయె. దృక్స్వరూపమాయె. ఈ దిక్కుమాలిన జడ బుద్ధి దాన్నెలా పట్టుకొంటుంది? ఇదీ శంక. అందుచేత అచ్ఛమైన ఆత్మపదార్థాన్ని పట్టుకోవడమంటూండదు. ఆ భావాన్ని పట్టుకోవచ్చు. అంటే ఆత్మభావాన్ని పట్టుకోవచ్చన్నమాట. దీన్నే అద్వైతగ్రంథాల్లో అఖండాకారాకారితవృత్తి అనీ బ్రహ్మవృత్తి అనీ చరమవృత్తి అని ఆత్మవృత్తి అని చెప్పారు. ఇది యెట్లా యేర్పడుతుందో వూరికే విస్తరించి చెప్పేకన్న ఈ మార్గాన్ని అభ్యాసం చేస్తూంటే యీశ్వరానుగ్రహంవల్ల సులభంగా తెలుస్తుంది. ఇది సిద్ధాంతరీత్యా చెప్పిన అర్థం. అట్లాకాకుండా భాగవతంలో భక్తియోగం దీనికి మార్గంగా చెప్పారు కాబట్టి హృదయంతో అంటే బుద్ధితో పూర్వంచెప్పిన ద్రష్ట అయినటువంటిన్నీ విశ్వపతి అయినటువంటిన్నీ చైతన్య ఘనస్వరూపుడైనటువంటిన్నీ శ్రీవిష్ణు పదాన్ని తానే అని భావించి పట్టుకోవడం. అంటే ఆత్మ స్వరూపమనే భావించి పట్టుకోవడం అనిన్నీ చెప్పవచ్చు. ఈ విధంగా ఆత్మ లాభాన్ని పొంది ఇంక ఆ పైన యేమీ చేయకుండా మౌనంతో అలా వుండిపోవాలి. మౌనమంటే యిక్కడ మానసికమైన మౌనం. అంటే అక్కడే బుద్ధిని లయింప చెయ్యడం అన్నమాట. అప్పుడు శాస్త్రాల్లో చెప్పిన జ్ఞాన బలం యేదైతే వున్నదో అది ఇట్లాంటి మునికి అనుభవ సిద్ధమౌతుంది. దానివల్ల యిప్పటికి ఈయనకుండే విషయ వాసనలన్నీ కూడ నిర్దగ్ధములైపోతవి. ఇంకా శరీరాన్ని వదలిపెట్టవలసిన పని వొక్కటే మిగిలివుంది. దాన్ని యెలా వదలిపెట్టాలో చెపుతా విను.

"కాలిమడిమతో మూలాధారాన్ని నిరోధించి ప్రాణాన్ని పైకి లేపాలి. పైన ఆరుస్థానాలున్నవి. మొదటిది నాభి యందున్న మణిపూరకమనేది. మూలాధారాన్నుంచి అక్కడకు ప్రాణాన్ని లేపాలి. అక్కడనుంచి హృదయమునందున్న అనాహత చక్రానికీ, అక్కడనుంచి కంఠం యొక్క క్రిందిభాగంలో వున్న విశుద్ధ చక్రానికీ. ఆ చక్రముయొక్క పైభాగమైన తాలు మూలానికీ, అంటే కంఠముయొక్క పైభాగం, క్రిందివౌడ మూలభాగానికీ మెల్లగా తీసికొనిపోవాలి. అక్కడనుంచి చాలా త్రోవలున్నవి. వాటిగుండా పోయే ప్రమాదంవుంది. కాబట్టి నెమ్మదిగా లేపాలి. అక్కడనుండి కనుబొమలమధ్య ప్రదేశానికి లేపాలి. అక్కడ అజ్ఞాచక్రమున్నది. అక్కడ యేడు మార్గములున్నవి. రెండు ముక్కులు, రెండు చెవులు

రెండు నేత్రములు వొకనోరు. ప్రాణము ఈ మార్గాల్ని పట్టకుండా వీటిని మూసివేయాలి. అనపేక్షుడు అంటే యే కోరిక మిగలనివాడు కనుక అయితే యిక్కడ వొక అర్ధ ముహూర్తం అంటే సుమారు నలభై అయిదు నిముసములు బ్రహ్మధ్యానం చేస్తూ బ్రహ్మరంధ్రాన్ని భేదించి యీ దేహాన్ని వదలివేసి పరమాత్మలో ఐక్యం పొందాలి. ఈ చెప్పినది సద్యోముక్తి.

యదా సర్వే ప్రముచ్యంతే కామా యే అస్యహృదిస్థితాః
అథమర్త్యోఽ మృతో భవత్యత్రబ్రహ్మ సమశ్నుతే.

అని శ్రుతి చెపుతున్నది. మనస్సులో వున్న కోరికలనన్నీ వదలిపెడితే మర్త్యుడమృత్యుడవుతాడు. ఇక్కడే బ్రహ్మమును పొందుతాడు. అంటే ముక్తిని పొందడానికి యీ కోరికలడ్డమన్నమాట. వీటివల్లనే స్వభావంగా అమృతుడైనవాడు మరణశీలుడౌతాడు. ఈ కోరికలు వాణ్ణిలాక్కొపోతవన్నమాట. రెండోది క్రమముక్తి.

"ఇంకా యేమైనా కోరికలు మిగిలి బ్రహ్మలోకానికిగాని స్వర్గానికిగాని పోదామని అభిప్రాయం ఉంటే మనస్సు, ఇంద్రియాలు వీటిని వదలిపెట్టకుండా వాటితో కలిసే వెళుతాడు. అట్లాంటి కోరికలున్న వాళ్లకి లింగదేహభంగం జరగదు. లింగదేహమంటే మనస్సూ ఇంద్రియాలు మొదలైనవి. (మనస్సు, బుద్ధి, పంచకర్మేంద్రియాలూ పంచ జ్ఞానేంద్రియాలూ, పంచ ప్రాణాలూ ఈ పదిహేడింటిని కలిపి లింగదేహమంటారు.) మనిషి మరణిస్తే పోయేది స్థూలదేహం మాత్రమే. ఈ లింగదేహమే పుటుతూ మరణిస్తూవుంటుంది. వస్తూపోతూ వుంటుందన్నమాట. వాళ్ల వాళ్ళ కర్మలనుబట్టి వాళ్ల వాళ్లకు రాకపోకలుంటూంటవి. అయితే యిట్లా కర్మగతి మాదిరిగా యోగగతి పరిచ్ఛిన్నంగా వుండదు. అంటే కొన్ని హద్దులకు లోబడివుండదు. ఇప్పుడు యిక్కడ చెప్పిన సద్యోముక్తి క్రమముక్తులు రెండున్నూ యోగులకు సంబంధించినవి. ఈ యోగులు మూడులోకాలకీ అంటే బ్రహ్మాండానికి లోపల బయటా కూడ తిరుగుతారు. వాళ్ల లింగశరీరం గాలిలో తేలుతూ వుంటుంది. అందుచేత వాళ్లు యెక్కడకు వడితే అక్కడకు పోగలరు. పైగా వాళ్లు విద్యా తపో యోగ సమాధుల్ని బాగా అభ్యాసం చేసినవాళ్లాయె. వాళ్లను కర్మలు కట్టివెయ్యలేవు. ఆకాశంలో బ్రహ్మలోకమార్గం పట్టి యోగి మొదటగా అగ్నిదేవత అయిన వైశ్వానరుణ్ని సుషుమ్నానాడిగుండా తన తేజస్సుతో మానసిక దోషాల్ని దగ్ధంచేసి యే అంటూ లేకుండా పైన ఆకాశంలోవున్న శింశుమార చక్రాన్ని పొందుతాడు. ఈ శింశుమార చక్రం నక్షత్రరూపమైంది. దీన్ని అధిష్ఠించి నారాయణమూర్తి వుంటాడు. సుషుమ్నానాడి గుండా ఇక్కడికెల్లాపోతాడు? అంటే ఈ సుషుమ్నానాడి హృదయకోశమునుండి బయలుదేరి అంగిలిగుండా బ్రహ్మరంధ్రంవరకు వుంటుందని సామాన్యంగా చెప్పినా ఆ పైన కూడ చాలా విస్తారంగా వ్యాపించివుంది. ఈ శింశుమార చక్రం విశ్వానికి నాభిస్థానం. సూర్యాది గ్రహాలు దీన్ని ఆశ్రయించి వుంటాయి. స్వర్గలోకంలో వుండేవాళ్లు దీన్నతిక్రమించి పైకిపోలేరు. యోగి మాత్రం శింశుమారాన్నతిక్రమించి నిర్మలమైన లింగశరీరంతో మహర్లోకానికి పోతాడు. ఇది బ్రహ్మవేత్తల స్థానం. కల్పాయుష్కులైన భృగ్వాది మహర్షులిక్కడ క్రీడిస్తూంటారు. ఇక్కడ కల్పాంతంవరకు యోగి వుంటాడు. తర్వాత అనంతుని ముఖమునుండి బయలుదేరిన అగ్నిలో విశ్వమంతా మండిపోతూంటే యీ వేడి ఆ మహర్లోకానికిగూడా తగులుతుంది కాబట్టి బ్రహ్మలోకానికి యోగి వెళ్ళిపోతాడు. ఆ బ్రహ్మలోకం రెండుపరార్ధాలకాలం పాటుంటుంది. అక్కడ మహాసిద్ధులు విమానాలెక్కి తిరుగుతూంటారు. అక్కడ శోకం వుండదు. జరామృత్యువులుండవు. దుఃఖం వుండదు. భయం వుండదు. వాళ్ళకున్నదల్లా-భగవద్ధ్యానం చెయ్యకుండా సంసారంలోపడి దురంతమైన దుఃఖాన్ననుభవిస్తూండేవాళ్ళనుచూచి దయవల్లకలిగే బాధవొక్కటే. మరే బాధా లేదు. ఇట్లా బ్రహ్మలోకానికి వెళ్ళినవాళ్ళు మూడురకాలుగా వుంటారు. బాగా పుణ్యంచేసి బ్రహ్మలోకానికి వెళ్లినవాళ్ళు కల్పాంతరంలో వాళ్ళవాళ్ళ పుణ్యతారతమ్యాన్నిబట్టి అధికారికులౌతూంటారు. హిరణ్యగర్భాద్యుపాసనాబలంచేత అక్కడకు వెళ్ళినవాళ్లు బ్రహ్మగారున్నంతకాలం అక్కడుండి ఆయనతోపాటు ముక్తిచెందుతారు. భగవంతుడైన నారాయణమూర్తినుపాసించినవాళ్ళున్నారే, అంటే పూర్వం నేను చెప్పిన వుపాసన చేసినవాళ్ళు మటుకు వాళ్ళయిష్టంవచ్చినప్పుడు బ్రహ్మాండాన్ని భేదించుకొని అక్కడనుండి విష్ణుస్థానానికి వెళ్ళిపోతారు. ఇప్పుడిక్కడిది ప్రస్తుతం కాబట్టి భగవద్భక్తుడైన యోగి బ్రహ్మాండాన్ని యెట్లా భేదిస్తాడో ఆసాంతం చెపుతావిను. ఈ విరాట్ఛరీరముందే అంటే యీ విశ్వం దీనిలో మొత్తం పద్నాలుగులోకాలూవున్నాయి. అంతా దృశ్యంకదా. ఇది యెట్లా యేర్పడిందో చెపుతావిను. ఈ సర్వవిశ్వానికీ మూలభూతమైంది ప్రకృతి. ఈశ్వరాధిష్ఠితమైన ప్రకృతిలో యేదో వొక అంశవల్ల మహత్తత్వం పుట్టింది. దానిఅంశవల్ల అహంకారం దాని అంశవల్ల శబ్దతన్మాత్రపుట్టి దానిద్వారా ఆకాశం పుట్టింది. దాని అంశ పుచ్చుకొని స్పర్శ తన్మాత్ర. దానివల్ల వాయువు. దాని అంశవల్ల రూపతన్మాత్ర, దానివల్ల అగ్ని. దాని అంశ

వల్ల రసతన్మాత్ర, తద్వారా జలము, ఆ జలాంశవల్ల గంధతన్మాత్ర దానివల్ల భూమి. ఇప్పుడీ పంచభూతాలు యేర్పడ్డాయి. ఈ పంచభూతాలవల్ల పద్నాలుగులోకాలు యేర్పడ్డాయి. ఇదే విరాట్ఛరీరమంటే. ఈ విరాట్ఛరీరముందే యిది యాభై కోట్ల యోజనముల వైశాల్యం కలిగివుంది. ఇదంతా యీ బ్రహ్మాండంలోవుంది. బ్రహ్మాండమంతా కలిపి యీ భూమి. దీనికి ఆవరణములున్నవి. ప్రథమావరణం కోటియోజనములవైశాల్యం గలిగింది. కొంతమంది యాభై కోట్ల యోజనములంటారు. తరువాత జలాగ్నివాయ్వాకాశరూపములైన ఆవరణాలున్నవి. అహంకార మహదావరణములున్నవి. వీటియొక్క అంశల్నిబట్టిగదా విశ్వం యేర్పడింది. యిట్లా విశ్వంగా పరిణమించిన యీ అంశలే యీ మహదావరణంవరకు వొకదానికొకటి పదిరెట్లు వైశాల్యం కలిగివున్నవి. ఎనిమిదోఆవరణం ప్రకృతి. దానివిస్తారము యింతా అని చెప్పలేము. ఇల్లాంటి ఆవరణాల్ని యెట్లా భేదిస్తాడు యోగి? అనేది చెప్తున్నాను. యోగి తన లింగశరీరంతో పృథ్వీరూపాన్ని పొందుతాడు. జలరూపాన్ని పొందుతాడు. అగ్నిరూపాన్ని పొందుతాడు. వాయురూపాన్ని పొందుతాడు. ఆకాశరూపాన్ని పొందుతాడు. పొంది ఆయారూపాల్లో అక్కడక్కడున్న భోగాల్ని అనుభవిస్తాడు. ఇల్లా యీభోగాలనుభవిస్తూ యీ పంచభూతాల్ని అతిక్రమించి సూక్ష్మభూతములైన గంధ, రస, రూప, స్పర్శ, శబ్దములను-ఘ్రాణ, రసన, నేత్ర, త్వక్, శ్రోత్రములతో క్రమంగా ఆయాకర్మేంద్రియాలతోగూడ ఆయాక్రియల్నిపొంది అతిక్రమిస్తాడు. అహంకారావరణం, మహదావరణం, ప్రకృత్యావరణం మూడూ మిగులుతవి. వాటిల్లో అహంకారావరణం మూడు విధాలు. అది తామసమనీ, రాజసమనీ, సాత్త్వికమనీ. తామసంవల్ల సూక్ష్మభూతాలు పుడుతవి. రాజసంవల్ల బహిర్ముఖాలైన దశేంద్రియాలు పుడుతవి. సాత్త్వికంవల్ల మనస్సు దేవతలు పుడుతారు. ఈ సూక్ష్మభూతాల్ని అవి పుట్టినక్రమంలో తామసాహంకారంలోనూ, ఇంద్రియాల్ని రాజసాహంకారంలోనూ, మనస్సునూ దేవతల్నీ సాత్త్వికాహంకారంలోనూ లయంచేసి ఆ అహంకారాన్ని విజ్ఞానరూపమైన మహత్తత్త్వంలో లయంచేస్తాడు. దాన్ని ప్రధానంలో లయంచేస్తాడు. దాన్ని కూడ పరమాత్మయందు లయంచేస్తాడు. ఇప్పుడతనికి యేవుపాధీలేదు. శాంతమూ, అవికారమూ, ఆనందస్వరూపమూఅయిన పరమాత్మలో కలిసిపోతాడు. ఇహ మళ్లా తిరిగి పుట్టడు. ఈ రెండుమార్గాలూ నీవడిగావు కాబట్టి నేనుచెప్పాను. ఇవి సనాతనములు. వేదం వీటినిగురించి గానంచేసింది. బ్రహ్మగారు చాలాకాలం ఆరాధించి అడిగితే భగవంతుడైన వాసుదేవుడు యీ రెండుమార్గాలు చెప్పాడు. ఇవిరెండూ మోక్షమార్గాలు. నీవు దక్షిణమార్గమైన కర్మమార్గాన్నిగురించికూడ అడిగావు. అది కర్మఠులమార్గం. పునరావృత్తితో కూడివున్నమార్గం. ఈ రెండుమార్గాలే మోక్షమార్గాలు కాబట్టి యిక్కడ చెప్పాను. సంసారంలో పడ్డవాళ్ళకు యింతకంటె కల్యాణప్రదమైనమార్గం యింకొకటిలేదు. ఈమార్గాన్ని చక్కగా అనుష్ఠానంచేస్తే భగవంతుడైన వాసుదేవునియందు భక్తియోగం పుడుతుంది. బ్రహ్మదేవుడు యేకాగ్రచిత్తంతో మూడుసార్లు మొత్తం వేదాన్నంతా చక్కగా విచారించి యిదేమార్గమని నిశ్చయించి చెప్పాడు దీనివల్ల హరిభక్తి కలుగుతుంది. హరి అంటే ఆత్మస్వరూపుడే. అదిసరే వొకవిషయాన్ననుభవిస్తే దానిమీద రుచిపుడుతుందీ. ఆ భగవంతుడంటే యెట్లాంటివాడో మనకు తెలియదుగదా! మనం అనుభవించలేదుగదా! ఆయనమీద ప్రేమ యెట్లా కలుగుతుందీ అని అడుగుతావేమో! చెప్తా విను.

“ఆభగవంతుడు మనకు కనపడుతూనేవుంటాడు. ఎట్లాగంటే? ఆత్మస్వరూపంగా కనబడుతాడు. ఇప్పుడు బుద్ధి, యింద్రియాలు శరీరం ఇవన్నీ వున్నాయిగదా! ఇవి మనకు కనబడుతున్నవిగదా! వీటిని చూచేదెవరు? ఆ చూచేవాడు ఈ చూడబడేవాటిల్లో యేదీ కాదుగదా! అందుచేత ఆయన్ను చూచేవాడని తెలిసికో. చూచేవాడెవరు? నీవేగా. కాబట్టి ఆత్మ అంటే నీవే. నీయందు నీకు ప్రేమలేదా! నీమీదకంటె అధికప్రేమ నీవుకాని దానిమీద యెట్లావుంటుంది? అందుచేత రెండురకాలుగా దృశ్యముచేత ద్రష్టృసిద్ధి. చూడబడేవాటిచేత చూచేవాడున్నాడనే నిశ్చయం కలుగుతుంది. దృశ్యములు జడములు. వీటి దర్శనం మనకు కలుగుతోంది. కాబట్టి ఆచూచేవాడు స్వయంగా ప్రకాశించేవాడై వుండాలి. వీటన్నింటికీ లోపలవుండి అన్నింటిని ప్రకాశింపచేసేవాడై వుండాలి. లేకపోతే వీటిని చూడటం కుదరదు అనేది వొకమార్గం. బుద్ధ్యాదులు లక్షకములు వీనిచేత లక్షితమైనది ఆత్మ. లక్షణకముఅంటే పరోక్షంగా చూపించేది. లక్షితమంటే పరోక్షంగా తెలుసుకోబడేది. ఇది లక్షణామార్గం. రెండోది అనుమానమార్గం. బుద్ధి మొదలైనవి కరణములు. అంటే సాధనములు. వీటిని ప్రయోగించేకర్త వొకడుండాలి. లోకంలో వులి, నాగలి మొదలైనసాధనములనుచూచి వాటిని వుపయోగించే వడ్రంగి, కర్షకుడు మొదలైనవాళ్ళను మనం వూహించినట్లే యీ బుద్ధి మొదలైనవాటినిబట్టి వీటినుపయోగించేవాడు నడిపేవాడొకడున్నాడనీ, ఆయన స్వతంత్రుడనీ నిశ్చయం చేయవచ్చు. ఆయన స్వతంత్రుడని యెట్లా అంటే

ఆయన స్వతంత్రుడుకాకపోతే ఆయన కూడ దృశ్యకోటిలో చేరుతాడు. ఆయన్ని నడిపేందుకు మరొకడున్నాడనీ ఆయనకు మరొకడనీ యిట్లా దీనికి అంతు అంటూండదు. ఎక్కడోక్కడ ఆగాలి. ఆ ఆగినచోటు దృశ్యకోటిలో చేరేదికాకుండా వుండాలి. ద్రష్ట అనే చెప్పాలి. స్వతంత్రుడనే చెప్పాలి. ఒకేమాదిరి ప్రశ్నలూ వొకేమాదిరి సమాధానాలూ చెప్పుకోడంవల్ల లాభంయేమిటి? అందుచేత బుద్ధివరకు మనకు కన్పడుతున్నవి. దాన్ని మనం చూస్తున్నాం అందుచేత అంతవరకు జడపదార్థం దృశ్యం. దాన్ని మనం చూస్తున్నాం కాబట్టి మనం చూచేవాళ్ళం చైతన్యపదార్థం. ఆత్మపదార్థం. అందుచేత మనమే ఆత్మస్వరూపం. ఈశ్వరస్వరూపం. పరమాత్మ మనతో అభిన్నుడే. మనకీనిశ్చయంకలిగి మనం జడపదార్థమైన యీ బుద్ధ్యాదులతో యేకత్వం పొందకుండావుండటం కోసం మనం సచ్చిదానందస్వరూపులం అనేటువంటిభావం దార్ఢ్యం పొందడంకోసం ఆ లక్షణాలతో అంటే సచ్చిదానందస్వరూపంగా పరమాత్మస్వరూపంగా భావించాలి. అదే విష్ణుస్వరూపం. అందుచే రాజా! శ్రీహరిని సర్వకాలాల్లోనూ, సర్వదేశాల్లోనూ, సర్వప్రయత్నాలచేత వినాలి. కీర్తించాలి స్మరించాలి. ఆత్మస్వరూపుడైన యీ శ్రీహరి కథామృతాన్ని శ్రవణపుటాలతో త్రాగేవాళ్ల విషయవాసనలతో మలినమైన హృదయాల్ని పరిశుద్ధంచేసికొని అట్లా పరిశుద్ధమైనమనస్సుతో ఆయన పాదపద్మాలను పొందుతారు. ఇది యిక్కడికి మరణం సమీపించినవాడు మరణించబోయేవాడు మోక్షకాముకుడైనవాడు నిజంగా చేయాలసినపని.

"ఇల్లా మోక్షాన్ని కోరకుండా బ్రహ్మవర్చసాన్ని కోరేవాడు బ్రహ్మనీ, యింద్రియపాటవాన్నికోరేవాడు ఇంద్రుణ్ణి, సంతానాన్నికోరేవాడు ప్రజాపతినీ, భక్ష్యభోజ్యాదుల్నికోరేవాడు అదితినీ, బంగారాన్నికోరేవాడు దేవతల్నీ, రాజ్యాన్నికోరేవాడు విశ్వేదేవతల్నీ, ప్రజల్ని స్వాధీనం చేసికోదలచినవాడు సాధ్యుల్నీ, శ్రీకాముడు మాయనూ, తేజస్కాముడు అగ్నిహోత్రునీ, వసుకాముడు వసువుల్నీ, వీర్యకాముడు రుద్రుల్నీ, ఆయుష్కాముడు అశ్వినీదేవతల్నీ, పుష్టికాముడు భూదేవిని, ప్రతిష్ఠాకాముడు రోదసినీ, రూపకాముడు గంధర్వుల్నీ, స్త్రీకాముడు వూర్వశినీ, అందరిమీద ఆధిపత్యంకోరేవాడు పరమేష్ఠినీ, యశస్కాముడు విష్ణుమూర్తినీ, కోశకాముడు వరుణునీ, విద్యాకాముడు శివునీ, దాంపత్యంకోరేవాళ్ళు వుమాదేవినీ, ధర్మార్థకాముడు విష్ణువును, సంతానవృద్ధికాముడు పితృదేవతలనూ, యేదైనా బాధను పోగొట్టుకోవాలనుకొనేవాడు యక్షుల్నీ, బలకాముడు మరుత్తుల్నీ, రాజ్యకాముడు మంత్రరూపదేవతల్నీ, శత్రుమరణాన్నికోరేవాడు నిర్ఋతినీ, కామకాముడు సోముణ్ణి, అకాముడు అంటే కోరికలులేనివాడు ప్రకృతి కంటె పరుడైన యీశ్వరుణ్ణి వుపాసించాలి. అకాముడు సర్వకాముడు, మోక్షకాముడు ఎవడైనా తీవ్రమైన భక్తియోగంతో పరమపురుషుడైన శ్రీహరినుపాసిస్తే అది తప్పకుండా సిద్ధినిస్తుంది. మోక్షానికిదే చక్కనివుపాయం. ఏమిటి అంటే భగవద్భక్తులసాంగత్యంవల్ల భగవంతుని యందు నిశ్చలమైన భక్తిభావం కుదరటం. శ్రీహరి కథలు వింటే జ్ఞానం కలుగుతుంది. వానివల్ల రాగద్వేషాలు నశించి చిత్తం ప్రసన్నంగా వుంటుంది. త్రిగుణాత్మకములైన విషయములందు వైరాగ్యం కలుగుతుంది. కైవల్యానికి రాచబాటయైన భక్తియోగం కలుగుతుంది. ఆనందం అంటే యేమిటో తెలిసినవాడెవడు శ్రీహరికథలయందనురక్తుడు గాడు?"

ఇల్లా శుకమహర్షి అడిగినప్రశ్నలకు సమాధానంచెప్పిన తర్వాత రాజు విశ్వసృష్టినిగురించీ యింకా ప్రసక్తానుప్రసక్తంగావచ్చిన విషయాల్నిగురించీ అడగటం శుకమహర్షి వాటికి సమాధానం చెప్పటం పరమేశ్వరలక్షణాన్ని బాగాపట్టియిచ్చే భాగవతాన్ని వ్యాసనమాసరూపంగా విస్తరించడం జరిగింది. భాగవతమంతా పరీక్షిత్తు శుకమహర్షివల్ల విన్నాడు. ఈ భాగవతాన్ని శుకమహర్షి చెప్పటానికి పరీక్షిత్తు వింటానికి ఆ యేడురోజులూ చక్కగా సరిపోయింది. తర్వాత శుకమహర్షి పరీక్షిత్తుకిట్లా చెప్పాడు. "నాయనా! పరీక్షిత్తూ! సత్త్వనిధియైన శ్రీమన్నారాయణుని లీలాకథలు నీకు నేను సంగ్రహంగా చెప్పాను. వీటిని విస్తరించి చెప్పటానికి బ్రహ్మదేవుడుకూడా చాలడు. ఈ సంసారమనేసముద్రం తరించటం చాలాకష్టం. దీన్ని దాటాలంటె ఆ పురుషోత్తముని లీలాకథారసాన్ని సేవించడంకంటె మరొకవుపాయంలేదు. నిత్యుడైన నారాయణమహర్షే యీ పురాణాన్ని నారదునికి చెప్పాడు. నారదుడు కృష్ణద్వైపాయనునికి చెప్పాడు. ఆయన నాకు చెప్పాడు. ఈపురాణంలో భగవంతుడైన హరిని గురించి చక్కగా చెప్పడం జరిగింది. ఆయన ప్రసాదంవల్ల బ్రహ్మ, కోపంవల్ల రుద్రుడు పుట్టారు. వాళ్ళిద్దరూ వొకరు రజోవృత్తివల్ల యింకోరు తామసవృత్తివల్లా పుట్టారు కాబట్టి స్వతంత్రులుకారు. మరి శ్రీహరి యీ విశ్వానికంతటికీ ఆత్మస్వరూపుడూ నియామకుడూ కాబట్టి ఆయన స్వతంత్రుడు. ఆయన కథలు యీభాగవతంలో వర్ణించారు. ఇట్లాంటి భాగవతం విన్నతర్వాత యింకా భయశంక యెందుకు? నీవు కృతార్థుడవైనావు. 'అయ్యో! నేను

చచ్చిపోతాను' అనేభయం వున్నదే ఇది పశుబుద్ధి. ఇంతకంటె అవివేకంలేదు. దీన్ని ముందు జయించు. నీవు వేరు. ఈ దేహంవేరు. నీవిదివరకు పుట్టలేదు. ఎందుకంటె: నీవు యీ దేహం పుట్టకముందు లేనివాడవుకావు. ఉన్నావు. ఇప్పుడు దేహంపోతే పోయేవాడవూ కాదు. పుట్టేది దేహం. చచ్చేదిదేహం. పుత్రపౌత్రాదిరూపంగా తానే పుట్టుతూంటాడని శ్రుతి చెపుతూన్నదిగదా! వాళ్లంతా నశిస్తునేవున్నారు గదా! అప్పుడు నేను నశించకపోవటం ఎట్లా కుదురుతుంది? అని అంటావేమో. అక్కడ అది దేహాన్నాశ్రయించి చెప్పినమాట. బీజమునుండి అంకురం, అంకురాన్నుండి బీజం పుట్టినట్టుగా దేహంనుండి దేహం పుడుతుంది. నీవో దేహంకంటె వ్యతిరిక్తంగా వున్నావు. దేహం వేరు, నీవు వేరు. మండుతూన్న కట్టె వున్నదనుకో. అకట్టె వేరు అగ్ని వేరుకాదా! అట్లాగే నీదేహంవేరు, నీవు వేరు. నీకు స్వప్నంవచ్చింది, స్వప్నంలో నీకు శిరచ్ఛేదం జరిగినట్లు నీవు చూచావు. మరి నీ శిరచ్ఛేదం నీవు చూడటమేమిటి? శిరస్సుంటేగా చూచేందుకు? కానీ చూచావు. ఎట్లా చూచావు? నీవు శరీరంకంటె వేరు కబట్టే చూచావు. అట్లాగే యీ జాగ్రదవస్థలోకూడ నీ దేహంయొక్క మరణాదుల్ని చూస్తావు. దేహం పుట్టడం చావడం ఇవన్నీ మనకు కన్పడుతునేవుంటవి. ఈ కన్పడటం యిదంతా వొక యింద్రజాలం భ్రమమాత్రం. న్యాయానికి నీవు పుట్టవు, చావవు. ఆత్మ పుట్టేదిగాదు, చచ్చేదికాదు, నిత్యం. కొడుకునుచూచి మనం పుట్టామనీ, తండ్రినిచూచి మనం చస్తామనీ జన్మ మరణాల్నిగురించి వూహచేస్తాం. అంతేతప్ప ఆత్మకంటె మరొకవస్తువు లేకపోవటంవల్ల యీజన్మ మరణాల అభిజ్ఞానం అంటే పూర్వం చూచినదాన్ని పోల్చుకోవడం వుండడానికి వీల్లేదు. దీన్ని కొంచెం వివరిస్తాను. పూర్వం జన్మమరణాల్నిచూస్తేకదా మళ్లా పోల్చుకోవడం? మరణించేవాడు మరణాన్నెట్లా చూస్తాడు? వొకవేళ చూచాడనే అనుకొందాం. మరణమంటే నాశమేకదా! నశించినవాడు దాన్నెట్లా గుర్తుపెట్టుకొంటాడు? అసలువాడంటూ వుంటాడుగనుకనా గుర్తుపెట్టుకొనేందుకు? మళ్లా అది వచ్చినప్పుడు అదే యిది అని పోల్చుకోవడానికి? కాబట్టి మరణంవిషయంలో అభిజ్ఞానం కుదిరేదికాదు. అట్లాగే జన్మవిషయంలోనూ కుదిరేదికాదు. ఇవి దేహంతాలూకులైనప్పుడు, దేహంకంటే తాను వేరైనప్పుడుమాత్రమే కుదురుతుంది. అల్లాంటి వివేకంవున్నవాడికి యీ జన్మ మరణాలు యెప్పుడూ లేనేలేవు కాబట్టి యిదంతా వాడికి భ్రమగానే భాసిస్తుంది. కాబట్టి జన్మమరణాలు అవివేకి వూహించుకొనేవి. న్యాయానికి అవివేకి, వివేకి యీ యిద్దరికీ అనుభవంలో లేనివి. దేహం చస్తుంది. దేహం పుడుతుంది. పుట్టినదేహం చస్తుందికాని చచ్చినదేహం పుట్టదు. యే దేహానికాదేహం దానికటుకు దానికచావుపుట్టుకలు క్రొత్తే. కాబట్టి దానికీ యీ ప్రత్యభిజ్ఞానం వుండదు. కుండ పగిలిపోతే అందులోవున్న ఆకాశం పోయిందా? అల్లాగే దేహంపోతే అలోపల వున్నజీవుడు తత్త్వజ్ఞానసంపన్నుడైతే వాడు బ్రహ్మములో కలిసిపోతాడు. ఆత్మకు యీ దేహం మొదలైన వుపాధులు- వీటిసంబంధం మాయవల్ల కలిగిందే. మాయ మనస్సును సృష్టిస్తుంది. మనస్సు దేహాదికాన్ని సృష్టించుకొంటుంది. దాన్నిబట్టి సంసారాదికం యేర్పడుతుంది. అంతా వట్టిమాయ. యథార్థతః యేమీ లేదు. ప్రమిదలో నూనెపోశాం. వత్తివేశాం. నిప్పు అంటించాం. దీన్ని దీపంఅన్నాం. ఆ ప్రమిదే లేకపోతే యివన్నీ వున్నాయా? ఆ ప్రమిద మనస్సనుకో, చమురు కర్మఅనుకో. వత్తి దేహమనుకో. నిప్పు ముట్టించడం ఆత్మచైతన్యాన్ని దేహమందారోపించడమనుకో. అదంతా కలిపి దీపం. ఇదంతాకలిపి సంసారం. మనస్సు మూడుగుణాల సంపుటి. రజస్సువల్ల యీదేహం పుడుతుంది. సత్త్వంవల్ల పెరుగుతుంది. తమస్సువల్ల నశిస్తుంది. ఇదంతా మనస్సు చేసేది. ఆత్మకిక్కడ యేమీ ప్రసక్తిలేదు. ఈ స్థూల సూక్ష్మదేహాలకంటె అది వేరుగావుంది. స్వయంజ్యోతి. నిత్యమైంది. సత్యమైంది. నిర్వికారమైంది. దానికంతంలేదు. సాటిలేదు. సర్వవ్యాపకమైంది. దాన్ని పట్టుకో. రెండుమార్గాలున్నవి. ఒకటి తర్కమార్గం. రెండోది భక్తిమార్గం. ఈ రెండూ పూర్వం చెప్పాను. మళ్లా చెపుతున్నాను.

"తర్కమార్గం అన్వయ వ్యతిరేకలక్షణం గలది. ఆత్మ ద్రష్ట. బుద్ధ్యాదులు దృశ్యములు. దృశ్యాదులున్నచోటెల్లా ద్రష్ట వున్నాడు. ఇవిలేనిచోటగూడ ద్రష్ట వుంటున్నాడు ఇదివుంటే వీటిని చూస్తాడు. లేకపోతే తన్నుతాను చూచుకొంటాడు. కాబట్టి ద్రష్ట అన్వయరూపేణ దృశ్యం వున్నప్పుడల్లా వున్నాడు. వ్యతిరేకంగా యివి లేనప్పుడూ వున్నాడనేది తర్కం. విచారమార్గం. రెండోది భక్తిమార్గం అంటే ఆ ఆత్మ పరమేశ్వరస్వరూపమేనని దానియందీశ్వరత్వాన్నారోపించుకొని ధారణ, ధ్యాన, సమాధుల్ని పొందడం. ఆత్మ తన స్వరూపమేనని పొందితే విచారమార్గం. పరమేశ్వరుడేనని పొందితే భక్తిమార్గం. ఈ రెండు పద్ధతులగుండ నిత్యమైన జన్మమృత్యుజరారహితమైన సచ్చిదానందలక్షణమైన నిర్వికారమైన ఆ ఆత్మపదార్థాన్ని పట్టుకో. ఆ బ్రాహ్మణపిల్లవాడు ప్రేరేపిస్తే ఆ తక్షకుడువచ్చి యిప్పుడు నిన్నేమిచేయగలడు? ఇటువంటి స్థితిలోవున్న నిన్ను సమీపించనేలేడు. మృత్యువులకు మృత్యువైన

యీశ్వరునిదగ్గరకు మృత్యువులు రాగలవా? 'అహం బ్రహ్మాస్మి, బ్రహ్మైవాహం' అని భావనచేస్తూ నిరుపాధికమైన ఆత్మపదార్థంలో ఆత్మను లీనంచేసికూర్చో. ఆ తక్షకుడు వస్తాడు. విషపునోళ్ళతో కాలిమీద కరుస్తాడు. ఆ తక్షకుణ్ణికానీ నీ శరీరాన్నికానీ యీ సర్వవిశ్వాన్నికానీ ఆత్మకంటె భిన్నంగా నీవు చూడలేవు. అంతా ఆత్మపదార్థమే. అంతా నేనే అనే పరమమైన జ్ఞానం కలుగుతుంది. బాబూ! ఇదంతా నీకు చెప్పానుగదా! హరి లీలలనుగురించి చెప్పుమని అడిగావు. ఆయన విశ్వాత్ముడు. అదంతా నీకు చెప్పాను. ఇంకా యేమిచెప్పుమంటావో చెప్పు'' అని శుక మహర్షి అన్నాడు.

ఈ మాటలువిని పరీక్షిత్తు లేచివచ్చి ఆయన పాదాలకు తల తాకించి నమస్కరించి అంజలిబంధంతో యిట్లా అన్నాడు. ''భగవంతుడా! నేను కృతార్థుడనైనాను. దయతో నన్ననుగ్రహించావు. జన్మమృత్యురహితుడైన శ్రీహరినిగురించి నాకు చక్కగా చెప్పావు. మేమజ్ఞులం. సంసారతాపతప్తులం. మీరెప్పుడూ ఆ పరమాత్మతో ఐక్యం భజించివుంటారు. మాబోటివాళ్ళపైన మీకను గ్రహం వుండడం పెద్ద ఆశ్చర్యమేమికాదు. ఈ భాగవత పురాణం మీవల్ల నేను విన్నాను. మీరుపదేశించిన అభయమైన బ్రహ్మనిర్వాణంలో నేను ప్రవేశిస్తున్నాను. తక్షకుడూ మొదలైన మృత్యువులవల్ల నాకేమీ భయంలేదు. స్వామీ నా కనుజ్ఞయివ్వండి. నేను నా యింద్రియాలనన్నింటినీ నియమించి మనస్సులోవుండే కామవాసనలనన్నింటినీ కడిగివేసి ఆ పరమేశ్వరుడైన ఆత్మస్వరూపుడైన శ్రీహరి యందు ప్రవేశించి శరీరాన్ని వదలివేస్తాను. జ్ఞాన విజ్ఞాన నిష్ఠతో నా అజ్ఞానమంతా పటాపంచలైపోయింది. మీరు శ్రేష్ఠమైన క్షేమస్వరూపమైన భగవత్పదాన్ని చూపించారు.''

భగవంతుడైన శుకమహర్షి రాజుకు అనుజ్ఞ దయచేసి ఆయనచేత పూజితుడై భిక్షువులతోకలిసి వెళ్ళిపోయాడు. పరీక్షిన్మహారాజు ప్రాణాలను బంధించి బుద్ధితో మనస్సును ప్రత్యగాత్మస్వరూపమందు మేలగించి పరమాత్మను ధ్యానం చేస్తూ స్థాణువులాగా నిశ్చలంగా వుండిపోయాడు. ఆయన కిప్పుడు సంగాలులేవు, సంశయాలులేవు. ఆయన మహాయోగి, బ్రహ్మభూతుడు. గంగానది తూర్పువొడ్డున వుత్తరముఖంగా ప్రాగగ్రములైన దర్భలమీద కూర్చుని వున్నాడు. పరమాత్మధ్యానంలో మునిగివున్నాడు. తక్షకుడు బయలుదేరాడు. వస్తూ తోవలో కాశ్యపుడనే మాంత్రికునిచూచాడు. వాడికి డబ్బుయిచ్చి సంతోషపెట్టి వెనక్కి పంపివేశాడు. ఈపని యెందుకుచేయాలి? అంటే అతడు వచ్చి మంత్రవేస్తే తనవిషం విరిగిపోతే తనకప్రతిష్ఠ గదా! అందుకు. తర్వాత బ్రాహ్మణవేషం వేసికొనివచ్చి రాజును కరిచాడు. వాని విషాగ్నివల్ల రాజుదేహం భస్మమైపోయింది. దేవదుందుభులు మ్రోగినవి. గంధర్వులు అప్సరసలు సంగీతం పాడారు. దేవతలు పుష్పవర్షం కురిశారు. జనమేజయుడు రాజ్యానికి వచ్చాడు. ఈ తక్షకుడు చేసిన అపకారం విన్నాడు. సర్పయాగంలో సర్పాలన్నింటినీ హోమంచేయడం సాగించాడు. ఈమాటతెలిసి తక్షకుడు భయపడి యింద్రుణ్ణి శరణుపొందాడు. బ్రాహ్మణులుపిలిస్తే తక్షకుడు రాలేదు. జనమేజయుడెందుకు రాలేదని అడిగాడు. వాళ్లు, యింద్రుడు వాడికి శరణం యిచ్చాడని చెప్పారు. అయితే యింద్రునితోగూడ తక్షకుణ్ణి పిలవండి అని జనమేజయుడన్నాడు. బ్రాహ్మణులట్లాగే పిలిచారు. ఇంద్రుడు స్వర్గాన్నుండి తక్షకుడితోగూడ క్రిందికి పడడం మొదలుపెట్టాడు. అప్పుడు బృహస్పతి జనమేజయుని దగ్గరకువచ్చి ''మహారాజా! యీ తక్షకుడు అమృతం త్రాగాడు. అందుచేత అజరామరుడైనాడు, కాబట్టి వీడు చావడయ్యా! జీవితంగాని మరణంగాని కలగటానికి కారణం వాళ్లవాళ్లు చేసికొన్న కర్మేతప్ప మరొకటిగాదు. సుఖదుఃఖాల్నిచ్చేది ఆకర్మేతప్ప మరొకటిగాదు. పాములు, దొంగలు, అగ్ని, నీళ్ళు, ఆకలి, దాహం, వ్యాధి మొదలైనవాటివల్ల అట్లాంటి వాటివల్ల దేహధారులు మరణిస్తున్నారంటే అది వాళ్లవాళ్లు చేసుకొన్నకర్మవల్ల అట్లాంటిఫలితాలు పొందుతున్నారు. కాబట్టి యీ ఆభిచారికకర్మ యింతటితో సమాప్తం చెయ్యి. ఈ సర్పాలదేమీ దోషంలేదు. అయినా నీయజ్ఞంలో అవి తగులబడ్డవి, యిందులో నీతప్పేమీలేదు. వాటి జన్మాంతర కర్మ అట్లావుంది'' అన్నాడు.

బృహస్పతిమాటలువిని జనమేజయుడు సర్పసత్రాన్ని విరమించి ఆయన్ను పూజించి పంపాడు. ఇదంతా ఆ మహావిష్ణువు మాయ. దీన్ని దాటడం మహాకష్టం. దీనిస్వరూప మిట్లాంటిదని చెప్పడానికి వీలులేదు. ఈ ప్రాణులందరూ ఆయన అంశలే. ఆ మాయామహిమవల్ల కోపతాపాలు పెంచుకొని అంటే త్రిగుణాలకు లోబడి యీ దేహాలయందు పడి మోహం పొందుతూంటాము. మరి యీ మాయను దాటడమెట్లాగంటే ఆ పరమేశ్వరుని భజన వాకచే సర్వానర్థాల్ని నివారిస్తుంది. నేనూ నాదీ అనేభావాన్ని యీ దేహమనే దేహమునందు పొందనివాళ్ళు ఆ విష్ణుపదాన్ని పొందుతారు. ఎవరైనా పిడివాదంచేస్తే మనం సహించి వూరుకోవాలి. ఎవర్నీ అవమానం చేయగూడదు. ఈ నశించిపోయేదేహాన్ని పట్టుకొని యెవరితోనూ తగాదా పడకూడదు. ఇదీ పరీక్షిత్తుకథ. పరీక్షిన్మహారాజు మరణభయం పొందాడు. మనమంతా పొందుతునేవున్నాం. ఆయనకూ

మనకూ ఒకతేడా వుంది. ఆయనపడే జాగరూకత ఆయన పడితే మనంపడే తాపత్రయం మనం పడతాం. భాగవతం అంతా విన్నతర్వాత అసలు మరణమనేది లేదని ఆయనకు తెలిసింది. ఈశరీరం తానుకాదని ఆయనకు తెలిసింది. తా నాత్మస్వరూపుడని తెలిసింది. సచ్చిదానందలక్షణమైన తన యథార్థస్వరూపాన్ని పట్టుకొంటే భయానికీ దుఃఖానికీ తావులేదని తెలిసింది. అది పట్టుకొన్నాడంతే. దేహాన్ని పట్టుకొంటే దీనిగుణాలైన భయమూ, దుఃఖమూ కలుగుతవి. ఆత్మను పట్టుకొంటే దానిగుణాలైన సచ్చిదానందములు వస్తవి. అవి ఆయనలాగానే మనమూ పట్టుకొంటే మనకూ వస్తవి. పట్టుకోకపోతే భయం దుఃఖం తప్పవు. ఇదేవిషయాన్ని సనత్సుజాతీయంలో సనత్సుజాతులవారు ధృతరాష్ట్రుడికి చెపుతారు.

"ఉభే సత్యే క్షత్రియాద్యప్రవృత్తే, మోహోమృత్యు స్సమ్మతోయంకవీనాం। ప్రమాదంవై మృత్యుమహం బ్రవీమి, సదాఽప్రమాదమమృతత్వం బ్రవీమి" అని. మరణం వుంది మరణం లేదు. రెండూ నిజమే. కొంత మంది పండితులేమన్నారంటే మోహం అంటే దేహాదులందు ఆత్మబుద్ధి మృత్యువన్నారు. సనత్సుజాతులవారి అభిప్రాయంలో 'ప్రమాదం' అంటే ప్రచ్యుతి అంటే తా నాత్మభావననుండి దిగజారడం మృత్యువన్నారు. అప్రమాదమంటే నిరంతరమూ ఆత్మభావనలో వుండడం. లేక ఆత్మానుభవంలో వుండడం అమృతం. ఇటువంటి అమృత పదవిని పొందడం యెట్లాగో దానిలక్షణమూ దానిమార్గమూ రెండూగూడ యీ పరీక్షిత్తు కథ మనకు బోధిస్తుంది.

# శ్రీరామకృష్ణ ప్రభ

## ముప్పది ఆఱవ సంపుటము

1979 జనవరి నుండి 1979 డిసెంబరు వరకు

సంపాదకులు :

స్వామి తన్మయానంద

ప్రకాశకులు :

స్వామి తన్మయానంద

శ్రీ రామకృష్ణ మఠము, మైలాపూరు, మద్రాసు-600 004

# అకారాది విషయానుక్రమణిక

# బాలల శారదాదేవి

బి. ఎస్. ఆర్. ఆంజనేయులు

శారదా కల్పతరువు

యాత్రలన్నీ ముగించి మాతృదేవి కలకత్తాలోని మాతృమందిరానికి వచ్చింది. అప్పటినుండి ఎంతోమంది ఆమెదగ్గరకు వచ్చారు.

ఒకసారి రామకృష్ణదేవుడు శారదాదేవితో యిలా చెప్పారు. "చూడు! ఈ కలకత్తా ప్రజలు చీకట్లో కొట్టుకుంటున్న పురుగులలాగా వున్నారు. నీవు వారిని రక్షించు." అపుడు శారదాదేవి యిలా బదులు చెప్పింది. "నేనేం చెయ్యగలను. నేను ఆడదాన్ని." ఆయన వెంటనే అందుకున్నారు. "అయితేనేం నీవు చెయ్యాల్సింది చాలా వుంది. నేను ఒక్కడినే యీపనంతా చేయగలనా?"

శ్రీ రామకృష్ణదేవుడు ఆమెకు ఎన్నో మంత్రాలు చెప్పారు. ఆమెకూడా ఎంతో జపము, ధ్యానము చేసింది. ఎన్నో ఆధ్యాత్మిక అనుభవాలు సాధించింది. రామకృష్ణునిలాగా మారిపోయింది.

మీరు మర్రిచెట్టును చూసేవుంటారు. ఎండలో అలసిపోయినవారు దానిక్రిందికి వస్తారు. కొంతసేపయినతర్వాత బడలిక తీరుతుంది. వారు తెచ్చుకున్న ఆహారం తిని హాయిగా నిద్రపోతారు. మంచిసుఖాన్ని పొందుతారు. అలాగే సంసారంలో కాలిపోతూ మనస్సుకు శాంతికోసం ఎంతమందో మాతృదేవిదగ్గరకు వచ్చారు. ఆమె అపారప్రేమను రుచిచూచి శాంతి పొందారు. అందుచే రామకృష్ణులు 'రాధు' అనే బంధం తగిలించి ఆమెను యిన్నాళ్లు నిలిపారు. రామకృష్ణ నిర్యాణము తర్వాత మాతృదేవి 34 సంవత్సరములు ఆయన పని చూచింది.

అన్నివైపుల ఊడలు తన్ని పెరిగి
మండుటెండల మండుచు నుండువారి
చేర్చి లాలించి శాంతిని కూర్చునట్టి
కల్పవృక్షము శారదా కల్పవల్లి

76

# శ్రీ రామకృష్ణ మఠ ప్రచురణములు

| పుస్తకము | వెల |
|---|---|
| శ్రీ రామకృష్ణ కథామృతము | 8.00 |
| శ్రీ రామకృష్ణ జీవితచరిత్ర | 10.00 |
| శ్రీ రామకృష్ణ బోధామృతము | 8.00 |
| శ్రీ రామకృష్ణోపనిషత్తు | 3.75 |
| శ్రీ రామకృష్ణపరమహంస నీతికథారత్నములు | 2.50 |
| గురూపదేశములు | 2.00 |
| నా గురుదేవుడు | 1.25 |
| శ్రీ రామకృష్ణ దివ్యవాణి | 1.50 |
| శ్రీ రామకృష్ణ పరమహంస జీవిత సంగ్రహము | 0.75 |
| ఆరాత్రికము మరియు | |
| శ్రీ రామనామ సంకీర్తనము | 0.50 |
| శ్రీ శారదాదేవి జీవిత చరిత్ర | 4.00 |
| శ్రీ శారదాదేవి | 2.50 |
| శ్రీ శారదా సూక్తి నవనీతము | 0.90 |
| శ్రీ వివేకానంద జీవిత చరిత్ర | 4.00 |
| బాలల వివేకానందుడు | 2.00 |
| శ్రీ వివేకానంద సంపూర్ణగ్రంథావళి | |
| 8 సంపుటముల పూర్తిసెట్టు (సాదా) | 55.00 |
| .. .. (క్యాలికో) | 61.00 |
| విడి సంపుటములు ఒక్కొక్కటి (సాదా) | 5.00 |
| .. .. (క్యాలికో) | 6.50 |
| స్వామి శిష్య సంవాదములు | 10.50 |
| సందేశ తరంగిణి (మొదటి భాగము) | 4.00 |
| .. (రెండవ భాగము) | 5.50 |
| భారత యువజనులారా! | 3.00 |
| ప్రబోధ రత్నాకరము | 8.75 |
| రాజయోగము | 6.25 |
| కర్మయోగము | 4.00 |
| భక్తియోగము | 4.00 |
| శ్రీ వివేకానందలేఖావళి (మొదటిభాగము) | 2.25 |
| .. (రెండవభాగము) | 3.00 |
| హిందూ మతము | 4.00 |

| పుస్తకము | వెల |
|---|---|
| వివేక సూర్యోదయము | 4.00 |
| అనుష్ఠాన వేదాంతము | 2.50 |
| ప్రాచ్యము - పాశ్చాత్యము | 1.25 |
| కులము, సంస్కృతి, సామ్యవాదము | 3.00 |
| భారతదేశము | 2.00 |
| భారతీయ మహిళ | 2.00 |
| నా జీవితము, జీవిత కార్యము | 1.25 |
| శ్రీ రామకృష్ణ సేవాసంస్థ: తదాదర్శములు | 0.50 |
| చికాగో నగరోపన్యాసములు | 1.00 |
| శ్రీ వివేకానంద శంఖారావము | 0.80 |
| నవీన భారత దేశము | 0.40 |
| సర్వం విష్ణుమయం జగత్ | 0.35 |
| శ్రీ వివేకానంద సింహగర్జనలు | 0.20 |
| బ్రహ్మానంద బోధనలు | 4.75 |
| తాపత్రయ చికిత్స | 0.60 |
| ముక్తిమార్గము | 0.30 |
| పారమార్థిక సంభాషణలు | 6.50 |
| నారద భక్తిసూత్రములు | 4.00 |
| శ్రీ పోతన భాగవతము-మూడవ సంపుటము | 7.50 |
| దేవీమాహాత్మ్యము | 4.00 |
| శ్రీ మద్భగవద్గీత | 9.00 |
| శ్రీ మద్భగవద్గీత చిన్నసైజు | 3.00 |
| పారాయణగీత తాత్పర్యసహితము | 8.75 |
| .. మూలము | 2.00 |
| కఠోపనిషత్తు | 2.00 |
| గిరీశచంద్ర | 1.00 |
| భక్తిమార్గము | 1.00 |
| శ్రీకృష్ణవాణి | 0.80 |
| బుద్ధవాచ | 0.80 |
| క్రీస్తు సూక్తిమాల | 0.80 |
| మహమ్మదు సూక్తి మంజరి | 0.80 |
| శ్రీ విష్ణుసహస్రనామ స్తోత్రము | 1.25 |

ఇవియేకాక ఆంగ్ల, సంస్కృత, తమిళ, హిందీ, కన్నడ గ్రంథములును.

వేదాంత కేసరి (ఆంగ్లము) శ్రీ రామకృష్ణ విజయము (తమిళము)

అను మాసపత్రికలును, శ్రీ రామకృష్ణ పరమహంస, శ్రీ శారదాదేవి, శ్రీ వివేకానందస్వామి మున్నగువారి ఛాయాచిత్రములు, త్రివర్ణ చిత్రములు, తైలచిత్రములు మున్నగున వెన్నియో మా యొద్ద లభింప గలవు.

అడ్రెసు: మేనేజరు, శ్రీ రామకృష్ణ మఠము, మైలాపూరు, మద్రాసు - 600 004